

ఉగాది
శుభాకాంక్షలు...



# జెమినీ వారి

## రాబోవు తెలుగు చిత్రం

హృదయాన్ని ద్రవింపచేసే
ఒక మాతృ దేవత విషాదగాథ!

## ఎదురు చూడండి!

# ADVERTISERS' INDEX

# ఆంధ్రపత్రిక

## సౌమ్య సంవత్సరాది సంచిక

[ఏబది తొమ్మిదవ సంచిక]

[1969 - 70]



సంపాదకులు :

శివలెంక శంభుప్రసాద్



వెల రూ. 3

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము.

Supplement to Andhra Patrika Issue Dated 19-3-1969 Regd No. M 1113

| సంచిక | # సౌమ్య సంవత్సరాది సంచిక | సంవత్సరము |
|---|---|---|
| 59 | విషయానుక్రమణిక | 1969—70 |



**త్రివర్ణ చిత్రములు:**

ఓమ్

# ప్రస్తావన

కాలం విచిత్రమైంది. దానికి ఎదగడమేకాని తరగడం లేదు. అది ముందుకు పోతుందేకాని, వెనుకకు తిరగదు. ఈ కాలంముందు మనిషి నిలబడి "నేను ఎవర్ని?" అని ప్రశ్నించుకుంటే బాగుండును అనిపిస్తుంది. అప్పుడు మనిషికి తన భూత భవిష్యద్వర్తమానాలు కొంచెం కాకపోతే కొంచెమయినా అవగతం కావచ్చు. అదే కష్టమయిన పని. ఇటువంటి ప్రశ్నను మార్షల్ మాక్‌లుహాన్ అనే ఆయన వేసి, దానికి ఇట్లా సమాధానం చెప్పారు "నీవు ఎవరు?..." "అయ్యా, నేను ఎవరిని? ..నాకె తెలియడం లేదు. ప్రస్తుతానికి...అనగా ఈ క్షణంలో నేను ఎవరో నాకు తెలును. నేను ప్రొద్దున నిద్ర లేచినప్పుడు నేను ఎవరో నాకు తెలుసు ఆ తర్వాత నేను చాలా మారిపోయి వుంటాను, చాలా మారిపోయి వుంటాను"

ఈ సమాధానంలో కాలంలో వచ్చిన మార్పు, ఆ కాలంవలన పరిసరాలలో వచ్చిన మార్పూ, ఆ మార్పుయొక్క ప్రభావం మనిషిలో తోచిన పద్ధతి గోచరిస్తున్నవి. కాని, అంతా ఈ పని చేయరు. ఈ ప్రశ్న వేసుకోరు. వేసుకుంటే, ఎవరికి వారికే ఈ మార్పుయొక్క లక్షణము, పద్ధతి గోచరిస్తాయి.

కాలంలో మరి ఈ మార్పు ఎక్కడినుంచి వస్తున్నది? అందుకు ఒక్కటే సమాధానం కనిపిస్తుంది. భావాలవలన ఈ మార్పు వస్తున్నది. కొందరు ఉత్పత్తిసాధన విశేషాలలో మార్పువల్ల కూడా వస్తుందని, అసలు భావాలలో మార్పు రావడానికి అదే కారణమని అంటారు. నిజమే కావచ్చు. కాని, ఇప్పుడు ప్రపంచంలో చూస్తే, ఒకరకమైన ఉత్పత్తి పద్ధతులుగల దేశంలో, ఆ దేశాలలో పుట్టిన భావసంపత్తి అతి త్వరితగతిని ప్రపంచమంతటా వ్యాపిస్తున్నది. ఆ భావాలు బలంకలవి, ప్రబలమైనవి కావడంవలన వాటిని అరిగించుకోలేని, అరిగించుకొనేందుకు అసమర్థమైన సమాజాలకు, ఉత్పత్తి సాధన సంపత్తివలన ఏర్పడిన అభివృద్ధి దశావిశేషంలేని దేశాలకు కూడా ఎగబ్రాకుతున్నాయి వాటిని ఎవరూ ఆపలేరు వాటివలన వచ్చే పరిణామాలను గురించి ఏమి చేయడమూ మాత్రము ఆలోచించుకోవలసి వుంటుంది. అది చేయలేని సందర్భం వున్నప్పుడు, పరిస్థితి అయోమయంగా, అర్థరహితంగా సిద్ధమై, వ్యర్థస్పర్థలకు, ప్రయోజనరహితమైన పద్ధతులకు దారి తీస్తుంది.

ప్రపంచంలో ఇది ఇవ్వాళే జరుగుతున్నదా అంటే ప్రామాణిక శాస్త్రవేత్తలు, ధిషణాధనులు అయిన మేధావులు—కాదు—అంటున్నారు అనాది నుంచి ఇది ఇట్లాగే జరుగుతూ వున్నదంటున్నారు, నాగరకతలో ఎటువంటి మహత్తరమైన అభివృద్ధి జరిగినప్పటికైనా, పరిస్థితి విషమంగాను, విలయతుల్యంగాను వుంటూనే వచ్చిందని, ఒక నాగరకత నశిస్తే మరొక నాగరకత ఉద్భవం చెందుతూ వున్నప్పుడు, దానికి కారణమైన భావజాతంవలన వాటికి జనిస్థానాలయిన సమాజాలకు అది దాదాపు నిధనాన్ని తెచ్చిపెట్టినంత పనిగా జరిగి వున్నదని వైట్ హెడ్ అంతటి మేధావి చెప్పి వున్నాడు.

ఇటువంటి పరిస్థితి ప్రపంచంలో ఏర్పడి వుంది. మానవుని సాంకేతిక విజ్ఞానం, విజ్ఞానశాస్త్ర వైభవం మానవుని బుద్ధికన్నా వేగవంతాలై ముందుకు పోతున్నాయి. ఇంతవరకు భూమికి అంటిపెట్టుకొన్న మనిషి ఇతర గ్రహనక్షత్రాలకు దిగుతున్నాడు; ప్రపంచం దూరదూరమై వుంటూ వచ్చింది సన్నిహితమై

పోతూంది. మనిషి ఈ ఒత్తిడి తట్టుకోలేక పోతున్నాడు. కాలంలో విజ్ఞానంచేత వచ్చిన ఈ మార్పు అతనని ఎత్తున పడుతున్నది ఈ తట్టుకోలేనితనం పెరిగి బహు విధాలయిన భావసృష్టులకు దారితీస్తున్నది. పాత భావాలు చిందరవందర అవుతూకూడా నిలబడి వుండడానికి ప్రయత్నించడమేకాక, మార్పును సహించలేనివి అవుతున్నాయి ఆ భావాలు క్రొత్తగా ఉద్భవించినప్పుడు, అంతకు క్రితమువున్న ఆ భావాలతో ఎట్టి సంఘర్షణకు దిగి వున్నాయో ఆ సంగతి విస్మరించి, ఇప్పుడు ఈ క్రొత్త భావాలను అరిగించుకోలేక కుటిలపడి పోతున్నవి.

ఈ భావాలతో భావాల సంఘర్షణ, ఆ సంఘర్షణవలన ఉద్భవించే పరిణామాలు అర్థంచేసుకొని, అరిగించుకొని జనాన్ని దిద్దవలసిన బాధ్యత నాయకుల మీదనూ, మేధావులమీదనూ వున్నది. ఎందుచేత ననగా, అందరి మానవులకు ఈ భావాలు, ఈ భావాల సంఘర్షణ తెలియదు, అర్థంకాదు. కాని వాటి పరిణామం విశ్వవ్యాపి అవడంచేత వాటి ప్రభావం వారిపైకూడాపడి, వారిని అప్రతిభులను, కొన్ని సందర్భాలలో విపరీతశక్తులనుగా పరిణమింపజేస్తుంది. ఇప్పుడు తెలంగాణాలో సాగుతున్న అలజడియేమి దేశంలోను, ప్రపంచంలోను జరుగుతున్న ఇతరములైన అలజడులేమి ఇటువంటివే ఒక భావం నాగరక సమాజంలో పుట్టి, రెక్కలు కట్టుకొన్నట్లు వచ్చి అంతటి నాగరికాలుకాని ఇతర దేశాలమీద ఉల్లల్లాడడంవలన సముద్భవం చెందుతూవున్న ఒకానొక పరిస్థితి ఇది ఈ పరిస్థితి ఇట్టిదని తెలియనప్పుడు, అందుకు పరిష్కారాలుకూడ కనపడవు ఎందుచేతననగా, ఇచ్చట వ్యక్తచేతనగాక, అవ్యక్తచేతన పనిచేస్తున్నది. ప్రపంచంమీద వీస్తున్న ఒక గాలి సహస్రశిరాతో డిపురుషునివలె వ్యాపించి విశ్వరూప సందర్శన యోగంగా విస్తరిల్లుతున్నది. ఈ స్థితిని ఏకదేశంగా చూచినప్పుడు పరిమితమై, ఖండమై, పరిపూర్ణ దర్శనాన్ని ఇవ్వదు. దాని స్వరూపం సమగ్రంగా కన్పించాలి అంటే, ఏకదేశస్థితి ఆలోచనా పద్ధతి పనికిరాదు. కాని, నాయకస్థానాలలో వున్నవారు ఆ ఏకదేశస్థితిలోనే ఆలోచనాపరులై వుండడంచేత ఈ పరిస్థితి మరింత అధ్వాన్నమౌతున్నది.

ఈ పరిస్థితినిగురించి ఇతరదేశాలలో ఆలోచించి వున్న మేధావులు ఏమంటున్నారంటే, నాయకస్థానాలలో వున్నవారి చేతలకు మాటలకు పొంతనలు అందకపోవడంవలన తరాలమధ్య వారధులు సంభవించి వంతెనలు పడడం లేదంటున్నారు. ఇది ఇతరదేశాల విషయంలో ఎల్లా వున్నదోగాని, మన దేశం, మన రాష్ట్రం విషయంలో సర్వరంగాలలోనూ అదేవిధంగా అవభాసిస్తున్నది ఇచ్చట మాటలకు చేతలకే వారధి గాక, వారినుంచే వారిలో వారికే వారధి తెస్తున్నదా అనిపిస్తున్నది అట్టి వారధి లేనిచోట అర్జవం వున్నది. ఇచ్చట అది అపురూపమైన దినుస్సైపోయింది. ఇచ్చట నాయకుడు, మేధావి, రచయిత, కవి, సిద్ధాంతి, అనుయాయి అంతాగాడా ఈ రకమైన ఆర్జవ రాహిత్యంచేత బాధిస్తూ తమ్ముతాము వంచించుకొనడమేకాక లోకాన్నికూడా వంచిస్తున్నారా అనిపిస్తున్నది ప్రతిఒక్కరు మహాతత్వాలు నోటిమాటలుగా కొట్టిపోసివారేగాని ఆచరించేవారు కనిపించరు ప్రతిఒక్కరూ గాంధీ చెప్పినట్లు నడవాలనేవారే గాని ఆ నడక వారి జీవితాలలో, పనులలో కనిపించదు ఇది ఈ నాయకత్వంపట్ల ప్రజలలో విశ్వాసం పుట్టకుండా చేస్తున్నది, ఈ సంగతి ఇట్లా అని వీరు గ్రహించారో? చెప్పలేము ఇచ్చట ఒకరకమైన అవహ్నవం, ఒకవిధమైన ఆత్మధర్మప్రతారణం, ఒక్క నాటకం ఆడడంగా జరిగిపోతున్నదా అనిపిస్తుంది.

దేశం రాజకీయ ప్రాబల్యంనుంచి ఇంకా బయట పడని కారణంచేత, దేశంలో మేధావివర్గం సరైనది ఇంకా ఏర్పడక పోవడంచేత, రాజకీయ తంత్రాలచేత ఆక్రమించుకోబడిన ప్రజానీకం దారి తెన్నూ కానరాదై పోతున్నది. ప్రజలలో తిరుగుబాటుతత్వం ప్రబలడానికి ఇదకూడ ఒక కారణమా? ఈ రాజకీయ

నాయకులు మేధాసంపన్నులు, కాలంలో వస్తున్న మార్పులను గ్రహించి ప్రజలను దిద్దగలవారు అయితే ఇబ్బంది వుండదు. కాని, మన దేశంలో అల్లా కాదు. ఇచ్చట రాజకీయనాయకులు అమనస్కులు వారికి అధికారం పట్టినంతగా ప్రజలయెడల ఆదరం పట్టలేదు. వారికి ప్రజలు ఉపకరణాలు. కులాలు, కుంతత్వాలు చెడ్డవి అంటూనే, వాటినే ఆధారం చేసుకొని, పైకి వస్తున్నారు. జనాన్ని విడదీస్తారు. తాము విడతారు. అటువంటిచోట సంఘంలో సమన్వయం కుదరక అది ఒక కప్పలతక్కెడవలె తయారవుతున్నది.

రాజకీయాలతో సంబంధంలేని మేధావులు వున్నారా అంటే, ఇది కొంచెం ఆలోచన చేయవలసిన విషయం అవుతున్నది 1857 లో సిపాయి విప్లవ అనంతరం దేశంలో సమాజంలో ప్రారంభమయిన సమాజ పరివర్తనం దగ్గరనుంచి సాగిన చరిత్రను గమనిస్తే, దేశ స్థితిగతులు ఎరిగి స్వోపజ్ఞంగా ఆలోచించి ప్రజావాహినిని ఒడ్డులను ఒత్తిన మేధావి మాత్రుడు కన్పించడు సర్వమూ అనుకరణం. సర్వమూ పాపం చేసినట్లు భావించి, దానికి ప్రాయశ్చిత్తం చేసుకొనే పద్ధతి. ఎవరో ఏదో అనగా, దానిని పట్టుకొని గొడ్డును బాదినట్లు బాదడం. అంతకుమించి సృజనాత్మకమైన ఆలోచన సాగినది కన్పించదు. ఎక్కడో, ఏదో భావం మొలవగా, దానిని పరిస్థితులకు అనువదించి, పోషించగల మానసిక ప్రజ్ఞ దేశంలో కొరవడడమే ఈ చరిత్ర అంతటా కన్పిస్తుంది. నూతన భావాలు అన్ని దేశాలలోను, అన్ని సమాజాలలోనూ ఏకవిధంగా పనిచేయవు. ప్రజాస్వామ్యం అన్నది గ్రీకుల నాటిమాట. దాని స్థితి బహుదేశాలలో ఇప్పుడు బహువిధాలుగా వున్నది. ఈ ఒక్క భావ విస్తరణం చూస్తే చాలు, ఎప్పుడు, ఎక్కడ, ఏ పరిస్థితులలో, ఏది ఎట్లా జరగవలసిన అవసరం వున్నది స్పష్టమవుతుంది. సమన్వయ పద్ధతి, వస్తునిష్ఠమైన పరిశీలనతో కొత్త భావాలను అనువదించే శక్తి ఇచ్చట అబ్బక పోవడంవలన దేశంలో మేధావిమాత్రులేగాని, మేధావులు కన్పించడం లేదు. ఇది మన దేశానికి, రాష్ట్రానికి పట్టినగతి.

రచయితలలో స్థితి గూడ ఇదేవిధంగా వుంటున్నది ఇతర నాగరిక దేశాలలో 'పాత' ఇచ్చట 'క్రొత్త' అవుతున్నది. సాంకేతికయుగంలో భావాల పర్యాణ తీవ్రతరమై ముహుర్ముహుస్తరంగతాడితములైన ప్రవాహ పరంపరాభివృద్ధిగా నాగరకత సాగిపోతూ వుండగా, అగ్రతరంగం అందక, గతించిపోయిన తరంగాలే—అగుపడి, అదే సత్యమన్న భ్రాంతిలో అప్రతిభమై ఈ రచయితృలోకం కొట్టుకొంటున్నది. ఏ దేశంలోనైనా సాహిత్యతపస్వులు మార్గదర్శకులవుతారని వుంది ఇది పూర్వం నిజమే కాని, ఇప్పుడు ఎంత నిజమో చెప్పలేము మానవుని కదిలించని అంతఃకరణను పట్టి, విశ్లేషించి, సౌందర్యవస్తుగా చెప్పగల శక్తి సాహిత్య సాధకునికి వున్నట్లు మరొకరికి వుండదన్న వాదం మనం అంగీకరించవచ్చు. ఎందుచేతననగా, ఒక శాస్త్రవేత్త, ఒక దార్శనికుడు, ఒక పరిపాలకుడు తాము చెప్పవలయుదానిని ప్రభుసమ్మితంగా మాత్రమే చెబుతారు సాహిత్యసాధకునికే మాత్రమే ఆ చెప్పవలయుదానిని కాంతాసమ్మితంగా చెప్పే శక్తి అలవడివుంది నిజమే కాని, ఆ చెప్పెడిదేమో, చెప్పవలయునదేమో, స్పష్టంగా దర్శనం అయినప్పుడు గదా. ఆ కాంతాసమ్మితత్వం పనిచేస్తుంది! రాజకీయవేత్తలలోవలెనే సాహిత్య సాధకులకు దర్శనదారిద్ర్యం ఏర్పడిపోయింది ఇచ్చట రాజకీయవేత్తకుగాని, సాహిత్యసాధకునికిగాని మనుష్యుడు విషయం కావడంలేదు; సమాజం లక్ష్యం కావడంలేదు. అనగా వస్తునిష్ఠమైన ఆలోచనాపద్ధతిస్థానే గతకాల సంక్రమితాలైన మానసిక స్థితులే ఆలోచనాసారణులయి వస్తుస్థితి గోచరింపనీయడంలేదు ఇచ్చట ఈ రచయితృలోకానికి రచయితృలోకం, మతానికి మతం, సంక్రాంతం సిద్ధాంతాలకు సిద్ధాంతాలు పనిచేసి, అది ఒక విపరీతవిచిత్రసంఘర్షణగా సాగుతూ, భావోద్దీప్తికిగాక, భావ నిధనానికి, ప్రతిపగమనానికి దారితీస్తున్నది ఆలోచన చేసి మార్గం దిద్దవలసినవారు సంఘర్షణ సంకులవుతున్నారు, సమస్యాసంకులు కాలేక పోతున్నారు. మతాచార్యులు గూడ నిస్సంగత్వం లేనివారై, మత సంగతిలో కాలసంగతి లేని వర్ణ ధర్మాదికాలను కూడపోస్తున్నారు. మతంయొక్క ప్రయోజనాలను వర్తమాన విజ్ఞాన పరంపరతో

అనుసంధించుకోలేక, గతించిన కాలాన్ని పునః ప్రవృత్తం చెయ్యాలని చూస్తున్నారు. మతంలో వున్న, వుండవలసిన సమాజ ధర్మ ప్రయోజన పద్ధతిని పునర్విమర్శ చేయక, అదార్శనికు లవుతున్నారు ఇది ఎంతవరకు కొన్ని సందర్భాలలో పోతున్నదనగా, ఈ పునః ప్రవృత్తివాదులు చంద్రలోకానికి మానవ యాత్రకూడా వేదంలోనే జరిగిందని, న్యూటన్ చెప్పినది కృతయుగంలోనే చెప్పినారని విచిత్ర విపరీత వాద బాధాబాధితులవుతున్నారు సంఘ పురోభివృద్ధికి ప్రతిబంధకం అవుతున్నారు. "అథాతో బ్రహ్మజిజ్ఞాస"గా ప్రారంభమైన మతాచరణం "అథాతో తిర్యగ్ జిజ్ఞాస"గా కొనసాగుతున్నదే గాని, ఆర్తజన సముద్ధరణ జిజ్ఞాసగా మాత్రం సాగడం లేదు.

రాజకీయరంగంలో వున్న వైక్లబ్యమే మత రంగంలో, సాహిత్యరంగంలో ప్రతిబింబిస్తూ, సత్వమూ స్తబ్ధంగా అసంయోజితమై, యోజనా విహీనంగా జనమనఃక్షేత్రాలను సరిదిద్దడంలో అసమర్థం అవుతున్నది. ఇప్పుడు 'నిన్న' ప్రధానమైనంత 'ఇవాళ' ప్రధానం కావడం లేదు. 'నిన్న'కు పట్టంగట్టి 'నేడును' ఏలాలన్న భావం సర్వదా గోచరిస్తున్నది. ఈ విపరీత మనస్థితి కొత్తను తట్టుకోలేక నిరోధిస్తున్నది. సాహిత్యరంగంలో చూస్తే, తెలుగుకు సంబంధించినంతవరకు, చరిత్రకు సంబంధించి నంతవరకు పరిభాషలో తేడాయేగాని, పద్ధతిలో తేడా లేదు. ప్రబంధకవిత్వంతో భావకవిత్వ యుగోదయం అయిననాటి ప్రోత్థిత వివాదాలే, ఇటీవల గూడ వేరుపరిభాషలో సాగుతున్నాయి. ప్రబంధ యుగ అత్యయకాలంలో సాగిన పద్ధతి భావకవిత్వ అవసానదశలోను, అభ్యుదయయుగం అంత్యదశలోను గూడ పునరావృత్తమై 'నేటిని' అపకర్షిస్తూ, 'నాటిని' ఉత్కర్షిస్తూ, నాడు, నేడులలోని మేలిమిని అనుసంధించి సమన్వయాన్ని సాధించలేని స్థితిలో పడుతున్నది.

ఈ పరిస్థితిని నిగమించిచూస్తే, ఇంకలోవున్న ఆవేదన సమస్తం గోచరిస్తుంది. ఇప్పుడు 'నేడు' జరుగవలసిన పనిని 'నిన్న'టి పరికరాలతో జరుపవలెనన్న ప్రయత్నాన్ని జతనుపరచడంచేత గతకాలపు పరిష్కారమార్గాలలో నేటి పరిస్థితుల చిక్కులను పడదీయవలెననే తలంపులు పలంతులు కావడంవల్ల, పరిస్థితికి పరిస్థితి పరికరాలకు పరికరాలు పరిష్కార మార్గాలకు పరిష్కార మార్గాలు చాలక, చెడి, పరిస్థితిని మరింత విషమము, సంకీర్ణము, కఠినము చేస్తున్నవి.

ఈ స్థితినుంచి విముక్తి ఎప్పుడనగా, ఆ స్థితి యొక్క వస్తుస్థిత్యవబోధచేత, తదనుకూల పరికర, తదనుకూల పరిష్కారమార్గ జిజ్ఞాసవల్ల తదతీత స్థితి సాధకాలైన సాధన సంపత్తులు ఏర్పడినప్పుడు మాత్రమే ఇందుకు శ్రద్ధ, ఆర్జవం, సాహసైక దృక్పథం, స్వోపజ్ఞ, సత్యదీక్ష ఆచరణప్రవణత ఎంత అవసరమో జిజ్ఞాసాపథగాములు విజిజ్ఞాసించవలసి వున్నది.

---

# సౌమ్య సూక్తము

శ్రీ శనగన నరసింహస్వామి

**1**

శిశిర తుహినవేపథ్యము శీర్ణమయ్యె—
జీర్ణమయ్యెను తరుదళశ్రేణి—నూత్న
వనరమా పాద నూపుర ధ్వనులు చెలగె
స్వాగతము! సౌమ్యవత్సరా! స్వాగతంబు!

**2**

నీ రాక ముందుగా నిఖిల దిక్కులం చాటె
కాకలీరీతి పుంస్కోకిలములు—
నీ ప్రాభవమును మన్నించి వీచెను గంధ
శైలానిలములు వింజామరములు—
నీ మార్గమున తావి నించెను వనలక్ష్మి
బహువిధవికచ పుష్పములు పఱచి—
నీ దర్శనము కోరి నిల్చియున్నారు శృం
గాటకంబులను లోకమున వార—

అంతదూరాన నిను గాంచు టబ్బె నేమొ!
కీలకము గద్దె దిగిపోయె బేలయగుచు;
రమ్ము! రాజ్యాభిషేకోత్సవమ్ము నంద
సౌమ్య! సౌమ్యాభిధాన! వత్సరవరేణ్య!

**3**

సౌమ్యుడవు బుద్ధినం చభి
రమ్యుడ వాకృతి నటంచు రకావేతి నూ
కావ్యముల దీర్తువంచు న
సామ్యుడ వంచును దలతుము సౌమ్యా! విన్మన్.

**4**

నీవు రాకముందె నినుగూర్చి కమ్మని
కలలు గాంచినాము కతలు కట్టి

నాము కైత లల్లినాము మా నమ్మిక
నమ్ము సేయకుము ! శుభ మ్మొసగుము !

5

విరద లోకచో వనావృష్టి వెరపు లోకటు
పండు టొకచోట పూర్తిగా నెండు టొకటు
ఈతిబాధల రుచి చూపి యేమొ సలిపె
కీలక మ్మింక రమ్ము ! మమ్మేలు కొనుము !

6

పేరును బట్టి నీ విలకు ప్రీతిని గూర్చెదవంచు నీ సదా
చారము గాంచి పెద్ద లతిసార్థకనామ మొసంగిరంచు వి
స్ఫారపుటాశ లూనితిమి స్వాంతములన్, ప్రభవాది సోదరో
దారమనోజ్ఞ వర్తన విధానమునన్ జగ ముద్ధరింపువమా !

7

పంచాంగంబులు పూని రచ్చలపయిన్
గ్రహోత్తముల్ తావకో
దంచద్భావిఫల ప్రభావములు వ్యా
ఖ్యానించుచున్నారు రో
మాంచోద్భేదవిభూతి శ్రోతృజనముల్
మజ్ఝా! భళీ! మాయురే!
యంచున్ గౌతుకమున్ వెలార్చ మతి నీ
యౌచిత్య మెట్లుండునో !

8

ఆయురారోగ్యవృద్ధిఁ బత్యాయుభంగి
కొమరు లఱువదిమంది తన్నాలుచుండ
ముతిసికొను ప్రకృతి సవిత్రి ముద్దుబిడ్డ
వీవు నిను వేతె నుతియింపనేల సౌమ్య !

9

ఈ వర్షంబు సుఖంబుగల్గ మతి యీ యేడాది లక్ష్మీకటా
క్షావిర్భూతి లభించునంచు మృగతృష్ణాకాంక్షతోఁ బోలె మి
థ్యావేశంబునఁ బొంగి క్రుంగితిమి నే డంతర్బహిస్సౌమ్యుడై
నీ వెతెంచితి వింక మా తపము పండెన్ నిండె సంతోషముల్.

**10**

మరియొక యర్వదేడులకు
మానకవత్తువు నీవు కాని యీ
నరు డెవ డెప్పు డేమగు నొ
నమ్మకమున్ వచియింపలేము నీ
పరిచయభాగ్య మిప్పుడె య
పారముగాఁ గలిగించి మా నమ
స్కరణము లందుమా! సుజన
సంస్తవనీయ వినీతవర్తనా!

**11**

ఇంటింట సిగ్గేది యెలుగెత్తు యాచకా
నీకంబునకు కోర్కి నిండుగాక!
వలిగొట్టి గజ గజ వణకాడు నిస్స్వ వృ
ద్ధున కొక్క దుప్పటి దొరకు గాక!
విపదంబునిధి మున్గి వెరగందు జనుల కె
ల్లెడ సహాయత లభియించు గాక
రేలు బవళ్లార్తిఁ గృశియించు దీర్ఘ రో
గుల కీష దుపశాంతి కలుగు గాక!

పక్షపాత విదూరము భవ్యతరము
ధన్యధన్యంబు భద్రభద్రంబు నగుచు
వర్ష భోగ్యంబు విభవంబు వరలు గాక!
తావకీనంబు వసుమతీ తలమునందు.

**12**

ప్రాతను రోతగాఁ దలచు భావము పొందక క్రొత్తయెల్ల సం
పూతముగాఁ దలంచు లఘుబుద్ధిని జెందక ప్రాత క్రొత్త లం
దే తఱి మేలె గైకొని త్వదేక విభుత్వమునందు ముందు మా
జాతి సమస్త మున్నతికి సాగునుగావుత! సౌమ్య వత్సరా!

# ఉగాది

శ్రీ కె. యస్. వి. నరసింహం

కొక్కొంకో యని కూయు కుక్కుట బృంద
గాన మాధురిచేత కదలి లేచి
జగతి మేల్కొనెనంచు [illegible] రెడు [illegible]
దుప్పట్లు వెడ్దదోలి కొప్పరించి

అంబా యనుచు లేగ లాలమందల బోవ
        నట్టెట్టు జూడక నడుగు బెట్టి
మొయిలు మునుగులోన మొగమెత్తి దిలకించు
        బాల భానుని తోడ పంతమాడి
నూతనోత్సాహ చయమగు నూపురంబు
        ఘల్లు ఘల్లంచు మ్రోగ నుగాది లక్ష్మి
వేగ నవతరించె జనాళి వేడ్క మీర
        మధుర మధురానుభూతుల మధువు చింద.

జిలుగు పయ్యెద జెక్కి చిలికించె కలయుంపి
        కలహంస గమనయౌ కలికియోర్తు
పూల రైకకు దీటు మేలి ముగ్గుల దీర్చె
        నెలజవ్వనాంగియౌ లలనయోర్తు
చెంగావి పావడా చిన్నబోవగ నింట
        నెజ్జి మట్టెని దిద్దె నింతియోర్తు
పాదాగ్రముల నిల్చి పట్టు పయ్యెద జార
        తోరణమ్ముల గట్టె కీరయోర్తు
'వేగ రావమ్మ నీకిదే స్వాగతమ్ము
        నిత్య కళ్యాణ విభవమ్ము సత్యమనగ
కలల నిక్కమ్ము సేయు నుగాది లక్ష్మి'
        అనెడి యాహ్వాన సంస్తుతు లలరుచుండ.

నూనుసిగ్గు తెరవెన్క నూతనోత్సాహాన
        నాధుని తలయంటు నవవధూటి
కుచ్చెళ్ల నెగబెట్టి కూర్మిమీద మగని
        జలకమాడించెడి తలిరుబోడి
క్రొత్తవలువ లిచ్చి కోపువార విభుని
        ముస్తాబు చేయించు ముద్దరాలు
అద్దాన సొగసుల దిద్దుకొను పతిని
        తలుపుచాటుగ జూచు తమ్మికంటి
సరస శృంగార చేష్టల సరసమాడ
        ఘనతరానంద రూపి యుగాది లక్ష్మి
కంతుబాణమౌ లలిత శృంగార రథము
        నెక్కి చనుదెంచె బావుటా నెగురవేసి.

వేపచెట్టున నిల్చి వేడ్కమీరగ కొమ్మ
        కొమ్మల వీక్షించు కోడెగాండ్రు
మృష్టాన్న కలన సంతుష్టులై సెజ్జల
        కేగి నిద్దురలోన జోగువారు .

రచ్చబండను జేరి రంగైన భావిని
పంచాంగ శ్రవణాన కాంచువారు
పకపకమని నవ్వి పండుగ ముచ్చట్లు
తెలియాడుచు సేద దీర్చువారు
ఆరు చవుల గలిపి పెట్టి యారగింపు
డనుచు భావిని ము న్నిదే చనవుతోడ
కోర్కెలెలరార క్రొంగొత్త కొలువులోన
గద్దెపై నెక్కి నేడె యుగాది వెలసె.

# మధుశ్రీ

## శ్రీ త్రిపురాన వేంకటకృష్ణరావు

**1**

శ్రీయుఁగ మావి తేనియలు తేరి, బుగుల్కొనఁగా మదిన్ గుబుల్;
కోయిల జంట కంఠమునఁ గూర్చొని కోయని కూయఁ; బాయ సం
దీయక తేఁటి దంపతులు హృత్కుసుమంబున నిల్చి హాయిగా
మ్రోయ, మధూదయం బొదవెఁ గ్రొంగయితల్ హృది జాలువాఱఁగన్.

**2**

పికగానాసవ వాహినీ లహరిపై విశ్వంబుఁ దేలించి, చై
త్రకుమారానిల వీచికా మధురిమన్ దాదాత్మ్య మొందించు నీ
విక సన్మాధవ శోభతో సుకవి యువ్వెత్తార్చి లోకంబులన్,
సుకవిత్వామృత మాధురీ గతులఁ జేర్చున్ నందనారామమున్

**3**

కొలువై యామని పూచి కాచి వలపుం గ్రొందీపు లందీయఁ, గ్రొం
జెలువున్ వన్నియ లెంచి కుంచియలు పైఁ జిందించి, చిత్రించు; న
త్కళలన్ లోకపు జాతి పోకడలు ప్రత్యక్షంబుగాఁ జూప, సొం
పలరన్, జేరెఁడు మేరలో, వికసింతుండై చిత్రకారుం డిలన్.

**4**

పాలి కారాకును రాల్చి దానికి బదుల్ మొల్వంగఁ బ్రాణానిలం
బొలయంగాఁ గల చిన్ని పొన్ని చివురా కుత్పత్తి గావించు నీ
విలసన్మాధవ మంజువేళల మహా వీరంబులై లోకముల్
తిలపెట్టెన్ బరివర్తనంబునకుఁ గ్రొత్తల్కొఁగ బూర్ణాకృతుల్!

### 5

పొదుపే కా బ్రదుకల్లఁ, దేని విరికిన్ బొట్టొక్కఁడుం గాఁ బెరన్
గుడువన్ బెట్టను దేనెటీఁగ యొరులం గ్రోల్పంగ; మున్ క్రోలు ప్రాఁ
బొద పూఁ గ్రోలక తేలు, గ్రొంబొదరు పూవుం గ్రోలుఁ, జాఁదూలు, తే
పెదలో నుంపక తేఁటి; లోకము వినోదించున్ నిజేచ్ఛాగతిన్॥

### 6

అలరుందోఁట, సరస్తటిన్ బికము కూయున్, దేఁటి మ్రోయున్, శుకం
బులు పాడన్, శిఖు లాడ, నూత్న మిధునంబుంబోలె గువ్వల్ పొదం
దలిరుంగూట నడంగి సిగ్గలయు నంతఃప్రేమ లన్యోన్యతం
జెలఁగన్ మ్రాఁగను వెట్టి చూచె; వినయశ్రీ శారి కొండాడఁగన్॥

### 7

నవవర్షాది దినప్రభాతమున నానందంబునన్ గాఁడిఁ గ్రొం
బువ్వులం గొల్చి, పాలంబునన్ దొలిహాలంబున్ బూన్చి, పంచాంగ సం
శ్రవణానంతర దేవసేవ పిదపన్ రైతింటఁ బచ్చళ్ల ప్రాఁ
బడి చూడన్ మహినేత విందు లిడియెన్ సౌధాల మిత్రాళికిన్॥

### 8

అలరుందోరణలై నవప్రియుల ప్రేమాలోకముల్ గ్రాలె; రా
గిలెఁ గెంజాయలు చెక్కు చేరువులఁ; గాఁగిళ్లన్ దలిర్చెన్ గగు
ర్మొలకల్, తేనియ లొల్కెఁ జుంబనములన్, గ్రొంబూపగాఁ బాపయున్
జెలగెన్ గొమ్మ; న దెంత ప్రేఁచుగా మధుశ్రీ యెల్ల జీవావళిన్.

### 9

అనిలాంకూర సుగంధమై హృదయ, ముద్యత్కౌసుమోల్లాసమై
యనుభావంబు, మధూదయ ప్రయాతమై యధ్యాత్మ భాసించు నీ
ఘన వాసంత సువేళ; నన్నిటికి నిక్కంబైన శ్రీ కాల శ
క్తిని ధ్యేయంబుగఁ గొల్వఁగాఁ దగుఁ బ్రవర్ధిల్లన్ మధుశ్రీ యిఁకన్॥

# షష్టిపూర్తి

## శ్రీ అయ్యగారి నరసింహమూర్తి

అవతరించితి వీ భువి నరువదేండ్ల
నాఁడు బాలుఁడ వీక నేఁడు వేడుకలర
షష్టిపూర్త్యుత్సవము నీకు జరుపఁదలఁచి
కూర్చి తెచ్చిన కుసుమాల గుచ్చ మిదిగొ!

బాల్యచేష్టలు నాటి వేష్టైనగాని
సౌమనస్యము నీయందు సార్థమిఙ
గావలెనని సుమనసులు కౌతుకమున
రమ్యమగు పేరుపెట్టిరి 'సౌమ్యు'డనుచు.

ఊహ కలిగిన దాదిగ నుర్విలోని
మంచి చెడుగులయందలి మర్మములను
అరసి జీర్ణించు కొన్న నేర్పరివి యగుట
ప్రాభవం బొప్ప 'సౌమ్యుండా' ప్రజలనేల
రమ్ము, ఇమ్ము సుఖమ్ము కరమ్ము హితవము.

పీడుపాలనఁ గోరుచు నిఖిల జగతి
నిండు నీరాజనముబట్టె నెనరుతోడ;
షడ్రుచుల మధురిమంబును జగతి కొసఁగి
ఎల్లజనముల నేలు మా ఉల్ల మలర.

షష్టిపూర్తియున్న జగతి రెండవ బాల్య
మందురు విదు లరసి యడుగువేసి
నేతి బీరకాయ రీతిని గాకుండ
పేరు నిలుపుకొనుము పృథ్విలోన.

# అమృతేచ్ఛ

## శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

సీ॥ ఏకమై, పరిమళముల నెపక మెసఁగి,
మాలికాకృతి దాలిచి, మాతృదేవి
గళము గైసేయు పూవుల చెలువ మొప్ప
కుసుమ వనమున కార్చిచ్చు ముసరనేల?

సీ॥ పసిడి జలతారు పలిపము ముసుగువేసి,
మాత్న కుంకుమ రాగము నూలు కొలిపి,
అందమొలుకు వినీల నభోంగణమున
కటిక చీకటి కాటుక క్రమ్మనేల?

సీ॥ కోమల గ్రామ మూర్ఛనల్ కుదిరి, మధురి
దమకములతోడ వీణ తీగలు నదింప,

రమ్యగతి సాగు కల్యాణిరాగ కలిత
గీతమున అపశ్రుతి పలికింపనేల ?

గీ॥ బాల పల్లవ స్తబక సంపద వహించి,
లలిత లలిత దళ శ్యామలంబు లగుచు
చలువ నీడల పాంథుల నలరజేయు
ద్రుమాకులందు ఆకులపాటు సోకనేల?

గీ॥ స్నేహసార పూరిత పరిస్నిగ్ధ మగుచు
కాంతి సౌభాగ్య చాంద్రీ ప్రసన్నరేఖ
తేలయు మానవ మానస వీధులందు
ఈసు సెగలు కరాళించి పొగులుటేల ?

సీ॥ లేతగా పచ్చిగా తుషారార్ద్రములును,
సురభిళములగు పవనాంకురములగుములు
చటుల కుటిల ఝంఝా ప్రభంజనము లగుచు
తెరలి లోకమున్ గగ్గోలు పరచుటేల?

సీ॥ అలరుతావులు, పండు వెన్నెలల చలువ,
కోకిలముపాట తీయన, క్రొంజివుళ్ళ
వన చెలంగు వసంతము భంగి జగము
శ్రీమయమ్ముగ వెలయ కాంక్షింతు మదిని.



# తెలుగువా రెవరు?

## శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి

లోక వ్యవహారమందును, వాఙ్మయమందును ఆంధ్రము తెలుగు అను పదములు సమానార్థకములుగా ప్రయోగింపబడుచున్నవి ఆంధ్రులే తెలుగువారు తెలుగువారే ఆంధ్రులు అనుటలో ఎవరికిని సందేహముగాని, ఆశ్చర్యముగాని లేదు కాదన్ననే వింత కాని నిజముగా ఆశ్చర్యపడవలసినది ఒకరికే రెండు పేర్లుండుట తమిళ, మలయాళ, కన్నడములకుగాని, మహారాష్ట్ర గూర్జర వంగాది భారతీయ భాషలకుగాని, ప్రపంచములో తెలిసినంతవరకు మరి యే భాషకుగాని రెండు పేర్లు లేవు. ద్రావిళ తమిళ శబ్దము లొకటే ద్రవిడమే తమిళమైనదో లేక తమిళమే త్రమిళ, ద్రమిళ, ద్రవిడ ద్రావిడములుగా పరిణమించినదో గాని అన్నియు ఒక్క పదముయొక్క వికారములే అట్లే కన్నడమే కర్ణాటకము. సంస్కృతమును దేవభాష, గీర్వాణి ఇత్యాదిగా చెప్పుటవలన అవి వేరు పేర్లని తలంపరాదు; విశేషణములు ఆంధ్రమునకు తెలుగు అట్టిదికాదు. పూర్తిగా సంబంధములేని రెండు పదములు మన భాషకు పేర్లుగా ఉండుటయే వింత దీనినిగూర్చి పండితులును, చరిత్రకారులును ద్రావిడ భాషా తత్త్వ నిర్ణయ సంబంధమున చర్చ చేసినను, మన భాషకు రెండు పేర్లేల యనుటను గూర్చి చింతించినట్లు కానరాదు ఆంధ్ర శబ్దము ప్రాచీనమే ఐతరేయ బ్రాహ్మణమునుండియు, పురాణముల కాలమునుండియు కనబడుచున్నది. ఆంధ్ర శాతవాహన రాజులు దక్షిణాపథమును పాలించినదియు, ఆంధ్రపదము జాతి వాచకముగా నుండుటయు స్పష్టమే వీరు తమిళుల కుత్తరముననుండినందున వీరిని తమిళులు 'వడుగరు' ఉత్తరాదివారు అను వర్థమున పేర్కొనుచుండిరి. 'వడుగవళి' అనగా 'ఆంధ్రాపథము'

కాని ఇంత ప్రాచీనకాలమున తెలుగు తెనుగు అను పదములు భాషను గూర్చిగాని, జాతినిగూర్చిగాని కానరావు ఆంధ్రభాషలో ప్రాకృత పదములు కోకొల్లలు. ఇవి ద్రావిడ పదములా ప్రాకృత పదములా యనియు సందేహమే. తర్వాతి కాలపు తెనుగు భాషలోని శబ్దములు ప్రాచీన ప్రాకృతములలో కనబడినంతమాత్రమున తెలుగు నాటినుండి కలదనిగాని ప్రాకృతముమీద ద్రావిడభాషా ప్రభావమనిగాని, ద్రావిడముమీద ప్రాకృత ప్రభావమనిగాని నిర్ణయింపలేము. ఆంధ్రభాష ఎంత ప్రాచీనమో తెలుగుకూడ అంత ప్రాచీనమనుటకు ప్రమాణములు లేవు ఏకకాలమున రెండు పేర్లు వ్యవహించియుండుననుటకు తగిన చారిత్రకాంశములును లభింపలేదు తెలుగు అను వ్యవహారము క్రీ. తర్వాతి కొన్ని శతాబ్దములకే కనబడుచున్నది నాగబు (నాగంబు) పదమునుబట్టి చూచిన తెలుగు భాషా స్వభావము ప్రాచీనమనియే చెప్పవలసియున్నది. ఇది ప్రాకృత మర్యాదకాదు. ఏదో దేశీయము. తర్వాత తెలుగనబడినది ఏలయన క్రీస్తుక పూర్వమునుండియు తెలుగుండియుండిన ఎక్కడనైనను ఆపదమో, దాని పూర్వ రూపమో చిక్కదా? అగత్తియం అను తమిళ లక్షణ గ్రంథములో 'తెలుంగు' పదమున్నది కాని తమిళ పండితులు ఇది ప్రాచీనము కాదనియు, అర్వాచీన విషయము లెన్నియో ఇందు ప్రక్షిప్తములు కలవనియు చారిత్ర కాధారముగా పనికిరాదనియు త్రోసివేసినారు. పురనానూరులో 'ఆయ్ అండిరన్' ఒకడు కలడు. ఇతడు ఆంధ్రుడేమోయని [illegible] వి ము. రాఘవయ్యంగారు శంకించినారు. కాని తెనుగని ఎక్కడను లేదు. తర్వాతికాలమున విద్ధసాల భంజికలో రాజశేఖరుడు 'త్రిలింగాధిపతి' యని ప్రయోగించెనని మిత్రులు ఆరుద్రగారు వ్రాసినారు. ఇది త్రికళింగాధిపతి యనుటకు అనంతరలేఖకుని పొరపాటుగా నుండును. ఎందులకనగా ఈ కథను గ్రహించిన మంచన తెనుగుమీద అభిమానము కలవాడు, తెనుగువాడు, తనకాలమునకు ప్రచారమునకువచ్చి అందరికిని అభిమాన పదముగా నుండు దానిని మాని 'కళింగలోత్రిపురి' యని యేల మార్చును? కావ్యముగా మూలమునుమార్చి పేళ్లల్లో కొంతమార్చినను తనదేశము పేరు స్పష్టముగా కనబడుచున్నదానిని మార్చునెందులకో! కాబట్టి త్రికళింగమేగాని త్రిలింగమై యుండదు రాజశేఖరునినాటికి త్రిలింగ రూపము రాలేదు. మార్కండేయ వాయు పురాణములలో 'తిలింగ' పదమే కనబడుచున్నదని శ్రీ ఆరుద్రగారు తెలిపియున్నారు. కాని పురాణములలో ఫోర్జరీలు ఎక్కువ ఇంతేగాక ఈ 'త్రిలింగ' 'తిలింగ' శబ్దములకును, త్రికళింగ శబ్దమునకును బొత్తిగా సంబంధము లేదు. కళింగము మూడు భాగములు ఉత్తర మధ్య దక్షిణములు ఉత్తర కళింగమే ఉత్కళము. ఉదీచ్యదేశముగాన ఉదీచ్య క్రమముగా ఒడిస్సా, ఒరిస్సాగా మారినది. ఇదంతయు తెలిసినదే ప్రాచీన పురాణములలో త్రిలింగపదము లేదని శ్రీ వేడేపల్లి వెంకట రమణాచార్యులవారు తెలిపియున్నారు (ఆం. సా ప. పత్రిక 2 ద్రావిడ భాషా పంచకము) క్రీ శ 150 నాటి గ్రీకు భూగోళజ్ఞుడు టాలెమీ 'ట్రిలింగా' అను పదమును వాడెనని మనవారు తలంచిరిగాని పొరపాటు. అది 'ట్రిగ్లిప్టాన్' కళింగమని పెద్దల యభిప్రాయము ఈ సందర్భమున శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిని స్మరింపవలెను. ఇట్లు వ్రాసియున్నారు:

"క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దము మొదటి పాదములో ఓరుగంటి ప్రతాపరుద్రుని ఆస్థానమందుండిన విద్యానాథకవి తన ప్రతాపరుద్రీయమున ఈ దేశమును తిలింగ, తెలుంగ, తెలింగ అనికాక త్రిలింగమని వ్యవహరించి, శ్రీశైల, కాళేశ్వర, ద్రాక్షారామములలోని మూడు శివలింగములవలన ఈ దేశమునకు ఆ పేరు కలిగినట్లు—

'యైర్దేశః త్రిభి రేవ యాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా
యేషాం కాకతిరాజకీర్తి విభవైః కైలాసశైలః కృతః
తే దేవాః ప్రసరత్ప్రసాద మధురాః శ్రీశైల కాళేశ్వర
ద్రాక్షారామ నివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే జాగ్రతు.'

అను శ్లోకములో సూచించియున్నాడు ఈ శ్లోకము శైవ మతావలంబకుడయిన ప్రతాపరుద్ర చక్రవర్తిని గురించి చెప్పినది కళింగము మినహాగా ఇప్పటి యాంధ్రదేశమునకంతకును కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తి ప్రభువగుటచేత శివక్షేత్రములైన శ్రీశైల కాళేశ్వర ద్రాక్షారామములను ఉజ్జాయింపుగా ఎల్లలుగా చెప్పి ఆ క్షేత్రములలోని శివలింగములవలననే ఈ దేశమునకు త్రిలింగమను పేరు కలిగినట్లు కవి చమత్కరించినాడు అంతియేకాని అంతకు పూర్వ మీ దేశమునకు త్రిలింగమను పేరు ఉండినట్లు వాఙ్మయములోకాని శాసనములలోకాని ఎందును కానరాదు. కాకతి రాజన్యులు శైవులని, వారు పాలించిన కాలములో ఆంధ్రదేశములోని ప్రధాన మతము శైవమేయని మన మీ సందర్భమున జ్ఞాపకముంచుకొనవలసియున్నది ....కాని కొందరనుకొనునట్లు త్రిలింగపదము ప్రాచీనమునుకాదు, తెలుగు—త్రిలింగ త్రికళింగ పదములనుండిగాని, తెనుగు త్రినగములనుండిగాని రానులేదు. ...విద్యానాథుడు చెప్పిన విషయమునే అతనికి తరువాతికాలపు తెలుగు లక్షణవేత్తలు ఉటంకించినారు." (తెలుగు విజ్ఞాన సర్వస్వము సంపు 3. పు 2.)

ఇందులకు తగినట్లు విద్యానాథునికి కొంత ముందువాడు రుద్రాంబ సమకాలికుడు, యాదవరాజ మంత్రి హేమాద్రి, తన వ్రతఖండమున కాకతీయులను 'త్రిలింగాధిపతు'లని వర్ణించినాడు పదుమూడవ శతాబ్ది.

> "త్రిలింగాధిపతేః యశోః విశసనం
> రుద్రస్య రౌద్రాకృతేః ...
>
> త్రిలింగ క్షితిపాల తూలనిచయ ప్రక్షేప చండానిలో...."

దీనింబట్టియే ఉత్తరదేశస్థులును వారి ననుసరించి మహమ్మదీయులును ఆంధ్రదేశమందలి తెలంగాణా భాగమును తిలంగ్ అని వ్యవహరించిరి. మేరుతుంగాచార్యుడు 13 వ శతాబ్ది ) ప్రబంధ చింతామణిలో, క్రీ శ. 973—997 నడుమ పాలించిన తైలప చక్రవర్తిని, పశ్చిమ చాళుక్య కర్ణాటకుని, తెలంగాణ ప్రభు వనెను.

కాని ప్రాచీనాంధ్రకవులు త్రిలింగ అనిగాని తెలింగ అనిగాని వ్రాయక తెనుంగనియు, తెలుగనియు వ్రాసిరి శాసనములలో తెలుగుపదమేగాని తెనుగు పదము కానరాదు. 'నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురుడయ్యె'. త్రినగముల భావము నాడుండినదో లేదో వేరువిధముగా తెలియదు తెలుగుపదమే ఉచ్చారణలో తెనుగైనదో పరిశోధింపవలయును మూడు కొండలు (త్రినగములు) అనుభావము వెలనాటి దుర్జయులకుండినట్లు వారి పండ్రెండవ శతాబ్ది శాసనపుదని శ్రీ శర్మగా రీ శ్లోకము నుదాహరించుట వలన తెలియుచున్నది

> "పూర్వాంభోనిధి కాలహస్తి శిఖరి శ్రీమన్మహేంద్రాచల
> శ్రీశైలై ర్వలయాకృతాంధ్ర విషయం."

దీనినిబట్టి కాలహస్తి, శ్రీశైల మహేంద్రాదుల నడిమిదేశ మాంధ్రదేశమనియే గాని పైన ఉదాహృత శ్లోకమందలి కాళేశ్వర (మంథెన కాళేశ్వరము, గోదావరీతీరము, పూర్వపు హైదరాబాదు రాజ్యము) శ్రీశైల దాక్షారామముల నడిమిది కాదని తెలియుచున్నది రెండును ఎంత పరస్పర విరుద్ధములు!

కాబట్టి శ్రీ శర్మగారు "ఈ రీతిని పూర్వ మాంధ్రదేశమున ఏ కొంత భాగముననో పరిపాలనము నెరపిన రాజులు తాము పాలించిన దేశము విస్తీర్ణముకాని, హద్దులుగాని తెలుపుచు వచ్చినారు కాని మొత్త మాంధ్రదేశపు విస్తీర్ణముకాని హద్దులుకాని తెలియవు అందువలన పూర్వము ఆంధ్రదేశము మొత్తము పరిమితిగాని, దాని ఎల్లలుగాని తెలిసికొన వీలులేక పోవుచున్నది" అని వ్రాసినారు

త్రినగములు త్రిలింగములు అనుభావము వెలనాటి దుర్జయులకు ఉండగా అసలు శబ్దము తెనుగా తెలుగా యనునది అన్వేషింపవలయును ఆంధ్రేతరులు తిలింగ్, తిల్లింగ్ అనియు దానినే తర్వాత తెలంగానాగా వ్యవహరించినది తెలిసినది వారెవ్వరును తెనంగ్ అని వ్యవహరింపలేదు తెలంగే శ్రీ శర్మగారు దీనింగూర్చి వ్రాసినది—"తెలుగు అన్నమాట నిపుడు ఆంధ్రమునకు పర్యాయపదముగా వాడుచున్నాము. ఆంధ్రపదముతో ఏమాత్రమును సాజాత్యములేని తెలుగు దానికి ఎట్లు ఎప్పటినుంచి పర్యాయపదమయ్యెనో తెలియదు. క్రీస్తుశకము పదివందలకు పూర్వపు శాసనములలో కాని, వాఙ్మయములో కాని తెలుగు అనుపదమే కానరాదు తమిళ, కన్నడ శాసనములలోను, ఆంధ్ర, కర్ణాట వాఙ్మయములలోను తెలుగుపదము పదునొకండవ శతాబ్దము ఆరంభమునుండియే కనబడును. శాసనములలో 'తెలుంగు భూపాలురు', 'తెల్లరవాడి', 'తెలింగకులకాల', 'తెలుంగ', 'తెలుంగదమల్ల' మొదలైన పదములు కానవచ్చును. ఈ శాసనములలోకూడా 'తెలుంగ', 'తెలింగ' పదములు జనవాచకము లేదా జాతి, వాచకముగనే కనబడును. ఒక్క శాసనములో మాత్రము 'తెలుంగవా ంొళగణ వాధవియ కెఱెయ' అని తెలుగుదేశములోని 'మాధవియకెఱె'అను గ్రామము పేర్కొనబడినది. ఇంద. తెలుగువాడు అని తెలుగుదేశము దాహృతమైనది. అనాటికే ఆంధ్ర త్రిలింగ లేక తెలింగ పదములు ఒకటే జాతిని దేశమును తెలుపుటకు అభేదముగ వాడబడినవి. తెలుగును దేశపరముగాను, జాతిపరముగాను వాడిన శాసనము లింకను ఉండవచ్చును. కాని అవి యన్నియు క్రీ. శ. పదవ శతాబ్దమునకు తరువాతివేకాని అంతకుపూర్వపువి కావు. పూర్వోక్తోదాహరణముల ననుసరించి చూడగా తెలుగురూపమే—అది తెలుంగుకానీ, తెలింగకానీ— మొదటిది పదునొకండవ శతాబ్ది మధ్యకాలమున పూర్వ చాళుక్య రాజరాజ నరేంద్రుని ఆస్థానముననుండిన నన్నయభట్టారకునినాటికి తెలుగు రూపాంతరముగా తెనుగు వచ్చినది. పదునాలుగవ శతాబ్దమునకు పూర్వమందుండిన నన్నయ నన్నెచోడులు తెనుగును భాషాపరముగా వాడియున్నారు. పదుమూడవ శతాబ్దములోని మహమ్మదీయ చరిత్రకారులు ఈ దేశమును తిలింగ్ (తిలింగ) అని వ్యవహరించిరి. ఈవిధమున తిలింగ, తెలుంగు, తెలింగపదములు దేశమును భాషను జాతిని సూచించు ఆంధ్రమునకు పర్యాయపదములైనవి"

ఎల్లలనుబట్టి, భావములు మారిన తీరునుబట్టి రుద్రునికాలములో (క్రీ. శ. 1158—1195)ని దానికి ప్రతాపరుద్రుని కాలములోని( 1296—1323) దానికిని ఇంత మార్పుండగా నడుమ రుద్రునికాలమున త్రిలింగ పదము లేదు సరిగదా దాక్షారామ కాళేశ్వరము ప్రస్తావములునులేవు. కాకతీయుల యభివృద్ధిని చూడగా రుద్రదేవుని కాలముననే స్వాతంత్ర్య సంపాదనమును రాజ్యాభివృద్ధియు సామ్రాజ్య విస్తరణమును కనబడుచున్నవి. మొదటి పర్యాయము సామ్రాజ్యపు టెల్లలు చెప్పబడినవి.

> 'రాజ్యం ప్రాచ్యాం లవణ జలధౌ స్త్రీరవర్యన్త మస్య
> శ్రీశైలాన్తం పచరతి సదా దక్షిణస్యాం సమగ్రం,
> ప్రాతీచ్యాన్తు కటకనికట స్థాయినీ రాజ్యలక్ష్మీః
> కౌబేర్యాశాతట విలసితా మాల్యవన్తం ప్రపేదే.'

ఇది క్రీ. శ 1162 నాటి హనుమకొండ శాసనము. రుద్రునికాలమునలేని తిలింగపదమును, కాదా రుద్రునికాలమునగాని అతనికి ముందుగాని, కాకతీయులు చెప్పుకొననట్టి తిలింగపదమును రుద్రుడు గతించిన వెనువెంటనే యాదవులు ప్రయోగించుటయు, అందులకు తగినట్లు శ్రీరంగమునందు దొరకిన తామ్రపట్టికలో తిలింగ శబ్దము దేశపరముగా

> 'పశ్చా త్పురస్తా దపి యస్య దేశౌ, ఖ్యాతౌ మహారాష్ట్ర, కలింగసంజ్ఞౌ
> అవా గుదక్ పాండ్యక కాన్యకుబ్జౌ దేశః స్మ తత్రాస్తి తిలింగనామా'

అని ప్రయుక్తమై యుండుటయు చూడగా కల్యాణి చాళుక్యులు పోయి, కాలచుర్యుల ప్రాభవము తగ్గి, కాకతీయులు తూర్పు దక్షిణాపథమునకంతటికిని ప్రభువులని తెలియుచున్నది పాండ్యులు నెల్లూరివరకు వచ్చియుండిరి. చోళులు తగ్గిరి కాన్యకుబ్జ రాజ్యము కాశీదేశమను పేర కాకతీయుల ఉత్తరపు టెల్లను తాకుచుండెను. పడమట యాదవుల మహారాష్ట్ర, రాజ్య మభివృద్ధికి వచ్చియుండినది. తూర్పున కళింగము. ఇవి నాటి సామ్రాజ్యములు ఒక విధముగా నేటి ఆంధ్రదేశమంతయు ఈతిలింగములో అడగినది. ఇదంతయు రుద్రుని ప్రభావము. తమిళ మహాకవి కంబడు కూడ రుద్రుని దర్శించినట్లు తమిళములో చాటువులు కలవు.

శ్రీ మల్లంపల్లి వారన్నట్లు—త్రిలింగ శబ్దము విద్యానాథుని తర్వాతిదే యనాటకు పై త్రిలింగ తిల్లింగ తిలింగోదాహరణములేగాక, తర్వాతివాడైన విన్నకోట పెద్దన—

> "ధర శ్రీపర్వత కాళేశ్వర దాక్షారామ సంజ్ఞ వరలు త్రిలింగా
> కరమగుట నంధ్రదేశం బరుదార త్రిలింగ దేశ మునః జనుఃబ్రులుబలి
> త్ర్యత్రిలింగ పదము తద్భవం బగుటచే
> తెలుగు దేశమనఁ దేటపడియె

వెనుకః దెనుగు దేశమును నేండ్రు కొంద
అబ్బాస పంచగతులఁ బరగుచుండు."

అనుటయు, ముందువాఁడు కేతన తిక్కన, కాకతి గణపతి చక్రవర్తులకును కాలికుఁడు, తన యాంధ్ర భాషా భూషణములో ఈ త్రిలింగములను చెప్పక, తెనుంగు తెలుగు పదములను మాత్రము వాడియుండుటయే.

"'మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్పరేఁ జెప్పెద విద్వన్నుత".

చూడఁగా 'తెనుఁగు' పదము మొదట నన్నయలో నున్నది. కాని నాటి తమిళ శాసనములలో తెలుంగుపదమే కనఁబడుచున్నది. చోళచక్రవర్తి రాజాధిరాజు వేంగిని సాధించుటకు (పశ్చిమ) కల్యాణి చాళుక్యలతో యుద్ధ మొనరించినకాలపు (1048 క్రీ శ) వర్ణనగల శాసనములో 'పూందూరు కటక మహా నగర' మున 'పేరారు' నదీతీరమున నిడువడి తెలుంగు విచ్చయ్య తమ్మ అను ఇరువురను 'శిల్లై కైవుత్తరాజన్, అక్కప్పయ్యన్, పిడ్డైకై (పెడకల్లు?) చోళన్' మొదలైనవారిని చెరబట్టెనని కలదు (ఎస్ ఐ ఐ V 520) వీరందరు కల్యాణీ చాళుక్యల సామంతులైన తెలుఁగు చోళులు, కర్నూలు ప్రాంతమువారు. ఈ శాసనములలోనే ఈ తెలుంగు విచ్చయ్యను 'నిడువాల్ తెలుంగు విచ్చయ్య' అని కూడ చెప్పియున్నారు. నిడువాల్ అనగా పొడుగుపాటి కత్తి లేదా ఇది 'నిడుగల్లు'కు తమిళీకరణమో! కాని ఇతఁడు తెలుగుచోళభిజ్ఞన ఈ శాసనము నన్నయ్య రాజరాజ నరేంద్రులకు సమకాలికము నాటికింకను భారతాంధ్రీకరణ ప్రారంభము కాలేదు తెలుంగే తెనుంగైయుండును. ఈ కాలముదే కల్యాణి చాళుక్య చక్రవర్తి త్రైలోక్యమల్లని (క్రీ. శ 1053) హిరె హడ గళ్ళి శాసనమున (S I I. IX-I 118) తెలుగునకు తిలు అని ప్రయోగింపబడియున్నది—తెలుగు అక్షరములను గురించి. సందర్భము పొన వడంగెరె యగ్రహారమ సందలి బ్రాహ్మణులలో జేమేశుడనువాఁడు ప్రశంసింపబడినప్పటిది. ఇతడు తన కీర్తిని నాలుగు విధములైన లిపులలో వ్రాయించినాడట—'విజాంకమాలెయం మానవ మన్మథం బరెద నాదరదిం విటాచక్రవర్తి ధాత్రీనుతమాగె తిలు తివుళ కన్నడ నాగర దక్కరంగళ". ఇందు కన్నడ నాగరాక్షరములు పోగా మిగిలినవి తిలు తివుళ. తివుళ, తిగుళ శబ్దములకు కన్నడములో తమిళులని యర్థము. చోళులను జయించిన కల్యాణి చాళుక్య సోమేశ్వరునికి 'తిగుళరమారి' యని బిరుదు ఇక మిగిలిన తిలువే మన తెలుగు చూడఁగా మన తెలుగునకు సమకాలికముగా మూడు రూపములు తెనుంగు, తెలుంగు, తిలు కనబడుచున్నవి. వీనిలోని తెలుంగుకే ప్రయోగము లెక్కువ. తిలురూపము ఏదో ప్రాచీన రూపముగాను తిలుంగ తిలింగ త్రిలింగ రూపములకు మాతృకగాను తోచుచున్నది.

మరి ఈ రూపములు జాతి వాచకములా భాషా వాచకములా ఉభయ వాచకములా లేక దేశవాచకములా? ఆంధ్ర శబ్ద మొక్కటి ప్రత్యేకముగా నుండుటచేత సందేహాస్పదము. పాల్కురికి సోమనాథుఁడు బసవ పురాణమున తెలుంగు బొమ్మయ్య లేక బొమ్మయ్య కథలో జాతివాచకముగా ప్రయోగించి యున్నాడు ఆంధ్రదేశమున తెలగనాయుళ్లేగాక ఓరుగంటిలో తెలుగువాండ్రు 6500 ఇండ్ల వారుండిరని సిద్ధేశ్వర చరిత్ర తెలుపుచున్నది అసలీ గ్రంథము చారిత్రక ప్రమాణముగా పనికి రాదుగాని (అనగా పరిశోధించి సమన్వయపడిన చోట్ల మాత్రమే గ్రాహ్యము) తెలుగువాండని యొకరుండినది కవి యెరుగుననుటకు చాలిన నిదర్శనము.

ఇతర జాతులు లేక వర్ణములు లేక తెగలవలె తెలుగువా రొకరుండిరి. వారికిని తెలుగు చోళులకు ఏదో సంబంధమున్నది. ఈ తెలుగుచోళులు కర్నూలు జిల్లా లేక మహబూబునగరు జిల్లా పూందూరు ప్రాంతమున కనబడియున్నారు. తెలుగు చోళరాజుల కుటుంబములవారే తెలుగువారుగా నుండిరనుట కొక నిదర్శనము దొరికినది. హొయసల త్రిభువనమల్ల బిట్టిగుడు (విష్ణువర్ధనుడు) క్రీ శ. 1136 లో తెలుగు దేశముపై నెత్తి వచ్చెను. వెలనాటి గొంకరాజు శాసనములు ఆంధ్రదేశమును గూర్చి, ఆంధ్రాధిపుని గూర్చి, తమ్మకొనట్లు, చెప్పుచున్నవి. వీరు పాలించుచుండినదికూడ ఆంధ్రదేశమే యైనను ఆంధ్రము అదేదో వేరైనట్లు చెప్పుటయు, రెండవ గొంకరాజు ఆంధ్రరాజును జయించినట్లును, రెండవ చోడరాజు కాకతిప్రోల నిర్దహనుడని యుండుటయు చూడగా నాడు కాకతీయులే ఆంధ్రరాజులుగాను వెలనాటి చోళులును, ఇతర చోళులును తెలుగువారుగాను పరిగణింపబడుచు వచ్చిరనుట తెలియుచున్నది (చూ. శ్రీ వై. యశోదాదేవిగారి వ్యాసము JAHRS Vol XVIII) పైన చెప్పిన హొయసల బిట్టిగుడు కాకతీయులను తాకినట్లులేదుగాన అతడు తాకిన తెలుగువారు వెలనాటివారే యను శ్రీ యశోదాదేవిగారి యభిప్రాయము సమంజసముగానే యున్నది. పైన 'తెలుంగ నా డొళగణ మాధవియకెఱె' అని 'ఒక్క శాసనముల మాత్రము.. తెలుగునాడు అని దేశ ముదాహృతమైనది' అని శ్రీ మల్లంపల్లి వారి రచన చూచితిమిగదా. దానికి వివరణము ఇప్పుడు దొరికినది. ఈ శాసన ముదాహరించు 'మాధవియకెఱె' మన గురిజాల, గుంటూరుజిల్లాలో పలనాడు తాలూకాలోనిది. (ఎపిగ్రాఫియ కర్నాటికా VII SK. 290 ముగుళగెఱె) చూడగా ఇది నాడు ఆరువేల వెలనాటి రాజ్యములోనిది అక్కడి నాడులన్నియు మనకు తెలిసినవే తెలుంగనాడని దేనిని ప్రత్యేకముగా నిర్దేశింపగలము దూరపు కన్నడులు తెలుగు రాజ్యమనుటకు తెలుంగనాడనిరని గ్రహింపవలెను. కాబట్టి తెలంగనాడనగా వెలనాడే, సందేహింప నక్కరలేదు ఈ ప్రాంతములోనే, నరసరావు పేట తాలూకాలో విప్పర్లలో దొరకిన చాళుక్య జయసింహవల్లభుని క్రీ. శ 649 నాటి శాసనమే, తొలి తెలుగు శాసనము— ఈ ప్రాంతముదే. అంతకు ముందువి రేనాటిచోళులవి

కాకతీయులు తెలుగుచోళులకు సంబంధపడినవారు కానందున వారిని తెలుగువారనక ఆంధ్రులనిరి. విద్యానాథుడును 'ఆంధ్రక్ష్మాభర్తుః' అని ప్రయోగించినాడు. కాని ప్రోలరాజు కాలమునుండి వారి రాజ్యము విస్తరించిన పిదప ఆంధ్ర తెలుగు పదములు పర్యాయపదములుగా నేర్పడినట్లు తెలియుచున్నది. తెలుగు చోళులు, రేనాటివారు, వెలనాటివారు మొదలైనవారే మొదట తెలుగువారు తెలుగు, తెలుంగు తిలింగు పదములు వ్యవహారమునకు వచ్చి వెలనాటిని కూడ కాకతీయులు జయించిన పిదప అంతయు కలిసి, ఆంధ్ర దేశమును తెలుగు దేశమును ఒక్క భూభాగమై అభేదప్రతిపత్తి నందసాగినవి ఆంధ్రవాఙ్మయము తలయెత్తునాటికి ఈ రెంటి కలయిక కుదురుకొన్నది వీరెక్కువగా నుండిన దేశము కడప, నెల్లూరు, కర్నూలు, గుంటూరు జిల్లాలును యుద్ధముల వలన వేంగీ దేశమును కాబట్టి మూడు నగములను లేదా లింగములను తమకు హద్దులని పండ్రెండవ శతాబ్దమున చెప్పుకొనిరి

"పూర్వాంభోనిధి కాలహస్తి శిఖర శ్రీమన్మహేంద్రాచల
శ్రీశైలై ర్వలయీకృతాంధ్ర విషయం' అని.

వీరు తెలంగాణాకుగాని పడమటికిగాని సామంతులుగాను సేనాధిపతులుగాను పోయి యుండినను, కొంతకాలము వేంగీచాళుక్యులకును కొంతకాలము కల్యాణీచాళుక్యలకును సామంతులుగా నున్నను, ఈ చెప్పిన భూభాగమే తమదానిగా భావించి యుండిరనుట స్పష్టము వీరు బలపడినది మొదలు ఈ భావ మభివృద్ధియై నన్నయ (త్రినగముల నడిమిదిగాన తెనుంగని 'ఎట్లు సాధించినాడో') ప్రయోగించి యుండును. తెనుగు లేక తెలుగుభాషయొక్క వ్యాప్తి చరిత్రను అన్వేషించిన పైభావము బలపడును. పైగా కాకతీయులు కూడ తెలుగువారేయనియు, తెలుగు చోళులకు దగ్గరి బంధువులనియు తెలియును.

ఇప్పటికి తెలుగే ఆదిరూపమని తేలినది. దాని మార్పు తెనుగు. ప్రాచీనాంధ్రులు తెనుగువారుకారు వారి భాష ప్రాకృతము తర్వాతివారును తూర్పు చాళుక్యుల వరకు అంతే. చాళుక్యులు కూడ తెనుగువారు కారు. వారి జన్మస్థానము

చక్కని పురోభివృద్ధికి చాలినంత నీటికి పంపుతో కూడిన
నమ్మదగిన
Kirloskar కిర్లోస్కర్ మోటార్



ఉత్తమ
ఫలసాయం



వ్యవసాయదారుని
పురోభివృద్ధికి



చాలినంత
నీరు



చక్కని
ఫలసాయానికి

మరియు చాలినంత నీటికి-
పంపుతో కూడిన నమ్మదగిన
Kirloskar కిర్లోస్కర్ మోటార్



(పంపుతో కూడిన కిర్లోస్కర్
వ్యవసాయ మోటార్)




కిర్లోస్కర్ ఎలక్ట్రిక్ కంపెనీ లిమిటెడ్,
పోస్టుబాక్సు నెం. 1017, బెంగుళూరు-2-ఇండియా
సోల్ డిస్ట్రిబ్యూటర్లు: పారీ & కంపెనీ లిమిటెడ్
పోస్టుబాక్సు నెం. 12, మద్రాసు-1. పోస్టుబాక్సు నెం. 208 కలకత్తా-1.
పోస్టుబాక్సు నెం. 506 బొంబాయి-1 పోస్టుబాక్సు నెం. 122

(AR-713 TEL)

రేనాటిలోని చళుక్యగిరియే యైనను ఆంధ్రదేశమునకు కర్ణాటకులుగా వచ్చిరి. మొదట పిఠాపురమును కళింగాంధ్ర ప్రాంతమును జయించి అటునుండియే తీరాంధ్ర దేశమున వ్యాపించి వీరి తొలి శాసనములలో తెలుగు చాల తక్కువ తీరిపేర పోగా ప్రాకృత సంస్కృతములే ఎక్కువ. మంచి తెనుగు కృష్ణకు దక్షిణముననే కనబడుచున్నది వీరికన్న ముందే రేనాడు తెలుగు ప్రాంతము. ఆరవ శతాబ్దమందే రేనాటి చోళుల తెనుగు శాసనములు కనబడుటచేత గుంటూరు జిల్లాలో తెలుగు వ్యాపించుటకు చాలముందే ఇచ్చట తెలుగుండెనని చెప్పవచ్చును కాబట్టి ప్రాకృత భాషయుండిన తీరాంధ్ర దేశమున దక్షిణము నుండి తెనుగ భాష వ్యాపించి భాషల మార్పు తెచ్చినది ఈ మార్పు తెలుగు చోళులవలన వచ్చినదే.

ఈ చోళులు చాల కుటుంబాలవారు ఆంధ్రదేశమునకు వచ్చిరి. కొందరు తాము కరికాలచోళుని వంశస్థులమని చెప్పుకొనియుండుటచేత కావేరీ తీరమునుండి పల్లవరాజుల కాలమునందో అంతకుముందో ఎప్పుడో రేనాటికి వచ్చియుండవలెను. వీరిలో చాలమందికి 'ఒరయూర్పురవరాధీశ్వర' యను బిరుదు కలదు ఒరయూరు (ఉఱైయూరు) చోళుల ప్రాచీన రాజధాని. దీనికే 'కోడి' యని నామాంతరము (కోడిని గూర్చిన చరిత్ర, మహిమలు ఉరయూరివే)

కలు పొన్న విరుల బెఱుగం
గలు కోడి రవంబు దిశల గలయగ జెలగన్
బొలుచు నొరయూరి కధిపతి
నలఘు పరాక్రముడ టెంకణాదిత్యుండన్.

అని నన్నెచోడుడు చెప్పుకొన్నది తననాటికథ కాదు. పెద్దలది. పానుగంటికి పోయి పండితారాధ్యులు ఉదయాపనీశునికి శాపమిచ్చి వెడలినప్పుడు 'అక్కజరభుగ బూచె నక్కలు పొన్న కుక్కురో కుర్రని కూసె కల్కోడి' ఇదంతయు ఉరయూరికథ. పండితారాధ్య బసవ పురాణములను వ్రాసిన పాల్కురికి సోమనాథుడు పెద్దలవలన విన్న కథలను గ్రంథస్థము చేసెను. తమిళ వాఙ్మయముతో పోల్చి వీనిపై నెవరును ఇంతవరకు పరిశోధన చేయలేదు. పెరియ పురాణములోని శైవ భక్తుల కథలకును, బసవ పురాణ పండితారాధ్య శివతత్త్వసారాదుల శైవ కథలకును ఎంతో భేద మున్నది. శైవము ఆంధ్రదేశమున వ్యాపించి ప్రబలిన కాలమున నీ కథలు వ్యాపించి, వాని ఆకరములు విస్మృతములుకాగా, ఆ మహిమలను ప్రాచీనులకు చెందినవానిని, ఇటీవలివారికి మనవారు ముడిపెట్టిరి. నాడగా ఈ చోళులు, కావేరీ తీరమువారు. మొదట రేనాడు మొదలగునాడుల నాక్రమించి క్రమముగా నలువైపుల పాకనాడు, కమ్మవాడు, లనాడులకును, పడమట నలపాడి, నొళంబపాడి మొదలైన ప్రదేశములకును వ్యాపించిరి. అనగా నెల్లూరు, గుంటూరు, కర్నూలు, అనంతపూర్, బళ్లారి, మైసూరులో కొంతదూరము వ్యాపించిరి. వీరితో కూడ వీరి భాషయు వ్యాపించి యుండుననుటకు సందేహములేదు.

ఇందులకు నిదర్శనము స్థూలదృష్టికే కనబడుచున్నది. కడప నెల్లూరు జిల్లాలలోకన్న ప్రాకృతము ఎక్కువగా వ్యాపించియుండిన ఇతర జిల్లాలలో పూర్వ ప్రాకృతములుపోయి వానిచోట క్రమముగా తెనుగు శాసన భాషగా కనబడుచున్నది గదా. కర్ణాటక దేశమందు కూడ ప్రాకృత స్థానమున కన్నడ మేర్పడి అది క్రమముగా అటు పశ్చిమ తీరమునకును, ఇటు కర్నూలు, తెలంగాణములకును వ్యాపించినది కనబడుచున్నది కన్నడము తెలంగాణముతోనే నిలిచి వేంగికిని తీరాంధ్ర దేశమునకును రాలేదు. ఏలయన ఆరు ఏడు శతాబ్దములనాటికే తీరాంధ్రముమీద తెలుగుయొక్క ప్రభావము కుదురుకొన్నది. తెలంగాణమున కన్నడము వ్యాపించినది. వేములవాడ చాళుక్యులు కన్నడమునే యభిమానించిరి అటు గోదావరీ తీరమునుండి శ్రీరుగంటివరకును ఈ కన్నడము పర్విన్నది నాటి కింకను తెలుగు కవిత్వ మేర్పడినను కావ్యమార్గము కుదురనందున పంపాదులు వేంగినుండిపోయి కన్నడమందే కావ్య రచన యొనర్చిరి. కాకతీయులలో రుద్రునివరకు కన్నడ ముండినది గదా. కాకతీయులును తెలుగు చోళులను కల్యాణి చాళుక్యుల సామంతులుగానుండి ఆ యా ప్రాంతములలో మొదట కన్నడములోనే శాసనములు వేయించి స్వతంత్రులైన తర్వాతనే తెలుగులోకి దిగిరి. కాకతీయుల స్వాతంత్ర్య కాలమునకు సరిగా తెలంగాణములో తెలుగు వ్యాప్తి కనబడుట పరిశీలింపదగినది తెలుగు శాసనభాష యైనది ఇచ్చట పండ్రెండవ శతాబ్దినుండియేగదా తెలంగాణమను పేరు కూడ అర్వాచీనమే ఒక్కొక్క భాగమున వేర్వేరు పేరుండి కాకతీయులు విజృంభించిన తర్వాతనె ఈ పేరు వచ్చుట కాబట్టి తెలుగువారు, తెలుగు చోళులు, వ్యాపించి వారి భాషయు వ్యాపించి దేశమున కీ పేరు వచ్చినది.

తెలుగువారైన చోళులు ఉరయూరువారు కాబట్టి తెలుగుయొక్క పుట్టు పూర్వోత్తరములను గ్రహించుటకు కాలమానమునుబట్టి వెనుకకు పోగలమా యన్న గట్టిగా పట్టు దొరకకున్నను కొంత సూచన కనబడుచున్నది. పల్లవులు తమ బిరుదములలో తెలుగు పదముల కూర్పులవంటివానిని ధరించుచుండిరి. 'విడేల్ విడుగు,' 'పిరాప్పిడుగు', 'కడుంబిడుగు' పిడుగు తమిళపదము కాదు. తమిళములో 'ఇడి' యందురు. పైగా పల్లవ శాసనములలో 'విభుండు, నిర్పియొల్లుయ్యంబు, వెంటుల విత్తు' మొదలైన పదములును, పల్లవ సామంతులైన కళభ్రులలో ఐదవ శతాబ్దమున పాండ్యులను జయించి మధుర నేలిన వారిలో, 'పెరుంబిడుగు ముత్తరయన్ సువరన్ మారన్' ప్రసిద్ధుడు వీరు ముత్తరాజులు, అనగా ముదిరాజులు. మూడు తరములవారు వీరు పల్లవ సామంతులైయుండి పాండ్యులను అణచిపెట్టియుండినట్లు తెలియుచున్నది. పల్లవ బిరుదములను 'పెరుంబిడు విడేల్ విడుగు' లను వీరును ధరించియుండిరి. 'పగాప్పిడుగు అనియు కలదు. ఈ కళభ్రు లెక్కడివారో తెలియదుగాని వీరు పాండ్యులను పడద్రోసినకాలము క్రీ. శ. 6 వ శతాబ్దమని చరిత్రకార సమ్మతము. వీరు కర్ణాటక జైనులని కొందరును, కళ్లర్, కళవర్, కళబర్ అనబడు అడవిజాతివారని కొందరును అభిప్రాయపడియున్నారు శాతవాహనుల త్రొక్కిడివలన దక్షిణమునకు వచ్చిరట. ఈ కళ్లజాతివాడు "పుల్లి" యను నతడు వెంగడం (తిరుపతి) కొండ ప్రాంతమును పాలించుచుండెనని సంగం వాఙ్మయమందు కలదు తిరుపతి తొండల మండలమునకు ఎల్ల కాళహస్తి తొండమనాటిలోనిది. మదరాసుకూడ తండియార్పేట అనబడు ప్రదేశము తొండైయార్పేట అని యుండెను. తొండమానులు పల్లవులు వారిపేట. పల్లవుల తొండ మండల భాగము కంచివరకు. కంచికి ఆవలమున అరువావడతలైనాడు అనిపేరు. చిదంబరమువరకు అరువనాడు దానికి ఉత్తరపు ఎల్ల వడతలై, అనాడు ఇక్కడివారే అరువాళర్ వీరినే అరవవారనిరి. అరవ మనగా తమిళమున పాము. ఇచ్చట నాగులుండిరనియు వారికిని పల్లవులకును సంబంధముండెననియు కథలు కలవు నెల్లూరుజిల్లాలో కందుకూరినుండి దక్షిణమునగల దేశమున పండ్రెండు బోయకొట్టము లుండినట్లు తెలియుచున్నది. కందుకూరొక కొట్టము. కొట్టమనగా దుర్గము కంచిరాజ్యమందును కొట్టములే ఎక్కువ. ముప్పదిరెండట. కంచిరాజ్యమును పల్లవు లాక్రమించిన అతి ప్రాచీనకాలమున ఇచ్చట ఎవరు పాలించుచుండిరో తెలియదుగాని పల్లవులు మాత్రము నెల్లూరు మండలమును రెండవ నందివర్మ కాలమున జయించినప్పుడు ఇచ్చట బోయరాజులుండిరనియు, వారి నాయకుడు పృథ్వీ వ్యాఘ్రుడనువాడు (నిషాదపతి) పల్లవుల అశ్వమేధాశ్వమును పట్టుకొని పోరాడగా పల్లవులు ఓడించిరనియు తెలియుచున్నది ఈ బోయలు ఎప్పటినుండి యుండిరో తెలియదు వీరె కళ్లరులై యుండినయెడల పుల్లి శబ్దము ప్రాకృతము ('వగ్ఘ సిహాయ పుల్లి' అని హేమచంద్రుని దేశీనామమాల) కాన ఈ పృథ్వీవ్యాఘ్రుడే ఆ పుల్లియో, వీని పూర్వులెవరైన ఆ పేరిటివారుండి న వాఙ్మయము కెక్కిరోయని సందేహము కలుగుచున్నది. తిరుపతి, నెల్లూరులు సన్నిహిత ప్రదేశములే. పైగా వీరు పూర్తి తమిళులు కారు వీనినెల్ల చూడగా (ఊహయే, చరిత్రయని గట్టిగా చెప్పుటకులేదు) ఈ కళభ్రులు బోయవాండ్రై యుండి, పల్లవ సామంతులై తమ తెలుగు బిరుదములతో దక్షిణమునకుపోయి పాండ్యులను జయించిరా లేక ఆదేశము

వకుపోయి కావేరీతీరము, వైగైతీరములలోనుండి పల్లవులవలన నీ బిరుదము ను సంపాదించిరా యనియు శంక కలుగుచున్నది.

రేనాటి చోళులకు సమకాలికులు ఈ బోయరాజులు. అప్పటికే రేనాటికి కరికాలచోళుని వంశస్థులు వచ్చి రెండుమూడు శతాబ్దములై యుండవలెను. కరికాల చోళుని కాలము నాలుగవ శతాబ్దముగా పరిశోధకులు తలచియున్నారు. అతని శత్రువే ముక్కంటి కాడువెట్టి త్రిలోచన పల్లవుడు. సముద్రగుప్తుని కాలమునకు కంచిలో పల్లవులు కలరు. ఈ ప్రాచీన ప్రాకృత శాసనాల పల్లవులకాలమందే కావేరీతీరమునుండి చోళులు జయింపబడి వారివంశమువారు పల్లవ సామంతులుగా రేనాటికి వచ్చియుండవలెను. రేనాటిలో తెనుగు శాసనములు కనబడునాటికే కొంత భాషాభివృద్ధి కనబడుచుండుటచేత తెనుగునకు కొంత పరిణామము కుదిరియుండవలెను. తెనుగు కవితకును తమిళ కవితకును సామాన్య స్వరూపము యతిప్రాసలు. సంస్కృతములో యతి పద్ధతిలేదు కన్నడములోను యతి లేదు. సంస్కృతములో ద్వితీయాక్షర ప్రాసము లేదు. కన్నడములో నున్నది. తమిళములో వలెనే తెనుగునందు రెండును కలవు. యతిని మోనై యనియు ప్రాసమును యదుగై యనియు తమిళములో చెప్పుదురు కర్ణాటకులు తమిళ పదములతోను, భాషా మర్యాదతోను ద్వితీయాక్షర ప్రాసమును మిగుల్చుకొని వృత్తరచన చేయగా తెనగువారు రెంటిని వదలకయే సంస్కృత వృత్తములను కలుపుకొనిరి తమిళమందును వృత్తరచన కలదు గుణగ విజయాదిత్యునికాలమునుండియు తెనుగు కవిత కనబడుచున్నది కాని తెలుగు తెనుగు పదములు కానరావు.

నన్నయనాటికే కవులు తెనుంగురూపమును వాడిరి. శాసనాది రచయితలు తెలుంగు రూపమును వాడిరి అనగా పండితుల భాషకును పామరుల భాషకును అప్పటికే కొంత భేద మేర్పడియుండవలెను. త్రిలింగము అనగా శ్రీశైల (మంతెన) కాళేశ్వర దాక్షారామములు కావనియు, త్రినగము అనగా కూడ ఇవి కావనియు తేలినది. ఇంతకును దాక్షారామమందు అంత గొప్ప కొండ యెక్కడిది. మహేంద్ర పర్వతమునకు పోవలయును. అప్పుడు కళింగము కూడ చేరును చూడగా మొదట తెలుగు వారొకరు (వారి పేరుమాత్రము వాచ్యముగా కనబడకపోయినను) ఉండిరనియు, కడప, నెలూరు, చిత్తూరు జిల్లాలే వారి ప్రాచీన స్థావరములనియు వారు క్రమముగా కర్నూలు, గుంటూరు జిల్లాలకును, తెలంగాణము, కృష్ణా జిల్లాలకును వ్యాపించి తర్వాత గోదావరీ తీరమునుకూడ దాటిరనియు స్పష్టపడుచున్నది. వేములవాడ చాళుక్యులు, కల్యాణి చాళుక్యులు, తొలితొలి వారైన సామంతకాకతీయులు వీరందరును పాలించిన కాలమున తెలంగాణమునకు ఆ పేరులేక తర్వాత వచ్చుటయు మొదట కన్నడ శాసనములుండి, వానిచోట తర్వాత తెలుగు కనబడుటయు, కాకతీయులను ఆంధ్రులుగా వ్యవహరించి తెలుగు చోళులను తెలుగువారనుటయు— చూడగా ప్రాచీనాంధ్రము, అనగా ప్రాకృతము క్రమముగా అంతరించి ఆ దేశమున కన్నడము వ్యాపించి, అదియు తగ్గి తెలుగు పూర్తిగా దేశమంతయు పర్విన దని తెలియుచున్నది. కాకతీయులు స్వతంత్రులగునప్పటికి తెలుగువారు ఆయా ప్రాంతములలోచేరి తెలుగు శాసనభాషయు, రాష్ట్రభాషయు సామ్రాజ్యమువిస్తరించి వేంగికూడచేరి దాక్షారామము కలిసి, శైవమతమువిజృంభించినంతట త్రిలింగ శబ్దము కుదిరి సార్థకత చెందినది. ఆంధ్రేతరులు తెలంగాణమునే ఆంధ్రదేశమనుటకు కారణము ప్రాచీనాంధ్రులు కర్ణాట తెలంగాణములతోడి దక్షిణాపథమునంతయు పాలింపగా, కన్నడ సామ్రాజ్యములు వచ్చి పశ్చిమ భాగమునకు కన్నడ కర్ణాటక నామములను పెట్టగా, మిగిలిన యాంధ్రదేశము ఆంధ్రముగానే యుండి క్రొత్త తెనుగుకూడ కలిసి మనకు రెండు పేర్లేర్పడినవి.

మరి కావేరీ తీరమునుండి పెన్నానదీ తీరమునకు వచ్చినవారు గదా చోళులు, వారినిగూర్చి తమిళ వాఙ్మయమందు 'తెలుగు' పదము కానరాదే, వీరెట్లు తెలుగువారగుదురని సందేహము కలుగవచ్చును. చేర చోళ పాండ్యులకు ముగ్గురకును జాతిపరముగా తమిళ శబ్దము కానరాదుగాని, భాషాపరముగా మన్నది. కరికాలచోళునిగూర్చి సంగం వాఙ్మయమందు పాడల్ (పాటలు— పద్యములు) కలవు. (తెనుగువారికి తెలిసినంత ఇతవిని గురించి వారికి తెలియదు లెండు) వీరిని 'మూవేందర్' ముగ్గురు రాజులు అని యందురు. మరి తెలుగు శబ్ద మెట్లు వచ్చినదనగా ఒక ఊహాకు కొంతమార్గము కనబడుచున్నది. ఇది కథలమీద నాధారపడినదేగాని గట్టి చరిత్రయని చెప్పలేము. పల్లవులు పాలించుచుండిన కాలమున, అతి ప్రాచీనుడు ఆదొండ చక్రవర్తియని యొక డుండెనట. పల్లవులు తొండమానులే గదా. ఈ చక్రవర్తి తన దేశమును సస్యవంతముగా చేయుటకై కృషీవలులకొరకు వెదకి తులుదేశమునుండి వెళ్లాళ కుటుంబములవారిని తెచ్చి తొండమండలములో నివసింపజేసెనట. అడవులను నరికించి చెరువులు కట్టించి శ్రీశైలమువరకును దేశమును ముక్కంటి పల్లవుడు బాగుచేయించిన కథ పాతదే గదా ఆదొండ చక్రవర్తియే యీ త్రిలోచన పల్లవుడో కాదో తెలియదుగాని, వెళ్లాళురనగా కృషీవలులనుట నిర్వివాదము. వీరు తులుదేశమునుండి వలసవచ్చి మదరాసు ప్రాంతములో నివసించినందున వీరికి 'తొండైమండలం తుళువ వెళ్లాళు'రని పేరు వచ్చినది. వీరి జ్ఞాపక చిహ్నమే నేటి టి టి వి హైస్కూలు (తొండై మండలం తుళువ వెళ్లాళ హైస్కూలు). మద్రాసు మింటు స్ట్రీటులో నున్నది. తులువారికి వాఙ్మయము లేదుగాని వారికి 'తిలు' యను పేరుండినదో లేదో తెలియదు. వీరే తొండమనాటికి మొదట వచ్చిరా లేక చోళులు రేనాటికి మొదట వచ్చిరో యనుట చెప్పలేము. పల్లవుల యాశ్రితులు రేనాటివారితో, ఇరుగు పొరుగువారితో కలియకయుందురా? తెలుగు చోళులు ప్రభువులు, యుద్ధవీరులు, పరిపాలకులు తులువవారు కర్షకులు. మన దేశమునందు కర్షకులందరు రెడ్లు. ఈ రెడ్లనందరినీ, నెల్లూరుజిల్లా, గుంటూరు జిల్లాలవరకు దాదాపు వేయేండ్ల క్రిందనే వచ్చి వ్యాపించి, నేటికిని ఇండ్లలో అతి ప్రాచీన తమిళ భాషను మాటలాడు పుదూరు ద్రావిడ బ్రాహ్మణులు 'వెళ్లాయర్' అనుచున్నారు వెళ్లాళ శబ్దమే యిట్లు మారినదో లేక అసలు సరియైన శబ్దమే యిదో ఎవరును పరిశోధింపలేదు. వేళ్ అనగా ఈటె ఆయర్ అనగా అభీరులు గొల్లలు. పాలెమ్ము వృత్తిగాగలవారు కాబట్టి వేళ్ + ఆయర్ వేళాయర్ ఐనదేమో. అసలు ఆయురులకు ఈటెలు, అనగా క్షత్ర ధర్మము లేదేమో? నెల్లూరి శాసనసంపుటములలోను, తిరుపతి శాసనములలోను రెడ్లకే వెళ్లాళర్ అని కలదు రెడ్లే రాష్ట్రకూటులనియు (రాష్ట్రకూట కుటుంబినః), సంసారులనియు చరిత్రచే తెలియుచున్నది. తుదకు తేలిన దేమనగా 'తిలు' శబ్ద వాచ్యులో, తెలు శబ్ద వాచ్యులో ఐయుండిన రెడ్డి కుటుంబములవారు రేనాటిచోళులతో అతి ప్రాచీనకాలమున చేరి, భాష పరిణామమునందు క్రమముగా తెలుంగ తెలుంగ శబ్దము ఉత్పన్నమై యుండవలెను. నాటి రాజ కుటుంబములు తమ యాశ్రిత కృషీవల కుటుంబములతో ఆంధ్రదేశమందు వ్యాపించి తెలుగుభాష వ్యాపించినది. నేటికిని స్వచ్ఛమైన తెలుగు మాటలాడువారు మత రెడ్లే.

ఇందుల కనుగుణముగా కాకతీయులును కావేరీ తీరము నుండి వ్యాపించిరాయని సందేహపడుటకు కొంత విషయము కనబడుచున్నది కాకతీయుల పూర్వచరిత్ర, అనగా మొదటి బేతరాజునకు మునుపటిది తెలుపు శాసనములు లేవు. దొరికినంతవరకు వీరు కల్యాణీ చాళుక్యుల సామంతుల గా నుండినప్పటివే వీనిలో మొదటిది క్రీ శ 1079 నాటి రెండవ బేతరాజుయొక్క హనుమకొండ శాసనము. రెండవది 1090 నాటి ఖాజీపేటది వీరు పశ్చిమ చాళుక్యుల సామంతులుగా నుండి అభివృద్ధికి వచ్చినది స్పష్టము. అంతకుపూర్వము, 'కాకర్త్య' శబ్ద మొకటి వేంగి చాళుక్యుల శాసనములలో దొరికినది, పెక్కు చర్చలకు కారణమైనది. మాంగల్లు శాసనమున దానార్ణవుని సహాయు యొక కాకర్త్య గుండ్యన యున్నాడు (క్రీ శ 955—6) ఈ గుండ్యన కాకర్త్యుడగుటయేగాక రాష్ట్రకూటుడుకూడ ఒక వేళ నిది అతని యుద్యోగమును గూర్చియు నుండవచ్చును. కాని తర్వాతివారి వంశావళిలో నీ గుండ్యన కానరాడు. ఇందులకు సమాధానము ఇతనికిని బేతరాజాదులకు నడుమ ఒక శతాబ్దము గడచుటయు వంశవృక్షమును కాకతీయులు బేతరాజునుండియే నిర్మించుకొనుటయు. పైగా వారు కొన్నిట

రెండవ బేతరాజుతోను కొన్నిట త్రిభువనమల్లునితోను కొన్నిట ఏదియులేకయు శాసనములు లిఖించిరి. వేంగి చాళుక్యులో కల్యాణీ చాళుక్యులో వ్రాయించుకొన్నట్లులేదు. అచ్చటచ్చట దుర్జయు డొకడు కనబడినను వంశవృక్ష నిర్మాణ శ్రద్ధ కానరాదు. దాదాపు ముప్పది యేండ్ల కాలములోనే మొదటి బేతరాజును వదలిన వీరు శతాబ్ది క్రింది గుండ్యనను వదలుటలో నాశ్చర్యము లేదు.

కాని గుండ్యనను కాకతీయులతో కలుపుటకు కాకర్త్య శబ్దమేగాక 'సామన్త విష్టి వంశ'ముకూడ నున్నది 'సామన్త విష్టివంశః శ్రీమాన్ కాకతి పురాధినాథో బేతః'. గుండనది 'సామన్త వొడ్డివంశః' విష్టి, వొడ్డి శబ్దములమీద చాల చర్చ జరిగినది. భేదమంతగా పాటింప దగినదికాదు. మాంగల్లు శాసనములో లేఖక ప్రమాదములు మెండు. బిట్టిశబ్దముతోడి చతుర్థకులజాలైన రాజవంశమువారి శాసనమొకటి తెలంగాణా శాసనములో II—37 కలదు. వీరు బిట్టికులతిలక జినాలయమును కట్టించి క్రీ శ 1108లో దానములిచ్చియున్నారు. ఈ శాసనదాత భువనగిరి దండనాయకుడు సంగనూరు విభుడు బీరయరెడ్డి రాష్ట్రకూటుడనగా చిన్న సామంతరాజను సర్గములో ఈ కాలమునకు శాసనములు గలవు. జయకేశి అరసు అనునతడు శక 996—1074 క్రీ శలో పులిగెరెలో రాష్ట్రకూటుడుగా పాలించుచుండెను (బాంబే కర్నాటక శాసనములు 29, 1935—36వం). కాకర్త్యగుండ్యన నతవాటి దేశమునకు రాష్ట్రకూటుడు.

కాకతీయులు మొదట కొరవిలో నుండి, తర్వాత అనుమకొండను చాళుక్య చక్రవర్తి త్రైలోక్యమల్ల ఆహవమల్లునికడనుండియు, తర్వాత సబ్బిసాయిరమును (వేములవాడ ప్రాంతమును) ఆరవ విక్రమాదిత్యుని కడనుండియు సంపాదించినది శాసనప్రసిద్ధము. వీరు తొలుత వేంగీ చాళుక్యులకు ఆశ్రితులు, తర్వాత పశ్చిమ చాళుక్యులకు కాకతి పురాధినాథులన్నది వీరికి ఆదినుండి గలబిరుదు కాకతి పురమును గూర్చిగాని కాకతమ్మను గూర్చిగాని ఎంత ప్రయత్నించినను ఊహామాత్రముగానే నిలిచి చరిత్ర లందుట దుర్ఘటముగా నున్నది. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి ఊహలను మించుట యసాధ్యము. వీరు తమ కాకతీయాంధ్రరాజయుగ చరిత్రమునందు మొదటి ప్రకరణములోనే 'కాకతులు, కాకతీయులు' అను శీర్షిక క్రింద విస్తారము చర్చించియున్నారు. 'కాకతి శబ్దమునకు వరుసగ కాకణి, కాకణ్డి, కాకంది, యనునవి పూర్వరూపాంతరములని జైనవాఙ్మయమును బట్టియు, బౌద్ధ వాఙ్మయమును బట్టియు, ప్రాచీన శాసనములను బట్టియు గన్పట్టు చున్నది' అని వ్రాసి, దానిని విస్తరించి 'కాకన్ది' గణమును గూర్చియు 'కాకన్ది' నగరమును గూర్చియు చాలా తెలిపినారు కాకతియని శక్తికి పేరట. జైనవాఙ్మయములో పుష్పదంత పురాణములో కాశీ విషయమున కలంకారము కాకంది పురమున్నదని కలదు.

"సదయారత్నకరండ దోళ్ భరత ధా
త్రీ ఖండదోళ్ రంజిసి
ర్పుదు కాశీ విషయం మనోజ విషయా
రమ్యం జగత్కామ్యమం
తదు పృథ్వీతిలకం క్షమాకటక మా
ర్గీ కాంచి విశ్వంభరా
విదితోత్తంస మిళావతంస మవనీ
హారం మహీనూపురం" (9—11)

......ఆనాడెంబ సరోవరక్కె వికసత్పంకేజ మెంబంతె లక్ష్మీనీడం......
కాకంది నామం పురం." (9—19)

'కాకతి' యని గ్రామమున్నట్లు మారేమండ రామారావుగా రనగా అట్టివి చాల గలవని వీరభద్రరావుగా రనిరి కాకందియను పేరు కాకినాడకు ఉండినదో లేదోగాని, నెల్లూరుజిల్లా గూడూరు తాలూకాలో సముద్రతీర ప్రాంతము రెడ్డిపాళెము పరిసరము పూర్వము కాకన్ది యనబడుచుండినది 'త్రిభువన చక్రవర్తి కోనేరిన్ మెయికొండాన్ రాజేందిర చోళమండలత్తుక్కడల్ కొండ పవ్వత్తిరి క్కోట్టత్తిల్ కాకన్ది మానగరిల్ పూశై కొండరుళుం పవన వినాయక దేవరుం......' అని పంట్రంగము చెంత పండరంగేశ్వరస్వామి దేవాలయ శాసనములో నున్నది (నెల్లూరు శాసనములు, గూడూరు 87). దీని తర్వాతి శాసనముచేత ఆ ప్రదేశమునకు పేరూరునాడని పేరనియు, అది పవ్వత్తిరి కోట్టములో నంతర్భాగమై జయంగొండ చోళమండలము (నెల్లూరు జిల్లాలో దక్షిణ దిగ్భాగము) లోనిదనియు కాకంది మహానగరమనియు తెలియుచున్నది. ఇందులో నొక శాసనమున నొక రాజరాజ పల్లవ సిద్ధరసు భార్య ఇరుమడి శ్రీయాదేవియను నామె ఉఱైయూర్ చోళన్ యొక్క కొమార్తె చేసిన దానములు గలవు. ఇవన్నియు కులోత్తుంగచోళుని తర్వాతివి వీని నెవరును చక్కగా శోధించి ప్రకటింపలేదు. కొన్నిటికి వేణుగోపాలశ్రేష్ఠిగారే మూలమును ప్రకటింపక వదలిరి. ఈ పంట్రంగము నేడు నాయుడుపేటనుండి తూర్పుగా మల్లాం రోడ్డులో పోయిన సముద్రతీర ప్రాంతమున కలదు ఇదిగాక మరియొక కాకన్దియు కలదు.

అది కావేరిప్పూంబట్టణమే. కావేరి సముద్రమును చేరు చోటి పట్టణమని యర్థము. దీనికే పుహార్ అనియు (పుహాఱ=ప్రవేశించు, సముద్రముతో సంగమించు) పేరు. దీనికి ఆవలి యొడ్డుననే ఒరయూరు కలదు కకున్దన్ అను నొక రాజు పాలించినందువలన దీనికి ఈపేరు వచ్చినది అని 'సంఘం' వాఙ్మయమున కలదు. ఈ కావేరి తీరముననే శిబిదేశమని పేరు. ఈ రాజులకు శిబి వంశస్థులుగాన శెంబియనులని ప్రసిద్ధి (దండి దశకుమార చరిత్రలో కూడ కావేరి తీరమును శిబిదేశ మన్నాడు) కరికాలచోళుని వంశస్థులు ఆంధ్రదేశమునకు వచ్చి రేనాటిలో కొంతకాలముండి దేశమంతయు వ్యాపించినట్లే కాకతీయులును కావేరీ తీరమునుండియే వచ్చి యుందురా! ఒక యాశ్చర్యము కాకతీయులలో తొలితొలి రాజులు చెప్పుకొనక పోయినను గణపతి చక్రవర్తి కాలమున కొన్ని శాసనములు వీరిని కరికాలాన్వయులని యనుచున్నది. ఇది తర్వాతి కల్పనయై యుండిన యెడల చోళులతో వీరెందులకు తమ్ము ముడి పెట్టుకొన్నారో ఆలోచింపవలెను. అంతేకాదు. మొదటి బేతరాజునుండి తాము దుర్జయుని వంశస్థులమనియు చెప్పుకొన్నారు. దుర్జయకులాబ్ధిచంద్రులు పలువు రున్నారు. ఈ దుర్జయుడు దుర్యోధనుని కొడుకని భాసనాటకము ఊరుభంగములోని దానిని వీరభద్రరావు గారు చెప్పియే యున్నారు. దుర్జయుడు చారిత్రక పురుషుడా యనునది కాదు కావలసినది ఇదంతయు దాక్షిణాత్య సంబంధమును సూచించుచున్నది అనునంత వరకే ముఖ్యము. భాసనాటకములు దక్షిణ దేశములో దొరికినవి అసలివి ఆతని నాటకాల రంగ ప్రతులనియు ప్రతీతి కాకతీయులును కావేరీ తీరవాసులై యుండి తెలుగు చోళులవలెనే పైకెగబ్రాకి యుందురు.

కావేరీ తీరముతోడి సంబంధమును తెలుపు విషయములు మరిరెండు కలవు. శిబి చక్రవర్తి పావుర మెత్తు మాంసమును డేగ కిచ్చిన కథ జగత్ప్రసిద్ధము. శిబి వంశస్థులు శెంబియనులు గదా. ఒరయూరు కథ మాత్రమే గాక చోళులను గూర్చిన శిబికథ చేజెర్లలోని కపోతేశ్వరాలయము చెప్పుచున్నది. ఇది ఆనంద గోత్రజుల కాలమునాటిదనియు మొదట బౌద్ధ చైత్య గృహముగా నుండి తరువాత హిందూ దేవాలయ మాయెననియు నిర్ణయించి యున్నారు. ఇంకను ఆంధ్రదేవాలయ వాస్తుకళా పరిణామములలో దీని స్థానమును శ్రీ సి శివరామమూర్తి గారిట్లు వ్రాసియున్నారు 'ఇది నాగార్జునుని కొండలోని బౌద్ధ చైత్యమువంటి వాని ననుసరించి గజపృష్ఠాకార రూపమున నిర్మింపబడిన తొలుదొల్లిటి హిందూ దేవాలయము .... వెనుకటి పై భాగము గజపృష్ఠము వలె వంపుగా నున్నది ... క్రీ శ 4వ శతాబ్దిలో పాలించిన ఆనంద గోత్రజులగు రాజులు కట్టించినది. దీనికి తరువాత గజపృష్ఠాకారముగ నిర్మింపబడిన తొలుతటి హిందూ దేవాలయము మహాబలిపురమందలి రథ వర్గమున గలదు. పల్లవ శిల్పులు చేజెర్ల దేవాలయ రూపము ననుకరించి యుండుట అసంభవము

కాదు పిలన, విచిత్ర చిత్తుడని ప్రసిద్ధిచెందిన పల్లవరాజు మొదటి మహేంద్ర వర్మ కృష్ణాతటభూమిని పాలించుచుండిన విష్ణుకుండి విక్రమ మహేంద్రుని దౌహిత్రుడగుటవలన అతడు కొండలను తొలిచి ఆలయములను నిర్మించు ఆంధ్ర సంప్రదాయమును తన కాంచీరాజ్యమున ప్రవేశ పెట్టి యుండవచ్చును. ఇట్టి గజపృష్ఠాకారమున నిర్మింపబడిన తొలుతటి దేవతాయతనములు మరిరెండు దక్కనునందు గలవు అందొకటి తేర్ అను ప్రదేశమున నున్నది రెండవది అయ్యావళిలోని దుర్గ దేవాలయము ఈ రెండును చాల ప్రాచీనములే రెండవది క్రీ శ ఆరవ శతాబ్దమునకు చెందినది క్రీ శ ఏడవ శతాబ్దారంభ దశకములలో చాళుక్యులకును పల్లవులకను కలిగిన సంఘర్షణలు కూడ ఈ సంస్కృతి సంసర్గ ప్రభవమునకు కారణమై యుండవచ్చును. అట్లే అయ్యావళి దేవాలయ నిర్మాణ పద్ధతిని పల్లవ శిల్పులు అనుకరించి యుండవచ్చును (తెలుగు విజ్ఞా సర్వ 3 పు 651) గజపృష్ఠ విమానములు మహాబలిపురమందే గాక మదరాసునకు చుట్టు ఐదారు చోట్ల గలవు తిరువత్తూరిలో పెద్ద ప్రధాన విమానము, ఉన్నవానిలో పెద్ద గజపృష్ఠము చిన్నవి సమాన పరిమాణము గలవి పొన్నేరిలోను, మదరాసు నుండి ఆవడికి పోవు మార్గమున పాడియను చోటను, అరక్కోణము మార్గమున తిరుపాచ్చూరు తిరుమళిశై మొదలైన చోట్లను కలదు ఇంతలేసి కట్టడములే వెలసియుండగా జనుల వలసలు ఏర్పడి యుండుట ఒక యాశ్చర్యమా!

దక్షిణ దేశమున చోళరాజులను గూర్చి చోళ బ్రహ్మహత్య కథ యొకటి కలదు ఆ రాజు చేసిన బ్రహ్మహత్య అతనిని వెన్నంటి తరుముగా నాతడు చాల దూరము పారిపోయి అది వదలనందున తిరువిడమరుదూ రనుచోట శివాలయమున ప్రవేశింపగా వాకిటనే నిలిచి అతనికై వేచి యుండెనట. మహాత్ముల సలహా వలన ఒతడింకొక మార్గమున పోయి దానిని తప్పించుకొనెనట బ్రహ్మహత్య ఇంకను ఆద్వారము చెంతనే కనుపెట్టుకొనియున్నదట మరి ఆంధ్రులలో వెలనాటివారికొక ప్రతిబంధక మున్నది వెలనాడు చోళరాజులు పాలించినది. చోళులతో సంబంధపడిన యీ కథ వెలనాటితోను సంబంధపడి యుండుట ఆలోచింప దగినది. శైవవాఙ్మయములో అరువత్తుమూవరును గూర్చి మన మెరిగినది తమిళు లెరుగరు. శైవవ్యాప్తి చరిత్రనన్వేషించిన ఎన్ని చారిత్రక సత్యములు వెలువడగలవో!

ఇట్టిదంతయు చూడగా శాతవాహనులు ప్రాకృతమును పల్లవులు మొదట ప్రాకృతమును తర్వాత సంస్కృతమును వృద్ధిపరుపగా, చేరచోళ పాండ్యులలో పాండ్యులు తమిళమును పోషింపగా, చేరరాజులు మలయాళభాషను ఆదరింపగా, చోళరాజులును వారితో చేరిన కాకతీయులును, రెడ్డుగా మారిన రాష్ట్రకూటులును తెలుగును పోషించిరి ఆంధ్రదేశమున వ్యాపించినందున క్రమముగ ప్రాకృత సంస్కృత భాషల ప్రభావముచేత మార్పునంది సంస్కృత ప్రాకృత ద్రావిడ భాషల యొక్క భిన్నరీతులను పదములను వ్యాకరణ విశేషములను తెలుగు గ్రహించినది ప్రాచీనాంధ్ర దేశమగుటచే ఆంధ్ర పదము నిలిచినది తెలుగువారు చేరుటచే తెలుగైనది మనకును మన భాషకును రెండు పేర్లుండుటకు పై చారిత్రకాంశములే కారణముగా నుండవచ్చునని నా యూహ. పెద్దలు పరిశోధింతురు గాక.

---

# సిరజ

## శ్రీ నిఖిలేశ్వర్

ఈ వేదనా రోదసిలాంటి
విశాల జీవితంలో
అనంతమైన నీరస క్షణాల గర్భంలో
పుట్టుక ఒక మహత్తులేన సంఘటన
చావు అంతకంటే మామూలైన పరిణామం.

రసహీనమై నిస్ప్రాణంగా లాగే కాలం
ఒక్కొక్క జన్మకు స్పందించి
కాస్సేపు కేరింతలమధ్య
కటాకటాలను మరచి
సనాతన సృష్టిలోని ఆనందానికి
ఒక వాస్తవం జీవం పోసుకుంటుంది.

దమనుల్లో ప్రకృతి—పురుషుల రక్తం
ఏ రోజు కారోజు అంతుపట్టని రహస్యంలో
అమాయకంగా——చిలిపిగా బతకడం మాని
సొంత జీవితాన్నే మోయలేని ఈ యుగంలో
రచన
అజేయమైన అనంతశ్వాస సృష్టి
విలయం చెందుతుంది
ఆర్ద్రంగా—ప్రశాంతంగా
మధుర సంగీతానుభవంలా......

ప్రతి పండు మాయని మెత్తదనంలో
మరెన్నో పళ్ళకు
సంగమ స్థానమయ్యే విత్తులతో
ప్రతి విత్తు వినూత్నమైన రహస్యంతో
కళ్ళ ఎదుట విశ్వాంతరాళాన్ని నిలిపినపుడు
ఒక మహత్తులేని సంఘటన
చావులేని నిరంతర జన్మపరంపర
ప్రతిసారి ఒక ప్రశాంత సుషుప్తితో
మంచులాంటి చల్లని తెల్లని అమాయకత్వంతో
మెరుస్తుంది జీవితం
బాధల పంకిలంలో స్వేచ్ఛగా—.

# రాచూరు శిలాశాసనములు

## శ్రీ బి. ఎస్. శాస్త్రి

మహబూబు నగర మండలము, కల్వకుర్తి తాలూకాలోని రాచూర గ్రామము వెలుపలనున్న దేవాలయమున గల నల్లరాతిపై మూడువైపుల శాసనములును, ఒకవైపు మహానాగమును, చెక్కబడియున్నవి ఈ శాసనములు రావితోట్ల ప్రెగ్గడ మల్లిసెట్టి వేయించినట్టివి

రాష్ట్రకూట వంశ మంతరించిన పిమ్మట నల్లగొండ, మహబూబు నగర మండలములను కల్యాణీ చాళుక్యు లాక్రమించి పాలించిరి ఈ మండలములలో కల్యాణీ చాళుక్యులకును, వారి సామంతులకును, దండనాథులకును, సంబంధించిన వందలకొలది శాసనములు కనిపించుచున్నవి

రాచూరు గ్రామ మతి పురాతనమైనది ఇచటనున్న ప్రాచీన దేవాలయములో కొన్ని శిథిలమై నామమాత్రముగ నిలచియున్నవి కేశవ దేవర ఆలయము శిథిలముకాకుండ పశ్చిమ చాళుక్య శిల్ప సంపదతో నొప్పారుచున్నది ఈ ఆలయము గర్భగుడి, విశాల మంటపము కలిగియున్నది కేశవ దేవర ఆలయము, మల్లికారున దేవర ఆలయము కలిసియేయున్నవి ఆలయము ముందు ఆవరణలో చిన్న చిన్న గుళ్లు ఉన్నవి అందు వినాయక, పార్వతి, ఆంజనేయస్వామి విగ్రహము లున్నవి

వినాయక విగ్రహముముందుగల నంది చక్కని శిల్పముతో నొప్పారుచున్నది దేవాలయ ప్రాకారకుడ్యములు పడిపోయి, పునాదులు మాత్రము కనిపించుచున్నవి ఈ గ్రామమున ప్రాచీన దేవాలయ శిథిల చిహ్నములు విశేషముగనున్నవి చరిత్ర ప్రసిద్ధిగన్న గంగాపుర మిచ్చటికి ఇరువదియైదు మైళ్ల దూరములో నున్నది

కేశవ దేవర ఆలయమునకు పది గజముల దూరమున ఒక శిలా శాసనమున్నది ఈ శాసనము కల్యాణీ చాళుక్యరాజగు మూడవ తైలపుని కాలమున నల్లపయ్య దండనాయకరు వేయించినది ఇది కన్నడ శాసనము

రావితోట్ల ప్రెగ్గడ మల్లిసెట్టి వేయించిన మూడు శాసనములలో ఒకదానియందు కందూరి ఉదయనచోడ మహారాజ ప్రశంస కలదు ఉదయనచోడునికి సంబంధించిన మొదటి శాసనము శక సంవత్సరము 1084 లో



రాచూరులోని కేశవదేవర ఆలయములోనున్న నంది వినాయక ఆంజనేయ పార్వతీ విగ్రహములు

వేయింపబడిన ఒడ్డర్ల శాసనమని[1] ఇంతవరకు భావింపబడినది కాని నల్ల గొండ మండలములోని సిరికొండ' గ్రామముననున్న శక సంవత్సరము 1070 నాటి అప్రకటిత శాసనము చాళుక్య ప్రతాప చక్రవర్తి జగదేకమల్లుని, ఉదయనచోడ మహారాజును పేర్కొనుచుండుటవలన—'సిరికొండ' శాసనము ఉదయనచోడ మహారాజును పేర్కొను మొదటి శాసనమని భావింపవచ్చును మళ్ళిసెట్టి వేయించిన రాచూరు శాసనము ఉదయనచోడుని పేర్కొను రెండవ శాసనమగును.

కందూరి చోడవంశీయుల చరిత్ర అసమగ్రముగ నున్నది ఇంతవరకు లభించిన శాసనములందు పేర్కొనబడిన రాజులపేళ్ళు కొణిదెన, పొత్తపి, నెల్లూరు, వెలనాడు, రేనాడు, కర్నాడు ప్రాంతములను పాలించిన తెలుగు చోడ రాజుల పేళ్ళతో సమన్వయపరచుటకు వీలు లేకుండ నున్నవి నల్లగొండ, మహబూబు నగర మండలములందు కందూరి చోడులకు సంబంధించిన శాసనము లెన్నియో యున్నవి అందు కొన్ని ప్రకటింపబడినవి కొన్ని ప్రకటింపబడ వలసియున్నది.

## కందూరి చోడులు

నేటి ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణ ప్రాంతమున మహబూబునగరం, నల్లగొండ మండలములందు తెలుగుచోడ వంశీయులలో నొకశాఖవారు కందూరు చోడులుగా ప్రసిద్ధిచెంది, కల్యాణి చాళుక్యులకును, కాకతీయులకును సామంతులుగా వ్యవహరించి పాలించినారు. ఈ వంశీయుల రాజధానులుగా వర్ధిల్లిన నగరములలో కొలనుపాక, కందూరు, పానగల్లు, వర్ధమానపురములు ముఖ్యమైనవి.

కందూరు చోడవంశీయులకు సంబంధించిన శాసనములను ఆధారముగా గొని రాజులకాలమును, చరిత్రను కొంతవరకు తెలిసికొనవచ్చును

## కందూరి చోడుల శాసనములు

1 కొలనుపాక— తొండరస చోళ మహారాజు — చా వి సం 13 —A P. Govt Arch Series No 3–Ng 48.

2. కొలనుపాక — కుమార కొండయ చోళమహారాజు—చా వి సం. 24—A. P Govt Arch. Series No. 3–Ng. 46.

3 గట్టుతుమ్మెన—నల్ల భీమదేవ చోడమహారాజు—చా వి సం 50 — Hyd. Arc. Series No. 19 Mn–10.

4. ఉప్పునూతల — సోమనాథదేవ చోడమహారాజు—చా వి సం 32 —Hyd. Arc. Series No. 19. Mn—45.

5 ఏలేశ్వరం — గోకర్ణదేవచోడ మహారాజు — చా వి. సం 33 —A. P. Govt. Arc. Series No. 22. No 333

6 ఏలేశ్వరం — గోకర్ణదేవచోడ మహారాజు — చా. వి. సం. 33-Govt. of A. P Arc Series No. 22 No 339

7. ఏలేశ్వరం — గోకర్ణదేవచోడ మహారాజు — చా వి సం 33-A. P. Govt. Arc. Series No. 344

8 మామిళ్ళపల్లి — గోకర్ణదేవచోడ మహారాజు — సౌమ్య చా. వి సం. 41—Hyd Arc. Series No. 19 Mn—27.

9 గట్టుతుమ్మెన — గోకర్ణదేవచోడ మహారాజు — చా. వి. సం. 40—Hyd. Arc Series No. 19. Mn—11.

10 పానుగల్లు — గోకర్ణదేవ చోడమహారాజు — శ సం. 1043 Hyd Arc Series No 13-2; P. 96.

11 పానుగల్లు — మైలాంబ — శ. సం 1046 — Hyd. Arc. Series No 13-2; P. 105—109.

12 సిరికొండ — ఉదయనచోడమహారాజు — శ సం 1070— అప్రకటిత శాసనము.

13 రాచూరు — ఉదయనచోడ మహారాజు — శ. సం 1079 అప్రకటిత శాసనము.

14. జడ్చర్ల — ఉదయనచోడ మహారాజు — శ సం 1084 Hyd Arc Series No 19 Mn—12, 13.

15 నేలకొండపల్లి — ఉదయనచోడ మహారాజు —శ సం. 1097 Hyd. Arc Series No 19 Km 15

16. ఏలేశ్వరం — ఉదయనచోడ మహారాజు — A P. Govt. Arc Series No. 22 No. 357.

17 ఏలేశ్వరం — ఉదయనచోడ మహారాజు — A. P. Govt. Arc Series No. 22, 358.

18 మామిళ్ళపల్లి — భీమ, గోకర్ణదేవచోడ మహారాజులు—శ సం. 1100—Hyd Arc Series No 19. Mn 26

19 లింగాల — తొండ — శ. సం 1106 — Hyd Arc. Series No 19 Mn 17.

20 పాలెము — గోకర్ణదేవుడు — Hyd Arc Series No. 19 Mn 31

21 మల్లేపల్లి — భీమదేవచోడ మహారాజు — శ సం. 1157 Hyd Arc Series No 22, 307.

పైన పేర్కొనబడిన శాసనములలో నం. 6, 7, 16, 17, 21 అప్రకటితములు కాని, ఆంధ్రప్రభుత్వ పురాతత్వ శాఖ సీరీసు నెం. 22 లో నమోదు చేయబడినవి గిరికొండ, రాచూరు శాసనములు—అప్రకటితములు — ప్రభుత్వమువారు నమోదు చేయనివి

పశ్చిమ చాళుక్యరాజగు త్రైలోక్యమల్లుని కాలమున ఇరుగణచోళ మహారాజును పేర్కొను మూడు శాసనములు[2] శ. సం 978 లో అలంపురమున వేయింపబడినవి ఇతనికి 'చరణ సరోరుహ విహత విలోచన ప్రముఖాఖిలాది" చోడవంశ ప్రశస్తి చేర్చబడినది చిద్దణచోళమహారాజు అయిజె మున్నూటిని పాలించు మహా మండలేశ్వరుడుగా, త్రైలోక్యమల్లుని సామంతుడుగా నున్నట్లు శ సం 989 నాటి అలంపుర శాసనమువలన తెలియుచున్నది[3]

ఈ చిద్దణ చోళ మహారాజే భువనైకమల్లుని కాలమున కన్నె—300; పెడకల్లెంటు—100; నరవాడి—500, అయిజె—300 పాలించుచుండెనని శ. సం. 995 నాటి శాసనము[4] తెలుపుచున్నది.

త్రిభువనమల్ల విక్రమాదిత్యుని రెండవ విజయ రాజ్య సంవత్సరము నాటికి అయిజె మండలమును వైదుంబవంశీయుడగు మల్లమహారాజు పాలించుచున్నట్లు తెలియుచున్నది[5]

త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు కడు సమర్థుడైన రాజు. సింహాసనమధిష్ఠించిన పిదప, మాండలికులను, సామంతులను మార్చినటు తెలియుచున్నది బహుశః చిద్దణ చోళ మహారాజు వారసుడో లేక దగ్గరి బంధువో ఐన తొండరస చోళమహారాజు కొలనుపాక ఏడువేలు పాలించుటకు త్రిభువన

---

1 Hyderabad Archaeological Series No.19Mn. 12, 13.
2. తెలంగాణ శాసనములు Vol II క. చా శా. నం 4, 5, 6.
3. ,, ,, Vol II ,, నం 11.
4 తెలంగాణ శాసనములు — Vol II క. చా శా నం. 12
5. తెలంగాణ శాసనములు — Vol II క. చా. శా నం. 14, 15

మల్ల విక్రమాదిత్యునిచే నియమింపబడియుండును కృష్ణానది ఉత్తర ప్రాంతమును, కొలనుపాక రాజధానిగా తొండరసచోళ మహారాజు పాలించుచుండెనని కొలనుపాక శాసనమువలన తెలియుచున్నది నల్లగొండ, ఖమ్మం మండలములోని నేలకొండపల్లి ప్రాంతము, మహబూబునగర మండలము కొలనుపాక ఏడువేల పరిధిలోనికి వచ్చును కృష్ణా—తుంగభద్రా నదులమధ్య ప్రాంతమును అనగా నేటిగద్వాలు, అలంపూర్ తాలూకాలు అయిజెమండలమని ఆనాడు పిలువబడినవి. ఈ ప్రాంతము వైదుంబరాజుల అధీనమందుండెను తుంగభద్రా నది దక్షిణమున, కర్నూలు, కడప, అనంతపూరు, ప్రాంతములను తెలుగుచోళ వంశీయులు పాలించుచుండిరి ఈ మాండలిక రాజు లందరు త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యునికి సామంతులుగా వ్యవహరించుచుండిరి త్రిభువనమల్లుడు తన కుమారుల నాయా ప్రాంతములందు రాజ ప్రతినిధులుగా నియమించెను కందూరు మండలమును పాలించుటకు చందలదేవి కుమారుడగు కుమార తైలపుడును, కొలనుపాకమండల పాలకునిగా పట్టమహిషి పుత్రుడైన సోమేశ్వరుని నియమించెను రాజపుత్రులు ప్రతినిధులుగా నున్నను, ఆయా మండలములను, మాండలిక రాజులు పాలించుచుండిరి రాజప్రతినిధిగా కుమార సోమేశ్వరుడు కొలనుపాకలో నియమింపబడక పూర్వము తొండరస చోళ మహారాజు, అతని సంతతివారు కొలనుపాక ఏడువేలు పాలించిరి అటుపిమ్మట కందూరి చోడులు, పానుగల్లు, కందూరు పట్టణములను రాజధానులుగా చేసికొనిరి ఉదయనచోడమహారాజు కాలమునాటికి వర్ధమానపురము రాజధానిగా నున్నట్లు రుద్రదేవుని వేయిస్తంభాల గుడి శాసనము వలన తెలియుచున్నది వేయిస్తంభాల గుడి శాసనమే హనుమకొండ శాసనముగా ప్రకటింపబడినది 6

## 1. తొండరసచోళ మహారాజు

కందూరిచోడ వంశీయుడగు ఈరాజు ప్రశంస కొలనుపాక శాసనమందున్నది 7 ఇతడు త్రిభువనమల్ల విక్రమాదిత్యుని సామంతుడు శాసనమందితడు ' సమధిగత పంచమహాశబ్ద, మహామండలేశ్వర, వీరమాహేశ్వర,కోడూర్పురవరేశ్వర, సూర్యవంశోద్భవకులతిలక కాశ్యపగోత్ర కలికాలాన్వయ, నామాది సమస్త ప్రశస్తి సహిత శ్రీ మన్మహామండలేశ్వర కన్నార తొణ్ణరస చోళమహారాజని'' వర్ణింపబడినాడు ఈ శాసనము చా వి వ 13 విభవ సంవత్సరము. ఉత్తరాయణ సంక్రాన్తి పర్వదినమున వేయబడినది ఇతడు కొలిపాక ఏడువేల పాలకుడు చా వి వ 13 విభవ సంక్రాన్తి క్రీ శ 1088 డిశంబరు 24 కు సమానమగును ఈ కందూరిచోడవంశీయులకు సంబంధించిన మొదటిశాసన మిది. తొండరస చోళమహారాజే వంశమునకు మూలపురుషుడని భావింప వచ్చును ఇతని పరిపాలనకాలము క్రీ శ 1078—1090 కావచ్చును.

## 2. కొండయచోళ మహారాజు

ఈతడు కొలనుపాక శాసనమును8 వేయించినట్లు తెలియుచున్నది శాసనమం దితడు కుమార కొండయచోళమహారాజని వర్ణింపబడినాడు ఇతడు తొండరస చోళమహారాజు పుత్రుడు కావచ్చును ఇతనికిని చోడ వంశ ప్రశస్తి కలదు. ఈ శాసనమున చా॰ వి సంవత్సరమున్న భాగము, సంవత్సరము పేరు చెదిరిపోయినవి స్పష్టాస్పష్టముగనున్న అక్షరములను బట్టి ఇది ప్రమాది సంవత్సరములో వేయించినట్లు తోచుచున్నది. ప్రమాది సంవత్సరము చా వి సంవత్సరము 24 కు సమానము కావున కొండయచోళమహారాజు తండ్రి యనంతరము కొలనుపాకఏడువేలు పాలించియుండును ఇతని పరిపాలనాకాలము క్రీ. శ. 1090—1105.

## 3. నల్లభీమదేవ చోడ మహారాజు

ఈ రాజు ప్రశంస గట్టుతుమ్మెన శాసనమున9 కనిపించుచున్నది ఇతనికి మహామండలేశ్వర బిరుదమున్నది ఇతని పట్టమహిషి ధన్నమహాదేవి తుంమేటి రామేశ్వరదేవరకు కోరికోలుతో నిచ్చిన దత్తిని తెలుపు శాసన మిది నల్లభీమదేవ చోడమహారాజు తల్లిదండ్రులపేళ్ళు తెలియుటలేదు ఈ శాసనము చా వి సం 30 లో వేయింపబడినది. కావున శాసనకాలము క్రీ. శ. 1106 అగును.

## 4 సోమనాథదేవ చోడ మహారాజు

ఇతడు చా. వి సం 32 శార్వరి సంవత్సర చైత్ర బహుళ దశమి శని వారమునాడు ఉప్పునూతల శాసనమును10 కేదారేశ్వర దేవరకు వెలిపొలము ఖ ౧౨ ప్రోలెనాయకుని చెరువు వెనుక నీరుపొలము 3 మఱుత్తులు, అందే శ్రీ కేశవదేవరకు అడ్డత్తిపొలము, బాసాని చెర్వువెనుక మఱుత్తులు ౨, నందాదీపమునకు ప్రతిమలగ కోలపాడ్వను కర్రకూరిని పెంటపుంకము అర్ఘగట్టును—ఇచ్చు సందర్భమున వేయించినాడు చా. వి సం 32 క్రీ శ —1108కి సమానము.

## 5. గోకర్ణదేవ చోడ మహారాజు

చా వి సం 33లో వేయించిన ఏలేశ్వరశాసనమును, చా వి సం 40లో వేయింపబడిన గట్టుతుమ్మెన శాసనమును, సౌమ్య సంవత్సరములో (చా వి. సం 41) వేయింపబడిన మామిళ్లపల్లి శాసనమును, శ సం 1043 లో వేయింపబడిన పానుగల్లు శాసనమును, ఏలేశ్వరములో లభించిన రెండు అప్రకటిత శాసనములు గోకర్ణదేవచోడమహారాజును పేర్కొనుచున్నవి ఇతడు చా. వి. సం 33లో ఏలేశ్వరదేవరకు, కోడూరు గ్రామమును దానమిచ్చినాడు చా వి. సం 33— ఎ డి 1110. గట్టుతుమ్మెన శాసనమును పిలబచె నాయకుడు మహామండలేశ్వర గోకర్ణ దేవమహారాజు రాజ్యాభివృద్ధిని గోరుచు చా వి సం 40లో వేయించెను చా వి సం 40—ఎ డి 1116. మామిళ్లపల్లి శాసనమును గోకర్ణ దేవచోడమహారాజే దండనాయకుడగు హరిహరదాసుండు ఖేయిదేవుడు సౌమ్యసంవత్సరము పుష్యబహుళ సప్తమి సోమవారమునాడు సంక్రాన్తి పర్వదినమున నృసింహ దేవర నైవేద్యమునకు భూమిదానమిచ్చు సందర్భమున వేయించెను. ఇందు గోకర్ణ దేవచోడమహారాజుకు చోడవంశ ప్రశస్తి చేర్చబడినది సౌమ్యసంవత్సరము చా వి సం 41 కు సమానమగును కావున శాసన కాలము క్రీ శ 1117 శా శ 1043లో వేయించిన పానుగల్లు శాసనమును గోకర్ణుడు కుక్కళము 31 లోని మాడువుల గ్రామమును, కావలియ బీమన పెగ్గడకును, అమనికల్లు 70లోని అడ్డలగారు గ్రామమును అష్టభోగ సహితముగా దొడ్డభట్టకును కాళ్లు కడిగి దానమిచ్చెను ఈ శాసనమున పేర్కొనబడిన మాడువుల—మాడుగుల, కుక్కలము— కుక్కడము నల్లగొండ మండలమున నున్నవి శా శ 1043— క్రి శ 1121 ఏలేశ్వరమున లభించిన నెం 339 శాసనము వలన గోకర్ణుడు చిటకోడూరు గ్రామమును ఏలేశ్వరదేవరకును, నెం 341 శాసనము వలన—కందూరి చోడరాజు కీచకపల్లి గ్రామమును ఏలేశ్వరదేవరకు దానమిచ్చినట్లు తెలియుచున్నది

మైలాంబ శా శ 1046 లో వేయించిన శాసనము వలన ఆమెకు ఉదయన, చోడభీమనారాయణ, గోకర్ణులను పుత్రు లున్నట్లు తెలియుచున్నది.

## 6. ఉదయనచోడ మహారాజు

కందూరి చోడరాజులలో ఉదయన చోడమహారాజు కడు ప్రసిద్ధుడు. ఇతడు గోకర్ణుని పుత్రుడు. ఇతనికి సంబంధించిన శాసనములలో సిరికొండ శాసనము మొదటిది. శ. సం 1070లో వేయింపబడినది చాళుక్య ప్రతాప చక్రవర్తి జగదేకమల్లునికాలపు శాసన మిది ఉదయన చోడమహారాజుకు సంబంధించిన శాసనములలోసిరికొండ (శ సం. 1070) రామారు(శ సం 1079) ఇప్పర్ల (శ సం. 1084) నేలకొండపల్లి (శ సం. 1097) ఏలేశ్వరము నెం 357, 358 లు ముఖ్యములు కందూరి ఉదయనచోడుని ప్రశంస కాకతీయుల శాసనములందు కనిపించుచున్నది గోకర్ణదేవుని యనంతరము ఉదయనుడు రాజై యించుమారు 1140—1176 వరకు పాలించెను

---

6 తెలంగాణ శాసనములు Vol I కా శా నం 5.

7 A. P. Govt Arc Series No 3 Ng 43

8 ,, ,, No 3 Ng. 46

9 Hyderabad Archaeological Series No 19 Mn 15

10. ,, ,, ,, No. 19 Mn.40

కాకతి రుద్రదేవుని హనుమకొండ శాసనమువలన[11] రెండవ ప్రోలరాజు గోవిందరాజు నోడించి అతని రాజ్యమును ఉదయున కొసంగినట్లు తెలియుచున్నది. చారిత్రకు లీ 'ఉదయుని' కందూరి ఉదయనచోడ మహారాజని నిర్ణయించినారు.

ఉదయనచోడమహారాజుకు మహామండలేశ్వర బిరుద మున్నది. చోడ వంశపు రాజుల ప్రశస్తి ఇతనికి చేర్చబడినది. కందూరి ఉదయనదేవచోడ, ఉదయనచోడ, ఉదయాదిత్య, ఉదయచోడ, చోడోదయ అని ఇతడు శాసనములందు పేర్కొనబడినాడు. ఇతడు కొడూర్పురవరేశ్వర, సూర్యవంశోద్భవ కుల తిలక కాస్యప గోత్ర కలికాలాన్వయ నామాది సమస్త ప్రశస్తి సహితుడు కాకతి ప్రోలరాజువలన, తానంతకుపూర్వము కోల్పోయిన రాజ్యమును పొంది ప్రోలరాజు శత్రువులతో వైరము కలిగియుండెనని భావింపవచ్చును చాళుక్య మూడవ తైలపునితో కాలచుర్యుల పక్షమున ప్రోలరాజు చేసిన యుద్ధమున, ఉదయనచోడ మహారాజు సహకరించి ప్రోలరాజు దయకు పాత్రుడై కందూరు నాడునేకాక నేలకొండపల్లి ప్రాంతమును కూడా సంపాదించియుండును. ప్రోలరాజు తైలపు నోడించిన సంవత్సరము క్రీ శ 1157 కావచ్చునని చారిత్రకుల అభిప్రాయము[12]

ప్రోలరాజు మరణానంతరము రుద్రదేవుని కాలమున ఉదయనచోడ మహారాజ స్వతంత్రుడయ్యెను. కాని కాకతి రుద్రదేవుడు చోడోదయుని స్వాతంత్ర్యము నరికట్టెను ఉదయనచోడ మహారాజు వృద్ధాప్యమున తన కుమారులగు భీమ, గోకర్ణుల ప్రోత్సాహమున స్వతంత్రుడయ్యెను ఉదయనచోడుని కాలమందే భీముడు రాజ్యమేలుచు తండ్రికి సహాయపడెను చాళుక్య తైలపుడు మరణింప బలపరాక్రమ సంపన్నుడైన భీముడు తైలపుని రాజ్య భాగముల నాక్రమించెను భీమచోడుడు బలగర్వితుడైయుండ, కాకతి రుద్రుడు వర్ధమాన పురముపై దండెత్తెను భీముడు, తల్లి, భార్య, సోదర, ఆప్త బంధు వర్గముతో, వర్ధమానపురము వీడి అడవులలో దాగెను రుద్రదేవుడు భీముని వెదకి బంధించి, క్షమించి తిరిగి భీమునికి రాజ్యము నిచ్చెను భీముడు రుద్రదేవుని సామంతుడుగా నుండుట కంగీకరించెను అంతియేకాక, తన సోదరి పద్మావతీదేవిని[13] రుద్రదేవ మహారాజు కిచ్చి వివాహ మొనర్చెను.

కాకతి రుద్రుడు వర్ధమానపురము నాక్రమించిన పిదప భీముడు సకుటుంబముగా బయలుదేరి నేటి మున్ననూరు కొండలలోను, అడవులలోను దాగియుండ రుద్రదేవు డాతని వెంబడించి, అడవి కాల్పించి, చివరకు భీముని బంధించి అతని సోదరి పద్మావతీదేవిని పరిణయమాడి, భీముని క్షమించెను ఆ ప్రాంతమున నగరము నిర్మించి తటాకము త్రవ్వించెను రుద్రుని కోట, బ్రహ్మగుండము, ఆలయములు, శిథిలనగర చిహ్నములు—మున్ననూరు ఘాటురోడ్డుకు ప్రక్కన కనిపించును సుమారు మైలు దూరము కొండలలో ఈ కోట, శిథిల నగరము వ్యాపించియున్నవి కోటలో నొక కొండకొన ఒక శిలా శాసనమున్నది శాసనము శా శ సం 1347 లో వేయించినట్టిది ఈ ప్రాంతము మహేశ్వర నీలకంఠ పుణ్యక్షేత్రమైనట్లును, ఇచట గుప్తమల్లికార్జున దేవర ఆలయమున్నట్లును, ఈ శాసనమును పాలకుర్తి మల్లినాయని కొడుకు సోమన వేయించినట్లును తెలియుచున్నది [14]

ఉదయనచోడుడు అతని మంత్రి పింగళి గోవిందయ్య శివతత్వసారము[15] పండితారాధ్య చరిత్రలను[16] గ్రంథములందు ప్రశంసింపబడినారు ఉదయన చోడ మహారాజు నల్లగొండ సమీపముననున్న పానుగల్లులోని ఉదయ సముద్రమను గొప్ప తటాకమును త్రవ్వించెను దానిని ఉదయాదిత్య సముద్రమందురు. ఉదయ సముద్ర ప్రశంస కాకతీయుల శాసనములందు కలదు [17] ఈ శాసనములలో నొకటి శ సం 1187 లోను రెండవ దిశ సం 1213 లోను వేయింపబడినవి శాలివాహన శక సంవత్సరము 1432 లో ఉదయాదిత్య సముద్రమునకు నీరు వచ్చుటకు త్రవ్వింపబడిన కాలువ, కతువ ఖిలమైయుండ, గోల్కొండ నవాబగు ఇబ్రహీం కుతుబ్షా పంపున, రహమతుల్లా కతువ, కాలువ, తూములు బాగు చేయించినట్లు తెలియుచున్నది

"...పానుగంటి ఉదయ సముద్రం కాలువ ఇందుపుకేలసీమలో నమిలెవద్ద మూసిఏట కతువ ఖిలమై వుండంగాను పునరోద్ధారకముగాను కత్తువగట్టి—కాలువ చేయించి ఆ నీళ్లు ఉదయ సముద్రమునించి, అగి నీళ్లు క్రిష్ణగావిని చేయించి, నమిలెకతువ మొదలుకొని క్రిష్ణ, ఈమధ్య చెరువుల కుంటలు కాలువలు నించి ...." [18]

ఉదయన చోడ మహారాజు పరిపాలనా కాలము క్రీ.శ. 1140—1176. సుమారు మూడు వందల సంవత్సరముల తరువాత శ సం. 1432 లేక క్రీ. శ. 1510 ప్రాంతమున ఉదయనచోడుడు నిర్మించిన కతువ ఖిలమైపోయినదని భావింపవచ్చును. ఏడవనిజాము కాలమున నమిలెకతువ పునరుద్ధరింపబడినది

## 7, 8 భీముడు—గోకర్ణుడు

భీమ, గోకర్ణు లిద్దరు ఉదయనచోడ మహారాజు కుమారులు. వీరు కలిసియే రాజ్య మేలినట్లు తెలియుచున్నది క్రీ శ. 1178 విళంబి సంవత్సరములో వీరు చూత ఘోష అగ్రహారమును, మామిళ్లపల్లి, మంచికుంట గ్రామములను, నృసింహ దేవర కగ్రహారముగా నిచ్చినట్లు మామిళ్లపల్లి శాసనము[14]వలన తెలియుచున్నది. భీమదేవచోడ మహారాజు కడు ప్రసిద్ధుడు. బలపరాక్రమ సంపన్నుడు ఉదయనచోడుని జ్యేష్ఠపుత్రుడు కాకతి రుద్రుని కలవరపరచినవాడు. మూడవ పశ్చిమ చాళుక్య తైలపుడు మరణించిన పిదప ఆ రాజ్య వైభవమును కొన్నినాళ్ళ నుభవించినాడు [20]

శ సం. 1106 లేక క్రీ. శ. 1184 లో మల్లమసాని, కన్నరదేవుల కుమారుడగు తొండ, విష్ణ్వాలయమును భీమరాజుపేరను, శివాలయమును తన తండ్రియగు కన్నరదేవుని పేరను, సూర్యదేవుని ఆలయమును గోకర్ణ దేవుని పేరను నిర్మించినట్లు లింగాల శాసనము వలన తెలియుచున్నది [21] తొండ కరికాల చోళవంశీయుడు. ఇతడు లింగాల గ్రామము నగ్రహారముగా జేసి సోమశిల శివా

---

11. యః కుంఠోరి పతే రకుంఠ పరశు శ్లక్ష్ణ గ్రధారోల్లస
ద్ధారాపాత నిపాతనైక చతురం గోవింద రాజాహ్వయం
బద్ధ్వా వ్యమ్మచ్య తదోదయ క్షితిభృతే రాజ్యం దదౌ లీలయా
లుంఠాకో విషయస్య తస్య సమరే సద్వీరదీక్షా గురుః.
—తెలంగాణా శాసనములు I కా. శా. నం. 5

12. ఆంధ్రుల చరిత్ర—చి వీరభద్రరావుగారు పు. 260

13. కందూరోదయచోడ వంశ విలసత్ క్షీరాబ్ధి గర్భోద్భవ
త్పద్మైకాశ్రయ రుద్రదేవ నృపతేః కిం వర్ణ్యతే విక్రమః.....
—అనుమకొండ శాసనము తె శా Vol కా. శా. నం. 5

14 Hyderabad Archaeological Series No. 19 Mn. 30

15 శివతత్వ సారము—పీఠిక—పు –8

16 పండితారాధ్య చరిత్ర—మహిమాప్రకరణము.

17 తెలంగాణ శాసనములు Vol I కా. శా నం. 33, 34, 35

18 Epigraphia Indo Moslemica 1925–26 Page 23—25

19. Hyderabad Archaeological Series No. 19 Mn 26

20 తెలంగాణ శాసనములు Vol కా. శా. నం. 5,

21. Hyderabad Archaeological Series No. 19 Mn 17.

లయమున కిచ్చెను కారుపాముల గ్రామమున పైన పేర్కొనిన మూడు ఆలయములను నిర్మించెను ఇతడు మాండలిక ప్రభువు

## 9 భీమదేవచోడ మహారాజు

భీమ, గోకర్ణుల యనంతర విూ వంశీయులకు సంబంధించిన శాసన మొక్కటి మాత్రమే భీమదేవ చోడ మహారాజును పేర్కొనుచున్నది ఈ శాసనము శ సం 1157—క్రీ శ 1235 లో వేయించినది అప్రకటిత శాసనము నల్లగొండ మండలములోని దెవరకొండ తాలూకాలో మల్లేపల్లి చౌరాస్తా ప్రక్కనున్న కుంటక్రింది చేనిలోనున్నది అప్పటికి కాకతీయ సామ్రాజ్యమును గణపతిదేవ మహారాజు పాలించుచుండెను రుద్రదేవుని కాలమందే కందూరిచోడుల కాకతీయుల సామంతులైరి భీమదేవచోడుని తరువాతి రాజుల పేళ్ళుగాని శాసనములుగాని తెలియరాలేదు ఇతనితో కందూరిచోడ వంశ మంతరించినదని భావించవచ్చును

## కందూరి చోడవంశము




### శాసనముల స్వరూపములు

రాచితోట్టి ప్రెగ్గడ మల్లిసెట్టి వేయించిన మూడు శాసనములునొక మహానాగమును, రాచూరు కేశవ దేవర ఆలయమునున్న నల్లరాతిపైన చెక్కబడినవి శాసన శిల ఎత్తు 5½' లు వెడల్పు 1½' లు నాలుగు వైపుల సమానమైన వెడల్పు కలిగి చూచుట కందముగానున్న శిలపై మల్లిసెట్టి

శ సం 1079, 1081, 1082లలో మూడు శాసనములను చెక్కించెను. శ సం 1079 లో వేయించిన శాసనమున శ్రీ శ్రీల వరుసతో కలిపి 31 పంక్తులును, శ సం 1081 నాటి శాసనమున 25 పంక్తులును, శ సం. 1082 వ సంవత్సరపు శాసనమున 12 పంక్తులును ఉన్నవి నాలుగవవైపు చెక్కబడిన నాగము చూచుట కందముగనుండి సజీవముగ నున్నట్లు కనిపించును

## లిపి

మల్లిసెట్టి వేయించిన మూడు శాసనములలో ఆంధ్రదేశమున పంద్రెండవ శతాబ్ది ఉత్తరార్ధమున వాడుకలోనున్న తెలుగులిపి వాడబడినది అక్షరములు గుండ్రంగానుండి, చక్కని వరుసలలో ఎంతో అందముగ కనిపించుచున్నవి శాసనాక్షరములను చెక్కిన శిల్పి కడు జాగరూకతతో వ్యవహరించినను, శాసనములందు కొన్ని స్ఖాలిత్యము లున్నవి పడగ ఎత్తినట్లున్న నాగము గంభీరముగను, సుందరముగను, ఆకర్షణీయముగను ఉన్నది మొదటి శాసనారంభమున నాలుగు శ్రీలు వ్రాయబడినవి సంవత్సర బదులు సంవత్స వ్రాయబడినది రెండవ శాసనమున ప్రమాది సంవత్సరము వ్రాయునపుడు రెండు 'ప్ర'లు వ్రాయబడినవి 24 వ పంక్తిలో విష్వయాంబదులు 'విషె' వ్రాయబడినది మూడవ శాసనమున పదియవ పంక్తిలో స్థాయి బదులు 'సాయి' వ్రాయబడినది మూడవ శాసనము మొదట హిరణ్యకశ్యపుని సంహరించుచున్న నరసింహమూర్తి ప్రక్కన ప్రార్థించుచు నిలబడిన ప్రహ్లాదుడు చెక్కబడినాడు ప్రహ్లాదుని విగ్రహము గణపతి విగ్రహమువలె నున్నది

## భాష

మూడు శాసనములలోను తెలుగు వచనము వాడబడినది ఉదయచోడ మహారాజాకుగల చోడరాజుల ప్రశస్తి తెలుపబడినది గోడూరి మున్నూటి పవదర—విన్నపమాలకించి, దానము గావించుట కాజ్ఞ యొసగబడినది పవదర పదము కన్నడ శాసనములందును, బొల్లెపల్లి శాసనమందును పేర్కొనబడినది గోడూరి మున్నూటిని పాలించు అధికారి పోతెనాయకుడు, ఉదయచోడ మహారాజుచే నియమింపబడినవాడు శాసనమున 26 వ పంక్తినుండి బహుభి ర్వసుధా దత్తా—స్వదత్తం పరదత్తంవా —శ్లోకము లున్నవి అనుస్వారమునకుబదులు అనునాసికాక్షరములు కూడా అచ్చటచ్చట వాడబడినవి శ—బదులు స—వ్రాయబడినది రెండవ శాసనారంభమున శ్రీమత్త్రైలోక్యమల్ల గంగాపురము—త్రిభువన మల్ల బ్రహ్మదేవసెట్టి అని ఉన్నది గంగాపురమునకు త్రైలోక్యమల్ల కేశవ పురమను నామాంతరము కలదు22

| | | | |
|---|---|---|---|
| 1 | ప్రశస్తి | — | ప్రసస్త |
| 2 | నాయకుని | — | నాయకిని |
| 3 | శకవర్షములు | — | సకవర్షములు |
| 4 | సంవత్సర | — | సంవత్స |
| 5 | సంక్రాంతి | — | సక్రాన్తి |
| 6 | నంధాదిపెకు | — | నన్దాదిపెకు |
| 7 | కార్తీక | — | కార్తిక |
| 8 | సోమనాధ | — | సోమనాత |
| 9 | అచంద్రార్క | — | అచంద్రార్క |

శ బదులు స, ళ, అనుస్వారమునకు బదులు అనునాసికాక్షరములను వాడుట పూర్వాంధ్ర శాసనములందువలె ఈ శాసనములందును కలదు కేశవ దేవరకు పెండ్లిండ్లు జరుగునపుడు పెండ్లికొడుకువారు, పెండ్లికూతురువైపువారు చెల్లించవలసిన రుసుము పడి విషయమును మొదటి శాసనము తెలుపుచున్నది మల్లిసెట్టి రావితాళ్ళి ప్రెగ్గడ మూడు శాసనములను మల్లిసెట్టి కేశవ దేవ



22 తెలంగాణ శాసనములు Vol I చా శా సం 24

రకు నన్దాదివియలను పెట్టించు సందర్భమున వేయించెను మొదటి శాసనమువలన కేశవ దేవరగుడి స్థానాపతి దామోదరభట్టు పేరు తెలియుచున్నది రెండవ శాసనము ముత్సిబోయిని నాయకయ్య కొడుకు కొండె లోనుగాగల వారును, మూడవ శాసనమున ముత్సిబోయిని కొడుకు యెఱగె— పేర్కొనబడినారు.



## 1 మొదటి శాసనము

### శాసనము — మూలము

శ్రీ శ్రీ శ్రీ శ్రీ

1 శ్రీ స్వస్తి సమధిగత పంచ మహా శబ్ద
2 మహా మండలేశ్వర వీరమహేశ్వర
3 కోడూర్పురవర వరేశ్వర సూర్యవం
4 శోద్భవ కులతిలక కాశ్యప గోత్ర క
5 లి కాలాన్వయ నామాది సమస్త ప్ర
6 స(శ)స్తి సహితులైన శ్రీ మన్మహా మం
7 డలేశ్వర కందూరి ఉదయన చోడమ
8 హారాజులు గోడూరి మున్నూటి నవర
9 ర రావితొత్తి పోతెనాయకి (కు)ని విన్న
10 పము దివ్యచిత్తమున నవధరించి
11 వ(శ)క వర్షంబులు 1079 యగు ఈశ్వర సం
12 వత్స(ర) పుష్య బ 8 బుధవారమునాటి
13 మకర స(ం)క్రాన్తి నిమిత్తంబున మ
14 ల్లిసెట్టి వేయించిన రావితొత్తి శ్రీ
15 కేశవ దేవరకు యిప్పలవాయను
16 స(శ)నివార ఎది మడ్డ్లను యిరువుట్టి
17 పెట్టు వడ్లిసెట్టి చెఱు వెనుక అడ్డ తూ
18 వు మడ్డ్లను యూరికడపడి డిం
19 ము ముందట పూవుతోట నన్దాదివెకు
20 నకరము నిచ్చినది కోమటి యిండ్ల
21 మత్తమము గాక మధ్యమము అడ్డ
22 కోమటి యిండ్ల పెండ్లికొడుకువారు రూ
23 క కూంతు వారు రూక యీ కేస(శ)వదేవ
24 ర గుడిస్త(స్థా)నాపతి దామోదరభట్టులు
25 శ్రీ బహుభి ర్వసుధా దత్తా రాజభి స్స
26 గరాదిభిః యెస్య యెస్య యదా భూమి
27 తస్య తస్య తదా ఫలం స్వదత్తాం పర
28 దత్తం వా యోహరేత వసుంధరా ష
29 ష్టిర్వర్షసహస్రాణి విష్ఠాయాం
30 జాయతే క్రిమిః॥

## 2 రెండవ శాసనము

### శాసనము — మూలము

1 ॰స్తి శ్రీ మత్త్రైలోక్య మ
2 ల్ల గంగాపురము త్రిభువ
3 న మల్ల బ్రహ్మదేవసెట్టి న

4 కవర్షంబులు 1081 ప్ర
5 ప్రమాది సంవత్సర కార్తి (క) శ
6 సు (శు) 11 వడ్డ వ (వా) రమునాండు శ్రీ
7 మద్రాజధాని పానుగంటి పూ
8 ఱగుడి శ్రీ సోమనాత (థ) దే
9 వర శ్రీ కేశవ దేవర సన్ని
10 ధానమ (ము) న రావితాత్సి పెగ్గ
11 డ మల్లిసెట్టి చేయించిన శ్రీ కే
12 శవ దేవరకు రెండు నందా ది
13 వియులకు దనపాదమ్ము డ
14 నవండమునుంబడికి నడు
15 చుచున్న ముక్కెబోయని నా
16 యకయ్య కొడుకు కొండో
17 జోనుగా నాచంద్రార్కతా
18 రకము ధారవోసి యిచ్చె॥
19 శ్రీ బహుభి ర్వసుధా దత్తా రా
20 జభి స్సగరాదిభి యెస్య యె
21 స్య యదా భూమి తస్య తస్య త
22 దా ఫలం॥ స్వదత్తాం పరదత్తాం వా
23 యో హరేతి వసుంధరా షష్ట్రి
24 వర్షసహస్రాణి విష్ఠా (యాం) జాయ
25 తే క్రిమి

## 3 మూడవ శాసనము

### శాసనము — మూలము

1 శ్రీ స్వస్తి శ్రీమతు పాద
2 ము దండమ రాజ్య సక వ
3 ర్షంబుల 1082 విక్రమ సం
4 వత్సరము కార్తిక సు (శు) 11
5 ఆదివారమునాండు రావి
6 తాతిటి పెగ్గడ మల్లిసెట్టి
7 చేయించి, శ్రీ కేశవ
8 దేవర నన్దాదివియకు
9 నిచ్చె నూనెడు నేతి అచంద్రా
10 ర్కస్థాయి ముక్కెబోయని
11 కొడుకు యెఱగెకు మున్న
12 యి మేకలు॥



# ఆంధ్రులు-పరిశ్రమలు

## శ్రీ గరిమెళ్ల వెంకట సీతారాం

దీపావళి పండుగకు ఆంధ్రదేశపు కోస్తా జిల్లాలలో భారీ ఎత్తున టపాకాయలు, మందుగుండు సామగ్రి తయారు చేసి కాలుస్తారు. సురేకారం, గంధకం, రజనులాటి వాటిని తగు పాళ్లలో కలిపి అద్భుతమైన చిచ్చుబుడ్లు పెన్సిల్ ముద్దలు తారాజువ్వలను తయారు చేసేవారు, కొన్నిచోట్ల, ఇంటికొక్కరంటూనా వున్నారంటే అతిశయోక్తి కాదు అయితే దేశంలోని అన్య ప్రాంతాలకు పంజాబ్, బెంగాల్, బొంబేలకు రవాణా చేయబడుతున్న మందుగుండు సామగ్రి మీద తమిళనాడులో ఉన్న శివకాశి ముద్ర ఉంటుంది. అంటే శివకాశిలో ఆ టపాకాయలు తయారు చేయుట ఒక పరిశ్రమగా అభివృద్ధి చెందింది. మన ప్రాంతంలో కూడా యీ అనుభవం, ఆసక్తి ఉన్నవారు ఎంతోమంది ఉన్నారు తయారు చేస్తున్నారు అయితే ఆ చేసినవి మనమే కాల్చేస్తున్నాం. కాని పారిశ్రామిక స్థాయిలో తయారుచేసి గిరాకీ ఉన్న ఇతర ప్రాంతాలలో అమ్మకం మొదలెట్టితే ఈ పరిశ్రమ వలన ఎంతో మందికి ఉపాధి కల్గి ఉండేది

ఇంకో ఉదాహరణ తీసుకుందాము. కేరళ కొబ్బరి తోటలకు ప్రసిద్ధి చెందినది. అక్కడ కొబ్బరి పీచును పరుపులలో కూరడానికి, తివాసీలు కిటికీ చాపలు లాటివి చేయడానికి ఉపయోగిస్తారు. ఆ రకరకాల పీచు వస్తువులను మన దేశం అంతటికి సరఫరా చేయుటమే కాకుండా విదేశాలకు ఎగుమతి కూడా చేస్తున్నారు. కేరళలో అదో పెద్ద పరిశ్రమ క్రింద తయారైంది. మన ఆంధ్ర దేశంలో కూడా కొబ్బరి తోటలు ఎక్కువగా ఉన్నాయి. అయితే మనం ఆ కొబ్బరి పీచును అంట్లు తోమటానికి, పొయ్యి వెలిగించు కోటానికి మినహా మరి దేనికీ ఉపయోగించటంలేదు

పరిశ్రమలకు ఉపయోగపడే ఇలాంటి ఎన్నో వస్తువులు మనం వినియోగించుకో లేకపోతున్నాము దీనికి కారణం ఏమిటి?

. ఆంధ్రదేశంలో అనాదినుండి వ్యవసాయం ప్రాముఖ్యం వహించింది గోదావరి, కృష్ణా, తుంగభద్రా, పెన్నా నదులు వ్యవసాయాభివృద్ధికి ఎంతో దోహదం చేశాయి ఎల్లప్పుడూ వ్యవసాయం మీద ఆదారపడిన వారికి అప్పుడప్పుడు ప్రకృతి ఎదురు తిరిగి నప్పటికి కనీసం ఒక పూట తిండికి లోటు లేకుండా గడుస్తుంది ఇంకోపని ఏదైనా చేపట్టాలన్న అవసరం లేకపోవటంతో ఒక నిస్తబ్దత మనలను ఆవరించింది ఆ నిస్తబ్ధత క్రమేపీ పెద్దదై ఒక భూతంలా తయారైంది. భూమి విస్తీర్ణం అస్థిరమైనది ఒక తండ్రికి పది ఎకరాలుంటే అతని తరువాతి అతని ఆరుగురు కుమారులు ఆరు ముక్కలు చేసుకొంటున్నారు ఆతర్వాత తరంవారు ఆభూమిని ఇంకా ముక్క చెక్కలు చేసుకొంటున్నారు అంటే ఆ పరిమిత వైశాల్యం కలిగిన భూమిమీద రానురాను ఒత్తిడి అధికం అవుతుంది మనం మొదటినుండి విస్సబ్దత అలవాటు చేసుకొన్న కారణం చేత ఆ భూములను విడిచి బయటకు వచ్చి, ఏమైనా కొత్త కొత్త జీవన విధానాలనుగురించి ఆలోచన చేయలేక పోతున్నాము. ఇతరత్రా ఏమైనా పరిశ్రమలు స్థాపిస్తే వ్యవసాయం మీదఉన్న ఒత్తిడి తగ్గి ఉండేది ఇంతకుముందు ఒక్క వ్యవసాయం మీద ఆధారపడి ఉన్న కూలిజనం కొంతమంది పరిశ్రమలలోకి వెళ్లితే, అక్కడున్న మిగతా శ్రామికుల వేతనాలు, జీవన స్థాయి బాగుపడే అవకాశాలున్నాయి.

అయితే మనమెందుకు పరిశ్రమలు స్థాపించడంలేదు? డబ్బు లేకనా? కాదు. ధూమాయిలంటే దానితో బంగారు నగలు కొని అలంకరించుకోటమో లేక ఒకటో, రెండో ఎకరాలు భూమి కొనడమో తెలుసును కాని పరిశ్రమలు స్థాపించి స్థానికంగా ఉన్న ముడి సరుకులను, అంగబలాన్ని వినియోగించి మనకు, మన రాష్ట్రానికి కూడా మేలు చేకూరేటట్లుగా చేయగల దూరదృష్టి, ధైర్యం, సంసిద్ధత మన వారిలో లోపించేయి.

దేశంలో ఏ ప్రాంతం యొక్క అభివృద్ధి అయినా సరుకులను ఉత్పత్తి చేసే పరిశ్రమలపై ఆదారపడి ఉంటుంది. మన ఆంధ్రప్రదేశ్‌లో సరుకులను ఉత్పత్తి చేసే పరిశ్రమలు తక్కిన ప్రాంతాలతో పోల్చి చూస్తే చాలా తక్కువనే చెప్పాలి. ఉన్న కొద్దిపాటి పరిశ్రమలలో ఎక్కువవాటిని ఇతర రాష్ట్రాలవారు నెలకొల్పడం మన మెరిగిన విషయమే లేదా మన ప్రాంతంలో ఉన్న ముడిసరుకులను ఇతర ప్రాంతాలవారు తీసుకెళ్లి వాళ్ల కర్మాగారాలలో సరుకులను ఉత్పత్తి చేసి ఆ సరుకును తిరిగి మనకే అమ్ముతున్నారు. దీనివలన ఇతర ప్రాంతాలవారు బాగా లాభాలు చేసుకొంటున్నారు ఆ లాభాలు పెట్టి వాళ్ల పరిశ్రమలు ఇంకా అభివృద్ధి చేసుకొంటున్నారు ఇలా సాగినంత కాలం మన రాష్ట్రం వెనుకబడి వుండక తప్పదు మన నిరుద్యోగ సమస్య తీవ్రతరం కాక తప్పదు

పరిశ్రమలు ముఖ్యంగా మూడు రకాలు 1 చేతిపరిశ్రమలు, చిన్నపరిశ్రమలు, 2 మధ్యతరహా పరిశ్రమలు, 3 భారీ పరిశ్రమలు. భారీ పరిశ్రమలను, కీలక పరిశ్రమలను ప్రయివేట్ రంగం చేపట్టేటట్లయితే కొద్దిమంది కోటీశ్వరులవుతారు లక్షలాది జనులు నిరుపేదలుగానే వుండి పోతారు ఆర్థిక సంపదకు సరియైన పంపిణీ ఉండదు బీదలు మరీ బీదలవుతారు. గుత్త వ్యాపారులు తయారవుతారు ధరలు తగ్గడానికి బదులు హెచ్చు అవుతాయి (ఇది రాజకీయ ఫలితాల గురించి ఇది చోటు కాదు) అందుచేత జాతీ పరిశ్రమలు కీలక పరిశ్రమలు ప్రభుత్వ రంగం నెలకొల్పుటయే మేలు.

ఇక పోతే చేతి పరిశ్రమలు మధ్య తరగతి పరిశ్రమలు ప్రయివేట్ రంగం నిర్వహించాలి చేతి పరిశ్రమలు చదువులేని వారికి, పల్లెలకు పరిమితమై ఉన్నాయి. పల్లెలలో వ్యవసాయదారులకు పంటకాలం అయిపోగానే, తీరిక చిక్కుతుంది ఆ తీరిక కాలంలో వారు కాలం వృథా పుచ్చకుండా ఏమైనా చేతి పరిశ్రమలు చేపట్టి వారి ఆర్జనను అధికం చేసుకొంటారు. ఈ విధంగా మన కళలు నశించి పోకుండా ఉండేందుకు చేతి పరిశ్రమలు ఎంతైనా అవసరం కొన్ని కొన్ని గృహ పరిశ్రమలు ఆంధ్రప్రదేశ్‌కు ఖ్యాతి కూడా తెచ్చి పెట్టినవి అయితే యీ చేతి పరిశ్రమలవలన అండర్ ఎంప్లాయిమెంట్ సమస్య తీరుతుంది గాని అన్ ఎంప్లాయిమెంట్ సమస్య తీరదు. అంతేకాకుండ ఇప్పుడు అక్షరాస్యత సంఖ్య ఎక్కువఅయి చాలామంది ఉద్యోగాల మోజులో పడి పల్లెలనుండి పట్టణాలకు తరలి వస్తున్నారు. ఒకప్పుడు చదువుకొన్న వారి సంఖ్య తక్కువగా ఉన్నప్పుడు గృహ పరిశ్రమల ప్రాముఖ్యం హెచ్చుగా ఉండేది ఇప్పుడు చదువుకొన్న వారి సంఖ్య పెరగడంతో వారిని ఉపయోగించుకొనేందుకు కావలసినన్ని మధ్య తరగతి పరిశ్రమలు లేక పోవటంతో నిరుద్యోగ సమస్య పడగలెత్తడం ఆరంభించింది.

నాలుక గీసుకునే బద్ద, అగ్గిపెట్టె, సబ్బుబిళ్ల మొదలుకొని రిఫ్రిజిరేటర్ వరకు గల వివిధ వస్తువుల కొరకు యీనాడు మనం ఇతర ప్రాంతాల వాళ్లమీద ఆధారపడి ఉన్నాము. ఇతర ప్రాంతాలలో తయారయే ఉత్పత్తులను

అమ్మేందుకు మార్కెట్టుం లేక, చిల్లర దుకాణాలు మన రాష్ట్రంలో బోలెడు ఉన్నాయి. 'ఉప్పు చింతపండు అమ్ముకుని భుజాలు ఎగరేస్తాను' అన్నట్లుంది మన పద్ధతి. అట్లాంటప్పుడు దండిగా లాభాలు చేసుకొనటంలో తప్పేముంది! ఒక ప్రాంతంలో తయారైన సరుకులను మనం కొన్నప్పుడు అదనంగా రవాణా ఖర్చులు భరించాలి. ఆ ప్రాంతాలవారు వారి కిష్టమైన ధరలను మన దగ్గర నుండి గుంజుతారు. అవే సరుకులు మనమే ఉత్పత్తి చేసుకుంటే మన నిరుద్యోగ సమస్య తీరుతుంది. సరుకులు తక్కువ ధరకు లభ్యం అవుతాయి. కొనుగోలు శక్తి ఎక్కువ అవుతుంది. పారిశ్రామికంగా ఆంధ్రదేశం ముందడుగు వేస్తుంది. అంతేకాకుండా ఒక పరిశ్రమను స్థాపించితే దానికి అనుబంధంగా వుండే పరిశ్రమలు లేక ఆ మొదటి పరిశ్రమను ఆధారంగా చేసుకొని పెరిగే చిన్నచిన్న పరిశ్రమలు పెంపొందడానికి అవకాశం లభిస్తుంది. ఉదాహరణకు మరమ్మత్తు కార్ఖానాలు, వర్క్‌షాపులు, పేకింగు కంపెనీలు, రవాణా కంపెనీలు మొదలైనవి నెలకొని వర్ధిల్లుతాయి. ఇవి కూడా రాష్ట్రంలోని ఉద్యోగావకాశాల పెంపుదలకు దోహదం చేస్తాయి.

ఇన్ని లాభాలున్నాయని తెలిసి కూడా మన ప్రైవేట్ రంగం ముందుకు వచ్చి పరిశ్రమలు ఎందుకు స్థాపించడంలేదు? పెట్టుబడి లేకనా? లేక ఆ చొరవ, ధైర్యము లేకనా?

పెట్టుబడి ఎక్కడనుండి వస్తుంది? మన అవసరాలకు ఖర్చుపెట్టగా మిగిలిన వ్యక్తిగతమైన పొదుపు మొత్తాలే పెట్టుబడిగా రూపొందుతాయి. చిన్నమొత్తాలైనా వ్యక్తిగతమైన పొదుపు మొత్తాలన్నింటిని ఒకచోట చేరిస్తే పెద్దపెద్ద మొత్తాలై పరిశ్రమలకు కావలసిన పెట్టుబడులు సమకూరుతాయి. ఈవిధంగా చిన్నచిన్న పొదుపు మొత్తాలను ఒకచోట చేర్చేందుకు సహాయపడే స్టాక్ ఎక్స్‌చేంజిలు, స్టాక్ బ్రోకర్ సంస్థలు మన ప్రాంతంలో అతి స్వల్పంగా ఉన్నాయి. చిన్న మొత్తాలు పొదుపు చేసేవారుకూడా పెద్దపెద్ద పరిశ్రమలలో వాటాదారులు కావచ్చునన్న విషయం మనలో చాలా తక్కువ మందికే తెలుసును. పొదుపు అంటూ చేసినవారు చాలావరకు చిల్లర వర్తకం వైపు మొగ్గుతున్నారు. పరిమిత ఆదాయంగల మధ్యతరగతి కుటుంబాలు వారి వారి ఆర్జనను తమ పిల్లల పోషణ, విద్య, వివాహం ఇత్యాది అవసరాలకు వినియోగిస్తున్నారు. అందుచేత అటువంటి కుటుంబాలు పొదుపు చేయుటం కష్టం. చేసినప్పటికి అవి వారి కుటుంబ అవసరాలకే సరిపోతాయి.

ఇక పోతే మన ఆంధ్రదేశంలో ఇతోధికమైన ఆదాయాన్నిస్తున్నది వ్యవసాయ పరిశ్రమ. వాణిజ్యపు పంటలు పండించి ఎక్కువ లాభాలు చేసుకొన్నవారు ఎంతోమంది ఉన్నారు. అలాంటివారు తమ వద్దనున్న ధనం మొత్తాలను దేనిలో పెట్టుబడి పెట్టడమో తెలియక, తికమకపడి, తుదకు మద్రాస్ (ఇప్పుడిప్పుడు హైదరాబాద్) తీసుకెళ్లి సినీ పరిశ్రమలో పోస్తున్నారు. ఒకరి పెట్టుబడి లాభం తెస్తే పది మందికి నష్టం వచ్చే సినీ పరిశ్రమ జూదం లాంటిది. మరికొంతమంది అయితే తమ డబ్బుతో పట్టణాలలో హోటళ్లను నెలకొల్పుతున్నారు. తమ డబ్బును తమ రాష్ట్రానికి లాభించే పద్ధతిలో పరిశ్రమలను నెలకొల్పడానికి, తద్వారా వేలాది జీవనానికి ఉపాధి కల్పించడానికి, ఆ పరిశ్రమలను ఒక నిర్ణీత పద్ధతి ప్రకారం నడిపించడానికి, అవసరమైన, నిర్దిష్టమైన ప్రణాళికారచన (ప్లానింగ్) మన ధనవంతులలో అధిక సంఖ్యాకులకు తెలియదేమో అనిపిస్తుంది. అవసరమైనప్పుడు కష్టనష్టాలకు సిద్ధపడి "రిస్కు" తీసుకొని, తెగించి, పరిశ్రమలను నడపగలిగిన చొరవ తక్కువ కనుకనే మనవాళ్లెక్కువగా స్వల్పకాలికమైన పెట్టుబడి ప్రయత్నాలకు (షార్ట్

రన్ వెంచర్స్) పూనుకొంటున్నారు. దీర్ఘకాలిక దృక్పథం తీసుకోటానికి ప్రయత్నించరు. ఇవాళ వ్యాపారంలో పెట్టుబడి పెడితే రేపో ఎల్లుండో లాభాలు రావాలి అని వారి ఆశయము. దురదృష్టవశాత్తు పరిశ్రమలలో ఇది సాధ్యం కాదు. పెట్టుబడి పెట్టాక లాభాలు రావటానికి రెండు మూడు సంవత్సరాలు పడుతుంది. దాన్ని "జెస్టేషన్ పీరియడ్" అంటారు. ఈ పీరియడ్ గడిచి లాభాలు చేతికి అందనారంభించేంతవరకు మన పెట్టుబడిదార్లు ఆగలేరు.

అదీగాక పొదుపు చేయబడిన మన మూలధనం ముందుకు రావటానికి మొహమాట పడుతుంది. మనది "షై కేపిటల్". పెద్దపెద్ద మొత్తాలను పొదుపు చేసినవారు కూడా చాలామంది తమ డబ్బును బ్యాంకులలో దాచడం లేదు. ఆ డబ్బును బ్యాంకులలో దాచితే ఆ బ్యాంకులు పరిశ్రమలు నెలకొల్పే వారికి సహాయం చేస్తాయి. తద్వారా ఆ డబ్బు పరోక్షంగానయినా రాష్ట్ర పరిశ్రామికాభివృద్ధికి సాయపడగలదు.

బాగా పొదుపు చేసిన వారెవరైనా ఏదైనా ఒక పరిశ్రమను నెలకొల్పుదామనుకొన్నా, వారికి చాలా విషయాలు తెలిసి ఉండాలి. ఆయా ప్రాంతాల శీతోష్ణస్థితి, ఆ పరిశ్రమయొక్క లాభ నష్టాలు, ముడిసరుకుల అందుబాటు, నీరు, విద్యుచ్ఛక్తి, శ్రామికులు మొదలైన అంశాలు, రవాణా సౌకర్యాలు, తయారు చేసే సరుకులకు మార్కెట్‌లో గిరాకీ, ఇత్యాది విషయాలపై క్షుణ్ణమైన పరిశీలన, కచ్చితమైన సమాచారము అందుబాటులో వుండాలి. ఇటువంటి సమగ్రమైన పరిశీలన మనరాష్ట్రంలో జరగవలసినంతగా జరగలేదేమోననిపిస్తుంది. ఈ తంటాలన్నీ ఎవడు పడుతాడులే, అంతకన్నా ఎక్కడో బొంబాయిలో తయారైన బట్టలు తీసుకొచ్చి ఇక్కడ దుకాణం పెట్టి అమ్మితే మనకు ఏ బాదరబందీ ఉండదు. హాయిగా గల్లాపెట్టె వద్ద కూర్చోవచ్చునన్న మనస్తత్వం మనది.

పరిశ్రమల ఎన్నిక, వాటి స్థాపనకు ఏమి చేయాలి, ఎట్లాచేయాలి అని సలహాల నిచ్చే నిపుణుల సంస్థలు కూడా మన ఆంధ్రప్రదేశ్‌లో లేవు. ఇన్ని సమస్యల నెదుర్కొని, ఈ బాధలన్నింటిని అనుభవించి పరిశ్రమలకు పూనుకోలేక, ఏ చిల్లర వర్తకంలోనో సినిమాలోనో పెట్టుబడి పెడుతున్నారు. చిల్లర వ్యాపారంగాని టోకు వ్యాపారంగాని ఒక్కరిచే స్థాపించబడుతాయి. ఒక్కరికే లాభాలు చేకూరుస్తాయి. అలాంటి వెన్నిఉన్నా నిరుద్యోగ సమస్య తీరదు. నానాటికి విద్యాధికుల సంఖ్య, వారిలో నిరుద్యోగులసంఖ్య హెచ్చుతున్నది. వారందరికి ఉపాధి కల్పించాలంటే బహుళసంఖ్యలో పరిశ్రమలు స్థాపించడం మినహా మరొక దారి లేనేలేదు.

"సమష్టి ఆదాయం" పెరగడానికి పరిశ్రమలు అవసరం. కొనుగోలు శక్తి పెరగాలంటే పరిశ్రమలు పెరగాలి. మన వ్యవసాయపరిశ్రమ అభివృద్ధి చెందాలన్నా పరిశ్రమల పైనే ఆధారపడి ఉంటుంది. కనుక ఆర్థిక స్తోమత వున్నవారు చొరవ తీసుకొని సరియైన మార్గాలలో పరిశ్రమలను స్థాపిస్తే ఆ పెట్టుబడి సర్వతోముఖమైన అభివృద్ధికి దారి తీస్తుంది.

అయితే మన ఆంధ్రదేశంలో పరిశ్రమలు లేవనికాదు. పరిశ్రమల ప్రాముఖ్యం తెలిసినవారు లేరనికాదు. పరిశ్రమ లున్నాయి. కాని అవి చాలా తక్కువగా ఉన్నాయి. 106000 చదరపు మైళ్ళ విస్తీర్ణం కలిగి ఉన్న ఆంధ్రదేశం, పరిశ్రమలకు కావలసిన ఎన్నో ముడి సరుకులకు పుట్టినిల్లు. ఆ ముడిసరుకులను పూర్తిగా వినియోగించేందుకు సరిపడే పరిశ్రమలు లేకపోవటం ఎంతైనా శోచనీయం.

మన ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్తి పది లక్షల ఎకరాలలో పండుతుంది. ఆ ప్రత్తిని పై ప్రాంతాలకు పంపే బదులు మనమే అధిక సంఖ్యలో బట్టల మిల్లులు స్థాపించవచ్చు కదా. అంతే కాకుండా సర్జికల్ కాటన్, ఆర్టిఫిషియల్ ఫైబర్, సెల్యులోజ్ పట్టు తయారుచేసే కర్మాగారాలు కూడా స్థాపించి మన ప్రత్తిని మనమే ఉపయోగించుకోవచ్చు.

మన ప్రాంతంలో సగటున ఎకరానికి పండే చెరుకు పంట తక్కిన ప్రాంతాలలో పోలిస్తే చాలా ఎక్కువ. ప్రస్తుతం మనం పండిస్తున్న చెరుకుపంటను పూర్తిగా వినియోగించాలంటె ఎలా లేదన్నా రోజుకు ఆరువేల టన్నుల చెరుకురసం తీసే పంచదార మిల్లులు మరో నాలుగు నెలకొల్పవచ్చునని అంచనా వేయబడింది.

ప్రస్తుతం మన రాష్ట్రంలో బియ్యం మిల్లులు అధికంగానే ఉన్నాయి. కాని వాటినుండి లభించే అనుబంధపు సరుకులను (బై ప్రాడక్ట్సు) వినియోగించటానికి ప్రయత్నించాలి. బియ్యపు తవుడు (రైస్ బ్రాన్) ఆయిల్‌కు మంచి ఎగుమతి విలువ కూడా ఉంది. ధాన్యపు పొట్టు ఉపయోగించి హార్డు బోర్డులను తయారు చేయవచ్చును.

మన ప్రాంతంలో సుమారు నాలుగు లక్షల ఎకరాలలో మామిడి, నారింజ, అరటి, ద్రాక్ష పండించబడుతున్నాయి. సాధారణంగా పళ్ళు ఎక్కువ కాలం నిల్వ ఉండవు. అందుచేత ఏ ధర లభ్యం అయితే ఆ ధరకే ఇతర రాష్ట్రాలకు రవాణా చేసేస్తున్నారు మన వ్యవసాయదారులు. అలాకాకుండా మన రాష్ట్రంలో పళ్ళ నిల్వ కేంద్రాలుంటే మన వ్యవసాయదారులు తమకు లాభం తెచ్చే ధర వచ్చేంతవరకు ఆగవచ్చు. అంతేకాకుండా టొమెటోలు, మామిడిపళ్ళు మొదలైనవి ఉపయోగించి జామ్‌లు జెల్లిన్‌లు, సాస్‌లు తయారుచేస్తే వాటికి దేశంలో అన్య ప్రాంతాలలో సంవత్సరం పొడుగున మంచి గిరాకీ ఉంది. ద్రాక్ష అయితే ఇటీవల ఆంధ్రలో చాలా విరివిగా పండుతున్నది. దీన్ని వినియోగించుకోగల ద్రాక్షసారాయి ఫ్యాక్టరీలు (వైనరీస్) నెలకొల్పవచ్చు.

రాయలసీమలో వేరుసెనగపంట ఎక్కువగా పండుతుంది. వేరుసెనగనూనె నుపయోగించి వనస్పతి తయారుచేసే కర్మాగారాలు నెలకొల్పుటకు మనం పూనుకోవాలి.

మొత్తం దేశంలో పండిన పొగాకు పంటలో నలభైశాతం మన ఆంధ్రప్రదేశ్‌లో పండుతున్నది. చాలావరకు యీ పంట అంతా ఇతర ప్రాంతాలకు రవాణా అవుతున్నది. అలా ఇతర ప్రాంతాలకు పంపేబదులు మనమే అధికంగా సిగరెట్ ఫ్యాక్టరీలు, పొగాకు గింజల నూనె, (టొబెకోసీడ్ ఆయిల్) తయారు చేసే కర్మాగారాలు స్థాపించవచ్చు కదా.

మన ప్రాంతంలో కలప, వెదురు, గంధపుచెక్క బెగాస్ ఎక్కువగా లభ్యం అవుతాయి. వాటిని సద్వినియోగం చేయాలంటే పేపరు మిల్లులు, చిప్‌బోర్డుల మిల్లులు అవసరం.

ఏస్‌బెస్‌టాస్, బైరైట్స్, బొగ్గు, క్రొమైట్, మేంగనీస్, మైకా, చైనాక్లే, లైమ్‌స్టోన్ మొదలగు ఖనిజాలు లభించే అనేక గనులు మన రాష్ట్రంలో ఉన్నాయి. ఈ గనులనుండి తీయబడిన ఖనిజాలను మనము మన రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధికి ఉపయోగించుకోలేక పోతున్నాము. నెల్లూరు జిల్లాలో 900 చదరపు మైళ్ళ ప్రాంతమంతా మైకా గనులతో నిండిఉన్నది. మైకా గనులలో లభించే మైకా తుక్కునుండి ఇన్సులేటింగ్ ఇటుకలవంటి వాటిని తయారు చేయవచ్చు.

మనకు సుదీర్ఘమైన సముద్రతీర ప్రాంతముంది. మనం ఉప్పుతయారీ చాలా హెచ్చు స్థాయిలో చేపట్టవచ్చును. కాస్టిక్‌సోడా, సోడా ఏష్ తయారు చేసేందుకుగాను విశాఖపట్నంలో మంచి అవకాశా లున్నాయి.

ఇంజినీరింగు ఇండస్ట్రీలో మాంద్యం (రెసిషన్) కారణంచేత, దేశంలో ఎంతోమంది యువక ఇంజినీర్లు ఉద్యోగాల్లేక కాలం వృథాపుచ్చటం మనమందరము ఎరిగిన విషయమే. వారు ఉద్యోగాన్వేషణ విడిచిపెట్టి ఏమైన చిన్న పరిశ్రమలను స్థాపించి మెకానికల్ కన్స్యూమర్ వస్తువుల ఉత్పత్తికి పూనుకొంటే, వారికి, రాష్ట్రానికి కూడా ఎంతో లాభదాయకము. ప్రస్తుతం మనకు కావలసిన అనేక విద్యుచ్ఛక్తి పరికరములు ఇతర రాష్ట్రాలనుండి తెప్పించుకొంటున్నాము. అలా కాకుండా మన ఇంజినీర్లు నలుగురైదుగురు కలిసి ఓ చిన్న ఇంజినీరింగు పరిశ్రమను స్థాపించి స్విచ్‌లు, స్విచ్‌బోర్డులు మొదలగు అనేక చిన్న చిన్న విద్యుత్ పరికరములు తయారు చేయవచ్చు.

విద్యా సంస్థలలో పదార్థ విజ్ఞానశాస్త్రం బోధన చేసేందుకు ఉపయోగపడే అనేక లేబరేటరీ పరికరములు ఎక్కువగా పై ప్రాంతాలనుండి మనం తెప్పించుకొంటున్నాము మన ఆంధ్రలోఉన్న ఒకటి రెండు సైంటిఫిక్ కంపెనీలు మన విద్యా సంస్థ లన్నింటికి కావలసిన పరికరములు సప్లై చేయ లేకపోతున్నాయి పెద్ద పెద్ద పరిశ్రమలకు కాకపోయినా మన ఇంజనీర్లు మంచి డిజైన్లు సృష్టించి, ప్లానులువేసి, స్టాండులు ఫిక్సర్లు మొదలైన అనేక చిన్న చిన్న లేబరేటరీ పరికరముల తయారీకిపూనుకోవచ్చు. ఇంతే కాకుండా బ్లేడులు, పెన్నులు మొదలగు ఎన్నో నిత్యావసర వస్తువులను మన ఇంజనీర్లు తమ మేధను ఉపయోగించి ఉత్పత్తి చేసేందుకు ప్రయత్నించాలి

రేడియో ఇంజనీరింగు చదివినవారు రేడియో ఎసెంబ్లీ వర్క్‌షాప్స్ నెలకొల్పితే ప్రస్తుతం మార్కెట్‌లో అమ్మబడుతున్న ధరలో సగం ధరకు మన రాష్ట్రంలో రేడియోలు అమ్మవచ్చును ఈ మాదిరే ట్రాన్సిస్టర్లు ఎసెంబ్లీ చెయ్యవచ్చు ఇలాంటి చిన్న చిన్న పరిశ్రమలు నెలకొల్పుటకు ముఖ్యంగా చొరవ కావాలి ఇలాంటి వర్క్‌షాపులు పంజాబ్, హరియానా, ఢిల్లీలలో ఎంతోమంది చదువురానివారు నడుపుతున్నారు

పైన ఉదాహరించిన చిన్న చిన్న పరిశ్రమలకు పెద్ద పెట్టుబడి అవసరం లేదు మన ఇంజనీర్లు ఉద్యోగ మనస్తత్వం విడిచిపెట్టి ఏమాత్రమైనా పెట్టుబడితో యిలాంటి చిన్న చిన్న పరిశ్రమలు నెలకొల్పుటకు పూనుకొనేటట్లయితే వారి నిరుద్యోగ సమస్య తీర్చేందుకు ప్రభుత్వముపై ఆధారపడకుండా ఉండటమే కాకుండా మరో కొంతమందికి జీవనోపాధి కల్పించిన వారవుతారు

మన రాష్ట్రంలో అక్కడక్కడ కొన్ని పరిశ్రమలు లేకపోలేదు కాని మన వనరులకు తగినంత నిష్పత్తిలో, మన రాష్ట్రం యొక్క, రాష్ట్ర ప్రజల యొక్క అభివృద్ధికి తగినంత స్థాయిలో లేవు ఆ వున్న కొద్ది పరిశ్రమలలో కూడా ఇతర రాష్ట్రాలవారు స్థాపించినవి ఎక్కువగా ఉన్నాయి మనవాళ్ళు అక్కడక్కడ ఎవరో ఒకరిద్దరు పరిశ్రమలను స్థాపించినంతమాత్రాన చాలదు ఇంకా ఎక్కువమంది ముందుకు రావాలి.

అయితే మనలో ఒక అపోహ వుంది ఒక పరిశ్రమను స్థాపించటం అన్నది ఒక్క వ్యక్తివలన, అతని పెట్టుబడి వలన అయేపని కాదన్న కారణం చేత వెనకాడుతున్నారు. అది నిజమే. అందుచేతనే ఇతర ప్రాంతాలవాళ్లను చూచి మనం నేర్చుకోవలసినది ఎంతైనాఉంది. అన్య ప్రాంతాలలో కూడా ఏ ఒక్క రిద్దరు మాత్రమే పరిశ్రమలు స్థాపించటంలేదు. వారు కొంతమంది కలసి కూటమిగా ఏర్పడి తమ పెట్టుబడుల్ని ఒకచోట చేర్చి పరిశ్రమలను స్థాపిస్తున్నారు ఉదాహరణకు దాల్మియాలు సింఘానియాలు,జైనులు, తాపర్లు మొదలగువారిని తీసుకొంటే ఒకే కుటుంబంలోని సభ్యులుకాని, వారి బంధువులుకాని వాళ్ల వాళ్ల మిగులు మొత్తాలను ఒకచోట చేర్చి పరిశ్రమలు స్థాపిస్తున్నారు అయితే అలాంటి సంస్థలు సాఫీగా నడవాలంటే అలా కలసిన వాళ్లలో ఒకరిమీద ఒకరికి విశ్వాసం, నమ్మకం ఉండాలి ఇది పెద్ద మొత్తాలను పొదుపు చేయుగలిగినవారి సంగతి.

చిన్న మొత్తాలు పొదుపు చేసినవారు కూడా పరిశ్రమలలో పెట్టుబడిపెట్టి పెత్తనదారు కావచ్చు ఇట్లాంటివారు పెద్ద పరిశ్రమలలో వాటాదారులుగా కూడా చేరవచ్చును. ఆ పరిశ్రమల మూలధనానికి అవసరమైన వాటా అసలు ఖరీదు పది రూపాయిలు లేక నూరు రూపాయిలు ఉంటుంది. ఈ వాటాలు కొనడానికి స్టాక్ ఎక్స్‌చేంజులు, స్టాక్ బ్రోకర్స్ తోడ్పడుతాయి. మన కెన్ని వాటాలు కావలసివస్తే అన్ని కొనవచ్చు. ఇట్లాంటి విషయాలను ప్రజల దృష్టికి తెచ్చే ప్రభుత్వ సంస్థలుకాని ప్రయివేటు సంస్థలుకాని కొన్ని ఉండాలి ఆ సంస్థలు పరిశ్రమల పెట్టుబడుల అవసరాలను వాటి లాభ నష్టాలను ప్రజలకు తెలియజెప్పే బాధ్యత స్వీకరించాలి

ఇంకొక విషయం కూడా వుంది ఒక పరిశ్రమకు కావలసిన పెట్టుబడి అంతా పెట్టుబడిదారులే భరించనక్కరలేదు తగిన హామీలమీద పరిశ్రమలకు అప్పులు ఇచ్చేందుకుగాను "స్టేట్ ఫైనాన్సు కార్పొరేషన్", "ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ బేంక్ ఆఫ్ ఇండియా', "ఇండస్ట్రియల్ క్రెడిట్ ఎండ్ ఇన్‌వెస్ట్‌మెంట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా' మొదలుగాగల ప్రభుత్వ సంస్థ

ఉన్నాయి. ఆ యా సంస్థలు, పరిశ్రమల ఆస్తి హామీమీద ఆస్తిలో ఏభై శాతం దాకా ఋణా లిస్తాయి. ఈ ఋణాలను ఎనిమిది లేక పది సంవత్సరాలలోగా తీర్చవచ్చును.

అంతేకాకుండా పరిశ్రమదారులకు ప్రభుత్వం కొంత ప్రోత్సాహాన్ని, కొన్ని "ఇన్‌సెంటివ్స్"ని ఇస్తున్నది. ప్రభుత్వం భూమి తక్కువ ధరకు లభ్యమయేటట్లు చూస్తుంది. నీరు, విద్యుచ్ఛక్తి తక్కువ ధరకు అందిస్తుంది. రవాణా సౌకర్యాలకు కూడా తోడ్పడుతుంది. కాకుండా పన్నుల రేట్లలో కొంత రాయితీలు ఇస్తుంది. ఈ సౌకర్యాలను వినియోగించుకొని కొన్ని కొన్ని పట్టణాలలో 'పారిశ్రామిక క్షేత్రాలు' వెలుస్తుండడం ఒక ముదావహమైన పరిణామం.

అయితే ఇంకా ఎక్కువగా ఈ అవకాశాలను, సౌకర్యాలను వినియోగించుకొని పరిశ్రమలను నెలకొల్పేటట్లు చేయడంలో ప్రభుత్వం, పత్రికలు, విద్యాసంస్థలు విలువైన పాత్ర వహించాలి. విద్యాసంస్థలు వృత్తి విద్యా ప్రాధాన్యంగల శిక్షణ నిచ్చేందుకు ప్రయత్నించాలి.

ఇతోధికమైన పారిశ్రామికాభివృద్ధికి పెట్టుబడి, ప్రోత్సాహం, సాంకేతిక నైపుణ్యం ఎంత అవసరమో, ఆ పరిశ్రమలు పూనుకొనే వారిలో చొరవ, ఐకమత్యం అంతే అవసరం. పారిశ్రామికంగా ముందుకు పోవాలంటే మనలో ఐకమత్యం ఎంతైనా అవసరం. అవతలవాడు బాగుపడి పోతున్నాడు—అన్న ఈర్ష్య ఉండకూడదు. మనలో మనం సర్దుకోగలిగి ఉండాలి. వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధిపరచే బాధ్యత అభివృద్ధి చెందిన ప్రాంతాలపై ఉంది. వారు అవసరమైతే కొన్ని త్యాగాలకు సిద్ధమై అన్ని ప్రాంతాలు సరి సమానంగా అభివృద్ధి అయేందుకు ప్రయత్నించాలి.

మొదటనుండి మనం ఉద్యోగ మనస్తత్వం అలవాటు చేసుకొన్నాము. వీలైనంతవరకు చదవడం, ఆ తరువాత ఉద్యోగాన్వేషణ, ఉద్యోగం వచ్చాక రిటైరై పోయేవరకు అందులోనే స్థిరపడిపోవటం మనకు ఆనవాయితీ అయిపోయింది. ఆ ఉద్యోగం కూడా వీలైనంతవరకు మన జిల్లాలోనే వెతకటానికి ప్రయత్నిస్తాము. మనవారిలో సంచలనప్రవృత్తి ("మొబిలిటీ") చాలా తక్కువ. ఒకచోటునుండి ఇంకోచోటుకి సులభంగా కదలము. ఆంధ్రదేశంలోనే స్వంత ఊరు విడిచి ఏ రెండు వందల మైళ్ళ అవతలో వుండలేము. సాధ్యమైనంతవరకు మన జిల్లాకు, తాలూకాకు రావటానికి ఉవ్విళ్ళూరుతుంటాము. అందుకనే ఆంధ్రులు జాతీయ స్థాయిలో కూడా ఎక్కువగా కనిపించరు. ఇతర రాష్ట్రాలలో కూడా తమిళులవలె, పంజాబీలవలె మనవారు కానరారు.

ఇంకో ముఖ్యమైన విషయం. దేశంలో ఎక్కడ చూచినా పరిశ్రమలన్నీ ఒక్క చోటనే కేంద్రీకరించబడుతున్నాయి. ఒకటో, రెండో పట్టణాలలోనే అన్ని పరిశ్రమల ఏర్పాటు కావటంచేత ఆ యా పట్టణాలలో జనాభా విపరీతంగా హెచ్చిపోయి, ఆ పట్టణాలు మురికి వాడల క్రింద తయారవుతున్నాయి. అవతల మిగతా పట్టణాలుకాని, పల్లెలు కాని అభివృద్ధి చెందే అవకాశాలు లేకుండా పోతున్నాయి. ఇది చాలా అవాంఛనీయమైన పరిణామము. ప్రాంతీయ అసమానతలు లేకుండా మన ఆంధ్రప్రదేశంలో అన్ని ప్రాంతాలు అభివృద్ధి చెందేందుకు ప్రభుత్వము, ఆర్థిక స్తోమతగలవారు ఆలోచించాలి. పరిశ్రమలు వీలైనంతవరకు విస్తృతంగా ఏర్పాటుచేస్తే చేకూరే లాభాలు ఎన్నో ఉన్నాయి.

ఇంతే కాకుండా ఏదైనా పద్ధపరిచె (ప్రాసెస్) పరిశ్రమ స్థాపించదలచుకొంటే ఆ ప్రాసెస్ పరిశ్రమను పూర్తిగా ఒక చోటనే నెలకొల్ప నవసరంలేదు. ఆ పరిశ్రమలోని వివిధ దశలను ప్రాసెస్‌లను విడదీసి ఒక్కొక్క ప్రాసెస్‌ను ఒక్కొక్కచోట నెలకొల్పవచ్చు. మొదటి 'ప్రాసెస్' తయారు చేసిన సరుకు రెండో 'ప్రాసెస్' మిల్లుకు ముడి సరుకుగా ఉపయోగపడుతుంది. దీనివలన విభిన్న ప్రాంతాలు అభివృద్ధి చెందేందుకు వివిధ ప్రాంతాల వారికి జీవనోపాధి కలిగేందుకు అవకాశాలున్నాయి. అంతే కాకుండా ఆ యా 'ప్రాసెస్'లలో ప్రత్యేక నైపుణ్యం లభించి, తయారైన సరుకుల నాణ్యం హెచ్చుగా ఉండి మన పరిశ్రమలు మన దేశంలోను, ఇతర దేశాలలోను పేరు ప్రఖ్యాతులు తెస్తాయి.

"అంగట్లో అన్నీ ఉన్నాయికాని అల్లుడి నోట్లో....." అన్నట్లుగా ఉంది మన పరిస్థితి. అట్లా కాకుండా అతి త్వరితంగా ఆంధ్రులు తమ రాష్ట్రాన్ని పారిశ్రామికంగా పటిష్టం చేసేందుకై తీవ్ర కృషి చేస్తారనే ఆశిద్దాము. ప్రస్తుతం భారతదేశంలో వ్యవసాయకంగా అగ్రతాంబూలం అందుకొంటున్న ఆంధ్రప్రదేశ్ సమీప భావిలో పారిశ్రామికంగా కూడా ఒక వ్యక్తిత్వాన్ని సంపాదించుకోగలదని కోరుదాము. లేనిపక్షంలో దేశంలో వివిధ ప్రాంతాలలో పోలిస్తే మన రాష్ట్రం నానాటికి వెనుకబడిపోయే ప్రమాదం ఉంది.

# యాథార్థ్యము, విపరివర్తనము

ప్రొఫెసర్ కె. సచ్చిదానందమూర్తి

లోక జ్ఞానము వలన, అనుభవంవలన ఈ ప్రపంచం కొన్ని స్థిరమైన పదార్థముల యొక్క, నిత్యమైన సంబంధముల యొక్క సమాహారం అని తోస్తుంది. ఇది ఒక భవనమని ( becoming ), దాని యొక్క సత్తా కార్యమని ఉత్పాదన మనిన్నీ గ్రహించటమే దర్శనశాస్త్రానికి ప్రారంభము. ఆసియాలో బుద్ధుడు ఐరోపాలో హెరాక్లిటస్సు అట్టి ప్రత్యయాన్ని పెంపొందించిన వారిలో మొదటివారు. యాథార్థ్య మనేది ఒక ప్రక్రియ. కాబట్టి అందలి సత్యం కూడ మార్పు చెందేదిన్నీ పెంపొందేదిన్నీ అయి ఉంటుంది. అంటే సత్యం అనేది స్థిరమైన వాక్యాల్లో ఇదమిత్థమని చెప్పడానికి వీలు కాదన్న మాట కాని విధేయాలుగా పెంపొందే క్రియావత్తులైన ఉద్దేశ్యాలుగల వాక్యాలలో వివరింపబడాలి.

యాథార్థ్య మనేది పరస్పర విరుద్ధ రూపాలతో కూడినది వాటిని విభజించి పరిశీలించి ఏకీకరణ మార్గాలను సూచించుట దర్శనశాస్త్రం చేసేపని జీవితమునందు, ఆలోచనయందు, బాహ్య ప్రపంచమునందున్ను కనుపించే మానవుడు—ప్రకృతి, యాథార్థ్యము—భావము, వ్యక్తిస్వార్థము-లోకహితము మొదలైనవి ఇట్టి వైరుధ్యాలకు ఉదాహరణాలు దర్శన శాస్త్రము ఈ వైరుధ్యాలను గ్రహించి విడమరచుటకు ప్రయత్నించవలసి ఉంది వానికి పరస్పరం సామరస్యాన్ని కలిగించే ఆంతర సంబంధాన్ని ఏర్పరచడం దాని పని

వ్యక్తి స్వేచ్ఛగా పెంపొందడానికి తగిన అవకాశాన్ని ఇచ్చే సంతృప్తికరాలైన భౌతిక పరిసరాలు, సాంఘిక పరిసరాలున్ను ఏర్పడేటట్లుగ ప్రపంచం మార్పు చెందవలసిఉంది. అంటే ఇప్పుడున్న ప్రపంచము అహేతుకము ఇది ఒక హేతుపూర్వకమైన యాథార్థ్యం కావాలి

ఇప్పటి ప్రపంచంలో మానవుడు పదార్థములున్ను అవి ఉండగలిగిన స్థితిని పొందడం లేదని మనకు తెలుస్తున్నది. అందుచే ఇప్పుడున్న ఈ ప్రపంచం అహేతుకము. ప్రకృతిలోను, సమాజంలోను దృశ్యములయ్యే ఆంతర శక్తులు క్రియారూపాన్ని పొందడం లేదు ప్రస్తుత యాథార్థ్యం మానవులయొక్క సముచితమైన శక్తుల సంపూర్తిని సమకూర్చడంలేదు ప్రస్తుతం మానవులు వారుండగలిగినంత స్వేచ్ఛగా ఉండడంలేదు ఆర్థిక రాజకీయ సాంఘిక పద్ధతులు, సంస్థలున్ను అవి యుండవలసినంత స్వేచ్ఛగా ఉండటంలేదు. ఆవిధంగా యాథార్థ్యంలో అసంగతత్వం కలదు. దీనికి సామరస్యం కలిగించాలంటే క్రియావత్త్వం ఆవశ్యకం.

ఈ పునర్నిర్మాణ కార్యక్రమానికి తగిన క్రియ అవసరం ఇప్పుడున్న యాథార్థ్య స్వరూపానికి, అది కాగల యాథార్థ్య స్వరూపానికి గల భేదాన్ని ఆలోచిస్తూ ఈ పునర్నిర్మాణ కార్యక్రమాన్ని ప్రారంభించాలి ప్రతీ పదార్థములోను వైరుధ్యం ఉంటుందని దీనివలన మనకు తెలుస్తున్నది. ప్రతీ పదార్థముయొక్క సరియైన స్వభావము (ఏది కాగలదో, ఏది కావలసి ఉందో అది) ఇప్పుడున్న స్థితికి భిన్నమైంది ఒక పదార్థంయొక్క సరియైన స్వభావాన్ని తెలిసికోవాలంటే ఆ పదార్థం ఇప్పటికంటె మరియొక రూపాన్ని పొందాలి దాని నిశ్చయత్వముయొక్క హద్దులను అతిక్రమించి ఇతర పదార్థాలతో సంబంధాన్ని పొందాలి.

లోకజ్ఞానం, అనుభవం ఈ ప్రపంచాన్ని ఉన్న దున్నట్లుగ ఇప్పటి రూపంతో పార్యంతిక యాథార్థ్యంగా గ్రహిస్తున్నాయి. దీనికి కారణం నిజమైన యాథార్థ్యం మానవజాతియొక్క అవసరాలకు అపేక్షలకు విదూరం కావడమే ముందు చెప్పినట్లుగ మన ఈ ప్రపంచము వైరుధ్యాలతో కూడింది అది మనకు పరిమితిని, బంధాన్ని కలిగిస్తుంది. మన మీ ప్రపంచాన్ని పునర్నిర్మాణం చేస్తేగాని స్వేచ్ఛగా మనజాలం.

ఇప్పటి పదార్థాల స్థితిని సరియైన స్థితితో పోల్చి భేదాన్ని కనుగొనలేక పోయినప్పుడు మానవులు ఉన్న దాన్నే స్థిరమని, నిత్యమని అంగీకరించి తృప్తి పొందుతారు. మానవులు గ్రహించని సంభవత్వాలను తెలిసికొనేటట్లుగ ఆ భేదాన్ని విశదపరచడం తర్కముయొక్క కర్తవ్యం. అప్పుడు ప్రస్తుత యాథార్థ్యాన్ని నిషేధించే నూతన యాథార్థ్యం నిర్మితం కాగలదు అంటే ప్రపంచం ఇప్పటి రూపంలో ఉండరాదు దాని అయథార్థ స్థితిని ఎదిరించాలి. ఆవిధంగా అది ఇప్పటి స్థితికంటె మరియొక స్థితిని పొందగలగాలి ఇప్పటికంటె వేరైన ఏకత్వాలుగా మారడంచేత పునర్నిర్మితమైన ప్రపంచంలో ఇప్పటి వైరుధ్యాలు తొలగిపోతాయి

మానవుడు నివసించే ఈ ప్రపంచం కొంతవరకు మానవబుద్ధివలన, మానవ ప్రయత్నమువలన నిర్మితం కావడంచేత తర్కం ఈ పనికి తానుగా పూనుకోడానికి ప్రయత్నించవచ్చు మానవుడు ఈ ప్రపంచంలో నివసించడానికి పూర్వం ప్రపంచంకంటె ఇప్పటి ప్రపంచం భిన్నమైంది.

ప్రతీ ఏకత్వం రెండు భిన్నత్వాలను కలిగి ఉంటుందనే భావం ఇటువంటి ఆలోచనకు మూలం. పదార్థము, భావము, ప్రక్రియ ఇవన్నీ భిన్నత్వాల ఏకత్వాలే ఈ భిన్నత్వాలను విడమరచడం పదార్థాల స్వభావం. ఆవిధంగా వైరుధ్యం, భిన్నత్వం అన్ని విధాలైన అభివృద్ధికి కారణం

అటువంటి యాథార్థ్యాన్ని గ్రహించగలిగే ఆలోచన పదార్థాలను వాని భిన్నత్వాలుగా విడమరచి, వాని ఏకీకరణానికిగల అవకాశాలను వ్యూహింపగలదిగా ఉండాలి ప్రతీ పదార్థం, పరిమితము, మార్పు చెందేదిన్ని అని మనం తెలిసికొనినపుడు అది తన భిన్నత్వంలోకి మారే సామర్థ్యాన్ని కలిగిఉందని గ్రహిస్తాము. వైరుధ్యం రెండు రకాలు అంతర్గత వైరుధ్యం మొదటిది; భిన్నత్వాలు ఒక మొత్తంగా మారుట దీనినే ప్లేటో సదసత్తుల సమాగమము అనెను. 'క గ కాదు' అను వాక్యము అసత్తునుగాని అభావమునుగాని చెప్పదు, కాని అన్యత్వాన్ని చెబుతుంది ఈ వాక్యానికి అర్థం ఏమంటే క అనునది గ కంటె సర్వథా వేరైనది గ కాకపోవుట యనగా పూర్తి అభావముకాదు, గ కు లేకుండ క కు మాత్రమే ఉండగల ఒకానొక లక్షణము కేవలము అభావమును తెలియజేయు విధేయము ఎచ్చటను ఉండదు ఆ విధేయముయొక్క నిషేధము ఉద్దేశ్యమును లక్షణవంతం చేస్తుంది కాబట్టి అన్యత్వము అనే అర్థంలో చెప్పబడిన నిషేధము (కాదనుట) ఉన్నదానిని అంతటిని లక్షణవంతము చేయును. ఇంకొకదానికంటె అన్యము అనే అర్థంలో సత్తు గూడ అసత్తగును; అది ఇంకొకదానికంటె అన్యమై దానిని లక్షణవంతము చేస్తుంది.

సావధికత్వము ప్రతీ పదార్థముయొక్క నిషేధాన్ని ఏర్పరుస్తుంది. ముఖ్యముగా అన్యత్వం లేకుండ ఏ పదార్థము లక్షణవంతం కాదు. దిఙ్నాగుడు ధర్మకీర్తి మొదలైన బౌద్ధ తత్త్వజ్ఞులును, అర్వాచీనులైన హెగేయున్ను ఇట్లే తలచారు. ప్రతి పదార్థము నిషేధ రూపము కావడం[illegible] నిరాకరణ ద్వారా అది ఒక విధిగా మారుటకు ప్రయత్నిస్తుంది అయినప్పటికి నూతనమైన ఏకత్వం గూడ ఒక నిషేధ రూపమే కావడంచేత అనిత్యమే అవుతుంది ఈ ఆంతర విరోధమే కాకుండ పదార్థములు పరస్పరము విరుద్ధములై ఉంటాయి. అట్లే అన్ని భావములు నియమాలు కూడ పరస్పరం విరుద్ధములై ఉంటాయి. కాని ప్రతి పదార్థము ఇతరములచే లక్షణవంతములు కావడంచేత వైరుధ్యమంతా ఒక విధంగా అంతర్గతమే అవుతుంది మొత్తముమీద A అను ఏ పదార్థమైనా భిన్నత్వాల అనిత్యమైన ఏకత్వము; అది A కానిది అనే దానికి కూడ భిన్నము అంతేకాకుండ అది తన నిజమైన సంభవత్వముల నిషేధము, పరిమితము కూడ అవుతుంది.

ఒక పదార్థముయొక్క సంభవత్వాలను గ్రహిస్తూ, వైరుద్ధ్యాలను విషేధాన్ని అతిక్రమిస్తూ, ఆ పదార్థాన్ని తెలిసికొనగలం. సంభవత్వానికి యాధార్థ్యానికి భేదం లేనంతవరకు అది హేతు పూర్వక మవుతుంది. యాధార్థ్యమంతా హేతు పూర్వకం కాదు. కాని ఒక పదార్థం దాని సంభవత్వాలను తెలిసికొని వైరుద్ధ్యాలను అతిక్రమించినప్పుడు నూతనమైన సంభవత్వాలను వైరుద్ధ్యాలను అభివ్యక్తం చేయ నారంభిస్తుంది ఆవిధంగా తిరిగి తన నిషేధానికి మూలనం అయిన ఏకత్వసిద్ధికి ఇంకొక ప్రేరేపణ ఏర్పడుతుంది ప్రతీ పదార్థము పరిమితి, వైరుద్ధ్యమున్నూ కలదయి ఉంటుంది. కాని అట్లుండుట తనకు తానుగా అణిగిపోవడం, తనకు తానుగా తొలగిపోవుటకయి ప్రయత్నించడం అవుతుంది ఈ నిరాకరణ ప్రక్రియలో అది తనంతట తానే ప్రతిరూపంగా మారుతుంది. తనకు తానే రద్దయి ఇంకొకటిగా మారే స్వభావంనుండి ఏదిన్నీ తప్పించుకోలేదు. పూర్తిగ హేతు పూర్వకం అయిన యాధార్థ్యం పదార్థాల స్వభావంలోనే ఉండజాలదు. దీనిని ఈవిధంగా కూడ చెప్పవచ్చును: యాధార్థ్యము అహేతుకమయినది. దాని స్వాభావిక సంవిధానంవలన అది మార్పు చెందడానికి వీలయినది. ఈ మార్పు హేతుపూర్వకం అయిన సంవిధానానికి దారి తీస్తుంది. కాని ఇది విశ్వాసం మాత్రమే

యాధార్థ్యం అంతకంతకు అహేతుకం అవుతూ ఉండవచ్చును. వైరుధ్యాన్ని విడమరచడం, నిషేధాన్ని నిరాకరించడం అంటే అస్తిత్వాన్నిపొందే నూతనం అయిన ఏకత్వం, మిక్కిలి సామరస్యంతో గూడినది, హేతు పూర్వకమయినది అవుతుందని అర్థం కాదు కాని మానవుని భవిష్యత్తునందుండే విశ్వాసము, సంఘటనలలో ప్రయోజనకరంగా కలుగజేసికోడానికి బుద్ధి సామర్థ్యమున్ను మానవుల్ని వారు ఊహించగలిగిన భావమునుబట్టి యాధార్థ్యాన్ని పునర్నిర్మాణం చేయడానికి తగిన సమర్థులుగా చేస్తుంది

మానవుల లక్ష్యంతో సరిపోయినంతవరకు యాధార్థ్యము హేతుబద్ధం అవుతుంది. యాధార్థ్యము లక్ష్యంతో విరోధించినప్పుడు అది అహేతుకం అవుతుంది. కాలక్రమాన ప్రతీపదార్థమున్ను లక్ష్యంతో విరోధించినప్పుడు అహేతుకం కాకతప్పదు మానవుల లక్ష్యాలను గురించిన ఆలోచనలు మారుతూ ఉంటాయి. అప్పుడు వాని ప్రభావంలో పదార్థాలు విచారింపబడి నిందింపబడతాయి. మానవుల బుద్ధిలో హేతుపూర్వకం అయింది ప్రస్తుతపు వస్తుస్థితిని ఎంత విరోధించినప్పటికి ఒక నాటికి యధార్థం కాగలదు లక్ష్యంచే విరోధింపబడినంతవరకు ఇప్పుడున్నది నశింప చేయతగింది. నూతన సంభవత్వములు మనకు బాగుగ విశదపడేటట్లు కనుపించినట్టయితే మానవుని క్రియయొక్క ఫలితాలు ఆలోచనలు నశించ దగినవి. ఆ విధంగా ఒక స్థితిగాని, సాంఘిక నియమంగాని, తత్త్వంగాని హేతుమత్త్వం కొరవడినట్లు కనుపించే యెడల మానవులు దాని నాశానికి ప్రయత్నించుట కొరతగింది ఏమయినా, అట్లున్నదంతా నశిస్తుంది. దాన్ని తిరిగి ఏవిధంగా పునర్నిర్మాణం చేయదలచుకొంటామో మనకు నిశ్చయం కలిగినట్లయితే మనమా నాశాన్ని మనఃపూర్వకంగా స్వేచ్ఛతో తొందర చేయవచ్చును ఎందుచేతనంటే ఇంకొకదాని పుట్టుకకు కారణం కాకుండ ఏదిన్నీ నశించదు. కాబట్టి ఈ నిర్మాణ ప్రక్రియలోను, నాశప్రక్రియలోను మనం కల్పించుకొనవచ్చును. మానవునికిఈ పని చేయగలిగిన స్వేచ్ఛాసామర్థ్యాలు ఉన్నవా అని, పదార్థాలలో అంతర్గతంగా ఉన్న కఠిన స్వభావాలు వాని మార్పుకు సంబంధించిన నియమాలున్ను తర్కమునకు అవకాశం లేనివిధంగా ఈ ప్రక్రియను నడిపించునా అనిన్నీ ప్రశ్నింపబడవచ్చును.

ఏ సందర్భంలోనైనా అస్తిత్వము యొక్క ఏ స్థితియైనా అనిత్యమే మానవులు దాంతో సంతృప్తి చెందినంతవరకు అది సమర్థింపబడుతుంది మానవులు తమ బుద్ధిలో అస్తిత్వము యొక్క ఉత్తమం అయిన ప్రతిరూపాన్ని రూపొందింపగలిగిన వెంటనే అది అహేతుకం అవుతుంది. చరిత్రక్రమంలో మొదట హేతుపూర్వకం అని తలంపబడింది. అంతా తరువాత అహేతుకం అని తలంపబడుతూ ఉంది అస్తిత్వాన్ని పొందినది, పొందబోయేదిన్నీ కూడ ఈ అవస్థను తప్పించుకోలేదు. అభివృద్ధిలోను సక్రమం అయిన పురోగమంలోను విశ్వాసం గల ఆశావాది, రాబోయే ప్రతీస్థితిని ఉన్నతమైందిగాను ఉత్తమమైందిగాను విశ్వసించ వచ్చు. కాని దీనికి నిదర్శనంలేదు భవనము (becom g) శాశ్వతంగా ఉకటుంది అనే విషయం మాత్రం మనం నిశ్చయంగా చెప్పవచ్చు.- ఇది ఉత్తమోత్తమం అయినట్టిన్ని, ఉన్నతోన్నతం అయినట్టిన్ని అస్తిత్వపు రూపాలను కలిగించబోతుందో లేక పరిస్థితులను విషమింప చేయబోతుందో లేక ఈ మార్పులు మంచి చెడులతో అనువృత్తములవుతాయో సందేహాస్పదమైన విషయం.

యాధార్థ్యం భిన్నత్వాల ఏకత్వం. ఈ ఏకత్వాలు సోపాధికాలు, అనిత్యాలున్ను. ఇతరములను అతిక్రమించి సమీకరించుకోడానికి ప్రయత్నించే భిన్నత్వాల నడుమగల సంఘర్షణే యాధార్థ్యము. ఆలోచన దీనికి సరిపోవాలంటే అది ఆ రూపంలో ఉండితీరాలి. అంటే కేవల (నిరపేక్షమైన) సత్యం లేదు. సత్యం అంతా సోపాధికము తాత్కాలికమున్ను. అస్తిత్వాన్ని పొందిన పదార్థాలు భిన్నత్వాల నుండి ఏకత్వాలుగా ఏర్పడిన విధమును, ఆ భిన్నత్వాలు ఏకత్వాలను తొలగించడానికి సంఘర్షించే విధమునున్ను గ్రహించే ప్రక్రియే సత్యము. సత్యమంటే, ఏకత్వాలు, నూతన సమన్వయాలున్ను ఎటువంటివి ఏవిధంగా ఆవిర్భవిస్తాయో తెలిసికొనడమే. సత్తు— ఆలోచన వీని యొక్క పౌర్వాపర్యం ఇచ్చితంగా చెప్పుట సాధ్యం కాదు ఆలోచన— సత్తు వీనియొక్క ద్వైధీభావమే ఏకత్వం యొక్క విభజన ఈ భిన్నత్వం అతిక్రమింపబడవచ్చును. కాని ఆ నూతన సంయోజనం శాశ్వతం మాత్రం కాజాలదు. ఇది, మరికొన్ని ఇతర భిన్నత్వాలు, వైరుద్ధ్యాలున్ను ఎప్పటికిన్ని అతిక్రమింపబడడం గాని, సమన్వయింపబడడం గాని జరుగక పోవచ్చు. ప్రతీవైరుద్ధ్యము, విభజన, భిన్నత్వమున్ను, సామరస్యం పొందుతుంది అనడానికిగాని, సంయోగింపబడుతుంది అనడానికిగాని నిదర్శనం లేదు విశ్వంలో ఏకత్వాలు విభాగం చెందడం, భిన్నత్వాలు సంయోగం చెందడం ఒక స్వభావం బహుశః కొన్ని వైరుద్ధ్యాలు ఎప్పటికిన్ని పూర్తిగా సమన్వయింపబడనంత మౌలికములు కావచ్చు. అయితే అవి ఏకం కావడానికిగాని, పరస్పరము లీనం కావడానికి గాని, యాధార్థ్యం యొక్క నూతన రూపాలను కలిగించడానికి గాని ప్రయత్నించవని మాత్రం అర్థం కాదు. కాని అవి ఫలవంతములు కాకను పోవచ్చు లేదా కొంతవరకు మాత్రమే ఫలవంతములు కావచ్చు ఏమయినప్పటికి సంయోజనం, ఏకీకరణం ఏదిన్ని శాశ్వతం కాదు

ఏకత్వాల విభజనకు భిన్నత్వాల ఏకీకరణమునకు సంబంధించిన ఈ ప్రక్రియలకు అంతం ఉన్నదా అని ప్రశ్నింపబడవచ్చు. ఈ ప్రక్రియ ఏకత్వం లేక సంయోజనమందుండే స్వాభావిక వైరుద్ధ్యాలవలననయినా, మరిన్ని ప్రతీ ఏకత్వం లేక సంయోజనం తనలో స్వకీయమైన వైరుద్ధ్యాలను లేక భిన్నత్వాలను కలిగి యున్నను, భవనప్రక్రియ ( process becoming ) శాశ్వతమగును. వైరుద్ధ్యాలన్నీ అతిక్రమింపబడితే అస్తిత్వపు స్థితి ఉండదు. వైరుద్ధ్యములు లేని అస్తిత్వపు స్థితి ఉన్నదనిన్ని ఇది ప్రపంచ ప్రక్రియకు ఉద్దేశ్యము (లక్ష్యము) అనిన్ని నిరూపింపబడ గలిగినప్పుడు ఈ యభిప్రాయం నమ్మవుతుంది. దానిపై దీని ఉద్దేశ్యము (లక్ష్యము) అయినా, దానిలో అంతర్గతంగా, ఒకవిధంగా దానికి పూర్వంగాను ఉండుటచే కేవలమయిన ఏకత్వం ఆదియందు కూడ ఉన్నదని వాదింపబడవచ్చును ఈ ప్రపంచం భవనపరంపర అనడానికి నిదర్శనం ఉన్నప్పటికీ, దానికి మూలం ఉన్నదని కాని, ఉండాలని కాని చెప్పడానికి నిదర్శనం లేదు మరియు ఇదొక ఆదిమమయిన ఏకత్వంలో నుండి పుట్టిందని, తిరిగి దానిలోనే చేరుతుందని చెప్పడానికి కూడ నిదర్శనం లేదు. మూలము, ఆది, లక్ష్యములేని, సత్తుకాని భవనపరంపరకంటె అధికమయిన పదార్థాన్ని తలచడం సత్యాలలో ఆధారాలు లేని ఊహా ప్రబోధనలో లగ్నం కావడమే కాని సత్యాల కంటె అతీతం కొంత ఉండవచ్చును

భూతార్థేతరము అతీతము. దానిని గురించిన ప్రతీతి దానిని రుజావు పరచ జాలదు. కాని అతీతము సమాధ్యవస్థలో స్ఫురిస్తుందని భావింపబడుతున్నది అట్టి స్ఫురణ వలన వ్యక్తిత్వంలో మార్పు, నైతిక ప్రవర్తన ద్వారా జీవితపారిశుద్ధ్యం సంభవిస్తుందని తలుస్తారు.

(1968 ఆలిండియా ఫిలసాఫికల్ కాంగ్రెస్ అధ్యక్షోపన్యాసం నుండి)

# క ష్ణు

శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ

తిమిర కుట్మలం విడివడి
తెలి తొలివెలుగుల విచ్చిన
సృష్టి మహాచైతన్యం
చిత్రమైన శతపత్రం —

దానిలోంచి రెక్కవిప్పి
తలలెత్తిన, చంచరీక
ద్వయం——నిజం —మాచు, జగం
తరుణ మానవాళియుగం.

సృష్టిలోని వర్ణక్రమ
చిత్రరక్తి, జీవశక్తి,
ఎదపుటలో అనుభూతుల
కదలికగా చిత్రించే,

నల్లనైన కుంచె కొనలు
‘నన్ను’ చిగిర్చిన ఆశలు
మానవ మేధావృక్షపు
మహితనీల సుమద్యుతుం.

దూరాలెరగని ఏయే
తీరాలో తిరిగివచ్చు
విహగాలై, దిదృక్షలే
విశ్రమించు కులాయాలు.

ఎడదసంద్రం చేరుకొందుకు
ఎగిరి నురుగులు తరగలవుతూ
కళా, స్వప్న స్రవంతులుగా
‘కళ్ళు’ మిలమిల మెరసిపోతవి.

సుప్త నవరస విపంచిక లవి
గుప్త కాంక్షా ‘హసంతిక’ లవి
లోన బడబాగ్నులను మ్రింగే
ఫేన దరహాస సాగరాలవి

క్రూరకాంక్షా ఫణుల మణులవి
‘ధీర’ వాంఛా మదనవ్రణాలవి
‘అహం’ అను రెండక్షరాలవి
అశ్రుపూర్ణ జలాశయాలవి-

---

# కాకి(తం) బంగారం

## శ్రీ వి. సి. బాలకృష్ణ శర్మ

దేశ దేశాలూ బంగారాన్ని గురించి ప్రపంచమంతటా కాకిగోల చేసి, చేసి, చివరకు కాగితం బంగారం తయారు చెయ్యాలని తీర్మానించాయి ఒకానొకప్పుడీ స్వర్ణకారవిద్య బాగా వ్యాప్తిలో ఉన్నదే

"మన్ను బంగరుగను మతి చేసిపెట్టుడా" అని వేమన్న కూడా వెర్రిగా నమ్ముకున్నది. భారతదేశంలోనే కాకుండా, ఈ విద్య పాశ్చాత్య దేశాల్లో కూడా 'అల్కెమీ' లనే పేరున ప్రసిద్ధి పొందింది చివరకీ ఆ ప్రయత్నాలన్నీ శుష్క దండగై, తత్సందర్భంగా తయారైన నకిలీ బంగారం ప్రత్యేకంగా ఒకస్థానం చూసుకుంది అసలైన బంగారం తన గొప్పతనాన్ని నిలబెట్టుకుంది చేసేది లేక, బంగారం చెయ్యడం చేతగాక, చివరికి "పదిమందీ" కలిసి ఒక కాగితాన్ని సృష్టించాలనీ, దాన్ని ఏకగ్రీవంగా బంగారంగా చెలామణీ చెయ్యదలచామనీ ప్రకటిస్తున్నారు తక్కిన వాళ్ళంతా సరే అని తలకాయ ఆడిస్తే ఆ కాగితమే బంగారమై పూరుకుంటుంది బంగారంతోనేగాని తీరని కొన్ని కార్యాలు ఈ కాగితం బంగారంతో తీర్చుకోవచ్చు లేని బంగారంకంటె కాగితం బంగారం మెరుగు గదా!

లోకంలో విశ్వామిత్ర సృష్టిలాగే 'కాకి' సృష్టి కూడా కొంత వ్యాపించింది కాకి బంగారం తెలుగుదేశంలో సుప్రసిద్ధం ఇది ఒక అద్భుత విశేషం చెరకుకాని చెరకు—కాకిచెరకు అది ఒక రకం గడ్డి కలువకాని కలువ—కాకి కలువ అది అల్లిపువ్వు ఇలాగే కాకిదొండ, కాకి నేరేడు మొదలైనవెన్నో మన భాషలో చేరుకున్నాయి 'కాకి యెంగిలి' అని ఇంకోటి కూడా వాడకలో ఉంది. ఏదన్నా ఒక వస్తువుని గుడ్డ చుట్టబెట్టి ధారాళమైన దంతక్షతాలు వెయ్యకుండా కొరకవలిస్తే అది యెంగిలి కాదుట కాకి యెంగిలి చిన్నతనంలో ఆక్షేపణీయంకాదు అట్లాగే ఒక వస్తువుకి నకిలీ రూపం తయారుచేసి, దాన్ని "కాకి" కి తగిలించి చెబితే నలుగురికీ అర్థమైపోతుంది ఆవిధంగా చూస్తే ఇప్పుడు లోకం సృష్టించబోతూన్న కాగితం బంగారానికి కాకితనం చాలావుంది కనుక కాకి బంగారమని నామధేయం చెయ్యడం చాలా సమంజసంగా ఉండేదేమో! కాని అసలైన కాకి బంగారమనేది మరొకటి ఉండడంవల్ల ఇది చెల్లదు అంచాత అది కాకి(తం) బంగారంగానే చెలామణి కావాలి

ఈ కాగితపు బంగారాన్ని (Paper gold) కరిగించి ఆభరణాలు తయారు చేసుకుందికి వీల్లేదు వ్యక్తులెవ్వరికీ ఉపయోగపడేది కూడా కాదు. బంగారానికి ఉన్న స్థానాన్ని ఆక్రమించగలిగిన శక్తి గలది అసలే కాదు బంగారం అట్లా యథాస్థానంలో ఉండగా, కొన్ని ప్రత్యేక అవసరాలలో అంతర్జాతీయ వ్యవహారాల్లో, బంగారానికి బదులుగా ఈ కాగితపు బంగారాన్ని చెల్లించి తాత్కాలికంగా పని జరుపుకోవచ్చు అంతర్జాతీయ ద్రవ్యనిధి సృష్టించబోయే ఈ కాగితాలు ఆ నిధి సభ్యులకు ఒక నిర్ణయానుక్రమణంగా లభిస్తాయి అవి ప్రత్యేక వినియోగాధికారాలు (Special Drawing Rights) ఈ అధికార పత్రాలు బంగారు పత్రాలు కావు భారతదేశంలోని బంగారు బాండ్లుకాని, తత్సదృశమైనవి కాని కావు ఒక దేశం ఈ పత్రాల ద్వారా తన తాత్కాలిక వైదేశిక విపత్తులను దాటుకోవచ్చు ఐతే, బంగారానికీ, ఈ అధికారలకీ సంబంధమేమిటి? అంటే బంగారానికి బదులు ఈ పత్రాలు చెల్లించి ఋణ విముక్తి పొందవచ్చు అంతర్జాతీయంగా అంగీకరింపబడే ద్రవ్యం ఎట్లా చూచినా బంగారంతప్ప మరేదీ లేదు ఈ అధికారపత్రాలు బంగారమే అని వాని వెనక అంతర్జాతీయ ద్రవ్యనిధి ఘంటాపథంగా ఘోషిస్తూ ఉంటుంది సర్వథా మద్దత్తు చేస్తుంది పూచీ పడుతుంది అందరూ ఆ కాగితాలనే కళ్ళకద్దుకుని బంగారంలా చూసుకుంటారు "పదుగురాడుమాట పాటియై ధరజెల్లు" అని, అదే కాగితపు బంగారం. 'పదుగురు' అంటే మామూలుగా మాటవరసకు చెప్పిన పదుగురుకాదు వారంతా పది దేశాల ప్రముఖులు నాలుగేళ్ళ గా చర్చలు సాగించి, సావధానంగా ప్రపంచ ద్రవ్యావసరాలు తర్జన భర్జనచేసి 1967 ఆగష్టు 26 వ తేదీన, రయో డి జనీరోలో ఒక అంగీకారానికి వచ్చారు ఆ దేశాలు పది—అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీ, జపాను, బెల్జియం, నెదర్లాండ్సు, స్వీడన్, ఇటలీ, కెనడా ఈ ధనిక దేశాల సంఘానికి పశ్చిమ జర్మనీ ఆర్థికమంత్రి కారల్ షిల్లర్ గత అక్టోబరులో అధ్యక్షుడుగా ఎన్నికైనాడు ప్రపంచంలో ఈ పదిమందీ ఏది చెబితే అది పాటి

నేతికి బదులు డాల్డా వాడినట్లు అసలు బంగారానికి బదులు ఇంకో వస్తువేమిటి? అసలు దాన్నే ఉపయోగించకూడదా అంటే, అసలు బంగారం చాలినంత లేదు చాలదంటే అన్ని దేశాలకూ చేతులో చాలినంతలేదు లేదంటే ప్రపంచంలో అసలు లేదని కూడా కాదు ప్రజలకు కావలసినంత తిండీ, గుడ్డా లేదంటే, దుకాణాల్లో లేదనికాదుగా! అట్లాగే కొన్నిదేశాలకు ఖజానాలు నిండుగా వుంటే, మరికొన్నింటికి ఖజానాలు నిండుకున్నాయి బలంగా ఉన్నదేశాలు పద్దైతే, ఐక్యవి సుమారు తొంభై స్వర్ణబలంలో మొదట చెప్పతగ్గవి అమెరికా, దక్షిణాఫ్రికాలు. అమెరికా సంయుక్త రాష్ట్రాల బంగారం నిలువలు ఈ 1969 జనవరి మొదటి తేదీకి 10,892 మిలియనుల డాలర్లకు దిగజారిపోయినా, ప్రపంచంలో అగ్రస్థానంలోనే ఉంది గత 1968 జనవరిలోకంటె 1,173 మిలియన్లు తగ్గింది పోయిన దశాబ్దం మొత్తంమీద లెక్క వేసుకుంటే 1958 నుండి సుమారు 10,000 మిలియన్ల డాలర్లు పలాయనమైనట్లు కనబడుతుంది. ఇటీవల ఈ పలాయన త్వరగా బాగా తగ్గిందనే చెప్పాలి 1968 మే నెల తరవాత కొంచెం నిలువ పెరిగినట్లు కూడా తెలుస్తూంది అప్పుడు 10,468 మిలియన్ల స్థితికి కూడా వెళ్ళింది కాని మళ్ళీ కొంత సుముఖమైనట్లు స్పష్టమైంది. దీనికి ముఖ్య కారణం 1968 మార్చి—ఏప్రిల్ నెలల్లో తీసుకున్న చర్యలే కావచ్చు ఆ మార్చినెల 15 వ తేదీనుండి ఒక పక్షం రోజులపాటు స్వర్ణ విపణిలో చాలా అల్లకల్లోలాలు చెలరేగాయి ఔన్సు 35 డాలర్లకు కొనవలసిన బంగారాన్ని 46 40 డాలర్ల వరకూ ధర పెంచి, ఎగబడ్డారు చివరకు స్వర్ణ కూటం (Gold Pool) సభ్యులంతా 1960 నుండి పని చేస్తున్న తమ కూటం ఇక అనవసరమనే నిర్ణయానికి వచ్చారు ఇదివరకే సహాయ నిరాకరణ ప్రారంభించిన ఫ్రాన్సు కాక తక్కినవి—అమెరికా, ఇంగ్లాండు, ఇటలీ, జర్మనీ, నెదర్లాండ్సు, బెల్జియం, స్విట్జర్లాండు; అంతటితో వారు స్వర్ణ వ్యాపారానికి స్వస్తిచెప్పి ఎవరి దారిన వారు పోయారు అమెరికా ఫెడరల్ రిజర్వు సంస్థ అధ్యక్షుడు విలియమ్ మెక్ మార్టిన్ బంగారం అమ్మకాన్ని గురించి క్రొత్త నిర్ణయాలు ప్రకటించడం కూడా వెంటనే జరిగింది నూతన విధానం ప్రకారం అమెరికాలో బంగారం ఇదివరకటిలాగే ధారాళంగా ఔన్సు 35 డాలర్ల రేటున ఎవరైనాసరే కొనుక్కోవడానికి వీల్లేకుండా చేశారు అంతర్జాతీయ ద్రవ్య వ్యవహారాలకోసం మాత్రమే బంగారం ఉపయోగించే అవసరం ఉండాలని నిర్ణయించారు దానికిమాత్రం ఇదివరకటిలాగే ఔన్సుకు 35 డాలర్ల రేటు వర్తిస్తుంది ఆ రేటు 1934 నుండి అమెరికా అనుసరిస్తున్న రేటు. ఇకముందు కూడా అదే రేటు అమల్లో ఉంటుందనీ, మార్పు జరగబోదనీ అధ్యక్షుడు నిక్సన్ తరఫున డేవిడ్ కెన్నడీకూడా మొన్న జనవరి 28 వ తేదీన ప్రకటన

చేశారు. ఇక వ్యక్తిగతంగా బంగారం కావలసినవారు ఏ ధరకైనా కొనుక్కో వచ్చు స్వేచ్ఛగా ధరను వదిలేసినా, మహాపోతే 40 డాలర్ల మేరకు స్థిరపడ వచ్చునని అభిప్రాయపడ్డారు 42, 43 అయితే ఎక్కువ! కాని ఈ వ్యాసం తయారవుతూన్ననాడు 42 75 వరకూ ధర పెరిగి, కొనేవాళ్ల దుడుకుతనం లండన్‌లో ఇంకా జాస్తీ అవుతూందని వార్త బంగారానికి ఇట్లా రెండు ధరలు ఏర్పరచడాన్ని ద్వికక్ష్య విధానం (Two Tier System) అంటున్నారు.

అమ్మకం విషయంలో తీసుకున్న చర్య అట్లా ఉండగా, కొనడం విష యంలో కూడా మార్టిన్ ప్రకటనలో ఒక ఖచ్చితమైన విధానం ఉంది ఇక ముందు బజార్లో బంగారం కొనవలసిన పనిలేదని నిర్ణయించారు ఇప్పుడు సువర్ణ కూట రాష్ట్రాలలో ఉన్న బంగారం సరిపోతుందట. ఇంతకీ కావలస్తే కాగితపు బంగారం రానే వస్తుంది ఈ కారణం వల్ల బంగారపు బజార్లలో మాంద్యం మొదట్లో కొంతవరకూ ఏర్పడింది సువర్ణ కూట దేశాలు స్వేచ్ఛా స్వర్ణ వ్యాపారంలో జోక్యం చేసుకోవు— బజారు అవసరాలకి బంగారం సప్లయి చెయ్యవు అవే కాకుండా జపాను, కెనడాలు కూడా బహిరంగమైన బంగారు బజారుకు దూరంగా ఉండాలని అంగీకరించాయి. ప్రెస్సు మాత్రం ఏ మాటా చెప్పుకోలేదు సంయుక్త రాష్ట్రాల స్వర్ణఖనులనుండి ఉత్పాదితమైన బంగా రానికి కూడా ఆ దేశపు ఖజానాలో ప్రవేశించే అవకాశం లేదు. ఇకముందు లైసెన్సు పొందినప్పటికీ ఎలక్ట్రానిక్ పరిశ్రమలకూ, దంత వైద్యానికీ, ఆభర ణాల తయారీకి, తదితరావసరాలకూ ప్రభుత్వపరంగా బంగారం సరఫరా బందు చేశారు ఈ చర్యలన్నిటి వలనా, ముఖ్యంగా దెబ్బతింటూన్నది దక్షిణాఫ్రికా.

దక్షిణాఫ్రికాని ఆర్థికంగా రాజకీయంగా చాలదేశాలు ఇదివరకే వెలి వేశాయి అంతర్జాతీయ సమావేశాల్లో పంక్తిబాహ్యంగా పరిగణించాయి కాని, ఆ దేశానికి దైవం చాలా అనుకూలంగా ఉంది ధారావాహికంగా స్వర్ణోత్పత్తి చెయ్య గల అఖండమైన ఖని సంపత్తి వుంది ఏడాదికి సుమారు 1000 మిలియనుల డాలర్ల బంగారం పుట్టించగలదు ఒక బంగారు గనిని ఉత్పాదక స్థితికి తేవా లంటే సుమారు 100 మి డాలర్లు ఖర్చవుతుందిట ప్రపంచంలో ప్రతి యేటా స్వర్ణవిపణిలో ప్రత్యక్షమయే బంగారంలో 70 శాతం దక్షిణాఫ్రికా జన్యం అక్కడ ఈనాడు శుద్ధిపరచబడుతూన్న బంగారం రోజుకు 3 5 మి డాలర్ల విలువ మేరకు ఉంటుంది! దాదాపు అంతటినీ లండన్‌కు పంపుతూ వుం టారు దీర్ఘకాలికములైన ఒప్పందాల మీద ప్రత్యేక నౌకాదళం ఈ పనికోసం ఏర్పాటు చెయ్యబడి వుంది ఈవిధంగా లండన్ ప్రపంచంలో అత్యంత విస్తార మైన సువర్ణ విపణిగా రూపొందింది ఇది 1968 మార్చి 14 వరకూ నిర్వి ఘ్నంగా సాగింది అమెరికా సలహామీద ఆ విపణి ఏప్రిల్ 1 వ తేదీవరకు మూసివేయబడింది తరువాత క్రొత్తవిధానం అమల్లోకి వచ్చింది

లండన్‌లో ఐదుగురు ప్రఖ్యాత సువర్ణ వ్యాపారు లున్నారు దక్షిణాఫ్రికా నుంచి వచ్చిన బంగారమంతా వారి చేతుల మీదనే నడుస్తుంది అందులో ఒక ప్రసిద్ధ వ్యాపార సంస్థ ఎన్ ఎమ్ రాత్స్‌చైల్డ్ అండ్ సన్స్ ద్వారా బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండ్ తనకు కావలసిన బంగారాన్ని కొనుక్కుంటూ ఉంటుంది ద్వికక్ష్య విధానం అమల్లోకి రాకపూర్వం కూడా బంగారానికి బజారు ధర నిర్ణయం చెయ్యాలంటే వ్యాపార ప్రముఖ పంచకం ప్రతిదినమూ ఉదయం సమావేశమై ఒక నిర్ణయానికి వచ్చేది ఎవరి తరఫున ఎంత కొనాలో వారికి అదివరకే ఒక నిశ్చితాభిప్రాయం సిద్ధంగా ఉంటుంది ధర ఏదంటే వారి వ్యాపారానికి భంగం రాదో ఆ ధరను కాసేపు క్రిందా మీద వేసి, చివరకు లాలోచీ పడి వప్పు కుంటారు అదే ఆనాటి బంగారం ధర మర్నాడు గిరాకీ ఎక్కువైతే మరో ధర నిర్ణయాత్పూర్వం ఆ వ్యాపారులను బంగారం సప్లయి చెయ్యమని కోరిన వారికి మాత్రమే ఆనాటి ధర వర్తిస్తుంది ఆ ధర ప్రకారం రెండు వ్యాపార దినాల అనంతరం బంగారాన్ని లండన్‌లో అందజేస్తారు వారు రెండో రోజునే పైకం చెల్లించి ఉండాలి ఇట్లా పైకం చెల్లించి లండన్ బ్యాంకులు విదేశా లలో గాని స్వదేశంలోగాని ఉన్న వ్యాపారుల కోసమో సంస్థల కోసమో బంగా రాన్ని ఖరీదు చేస్తాయి అట్లా కొనేటప్పుడు వేరే ఏ ప్రదేశానికైనా పంపమని కూడా కోరవచ్చు కొనుగోలు జరిగిన తరువాత అధిక భాగం బంగారం విమా నాల ద్వారా వెళ్లిపోవడం ఆచారం. విమానాలలో ఎక్కించే బంగారపు పార్సెల్ మీద "లోహం" అనే గుర్తిస్తారట. పైలట్‌కి అప్పగించిన జాబితాలో మాత్రం బంగారమని స్పష్టంగా వ్రాస్తారుట.

అసలు బంగారం కొనడానికి సిద్ధపడే వాళ్లలో రెండు రకాలు ఆశయా లుంటాయి. బంగారానికి గాని ధనానికి గాని విలువ మారుతూ ఉన్నప్పుడల్లా వీలైనంత లాభం వచ్చేవిధంగా తాపత్రయ పడేవారు ఒక రకం. ఇంకొక రకం కేవలం రాశీకృత సువర్ణాలానులు ఈ రెండు పద్ధతుల వలనా బంగారానికి అనవసరమైన గిరాకీ పెరిగి చాలా ఇబ్బందులకు దారితీస్తుంది. రాశిప్రియులు తమ వద్ద నే వీలయినంత మట్టుకు బంగారాన్ని దాచుకుంటారు. వాళ్లకి భయం హెచ్చు వారి కంటె ప్రమాదకరమైన చర్యలు తలపెట్టేవారు Specu lators. లోకంలో వచ్చే చిక్కు వీరివల్లనే. ధరల గమనాన్ని ఉపయోగించు కుని లాభాలు సుళువుగా కొట్టేసేవారు వీరు. ఒక్కొక్కప్పుడు తమకు వీలయిన ధరనే బజారులో నెలకొల్పగలిగిన బుద్ధిశాలురు. ఏదో విధంగా లాభం తియ్యడమే వీరి ధ్యేయం బంగారం ఎక్కడ నిలువచేసినా వీరికి అంతగా పట్టింపు లేదు. అవసరమైన చోటికి అర్జంటుగా తరలించగలిగితే చాలు ప్రపంచంలో ఎప్పుడు కరెన్సీ విలువలు మారుతాయా, ఎవరికి డివాల్యుయేషను అనే దుర్గతి సంభ విస్తుందా అని తెల్లవారి లేచి దశ దిక్కులూ పరికిస్తూ ఉంటారు. సమయం చూసి అక్కడ వ్యాపారం చేసి లాభాలు కొడతారు. విక్రీతమైన బంగారంలో 60 శాతం సామాన్యంగా లండన్ విడిచి వెళ్లిపోతుంది కాని స్పెక్యులేషను జాస్తీ అయితే 80 శాతం దాకా కూడా పోవచ్చు.

బంగారాన్ని ఎవరు వద్దంటారు? చీకటి బజార్లలో విశ్వాంగట్టిన ధనవణి తులు ఏ ధరకైనా కొనడానికి సిద్ధంగా ఉంటారు ఒక్క భారతదేశంలోనే బంగారం మీద మోజుఉందని అనడం పొరపాటు ఉన్నా ప్రయోజన మేమిటి? ఏ కాస్త బంగారం దేశంలో ప్రవేశం సంపాదించినా అది దొంగచాటుగా జరగ వలసిందే అన్నిదారులూ 1947 నుంచే బందు చేశారు ఇంకా ఫ్రెంచివారి కున్నంత సువర్ణ ప్రీతి భారతీయులకు మినహా మరెవ్వరికీ లేదేమో! అమెరి కనులు కూడా సువర్ణప్రియులు వారు కూడా [illegible] గతంగా రాసులు పెంచినవా రున్నారు విదేశాల్లో దాస్తూ ఉంటారు 19[illegible] తరువాత ఈ మార్గం నిషేధింపబడినా వారు మానుకో లేదు లండన్‌లో బంగారం కొనడానికి ఎగబడే వారు ముఖ్యంగా అరేబియా నుంచి దిగబడే తైలవ్యాపారులు తైలసిక్తములైన వారి లాభాలు వారికే లెక్క తెలియనివి జ్యూరిక్ బ్యాంకుల ద్వారా లండన్ బంగారం పంపిణీ అయిపోతుంది 1968 మార్చిలో బజారు తాత్కాలికంగా మూతపడేలోగా, లండన్‌లో విక్రీతమైన బంగారంలో సుమారు 75 శాతం జ్యూరిక్‌కు చేరవెయ్యడం జరిగింది అరబ్బీవ్యాపారులు బీరుట్ ద్వారా దీన్ని తెప్పించు కుంటారు స్విట్జర్లండులో కూడా ఏవిధమైన చర్చలూ లేకుండా, మామూ లుగా చాక్లెట్లు కొనుక్కున్నట్లు, డాలర్లకు బంగారం కొనుక్కోవచ్చునట. ప్రయాణికుల చెక్కులు కూడా నిరభ్యంతరంగా స్వీకరిస్తారట. ఇక లండన్, జ్యూరిక్, బీరుట్‌ల తరువాత చెప్పుకోదగింది హాంగ్‌కాంగ్ అక్కడ కూడా అధి కార రీత్యా స్వేచ్ఛా సువర్ణ వ్యాపారం నిషిద్ధమే ఐనా ప్రభుత్వోద్యోగులు కష్ట సుఖాలు తెలిసిన వాళ్లు! గుట్టుగా విమానాశ్రయంనుంచి సరాసరి నౌకాశ్ర యానికి స్వర్ణపేటికలన్నీ నిశ్శబ్దంగా తరలిపోతాయి చైనా తెప్పల్లో దడదడా పడవేసి, మకావోలాంటి రహస్య స్థలాలకు తీసుకుపోయి, బంగారపు కడ్డీలకు లండన్ రూపం మార్చి, రకరకాల చిన్న సైజుల్లో, క్రొత్త అవతారాల్లో తిరిగి హాంగ్‌కాంగ్ చేర్చుతారు ఒకసారి నడిబజార్లో పడ్డాక అది దర్జాగా వ్యాపారంలో నిలుస్తుంది భారతదేశంలోలాగ బంగారం కంట్రోలు లేదుగా! జపానువారు ఆ బంగారంలో చాలా భాగం తమ దేశానికి చేర్చుకుంటారు ఎర్రచైనాలో చేరేది స్వల్పం. చైనా తన అవసరాలు లండన్‌లోనే తీర్చుకుంటుంది ప్రపంచంలో కమ్యూనిస్టేతర దేశాల్లో ఉన్న గనులనుండి వస్తున్న బంగారం సాలీనా 1500మి. డాలర్ల విలువ ఉంటుందని అంచనా పారిశ్రామిక అవసరాలకూ వగైరా అంతర్జాతీయావసరాలకూ సుమారు 750మి పోగా, ఆరబ్, భారత, ఫ్రెంచి మొదలైన దేశాల ప్రజల అవ్వోదంకోసం 350 మి డాలర్ల బంగారం కావాలి. ఇక మిగిలిన 400 మి డాలర్ల బంగారం స్పెక్యులేషను వారికి సామాన్యంగా సరిపోవాలి. ఇందులో దేనికి గిరాకీ హెచ్చినా అల్లకల్లోలం బయలుదేరుతుంది.

బంగారానికి దొంగరేట్లూ, స్పెక్యులేషను ప్రమాదాలూ తప్పిపోవాలంటే ఔన్సు 35 డాలర్ల నుంచి ద్విగుణీకృతం చెయ్యాలి! లేకపోతే మధ్య మధ్య ప్రపంచంలో ఈ గడబిడ తప్పదు. సరిగ్గా ఈనాడు (1969 ఫిబ్రవరి నెలలో) లండన్‌లో మళ్లీ బంగారం బజారులో ఒక వడిదుడుకు ప్రారంభమైంది ఇది తాత్కాలికం

బంగారానికి ఇప్పటి డాలరు ధర పెంచాలా అక్కరలేదా అనేది పెద్ద సమస్య. ఇదమిత్థంగా నిర్ణయించి చెప్పడానికి ప్రఖ్యాత విత్తవిద్యానిపుణులు కూడా తటపటాయిస్తున్నారు. ఒక రెవరైనా ఏదో తేల్చి చెబితే మిగతా వాళ్లంతా దుయ్యబట్టుకుందికి సిద్ధంగా ఉన్నారు. సురక్షితమైన జవాబు చెప్పాలంటే, ధర పెంచకూడదు, అని నిష్కర్షగా చెప్పాలి. భవిష్యత్తులో అంతర్జాతీయ ద్రవ్యవిధానమంతా ఈ సమస్యను చక్కబెట్టడంమీదనే ఆధారపడుతుంది యూరప్‌లో డాలర్లు బాగా విలవ చేశారు అవి బంగారాన్ని కోరుతూ వుంటాయి. ఇంతవరకూ ఆ డాలర్లు పెట్టి బంగారం కొనడానికి ఏ అభ్యంతరాలూ ఉండేవికావు ఇట్లాఅన్ని డాలర్లకూ బదులు అమెరికా 35 డాలర్లు రేటున బంగారం చెల్లించడం చాలా కష్టం అప్పుడే బంగారం చాలా వరకు ఖర్చయిపోయింది కాబట్టి ధర మార్చినట్టయితే అమెరికాలో బంగారం మీద వత్తిడి తగ్గిపోతుంది. ధర పెంచడానికి ఇది ఒక కారణం అమెరికా ధర 1934లో ఏర్పడ్డ ధర అన్ని వస్తువులకూ ధర మారింది గనుక, బంగారానికి మాత్రం ప్రాత ధర నిలబెట్టడం దేనికి? మార్చి పారేయ్యండి, అంటున్నారు. ఇది మరో కారణం. ప్రపంచ దేశాలన్నింటికీ ఒక వాంఛ బలంగా ఉంటుంది. వీలయినంత బంగారాన్ని గాని, విదేశద్రవ్యాన్నిగాని నిలువచెయ్యాలని తాపత్రయం తప్పకుండా పెరుగుతుంది డాలరు కూడా బంగారం లాంటిది కనుక డాలర్లే దాచుకుందామని కొందరు తృప్తిపడతారు కాని బంగారం ఏనాటికైనా ఉత్కృష్టం. నిక్షేపం వంటిది డాలర్లకు బంగారం దొరుకుతూ ఉంటే, బంగారమే దాచకూడదా! ఎదురుగా ఉన్న అవకాశాన్ని ఉపయోగించుకోకుండా ఉపేక్షిస్తే ముందు ముందు ఎన్ని చిక్కులు వస్తాయో అని అనుమానించి బంగారం కొనేవారుంటున్నారు ఈ వాంఛ అమెరికాకు ప్రాణ సంకటం కలిగిస్తోంది ఒక్కొక్క తరంలో ఒక్కొక్కసారి బంగారం ధర పెంచుతూ ఉంటే కొందరికి బాగుంటుంది బంగారంగల దేశాలు తమ నిక్షిప్తాల విలువను సునాయాసంగా పెంచుకుంటాయి దానివల్ల ఆ దేశాలకు ఇతోధిక విత్తస్వాస్థ్యం కనబడుతుంది అందుకని బంగారం ధర పెరగాలని మరో కారణం కాని ఫెడరల్ రిజర్వు సంస్థ అధ్యక్షుని దృష్ట్యా బంగారం ధర పెంచడం శుద్ధ అనవసరం, అవాంఛనీయం. ధర పెంచడం వల్ల ఎవ్వరికీ ఏలాభం వుండదనీ, అమెరికాకు కూడా నిష్ప్రయోజనమనీ అతని అభిప్రాయం ప్రస్తుత నిక్సన్ ప్రభుత్వవిధానం కూడా ఇప్పటికి ఈ పద్ధతిలోనే నడుస్తోందని ప్రకటన వెలువడింది. బంగారం అసలు అమెరికా వదలివెళ్లవలసిన అవసరం ఎట్లా వస్తోంది? అని ఒక ప్రశ్న వేసుకున్నారు. దీనికి ముఖ్యకారణం బంగారపు ధర తక్కువగా ఉండడమా? అంటే, కాదు అమెరికా అనుసరిస్తోన్న ఆర్థిక విధానం దానికి ప్రముఖ కారణం. ఇదివరకు రెండు దశాబ్దాల క్రితం యుక్తంగావుందని అనుసరించిన పద్ధతి శాశ్వతంగా పనికిరాదు లోక పరిస్థితులు అతి చంచలముగా ఉంటాయి. రాజకీయంగానూ అంతే ఆర్థికంగానూ అంతే లండన్ ఒకప్పుడు రత్నసింహాసనం మీద కూర్చుంది. ప్రపంచంలో విత్తప్రసరణం రక్తప్రసరణంలాగే వుండేది. లండన్ దాని గుండెకాయలాగే ఉండేది ఆరోజులు వెళ్లిపోయాయి. 1948లో అమెరికన్ డాలర్ మత్తేభంలాగ సంచరించిన రోజులుకూడా తగ్గుముఖం పట్టాయి బాగున్నరోజున 1948లో మార్షల్ పథకంఅనిఒకటిపెట్టారు. యూరప్‌ల రకరకాల ద్రవ్యం వెదజల్లారు అక్కడ ఆర్థిక వ్యవస్థ పుంజుకునేలాగ చేశారు అమెరికా ద్రవ్యం ఆదేశాల చేతుల్లో ప్రోగుపడింది వారు ఆ డాలర్లను రిజర్వుగా పెట్టుకోవడం బంగారంలోకి మార్చుకోవడం ప్రారంభించారు. సువర్ణ నిక్షేపాలబలంతో విశ్వవిహారం చేసిన డాలరు గజం ఇప్పుడు బాగా ఆలోచించి అడుగులు వేయవలసి వస్తోంది ఫ్రాన్సు అటకాయించి అల్లరి లేవదీస్తోంది. జర్మనీ తళతళలాడుతూ అమెరికన్ మత్తగజానికి కళ్లు మిరుమిట్లు గొలిపి, అడుగుముందుకు వెయ్యనియ్యకుండా వుంది. ఇప్పుడు ధర పెంచితే అమెరికాకు లాభంగా ఉంటుందా, అంటే ఉండవచ్చు. ఇతర దేశాలు తమ మిగులు ద్రవ్యాలతో అమెరికాతో వ్యాపారం చేస్తే ఆలాభం తగినంత కనబడవచ్చు యూరప్‌రాజ్యాల చెల్లింపుల మిగుళ్లు అనుకూలంగానూ, అమెరికాలో ప్రతికూలంగానూ పెరుగుతూన్నన్నాళ్లూ ఈ లాభం అంతగా ఉండదు. నిజమైన సత్ఫలితం కావాలంటే అమెరికా వెనుకటి ఏనుగుఖర్చు తగ్గించి, తమ డాలర్లు లోకంమీద విపరీతంగా వ్యాపించకుండా చూసుకోవాలి. వియత్‌నామ్ విధానం లాంటివి చాలా ప్రతిబంధకాలే ఆపని కొంతవరకూ ప్రారంభించారు. కాని ఇతోధికంగా సాగాలి. అంతేకాని బంగారం ధర పెరగడం వల్ల ఇంతకాలం నుంచి వస్తూన్న పద్ధతిని తారుమారు చెయ్యడం తప్ప పెద్ద పెట్టున ఉపయోగం ఉండదు డాలరు విలువ తగ్గించడం వల్ల అన్ని దేశాలతోబాటు అమెరికా గర్వం కూడా దిగజారిపోతుంది ప్రపంచంలో నేడు ఆధారద్రవ్యంగా పరిగణింపబడుతూన్న డాలరుకు పరపతి తరుగుతుంది అప్పుడు ప్రపంచంలో రెండు పక్షాలు ఏర్పాటు కావచ్చు. డాలరును తలదాల్చేవి డాలర్ కూటంగానూ, బంగారంతోనే వ్యవహారం చేసేవి. స్వర్ణ కూటంగానూ విభజన పొందే అవకాశాలున్నాయి. అందుచే అమెరికా బంగారపు ధర మార్చడానికి సుముఖంగా లేదు కాని బంగారపు బజార్లో మొన్న ఫిబ్రవరి నెలలో వచ్చిన కలవరం చూస్తే కొన్ని విపరీతాలు ఇంకా ఎప్పుడైనా రావచ్చునని తోస్తుంది అవి వెంటనే రావచ్చు లేదా కొంతకాలంపోయాక సంభవించవచ్చు. ధర పెరగడానికి అసాధారణమైన పరిస్థితులు లేకపోయినా, ధర పెరుగుతూందంటే, బంగారానికి ధర పెంచితేనే గాని పూరుకోని వర్గాలు తీవ్రతరమవుతున్నాయన్నమాట.

వ్యక్తులకు బంగారంమీద ఉండే మోజు బంగారంతోనే కాని తీరదు కాని దేశాలకు బంగారంవలె అంగీకరింపబడేది ఏదైనా చాలు అందుచేత అన్ని దేశాలకూ అంగీకార్యమైన కాగితపు బంగారం సృష్టింపబడడం ఎంతో వాంఛనీయం ఈ విచిత్ర సృష్టి వల్ల ప్రపంచంలో బంగారానికి గల స్థానం తగ్గడానికి అవకాశంలేదు కాని బంగారం మీద అత్యంతంగా ఆధారపడ వలసిన అవసరం పోతుంది కాగితం బంగారం అంటే అసలు బంగారానికి ప్రత్యామ్నాయంగా వాడుకుందికి కాదు. దానికి ప్రతి రూపమూ కాదు కాని ప్రతిమానంగ ఉపయోగించవచ్చు అదనంగా ఇదికూడా వుంటుంది. బంగారం ధర పెరిగితే బంగారం ఉత్పత్తిచేసే దక్షిణాఫ్రికాలాంటి దేశానికిబ్రహ్మాండమైన సంతోషం. కాగితపు బంగారం సృష్టిస్తే యావత్ప్రపంచానికీ సౌఖ్యం

ప్రపంచ వ్యాపారం సంవత్సరానికి సుమారు 10 శాతంపెరుగుతూంది. అంటే అంతర్జాతీయద్రవ్యనిధి రూపొందిన తరువాత సుమారు ద్విగుణీకృతమైందని అంగీకరించవచ్చు అందుకు తగినంతగా అంతర్జాతీయద్రవ్యత (International Liquidity) పెరగలేదు. అది ఏడాదికి 3 శాతం మాత్రమే వృద్ధి పొందినట్లు లెక్కవేయబడుతూంది రిజర్వు ద్రవ్యాల నిలువలూ, బంగారపు నిలువలూ చాలా మందంగా వృద్ధిపొందుతున్నాయి. అవతల వ్యాపారపు-టురుకుతనం జాస్తిగా పెరుగుతూ వుంటే ఈ రెండింటికీ సామరస్యం కుదరడంలేదు. దీనివల్ల అంతర్జాతీయ ద్రవ్యతలో అనేక అగచాట్లూ, గడ్డు సమస్యలూ సిద్ధమవుతున్నాయి ఉత్పాదితమైన బంగారమంతా అంతర్జాతీయ ద్రవ్యతకు పనికివస్తే ఈ చిక్కు తప్పిఉండేది. గనులనించి బయటపడ్డ బంగారంలో సుమారు 60—65 శాతం ద్రవ్యేతర ప్రయోజనాలకు పోతూంది దీన్ని అరికట్టడం కష్టసాధ్యం. ఏ విధంగా చూచినా అంతర్జాతీయ ద్రవ్యనిధి సభ్యుల రిజర్వులు తగ్గుముఖంలోనే ఉంటున్నాయి. 1968 సం. రంలో తొలిమూడు నెలల్లోనూ 100 మి డాలర్లు తగ్గాయట ముఖ్యంగా అమెరికా, ఆస్ట్రియా, ఫ్రాన్సు, నెదర్లండ్స్, ఇటలీ, స్విట్జర్లాండ్ దేశాల్లో ఈ తగ్గుదల భారీఎత్తున కనబడినట్లు వార్తలు ఈ అంతర్జాతీయ ద్రవ్యతలో కలిగిన సమస్యలుకూడా సర్దుకోవాలంటే కాగితపు బంగారం చాలా ఉపయోగకరంగా ఉంటుంది

ఇట్లా కాగితపు బంగారమని వ్యావహారికంగా వర్ణించబడుతూన్న ప్రత్యేక వినియోగాధికారాలను సృష్టించాలనే నిర్ణయం, 1967 సెప్టెంబరులో ద్రవ్యనిధి వార్షిక సమావేశంలో గవర్నర్ల బోర్డులో రయో డి జనీరోలో ఆమోదించబడింది తదనుగుణంగా ద్రవ్యనిధి నిబంధనలలో కావలసిన మార్పులు ప్రతిపాదించబడుతున్నాయి. 1944 జూలై లో బ్రెటన్ వుడ్స్‌లో ప్రప్రథమంగా



వేణుగానలోలుడు !

శ్రీ డి. రామలింగేశ్వరరావు.

44 సభ్యదేశాలచేత సంఘటితం చెయ్యబడి, తరువాత 1946—47లో ఆచరణలో పెట్టబడిన నిబంధనావళికి సవరణలు చెయ్యబోవడం ఇదే తొలిసారి. చాలా దూరదృష్టితో రూపొందించబడిన ద్రవ్యనిధి సిద్ధాంతాలూ నిబంధనలూ అసలు మార్పుచెయ్యవలసిన అవసరమే లేక, వీలు వెంబడిని వివిధ విధాలుగా అర్థం చెప్పుకోదగినవై ఉన్నాయి. ద్రవ్యనిధి కార్యవర్గం వివరంగా రూపొందించి 1968 ఏప్రిల్‌లో సమర్పించిన సవరణ ప్రతిపాదనలు కూడా గవర్నర్ల బోర్డులో ఆమోదించబడ్డాయి. ద్రవ్యనిధిలో సభ్యత్వం ఉన్న 107 దేశాల్లో 80 శాతం ఓట్లు గలవి సుమారు 65. ఈ దేశాల కోటాల మొత్తం కూడా సుమారు ఆ శాతంలో ఉంటుంది. వారు ఈ సవరణలమీద ఆమోదముద్ర వేస్తే కాగితపు బంగారం అమల్లోకి వచ్చేస్తుంది. ఇది బహుశా 1969 సెప్టెంబరులోగా పూర్తికావచ్చు. ద్రవ్యనిధిలో దాదాపు 25 శాతం కోటాగల అమెరికా 1968 జూనులోనే అంగీకారాన్ని ప్రకటితం చేసింది. కొద్ది రోజుల్లో భారత దేశం కూడా ఈ విధానాన్ని పార్లమెంటులో చర్చించి ఆమోదముద్ర వేస్తుంది.

ఇదివరకు అందుబాటులో ఉన్న ద్రవ్యనిధి నిధులు ప్రత్యేక దరఖాస్తు మీద, ఏదేశపు ద్రవ్యం కావలిస్తే ఆ దేశపు ద్రవ్యంలో, వీలునుబట్టి, ద్రవ్య నిధి నిబంధనలకు లోబడి, నిధి యొక్క అంగీకారం ప్రకారం, అప్పుగా, వినియోగించుకోవలసినవి. నిధిచేత అంగీకృతమైన ఋణాల మేరకు అంతర్జాతీయ ద్రవ్యత (Liquidity) పెరుగుతుంది. అప్పులు తీరుతూవుంటే ఆ ద్రవ్యత తగ్గుతూ వుంటుంది. 1968- మార్చి నెలాఖరుకు నిధి సభ్యులమీద మిగిలివున్న ఋణం 4,500 మి. డాలర్లు. సాలీనా ఈ సభ్యులందరికీ ద్రవ్య నిధి సుమారు 2,500 మి. డాలర్లు మాత్రం ఇవ్వగలుగుతుంది. అది చాలదు. నిధి ఇవ్వగలిగే మొత్తంగాని, సభ్యులు పుచ్చుకోగలిగే మొత్తం గాని సభ్యుల కోటాలమీద ఆధారపడి వుంటుంది. ఆ కోటాలు వీలయినంత వరకూ పెంచగా మొత్తం 1968 మార్చి నెలాఖరుకు 21,000 మి. డాలర్లైంది. ఈ మొత్తం చిన్నా పెద్దా కలిపి 107 దేశాల వారిది. వారిశక్తినీ, అవసరాలనీబట్టి, ఈ కోటాలు నియమితమైనాయి. కేవలం 5 మి. డాలర్లు నుంచి 5 వేల మిలియనులు దాటి చెల్లించిన వారు కూడా ఉన్నారు. భారతదేశం చెల్లించినది 570 మిలియను డాలరులు. అప్పుకోసం దరఖాస్తు చెయ్యడం, ద్రవ్యనిధిలో అపేక్షిత ద్రవ్యం ఉండడం, నిధి కార్యవర్గం చేత అంగీకృతి పొందడం, ఆ తరువాతనే ఆ ఋణాన్ని ఉపయోగించడం, తిరిగి నిర్ణీత వ్యవధిలో వడ్డీతోసహా తీర్చుకోవడం, ఇన్ని చిక్కులు పడినా ఆ ద్రవ్యం రిజర్వుగా ఉపయోగపడదు. వ్యాపార రీత్యాగాని, ఇతరత్రాగాని విదేశాలకు చెల్లించవలసిన మొత్తం మిగిలి ఉన్నప్పుడు మాత్రమే ఏ దేశానికైనా ద్రవ్యనిధి సహాయం చేస్తుంది. ఆసరాగా నిలుస్తుంది. అదే ఆసరా పరపతి (Stand by Credit).

క్రొత్తగా వచ్చే కాగితపు బంగారంలో ఈ చిక్కులేమీ ఉండవు. ఒక్కొక్క 'కాగితం' యొక్క బంగారపు విలువ 0.888671 గ్రాములని నిర్ణయింపబడింది. ఈ బంగారానికి ద్రవ్యనిధి హామీ ఇస్తుంది. ఇది సరిగ్గా నేటి డాలరు విలువ. నిధి సభ్యులు తమ అంతర్జాతీయమైన చెల్లింపు సమస్యలను ఈ బంగారంతో తీర్చుకోవచ్చును. డాలర్లు లేవనిగాని, బంగారంలేదనిగాని విచారపడవలసిన పనిలేదు. ఈ ప్రత్యేక వినియోగాధికారాలు ఇదివరకు ఉన్న ద్రవ్యనిధి పరపతిలాగ కఠోరమైన షరతుల క్రింద ఉండవు. ఆ పరపతిని రిజర్వుగా అసలు ఎప్పుడూ ఉపయోగించడానికి వీల్లేదు. ఈ కాగితపు బంగారం కూడా స్వదేశపు రిజర్వును ఇష్టం వచ్చినట్లు మార్చుకోడానికి పనికిరాదు గాని అంతర్జాతీయంగా, సమయానుకూలంగా వినియోగించుకునే రిజర్వుగా, ఉపయోగించుకోవచ్చు. సాలీనా మామూలుగా తటస్థపడే చెల్లింపు మిగుళ్లను సర్దుబాటు చేసుకోవడానికి విరివిగా ధారాళంగా ఉపయోగించుకోవచ్చు.

కాగితపు బంగారం ఎంత సృష్టిస్తారో ఖచ్చితంగా వివరాలు బయటపడ లేదు. కాని 1,000 మి. డాలర్లకు తగ్గదు, 2,000 కు మించదు అని ఊహించబడుతూంది. ఆ మొత్తం ద్రవ్యనిధి కోటాల నిష్పత్తిలో సభ్యులందరికీ పంచి పెడతారు. భారతదేశానికి సుమారు 3.75 శాతంవరకూ వస్తుంది. ఈ స్వర్ణ పత్రాలను ఒకేఒక్క విదేశ ద్రవ్యంలోనికి మార్చుకోవాలని నిబంధన లేదు. స్వేచ్ఛగా, నిధి ప్రభుత్వం గల ఏ దేశపు ద్రవ్యంలోనికైనా, వీలు ప్రకారం మార్చుకోవచ్చును. ఉదాహరణకు మన దేశానికి 100 మి. డాలర్ల కాగితపు బంగారం లభించినట్లయితే, అందులో 50 మి. లతో డాలరులూ, 25 మి.లతో పౌనులు, 10 మి. లతో మార్కులూ, మరో 10 మి. లతో ఫ్రాంకులూ, 5 మి.లతో యెన్నులూ ఇట్లా తెచ్చుకుని చెల్లింపుల మిగుళ్ల తెగతెంపులు చేసుకోవచ్చు. ద్రవ్యనిధి ప్రమేయం లేకుండా నేరుగా ఏ దేశంతోనైనా ఈ పత్రాలను ఉపయోగించవచ్చు. ప్రతిదేశమూ ఈ కాగితపు బంగారాన్ని సొంత ద్రవ్యంలాగా వాడుకోవచ్చు. ఐనా దీనికి వెనక ద్రవ్యనిధిలో ఏదో నిక్షేపం రిజర్వుగా ఉందనుకోవడం పొరపాటు. అలాంటిదేమీ లేదు. సభ్యులు వేసే ఆమోదముద్రలే ఆ కాగితపు బంగారానికి జీవం. ఆ ముద్ర వేశారంటే ఆ కాగితాలను బంగారం లాగే గౌరవిస్తామని హామీ ఇచ్చినట్లు. అంతే, ద్రవ్యనిధి ఊరికే గాలిలో ఈ కాగితం బంగారాన్ని సృష్టించి, ఈ యంత్రం తనుకుతాను పనిచేసుకుపోతూ వుంటే, దూరాన్నుంచి పర్యవేక్షిస్తూ వుంటుందన్న మాట.

ఒకసారి ఈ బంగారం చేతికి వచ్చాక లెక్క ప్రకారం దానితో వ్యవహారం సాగిస్తూ, అదనంగా అవసరమైతేకూడా ద్రవ్యనిధి నుంచి మళ్లీ మరికొంత పుచ్చుకునే అవకాశం కూడా ఉంది. కాని ఇలా అదనంగా కావలిస్తే తన (సొంత) ద్రవ్యాన్ని నిధిలో చెల్లించి ఆ విలువ మేరకు తీసుకోవాలి. అట్లా తీసుకోడానికి కూడా ఒక గరిష్ఠ ప్రమాణం నిర్ణయింపబడింది. తన మొదటి కాగితపుబంగారం ఎంతో దానికి రెండింతలవరకూ మళ్లీ తీసుకోవచ్చు. అంటే ఒక దేశం ఎట్టి పరిస్థితుల్లోనైనా సరే తనకు మొదట ఇవ్వబడినదానికి మూడురెట్లు కంటే ఎక్కువగా తన హస్తగతం చేసుకునే అవకాశం లేదు. కాని మరో షరతుకూడా ఉంది. ఐదేళ్ల కాలంలో మొట్ట మొదట పొందిన కాగితపుబంగారాన్ని పూర్తిగా వినియోగించుకుంటే, అందులో 30 శాతం తిరిగి సంగ్రహించుకోవాలి. అంటే సగటున 70 శాతం కంటే అధికంగా ఏఒక్క సమయంలోనైనా వినియోగించుకోకుండా, ఆ పరిమితిలో అణిగిఉంటే, దానిని తిరిగి పొందడం, దానికోసం అప్పు తీర్చడం తటస్థించదు. దేశాలు దుబారాగా ఈ బంగారం వెచ్చించకుండా అరికట్టాలని ఇది ఒక కట్టుబాటు.

ఈ క్రొత్తవిధానంలో బడుగుదేశాలకుకూడా బలిష్ఠ దేశాలతోబాటు ఒకే రేటున బంగారపు సంభావన లభిస్తుంది. అంతర్జాతీయ రంగంలోని చెల్లింపు మిగుళ్లు వ్యతిరేకంగా తయారై, నానాయాతనా అనుభవిస్తూన్న దేశాలకు బేషరతుగా సువర్ణ సంభావన దొరుకుతూవుంటే, అంతకంటే ముదావహమైన విషయ మేముంటుంది? ఎవరి లక్ష్యమూ లేకుండా, పెద్దపెద్ద రాజ్యాల రాజకీయపు లంకెల్లో చిక్కుకోకుండా, స్వతంత్రంగా ప్రపంచంలో వ్యాపారాలు చేసుకునే అవకాశం కోసం ఎదురుచూస్తున్న దేశాలు, ముఖ్యంగా వర్ధమాన దేశాలు, ఈ కాకి(తం) బంగారానికి హారతి పట్టి ఆహ్వానించడానికి సిద్ధంగా ఉన్నాయి.

# ద్రౌపది - భక్త విదురులు

శ్రీ నేలటూరి రామదాసయ్యంగారు

ఉభయ వేదాంత ప్రవర్తకులు, శ్రీమంతులు కంచి అణ్ణంగరాచార్యుల వారు. 'ప్రతివాది భయంకర' అనియు, 'జగదాచార్య సింహాసనాధిపతి' అనియు వారికి తద్వంశపూర్వులనుండి దిగుచున్నట్టివి అన్వర్థములగు ఇంటిపేరులై యున్నవి. వేద వేదాంత శాస్త్రములందును, ద్రావిడ దివ్య ప్రబంధము లందును శ్రీవైష్ణవుల సొంతములై యని యభిమానింపబడు మోక్షశాస్త్ర సంప్రదాయములందును శ్రీ భాష్య భగవద్విషయములందును వారి పాండితి ఇంత లోతు ఇంత విశాల అని అంతు చెప్ప నలవిపడునది గాదు. ఇకను వట్టి కావ్య నాటకాదులమాట ఒక లెక్కయా? వారు కవి సహృదయ చక్రవర్తులు. వారు పూర్వ దివ్యసూరులు అనుగ్రహించినట్టియు పూర్వాచార్యులు రచించినట్టియు సకల గీర్వాణ ద్రావిడ గ్రంథములను తమ సొంత వ్యాఖ్యానములతో ఎల్లరకు సుగ్రహమగునట్లు లోక మహోపకారముగా ప్రకటించియు ప్రకటించుచును ఉన్నారు. వారి వాక్కునుండియు చేతినుండియు గీర్వాణమునను అరవమునను ఆంధ్రమునను గూడ ఎన్నియో మాస పత్రికలు బహువర్షములుగా తెంపులేక వెలువడుచునేయున్నవి. అందలి ప్రతి యక్షరము గూడ వారి సొంత పలుకును వారి సొంత వ్రాతయునే కాని ఇతరుల దొక్కటియు లేదు. ఇప్పుడు వారికి సాటి పండితుడు గాని కవి గాని ఆచార్యుడుగాని విమర్శకుడు గాని మరెవడును లేడు

వారు 'వైదిక మనోహర' యను తమ గీర్వాణ పత్రికలో నూటనాల్గవ దానియందు 10–4–1959 వ దినమున ఇట్లు ప్రకటించిరి. 'కార్పంగాడు' అని యింటిపేరుగల వేంకటాచార్యులను యాచార్యుల వారొకరు ద్రౌపది ఎప్పుడో ఒకసారి

'పఞ్చ మే పతయః సన్తి, షష్ఠోపి మను రోచతే'

"ఏవురు పతు లున్నారు నాకు. ఆరవవాడును 'సహి' నాకు ఇష్టుడే' అని యన్నదట. దాన ఆమె పాతివ్రత్య భ్రష్టయైన దని దూషించినారట అందులకు అణ్ణంగరాచార్యులవారును "ద్రౌపది అట్లొకసారి యన్నది నిజము కాని, అది స్త్రీజన వాక్ చాపల మాత్ర ప్రకాశకము, వట్టి ఎగతాళిమాట, ఆమె నిజమగు మనోరథముం జెప్పునది కాదు దాన నామె పాతివ్రత్యభ్రష్ట యనుట మహా పాతకము. ఆయన ఎవరో కార్పంగాడు వేంకటాచార్యులట! ఆయునకు మంచి గురు శుశ్రూష యున్నంగదా" అని దినంతు లడిచి, ఆ మహా పాతకము శాంతమగునట్లు నే నిదే ఆమె ప్రభావ మభివర్ణింతును అని 'జయతు జయతు ద్రౌపదీ దివ్యకీర్తి' అని యాశంసించి ద్రౌపదీ ప్రభావ సంగ్రహమని తొడంగినారు.

ద్రౌపది యజ్ఞాగ్ని జన్మ పంచపతి వివాహాది పవిత్రాద్భుతములను వర్ణించి, అంతట ఆమె పడిన క్లేశములం జెప్పం దొడంగి ఆచార్యులవారు తత్ప్రభావ పరిగృహీత చిత్తావేశమున ఇట్లు ఆనతిచ్చినారు. 'దురాత్మా దుశ్శాసన స్తదానీ మేవ అంతఃపురం ప్రవిశ్య సాధ్వీం ద్రౌపదీం కేశేషు ఆకృష్య రాజసభాం బలా దానినాయ లాంచతద్భర్తౄంశ్చ పరిభవితు మిచ్ఛన్ తస్యా శరీరాత్ వసనం ఆచకర్ష స్వకీయే వస్త్రే బలాద్ దుశ్శాసనేన హ్రియమాణే, మనుష్యేషు రక్షకం కమపి సా నాలభత తస్మాత్ హస్తా వుద్యమ్య సాఞ్జలిబన్ధం 'హా కృష్ణ ద్వారకావాస రక్ష మాం శరణాగతామ్' ఇతి సకరుణం భగవన్త మేవ శరణ మభియాతా తస్యా శరీరాత్ తస్మిన్ సమయే అనన్తాని కౌశేయవాసాంసి ఉపర్యుపరి సముత్పన్నాని తాని చ ఆకృష్యాకృష్య దుశ్శాసన శ్శ్రాన్తో భూత్వా భూమౌ పపాత. దుర్మేధా దుర్యోధన స్తు తదానీ మపి సాధ్వ్యాం తస్యాం భగవత్కరుణాయా ప్రసరరీతిం నాజానాత్ .....ధూర్తో దుర్యోధనః సభా మధ్యే సాధ్వీం తాం స్వస్యోరౌ స్థాతు మాహ్వయత్ వీరపత్నీ సా 'వీరాపశద, వీత లజ్జ మేవ త్వదూరౌ స్థాతుం య త్త్వమాహూతవాన్, భీమస్తవోరూ ధ్రువం భఙ్క్ష్యత్. దుష్టో దుశ్శాసనశ్చ స్వకీయేన దగ్ధ హస్తేన మత్కేశాన్ ఆకృష్య వస్త్రం చ మే య దపాహరత్ తస్మా త్తస్య వక్షో భిత్త్వా తద్రుధిరేణ భీమో మమ కేశాన్ సిఞ్చేత్. తావత్పర్యన్తం కేశా న్మే న బన్ధ్నీయామ్' ఇతి సాక్రోశం సా ప్రతిజజ్ఞే" అని.

"దురాత్ముడు దుశ్శాసనుడు అప్పుడే అంతఃపురము ప్రవేశించి సాధ్వియైన ద్రౌపదిని వెండ్రుకలుం బట్టుకొని లాగి రాజసభకు బలవంతముగ తెచ్చెను ఆమెను ఆమె భర్తలను పరిభవింపగోరినవాడై ఆమె యొంటినుండి చీరను లాగెను. . . . . .తన చీర బలవంతముగా దుశ్శాసనునిచే హరింపబడుచుండగా, మనుష్యులయందు రక్షకు నెవ్వని ఆమె పడయుదాయెను అందువలన చేతులెత్తి మోడ్పువట్టి, ఓ కృష్ణ, ద్వారకావాస, శరణాగతను నన్ను రక్షింపవయ్యా అని జాలి పుట్ట దేవుని శరణు జొచ్చినది ఆ సమయమున ఆమె యొంటి నుండి అనంతములై పట్టుచీరలు వెంటవెంటనే ఉత్పన్నములైనవి వానిని ఒలిచి యొలిచి దుశ్శాసనుడు అలసిపోయినవాడై నేలం గూలెను తెలివిమాలినవాడైన దుర్యోధనుడన్ననో అప్పుడును ఆ సాధ్వియెడ భగవంతుని కరుణ ప్రసరించిన రీతిని ఎఱుంగజాలు డాయెను. ధూర్తుడై వాడు సభనడుమ ఆ సాధ్విని తన యూరువునం గూర్చుండ రమ్మని పిలిచెను ఆ వీరపత్ని 'నీచుడా, వీరుడవా నీవు? సిగ్గుమాలియే నన్ను నీ యూరువునం గూర్చుండం బిలిచితివి; గాన భీముడు నీ యూరువులం దప్పక విఱుగుగొట్ట గలడు పో దుష్టుండు దుఃశాసనుండును తన పాడు చేతితో నా వెండ్రుకలు లాగి నా చీరను ఒలిచినాడు గాన వాని ఱొమ్మును పగిల్చి ఆ నెత్తుటితో భీముడు నా వెండ్రుకలను తడుపగలడు పో అంతవఱకు నా వెండ్రుకలను నేను ముడువను' అని తిట్టుచుం బ్రతిన వట్టెను" అని

అట్లట్లు భీముడు చేయగలడని ఈమె తాను ప్రతినవట్టుట ఇదెట్టిది? శపించె నన్నను ఒక తీరుగ నుండునేమో ప్రతిన ఈమె పట్టుటయు దానిని భీముడు తీర్చుటయు! ఈ ప్రతినపట్టుట గాని శపించుట గాని భారతమునం జూపట్టదు ఈ ప్రభావ వర్ణనవశమున ఏమో అనుశాసన మని భారవిని, ఏమో వృకోదర ప్రగల్భోక్తి అని వేణీసంహారమును ఉదాహరించిన గురువర్యులు ఈ ద్రౌపది ప్రతిజ్ఞను వేంకటాచార్యులు లేదన్న పాతివ్రత్యమును మరి మరి యుగ్గడించి, ప్రతిష్ఠించుట మరి యే పురాణమున నే నాటకమున మరి యే దివ్య ప్రబంధముం గాంచి యిట్లు ప్రఖ్యాపించినారో!

కొప్పువట్టి లాగినపుడు గాని చీర లాగి యొలిచినపుడుగాని యా దుండగీని దుడుకునకు నోట నెట్టుకొని రాని యీ ప్రతిన దేవుని కరుణను ముట్టుచీర పోయి పట్టుచీర పుట్టి ఆ యాపద తీరిన యనంతరమా?

మహాభారతమున వ్యాసులు :

తతో దుశ్శాసనో రాజన్
ద్రౌపద్యా వసనం బలాత్
సభామధ్యే సమాక్షిప్య
వ్యపాక్రష్టుం ప్రచక్రమే

ఆకృష్యమాణే వసనే
ద్రౌపద్యా చిన్తితో హరిః
..... .......
ప్రపన్నాం పాహి గోవిన్ద
కురుమధ్యే వసీదతీమ్.
ఆకృష్యమాణె వసనే
ద్రౌపద్యాస్తు విశాంపతే
తద్రూప మపరం వస్త్రం
ప్రాదురాసీ దనేకశః
...........
త దద్భుత తమం లోకే
వీక్ష్య సర్వే మహీభృతః
శశంసుః ద్రౌపదీం తత్ర
కుత్సన్తో ధృతరాష్ట్రజమ్.
శశాప తత్ర భీమస్తు
రాజమధ్యే బృహత్స్వనః
క్రోధా ద్విస్ఫురమాణోష్ఠో
వినిష్పిష్య కరే కరమ్.
ఇదం మే వాక్య మాదధ్వం
క్షత్రియా లోకవాసినః.
.. ........
య ద్యేత దేవ ముక్త్వాహం
న కుర్యాం పృథివీశ్వరాః
పితామహానాం పూర్వేషాం
నాహం గతి మవాప్నుయామ్.
అస్య పాపస్య దుర్బుద్ధేర్
భారతాప సదస్య చ
నాపిబేయం బలా ద్వక్షో
భిత్వా చే ద్రుధిరం యుధి.

ఆంధ్ర భారతమున నన్నయ్య—

ఇది సేయఁగా దని మది విచారింపక
సద్గర్హితుండు దుఃశాసనుండు
నెట్టన ద్రౌపది గట్టిన పుట్టంబు
సభలోన విడ్చె నాశంక లేక.

పాంచాల రాజపుత్రి భయార్తయై యార్తజనశరణ్యుం డైన జగన్నాథు జనార్దనుం దలంచె

యుడుగక యొలువంగఁబడియు ము న్నపనీత
మైన తద్వస్త్రంబు నట్లె వలువ
లలితాంగి జఘన మండలమునఁ బాయక
యొప్పుచున్న నయ్యువిదఁ జూచి
సభ్యు లెల్ల ముదిత సమ్మదులయిరి.

దుశ్శాసనుండు సేసిన యవమానంబు సూచి కోప రసా గ్నియునుం డగుచు దంతసందష్ట దారుణముఖుం డయి యెల్లవారును విన నిట్లనియె.

కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనే
కుల్ సూచుచుండన్ మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు సేసిన ఖలున్
దుశ్శాసనున్ లోక భీ
కరశీలన్ వధియించి తద్విపుల వ
క్షః శైల రక్తౌఘనిర్
ఝర ముర్వీపతి చూచుచుండ నని
నాస్వాదింతు నుగ్రాకృతిన్.

ఇట్లు సేయనైతి నేని బిత్రు పితామహుల గతికిం దప్పినవాఁడ నగుదు ననిన, నతని యతిమానుషంబైన మహావ్యవసాయంబున కద్భుతం బందిరి

"శశాప తత్ర భీమస్తు" భీమసేనుండు ఎల్లవారును విన నిట్లనియె...
అని భీముని ప్రతిజ్ఞ ఘోషింపబడినది; ద్రౌపదిది కాదు

ఇట్లే మరియు మహాభారతమున— ( వ్యాసుఁడు )
కర్ణః ..

అన్యం వృణీష్వ పతి మాశు
యస్మా ద్దాస్యం న లభసి దేవనేన.

................

తద్వై శ్రుత్వా భీమసేనో త్యమర్షీ
భృశం నిశశ్వాస తదార్తరూపః
రాజానుగో ధర్మపాశానుబద్ధో
దహ న్నివైనం క్రోధసంరక్త దృష్టిః

భీమసేనః—

నాహం కుప్యే సూత పుత్రస్య రాజన్
ఏష సత్యం దాసభావం ప్రవిష్టః
కిం విద్విషో వై మా మేతం వ్యాహరేయుః
నాదేవీ స్త్వం య ద్యనయా న్నరేన్ద్ర

వైశంపాయనః—

భీమసేనవచః శ్రుత్వా
రాజా దుర్యోధన స్తదా
యుధిష్ఠిర మువా చేదం
తూష్ణీం భూత మచేతనం
భీమార్జున యమౌ చైవ
స్థితౌ తే నృపశాసనే
ప్రశ్నం బ్రూహి చ కృష్ణాం తాం
అజితాం యది మన్యసే
ఏవ ముక్త్వా తు కౌన్తేయ
మపోహ్య వసనం స్వకమ్ –
స్మయ న్నివైక్ష్య పాఞ్చాలీం
ఐశ్వర్య మదమోహితః
. ...... ....
అభ్యుత్స్మయిత్వా రాధేయం
భీమ మాధర్షయ న్నివ
ద్రౌపద్యాః ప్రేక్షమాణాయాః
సవ్య మూరు మదర్శయత్.
భీమసేన స్త మాలోక్య
నేత్రే ఉత్ఫాల్య లోహితే
ప్రోవాచ రాజమధ్యే తం
సభాం విశ్రావయ న్నివ
పితృభిః సహ సాలోక్యం
మాస్మ గచ్ఛే ద్వృకోదరః
య ద్యేత మూరుం గదయా
న భిద్యాం తే మహాహవే

క్రుద్ధస్య తస్య సర్వేభ్యః
స్రోతోభ్యః పావకార్చిషః
వృక్షస్యేవ వినిశ్చేరుః
కోటరేభ్యః ప్రదహ్యతః.

ఆంధ్ర మహాభారతమున (నన్నయ)

అక్కోమలి పాంచాలిం జూచి నగుచు—
తరుణి, యేపురకంబె నొక్కరుఁడ భర్త
యగుట లగ్గు, జూదంబున నాలి నోటు
పడని వానిఁగా దగు భర్త బడయు మింక
ననుచు రాధేయుఁ డుల్లసమాడు నంత—
అమ్మదితన్ విభీతహరి

ణాక్షిఁ గలావ విభాసి కేశభా
రమ్మున నొప్పుదానిఁ దన
రమ్య పృథూరుతలంబు నెక్కఁగా'
రమ్మని సన్న సేసె ధృత
రాష్ట్ర సుతాగ్రజుఁ డప్డు దాని దూ
రమ్మునఁ జూచి కౌరవ కు
రంగ మృగేంద్రుఁడు భీము డల్కతోన్.

లయసమయ దండధర ని
ర్దయుఁడై ధరణీశు లెల్లఁ దన పలుకులు వి
స్మయ సంభ్రమ భయ సంభృతు
లయి వినుచుండంగ నిట్లు లనియెన్ సభలోన్.

ధరణీ రాజ్య సంపద మదంబునఁ
గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరుదేశమున నుండఁగ
బిల్చిన యుద్ధురాత్ము దు
ర్వార మదీయ బాహుపరివర్తిత
చండ గదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను
నుగ్రరణాంతరంబునన్

ఐనను ద్రౌపది ప్రభావమును జెప్పెదనన్న యుపక్రమమున భారతమునం జెప్పిన దానిం జెప్పుటయు తెన్న యగును తామే తమ విదుర ప్రకరణంలో 'యథా వ్యాసేన ప్రాకాశ్యత' అని చెప్పినారే. ఆ నియమమును ఇందును పాటించరా?

ఇట్లే యుద్ధాన దుఃశాసనుం జంపినయెడ ఈ తన ప్రతిజ్ఞను స్మరించి పలుకుట కానందగును. ఇదె ఆ ఘట్టము—

అథా అవిక్రమ్య రణే వృకోదరో
మహాగజం కేసరీ యద్వ దేవ
నిగృహ్య దుఃశాసన మేక వీరః
సుయోధన స్యాధిరథేః సమక్షం
. . . . . . . . . .
అసిం సముద్యమ్య శితం సుధారం
కంఠే సమాక్రమ్య వక్షః పతితస్య భూమౌ
వధాపిబ చ్ఛోణిత మస్య కోష్ణం
తతో నిపాత్యాస్య శిరోఽపకృత్య
తే నాసినా తవ పుత్రస్య రాజన్
సత్యాం చికీర్షు మతిమా ప్రతిజ్ఞాం
భీమో పిబ చ్ఛోణిత మస్య కోష్ణం.

వాసుదేవ —
భీమసేన స్తు ధర్మేణ
యుధ్యమానో న జేష్యతి
అన్యాయేన తు యుధ్యన్వై
హన్యా దేవ సుయోధనమ్
ప్రతిజ్ఞాతం తు భీమేన
ద్యూతకాలే ధనంజయ
ఊరూ భేత్స్యామి తే సఖ్యే
గదయేతి సుయోధనమ్
సోఽయం ప్రతిజ్ఞాం తాం చాపి
పాలయ త్వరికర్శనః
. . . . . . . . . . . .
స పపాత నరవ్యాఘ్రో
వసుధా మనునాదయన్.
భగ్నోరు భీమసేనేన
పుత్ర స్తవ మహీపతే
. . . . . . . . . .
ప్రతిజ్ఞా పాలనం ధర్మః
క్షత్రియ స్యేహ విద్మహే.
సుయోధనస్య గదయా
భంక్త్వా సూర్వ్యరూ మహాహవే
ఇతి పూర్వం ప్రతిజాతం
భీమేన హి సభాస్థలే
మైత్రేయే ణాభిశప్తశ్చ
పూర్వ మేవ మహర్షిణా
ఊరూ భేత్స్యతి తే భీమో
గద యేతి పరంతప.

అక్కీచకారాతి . . . . . ప్రతిన చందంబు డెందమున నాన హిల్ల, నుద్దండ గదాదండంబున దుఃశాసను వైవ నతఁడు నెత్తురు గ్రక్కుచు ధరణిం బడిన, బెబ్బులి లేడి కొదమం బొదువుపోలికం బొదివి మెడ ద్రొక్కి . . . . . . . కఠారంబు వెరికి . . . . .

నరసింహుం డసురేంద్రు ప్రవ్వు కరణిన్
రౌద్రం బుద్రగంబుగా
నుర మత్యుగ్రతఁ జీరి క్రమ్ము రుధిర
మ్ము ల్లాసియై దోయిటన్
వెరవారం గొని త్రావు, మెచ్చుఁ జవికిన్
మేను న్మొగంబున్ భయం—
కరరేఖం బొరయంగఁ జల్లికొను, న
క్కౌరవ్యుఁ జూచున్ బొరిన్.

ఇట్లు దారుణ భంగిం బ్రతిజ్ఞాకరణ పూరణం బాచరించి . . . . . .

విను మేను జేయఁబూనిన
పనులం దొకటి గడతేరెఁ బాపాత్ము సుయో
ధనుఁ బొరిగిని తల దన్నుదు
నను రెండవ పనియుఁ దీర్ప నరిగెద నెలమిన్.

కీచకారాతి . . . ధర్మ సంగరమున నరిది జయము గొనుట జూదంబు నప్పుడు అనిలసుతుండు సుయోధను తొడలు విఱుగ నడుచువాడ నని ప్రతిన పట్టినవాడు . . . . . . .

. . . . . . . . . . .

సాధ్వసు పరిభ్రమణంబు సేసినం
దెలిపె యతండు గాంచి సము

దీర్ఘారయంబున వైచె బెన్నాడల్
విఱిగి . . . పడన్. . . . . .

అట్లు పడియున్న నీ కొడుకు జేరం జని భీమసేనుఁడు
ఏకవస్త్ర పాంచాలి నట్లీడ్చి తేరఁ
బనిచి, సభలోన బఱచిన పాపఫలము
ననుభవింపుము దుష్టాత్మ యనుచు వామ
చరణమున బెట్టిదముగాగ శిరము దన్నె.
. . . . . . . . . . .
ప్రతిన నెఱపుట నృపులకుఁ బరమ ధర్మ
మగుట మనమున నర్పింపు మనిలసుతుఁడు
గద సుయోధను తొడలు భగ్నములు సేయు
వాఁడుగా సభ బూనినవాఁడు గాడె

అట్లుగాక, మైత్రేయ మహాముని శాపమున దుర్యోధను తొడలు భీమసేను గదాఘాతంబున భగ్నంబులు గాఁగల యవియై యుండె, నిప్పు డట్లయ్యె.

ఇది మహాభారతమునం జెప్పఁబడిన దుఃశాసన దుర్యోధనులం గురించిన భీముని ప్రతిజ్ఞా ప్రకారము (ద్రౌపది ప్రభావమును జెప్పుచో నైనను దీని నెల్ల ద్రౌపది ప్రతిజ్ఞగా చెప్పుట ఎక్కడ భీమ ప్రతిజ్ఞ యనుట సత్యము. ఇతరము కల్ల గదా.

ఈ కథనే నాటక వస్తువుగాఁ గొని ఉచార్యులవారి యనుగ్రహమును గన్న వేణీ సంహారకార్యుడును వీనిని భీమ ప్రతిజ్ఞలుగానే చెప్పినాఁడు ఇది దుఃశాసనుని గూర్చి భీమ భాషితము—

కృష్టా యేన శిరోరుహే నృపశునా పాఞ్చాల రాజాత్మజా,
యే నాస్యాః పరిధాన మ ప్యపహృతం రాజ్ఞాం కురూణాం పురః
య స్యోరఃస్థల శోణితాసవ మహం పాతుం ప్రతిజ్ఞాతవాన్
సోఽయం మద్భుజపఞ్జరే నిపతితః సంరక్ష్యతాం కౌరవాః.
ఇది దుర్యోధనుం గూర్చినది

చఞ్చద్భుజభ్రమిత చణ్డగదాభిఘాత
సఞ్చూర్ణితోరుయుగళస్య సుయోధనస్య
స్త్యానావనద్ధ ఘనశోణిత శోణపాణి
రుత్తంసయిష్యతి కచాం స్తవ దేవి భీమః.

మఱి యిదియు—ఆచార్యులవారే వృకోదర ప్రగల్భోక్తి అని యుదాహరించినది—

కృష్టా యే నాసి రాజ్ఞాం సదసి నృపశునా తేన దుఃశాసనేన
స్త్యానా న్యేతాని తస్య స్పృశ మమ కరయోః పీతశేషా ణ్యసృఞ్జి
కాన్తే రాజ్ఞః కురూణా మతిసరస మిదం మద్గదాచూర్ణితోరోః
అఙ్గేఽఙ్గేఽసృఙ్నిషిక్తం తవ రిపుజనిత స్యానల స్యోపశాన్త్యై.

మఱి భారత చంపూకారుఁడు అనంతభట్టకవి దుఃశాసనుం గూర్చి భీమ ప్రతిజ్ఞగాను, దుర్యోధనుం గూర్చి ద్రౌపది శపథముగాను చెప్పినాఁడు.

అథ తథాభూత పరుష మోపాభిషంగ రోష కలుషేణ వృషదశ్వ జన్మనా పరిషది భీషణ మేవం బభాషే

ఉరసి స్థల దూష్మలం మృగాక్ష్యాః
సమితౌ వస్త్ర మిదం య ధాహ మక్ష్ణా
ద్విషతః కచకర్షిణో వ్యముష్యా
రసనే నానుభవేయ మేవ మేవ.

'. . . . .సుఖ మి హాస్వేతి కరతలాస్ఫాలన నిర్ఘోషే సక్థి న్యేవ తవ మృత్యుః స్యా దితి సుయోధనం ప్రతి యాజ్ఞసేన్యాః శాపేన చ. . . . .'

'అధిక స్యాధికం ఫలం' అన్నట్లు రాజశేఖరుఁడు ప్రచండ పాండవమున ద్రౌపది తన వేణిని భీముఁడు తాను పగిల్చిన దుఃశాసనుని గుండె నెత్తుటి తడి తోడి చేతితో సంహారము చేయగల్గు డన్ని, అది శాపమో ప్రతినయో, పలికినది భీముఁడును 'ప్రతిజ్ఞాం శృణు' అని ఆ యున్నదమ్ములను ఇరువురిం గూర్చి ప్రతిజ్ఞలం బలికెను

అయినను ఈ కావ్య నాటకముల చమత్కారములతో మన కేమి పని? ద్రౌపది ప్రభావమునకు భారతమును గదా ప్రమాణీకరింపవలయును. దాని కన్నను ప్రమాణ మని ఒకవేళ ఈ ద్రౌపది ప్రతిజ్ఞలను ఎందేని దివ్య ప్రబంధముల గ్రహించినారేమో కార్పొంగాడు వేంకటాచార్యుల దూషణముం ద్రోసి భూషణముం దొడ్గగుటకు!

తరువాత నాకప్పుడు 1960 మార్చిలో వైదిక మనోహరలోనే విదుర ప్రశంస అని ఆ మహానుభావుని ప్రశంసం బ్రకటించిరి. ఆతని జన్మకారణమును, కారణ జన్మతను, పరమ భక్తాగ్రేసరతను మిక్కిలియు నుగ్గడించిరి. సర్గమును 'యథా వ్యాసేన ప్రకాశ్యత' అని మహా భారతమును అనుసరించిన సంగ్రహము యనిరి శూద్ర యోని జాతుఁడైనను విదురుఁడు వ్యాసమహాముని కుమారుఁడు, ధర్మ దేవత యవతారము. మఱి మహాజ్ఞాని యగుటకును పరమ భక్తాగ్రేసరుఁ డగుటకును సందేహమా? ఆ ప్రశంస కడపట ఆయన చనిపోయినపుడు ఆయన దేహమునకు ధర్మపుత్రుఁడు సంస్కారము చేసెనని చెప్పుచు దాని విమర్శ అని ఇట వ్రాసినారు 'మహాత్ముఁడు విదురుఁడు నిధనమును బొందగా, ఆయనకు సంస్కారము యుధిష్ఠిరుఁడు చేయవలసినట్లు ఏర్పడినది విదురుఁడన్నచో అసమాన్యాధిక జ్ఞాన వైభవము గలవాడు మఱి యతని జాతియన్నచో జఘన్యము, శూద్రజాతి; ఏమి సేయుదును ఎట్లు సేయుదును అని యుధిష్ఠిరుఁడు చింతావిహ్వలుఁ డాయెను దీనిం దెలుపుచు మహా భారతము చెప్పుచున్నది—

'ధర్మ రాజ స్తు త త్రైనం సంచిస్కారయిషు స్తదా
దగ్ధు కామో భవ ద్విద్వాన్' అని

'విద్వాంసుఁ డా ధర్మరాజు అన్నచో ఆతనికి సంస్కారము చేయఁ గోరెను. (దేహమును) కాల్పఁగోరెను' అని

ఈ శ్లోకమున 'తథా'కు 'చ' అని అర్థము దాన సంస్కారముచేయఁ గోరినవాఁడును ఆయెను కాల్పఁగోరినవాఁడును ఆయెను—అని ఫలించినది అనఁగా ''జ్ఞానవైభవమునకుం దగినట్లు ఎక్కటో అట్లు సంస్కరింతునా జఘన్య జాతికిం దగినట్లు ఊరక కాల్చి వైతునా?'' అని ఆయన చింతావిహ్వలుఁ డాయెను—అన్నమాట. తరువాత ఏమి జరిగినది యందురేని—

'. . . . . . ఆ ధాకాశే వచోఽ బ్రవీత్
భో భో రాజన్ న దగ్ధవ్య మేత ద్విదురసంజ్ఞకమ్
కళేబర మి హైత త్తే నైష ధర్మః సనాతనః
లోక వైలక్షణో నామ భవిష్య త్యస్య పార్థివ
యతిధర్మ మవాప్తో ఽసౌ న శోచ భరతర్షభ' ఇతి—

అని అప్పుడే ఒకానొక యాకాశవాణి పొడమినదని చెప్పబడుచున్నది 'ఏత న్నదగ్ధవ్యం' అనగా ఇది దివ్య మంగళ శరీరము. ఇది యూరక కాల్పఁబడఁ దగదు అన్నమాట 'సనాతన ఏష ధర్మః తే లోక వైలక్షణో న భవిష్యతి'— ఊరక కాల్చుట కంటెను వ్యతిరేకమగు ఈ సంస్కారపుఁ దెఱఁగు నీకు ప్రాచీనాచార సిద్ధమగు ధర్మము అగును శాస్త్రమునకు విరుద్ధమైనది కాఁజాలదు' అని యర్థము. ఇందులకై నహేతువు చెప్పఁబడుచున్నది 'యతిధర్మ మవాప్తోఽసౌ'—ఇతఁడు యతి ధర్మమును బొందినవాఁడాయెను—అను నీ మాటలచేత యతితో సమానముగా, ఇంచుకయు భేదము లేకుండ ఇతఁడు బ్రహ్మమేధ సంస్కారమునకు అర్హుఁడు గాని, మఱేమన, ఊరక కాల్చివేయఁబడఁదగినవాఁడు గాఁడని ఫలితార్థము. 'న శోచ'—ఇతఁడు సంస్కరింపఁబడవలసినవాఁడా, ఊరక కాల్పఁబడవలసినవాఁడా అను విచారమునం గిలిగిన దుఃఖము మానుము—అని యర్థము. ఇచటనో 'అసౌ యతిధర్మ మవాప్తః' ఇతఁడు యతిధర్మమును బొందినాఁడు అను స్పష్టంపుమాటచే

'పుత్రో గృహస్థః శుద్రో'ధ యతేః సంస్కార మాచరేత్

కొడుకు గృహస్థుడును శుద్ధుఁడు నైనవాఁడు యతికి సంస్కారము

ఆచరింపవలసినది' అని తొడంగి విహితమైన బ్రహ్మమేధ పూర్వకమగు దాహ సంస్కారము విదురుం గూర్చి ఆకాశవాణిచే విధింపఁబడినది— అని నిస్సంశయముగా కన్పట్టుచున్నది'' అని.

ఆచార్యులవారు మఱియుం జెప్పుచున్నారు·—

''ఈయన యతిధర్మముం బొందినవాఁడని చెప్పుటచేత, ఈ (యతి) ధర్మము వ్యక్త్యంతరములందును కలుగఁదగిన ధర్మమే ఇట బ్రహ్మ మేధ సంస్కారమునకు అది కారణముగా చెప్పఁబడినది కావున ఈ చెప్పిన సంస్కారము విదురుఁడను వ్యక్తి విశేషమందు నియతము అను వాదము పొసఁగదు. అది ఏ యతికిని చెల్లునదే యతులను ఊరక, అనఁగా అమంత్రకముగా సంస్కరించుట ఎక్కడను మునుపు చూడఁబడినది కాని వినఁబడినది కాని కాదు. మంత్రాపవాద ప్రమాణము (ఎందును) లేదు. కావున (ఊరక=అమంత్రకముగా) అనుష్ఠింపఁబడినదనుట కాని వ్యక్తి విశేష నియత మనుటగాని ఇచట ఉచితములగు వాదములు గావనుట సిద్ధము'' అని

శ్రీ మదాచార్యులవారి యీ విదుర బ్రహ్మమేధోపన్యాస మంతయు శ్రీ లోకాచార్యులవారు శ్రీవచనభూషణమను తమ శాస్త్ర గ్రంధమునం జెప్పినదాని యనువాదమే. అందు జాతిని జన్మను లెక్కసేయక జ్ఞానవైభవముగలవారిని, తక్కువజాతివారి నైనను, తనతో సమానముగాను, తనకన్నను ఎక్కువగా నైతమును లెక్కసేయవలయు నను ధర్మసూక్ష్మ రహస్యమును పలుదెఱంగుల బోధించునెడ—

'ధర్మపుత్రర్ అశరీరి వాక్యత్తాలుయుమ్ జ్ఞానాధిక్యత్తాలుయుమ్ కొణ్డు శ్రీ విదురరై బ్రహ్మమేధత్తాలే సంస్కరిత్తార్' అని 'ధర్మపుత్రుఁడు అశరీరి వాక్యమును జ్ఞానాధిక్యమును పరిగణించి శ్రీ విదురుని బ్రహ్మమేధ సంస్కారముతో సంస్కరించెను' అని యానతిచ్చినారు. దానికి శ్రీ మణవాళ మహామునులు వ్యాఖ్యానము వ్రాయుచు—ధర్మపుత్రుఁడు తన వర్ణ ధర్మమునే ఉద్దేశ్యముగాఁ దలఁచి, దానికి సడలుట కలుగని తెఱంగున నడచుకొనువాఁడు గదా అటువంటి యాయన శ్రీ విదురుని సంస్కారము నెడ ఆయన వర్ణమును చూతునా, జ్ఞానాధిక్యముం జూతునా, ఏమి సేయుదును అని వ్యాకులపడుచుండఁగా

'ధర్మరాజ స్తు తత్రైనం సఞ్చిస్కారయిషు స్తదా
దగ్ధుకామోఽ భవ ద్విద్వాన్ అథాకాశే వచోఽ బ్రవీత్
భోభోరాజన్ న దగ్ధవ్య మేత ద్విదుర సంజ్ఞకమ్
కలేబర మి హైత త్తే నైష ధర్మః సనాతనః
లోక వైలక్షణో నామ భవిష్య త్యస్య పార్థివ
యతిధర్మ మనాప్తోఽ సౌ న శోచ భరతర్షభ.

అని ఈయన బ్రహ్మమేధ సంస్కారార్హుఁ డని పలికిన అశరీరి వాక్యము వలనను సంప్రతిపన్నమైన యాతని జ్ఞానాధిక్యము వలనను సందేహము తొలఁగి వైదికాగ్రేసరులకు చేయవలసిన బ్రహ్మమేధ సంస్కారముతో సంస్కరించినవాఁ డాయెను గదా— అని కూర్చెను

శ్రీ లోకాచార్యులకు సొంతతమ్ముఁడు, అన్నింటను ఆయనకు సాటి యయిన యాచార్యులు అభిరామ వరాచార్యులు—అ కియ మణవాళప్పెరుమాళ్ అను నఱవపేరుననూ ప్రసిద్ధులు తమ రచించిన యాచార్య హృదయ మను శాస్త్ర గ్రంథమునను దీనిం దడవినారు

'ఐవరిల్ నాల్వరిల్ మూవరిల్ మున్పట్టవర్కళ్
సన్దేహియామల్ సహజరోడే పురోడాశమాక
చ్చెయ్ద పుత్రకృత్యముం.'

దీనికిని మణవాళ మహామునులదే వ్యాఖ్య.

'ఐవరిల్ ఇత్యాది—పాణ్డవర్కళ్ ఐవరిల్
ప్రథమరాన ధర్మపుత్రర్ శ్రీ విదురర్కు
జ్ఞానాధిక్యత్తాలుయుం అశరీరివాక్యత్తాలుయుం
కొణ్డు సన్దేహియామల్ శెయ్ద పుత్రకృత్యముం'

జ్ఞానాధిక్యమును పరమ భక్తతను పరిగణించి అశరీరవాక్కుచే ప్రబోధితుఁడై శ్రీ విదురునికి, తక్కువ వర్ణమువానికైనను ఎక్కువ వర్ణమువాఁడగు ధర్మపుత్రుఁడు ఇంచుకయు సందేహింపక పుత్రకృత్యము నడపినాఁడు—అని

అట్లే వారికి సాటివారును మించినవారును అనందగు శ్రీ వేదాంత దేశికుల వారును—

'బ్రహ్మవిత్తాన ఇవర్(విదురర్) యోగ ప్రభావత్తాలే
దేహన్యాసం పణ్ణిన పిన్పు ప్రాప్తనాన ధర్మపుత్రర్ ... ద
సంస్కార విశేషం తూష్ణీమనుష్ఠితమాదల్ వ్యక్తి ...
నియతమాదల్ ఆమ్—ఇత్తనై.'

'బ్రహ్మవిత్తైన ఈయన—అనఁగా—విదురుఁడు యోగ ప్రభావముచేత దేహన్యాసము చేసిన యనంతరము అందులకు బాధ్యత గల ధర్మపుత్రుఁడు చేసిన సంస్కార విశేషము ఊరక (అమంత్రకముగా?) చేసిన దేనియు వ్యక్తి విశేషమునకు చేయవలసినదనియు అగును—అంతే'—అని.

శ్రీ లోకాచార్యులేమి, వారి తమ్ములింగారేమి, వారి దివ్యసూక్తులను వ్యాఖ్యానించిన మణవాళ మహామునులేమి, శ్రీ వేదాంత దేశికులేమి పెక్కు శతాబ్దుల క్రిందటి ప్రాచీనులు. శ్రీమదణ్ణంగిరాచార్యులవారు ఇప్పుడు నిండు విభవమున వెలసియున్నవారు. ఈ నలువురిని మించిన విద్వాంసులుగాని ఆచార్యులుగాని మఱెందును, ఎన్నఁడును ఉండఁబోరు. శ్రీమంతులు అణ్ణంగరాచార్యులవారు లోకాచార్యులయు వారి తమ్మునింగారియు మణవాళ మహామునులయు సూక్తులను ఎంతయుం బ్రమాణీకరించి తలం దాల్తురు. అట్లే శ్రీ వేదాంత దేశికుల సూక్తులను ప్రమాణీకరించుచు శిరసావహించుచున్నట్లే చెప్పుచు, అంతలో అందందు తప్పులను పొరపాటులనుం గూడ చూపుచు ఆక్షేపించుచునే అంతలో అవలంబించుచు తమలో కలుపుకొనుచు నుందురు. అట్లే పైన ఉదాహరించిన 'ఈయన యతి ధర్మముం బొందినవాఁడని చెప్పుటచేత' అను మొదలగు ఎనిమిది బంతులును శ్రీ వేదాంత దేశికుల సూక్తుల మీఁది యాక్షేపణయు వానిం బడగొట్టుటయునే. ఆ విషయము తరువాత చూతము లే

మఱి ప్రకృతమున ఆ నలువురును విదురునికి ధర్మపుత్రునిచేత సంస్కారము చేయించినవారే. అందు అణ్ణంగరాచార్యులకు వారు నలువురును వారికి అణ్ణంగరాచార్యులవారును తోడే. కావున ఏవురును సంస్కారము చేయించినవారే.

ఐనను శ్రీమహాభారతాశ్రమవాస పర్వమున గల విదుర నిర్యాణ కథలో చక్కఁగా పూర్వోత్తర సందర్భ సమాకలనముంజేసిన ధర్మపుత్రుఁడు విదుర కలేబరమునకు సంస్కారము చేయఁగోరెనే కాని మఱి ఆకాశవాణిచే వారింపఁబడి అది చేయలే దని తెన్నగా ఏర్పడును ఇదె కనుఁడు —

గాంధారీ ధృతరాష్ట్రాదులు వానప్రస్థము స్వీకరించి అడవులకు బోయి ఆశ్రమవాసము చేయుచుండిరి అప్పుడే సంజయ విదురాదులును అడవులకుం బోయిరి. కొంతకాలమునకు వారి నందరిని ఆస్థితిలో ఎట్లున్నారో, పాపము అని చూడఁగోరి పాండవులందఱు ద్రౌపద్యాదులును వెంటరా అచటికిం బోయిరి. అట నందరు ధృతరాష్ట్రునాశ్రమమున సమవేతులై కూర్చుండి యొండొరుల కుశలాదికము విచారించుకొనుచో యుధిష్ఠిరుఁడు 'నాయనా విదురుఁ డేడి?' అగపడలేదే అతనికిం గుశలమా?'' అని యడిగినాఁడు.

ఇ త్యేవం వాదినం తం స
న్యాయవి త్ప్రత్యభాషత
కుశల ప్రశ్న సంయుక్తం
కుశలో వాక్యకర్మణి
క్వ చాసౌ విదురో రాజన్
నేమం పశ్యామహే వయం.
ఇత్యుక్తః ప్రత్యువా చేదం
ధృతరాష్ట్రో జనాధిపం
కుశలీ విదురః పుత్ర
తపో ఘోరం సమాశ్రితః

. . . . . . . . . . . . . .

ఇత్యేవం బ్రువత స్తస్య
జటావీటముఖః కృశః
దిగ్వాసా మలదిగ్ధాఙ్గో
వనరేణు సముక్షితః
నివర్తమానః సహసా
రాజన్ దృష్ట్వాశ్రమం ప్రతి
త మన్వధావ న్నృపతి
రేక ఏవ యుధిష్ఠిరః
ప్రవిశంతం వనం ఘోరం
లక్ష్యా లక్ష్యః క్వచిత్క్వచిత్.
భో భో విదుర రాజాహం
దయిత స్తే యుధిష్ఠిరః
ఇతి బ్రువన్ నరపతి
స్తం యత్నా దభ్యధావత
తతో వివిక్త ఏకాన్తే
తస్థౌ బుద్ధిమతాం వరః
విదురో వృక్ష మాశ్రిత్య
కంచి త్తత్ర వనాన్తరే
తం రాజా క్షీణభూయిష్ఠం
ఆకృతీ మాత్ర సూచితమ్
అభిజజ్ఞే మహాబుద్ధిం
మహాబుద్ధి ర్యుధిష్ఠిరః

యుధిష్ఠిరోఽహ మస్మీతి
వాక్య ముక్త్వాగ్రతః స్థితః
విదురస్య శ్రవో రాజా
తం చ ప్రత్యభిపూజయత్
తతః సోఽనిమిషో భూత్వా
రాజానం త ముదైక్షత
సంయోజ్య విదుర స్తస్మిన్
దృష్టిం దృష్ట్యా సమాహితః
వివేశ విదురో ధీమాన్
గాత్రై ర్గాత్రాణి చైవ హి.
ప్రాణాన్ ప్రాణేషు చ దధ
దింద్రియా ణీంద్రియేషు చ
స యోగబల మాస్థాయ
వివేశ నృపతే స్తనుమ్.
విదురో ధర్మరాజస్య
తేజసా ప్రజ్వల న్నివ
విదురస్య శరీరం తు
త థైవ స్తబ్ధలోచనమ్

. . . . . . . . . . . . . .

దదర్శ గతచేతనమ్.
బలవంతం త థాత్మానం
మేనే బహుగుణం తదా

ధర్మరాజో మహాతేజాః
తచ్చ సస్మార పాణ్డవః
పౌరాణ మాత్మనః సర్వం
విద్యావాన్ స విశాం పతే
యోగధర్మా మహాతేజాః
వ్యాసేన కథితం యథా
ధర్మరాజశ్చ త త్రైనం
సంచిస్కారయిషు స్తదా
దగ్ధుకామోఽభవ ద్విద్వాన్
అథ వా గభ్యభాషత
భోభోరాజన్ న దగ్ధవ్య
మేత ద్విదుర సంజ్ఞికమ్
కలేబర మి హైవం తే
ధర్మ ఏష సనాతనః
లోకాః సాంతనికా నామ
భవిష్యం త్యస్య భారత.
యతిధర్మ మవాప్తోఽసౌ
నైషశోచ్యః పరంతప
ఇత్యుక్తో ధర్మరాజః స
వినివృత్య తతః పునః
రాజ్ఞో వైచిత్ర వీర్యస్య
త త్సర్వం ప్రత్యవేదయత్
తతః స రాజా ద్యుతిమాన్
స చ సర్వో జన స్తదా
భీమసేనాదయ శ్చైవ
పరం విస్మయ మాగతాః
త చ్ఛ్రుత్వా ప్రీతిమాన్ రాజా
భూత్వా ధర్మజ మబ్రవీత్
. . . . . . . . . . . .
యదర్థో హి నరో రాజన్
తదర్థోఽస్యాతిథిః స్మృతః
. . . . . . . . . . . . . .
తత స్తే వృక్షమూలేషు
. . . . . . . . . . .
తాం రాత్రి మవసన్ సర్వే
ఫలమూల జలాశనాః

ఇట్లు పలుకుచున్న యాయనకు న్యాయమెఱింగినవాఁడగు యుధిష్ఠిరుఁడు మాటలాడుటయందు నేర్పరి, కుశల ప్రశ్నతో కూడ ఇట్లు బదులు పలికెను. నాయనా, ఆ విదురుఁ డేడి? అతఁడు మా కగపడఁడేదే అంత ధృతరాష్ట్రుఁడు బదులాడుచున్నాఁడు అబ్బాయి, విదురుఁడు కుశలియే అతఁడు ఘోరతపముం జేయుచున్నాఁడు అనునంతలో దూరాన వాఁడుగో ఆవిదురుఁడే అగపడుచున్నాఁడని ఎవరో అతనికిం జెప్పినారు అతనికి మొగాన జడలు కొయ్యవాఱినవి చాల చిక్కియున్నాఁడు. దిసమొల, ఒడలంతయు మురికి, అడవి దుమ్ము కమ్మియున్నది

అతఁడు తటాలున వెనుమరలి (తన?) ఆశ్రమమునకుం బోవం గాలిచి, యుధిష్ఠిరుఁడు తాను ఒంటరిగ ఆతనివెంబడి పరువెత్తెను అతఁడును అంతలో ఒక్కట నగపడియు అంతలో నొక్కట నగపడకయు భయంకరారణ్యముం జొరంగా గాంచి, ఓహోయి విదుర ఓవిదుర, నేను రాజను, నీకు ప్రియుండను, యుధిష్ఠిరుఁడను అని పలుకుచు అతఁడు పూనికతో తఱిమి పరువెత్తెను. అంతట నా మహా బుద్ధిమంతుఁడు మఱి పురుషునెనులేని యేకాంతమున ఆ యడవిలో ఒక చెట్టును ఆనుకొని నిల్చఁబడెను ఆతనిని, మిక్కిలియు చిక్కిపోయియున్నవానిని, ఆకారమాత్రముచేత గుర్తింపఁదగియున్న వానిని బుద్ధిశాలిని, బుద్ధిశాలి యా రాజు యుధిష్ఠిరుఁడును అనవాలు పట్టెను.

అంతట తాను 'యుధిష్ఠిరుఁడను, బాబూ, నేను' అని పలికి ఆతని యెదుట నిలఁబడి ఆతని ఆతని మహిమను ఎంతేని పూజించినవాఁడాయెను. అంతట నాతఁడు రెప్పవాల్పని చూపులో కన్నెత్తి సమాధిం బూని తన చూపు లను ఆతని చూపులో కలిపి తన యవయవములతో ఆతని యవయవములం జొచ్చి, తన ప్రాణముల నతని ప్రాణములందును ఇంద్రియములను ఇంద్రియములయందును నెలకొల్పి యోగబలముం బూని తేజతో మిఱుమిట్లు గొలుపుచుం బోరె ధర్మరాజు తనువునం జొచ్చినవాఁడాయెను అంతట యుధిష్ఠిరుఁడు ఆతని దేహముం బరికింపఁగా అది యుప్పే చెట్టును ఆనుకొని అట్టె ఱెప్పలాడక నిలచిపోయిన కన్నులతో ప్రాణముపోయినదిగా అగపడెను. అప్పుడు ధర్మరాజు తనకు తాను ఎన్ని మడుంగులో బలముకలవాఁడైనట్లు అనుకొని మిక్కిలియు తేజఃశాలియై విద్యావంతుఁడు తాను యోగలక్షణమును గలిగినవాఁడై మునుపు వ్యాసుఁడు చెప్పియుండిన తన పాత సంగతి నెల్ల స్మరించిన వాఁడాయెను

అప్పుడు ఆ విద్వాంసుఁడు ధర్మరాజు ఆతనికి అక్కడనే సంస్కారము చేయఁగోరినవాఁడై దహనము చేయు తలంపుఁ గొనెను అంతట నొక వాక్కు వెలువడి అతనింగూర్చి పలికెను

"ఓహోయి రాజా, కాల్పఁబోకు, నీ విట్లు ఇక్కడ ఈ విదురిని పేరి కలేబరమును. ఇది(య) సనాతన ధర్మము ఇతనికి సాంతానికములను లోకములు కలుగఁగలవు ఇతఁడు యతి ధర్మమ్మం బొందినవాఁ డాయెను ఇతనిం గూర్చి నీకు ఏ చింతయు వలదు" అని ఆమాటలు విని ధర్మరాజు అంతట వెను మర లినవాఁడై మరల ధృతరాష్ట్రుని (ఆశ్రయమునుం) జేరవచ్చి, ఆయనకు దాని నంతయు తెలియఁజెప్పెను అంత ద్యుతిమంతుఁ డా ధృతరాష్ట్రుఁడును అక్కడ కూడియున్న జనులందఱురును భీమసేనుఁడు మొదలయినవారు ఈ వృత్తాంతమును విని మిక్కిలియు ఆశ్చర్యము చెందిన వా రైరి దాని నంతయు విని ప్రీతి చెందిన ముసలిరాజు ధర్మరాజుతో పలికెను . . . . నరుఁడు తనకు కలిగిన దానినే తనయతిథులకుం బెట్టును . . అంతట వా రందఱును పండ్లను దుంపలను తిని నీళ్లు త్రాగి ఆ చెట్లక్రిందనే ఆ రాత్రిం గడిపిరి

ఉభయకవి మిత్రుఁడు సోమయాజి యప్రధృష్యవాక్కు, తిక్కన. ఈ ఘట్టమున ఆయన వాక్కు ఇదిగో—

"ధృతరాష్ట్రుఁడు ధర్మతనయుతోడ—
. . . మము బాసి విదురుఁ డెచ్చటనేఁ
జరియించు, మునిజనాశ్చర్యకారి

యగుచు జలము లనిల మాహారముగఁ గొను
నవియు నదియు గొనక యయిన నుండు
శూన్యవిపినమున విద్యైన్య స్వతంత్ర సం
చారి యై వసించు గౌరవేంద్ర.

ఒక్కొక మరి డబ్బాటే చక్కటిఁ గాననగు ననియె జనవర తోచెన్
గ్రుక్కిన నప్పుడ విదురుం డక్కాంతేయాగ్రజున కనతి దూరమునన్.

కాంతార ధూళి మలినాంగుఁడును జటీభూత కేశ పాశుండును దిగంబరుండును నగు విదురుఁ డట్లు దోఁచి, యయ్యాశ్రమంబుననున్న జనంబులుం గని మగిడిపోవం జూచి ధర్మతనయుండు దన యనుచరుల నిలువుం డనుచు దా నొక్కరుండును సత్వరంబుగా న వ్వినుత ప్రభావుని వెనుకం జనియె. నతండు గుల్మాంతరితుం డగుచు తోఁచుచుఁ బోవంబోవ నప్పాండవాగ్రజుండు ఎలుంగెత్తి యోవిదుర యోవిదుర నిలు నిలు మేను యుధిష్ఠిరుండ, నిన్నుం గాన వచ్చితి నని పలుకుచుం బాఱిన నమ్మహాత్ముండు మరలి కనుంగొని వివిక్తప్రదేశంబున నొక్క పాదపంబు సేరి నిలిచిన

ధర్మ తనూజుండు దత్సమీపంబున
వేఁగి యయ్యోగి కట్టెదుర నిలిచి
యాతండు నయనంబు లర్ధనిమీలితములై యుండ నూరక యున్నఁ గాంచి

విర్మలాత్మక యేను ధర్మసూనుఁడ నన్నుఁ
 గను విచ్చి చూడవే యనుఁడు నతఁడుఁ
జెప్పల వ్రేగయించి యప్పాండవోత్తముఁ
 దప్పక చూచి యుదాత్త యోగ
బలము గైకొని యింద్రియములను బ్రాణ
 ములను నింద్రియములఁ బ్రాణములను గలపి
విజ శరీరంబు విడిచి యానృపతితనువు
 సొచ్చెఁ దేజోమయత్వ విస్ఫూర్తి మెఱయ.
వినుము, ధర్మపుత్రు తనువునఁ గొంతియు
 లావు నప్పు డగ్గలంబు లయ్యె
నొలసె బుద్ధి యధిక బల మట్టులగు టతఁ
 డెఱిఁగి చోద్యమంది యెలమి నొందె.
తదనంతరంబ యప్పతి
 విదురశవము ద్రాను సెంది వికృతి రహితమై
విదురమెయి నొఱగి యున్న పగిది
 నుండం జూచి యగ్నికృత్యము నడపన్
తలఁచిన మింట నొక్కపలుకు ధర్మ తనూజ యతిత్వగౌరవో
జ్జ్వలుని కళేరంబునకు వహ్ని విధాన మొనర్చు టర్హమే
వల దని ప్రమోసె నమ్మనుజ వల్లభుఁ డప్పుని దక్కి పోయి ధ్రా
తలకును తండ్రికిన్ సువిదితంబుగ నంతయునుం గ్రమంబునన్

ఎల్లవారును వినుచుండం జెప్పిన నందఱు నద్భుత రసంబున మునిం గిరి, పదంపడి ధృతరాష్ట్రుం డామంత్రణంబుసేయ మునిజనులు నిజ నివాసంబులకుం జనిరి. తదనంతరంబ యాంబికేయుండు ధర్మనందనునితోడ .....భరత కులోత్తమ ఫలమూలముల నుపయోగింపు మొనఁగెద. . యనవుడు నట్లకాకని ఫలంబులు మూలముల నుపయోగించె. . . . . . . అయ్యందఱు నవనిశయన మొంది యా రాత్రి నిద్రించి . . . . "

సంస్కృత భారతమున పాఠము పురాణం హయగ్రీవశాస్త్రుల యాంధ్రప్రదేశ మదరాసుల తెలుగు లిపిలోకాని, నీలకంఠ పండితవ్యాఖ్యతోడి బొంబాయి నాగర లిపిలోకాని, ప్రతాపచంద్రుని ప్రాచీన కల్కత్తా నాగరలిపిలోకాని కుంభఘోణమువారు చాల అర్వాచీనముగా ప్రకటించిన నాగరలిపిలో కాని పరిగణింపఁదగిన భేదములు లేక ఒక్క తీఱుననే యున్నది. తిక్కన తెనుఁగును దానికి అనువాదముగానే యున్నది. తిక్కనయున్నను యీ యాచార్యుల కందరి కన్న నూర యేండ్లు ప్రాచీనుఁడు. అందు సాంతానికములు లేకపోవుట అది 'మక్కికి మక్కి' అన్న సమగ్రత లేని దనుట. అంతే

అప్పుడే కలసికొన్న దర్మరాజు ధృతరాష్ట్రునివద్ద ఆశ్రమాన అందఱితోడం గూరుచుండి కుశలప్రశ్న చేయుచు, నాయనా, విదురుఁ డేఁడి, అని యడుగునంతలో ఇంచుక దూరాన అతఁడె అగపడి మరలి పోవుచుండుటయు దానింగాంచి అతనివెంట ధర్మరాజు ఒంటరిగా పరువెత్తుకొని పోయి కొంత దూరాన కలసికొని తన్నుం దెలుపుకొనఁగా అతఁడు ఎవ్వరును లేని యా యేకాంతపుఁ బోట ఒక చెట్టును ఆనుకొని నిలఁబడి ధర్మరాజు చూపున తన చూపు నిలిపి యోగమహిమచే తన సర్వావయవేంద్రియ ప్రాణములతో అతని సర్వావయ వేంద్రియ ప్రాణములలో ప్రవేశించుటయు, అంతట అతని కలేబరము చేతన హీనముగా నగపడుటయు, అన్నియు నెఱిఁగిన విద్వాంసుఁడు ధర్మరాజు దానికి దహన సంస్కారము చేయఁగోరుటయు, ఆకాశవాణి యతియైన యాతనికి దానిని వారింపఁగా మానుకొని, దానిని అట దిగనాడి ధృతరాష్ట్రు నాశ్రమమునకు మరలుటయు, అచట తాను విదురుని వెంటఁ బరువెత్తినపుడు కూర్చుండియున్నవారు అట్లే కూర్చుండియుండగా అందఱికిని [illegible] నిర్యాణ ప్రకా రాశ్చర్యమును జెప్పుటయు—ఇది కథ, ఎంత పొందికగా రసవంతముగా మన్నది!

మరి విశద వాక్ప్రభావమణులైన మణవాళమహామునుల వారికి ఆపాఠ మెచట నుపలబ్ధమైనదో. ఇటీవల దక్షిణాది పాఠమని వావిళ్ళవారు ప్రకటించిన నాగర లిపిలోనున్నది అది. మఱి వారికిని గురువులైన లోకాచార్యులవారును వారి తమ్ములింగారును ధర్మరాజు విదురినికి బ్రహ్మమేధముం జేసెనని ఏల చెప్పినారో! ఆ యుఱవమున వ్యాఖ్యాతమైన పాఠములో నైనను ధర్మరాజు విదురునికి అట్టు సంస్కారము చేసినట్లు అగపడలేదే.

'సంచిస్కారయిషు స్తథా దగ్ధుకామోఽభవత్.'

అన్నింటను పాఠము 'తదా' అప్పుడు—అని యున్నది ఇట మాత్రము పాఠము 'తథా' అని యున్నది దానికి అణ్ణంగరాచార్యులవారు మనలను తప్పుదారికి పోనీకుండుటయుం బోలె

"శ్లోకేఽస్మిన్ తథే త్యేతత్ చార్థకమ్
సంచిస్కారయిషుశ్చ దగ్ధుకామశ్చ అభవత్ ఇతి ఫలితమ్"

"ఈ శ్లోకమున 'తథా' కు 'చ' అని అర్థము సంస్కారము చేయుగోరినవాడును దహనము చేయగోరినవాఁడును ఆయెను" అని ఫలించినది అని వివరించినారు

మఱి శ్లోకమున 'దగ్ధుకామః' తో మఱియొక 'చకారము'అనఁగా రెండవ చకారము లేదే, అతని మనసున రెండు కోరికలు—సంస్కరింపను దహనము చేయను—అని రెండు వగలుగా అర్థము చెప్పి— ఇటా అటా అని చిత్తము ఆందోళిత మైనది అనుటకు?

ధర్మరాజ స్తు త త్రైనం సంచిస్కారయిషు స్తదా
దగ్ధుకామోఽభవ ద్విద్వాన్ . ..

'ధర్మరాజస్తు' అన్నను 'ధర్మరాజశ్చ' అన్నను కథ చెప్పువరుసలో అంతగా భేదము లేదు. ధర్మరాజు అన్నను అన్నను, ధర్మరాజును అన్నను ఒక్కటె. ఇక 'తథా' ప్రకారవాచి. సంస్కారము చేయగోరినవాఁడై తత్ప్రకారముగా దహనము చేయఁగోరినవాఁ డాయెను అని యర్థము. విద్వాంసుఁడనియు ధర్మరాజనియు అనుటచేత అట్టివాఁడు సంస్కారము చేయఁగోరినవాఁడై దహనము చేయఁగోరెను. అని యున్నది. అతఁడు మనసున ఎట్టి విహ్వలతయుచెందినట్లు లేదు నిశ్చయించుకొన్నట్లే యున్నది 'బ్రహ్మమేధమే' ఇట లెస్సయగు విధియైన విద్వాంసుఁడును ధర్మరాజును ఐన యాతఁడు కోరిన దహనము అట్టి సంస్కారమే యని తలంపఁదగును దానినే ఆకాశవాక్కు వారించిన దనియుఁ దలంపఁ దగును అట్లు చేయుట—కాల్చుట 'నైష ధర్మః సనాతనః—'ఇది సనాతన ధర్మము గాదు 'లోక వైలక్షణో నామ భవిష్య త్యస్య పార్థివ' రాజా ఇతనికి లోక వైలక్షణము (అసాధారణము, విశేష లక్షణము గలది) గదా అగును 'యతి ధర్మమవాప్తోఽసౌ' ఏలన ఇతడు యతి ధర్మముం బొందినవాఁ డాయెను 'న శోచ'—'(ఇతనింగూర్చి) నీకు ఏచింతయు వలదు, భరతర్షభుఁడా- అని ఆకాశవాక్కు తెలిపిన తెఱం గగును. కావున మణవాళ మహామునులవారి పాఠమునను విదురు దేహమునకు సంస్కారము మాన్పి పాముటయే తోఁచుచున్నది అందుల కారణము 'యతి దర్మ మవాప్తోఽసౌ' లను నాకాశవాక్కు దానిని తిక్కన 'యతిత్వ గౌరవోజ్జ్వలుని కళేబరంబునకు వహ్నివిధానమొనర్చు టర్హమే? అని వికసింపఁజేసి లెస్సగా ఉపన్యసించినాడు నీలకంఠ పండితుఁడును తన వ్యాఖ్యలో "లోకా ఇతి యతి ధర్మో దాహాద్యయోగ్యత్వమ్" అని వివరించినాఁడు. మఱియుం జెప్పినాఁడు "శూద్రయోని జాతానామపి యతి ధర్మోఽస్తీతి దర్శితమ్" అని—అందులకు—దాని నెఱింగింపను—ఇట ఆకాశవాక్కు పనివడినది అని తెలియఁజెప్పినాడు

" . తే ధర్మ ఏషః సనాతనః
లోకాః సాంతానికా నామ భవిష్యం త్యస్య భారత"

అని ఋజువుగా చక్కఁగా నున్న పాఠముయొక్కయు అన్వయము యొక్కయు వ్యాస వాక్సదృశముగా నున్న వాని స్థానమున

". . . .తే నైష ధర్మః సనాతనః
లోక వైలక్షణో నామ భవిష్య త్యస్య పార్థివ"

అని ఏట్టి వంకర పాఠము ఆచార్యులవారు ఎచ్చరించి అన్వయము చెప్పి బోధింపవలసినది ఏర్పడినది! 'వైలక్షణః' 'ఇది యేటి మాట? సనాతన ఏష ధర్మః తే లోకవైలక్షణో నభవిష్యతి' అని దొంక తిరుగుడుగా ఎట్లు సాధించినారు!

మఱి నామ' ఎటు పోయినది? 'న భవిష్యతి నామ' అనియా? 'సనాతనో నామ' అనియా? ధర్మో నామ' అనియా? దాని కేమి, అది దేనితోనైనను ఎట్లైనను అంటుకొనును.

అట్లుగాక శ్రీ యణ్ణంగరాచార్యులవారు చెప్పిన యన్వయముం గొప్పను 'సనాతనమగు నీ ధర్మము—అన్నగా కాల్పుమానుట— నీకు లోక వైలక్షణము— లోక విరుద్ధమైనది, శాస్త్ర విరుద్ధమైనది కాజాలదు. ఏలన ఇప్పుడు యతి ధర్మముం బొందినవాఁ డాయెను నీకు ఏ చింతయు వలదు పో' అని అర్థము నిర్వహింపఁదగును 'విలక్షణము' అదే 'వైలక్షణము' అను నిది విశేష లక్షణము గల ఉత్కృష్టమైన—శ్లాఘ్యమైన అను నర్థమున శ్రీ వైష్ణవుల కెంతయు ప్రియమైన మాట, విశేషముగా శ్రీ మదణ్ణంగరాచార్యులవారికి మఱి దానికి ఇట వారు 'శాస్త్ర విరుద్ధము' అను నర్థముం జెప్పినారు ఏల? తత్ప్రియమైన యర్థముననే సరుదుకొనవచ్చునే

ఇట్టి యెడల నా మహాత్ములు పుణ్యలోక విశేషములం బొందినా రనుటయుం బ్రాయికము. ఇట పెక్కు ప్రాచీన పాఠములందు ఆంధ్ర, కల్కత్తా, బొంబాయి ముద్రణముల తెలుఁగు నాగరి లిపులం దుదాహృతములై యున్నవానియందు

“లోకాః సాన్తానికా నామ భవిష్యన్త్యస్య భారత”

అని యున్నది కుంభఘోణ నాగరిలిపి పాఠమునను

'లోకో వైకర్తనో నామ భవిష్యతి ..'

అని లోకము చెప్పఁబడినది కాని, దానిపేరు వైకర్తనమని ఉన్నది కాని యిందలి పాఠములు అంత విశ్వసనీయములు గావు ఐనను ఇందులో 'లోక ప్రసక్తము కలదనుట'కై ఉదాహరించితిని, రామాయణమున జటాయువునకును వాల్మీకిచే-

“యా గతి ర్యజ్ఞశీలానా మాహితాగ్నేశ్చ యా గతిః
అపరావర్తినాం యా చ యా చ భూమి ప్రదాయినాం
మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్”

అని యుత్తమ లోకములు పొందుట చెప్పఁబడినది. ఆ వాల్మీకియే ఉత్తర కాండమున శంబుక కథలో

'రాఘవ స్తముపాగమ్య తప్యంతం తప ఉత్తమమ్
త మువాచ నృపో వాక్యం ధన్యస్త్వమసి సువ్రత'

అని యతని సువ్రతతను ధన్యతను మెచ్చుకొనుటం జెప్పుచునే

శూద్రయోన్యాం ప్రసూతోఽస్మి శమ్బూకో నామ నామతః
దేవత్వం ప్రార్థయే రామ సశరీరో మహాయశః
.... .దేవలోక జిగీషయా
....... తప ఉగ్రం సమాస్థితమ్'

అని 'లోకముం' గోరిన యతని మాటలు విని, నిర్దాక్షిణ్యముగా

. తస్య శూద్రస్య . శిర శ్ఛిచ్ఛేద.'

అని రాముఁడు ఆతని తల తెగవేసె నని చెప్పినాఁడు మఱి యతఁ డేవోయునే ఆ మాటను చెప్పలేదు. కాళిదాసు ఆతనిం గూర్చియే—

'కృతదణ్డః స్వయం రాజ్ఞా
లేభే శూద్రః సతాం గతిమ్
తపసా దుశ్చరే ణాపి
న స్వమార్గ విలఙ్ఘినా.

అని యతఁ డట్లు రామరాజదండితుఁడై సద్గతిం బొందినాఁ డనెను భవభూతి

ఉత్తర చరితలో రాముఁడు తన నిష్కరుణతను ఏవగించుకొనుచునే శంబూకుని తలఁద్రెంపగా అతఁడు సద్యో దివ్య పురుషుఁడై శ్రీరామానుగృహీతుఁడును తదనుజ్ఞాతుఁడు నై తపః ఫలముగానో శ్రీ రామరాజ దండన ఫలముగానో దేవయానమున మోదానంద సమృద్ధ మగు 'వైరాజా నామ తే లోకాః' అని వైరాజములను లోకములం బొందె నని చెప్పినాఁడు ఇటను విదురునికిని 'లోకా భవిష్యన్తి' అని లోకములం జెప్పుట సంభావ్యము యగునేమో ఈ విదుర కథం గాంచియే భవభూతి యాంధ్రుఁడు ఆంధ్రదేశపు టీ భారత పాఠములం బరికించియే, కాళిదాసు 'సద్గతిని' తాను 'వైరాజా' నామ లోకాః' అని కల్పించి నాఁడు కాఁబోలు.

"న దగ్ధవ్యం— ధర్మ ఏష. సనాతనః"
"న దగ్ధవ్యం—నైష ధర్మః సనాతనః"
"లోకాః సాన్తానికా నామ భవిష్య న్త్యస్య భారత"
"లోకో వైకర్తనో నామ భవిష్య త్యస్య భారత"
"లోక వైలక్షణో నామ భవిష్య త్యస్య పార్థివ"

ఈ బంతులను సొరిదిం బరికించి పూర్వోత్తర కథా సందర్భముల నాకళించి ఏది సుసంభావ్యతరమో ఏది ప్రకృతియో ఏది వికృతియో అరయం దగును

'న దగ్ధవ్యం' అని నిషేధించిన యాకాశ వాక్కు విధించినది ఖననా అని అసందిగ్ధముగా నిటం దెలియలేదే ఇ దేమి పాఠము? అందులకు ఇదేమి వ్యాఖ్యానము? బ్రహ్మమేధ మన్నమాట ఎక్కడ ఉన్నది? ధర్మరాజు ఇటు చేయుమనా అటు చేయుదునా అని పర్యాకులుఁడైన మాట ఎం దున్నది? 'సంచిస్కారయిషుః' 'దగ్ధుకామః' అనునవి యొండొంటికి పూరణములు గాక రెండు కోటులం జెప్పునవియా? సంస్కారము దహన ఖనన త్యాగాది బహు భేదములు గలది గావున అందు అతఁడు దహనమును గ్రహించె ననుట కాదా? తాను 'ధర్మరాజు' విద్వాంసుఁడును, ఉత్తమవర్ణుఁడు అధమవర్ణునికైనను జ్ఞాన వైభవోపేతునికి ఇట్లు చేయఁదగునని యెఱిఁగి నిశ్చయించుకొనుటయే "సంచిస్కారయిషుః దగ్ధుకామః' అనుట దానినే అతఁడు యతియై పోయినాఁడు బాబూ, యతులకు అది —దహన సంస్కారము— అక్కరలేదని ఆకాశవాణి వల దన్నది కావున ధర్మరాజుయొక్క ఆ కోరికను చెప్పుటయే చాలును శ్వపచోఽపి మహీపాల విష్ణు భక్తో ద్విజాధికః విష్ణుభక్తి విహీనస్తు యతిశ్చ శ్వపచాధమః—అను మొదలగు ధర్మమును ధర్మరాజు విద్వాంసుఁడు తాన ఎఱుంగఁడా? దాననే ఈ యాచార్యు లెల్లరు సాధింపఁగోరిన ధర్మము ఉత్తమ వర్ణుఁడు జ్ఞానాధికాధమవర్ణునికి సంస్కారముచేయవలసినది యనుట నిర్వ్యాఘ మగును. వారి యెత్తికోలు చెల్లును

దానిని ఆకాశవాణి కారణవిశేషముం జెప్పి నిషేధించి యుండుఁగాక, దాన బాధ లేదు. మఱి యట్లు బ్రహ్మమేదము చేసియున్న ఆమాట ఒక బంతిలోనైనను ఇటం జెప్పఁబడలేదే అట్లు చేసియే యున్న, కూఁతవేటు దూరాన నున్న తన జనమును పిలువఁడా, వారిం గలుపుకొని తోడు చేసికొనఁడా, ఆ వివిక్తైకాంతముననే తా నొక్కఁడే అంతయు చేసివేయునా? అసంభావ్యము! అటనుండి వచ్చి యా వృత్తాంతము నెల్లం జెప్పి వారికి ఆశ్చర్యముం గలిగించి, చక్కఁగా సమాధానపడియున్న తాను వారిని సమాధాన పెట్టెను. ఒక్కరును ఇంకను ఏమో సేపము ఉన్న దనుకొనలేదు.

'నైష శోచ్యః పరంతప!
ఇ త్యుక్త్వా ధర్మరాజ స్స
వినివృత్య తతః పునః
రాజ్ఞో వైచిత్రవీర్యస్య
త త్సర్వం ప్రత్యవేదయత్"

ఆకాశవాక్కు విన్నఁగానే తాను సమాధానపడి మరి తన కేమియు అక్కడ పనిలేనట్లు 'వినివృత్య తతః పునః' అటనుండి మరలివచ్చెనని చెప్పఁబడినది ధృతరాష్ట్ర గాంధార్యాదులు, పాండవులు, వారిం జూడవచ్చిన మునులు అందఱు అట ధృతరాష్ట్రాశ్రమమున నొక్కెడఁ గూర్చుండి మాటలాడుకొనుచుండినారే, అందుండిలేచి ధర్మరాజు అట్లు విదురువెంట పోయినాఁడు ఆయన మరల ఆ సమకూడియున్నవారు చెదిరిపోక మునుపే వారి నడిమికి వచ్చినాఁడు వృత్తాంతము చెప్పినాఁడు. అదంతయు ముగిసిన తరువాత ధృతరాష్ట్రుఁడు ఆ చూడ వచ్చియుండినవారిని ఆ మంత్రణము చేసినాఁడు ఆ విదురుని కథ యంతయు అంతలో జరిగిపోయినది అంతే ధృతరాష్ట్రాదులు కాని, భీమాదులు కాని మమ్మేల పిలవవైతివి, మా కేల తెలుపవైతివి, మేము నీకు అందీయమా, కంటితో అంతయు చూడమా—అని యిట్లు ఏమియు అనలేదే!

భీష్ముడు విదురునికన్నం దక్కువవాఁడా? ఆయన సంస్కారపుఁ గథను ఎంత గొప్పగా చెప్పినాడ, వ్యాసుఁడు! ఎంత గొప్పగా అనువదించినాఁడు. తిక్కన! యోగసమాధిచే సొంతముగా ప్రాణాలు ప్రత్యవయవముగా విడదీసి వదలినవాఁడే!

'తతో ఽస్య విధివ చ్చక్రుః. పితృమేధం మహాత్మన
యజనం బహుశ శ్చాగ్నౌ జగుః. సామాని సామగాః' వ్యాసుడు.
'దేవవ్రతుని దేహంబు శ్రౌతాగ్ని కాహుతిసేసి ఒహుకుండంబు
లెత్తి ఘృతంబు ప్రయోగించి ప్రజ్వలింపఁజేసి రివ్విధంబునం
బిత్రుమేదంబు విభవ మహితంబుగ విధివిహితం...ంగా
ననుష్ఠించి . 'తిక్కన'

ఇట్లు ఆయనకు పితృమేధమే చేసినట్లు కంఠోక్తిచే చెప్పఁబడినది ఒటాయునకో రాముఁడు తాను సొంతముగా చితిపేర్చి ఆ దేహమును అం దిడి తన సొంత చేతితో నిప్పుపెట్టినాఁ డని చెప్పఁబడియున్నది పుణ్యలోకములం బొందుమనియు తానే ఆనతిచ్చినాఁడు మరి బ్రహ్మమేదమని వాల్మీకి మాట లేదు, కాని తన స్వజనమునకుం బోలె చేసినాఁడు రాముఁడు— అని చెప్పఁబడినందున అది బ్రహ్మమేధమే యగునని వ్యాఖ్యానించినారు భీష్మునియెడ వ్యాఖ్య కల్పింపనక్కర లేకుండ పితృమేధమని వ్యాసకంఠరవ మున్నది దశరథునికి, అశ్వమేధములు చేసిన చక్రవర్తికిని భరతుఁడు పితృమేధమే చేసినాఁడని వ్యాఖ్యాతల వాక్కు. జటాయువు అంతకన్నను స్వజనమగునా?

అంతటిని లెస్సగా పరికించిన, కథ పూర్వోత్తర సాధు సమాకలన చేసిన ఆచార్యులు, ఎవరిని మించినవారు మఱి లేరో, వారు ఏవురును విదురునికి సంస్కారము చేయఁబడిన దని చెప్పిన మాట పొరపాటనియే తోచును

యతికి, సర్వసంగపరిత్యాగము చేసి ఏ హిమాలయపు టడవులలోనో ఏ వింధ్యకాంతారములలోనో ఏ దండక గహనములలోనో తపస్సు చేసికొనుచుండువానికి, తన ప్రవృత్తి ఏవిధముగాను ఇతరులకు తెలియనిచ్చుట అక్కఱలేని వానికి, సామాన్యముగా అటు తెలియకయే యుండువానికి కొడుకు సంస్కారము చేయవలయు ననుట అ దెక్కడి శాస్త్రము? ప్రకటముగా ఒక్కెడ ఒక మఠముం గనుపెట్టుకొని యున్న తత్పూర్వాశ్రమంపుఁ బుత్రుఁడు డబుల్ ట్రిపుల్ యక్స్‌ప్రెస్ టెలిగ్రాంనో ట్రంకుకాల్‌నో అందుకొన్న వాఁడ 'పుత్రో గృహస్థ శుద్ధోఽథ యతేః సంస్కార మాచరేత్' అను శాస్త్రమును అనుష్ఠింపవలయునేమో మఱి సామాన్యముగా యతుల యోగక్షేమము కొడుకుల కందుచుండునా? అట్లన్యోన్య వ్యతికరము కూడునా? అదేమిశాస్త్రమో అబ్బా! 'యతిధర్మః దాహో ద్యయోగ్యత్వం' అని నీలకంఠ వ్యాఖ్య ఆకాశభారతిని విన్నఁగానే 'ధర్మరాజో విద్వాన్' మరి మోజోరియు పెట్టుకొనక మరలుట త న్నీలకంఠ శాస్త్రానుష్ఠానమునకు ఇదె ప్రజల పొరాణికోదాహరణము 'యతిత్వ గౌరవోజ్జ్వలుని కలేబరంబునకు వహ్ని విధానమొనచుటర్హమే' అను బుధారాధన విరాజి సోమయాజి తిక్కనయనువాదము దానిని చిత్తమునకు లెస్సగా ఎక్కించు వివరణము మఱి యేతిక్కలకును ఎడ మీయదు.

విదురుని యతిత్వము సామాన్యమా? వ్యక్తి విశేష నియతము కాదా? మఱి నీ కేల మశకము పాటివాఁడవు ఆ యేనుఁగుల జోలికిం బోవుట యందురెమో తమ వాక్కునకుం బ్రమాణమును దివ్యప్రబంధములనుండియు ఇంక నెందుండియు తెచ్చి నేర్పిన నేర్చు కొందమను ఆస. శిష్యుఁడను, జిజ్ఞాసువను. అంతే

# గాంధీతత్త్వం-ఒక పరిశీలన

శ్రీ కల్లూరి బసవేశ్వరరావు

**20**—వ శతాబ్దిలో భారత జాతిని ప్రభావితం చేసిన మహనీయులలో మహాత్మాగాంధి అగ్రగణ్యుడు ఆయన షుమారు మూడున్నర దశాబ్దాల పాటు తన ఉపదేశాలతో, విధానాలతో భారతీయుల దృక్పథంలో, తాత్విక చింతనలో, జీవన సరళిలో, రాజకీయ, ఆర్థిక, సాంఘిక విధానాలలో మార్పులు ప్రవేశ పెట్టటానికి యత్నించినాడు పిపీలికాది బ్రహ్మ పర్యంతం సర్వ విషయాలను గురించి ఆయన ఆలోచించినాడు. ఇతరులచేత ఆలోచింప చేసినాడు సెక్సు, బర్త్ కంట్రోల్, మద్యపానం, ధూమపానం, అంటరానితనం, ఆత్మ సంయమనం, మౌనవ్రతం, ప్రకృతివైద్యం, యంత్రయుగం, ఖద్దరు, చేతిపరిశ్రమలు, బ్రహ్మచర్యం— ఇత్యాది విషయాలను గురించేగాక, మానవ జీవితానికి ప్రధాన ప్రాతిపదికలని చెప్పదగిన సత్యం, అహింస, నీతి, స్వేచ్ఛ, వంటి విశిష్ట మౌలిక విషయాలను గురించి కూడ మహాత్ముడు నిశితంగా ఆలోచించి, తన భావాలను, సూటిగా, సరళంగా తెలియజేసినాడు. ఆయన భావాలతో ఇతరులంతా ఏకీభవించినా ఏకీభవించకపోయినా, ఆయనకు జీవితంపట్ల ఉన్న సమగ్రమైన దృక్పథాన్ని, ఆయన చూపిన నిశితమైన విచారణాశీలాన్ని పలువురు ప్రశంసించినారు కొందరు ఆయనను "విజ్ఞాన సర్వస్వంగా" వర్ణింపగా, మరికొందరు 'మహాత్మా గాంధి భారత జాతిపిత, భారతీయులకు ఉపదేశకుడు, ఉపాధ్యాయుడు' అని వ్యాఖ్యానించినారు ఇంకా కొందరు ఆయనను గౌతమబుద్ధునితో, ఏసుక్రీస్తుతో పోల్చినారు

"గాంధిజం అనేది ఏమీలేదు నా తర్వాత నా పేరుమీద ఒక తెగ ఉండాలని నా అభిమతంగాదు" అంటాడు మహాత్ముడు అయినప్పటికీ ఆయన వ్రాసిన పుస్తకాలనూ, చేసిన వ్యాఖ్యానాలనూ, "హరిజన్" "యంగ్ ఇండియా" వంటి పత్రికలలోని ఆయన వ్రాతలనూ ఆధారం చేసుకొని, ప్యారేలాల్, మహదేవ్ దేశాయ్, టెండూల్కర్ వంటి గాంధేయులేగాక, పలువురు ఇతర పండితులు గాంధితత్వాన్ని గురించీ, దాని పూర్వాపరాలను గురించీ, వర్తమాన పరిస్థితులకు దానిని అన్వయించుకోవటం ఎంతవరకు సాధ్యమనే విషయాన్ని గురించీ నిశితంగా పరిశీలించి వ్యాఖ్యానించారు అటువంటివారిలో దివాకర్, రిచర్డ్ గ్రెగ్, నిర్మలకుమార్ బోస్, గోపీనాథ ధావన్, డాక్టర్ ఉన్నితన్, కె యం పణిక్కర్, హెప్రియాన్స్, నార్మన్ బ్రౌన్, ఆర్ సి మజుందార్, మహాదేవప్రసాద్—మొదలయినవారు గణనీయులు వారు మహాత్మాగాంధిని ఒక అవతార పురుషునిగా, ఒక ప్రవక్తగా కాక, ఒక రాజకీయవేత్తగా, సాంఘిక సంస్కర్తగా, విప్లవమూర్తిగా, తాత్వికునిగా చిత్రించినారు

గాంధితత్వంయొక్క స్వరూప స్వభావాలను వివరించేముందు 'గాంధి మతవాది ఆయన మతాన్ని రాజకీయాలకు జోడించి వానిని సంకుచితంచేశాడు' అన్న దురభిప్రాయాన్ని తొలగించటం అవసరం. గాంధి మహాత్ముడు హిందూ మతస్థుడు అయితే హిందూమత సంప్రదాయాలను తు. చ. తప్పకుండా గుడ్డిగా విశ్వసించే సనాతనుడుకాదు పూజలు, వ్రతాలు, తీర్థయాత్రలూ ఆయనను ఆకర్షించలేదు పరతత్వ చింతనం, మాయావాదం, అద్వైతసిద్ధాంతం, మంత్ర తంత్రాలు, అణిమాదిసిద్ధులూ, పరిపూర్ణయోగం, అతీత మానవుడు ఇటువంటి మార్మికమైన విషయాలను ఆయన పట్టించుకోలేదు. వేదాలకూ, బ్రహ్మసూత్రాలకూ ఆయన వ్యాఖ్యానాలు వ్రాయలేదు. షడ్దర్శనాల సారాన్ని ఆయన ఉపోశనం పట్టలేదు హైందవ మత గ్రంథాలలో భగవద్గీత, రామాయణాలు ఆయనకు ప్రీతిపాత్రములు ప్రార్థన ఆయనకు కవచం. గోసంరక్షణ ఆయన దృష్టిలో పవిత్రమైన కార్యం. కాని శాసనం ద్వారా గోవధ నిషేధాన్ని అమలు పరచటం ఆయన కోరలేదు యజ్ఞయాగాలను గాంధి చెయ్యలేదు పీఠాధిపతుల ఆశీర్వాదంకోసం ఆయన అర్రులు చాచలేదు హైందవ మతంలో తన అంతరాత్మ అంగీకరించని విషయాలను ఆయన స్వీకరించలేదు

మతాన్ని గురించి గాంధి తీవ్రంగా ఆలోచించి సొంత నిర్ణయాలు చేసుకొన్నాడు పాత సంప్రదాయాలకూ, పీఠాధిపతుల వ్యాఖ్యానాలకూ ఆయన తలఒగ్గలేదు. భగవంతుని అస్తిత్వాన్ని, ఆత్మ ఉనికిని ఆయన అంగీకరించినాడు ఆయన సిద్ధాంతం ప్రకారం మత ప్రభావం మానవుని సర్వ వ్యాపారాలపైనా ఉండాలి. "ఈ విశ్వం క్రమబద్ధమైన, నైతిక ప్రభుత్వానికి లోబడి ఉన్నదను విశ్వాసమే మతం" అంటాడు గాంధి [Religion is a belief in the ordered moral government of the Universe] మతానికి నైతికపరమైన నిర్వచనం చెప్పబోయినందువల్ల, మతం మానవ జీవితంలో కిరీట స్థానాన్ని పొందుతున్నది "మతంలేక మానవుడు మనలేడు. కొందరు అహంకారంతో మతంతో తమకు నిమిత్తం లేదంటారు ఇలా ఉద్ఘాటించటం గాలి పీలుస్తూ ముక్కులేదనుకోవటమే" అంటాడు గాంధి. మతానికి నైతిక నియమాలు ప్రాణతుల్యాలు మతం మనిషికి ఉచ్ఛ్వాస, నిశ్వాసముల వలె సహజం ప్రపంచమతాలలో ఉచ్చనీచాలు లేవు సర్వమతాలూ సమాదరణీయాలే గాఢమైన పరిశీలన పిమ్మట ఆయన చేసిన నిర్ణయమిది— "సర్వమతాలూ సత్యములే సర్వమతాలూ అసంపూర్ణాలే ఏలనన మానవుడు అసంపూర్ణుడు గనుక" నైతిక నియమబోధితమైన మతం మానవుల సర్వ కార్యకలాపాలనూ శాసించాలని ఆయన తీర్పు మతం సత్యం మతం నైతిక సూత్రాల సంపుటి మతమంటే నైతిక ప్రమత్వమని చెప్పుకొన్నప్పుడు రాజకీయాలుగాని, ఇతర సాంఘిక ఉద్యమాలుగాని మతానికి దూరంగా ఎలా ఉంటాయి?

మతానికి, రాజకీయాలకూ అవినాభావ సంబంధాన్ని చెప్పినా గాంధి మతస్వామికాడు. ఆయన లక్ష్యం మతాతీతమైన లౌకికరాజ్యమేగాని, మతరాజ్యంగాదు మతాన్ని ప్రభుత్వరంగంలో దూర్చి సమాజాన్ని సంక్షుభితం చేయటం ఆయన అంగీకరించడు మత సంస్థలకు ప్రభుత్వం సహాయం చేయటాన్ని కూడ ఆయన హర్షించలేదు ప్రభుత్వంయొక్క దయా దాక్షిణ్యాలపై ఆధారపడినది నిజమైన మతమా? అని ఆయన ప్రశ్న గాంధి లక్ష్యం లౌకికరాజ్యం (Secular State) మతం కేవలం వ్యక్తిగతం. వ్యక్తిగత జీవితానికే మతాన్ని పరిమితంచేసినకో రాజకీయరంగం ప్రశాంతంగా సాగిపోతుంది ఆయన "హరిజన్"లో ఇలా వ్రాసినారు :—

'Religion was a personal matter and if we succeeded in confining it to the personal plane, all would be well in our political life'

మానవుని హేతుశీలానికి అందని ఏ మత సిద్ధాంతాన్నీ గాంధి అంగీకరించడు నైతిక ప్రవర్తనకు విరుద్ధమైన మతాచారాలను ఆయన ఖండిస్తాడు ఇది చాల ప్రధానమైన విషయం, మత సంబంధమైన సిద్ధాంతాలు హేతుబద్ధములా? కావా? మతాచారాలు నీతి సమ్మతములా? కావా? అని ఆయన వితర్కిస్తాడు హేతుబద్ధములు కాకపోయిననూ, నీతి విరుద్ధములు కానిచో ఆయన అట్టి మతాచారాలను సహి

ష్టుడు మత సిద్ధాంతాలనూ, ఆచారాలనూ పరిశీలించేటప్పుడు "నీతి" ఆయనకు గీటురాయి. నీతికి నిలబడని మత సంప్రదాయాలూ, భావాలూ దోష భూయిష్ఠాలు; సహింపరానివి. 1920లో గాంధి "యంగ్ ఇండియా"లో వ్రాసిన యీ వాక్యాలే ఇందుకు సాక్ష్యం:—

'I reject any religious doctrine that does not appeal to reason and is in conflict with morality. I tolerate unreasonable religious sentiment when it is not immoral.'

## 2

రిచర్డ్ గ్రెగ్ గాంధి మహాత్ముని ఒక సాంఘిక, వైజ్ఞానికవేత్తగా, ఒక సాంఘికపరిశోధకునిగా చిత్రించినాడు [Gandhi is a Social Scientist and a Social Inventor. ఏ భావాల ప్రభావానికీ, ఏ సాంఘిక పరిస్థితుల ప్రాబల్యానికీ లోనై గాంధి తన సిద్ధాంతాలను రూపొందించాడో చూద్దాం. బాల్యకాలంలో గాంధి తన తల్లి ధార్మిక చింతనవల్ల, తండ్రి సద్గుణాలవల్ల ప్రభావితుడైనాడు. సత్యహరిశ్చంద్రుని గాథ, జైనధర్మం ఆయనను ఆకర్షించినాయి. ఇంగ్లండునుండి తిరిగివచ్చిన పిమ్మట రాజచంద్రుడనే జైన యువకుడు గాంధి భావ వికాసానికి తోడ్పడినాడు. దక్షిణాఫ్రికాలో ఉండగా అమెరికా రచయిత డేవిడ్ థోరో, రష్యా రచయిత లియో టాల్‌స్టాయీల రచనలు ఆయనకు అహింసా విధానంలో మార్గాన్ని చూపించినాయి. టాల్‌స్టాయికీ, ఆయనకూ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగినాయి. ఇక జాన్‌రస్కిన్ విరచితమైన 'Un To The Last' అనే గ్రంథం ఆయన దృక్పథాన్నే మార్చివేసింది. ఆ పుస్తకాన్ని గాంధి "సర్వోదయ" అను పేరుతో గుజరాతీలోనికి అనువదించినాడు. గాంధి వివరణ ప్రకారం జాన్‌రస్కిన్‌వలన ఆయన మూడు విషయాలు గ్రహించినాడు—అవి యేవన

(1) వ్యక్తియొక్క అభివృద్ధి సమాజస్థులందరి అభివృద్ధిలో యిమిడి వుంది. (2) లాయర్ వృత్తికి మంగలివాని వృత్తికి వున్నపాటి విలువయే వుంది. ఏలనన అందరూ తమ పనిద్వారా జీవన భృతిని సంపాదించుకోటానికి సమానమైన హక్కును పొందివున్నారు గనుక. (3) శ్రమైక జీవనం—అనగా కర్షకుని జీవనం లేదా చేతిపనివాని జీవనం విలువైనది. అనుభవింపదగినది. ఇక ధార్మిక గ్రంథాలలో బైబిల్, కొరాన్, భగవద్గీత, తులసీదాసు రామాయణం, ఈశోపనిషత్తు, వివేకానందుని రాజయోగం, పతంజలియోగ సూత్రాలు మహాత్ముని మెప్పు పొందినవి. కారల్ మార్క్స్ రచించిన "కాపిటల్" అన్న గ్రంథాన్ని ఆయన చదివినాడు. అయితే మార్క్స్ నిర్ణయాలతో ఆయన ఏకీభవింపలేదు.

నాటి భారత దేశంలోని రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక స్థితిగతులను గాంధి కూలంకషంగా పరిశీలించినాడు. భారతదేశం ఆంగ్లేయుల సామ్రాజ్య వాదానికి ఎరయైనది. భారతీయులు రాజకీయంగా అస్వతంత్రులు. వారి సాంఘిక వ్యవస్థ కుళ్లిపోయినది. కులతత్వం, అంటరానితనం, బాల్య వివాహాలు, హైందవ, మహమ్మదీయ సంఘర్షణలు, స్త్రీల వెనకబడినతనం, నిరక్షరాస్యత, సోమరితనం—వీని భారంతో భారతసమాజం బలహీనమైనది. భారతీయులు తమ ప్రాచీన సంస్కృతిలోని విలువలను తెలిసికొనకుండా, పాశ్చాత్యులు ప్రతిష్ఠించుకొన్న నవీన నాగరికతమోజులో పడుతున్నారు. ఇక భారతీయుల ఆర్థిక దుస్థితి, వారి దారిద్ర్యం, నాటి కరువు కాటకాలు గాంధిని కల్లోల పరచినాయి. 1936లో ఆయన "హరిజన్" లో యిలా వ్రాసినాడు.

'I have indeed wept to see the stark poverty and unemployment in our country but I must confess our own negligence and ignorance are largely responsible for it. We do not know the dignity of labour as such.'

రాజకీయంగా, నైతికంగా, ఆర్థికంగా పతనమై శోచనీయావస్థలో ఉన్న భారతజాతి గాంధికి సాక్షాత్కరించింది. అట్టి భారతజాతిసముద్ధరణకై ఆయన తన జీవితాన్ని ముడుపుకట్టినాడు. అయితే భారత జాతి సముద్ధరణ ఎలా సాధ్యం? అన్న ప్రశ్నకు గాంధి సమాధానం రెండు రకాలుగా వుంది. ఒకటి జాతి విముక్తికై ఆంగ్లేయుల పరిపాలనను అంతమొందించటం రెండు: సాంఘిక వికాసానికీ, నైతికాభివృద్ధికి నిర్మాణాత్మకమైన కృషి చేయటం. ఈ రెండు పనులలో ఏది ముందు, ఏది వెనుక అనే ప్రశ్న అర్థరహితం. ఒక వైపు రాజకీయ విమోచనకై పోరాటం జరుపుతూ, మరోవైపు సాంఘిక, నైతిక పునరుద్ధరణకు పునాదులు వేసుకోవాలి.

ఈ సందర్భంలో 'Progress' అభివృద్ధిని గురించి గాంధి భావాలు తెలుసుకోవాలి. లేకపోయినచో గాంధితత్వంలోని అంతరార్థం గోచరింపదు. గాంధి ఆర్థికాభివృద్ధికీ—నైతికాభివృద్ధికీ మధ్య వున్న వైరుధ్యాన్ని నొక్కిచెప్పినాడు. నైతికాభివృద్ధి ఆధ్యాత్మికం. ఇది జీవితపు విలువలకు సంబంధించినది. సత్యపరాయణత, అహింస, ప్రేమలను అనుష్ఠించటం ద్వారా కలిగే ఆత్మ వికాసమే నైతికాభివృద్ధి. ఆర్థికాభివృద్ధి భౌతికమైనది. ఇది భౌతిక సుఖాలకు సంబంధించినది. కూడు, గుడ్డ లేక అలమటించే నిరుపేదకు నైతిక వికాసం పూజ్యం. అంతులేని సంపదతో అతులిత భోగాలను అనుభవించే కుబేరులకు కూడా నైతిక వికాసం పూజ్యం. ఆర్థికాభివృద్ధి అతి తక్కువగా వున్నా, లేదా అతి ఎక్కువగావున్నా నైతిక పతనం యేర్పడుతుంది. కాగా నైతిక వికాసానికి అవరోధంలేని పద్ధతిలో ఆర్థికాభ్యుదయం జరగాలి. హద్దులేని భోగవాంఛలకు ఆనకట్ట కట్టాలి. నైతిక వికాసానికి ఎంతవరకు అవసరమో అంతవరకే సంపదలు ఉండేటట్లు చూడాలి. అనగా సమాజంలో నైతికాభివృద్ధికీ—ఆర్థికాభివృద్ధికీ మధ్య వైరుధ్యం లేనివిధంగా ఒక సమస్థితిని (Equlibrium) యేర్పాటు చేసుకోవాలి. అట్టి సమస్థితిలేనినాడు జాతి నైతికంగా పతనంగాక తప్పదు.

1908–లో గాంధి 'హింద్ స్వరాజ్' అనే పుస్తకాన్ని వ్రాశాడు. అందులో భారతదేశ పరిస్థితినీ, నవనాగరికతను అనుభవిస్తూ వున్న పాశ్చాత్య దేశాల పరిస్థితినీ పరిశీలించినాడు. దుర్భర దారిద్ర్యానికి లోనైన భారతావనిలో నైతిక మాలిన్యం యేర్పడింది. యంత్రాగారాలను స్థాపించి, పట్టణాలను అభివృద్ధి చేసుకొని అతులిత భోగ భాగ్యాలను అనుభవిస్తూఉన్న పాశ్చాత్య దేశాలలోకూడ నైతికపతనం యేర్పడింది. ఆధ్యాత్మికపు విలువలు లుప్తమైనవి. కనుక భారతీయులు 'స్వరాజ్యాన్ని' సంపాదించుకొని, నవీన నాగరికత అనే జాడ్యంతో నీరసిస్తున్న పాశ్చాత్య దేశాలను అనుసరిస్తే అది అచ్చమైన స్వరాజ్యంకాదు. ఆత్మవికాసానికీ, ఆధ్యాత్మిక ఔన్నత్యానికీ దోహదం చేసేవిధంగా వారు తమ సమాజాన్ని పునర్నిర్మాణం జేసుకోవాలి. అచ్చమైన సుఖం నైతిక నియమపాలనంవల్లనే లభిస్తుంది. శారీరక సుఖాలుగానీ, అంతులేని ఐశ్వర్యంగానీ, శాంతినీ, సుఖాన్నీ ప్రసాదింపవు ('Gandhi denied that happiness means only physical pleasure or economic prosperity. He maintained that man could be happy only if he led a simple life and obeyed moral laws'.) నిరాడంబర జీవితం నైతిక నియమాలను పాటించటానికీ, ఆత్మ వికాసానికీ దోహదం చేస్తుంది. నిరాడంబర జీవితాన్ని అనుసరిస్తూ, ఆధ్యాత్మికపథంలో నైతిక వికాసాన్ని అందుకొనే ఉదర్కరాజ్యంగా భారతదేశాన్ని రూపొందించటమే గాంధి మహాత్ముని లక్ష్యం. అట్టి లక్ష్యసాధనకోసం ఆయన చూపిన మార్గంలో రెండు ప్రధానాంశాలు వున్నాయి. అవి యేవన—1 సత్యము 2 అహింస. 'నేను కొత్తగా బోధించినది యేమీ లేదు. సత్యం—అహింస అనునవి పర్వతాలవలె పురాతనములు. వీలైనంత విస్తృత పరిధిలో నేను వానితో ప్రయోగాలు మాత్రం చేశాను' అని అంటాడు ఆయన. నిజానికి ఆయన సత్యాహింసలను విస్తృత పరిధిలో, ప్రయోగించుటయేగాక, వానికి నూతన అర్థాలనూ, ప్రాధాన్యాన్ని కల్పించినాడు. వానిని ప్రధాన ప్రాతిపదికలుగా చేసి నవ భారత సమాజ నిర్మాణానికి పూనుకొన్న ఘనత గాంధికే దక్కుతుంది. కాగా సత్యము—అహింస

లను గూర్చిన ఆయన తలంపులు రేఖామాత్రంగానైనా వివరించటం అవసర మవుతున్నది:—

1. సత్యము—సత్యం అనుపదం 'సత్' నుండి వచ్చింది. 'సత్' అనగా ఉన్నది అని అర్థం. అట్లు ఉన్నది యేదో అదే సత్యం ప్రతివ్యక్తీ సత్యాన్ని నిరంతరం అన్వేషిస్తాడు. అది వానికి నైజం సత్యమంటే కేవలం మాట నిలబెట్టుకోవటంగాదు మనస్సులో, వాక్కులో, క్రియలో—సర్వ కార్యకలాపాలలో సత్యం అనుష్ఠింపబడాలి గాంధి మతం ప్రకారం ఎక్కడ సత్యముందో అక్కడ జ్ఞానమున్నది సత్యనిరతియే మానవ జీవితానికి అర్థం కల్పిస్తుంది 1920 కి పూర్వం గాంధి దైవమే సత్యము అని భావించాడు. కాని తర్వాత ఆయన సత్యమే దైవము అని నిర్ణయించాడు (Truth is God) ఇట్లా భావించటంవల్ల సత్యాన్ని ఆరాధించే ప్రతి మనిషితో ఆయనకు పొత్తు కుదురుతున్నది తనకు గోచరించినట్లుగా ఇతరులకు సత్యం సాక్షాత్కరింపకపోవచ్చు వారు ఆస్తికులు గావచ్చు, నాస్తికులు గావచ్చు వారి మత విశ్వాసాలతో ఇట ప్రమేయం లేదు. వారు గాంధివలె సత్యాన్ని ఆరాధిస్తున్నారు అందుచేత గాంధి వారిని కూడ సత్యపథంలో సహయాత్రికులుగా గుర్తించినారు నిర్మలకుమార్‌బోస్ చెప్పిన మాటలు గుర్తు చేస్తాను —

'By enthroning Truth on the highest pedestal, Gandhi thus truely became a Catholic, and lost all traces of separateness from every other honest man who worshipped Gods other than his own'

సత్యం అనంతం అఖండం. నిత్యం మానవుడు అనిత్యం అపరిపూర్ణుడు కాగా మానవుడు పరిపూర్ణ సత్యాన్ని దర్శింపలేడు సత్యానికున్న అనంతముఖాలలో ఒక భాగాన్ని మాత్రమే చూడగలడు పాక్షిక సత్యాన్నే పరమ సత్యంగా భావించడం, ఇతరులు అసత్యవాదు లనుకోవటం, అందుకు వారు శిక్షార్హు లనుకోవటం అసమంజసం మానవుడు పరిపూర్ణ సత్యాన్ని తెలిసికోలేడు గనుక, అతడు ఇతరులను శిక్షించటానికీ, హింసించటానికీ అనర్హుడు 'సత్యపథగామి ఎదుటివానిని హింస ద్వారా గాక, ఓర్పుద్వారా, సానుభూతిద్వారా, అక్రమ మార్గాన్నుండి తొలగించాలి ఏలనన ఒకనికి సత్యంగా భాసించినది వేరొకనికి అసత్యంగా గోచరింపవచ్చు' నంటాడు గాంధి సత్యాచరణ ఏకాంతంగా కొండగుహలలో జరగదు సామాజిక జీవనమే సత్యాచరణకు మూలం. సత్యాచరణలో మనిషికి గోచరించేది పాక్షిక సత్యమే. కాగా సత్యం సాపేక్షమవుతున్నది (Truth is Relative) ఈ పరిస్థితులలో ఎవరికి గోచరించింది సత్యానికి చేరువగా వున్నది? అనేది ముఖ్యమైన ప్రశ్న ఈ ప్రశ్నలకు సమాధానం హింసవలన, బలప్రయోగంవలన లభింపదు. హింసవలన సత్యం అణగద్రొక్కబడుతుంది సత్యాన్వేషణలో అహింసయే ఏకైక మార్గం. సత్యవాది విధిగా అహింసావాది కాకతప్పదు

2 అహింస—గాంధిమహాత్మునికి అహింస కేవలం పరమ ధర్మమే గాదు సత్యాన్ని చేరడానికి అహింసయే సాధనం (Truth is the End Non Violence is the Means) అహింసద్వారా సత్యాన్ని సాధించడాన్ని ఆయన 'సత్యాగ్రహం' అన్నాడు సత్యాగ్రహం అనగా 'సత్యాన్ని పట్టుకొని ఉండుట' (Adherence to truth) సత్యానికీ, అహింసకూ మధ్య అవినాభావ సంబంధ ముంది అవి రెండూ ఒకే నాణెముకున్న రెండు ముఖాలు

అహింసా సిద్ధాంతంలో అంతర్గతమైఉన్న ప్రధానాంశాలను 1936 లో 'హరిజన్' లో గాంధి వివరించాడు ఆ వివరణ సారాంశం యిక్కడ పొందు పరుస్తాను —

1. అహింస మానవ జాతికి ప్రధాన నియమం. పశుప్రాయమైన హింసకంటె అహింస నిస్సందేహంగా మిన్న

2 ప్రేమయందు విశ్వాసంలేనివారికి అహింస నిష్ప్రయోజనం.

3 ఆత్మ గౌరవాన్ని అహింసద్వారా కాపాడుకోవచ్చు కాని అవినీతి చర్యలనూ, అక్రమసంపాదననూ అహింస రక్షింపదు.

4 అహింసను ఆచరించే వ్యక్తులుగాని, జాతులుగాని త్యాగాలు చేయక తప్పదు. సామ్రాజ్యవాదం అహింసకు బద్ధ విరోధి

5 అహింస ఒక శక్తి. స్త్రీలు, పురుషులు, పిన్నలూ—అందరూ యీ శక్తిని ఉపయోగింపగలరు అయితే వారికి ప్రేమలో విశ్వాసం అవసరం. సర్వమానవులనూ వారు ప్రేమింపగలగాలి.

6. అహింస వ్యక్తులకేగాని, వర్గాలకూ, సంఘాలకూ, దేశాలకూ ఉద్దేశింపబడలేదనుకోవటం పొరపాటు.

పై వివరణనుబట్టి అహింస ఒక ఆలోచనావిధానమే గాదు; అది ఒక జీవిత విధానమనియూ తెలుస్తున్నది. హింసకు వ్యతిరేకార్థములో అహింస వాడబడలేదు. హింసకు దూరంగా వుండటం అహింసగాదు భావనలో, మాటలో, క్రియలో హింసారాహిత్యం అవసరమే అహింస యనగా సర్వమానవులనూ, సర్వ ప్రాణులనూ ప్రేమించటం అహింస దుష్ట శిక్షణను నిర్దేశింపదు. కీడు చేసినవానికి మేలు చేయవలయును కీడు చేయుటలో అతనితో సహకరింప రాదు. హింసను అహింసతో నిరోధించాలి ఈ విషయంలో గాంధి అభిప్రాయ మిట్లున్నది —

'I accept the interpretation of Ahimsa namely that it is not merely a negative state of harmlessness, but it is a positive state of love, of doing good even to the evil-doer But it does not mean helping the evil doer to continue the wrong or tolerating it by passive acquiescence. On the contrary, love, the active state of Ahimsa, requires you to resist the wrong doer by dissociating yourself from him even though it may offend him or injure him physically'

హింసను అహింసతో నిరోధించటంలో త్యాగం, దుఃఖం అనివార్యం. అహింసావాది తన వేదనవలన—బాధవలన హింసావాది హృదయ పరివర్తనను సాధించాలి. అతడు సత్యాన్ని తెలుసుకొనేటట్లు చేయాలి. ఇందుకు అకుంఠిత సాహసం—ధైర్యం అవసరం. పిరికివానికి అహింస తగదు గాంధి అంటాడు — 'నేను పిరికితనాన్ని అంగీకరించను పిరికితనానికి బదులు హింసను సమర్థిస్తాను' అని అహింసకున్న శక్తి అపారం అహింసద్వారా అన్యాయాన్ని, అక్రమాన్ని నిరోధించి నెగ్గటం సంభవమే మహాత్ముని మాటలలో యీ విషయాన్ని యిలా చెప్పవచ్చు.—

'Non Violence in its dynamic condition means conscious suffering It does not mean meek submission to the will of the evil doer, but it means the pitting of one's whole soul against the will of the tyrant Working under this law of our being, it is possible for a single individual to defy the whole might of an unjust empire ...'

సమాజాన్ని కలుషితంచేసి, మానవ జీవితాన్ని దుర్భరం చేస్తున్న అన్యాయాన్ని వ్యక్తులు అహింస ద్వారా నిరోధించడాన్నే గాంధి 'సత్యాగ్రహం' అన్నాడు సత్యాగ్రహం అహింసాయుత విధానం అహింసాయుత ఆయుధం. ఈ ఆయుధానికి ప్రేమ, వేదన (Love and Suffering) అనేవి రెండు ముఖాలు. సత్యాగ్రహతత్త్వాన్ని గురించీ, దానిని ఉపయోగించే తీరు తెన్నులను గురించీ, సత్యాగ్రహి కుండవలసిన గుణ విశేషాలను గురించీ గాంధి మహాత్ముడు పెక్కు విషయాలు వివరించియున్నాడు అహింసాయుత సత్యాగ్రహం యుద్ధకాలంలోనూ, శాంతికాలంలోనూ, వ్యక్తిగత—సామాజిక విషయాలలోనూ అనుసరణీయం మనిషి క్రమంగా హింసామార్గాన్ని వదలి ఎలా అహింసామార్గాన్ని వరిస్తున్నాడో గత చరిత్ర చెప్పుతున్నది ఉన్నత స్థాయిలో అహింసా పరిణామమే మానవ చరిత్ర అంటాడు గాంధి.

అన్యాయంయొక్క స్వరూపాన్ని పూర్తిగా అవగతం చేసుకోవటం సత్యాగ్రహపోరాటంలో తొలిదశ. సంప్రదింపులు రెండవదశ. తరువాతి దశలో హర్తాల్, సహాయ నిరాకరణం, శాసనోల్లంఘనం, నిరాహారదీక్షవంటి విధానాలు అమలులోకి వస్తాయి. అయితే సత్యాగ్రహపోరాటంలో అత్యంతం 'అహింస' పాటింపబడాలి అంటాడు గాంధి. లేకపోతే అది దురాగ్రహ మవుతుంది.

మరొక ప్రధాన విషయాన్ని కూడ మహాత్ముడు ఉద్ఘాటించియున్నాడు. లక్ష్యమెంత ఉదాత్తమో, లక్ష్యసాధనకూడ అంత ఉదాత్తంగా ఉండాలి. న్యాయాన్ని, అన్యాయంద్వారా సాధించటం శ్రేయస్కరంగాదు. గమనానికీ—గమ్యానికీ అవినాభావ సంబంధముంది. లక్ష్యాన్ని సాధించటమే ప్రధానంకాదు. ఆ లక్ష్యాన్ని ధర్మబద్ధంగా సాధించటమూ కూడ ప్రధానమే. విధానం లోపభూయిష్టమైనప్పుడు లక్ష్యసిద్ధిలో శుద్ధి వుండదు. సాధనానికి లక్ష్యం—లక్ష్యసాధనలూ ఒకే సూత్రానికి ఉన్న రెండు చివరలు.

ఆంగ్లేయుల పాలననుండి భారతదేశాన్ని విముక్తం చేయుటయే గాంధి లక్ష్యంకాదు. సత్యాన్ని, అహింసనూ పునాదులుగా చేసి, ఒక నవభారతాన్ని, సమస్థితి నెలకొన్న ఒక నూతన సమాజాన్ని స్థాపించటం ఆయన ధ్యేయం. ఆ నూతన సమాజానికి నైతికవిలువలు గట్టి పునాదులు. భౌతికాభివృద్ధికీ—నైతిక వికాసానికీ అందు సమన్వయం సాధింపబడుతుంది. ఈ విషయాన్ని డాక్టర్ ఉన్నితన్ ఇలా వ్యాఖ్యానించారు:—

'Gandhi was visualising a balanced Indian society, solidly built on moral values.........His ultimate aim was attainment of a social equilibrium, an optimum combination of material and moral progress.'

## 3

మహాత్ముని ఆదర్శం 'రామరాజ్యం'. ఆ రామరాజ్యంలో సత్యం—అహింస సమస్తరంగాల్లో ప్రభుత్వం చేస్తాయి. అది సిద్ధించాలంటే చతుర్విధ మార్గాల్లో కృషి అవసరం. అవి యేవనః—1. వ్యక్తి సంస్కారం. 2. సాంఘిక సంస్కరణ. 3. ఆర్థిక పునర్నిర్మాణం. 4. రాజకీయ పునర్నిర్మాణం.

### 1. వ్యక్తి సంస్కారం

సంఘానికి వ్యక్తి మూలం. వ్యక్తి వికాసం వినా సాంఘిక వికాసంలేదు. కాగా వ్యక్తి సంస్కరణకు గాంధి అగ్రతాంబూలం యిచ్చాడు. సత్యాగ్రహానికి వ్యక్తియే మూలం. నిజమైన సత్యాగ్రహి కొన్ని నియమాలను, వ్రతాలను పాటించాలి. వ్యక్తి సంస్కారానికీ, వికాసానికీ గాంధి సూచించిన మార్గాలుచూద్దాం. ప్రతి మనిషి సత్యవ్రతాన్ని అనుష్ఠించాలి. మాటలో, చేతలో, ఆలోచనలో సత్యం ప్రతిబింబించాలి. ధన, మాన, ప్రాణాలకంటె సత్యపాలనం అధికం. సత్యంతో పాటు అహింసావిధానాన్ని ఆచరించాలి. అహింసయే పరమధర్మం. ప్రత్యర్థులను ప్రేమించాలి. ద్వేషం వర్జనీయం. దురాగ్రహం, దురాలోచన, స్వార్థం, పరులకు అహితాన్ని కోరటం—ఇవి హింసా విధానాలే. అహింసను ఆచరించటం కత్తిమీద సాము. అయితే అసాధ్యంమాత్రం కాదు.

బ్రహ్మచర్యవ్రతాన్ని పాటించటం అవసరం. బ్రహ్మచర్యమంటే కామాన్ని అదుపులో పెట్టుకోవటమే గాదు. సర్వేంద్రియనిగ్రహం బ్రహ్మచర్యం యొక్క లక్ష్యం కావాలి. వివాహితులకు కూడ బ్రహ్మచర్యం ఆచరణీయం. సంతానాపేక్షలేని కామక్రీడ దంపతులకు నిషిద్ధం కావాలి. జిహ్వాచాపల్యాన్ని అదుపు చేయుటం బ్రహ్మచర్యానికి తోడ్పడుతుంది. నిరాడంబరజీవితం వరణీయం. సంపదలపై మమకారం తగదు. అపరిగ్రహణం ఆవశ్యం ఆచరణీయం. వాంఛలను పెంచుకోవటం నిజమైన నాగరికత కాదు. వాంఛలను అదుపులో పెట్టుకోవటమే నాగరికత. భయాన్ని, పిరికితనాన్ని జయించాలి. పిరికితనం సత్యవ్రతాన్ని భంగపరుస్తుంది. 'స్వదేశీతత్వం' జీవన మార్గాన్ని నిర్దేశించాలి. ఆర్థిక, రాజకీయ, ధార్మిక వ్యవహారాలలో స్వదేశీతత్వమే శరణ్యం. అంటరానితనం నిర్మూలించడానికి ప్రతివాడూ కంకణం కట్టుకోవాలి. సోమరితనం పనికిరాదు. కాయకష్టం మహత్తర సద్గుణం. దీనినే గాంధి 'బ్రెడ్ లేబర్' అన్నాడు. సహనశీలం పెంపొందించుకోవాలి. మత సామరస్యం కొరకు అవిరతమైన కృషి చేయాలి. ఆహార విహారాల్లో నిరాడంబరత ప్రస్ఫుటం కావాలి. అహింసా వ్రతపాలనంలో శాకాహారం ప్రధాన ఉపాంగం. ప్రకృతి వైద్యం ఆచరణీయం. పైన పేర్కొన్నవి వ్యక్తివికాసానికి గాంధి సూచించిన మార్గాలు :

['These were the ideals he set for the individual to attain perfection, a satyagrahi was to follow them· The attempt of the individuals to reform themselves on these lines connoted moral and hence real progress according to Gandhian social philosophy.']

### 2. సాంఘిక సంస్కరణ

వ్యక్తి వికాసానికి అవరోధాలుగా నిలచిన పాత సంప్రదాయాలనూ, సాంఘికవ్యవస్థలనూ సంస్కరించడానికి గాంధి యత్నించాడు. సాంఘిక సంస్కరణ కుటుంబ వ్యవస్థతో ప్రారంభం కావాలి. బాల్య వివాహాలను గాంధి ఖండించాడు. వితంతు వివాహాలను అంగీకరించాడు. కొన్ని పరిస్థితుల్లో భార్యాభర్తలు విడాకు లిచ్చుకోవటం సమర్థించాడు. వరకట్నాలకు ఆయన బద్ధశత్రువు. అంతర్వర్ణ వివాహాలను ఆయన ప్రోత్సహించాడు. సాంఘిక సంస్కరణ కార్యకలాపాల్లో స్త్రీల సముద్ధరణకు ఆయన ప్రత్యేకస్థానం యిచ్చాడు. దేవదాసీవ్యవస్థను తీవ్రంగా ఖండించాడు.

రాజా రామమోహనరాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, వీరేశలింగం వలె గాంధి సాంఘిక సంస్కరణలకొరకు కృషి చేశాడు. అంటరానితనాన్ని తొలగించడానికీ, హరిజనోద్ధరణకూ ఆయన చేసిన కృషి అనల్పం. మద్యపానాన్ని ఒక సాంఘిక దురభ్యాసంగా ఆయన భావించాడు. మద్యపాన నిషేధాన్ని ఆయన తీవ్రంగా అభిలషించారు. మత సామరస్యాన్ని ఆయన కేవలం తాత్వికరంగానికే పరిమితం చెయ్యలేదు. దానినొక జాతీయ సమస్యగా స్వీకరించినాడు. ముఖ్యంగా హైందవ—మహమ్మదీయ సామరస్యం ఆయన చేపట్టిన సాంఘిక పునర్నిర్మాణ కృషిలో ప్రముఖ స్థానాన్ని పొందింది.

నైతిక వికాసానికీ, సామాజికాభివృద్ధికీ విద్య పునాదియని గాంధి తలంపు. ఆయన దృష్టిలో నైతికాభివృద్ధి విద్యయొక్క లక్ష్యం కావాలి. చేతి వృత్తుల ద్వారా విద్య నభ్యసించే బేసిక్ విద్యా విధానాన్ని ఆయన రూపొందించాడు. గ్రామీణ చేతి వృత్తుల ద్వారా నడిచే జాతీయ విద్యా విధానమే బేసిక్ విద్యా విధాన మంటాడు గాంధి. ( National Education Througn Village handicrafts).

### 3. ఆర్థిక పునర్నిర్మాణం

భారతీయుల ప్రధాన ఆర్థిక సమస్య దారిద్ర్యం. దారిద్ర్య నిర్మూలనం జరగాలంటే జాతీయ సంపద పెరగాలి. అలా పెరిగిన సంపద కొద్దిమంది సంపన్నుల చేతిలో కేంద్రీకృతం కాకూడదు. ఈ దృష్టితో గాంధి ప్రతిపాదించిన ఆర్థిక సిద్ధాంతాలు పరిశీలనార్హాలు.

గాంధి ప్రతిపాదించిన మొదటి సిద్ధాంతం ధర్మకర్తృత్వ విధానం. దీని ప్రకారం భాగ్యవంతుడు తన సంపదకు తానే యజమాని. హేతుబద్ధమైన తన అవసరాలను తీర్చుకొనే నిమిత్తం మాత్రమే ఆ సంపదను వినియోగించాలి. మిగిలిన సంపదకు అతడు కేవలం ధర్మకర్త. దానిని అతడు సమాజ కళ్యాణానికే వినియోగించాలి. ఆర్థిక అసమానతలువున్న పెట్టుబడిదారీ వ్యవస్థకు విరుగుడుగా గాంధి యీ ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని సూచించాడు. అయితే పెట్టుబడిదారులు అక్రమమార్గాన కూడబెట్టడాన్ని ఆయన హర్షింపలేదు. వారు న్యాయమార్గాన ధనాన్ని ఆర్జింపవచ్చు. అట్లు కూడబెట్టిన ధనాన్ని వారు

దరిద్ర నారాయణుల కొరకే ముడుపు కట్టాలి. ఈ విలక్షణమైన సూత్రానికి నిజాయితీ పునాది నిజాయితీపరులైన సంపన్నుల హృదయ పరివర్తనపై దాని జయాపజయాలు ఆధారపడతాయి. తమ శక్తియుక్తులను సమాజ కళ్యాణానికే వినియోగించాలనే నైతికపరివర్తన వారిలో రావాలి ఇక కష్టజీవులు భాగ్యవంతుల నిజాయితీపై నమ్మకముంచాలి వారిని ధర్మకర్తలుగా భావించాలి. ఇట్టి హృదయ పరివర్తన వచ్చిననాడు అహింసాయుత పద్ధతులలో ఆర్థిక సమానత్వం సాధించటం సులభం లేనినాడు కష్టజీవులు న్యాయంకొరకు సత్యాగ్రహ పోరాటాన్ని కొనసాగింపవచ్చునంటాడు గాంధి

చిన్న తరహా గ్రామీణ పరిశ్రమలనూ, చేతివృత్తులనూ పెంపొందించి వాని ద్వారా ఆర్థికాభివృద్ధి సాధించటం గాంధి ప్రతిపాదించిన రెండవ సిద్ధాంతం

భారీ పరిశ్రమలనూ, యంత్రాగారాలనూ నెలకొల్పటం ఆయన అభిమతంగాదు. ఈ సందర్భంలో ఆయన వాదం యిలా వుంది —

"నేను యంత్రాలకు శత్రువునుకాను. ఈ శరీరం ఒక యంత్రమని నాకు తెలుసు చరఖా యంత్రమని నే నెరుగుదును భారీ యంత్రాగారాలు స్థాపించినందువలన కలిగే విషమపరిణామాలనుగూర్చి నేను ఆందోళన పడుతున్నాను భారతదేశంలో గ్రామీణ పరిశ్రమలపైన, చేతి వృత్తులపైన ఆధారపడి బ్రతుకుతున్నవారు అనేకమంది ఉన్నారు భారీ పరిశ్రమలు ఏర్పాటు చేసినందువల్ల వారు నిరుద్యోగు లౌతారు వారికి జీవనోపాధి లభింపదు పైగా యంత్రాగారాలు స్థాపించినందువల్ల కలిగే దుష్ఫలితాలను మనం చూస్తూ వున్నాం సంపద కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతమవుతున్నది కష్టజీవుల శ్రమ దోచుకోబడుతున్నది వారి వ్యక్తిత్వం నాశనమవుతున్నది ఒక మహా యంత్రాగారంలో వారొక చీలగా దిగజారిపోతున్నారు నాకు యంత్రం ముఖ్యం గాదు నాకు మనిషి ముఖ్యం అతని ఆత్మ వికాసం ముఖ్యం భారీ పరిశ్రమల వెంటబడి జాతి భౌతిక సుఖాలకు ప్రాకులాడటం నిజమైన నాగరికతకాదు అట్లని నేను సర్వయంత్రాలనూ నిరసింపను. గ్రామాల్లో, కుటీరాల్లో, చేతి వృత్తుల్లో తోడ్పడే చిన్న యంత్రాలను ఆహ్వానిస్తాను కాని మనిషిని మరగా మార్చే భారీ యంత్రాలు అనవసరం"

వర్తమాన పరిస్థితుల్లో కొన్ని భారీ పరిశ్రమలను స్థాపించటం అవసరమన్న వాదాన్ని గాంధి సంపూర్ణంగా త్రోసివేయలేదు అటువంటి పరిశ్రమలు వ్యక్తుల యాజమాన్యంలో ఉండడాన్ని ఆయన అంగీకరింపలేదు. అవి ప్రభుత్వ యాజమాన్యంలోవుండి ప్రజల శ్రేయస్సుకే వినియోగింపబడాలనే ఆయనవాదం. ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమాల్లో వికేంద్రీకరణ సూత్రాన్ని అనుసరించటం గాంధిమార్గం. ఉత్పత్తి సాధనాలు కొద్దిమంది చేతుల్లో కేంద్రీకరింపబడడాన్ని ఆయన కోరలేదు. వికేంద్రీకరణకు గ్రామీణ పరిశ్రమలు తోడ్పడతాయని ఆయన విశ్వాసం.

## 4. రాజకీయ పునర్నిర్మాణం

గాంధి తాత్వికంగా రాజ్యం (State) యొక్క అవసరాన్ని అంగీకరింపని అరాచకవాది (Anarchist). "రాజ్యం వ్యవస్థారూపంలో వున్న హింస. వ్యక్తికి ఆత్మ ఉన్నది. రాజ్యం ఆత్మరహితమైన యంత్రం. దానిని హింసామార్గంనుండి తప్పించటం అసాధ్యం" అంటాడు గాంధి రాజ్యం యొక్క అధికారాలు విస్తృతమైనందువల్ల మనిషి వ్యక్తిత్వానికి దెబ్బ తగులుతుందనీ, రాజ్య రహితమైన ప్రజాస్వామ్యమే ( Stateless Democracy ) ఆదర్శ సమాజమనీ ఆయన నమ్మకం అటువంటి సమాజంలో ఒకడు పాలకుడూ — మరొకడు పాలితుడూ అను భేదం ఉండదు ప్రతి మనిషి పొరుగువానికి యిబ్బందిలేని విధంగా నడచుకోవటం జరుగుతుంది గాంధి కోరిన ఆదర్శ ప్రజాస్వామిక సమాజానికి స్వయం పాలిత గ్రామాలు పునాదులు. ప్రతి గ్రామం సంపూర్ణాధికారాలు గలిగిన ఒక రిపబ్లిక్. అది తన వ్యవహారాలను తానే నడుపుకోగలదు. గ్రామ రిపబ్లిక్‌లకు వ్యక్తి స్వేచ్ఛ మూలం. అహింసాసూత్రం గ్రామపాలనలో పాటింపబడుతుపది గ్రామ రిపబ్లిక్‌లు పునాదులుగా, తాలూకా, జిల్లా, రాష్ట్ర, జాతి స్థాయిలలో విశాలమైన రిపబ్లిక్ వ్యవస్థలు యేర్పాటు చేయబడతాయి. ఈ వ్యవస్థలో అధికార హోంఛకూ, రాజకీయ పక్షాల తంత్రాలకూ తావుండదు. ప్రభుత్వం విస్తృతమైన అధికారాలను కలిగివుండదు 'That Government is the best which governs the best' అనే సూత్రం పాటింపబడుతుంది. ఈ వ్యవస్థకు అహింస మూలం ప్రజాసేవ ప్రాణం వ్యక్తి వికాసం ప్రధానం గోపీనాథ్ ధావన్ గాంధి చిత్రించిన ఆదర్శరాజ్యాన్ని గురించి యీవిధంగా వ్రాయుచున్నాడు

'Gandhi is a philosophical anarchist because he believes that this end can be realised only in the classless and stateless democracy of autonomous village communities based on non-violence instead of coercion, on service instead of exploitation, on renunciation instead of acquisitiveness and on the largest measure of local and individual initiative instead of centralisation,'

## 4

గాంధినడిపిన ఉద్యమాలు భారతీయులలో నవ చైతన్యాన్ని కలిగించాయి వాని ప్రభావం వల్ల వారిలో సాంఘిక న్యాయం కొరకు పోరాడటం ఒక లక్ష్యమయింది సంపద, అధికారం ఏకొద్దిమందికో భుక్తంగాక,అందరు అనుభవించాలనే వాదం బలపడింది ప్రజోద్యమాలు బలపడి భారతీయ ప్రజా స్వామ్యానికి విస్తృతమైన ప్రాతిపదిక యేర్పడింది. పైగా ఆయన పాత సంప్రదాయాలనూ, మూఢనమ్మకాలనూ ఎదుర్కొని సామాజిక విప్లవానికి నూతన జవసత్వాలను ప్రసాదించినాడు అయినా యీనాడు గాంధి భావాలను ఆచరణలో పెట్టటం సులభసాధ్యం కాదంటాడు డాక్టర్ ఉన్నితన్

'Gandhian ideas were revolutionary in so far as they questioned rhe traditions, customs, habits and the authorities behind such practices. To that extent indian society derived a force or consciousness to pursue the changes in the same directions. But in other respects, the practical application of gandhian ideas meets with almost insurmountable difficulties which result from the dictates of the social and economic forces of a world society.'

గాంధితత్వం భారతీయుల ఆశయాలనూ, ఆదర్శాలనూ ప్రతిబింబించలేకపోయింది సైన్సు, టెక్నాలజీలను ఆశ్రయించి యితరదేశాలు, సాధిస్తున్న పురోగతి వారిలో క్రొత్త ఆశలను రేకెత్తించింది ప్రకృతి శక్తులను కైవసం చేసుకొని, సంపదను అభివృద్ధిచేసి ఉన్నతమైనజీవన ప్రమాణాలను అందుకోవాలని ఉవ్విళ్ళూరే భారతీయులకు గాంధి మార్గం కేవలం నిరాడంబర జీవితాన్ని ప్రసాదించింది. గాంధి సూచించిన ఆధ్యాత్మిక శిఖరాలు— వానిని చేరుటకు అవలంబించ వలసిన బ్రహ్మచర్యం, అపరిగ్రహం వంటి దీక్షలు వారికి ప్రాచీన ఋషి వాటికలను గుర్తుకు తెచ్చినాయి యంత్రనాగరికతనూ, టెక్నాలజీని నిరసించి గ్రామీణ పరిశ్రమలకు పట్టం గట్టిన గాంధి విధాన్ని వారు వెనకచూపుగా భావించారు.

ఈ సందర్భంలో గాంధి సమకాలికులు ఆయన సిద్ధాంతాలను యే దృక్పథంతో విమర్శించారో తెలిసికోవటం ఆసక్తికరం 1920 ప్రాంతాలలో భారత రాజకీయ వేత్తలలో సర్ శంకరన్ నాయర్ అగ్రశ్రేణికి చెందిన వ్యక్తి. గాంధి శాసనోల్లంఘనోద్యమాలను ఆయన హర్షించలేకపోయాడు గాంధి విధానాలు అరాచకత్వానికి దారి తీస్తాయని ఆయన విశ్వాసం.

'గాంధి అండ్ యూనార్కీ' అనే గ్రంథంలో ఆయన యీ విమర్శలను చేశారు. హిమీదత్, హిరేన్ ముఖర్జీ, నంబూద్రిపాద్‌వంటి కమ్యూనిస్టులు మార్క్సిస్టు దృక్పథంతో గాంధి తత్వాన్ని విమర్శించినారు. గాంధితత్వం బూర్జువా లేక పెట్టుబడిదారీ వర్గాలకు మద్దతుగా ఉండగలదని వారి విమర్శ. 'గాంధి వర్గతత్వానికి అతీతంగా ఉండలేక పోయాడు. ఆయన బూర్జువా వర్గాలకు అనుకూలంగా కృషిచేసినట్లు కమ్యూనిస్టులు భావించారు' అంటాడు హిరేన్ ముఖర్జీ. ('Gandhi acted as the conscious and willing tool of the bourgeoisie' See 'Gandhi Marg'-April, 1959) నవ్యమానవతా వాద తత్వవేత్త యం. యన్ రాయ్, ఆయన అనుయాయులు గాంధి తత్వాన్ని 'మధ్యయుగ తత్వం'గా విమర్శించారు. ఆధునిక పారిశ్రామిక నాగరికతను నిరసించటం గాంధితత్వం లోని ప్రధాన లోపమని వారి తలంపు. తత్కారణంగా, నవీన శాస్త్రీయ విజ్ఞానాన్ని—ముఖ్యంగా టెక్నాలజీని గాంధి అంగీకరింపలేకపోయాడు టెక్నాలజీ సాయం లేకుండా నేటి సమస్యలు తీరవు ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ, సమానత్వం కేవలం ఊహాలోకంలోనే వుంటాయి కాగా వారు గాంధి తత్వాన్ని20—వ శతాబ్దపు మూర్ఖత్వంగా పరిగణించారు ('Irrationalism of the Twentieth Century') ఇక సోషలిస్టు భావుకుడైన జవాహర్లాల్ నెహ్రూకూడ గాంధి మార్గాన్ని సంపూర్ణంగా ఆమోదింపలేదు. 'అనేక వత్సరాలనుండి నేను గాంధికి సన్నిహితుడను. అయినా ఆయన లక్ష్యమేమిటో నాకు బోధపడలేదు ఆయన భవిష్యత్తులోకి చూడలేకపోతున్నాడు. ఆయన తత్వాన్ని అంగీకరింపకపోయినా, గాంధితో కలిసే పనిచేశాము' అంటాడు నెహ్రూ. ('We went with him although we did not accept his philosophy')

గత రెండు శతాబ్దాలలో భారత దేశంలో పారిశ్రామిక నాగరికతకూ, సైన్సూ— టెక్నాలజీల అభివద్ధికీ పునాదులు యేర్పడ్డాయి సంప్రదాయానికీ— నవతకూ మధ్య సంఘర్షణ జరుగుతోంది. నవతా పథంలో దేశాన్ని ముందుకు నడపగల పుష్టి గాంధితత్వంలో కనబడటం లేదు అందుకు యీక్రింద తెలుపబడిన ప్రధానమైన బలహీనతలే కారణం —

(1) గత వంద యేండ్లలో శాస్త్రీయ విజ్ఞానం అపారంగా పెరిగింది. విశ్వాన్ని గురించీ, మానవుని గురించీ కొత్త సత్యాలు వెలుగులోనికి వచ్చాయి. కొత్త రీతులలో సామాజిక పునర్నిర్మాణం జరుగుతోంది ఈ మార్పులను అజలోకి తీసుకొని గాంధి తన తాత్విక సిద్ధాంతాలను వెలయించలేదు పైగా ఆయన నవీన నాగరికతను ఒక జాడ్యంగా యెంచి విరసించాడు. ('Mahatma gandhi characterised modern civilisation as a disease' and a 'nine days wonder', for it 'takes' note neither of morality nor of religion.')

నవీన నాగరికత కేవలం నగ్న భౌతికవాదమనీ, అందుచేత ఆధ్యాత్మిక విలువలూ ఆత్మవికాసమూ, నైతికాభివృద్ధి మంట గలిశాయని ఆయన తీర్పు. మెటీరియలిజం-స్పిరిచుయలిజానికి విరోధియా? లక్ష్మీ పూజనూ, భోగలంపటత్వాన్నీ భౌతిక వాదంగా యెంచటం పొరపాటుకాదా? మానవునీ, అతనిచుట్టూ వున్న ప్రకృతినీ అర్థం చేసుకొని, పెరుగుతూవున్న శాస్త్రీయ విజ్ఞానంసాయంతో నాగరికతా వికాసానికి తోడ్పడేదే భౌతికవాదం. భౌతికవాదం ఆత్మవికాసాన్నీ, నైతిక విలువలనూ నిరసింపదు పైగా అందు కవసరమైన పరిస్థితులను కల్పించి మానవుని సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడుతుంది. భౌతిక వాదాన్ని నైతిక విలువలతో సమన్వయం చేయటానికి గాంధి యత్నింపక, ఆధునిక నాగరికతను నిరాదరించటం అసమంజసం.

(2) సైన్సూ— టెక్నాలజీల నుపయోగించుకొని యీనాటి మానవుడు వ్యవసాయరంగంలో, పారిశ్రామికరంగంలో అధికోత్పత్తిని సాధిస్తున్నాడు. నానాటికీ పెరిగిపోతూవున్న ప్రజల భౌతికావసరాలను తీర్చటానికి యీ విధానమే శరణ్యం కాదా? ప్రముఖ తత్వవేత్త బెర్ట్రాండ్ రస్సెల్ యీ విధంగా వ్రాస్తున్నాడు.—

'యంత్ర నాగరికతలోని లోపాలను నేను తక్కువగా అంచనా వెయ్యలేదు. అయితే దానివలన కలిగే ప్రయోజనాలు లోపాలకంటె వేయిరెట్లు మిన్న. నవీన నాగరికతలోని కాఠిన్యాన్ని తొలగించాలంటే సైన్సును ఇతోధికంగా అభివృద్ధి చేసుకోవాలి. దానిని తిరస్కరింపకూడదు.' గాంధి నవీన శాస్త్రీయ నాగరికత సృష్టించిన సమస్యలను ఎదుర్కొని పరిష్కరింపకుండా, ఆ నాగరికతనూ, దానికి మూలమైన టెక్నాలజీని చిన్నచూపు చూడటం అవాస్తవికం.

(3) ఆర్థిక సమానత్వం సాధించటానికి గాంధి తత్వం సూచించిన ధర్మకర్తృత్వ సిద్ధాంతం ఆచరణయోగ్యంకాని ఆదర్శవాదం. ఈ సిద్ధాంతం ప్రకారం ధర్మకర్త మూర్తీకరించుకొన్న నిజాయితీపరుడు కావాలి శ్రామికులకు అతని నిజాయితీపట్ల పరిపూర్ణ విశ్వాస ముండాలి వర్తమాన పరిస్థితులలో యిది సాధ్యమా? సంపద ఏ కొద్దిమంది చేతులలో కేంద్రీకృతం కావటం న్యాయమా? అనునది ముఖ్యమైన సమస్య. సంపన్నులు ధర్మకర్తలుగా మారినందువలన యీ సమస్య పరిష్కారం కాదు.

(4) గాంధి మానవతావాది. కాని ఆయన మానవతావాదం పాత సంప్రదాయపు విలువలపైననే నిర్మింపబడినది అభివృద్ధి చెందుతూవున్న శాస్త్రీయ విజ్ఞానాన్ని పరిగణించి, మనిషినీ, మనిషికీ— సమాజానికీ మధ్య ఉన్న సంబంధాలనూ, నైతిక విలువననూ చుట్టుకొని వచ్చే శాస్త్రీయమైన సమగ్ర మానవతావాదాన్ని గాంధి ఊహింపలేకపోయాడు.

(5) గాంధి మానవుని మనుగడకు సత్యం పునాది అంటాడు. అయితే సత్యం అంటే యేమిటి? మనిషి నిరంతరం సత్యాన్వేషణ ఎందుకు సాగిస్తున్నాడు? అనే ప్రశ్నలకు ఆయన తత్వంలో సమాధానం లేదు. మానవుని స్వేచ్ఛా పిపాసయే (Quest for Freedom) సత్యాన్వేషణకు మూలమనీ, జ్ఞానగత విషయమే సత్యమనీ, (Truth is the content of know-ledge) యం యన్ రాయ్ వంటి నవ్యమానవతావాదులు ప్రతిపాదిస్తున్నారు (See –'Radical Humanism'–By M. N. Roy.)

(6) గాంధి ప్రతిపాదించిన అహింసావిధానం సర్వ విషయాలలో ఆచరణ యోగ్యమా? ప్రత్యర్థులను ప్రేమతో జయించి వారిలో హృదయ పరివర్తన తీసుకొనిరావటం వ్యక్తిగతమైన విషయాలలో ఆచరణ సాధ్యమేమోగాని, సామాజిక సమస్యల పరిష్కారానికి తోడ్పడుతుందా? గాంధినడిపిన సత్యాగ్రహోద్యమాలు అచ్చమైన అహింసాయుత సాత్విక నిరోధములా? వాటివలన ఆంగ్ల సామ్రాజ్యవాదుల హృదయాలు మారి భారతీయులకు స్వరాజ్యాన్ని ప్రసాదించినారా? అవి హింసతో, రక్తపాతంతో మలినం కాలేదా? ప్రముఖ చరిత్రవేత్త, ఆర్ సి మజుమ్‌దార్ గాంధి నాయకత్వం వహించి నడిపిన సత్యాగ్రహోద్యమాలను పరిశీలించి, అవి పరిపూర్ణమైన అహింసాయుత పోరాటాలు కావని నిర్ణయించాడు (See. 'Three phases of india's struggle for freedom'). 1940 లో మహాత్మాగాంధి 'హరిజన్'లో యిట్లు వ్రాసినాడు —

'we in India have never given non-violence the the trail it deserves. The marvel is that we have atained so much even with our mixed non-violence]".

అచ్చమైన అహింసవలన గాక, హింస—అహింసల సమ్మేళనం వలననే తన ఉద్యమాలు విజయవంతములైనాయని గాంధియే అంగీకరించినాడు గదా? విదేశీయుల దండయాత్రకు ఎరయైన జాతి స్వాతంత్ర్యరక్షణకై పోరాడటం దోషమా? దోషంకానిచో అదే సూత్రం వ్యక్తులకూ, సంఘాలకూ వర్తింపదా? అని కొందరి ప్రశ్న. గాంధి తత్వాన్ని ఆరాధించటం యీ ప్రశ్నకు సమా

ధానం కాదు. ప్రజాస్వామిక సమాజాలనూ, ఐక్యరాజ్య సమితినీ పటిష్ఠం చేసు కోవటమే సరియైన మార్గం.

గాంధితత్వంలో పైన పేర్కొనబడిన లోపాలు గోచరిస్తున్నా యన్నప్పుడు ఆశ్చర్యపడ నవసరం లేదు. గాంధి కూడ కాలానికి బద్ధుడే. ఆయన సిద్ధాంతాలు త్రికాలాబాధితాలు కావు. ఈ విషయాన్ని గుర్తించిన జె|ఫ్రీయాష్ మహాశయుడు యిలా వ్రాస్తున్నారు— 'గాంధి తత్వంలో, విధానంలో గ్రాహ్యమైన వానిని గుర్తించి, వాటిని వర్తమాన పరిస్థితులకు అన్వయించుకోవటం యీనాటి ప్రధాన విషయం. దీని ఫలితం గాంధి మార్గానికి సన్నిహితంగా ఉండబోదని నే నెరుగుదును. అందువలన వచ్చే నష్టమేమీ లేదు. పునరుద్ధరణ నా అభిమతం గాదు'.

"Today the point is to rediscover what is of permanent value in his teaching and practice, to re—state this and re—apply it in modern contexts. For all; I know, the end product will not always look very Gandhian. That does n't matter. I am not concerned with revivalism."

["Gandhi Marg"—48.]

పరిశోధకులు గాంధి తత్వంలో యిమిడివున్న యీ క్రింది విలువలను ఉద్ఘాటిస్తున్నారు.—

(1) గాంధితత్వం వ్యక్తికీ, వ్యక్తి వికాసానికీ ప్రధాన స్థాన మిస్తోంది సమాజం యొక్క ఉనికికి వ్యక్తులే ఆధారం. వ్యక్తి వికాసమే సమాజ ప్రగతికి ప్రమాణం జాతి, వర్గం పేర్లతో మానవ సమాజానికి సమష్టిభావాన్ని కల్పించి, వ్యక్తిని సమష్టి భావానికి బలి చేయటాన్ని గాంధి మార్గం అంగీకరించదు

(2) గాంధిమార్గం నైతిక విలువలకు మకుటం పెట్టోంది ఆదర్శం మంచిదైనంత మాత్రాన చాలదనీ, అందుకు వినియోగింపబడే ఆచరణ విధానం కూడ మంచిది కావాలనీ, సదాశయ సిద్ధికి సన్మార్గమే సరిఅయిన బాట అనీ గాంధి వాదం చాటుతోంది.

3) జాతీయ సంపదను పెంచి, ప్రజల జీవన ప్రమాణాన్ని అభివృద్ధి పరచే బాధ్యతను యీనాడు ప్రభుత్వం స్వీకరించింది. అందుకోసం పంచవర్ష ప్రణాళికలను అమలు పరుస్తోంది. అయితే ప్రణాళికాబద్ధమైన జాతీయ ఆర్థిక రంగంలో ప్రభుత్వం యొక్క యాజమాన్యం ప్రజాస్వామిక సూత్రాలను దృష్టిలో పెట్టుకొన్నప్పుడు ఎంతమేరకు ఉండాలనేదే చిక్కు సమస్య. సోషలిస్టు భావాభమోజాలో పడినవారు ఉత్పత్తి సాధనాలన్నీ ప్రభుత్వ యాజమాన్యంలోనే ఉండితీరాలంటారు. అందువల్ల అధికారాలన్నీ ప్రభుత్వం చేతిలో కేంద్రీకృతమై వ్యక్తి చొరవకూ క్రియాశక్తికీ అవరోధం యేర్పడుతుంది. ఈనాడు లభిస్తున్న శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం యిటువంటి కేంద్రీకరణకు వినియోగపడటం గమనార్హం. కనుక స్వేచ్ఛా సమాజాలు జాతి ఆర్థిక జీవిత నిర్వహణలో వికేంద్రీకరణ సూత్రాన్ని ప్రవేశ పెట్టి ప్రభుత్వ యాజమాన్యానికి హద్దులు ఏర్పాటు చేసుకోవాలి. ఆర్థికరంగంలో యీ వికేంద్రీకరణ సూత్రానికి ఉన్న విలువను గాంధి తత్వం గుర్తించింది.

గాంధిని మత ప్రవక్తగాగాక, ఒక తత్వవేత్తగా దర్శించటానికీ, గాంధి తత్వాన్ని సామాజిక దృక్పథంతో వివరించటానికీ యీ వ్యాసంలో యత్నం జరిగింది. గాంధి శతజయంతి వాడవాడలా జరుగుతున్న యీ తరుణంలో, గాంధి సిద్ధాంతాలను వర్తమాన స్థితిగతులకు ఎంతవరకు అన్వయించటానికి అవకాశ మున్నదో పరిశీలించటం సముచితం.

## కొన్ని ముఖ్యగ్రంథాలు

మహాత్మాగాంధి భావ ప్రపంచాన్ని తెలిసికొని, గాంధి తత్వాన్ని పరిశీలింప దలచుకొన్న జిజ్ఞాసువులకు యీ క్రింది ఆంగ్ల గ్రంథాలు కొంతవరకు తోడ్పడ గలవు.—

1. An Autobiography—The Story of My Experiments with Truth } By M. K. Gandhi
2. Hind Swaraj or Indian Home Rule } "
3. My religion "
4. Non—Violence in Peace and War Vols. I and II } "
5. Satyagraha "
6. Basic Education "
7. Constructive programme "
8. For Pacifists "
9. Mahatma—Life of Mohandas Karamchand Gandhi—8 Volumes D. G. Tendulker
10. The Last Phase—2 Vols. Pyarelal.
11. The life of Mahatma Gandhi--Louis Fischer.
12. Gandhi—A Study in Revolution—Geoffrey Ashe.
13. The Political Philosophy of Mahatma Gandhi—Gopinath Dhawan.
14. The Social Philosophy of Mahatma Gandhi—Mahadeva Prasad.
15. The Educational Philosophy of Mahatma Gandhi—S. M. Patel.
16. Gandhi in free India—T. K. N. Unnithan.
17. The Conquest of Violence—The Gandhian Philosophy of Conflict—Joan V. Bondurant.
18. The Power of Non-Violence-Richard B. Gregg.
19. Satyagraha—R. R. Diwakar.
20. Studies in Gandhism—N. K. Bose.
21. The Mind of Mahatma Gandhi—Edited by R. K. Prabhu & U. R. Rao.
22. Nehru on Gandhi — Jawaharlal Nehru
23. Mahatma Gandhi—100 years—Edited by S. Radhakrishnan
24. Gandhi in Indian Politics—Edited by A. B. Shaw
25. Gandhi—Maker of Modern India?—Edited by Lewis

# నీ రెండవ వాన

## శ్రీ వేగుంట మోహన ప్రసాద్

ఒక వెల్తురు ఉండేది
చిరిగిన రాత్రిలోంచి ఈ
నడిరేయీ కన్పిస్తోందది.
ఆ ఒక్క తేజస్సు తప్ప
కాలంపెట్టిన బావురుమన్న
గావుకేక చీకటిలో
నాకీనా దేవీ కనపడదు —
జ్యోతిర్గర్భ మేఘం చుట్టూరా;
వేదనా దగ్ధమైన హృదయం చుట్టూరా.
చేజారిన రుమాలా
కను జారిన భాష్ప బిందువూ తప్ప
నాకేమీ మిగలవు.

జ్ఞాపకం వెల్తురు గూడు.
స్మృతి మనస్సుకి విద్యుదాఘాతం
వెల్తురు వెన్నముద్ద ఆ వేడికి కరిగి
దేహమూ దాన్ని విదుల్చుకోలేదు.

చెట్టునుంచి రాలిన పొగడపూలా
లక్క పిట్ట ఆటలా వొట్టొట్టి అన్నాలా
అన్నీ తేజో వలయాలు
స్నేహ పిచ్ఛిలమై రాలిన రోజులు.
నిద్రలో, రాత్రిలో, అవజ్ఞలో
ఇంకా యీ విస్మృతిలో
ఆ తొలి తేజో వలయం నాలో లయం!

శివుడు ఈశ్వరుని ప్రార్థిస్తూ
అనంత దీప్తికొక దీపం కావలా కాస్తూ
గంగానది సాగర సంగమనం చేస్తో
జీవుని వేదన జ్వలిస్తుంది.
నిలవలేక యాతన పడుతూన్న జ్వాల
నా శిరస్సు చుట్టూ కాలిపోతూ తపన పడుతూంటుంది.

నన్నానవాలు పట్టలేరు
నాలో దుఃఖచ్ఛాయలకోసం వెతికితే
కన్నీటి చారల కోసం చూస్తే
నన్ను మీ రసలు ఆనవాలు పట్టలేరు

నీరెండలో వెలిసిన వర్షంలా
ఆకస మేమీ చెప్పదు.
తననుగూర్చి తాను తపస్సు చేసుకొంటున్న వాడ్ని
చీకటిలో అంతర్లీనమై పోయిన వెలుగుని
తనె సాగరమై జలదరించి పొంగిన గంగని
చూచి
నేను కాదు లెమ్మని వెళ్లిపోతా దానవాలు పట్టలేక.
నిద్రలో ఉన్న జాగరిత ప్రశాంతిని నేనే.
రాతిరి చీకటి ఒడిలో నిద్రిస్తూన్న వెల్తుర్ని నేనే.
బహిరంతర చైతన్యాలలో స్వాప్నిక అవజ్ఞనీ
సత్యమైన అభిజ్ఞనీ యిపుడు నేనే.
ఇవీ నా కొండ గుర్తులు.

నదీ మధ్యంలో నీరెప్పుడూ,
జరుగుతూ ఉంటుంది.
ఒడ్లు కరుగుతూ ఉంటాయి.
గాలికి పడవ పైట చెంగు ఎగిరిపోతూంటుంది.
నావ కదులుతూ ఉంటుంది.
ఏది స్థిరం మరి ఏది చలం?
నది ప్రవహిస్తుంది
నావ పయనిస్తుంది.
ఏది కాలం ఏది దూరం?
మురళిలోని గాలిని వేళ్లతో నొక్కి ఊదితే
వేణునాదం వినవస్తుంది,
వినిపించే గాలి వింటూన్న గాలిలో కలిసి.
ఏది మురళి మరి ఏది రవళి?
నావా నదీ బావా మరదళ్ళు;
సాదృశ్యాలు.
మురళి, రవళి అంతర్ బహిర్ వేదనలు
సహనాదాలు.
పగలూ రాత్రి కాలంలోనే
తేజస్సూ తమస్సు జీవంలోనే!
చీకట్లో ఏమాత్రమో ఎండ పొడ కలుస్తుంది.
లేకపోతే చీకటి కన్పించదు.
ఎండలో వాన కురిసి వెలిసి
కన్నీటి చారిక లారిపోయిన నేల
ఎంత తేజోమయమో!

---

# ఆగ్నేయాసియా పరిస్థితి

శ్రీ బారు గోవిందరావు

ప్రపంచ రాజకీయరంగంలో ఇటీవల కొన్ని సంవత్సరాలుగా జరిగిన సంఘటనలను మనం జ్ఞప్తికి తెచ్చుకుంటే, ఆ సంఘటనలు, ముఖ్యంగా ఆసియాఖండంలో జరిగినట్టివి, జటిలంగా, విచిత్రంగా కనిపిస్తాయి. ప్రపంచంలోని ఇతర ప్రాంతాలలో రాజకీయ దృక్పథం కూడా ఉజ్జ్వలంగా లేదు ఆసియాఖండం ప్రపంచంలోని విశాలతమ భూభాగానికి ప్రాతినిధ్యం వహిస్తున్నది. పామీర్ పీఠభూమి కేంద్రంగా నాగరకత ఉద్భవించి విస్తరించినట్లు చెబుతారు. ఆసియాఖండంలో ఉన్నతోన్నత పర్వతాలు, కొన్ని మహానదులు, వివిధ శీతోష్ణస్థితులు, అనేకానేక సాధన సంపదలు ఉన్నాయి ఆధ్యాత్మికంగా ప్రశాంతంగాఉన్న ఈ ఖండంలో ఎప్పటికప్పుడు దురాక్రమణపరులు కల్లోలాన్ని వ్యాపింపజేశారు. చివరిదురాక్రమణపరులు ఆసియానుంచే వచ్చారు—మంగోలులు, అరబ్బులు. 1498 లో వాస్కోడగామా కాలికట్‌లో దిగడంతో 430 సంవత్సరాలపాటు పాశ్చాత్య సామ్రాజ్యవాదం ఆ దురాక్రమణను అనుగమించింది. 1948 లో చైనాలో ప్రజా విప్లవం ప్రారంభం కావడంతో రాజకీయంగాను, ఆర్థికంగాను పాశ్చాత్యుల పలుకుబడి తీవ్రమయింది సామ్రాజ్యవాదానికీ, జాతీయతకూ మధ్య ఏర్పడిన సంఘర్షణ నేడు కమ్యూనిజం, ప్రజాస్వామ్యాలమధ్య సంఘర్షణగా భిన్న నామధేయంతో వ్యవహృతమయింది స్థూలంగా, మొదటిది మాస్కో పద్ధతి, ఇటీవల మావోయిజం లని ప్రసిద్ధి పొందిన పద్ధతి అని, తర్వాతిది జాతులు స్వేచ్ఛగా తమ అభిప్రాయాన్ని ప్రకటించే పద్ధతి అని అనవచ్చు. ఈ రెండింటిమధ్య దక్షిణ కొరియా, దక్షిణ వియత్నాం మొదలయిన దేశాల సైన్యంవంటి స్వేచ్ఛా ప్రపంచం సైన్యాలున్నాయి. ప్రజాస్వామ్య దేశాల, వర్ధమాన దేశాల, వెనుకబడిన దేశాల ప్రజలు అసంతృప్తితో కమ్యూనిజానికి ఎర కాకుండా చేయడానికి స్వేచ్ఛా ప్రపంచం పైన పేర్కొన్న దేశాలకు ఆర్థికాది సహాయం చేస్తున్నది భారత్, బర్మా, లంక, మలయా దేశాలు బ్రిటిష్ పరిపాలననుంచి, ఇండోనీసియా డచ్ పరిపాలననుంచి, ఇండో—చైనా ఫ్రెంచి పరిపాలననుంచి విముక్తం చేయబడ్డాయి చైనాలో కన్‌ఫ్యూషియస్ మతానికి పట్టుగొమ్మఅయిన మానవ సంక్షేమభావనా యుగం మరుగయిపోయి, దాని స్థానంలో మావోయిజం, భయం, క్రౌర్యం, మనోబుద్ధులను గూడా నియంత్రణ చేయడం నెలకొన్నాయి ఇవి చైనా వెలుపల గూడ వ్యాపిస్తున్నాయి.

యూరోప్‌ఖండంలో బెదిరింపుల యుద్ధం వార్తలను మనం తరచు వింటున్నాము యూరోప్‌లోని ప్రజాస్వామ్య దేశాలు రష్యాను వెనక్కునెట్ట దలచుకున్నాయి. రష్యాయేమో తన కమ్యూనిస్టు మిత్రదేశాలపై తన పట్టును గట్టిగా ఉంచుకోడానికి ప్రయత్నిస్తున్నది ఆసియాలో బెదిరింపులయుద్ధం పాశ్చాత్య దేశాలకు, ఆగ్నేయాసియాలో వ్యాపిస్తున్న చైనా కమ్యూనిజానికి మధ్య చెలరేగింది ఉత్తర అట్లాంటిక్ దేశాల రక్షణ వ్యవస్థ ద్వితీయ ప్రపంచయుద్ధం తర్వాత ఏర్పడింది. 1954—55 లో ఆగ్నేయాసియా దేశాల రక్షణ వ్యవస్థ, వార్సా సైనిక సంధులూ ఏర్పడ్డాయి రష్యా—చైనాల సమష్టి ప్రయోజనాలను గురించి పరస్పరం చర్చించాలని ఉద్దేశించిన చైనా—సోవియట్ మైత్రీ సంధి చైనా రిపబ్లిక్ అధ్యక్షుడు మావోసే—టుంగ్, సోవియట్ యూనియన్ ప్రధాని స్టాలిన్‌లమధ్య 1950 లో జరిగింది ఈ సంధి 30 సంవత్సరాలు అమలులో వుండాలని కూడా ఉద్దేశించబడింది. సిద్ధాంతరీత్యా ఉభయ దేశాలమధ్య తీవ్ర ఘర్షణ వున్నట్టు 1962 లో బహిరంగమయినప్పటికీ ఆ మైత్రీ సంధిలోని సారభాగం ఇంకా ఉండనేవుంది చైనాకు రష్యా వైఖరి నచ్చడంలేదు. ఆ వైఖరి అమెరికాలో శాంతి అని స్థూలంగా చెప్పవచ్చు. ఇక రష్యాకు చైనా వైఖరి, విధానం నచ్చడంలేదు. అదేమంటే—మార్క్సిజం—లెనినిజంలు ఆధారంగా పలసలు ఏర్పాటు చేయడం, సామ్రాజ్య విస్తరణ. 1964 లో జరిగిన ఆఫ్రికా—ఆసియా సమైక్య మహాసభలో గూడ చైనా ప్రతినిధులు, రష్యా ప్రతినిధులను సామ్రాజ్యవాదరెక్కలున్న పక్షులని విమర్శించారు ఆ సంవత్సరమే చైనా విధానాన్ని, దాని వ్యక్తి పూజా పద్ధతిని విమర్శిస్తూ, మాస్కోలో ఒక పభుత్వపత్రం ప్రచురించబడింది ఈ రెండు దేశాలకు ఘర్షణ ఏర్పడే ప్రాంతాలు మూడున్నాయి: (1) చైనా సరిహద్దు—శాంతమహాసాగరం మధ్యన రష్యా సముద్రప్రాంతం (2) రష్యా సహాయం పొందుతూ, చైనా—రష్యాలమధ్య బఫర్ రాజ్యంగావున్న మంగోలియాప్రాంతం, (3) సరిహద్దు ప్రాంతమైన సింకియాంగ్. చైనా వైపునవున్న సింకియాంగ్‌లో పెట్రోలు, యురేనియం సమృద్ధిగా ఉన్నాయి.

మధ్యప్రాచ్యంలోను, తూర్పు ఆసియాలోను తటస్థమైనవి, విబంధ విధానం అనుసరించేవి అయిన దేశాలు ఉన్నాయి ఈ దేశాల మహాసభలు, కమ్యూనిస్టేతర మహాసభలు చాల తరచైపోయాయి అంతర్జాతీయోద్రిక్తతను తగ్గించడంలో ప్రపంచ ప్రజానీకంలో మూడింట ఒక వంతుకు ప్రాతినిధ్యం వహించే విబంధ రాజ్యాల మహాసభ మొదట 1961 లో బెల్‌గ్రేడ్‌లో జరిగింది సమ్మిళిత, విబంధ అనే పదాల అర్థం కూడా ఇప్పుడు మారిపోయింది పూర్వం విబంధ అనే మాటకు ఉభయ వర్గాలనుంచి విడిగా వుండడమనే అర్థం ఉండేది. ఇప్పుడేమో, చాలావరకు ఇతర రాజ్యాలతో కలిసి వుండడమని అర్థం. భారతదేశం ఏ రాజ్యాలవర్గంలోను లేదు. కాని వాటితో కలిసివుంది. మనం రష్యాతోను, అమెరికాతోను మైత్రి పెంపొందించుకొంటున్నాము. మన విదేశాంగ సంబంధాలలో మనం అన్ని దేశాలతోను మైత్రి అనే ధ్రువతారనే అంటిపెట్టుకొని వున్నాము, ఏ గ్రహతారామండలం పైన ప్రత్యేకదృష్టి లేకుండా. మన అంతరంగ విధానం పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, మత ప్రసక్తి రహితత్వం, సంఘ శ్రేయస్కర ప్రణాళికా రచన, జాతీయ సమైక్యం. ఈ విధానాలవల్ల నూతన పద్ధతి అధికారం రూపొందుతున్నది ఆసియావాసులమయిన మనం రంగు ప్రాతిపదికగా చూచే విభేదాలను ప్రతిఘటిస్తున్నాము. నిరసిస్తున్నాము. ఈ ప్రాంతంలో చైనా పలుకుబడిని అరికట్టడానికి ఉద్దేశించిన ఆగ్నేయాసియా రక్షణ వ్యవస్థను ఇదివరకే ప్రస్తావించాను కాని, ఈ వ్యవస్థ నిర్జీవమైపోయింది దానిలో సభ్యత్వంగలదేశాలు థాయ్‌లాండ్, అమెరికా మినహా ఆ వ్యవస్థను వినియోగించుకొనడానికి సంకోచపడుతున్నాయి పాకిస్తాన్ దానిని వెన్నుపోటు పొడిచింది ఫ్రాన్స్ అధ్యక్షుడు డిగాల్ 1964 లో చైనాను గుర్తించడంతో ఈ వ్యవస్థ మరీ నిష్ప్రయోజనమయింది డిగాల్ ఇలా చేయడంవల్ల ఫ్రాన్సుకు, ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థ (నాటో) లోని దాని మిత్రదేశాలకు మధ్యవున్న విభేదాలు మరింత తీవ్రమయాయి. డిగాల్ తాను 'మూడవ రాజ్యకూటానికి' నాయకుడు కావాలని కోరుతున్నాడు. ఆగ్నేయాసియాలో రక రకాల విదేశీ జోక్యాన్ని తొలగించ దలచాడు ఫ్రాన్సులో అమెరికా ప్రతికూల భావాలు న్నాయి. ఫ్రాన్సుకు, అమెరికాకు పరస్పరావగాహన కొరవడినట్టు తోస్తుంది కాని, ఆగ్నేయాసియా విషయంలో ఫ్రాన్సు, అమెరికాల విధానాలు కొంత పూరకంగానే వున్నాయి. చైనా ఆగ్నేయాసియాను కబళించకుండా ఫ్రాన్సు నివారించదలచింది కాని, చైనా సమర్థించనిదే, ఈ విశాలప్రాంతంలో శాంతి నెలకొనదని ఆసియా భావి

మ్తున్నది. ఈ ప్రాంతంలో ఉద్రిక్తతను నివారించి, స్వాతంత్ర్యాన్ని, స్వయం నిర్ణయాధికారాన్ని సమర్థించి, జాతుల సహజీవన పద్ధతిని ప్రోత్సహించడానికి కొలంబో, బాండుంగ్, కైరో మొదలయిన నగరాలలో దౌత్య ప్రతినిధుల మహాసభలు జరిగాయి. అప్పటి అమెరికా అధ్యక్షుడు జాన్సన్ సోవియట్ దేశాలతో అణ్వస్త్రవ్యాప్తి నిరోధక సంధిని చేసుకొనడమనే తన లక్ష్యాన్ని సాధించాడు. కాని, యుద్ధ పరికరాలకోసం పెద్ద పెద్ద మొత్తాలు వ్యయమవు తున్నాయి. జాతులమధ్యా, రాజ్యకూటాలమధ్య పోటీలు కొనసాగుతూనేవున్నాయి ఈ భూమికతో, ఈ ప్రాంతంలోని దేశాల పరిస్థితి వాటి పరస్పర సంబంధం పరిశీలనార్హాలు.

భారతదేశానికి అపరిష్కృతంగావుండే రెండు సమస్యలు చైనా, పాకిస్తాన్. భారతదేశానికి సైనికంగాను, రాజనీతిపరంగా దృష్టిలోను ఉన్న స్థానం దానికి ఆసియాలోను, స్వేచ్ఛా ప్రపంచంలోను ప్రత్యేక స్థితిని కలిగిస్తున్నది ఆగ్నేయాసియాలో భారతదేశానికిగల పూజ్యత, ప్రాముఖ్యం గుర్తించబడ్డాయి.

## చైనా

చైనా సరిహద్దు నిడివి 9000 మైళ్ళు, దీనిలో 4000 మైళ్ళమేర రష్యాతో వుంది దాని మొత్తం సరిహద్దురేఖ నిడివి 13,000 మైళ్ళు దీనిలో మూడోవంతు కోస్తా. ఈ కోస్తా భూములు చాల విలువగలవి. ఇవి ఇతరులు అడ్డగించకుండా రక్షించుకోవడం అవసరం చైనా సామ్రాజ్యంకాలంలో—అనగా కన్‌ఫ్యూషియస్ యుగంలో—నాగరకతకు, సంస్కృతికి, మానవతావాదానికి చైనా ప్రసిద్ధిపొందింది 1911 లో సన్ యట్ సేన్ ప్రజాస్వామ్యం, అందరికీ తిండి, జాతీయత అనే సిద్ధాంతాలపై చైనా రిపబ్లిక్‌ను స్థాపించాడు. సన్ యట్ సేన్ తర్వాత 1925 లో చెంగ్ కై షెక్ అతని సంప్రదాయాన్నే అనుసరిస్తూ, యుద్ధంకోరే నాయకులను హతమార్చాడు కాని, తన ప్రభుత్వం అవినీతిని, దుర్బలం కావడాన్ని ఆపలేకపోయాడు. దీని ఫలితంగా మావోసే—టుంగ్, అతని కమ్యూనిస్టుపార్టీ చర్యలు ప్రజలందరికీ తెలిసినవే. చారిత్రకంగా చైనా సామ్రాజ్యంలో వలసలుగావున్న సింకియాంగ్, మంగోలియాలో భాగం, మంచూరియా (టిబెట్ కూడా) ప్రాంతాలను మావో మరల ఆక్రమించుకొన్నాడు ఈ ప్రాంతాలన్నీ కలిపితే, చైనాదేశంకన్నా విస్తారమైనవి అతడు మంగోలియా, బర్మా, ఆఫ్ఘనిస్తాన్ మొదలయిన దేశాలతో సరిహద్దు ఒడంబడికలు జరుపుకొన్నాడు అతడు పాకిస్తాన్‌తో చేసుకొన్న ఒడంబడిక అంతర్జాతీయ న్యాయసూత్రాలకు ప్రతికూలమని అంటారు మావో 1962 లో హిమాలయ ప్రాంతంలోని భారత భూభాగం 1200 చదరపు మైళ్ల మేరను కబళించడం ప్రపంచానికి ఆశ్చర్యం కలిగించింది జపాన్ ద్వితీయ ప్రపంచ సంగ్రామ సమయంలో అనుసరించిన సామ్రాజ్య విస్తరణ మార్గాన్నే మావో కూడా అనుసరించాడు. చైనా మన ప్రాంతంలో అక్రమంగా చొచ్చుకొని వచ్చినప్పటికీ, ఐక్యరాజ్యసమితిలో చైనాకు సభ్యత్వం వుండాలనే ప్రతిపాదనను మనం సమర్థిస్తున్నాము. ప్రత్యక్షపు సంప్రతింలను గురించి ఆలోచించడానికిముందు కొలంబో ప్రణాళికను ఆమోదించాలని కూడా కోరుతున్నాము అకాసిచిన్ పీఠభూమిని వారికి వదలిపెట్టడం, 1959 నవంబర్ 7వ తేదీన వారు నిర్వచించినట్లు చైనా సరిహద్దురేఖను సర్దుబాటు చేయడం, మనం 1962 సెప్టెంబర్ 8 వ తేదీన నిర్వచించినట్లు యథాపూర్వపు పరిస్థితిని అనుసరించడం—మొదలయిన పెక్కు ప్రతిపాదనలు చేయబడ్డాయి చైనా త్వరలో తగినన్ని అణ్వస్త్రాలు సేకరించుకొంటుందని, తన 120 డివిజనుల సైన్యంలోను 16 డివిజనులను టిబెట్‌లో మకాం చేయించిందని, తగినంత నౌకా, విమాన బలాలూ వున్నాయి గనుక ఇరుగు పొరుగు దేశాలకు ప్రమాదం వాటిల్లవచ్చునని, అస్సాం, లడఖ్ లలో భాగాలను కబళించివేయవచ్చునని రక్షణ విషయాల పరిశోధన సంస్థలో పరిశోధన జరుపుతున్న బ్రిగేడియర్ సాహ్ని 1998 అక్టోబర్‌లో ప్రకటించారు. మావో సే టుంగ్ మానవులతో పరిశోధన జరిపి అనుభవం సంపాదించుకొంటాడని అంటారు. "మానవులందరూ మరణించేవారే వారు అర్హమైన, ప్రయోజనకరమైన కారణంకోసం మరణిస్తే వారి మరణం కూడా ప్రయోజనకరమవుతుంది." ఇది ఆయన వాదం. అతనివారసుడైన లియుపియావో కూడా పీపుల్స్ లిబరేషన్ ఆర్మీ జాగరూకతతో మెలగాలని, ప్రొలెటేరియట్ సాంస్కృతిక విప్లవాన్ని విస్తరింపజేయాలని వాదిస్తాడు మావో సాంస్కృతిక విప్లవంలోను, లియు షావోచి ఉదారవాదం (లిబరలిజం)లోను పెక్కుమంది ప్రజలు శారీరకంగాను, మానసికంగాను ఆహుతి అయ్యారు. మావో, తన దేశంలో జెకొస్లొవాకియా, హంగరీ సంఘటనలు జరుగరాదని జాగ్రత్తపడుతున్నాడు ఆక్రమిత టిబెట్, సింకియాంగ్, షాంఘై మొదలయిన ప్రాంతాలపై ఒక కన్నువేసివుంచాడు మావో, లియు తమ పార్టీలను పునర్వ్యవస్థితంచేసి, గడచిన రెండు సంవత్సరాలుగా చెడిన ఆర్థిక వ్యవస్థను చక్కబరుస్తున్నారు. చివరకు మావో గెలిచినా, షావో—చి గెలిచినా, చైనా తన రాజ్య విస్తరణకు పూనుకొనేదే చైనా దురాక్రమణ విధానాన్ని అనుసరిస్తున్నప్పటికీ దానితో చర్చలకు సిద్ధంగా వున్నామని భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి మొన్న జనవరి 1 వ తేదీన ఢిల్లీలో ఒక సందర్భంలో అన్నారు పరిష్కారానికి జరిగే ప్రయత్నాల ఫలితాలు ఎలా వుంటాయో చెప్పడం కష్టమయినట్లే పాశ్చాత్య రాజ్యాలు ప్రతీక్షిస్తున్నట్టు మనం చైనా రాజ్య విస్తరణ లక్ష్యాలను నిరోధించే సేనాముఖంకావడం కూడా కష్టమే.

ఈ సందర్భంలో కాశ్మీర్ సమస్యలు, పాకిస్తాన్‌తో మన సంబంధాలు పరిశీలించవలసి వుంటుంది ఈ విషయంలో మనం పరిష్కారంకోసం కాల పురుషునికి ఎక్కువ అవకాశం ఇచ్చాము అంతర్జాతీయ సంబంధాలలో మనం విశ్వసిస్తున్నవి, ఇతరులు విశ్వసిస్తున్నవి, లేక విశ్వసించనున్నవి విశ్వసిస్తున్నాము. బ్రిటిష్ ప్రభుత్వం మన దేశాన్ని రెండు ముక్కలు చేసిన తర్వాత వదలిపెట్టి వెళ్లారు పాకిస్తాన్ కాశ్మీర్‌లో ఐదింట రెండు పాళ్ల భూమిని ఆక్రమించుకొంది ఐక్యరాజ్యసమితి నియమించిన ప్రత్యేకసంఘం పాకిస్తాన్ దురాక్రమణ చేసినట్టు అంగీకరించింది. కాశ్మీర్ సంస్థానం రాజ్యాంగ నిర్మాణ సభ భారత యూనియన్‌లో కాశ్మీర్ ప్రవేశాన్ని ఆమోదించింది. జమ్ముకాశ్మీర్ భారత దేశంలో భాగమైపోయింది గనుక, మన రాజ్యాంగం కొంతవరకు వర్తింపజేయబడింది మూడు సంవత్సరాలక్రితం మనం పాకిస్తాన్‌తో నిజంగా తలపడవలసి వచ్చింది పాకిస్తాన్ తాష్కెంట్‌లో చేసిన వాగ్దానాలను నిలుపుకొనలేదు అలా నిలుపుకొనివుంటే, అది భారతదేశంతో సంపూర్ణ స్నేహ సంబంధాలను నిలుపుకొనేది భారతదేశంలోని ఐదుకోట్ల ముస్లింలకు మత వైషమ్య మేమీలేదు. వారికి ఇతర పౌరులతో సంపూర్ణంగా సమానమైన హక్కులున్నాయి. పాకిస్తాన్ కమ్యూనిస్టు ప్రతికూల పాశ్చాత్య సైనిక భద్రతా సంధులలో చేరినా, ఇటు సోవియట్ యూనియన్‌నుంచి అమెరికానుంచీ కూడా ఆయుధాలు సంపాదిస్తున్నది. ప్రస్తుతం స్వేచ్ఛగావున్న షేక్ అబ్దుల్లా జమ్ము కాశ్మీర్ విలీనీకరణ కార్యక్రమం పూర్తికావడానికి కృషి చేస్తే అందరి ప్రశంసలూ పొందగలుగుతాడు. పాకిస్తాన్‌లోను అయూబ్‌ఖాన్ పరిపాలనకు ప్రతికూలంగా ఉద్యమం ఉంటున్నది.

## జపాన్

జపాన్ అనేది పెక్కు ద్వీపాల సముదాయానికి పేరు ఈ ద్వీప సముదాయమయిన జపానుకు శాంతమహాసాగరంలోను, ఆసియా ప్రధాన భూభాగం సమీపంలోను యుద్ధతంత్ర రీత్యా కీలకస్థానం వుంది జపాన్ విస్తీర్ణం భారత దేశంలోని మధ్యప్రదేశ్‌రాష్ట్రంకన్నా తక్కువ. జనాభామాత్రం 10 కోట్లకు పైగా వారికి తమ చక్రవర్తిపైన గుడ్డిభక్తి అతనికోసం ఎంతటి త్యాగం చేయడానికైనా సిద్ధం ఆ త్యాగం గౌరవమని కూడా భావిస్తారు జనం చాల శక్తిమంతులు, కష్టపడి పనిచేసేవారు క్రమబద్ధంగా ప్రవర్తించేవారు. సంస్కారం కలవారు. బుద్ధిమంతులు గడచిన శతాబ్దంలో వారు పాశ్చాత్య ప్రభావానికి లోనయ్యారు. గడచిన 25 సంవత్సరాలుగా వారిపై అమెరికా భావాలు, అమెరికా సంస్కృతి పూర్తిగా విరుచుకొని పడడంతో వారి సంస్కృతి మొదలయినవి ప్రభావితమై అమెరికావారి పద్ధతి జపాన్‌వారి ఆర్థిక విధానాన్ని జీవితాలను విప్లవాత్మకం చేసింది వినాశాత్మకమైన యుద్ధంతో ఎన్నో నష్టాలు కలిగినా గడచిన 16 సంవత్సరాలలో వారు ఆమ రాబడిని ఇబ్బడి చేసుకున్నారు. ప్రజల ఐశ్వర్యమూ ఇనుమడించింది.




(1) యు. ఎస్. ఎస్. ఆర్, (2) మంగోలియా, (3) మంచురియా, (4) చైనా, (5) జపాన్, (6) తైవాన్, (7) ఫిలిప్పైన్స్, (8) సారవాక్, (9) బ్రూని, (10) ఇండోనీషియా—1. కాలిమంటన్ 2. సెలెబెస్, 3. పశ్చిమ ఇరియన్ 4. సుమాత్రా, 5. జావా. (11) సింగపూర్, (12) మలయా, (13) హైగాన్, (14) వియత్‌నామ్, (15) లావోస్, (16), కాంబోడియా, (17) థాయ్‌లెండ్, (18) బర్మా, (19) నేపాల్, (20) సిక్కిమ్, (21) భూటాన్, (22) భారత్, (23) పాకిస్తాన్, (24) అఫ్ఘనిస్తాన్, (25) లంక.

జపాన్ వ్యాపారం మూడింట రెండువంతులు ఆసియా ఆఫ్రికాలలోని కమ్యూనిస్టేతర దేశాలతోనే అయినా, ఆగ్నేయాసియాతోను వాణిజ్యాభివృద్ధికి, చైనాలో తన వస్తువుల అమ్మకానికి ప్రయత్నిస్తున్నది. అమెరికా జపాన్‌తో సైనికపు ఒడంబడికలు చేసుకొనడం, శాంతమహాసాగరంలో 7 వ నౌకాదళాన్ని మకాం చేయించడం, జపాన్‌కు సహాయం చేయడం, ఆయుధాలు సరఫరా చేయడం, చైనాను ముందురాకుండా అడ్డుకొనడానికీ, శాంత మహాసాగరంలో రష్యా నౌకా దళచర్యలను నివారించడానికీని ఇంత అయినప్పటికీ, యుద్ధంవల్ల, పునర్నిర్మాణశ్రమతోను మొక్కపోయిన జపాన్ జాతీయాహంకారం ప్రదజ్వలించే అవకాశం వుంది.

## దక్షిణ కొరియా

దక్షిణ కొరియా అధ్యక్షుడు, మంత్రి వర్గమూ ఉన్న రిపబ్లిక్. జనసంఖ్య రెండున్నర కోట్లు. 16 సంవత్సరాలక్రితం కొరియా యుద్ధం జరిగింది తర్వాత దక్షిణకొరియా అమెరికానుంచి ఆర్థికసహాయం పొందుతున్నది. దేశంలో ఆర్థిక స్థిరత్వం ఏర్పడడానికి కొంతకాలం పడుతుంది దేశం చైనా వత్తాసుకల కమ్యూనిస్టు ఉత్తరకొరియాను ఎదుర్కోవ వస్తువస్తున్నది.

## తైవాన్ (ఫార్మోసా)

తైవాన్ శాంత మహాసాగరంలోవున్న ద్వీపం దీని పొడవు 200 మైళ్ళు, వెడల్పు 90 మైళ్ళు చైనాకు ఆగ్నేయ దిశలో వున్నది 18 సంవత్సరాల క్రితం జరిగిన యుద్ధంలో సర్వనాశనమయింది చైనాలో విప్లవం ఏర్పడిన తర్వాత ద్వితీయ ప్రపంచ యుద్ధ నాయకులలో ఒక్కడైన చాంగ్‌కై షేక్ తైవాన్‌కు పారిపోయి తలదాచుకొన్నాడు. అతడు తైవాన్‌లో చైనా రిపబ్లిక్ లేక జాతీయ చైనా పేరుతో 1949 లో రాజ్యం స్థాపించాడు దీనికి రాజధాని, తైపే ఇతనికి అమెరికా సైనిక ఆర్థిక సహాయాలు చేస్తున్నది చాంగ్‌కై షేక్ సుస్థిర ప్రభుత్వం నెలకొల్పారు ఈ రాజ్యం జనసంఖ్య కోటి 35 లక్షలు దీనిలో 20 లక్షల మంది చైనా నడిగడ్డనుంచి వచ్చిన కాందిశీకులు ఇతడు ప్రజలకు భూములు ఇచ్చి పట్టాలు ఇచ్చాడు దానితో రైతులు భూముల స్వంతదార్లయి వరి, చక్కెర, మొక్కజొన్నల పంట మూడింతలయింది పది సంవత్సరాలలో అభివృద్ధి ప్రమాణం తొమ్మిది శాతం పెరిగింది. అభివృద్ధిలో జపాన్ తర్వాత స్థానం తైవాన్‌దే చైనా నడి గడ్డపైది ప్రజలు మావో నియంతృత్వానికి ప్రతికూలంగా విప్లవం కొనసాగిస్తే, తను వారికి సహాయంగా చైనాపై దాడి చేస్తానని 1968 అక్టోబర్‌లో చాంగ్‌కై షేక్ ప్రకటన చేశాడు ఫ్రాన్స్ అధ్యక్షుడు డిగాల్ కమ్యూనిస్టు చైనాను గుర్తించడంతో రాజకీయంగా కొంత క్లిష్టత ఏర్పడింది.

## ఫిలిప్పైన్స్

ఫిలిప్పైన్స్ మలయా ద్వీప సమావ్నాయంలో 1008 కి పైగా వున్న చిన్న పెద్ద ద్వీపాల సముదాయం. రాజధాని మణిలా జనాభా కోటిన్నర జనాభాలో హెచ్చుమంది మలే జాతివారు తక్కిన వారు చైనీయులు, జపాన్ వారు. ఇది 19వ శతాబ్దంలో స్పెయిన్ అధీనంలో వుండేది 1898 లో స్పెయిన్—అమెరికా యుద్ధం తర్వాత అది అమెరికా వారి వశమై యునైటెడ్ స్టేట్స్‌లో భాగంగా చేర్చబడింది

కాని ఈ ద్వీపవాసులు తమ స్వాతంత్ర్యం కోసం పలుమార్లు పోరాటాలు సాగించారు—దూర ప్రాచ్యంలో యుద్ధతంత్రరీత్యా ఈ ద్వీపాల ప్రాముఖ్యాన్ని ఎరిగిన జపాన్ తమపై దాడి చేయగలదనే భయం వున్నప్పటికీ. 1946 నుంచి ఫిలిప్పైన్ అమెరికా రాజ్యంలో భాగంగా ఉండలేదు. స్వాతంత్ర్యం పొందింది; అమెరికాతో లాభసాటి వాణిజ్య సంబంధాలు పెట్టుకుంది ఈ ద్వీప సముదాయంలోని కలప, నార, పత్తి పరిశ్రమలపై జపాన్‌వారి ప్రాబల్యం వుండడం వల్ల జపానీయ ఆర్థిక విధానం చొచ్చుకొని వచ్చింది దాదాపు ఏడుసంవత్సరాలక్రితం అధ్యక్షుడు మక పోగల్ సామాన్య ప్రజల సౌకర్యం కోసం ఆర్థిక సాంఘిక సంస్కరణలను అమలు జరిపి నూతన శకం ప్రారంభించాడు మక పోగల్ అమెరికాతో పరస్పర రక్షణ ఒడంబడిక జరుపుకొన్నాడు, రష్యా మలేషియా, ఇండోనీషియాలతో, మైత్రీపూర్వక సంబంధాలు పెట్టుకొన్నారు ఆగ్నేయాసియా రాజ్యాల ఒక సంస్థను — మాఫిలిండో అనే పేరుతో నెలకొల్పి బలపరచాలని ఈయన లక్ష్యం.

## కాంబోడియా

కాంబోడియా దేశం ఫ్రెంచి పరిపాలననుంచి విముక్తమై, స్వతంత్రమైంది. జనాభా 60 లక్షలు. ఈ దేశం అధినేత ప్రిన్స్ నరోదం షిహనౌక్. రాజధాని ఫాంపెన్ ఫ్రాన్సుతో పాత స్నేహ సంబంధాలు కొనసాగాలని యితని ఆశ. ఫ్రెంచివారు ఇండో చైనాను పరిపాలించినప్పుడు ఐదు రాజ్యాలను ఐదు సరిహద్దులతో ఏర్పాటు చేశారు. ఈ సరిహద్దులను అమెరికా మినహా తక్కిన ప్రపంచ దేశాలన్నీ పరిగణించాయి తాను థాయ్ లెండ్‌ను, దక్షిణ వియత్నామ్‌ను అసంతృప్తి పరచవలసి వస్తుందేమోనని అమెరికా ఈ సరిహద్దులను ఒప్పుకోలేదు 1964 లో ఎనిమిదిదేశాల ఆగ్నేయాసియా రక్షా వ్యవస్థ మహాసభ మణిలాలో జరిగినప్పుడు నరోదమ్ తనకు ఈ వ్యవస్థ రక్షణ అక్కరలేదని, తన ఉద్దేశ్యం తాటస్థ్యమని స్పష్టపరచాడు అతని మొగ్గు రష్యా చైనాల వైపు వున్నది. అందువల్ల కాంబోడియాలో కొంత కమ్యూనిస్టు పలుకుబడి వుంది. కాని చైనావారి పలుకుబడని అరికట్టడం కోసం అమెరికా సైన్యం ఈ ప్రాంతంలో మకాం చేసి వుండాలని నరోదమ్ అభిమతం.

## థాయ్‌ల్యాండ్

థాయ్‌ల్యాండ్ జనాభా మూడు కోట్ల 40 లక్షలు స్వతంత్రదేశం. జనం అధికారుల నిర్బంధాలు లేకుండా తమ వ్యవహారాలు జరుపుకొంటున్నప్పటికీ, సైనిక పరిపాలన, లేక నియంతృత్వం వుందన వచ్చు. ప్రధాని సర్వాధికారి దీని రాజధాని బాంగ్‌కాక్ ఇది ఆగ్నేయాసియా రక్షణ వ్యవస్థకు కూడా కేంద్రం; సాంఘికఆర్థిక దృష్టితోను ముఖ్యమైనట్టిది థాయ్‌ల్యాండ్ జాతీయాదాయాన్ని ఏటా ఎనిమిది శాతం పెంచే దృష్టితో వ్యవసాయానికి, పరిశ్రమలకు, బ్యాంకింగు, రవాణాలకు ప్రాధాన్యం ఇస్తూ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికను 1967 లో ప్రారంభించింది విదేశీ పెట్టుబడి, వ్యాపారం, స్థానిక వాణిజ్యంలో సహకరించాలని ప్రోత్సహించ బడుతున్నాయి టారిఫ్ మట్టంకూడా తక్కువ.

## లావోస్

లావోస్ 17 వ శతాబ్దంలో అడపాదడపా థాయ్‌లెండ్ వియత్నామ్ బర్మాల దండయాత్రలకు గురి అయింది దీని దుష్ఫలితంగా, దేశం ముక్కా ముక్కలయి, ఫ్రెంచి వారి పెత్తనం క్రిందికి వచ్చింది తర్వాతి శతాబ్దంలో ఇది మూడు ప్రత్యర్థి రాజ్యాలగా విభక్తమయింది 1962 లో జెనీవాలో జరిగిన 14 దేశాల మహాసభలో ఈ మూడు ప్రాంతాలకూ స్వాతంత్ర్యం ఇవ్వాలని, మూడు రాజ్యాలను ఏకం చేయాలని, తాటస్థ్యం కాపాడాలని తీర్మానించడం వల్ల ప్రిన్స్ సౌవన్న ఫౌమా రాజ్యపరిపాలన చేయాలని సలహా యివ్వబడింది ఈ తీర్మానాన్ని బ్రిటన్, సోవియట్ యూనియన్ రక్షించాలని కూడా కోరబడింది ఇక్కడి నాయకులలో మూడు తెగలవారున్నారు (1) పాశ్చాత్య దేశాల పలుకుబడిలోవున్న దక్షిణ పక్షంవారు (2) కమ్యూనిస్టు ఉత్తర వియత్నాం, చైనాల పలుకుబడిలో వున్న వామపక్షీయులు (3) తటస్థులు వామపక్షీయులు దక్షిణ పక్షీయులు తాము జాతీయవాదులమని చెప్పుకొంటారు కాని, నిజానికి వారు, ప్రధాని సౌవన్న ఫౌమా నాయకత్వానవున్న తటస్థులకింద ఉన్నారు. సౌవన్న ఫౌమా, ఒకప్పుడు లావోస్‌లో సగంట నాల్గవంతులను ఆక్రమించుకొన్న కమ్యూనిస్టు సైన్యాలతో పోరాడవలసివస్తూ వుంటుంది ఇతడు విదేశీ సైన్యాలను తన దేశంనుంచి వెళ్లగొట్టలేక పోతున్నాడు అంతర్జాతీయ నియంత్రణ సంఘం వూరికే చూస్తూ ఉంటుంది.

## బర్మా

బర్మాలో 1962 లో జనరల్ నే—విన్ అధ్యక్షుడుగా విప్లవ మండలి నెలకొన్నప్పటినుంచి గొప్ప మార్పులు జరగాయి. ఇతడు భక్తిగల సైన్యం కారణంగాను, ప్రతిపక్షాలు చిందర వందరగా ఉన్నందువల్లను, పెట్టుబడి దేశాలు, కమ్యూనిస్టు దేశాలు సహాయము చేయడంవల్లను తన అధికారాన్ని నిలుపుకొనగలుగుతున్నాడు అయితే, ఈయన పెకింగ్ అనుకూలపక్షాన్ని గుర్తించి పని చేయవలసివచ్చింది. ఇతడు సోషలిజంను దేశంలో ప్రవేశపెట్టాడు.

బ్యాంకులపై అదుపుతోను, పెట్రోలు, ఖనిజాలు, టేకు, కలప, రవాణా పరిశ్రమలను జాతీయం చేయడంతోను ఆర్థిక వ్యవస్థను నిర్వహించగలుగుతున్నాడు.

## వియత్నాం

1954 లో జెనీవాలో జరిగిన మహాసభ ఫలితంగా, వియత్నాం ఉత్తర దక్షిణ వియత్నాంలని రెండు దేశాలుగా విభక్తమయింది. ఉభయ ప్రాంతాల విస్తీర్ణం చేరి 60,000 చదరపు మైళ్ళు. ఉత్తర వియత్నాం రాజధాని హనోయ్. ఇది కమ్యూనిస్టుపార్టీ వశంలో వుంది. హొచిమిన్ దీని అధ్యక్షుడు. ఉభయ ప్రాంతాల ఏకీకరణ జరుగాలని సూచించే రాజ్యాంగం అమలులో వుంది. దక్షిణ వియత్నాం రాజధాని సైగాన్ దీనికి ప్రధాని ఎన్‌గుయెన్ ఖాన్. దీనికి అమెరికా రక్షణ వుంది. దక్షిణ వియత్నాంలోను జాతీయ విమోచన సంఘటన ఎన్‌గుయెన్ హాన్‌థియు నాయకత్వాన పని చేస్తున్నది దీనికి ఉత్తర వియత్నాం బలం వుంది 1960 నుంచి కమ్యూనిస్టులు దక్షిణ వియత్నాంపై దండయాత్రలు సాగిస్తూనే వున్నారు. 1963 లో ఉత్తర వియత్నాంలోని వియత్‌కాంగ్ 60 శాతం జనం నివసించే సారవంతమయిన మీకాంగ్ డెల్టా ప్రాంతంలో మూడింట రెండు వంతులను అదుపులో పెట్టుకొంది. కమ్యూనిస్టులు దండయాత్రలతో ముందుకు వస్తుండగా, సైగాన్‌లోని ప్రభుత్వం ఆత్మరక్షణ పరాయణమయివుంది. 1964 లో అమెరికా రాయబారి జనరల్ టేయ్‌లర్ దక్షిణ వియత్నాం ప్రధానిని కలుసుకొని, కమ్యూనిస్టు వియత్కాంగ్ దుండగులపై గట్టి చర్యలు తీసుకోవాలని సలహా యిచ్చాడు. ఒక కుతూహలకర విషయం ఏమిటంటే—ఫ్రెంచి అధ్యక్షుడు డిగాల్ 15 సంవత్సరాలక్రితం కోల్పోయిన పలుకుబడిని మళ్లీ ఈ ప్రాంతంలో సంపాదించ కొనడానికి ప్రయత్నించడం. ఫ్రెంచివారికి ఉత్తర వియత్నాంలోని బొగ్గు గనుల పరిశ్రమమీద, దక్షిణ వియత్నాంలోని రబ్బరు తోటల పరిశ్రమమీద చాల ఆసక్తివుంది.వియత్‌కాంగ్‌ల ఉద్దేశమేమిటంటే ఉత్తర దక్షిణవియత్నాంలు మళ్లీ ఏకం కావాలని. విదేశాల ప్రాబల్యం, ముఖ్యంగా కమ్యూనిజంను అరికట్టడానికి శ్రమపడుతూన్న అమెరికా ప్రాబల్యం తొలగిపోవాలనిన్నీ. రష్యనులు కాని, చైనావారుగాని వియత్కాంగ్‌కు తోడ్పడుతున్నారు దీనితో వియత్నాం సమస్య ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. ఎవ్వరూ ఈ విషయమై హర్షించడం లేదు. 1967 సెప్టెంబర్ 29 వ తేదీన అప్పటి అమెరికా అధ్యక్షుడు శ్రీ జాన్సన్ వియత్నాంకు ఒక ప్రతిపాదన చేశాడు ఉత్తర వియత్నాంపై అమెరికా సైన్యం బాంబులు కురిపించడం ఆపివేస్తానని, పరిష్కారంకోసం సంప్రతింపులు ప్రారంభిస్తానని కాని, ఆ ప్రతిపాదన తోసివేయబడింది ఉత్తర వియత్నాంవారు సంయమంతో ప్రవర్తిస్తే అన్ని విధాల బాంబుల ప్రయోగాన్ని ఆపివేస్తానని, లేకపోతే పరిమితంగా బాంబులు వేయడం ఉంటుందని శ్రీ జాన్సన్ 1968 మార్చి 31 న మరొక ప్రతిపాదన చేశాడు. 1968 ఏప్రిల్ 3 వ తేదీన ఉత్తర వియత్నాం ప్రభుత్వం ఈ ప్రతిపాదనను అంగీకరించింది కాని, దండయాత్రను మళ్లీ కొనసాగించింది ఈ దండయాత్ర ఆక్రమిత పట్టణాలలో ఒక్కదానినైనా అదుపులో పెట్టుకోలేకపోవడంవల్లనైతేనేమి, దక్షిణ వియత్నాం ప్రభుత్వంపై ఒక్కరు కూడా తిరుగుబాటు చేయనందువల్లనైతేనేమి—విఫలమయింది దీని పర్యవసాన మేమిటంటే, ఉత్తర వియత్నాంలోని పరిశ్రమలకు నష్టం వాటిల్లడం, దక్షిణ వియత్నాం సైన్యాల బలం పెరగడమూను ఉత్తర వియత్నాంకు మాస్కో ఏటా శతకోటి డాలర్ల సహాయం చేస్తున్నది దాని సమస్యలు దానికున్నాయి చైనా చిక్కులు చైనాకున్నాయి హొచిమిన్ ఇక గత్యంతరంలేక శ్రీ జాన్సన్ 1968 మార్చినెలలో చేసిన ప్రతిపాదనను అంగీకరించాడు ఈ ప్రతిపాదన చేయడంలో అమెరికా అధ్యక్షుని ఉద్దేశం సంఘర్షణ పునఃపరిశీలనకు అవకాశం కల్పించే నిమిత్తం ఉభయ సైన్యాల ఉపసంహరణగా ప్రాతిపదిక కుదర్చడం, ఉత్తర వియత్నాంకు లోబడిపోకుండా దక్షిణ వియత్నాంను రక్షించడం, దక్షిణ వియత్నాంకు స్వయం నిర్ణయాధికారపు హామీ ఇవ్వడం, ఉత్తర వియత్నాం విషయంలోను, జాతీయ విమోచన సంఘటన విషయంలోను తన రాజకీయ నిర్ణయాలు చేయడానికి దక్షిణ వియత్నాంకు అవకాశం కలిగించడమూను. శ్రీ జాన్సన్ ఉత్తర వియత్నాం సహాయం పొందుతున్న దక్షిణ వియత్నాంలోని జాతీయ విమోచన సంఘటన నాయకుడు ఎన్ గుయెన్ హాన్ థియును చర్చలకోసం హొనొలులుకు ఆహ్వానించాడు. ఈ సమస్యకు సంబంధించిన పక్షాలమధ్య శాంతి చర్చలు పారిస్‌లో ప్రారంభమయ్యాయి. ఈ పరిస్థితి అధ్వాన్నం కావడానికి 1969 జనవరి మొదటివారంలో చైనా ఉత్తర వియత్నాంకు తుది విజయం వరకు యుద్ధం కొనసాగించడానికి సైనిక, ఆర్థిక సహాయం చేస్తానని ప్రతిపాదన చేసింది. వియత్నాం కోస్తాకు ఆవలగా చైనాకు చెందిన ద్వీపం హైనాన్ వుంది. అమెరికా చైనాపై అకస్మాత్తుగా దాడి జరిపేట్లయితే, హెచ్చరించడంకోసం హైనాన్‌ను రహస్యపు కోటగా మార్చారు.

## మలయేషియా

మలయా జనాభామాత్రం 70 లక్షలు. రాజధాని కౌలాలంపూర్ 1957 లో స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత ప్రిన్స్ తుంకు అబ్దుల్ రహమాన్ ప్రధాని అయ్యాడు. మలయాలో భూమి చాలవరకు అటవీమయం. రబ్బరు, తగరం మలయాలో విశేషంగా వున్నాయి. మలయా, సారవాక్, సాబాలతో తుంకు అబ్దుల్ రహమాన్ మలయేషియా సమాఖ్యను నెలకొల్పాడు. జనాభా కోటికిపైగా వుంటుంది. ప్రజలలో ముస్లింలు, చైనావారు హెచ్చుగా వున్నారు. ప్రజలు సహజంగా కమ్యూనిజం ప్రతికూలురు. అబ్దుల్ రహమాన్ సాంఘిక పారిశ్రామికాభివృద్ధి నిమిత్తం పథకాలు ప్రారంభించాడు. ఆయన తీవ్రమైన సమస్యలు ఎదుర్కోవలసి వచ్చింది ఫిలిప్పైన్స్ ఒకవైపు సాబా (ఉత్తర బోర్నియో) తనదేనని అంటున్నది మరొకవైపు ఇండోనీషియాతో ఘర్షణ ఏర్పడింది. సారవాక్, సాబాలు ఉత్తర బోర్నియోలో ఉంటున్నాయి. కాని, దక్షిణ బోర్నియో ఇండొనీసియాలో వుంది. దక్షిణ బోర్నియోతో స్నేహం కారణంగా దక్షిణ బోర్నియోనుంచి వస్తున్న గెరిల్లా దళాల బాధను ఎదుర్కోవలసి వస్తున్నది. ఉత్తర బోర్నియోలోవున్న బ్రూనీ ఒక సుల్తాన్ పాలనలో వుంది. ఇతనికి బ్రిటిష్ రక్షణ వుంది. మలయేషియా సమాఖ్యలో చేరడం ఇతనికి శ్రేయోదాయకం

## సాబా

సాబా ఉత్తర బోర్నియోలోని 20,000 చదరపు మైళ్ల ఒక చెక్క. ఇక్కడ కలప, రబ్బరు, పొగాకు, ఖనిజాలు విశేషంగా దొరుకుతాయి. సులూ సుల్తాన్ ఈ ప్రాంతాన్ని బ్రిటిష్ వారికి దానంగానో, కవులుకో యిచ్చాడు. తర్వాత యిది మలయేషియాకు బదిలీ అయింది. 1963 లో మలయేషియా సమాఖ్యలో ఒక రాజ్యంగా అయింది. ఇది ఎవరికి చెందాలనే విషయమై మలయేషియా ప్రధాని అబ్దుల్ రహమాన్‌కు, ఫిలిప్పైన్ అధ్యక్షుడు ఫెర్డినండ్ మార్కోస్‌కుమధ్య ఒక ఒడంబడిక వుంది సాబా మలయేషియాలో భాగమనే వాదాన్ని రష్యా, తూర్పు యూరోప్ దేశాలు సమర్థిస్తున్నాయి. ఇటీవల సాబాలో జరిగిన ఎన్నికలలో సాబా ప్రజలు తాము మలయేషియాలో ఉండడానికే నిశ్చయించుకొన్నట్టు స్పష్టం చేశారు. ఈ సమస్య మలయేషియా ఫిలిప్పైన్స్‌లమధ్య సామరస్య పూర్వకంగా పరిష్కర్త ద్వారాగాని, మధ్యవర్తిత్వంతోగాని పరిష్కారమయితే, ఆగ్నేయాసియా దేశాలకు ప్రయోజనకరం. వచ్చే రెండు మూడు నెలల్లో మలయేషియా ప్రధాని థాయ్‌లెండ్, ఆస్ట్రేలియా, న్యూజీల్యాండ్, సింగపూర్, మలయేషియా ఈ ఐదుగు రాజ్యాల రక్షణ మహాసభను సమావేశపరుస్తాడని 1969 జనవరిలో ప్రకటించబడింది.

## ఇండోనీషియా

సుమాత్రా, జావా, బోర్నియోలో పెద్ద భాగం—కాలిమంటం, సెలెబెస్ (సులావేసి), పశ్చిమ టిమోర్, పశ్చిమ న్యూగినీ (పశ్చిమ ఇరిన్) – కలిసి ఇండోనీషియా అని వ్యవహరించబడుతున్నాయి జనాభా 10 కోట్లకు పైగా. జకార్తా దీని రాజధాని 1949 లో ఇండొనీషియా డచ్‌వారి శృంఖలాల నుంచి విడివడిన తర్వాత, అధ్యక్షుడు సుకర్ణో తన దృష్టిని మలయేషియా

సింగపూర్‌లపై వ్యాపింపజేశాడు. కాని, అతడు తన ప్రయత్నాలను మానుకోవలసి వచ్చింది. ఇండోనీషియా ద్వీప సమూహం, పెట్రోలు, తగరం, రబ్బరు మొదలయిన వాటితో సంపన్నమయింది. సుకర్నో పాశ్చాత్య దేశాల సహాయంతో పోషలిస్టు రాజ్య స్థాపనకు పూనుకున్నాడు. ఆగ్నేయాసియాలో కమ్యూనిస్టు ప్రాబల్యాన్ని అరికట్టడానికి, కమ్యూనిస్టులు దేశాలను స్వాధీనం చేసుకోకుండా చూడడానికి, పెట్టుబడిగా పాశ్చాత్య దేశాలు ఇండోనీషియాకు చేసే సహాయాన్ని పరిగణిస్తాయి. కాని, సుకర్నో అవినీతి, బంధుప్రీతి, దుష్పరిపాలన కారణంగా అధికారచ్యుతుడు కావలసి వచ్చింది. తర్వాత వచ్చిన ప్రభుత్వం ఇండోనీషియా జాతీయ జీవితాన్ని సువ్యవస్థితం చేయడానికి ప్రయత్నిస్తున్నది. ఇండోనీషియాలోని కమ్యూనిస్టుపార్టీకి కోటిమంది సభ్యులున్నారు. అందువల్ల ఇండోనీషియా భవిష్యత్తును గురించి అంచనాలు వేయడం సులభం కాదు. పరిస్థితి ఎప్పుడైనా ప్రేలవచ్చు.

## ఆస్ట్రేలియా

ఆస్ట్రేలియా ఖండంలో జనసంఖ్య అత్యంత విరళం. ప్రభుత్వం "తెల్ల ఆస్ట్రేలియా విధానం" అనుసరిస్తూ, ఇతర దేశాలవారు వలస రాకుండా అడ్డుపెడుతున్నది. ఉత్తర ఆస్ట్రేలియా ప్రాంతాలు నిర్మానుష్యంగా ఉండడం చూచి ఇండోనీషియా ప్రజలు చాల అసూయపడుతుంటారు. పొరుగున తెల్లవారుకానివారు ఉండడంవల్ల ఆస్ట్రేలియా ప్రభుత్వం తన విధానాన్ని మార్చుకోవలసివుంటుంది.

## సింగపూర్

స్వయం సమృద్ధమయిన ఈ చిన్న ద్వీపం ఆరుతరాలపాటు బ్రిటిష్ పరిపాలనలోవుంది. ఆగ్నేయాసియాలో యుద్ధ తంత్ర రీత్యా దీనికి చాల ప్రాధాన్యం వుంది. ఇది మలయేషియా సమాఖ్యలో వుండేది. జనరల్ సుహార్తో ఇండోనీషియా అధ్యక్షుడయినప్పుడు ఇండోనీషియాతో సింగపూర్‌కు స్నేహపూర్వక సంబంధాలుండేవి. మూడు సంవత్సరాల క్రితం మలయేషియా సమాఖ్యలో నుండి విడిపోయి ప్రత్యేక రాజ్యంగా మారిపోయింది. ఇరుగు పొరుగు చిన్న ద్వీపాలతోపాటు సింగపూర్ వైశాల్యం 225 చదరపు మైళ్లు. జనాభా 20 లక్షలు. దీనిలో నాల్గింట మూడు వంతులు చైనావారు. తక్కినవారిలో అన్ని దేశాలవారూ వున్నారు—మలయావారు, భారతీయులు, ఇతర జాతులవారు. జనాభాలో మూడింట రెండువంతులు సింగపూర్ వోడరేవులో నివసిస్తున్నారు. వోడరేవు విస్తీర్ణం 37 చదరపు మైళ్లు. ఇది ఆధునిక సౌకర్యాలున్న సహజమైన రేవు. ప్రపంచంలోని పెద్ద రేవులలో ఐదవది. ప్రధాని లీ కువాన్ యూ నాయకత్వాన స్వేచ్ఛా వ్యాపారం, మేధావులయిన వ్యాపారస్థులు, వ్యాపారస్థులకు ప్రోత్సాహం, పన్నుల రాయితీ, ఆర్థికాభివృద్ధి సంఘం సహాయం, అభివృద్ధి బ్యాంకు ఋణాలు, రాకపోకల, వార్తల సౌకర్యాలు—ఈ లన్నింటి కారణంగా పారిశ్రామికంగాను, వ్యాపారరీత్యాను అభివృద్ధి చెందుతున్నది. ఆగ్నేయాసియా దేశాలలో తలసరి రాబడి హెచ్చుగావున్న దేశం ఇదే. ఇక్కడ ఏడాదికి తలసరి సరాసరి రాబడి రూ 4000. 1968 మే నెలలో భారతదేశం సింగపూర్‌తో పరస్పర వాణిజ్య ఆర్థిక సహకారాలకోసం ఒడంబడిక చేసుకుంది. 1968 మే నెలలో ఐదు రాజ్యాల రక్షా మహాసభ మలయేషియా రాజధాని కౌలాలంపూర్‌లో జరిగింది. బ్రిటన్, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, మలయేషియా, సింగపూర్‌ల ప్రతినిధులు పాల్గొన్నారు. మలయేషియా, సింగపూర్‌లతోసహా వర్తించే సమన్విత సైనిక రక్షణ వ్యవస్థ వుండాలని, 1970 లో జరిగే పెద్ద సైనిక విన్యాసాలలో ఈ ఐదు దేశాలు పాల్గొనాలని నిర్ణయించబడింది. కాని చైనా, రష్యాలతో సహా అగ్రరాజ్యాలు ఆగ్నేయాసియా ప్రాంతంలో శాంతి భద్రతల నిమిత్తం తటస్థీకరణకు హామీ ఇవ్వాలి. అని ప్రయత్నించకోడం విడూర్దరం ఫిలిప్పైన్స్‌కు ఆసియా దేశాలన్నింటితోను సైనిక స్నేహం కావాలి. దక్షిణ కొరియాకు అమెరికా సహాయం కావాలి. 1971 తర్వాత సూయజ్ ప్రాంతం నుంచి తన సేనల ఉపసంహారణకు బ్రిటన్ నిర్ణయించడంవల్ల ఆగ్నేయాసియా ప్రాంతంలో శాంతి రక్షణకు జపాన్ అమెరికా సహాయంతోగాని, స్వయంగా గాని పూనుకోవలసివుంటుంది.

## హిమాలయప్రాంత రాజ్యాలు

హిమాలయ పర్వతాల ఉపత్యక ప్రాంతాలలో వున్న రాజ్యాలు సిక్కిం, భూటాన్, నేపాల్ చాల వెనుకబడినట్టివి. భారతదేశంతో స్నేహంతో ఉన్నాయి. టిబెట్ కమ్యూనిస్టు చైనా అధీనంలో వుంది. కమ్యూనిస్టు ప్రభుత్వం కింద టిబెట్టు ప్రజలు పడరానిపాట్లు పడుతున్నారు. కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని అనుసరిస్తున్న రష్యా బౌద్ధ రాజ్యాలపట్ల అనుసరిస్తున్న వైఖరిలో ఇటీవల మార్పు కలిగింది. రష్యా ప్రభుత్వం ప్రతినిధివర్గాలను పంపడంద్వారా ఈ రాజ్యాలతోను, లంకతోను మత, సాంస్కృతిక సంబంధాలను పెంపొందించుకొంటున్నది. సోవియట్ రష్యాలో కొన్ని రిపబ్లిక్‌లు పూర్తిగాను, కొన్ని రిపబ్లిక్కులు కొంత మేర బౌద్ధ మతం అనుసరించేవి వున్నాయి. ఈ మార్పులకు కారణాలు, దానికి చైనాతోగల పోటీ, భౌగోళిక, రాజకీయ పరిస్థితిని.

## భారతదేశం

భారతదేశంలోను వివిధ సమస్యలపై అశాంతి వుంది. కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసేతర పక్షాల ప్రభుత్వాలు నెలకొని ఉన్నాయి. కచ్ బాడవ విషయమై భారత—పాకిస్తాన్‌లమధ్య రాజుతున్న వివాదం 1965 లో పాకిస్తాన్ మన బాడవప్రాంతంలో చొచ్చుకొనివచ్చి కొన్ని నాకాలు స్థాపించడంతో ప్రజ్వరిల్లింది. ఉభయ దేశాలూ ఈ వివాదాన్ని అంతర్జాతీయ ట్రిబ్యునల్ విచారణకు పెట్టాయి. పాకిస్తాన్ ఆక్రమించిన బాడవ ప్రాంతాలను అదే ఉంచుకోవచ్చునని ఆ ట్రిబ్యునల్ తీర్పు ఇచ్చింది. ఈ తీర్పును తోసివేయాలని ఆ ప్రాంతపు భారతీయులు కొందరు మన సుప్రీంకోర్టుకు దరఖాస్తు పెట్టుకున్నారు. 1969 జనవరి మొదటివారంలో సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది. అంతర్జాతీయ ట్రిబ్యునల్ నిర్ణయం సరైనదేకాని, దీనికోసం రాజ్యాంగం సవరణ అవసరంలేదని ఈ తీర్పులో స్పష్టపరచింది. కమ్యూనిస్టులు సిద్ధాంత యుద్ధాలలో కొట్టుకొంటున్నారు. నక్సల్‌బరీ విప్లవకారులు చురుకుగా పని సాగిస్తున్నారు. ఈశాన్య భారతంలో నాగాలు, కుకీ తెగవారు, మిజో తెగవార, చైనా సహాయంతో ఏకమయి భారత ప్రభుత్వాన్ని ఎదిరిస్తున్నారు. భారతదేశానికి తన పలుకుబడి విస్తరింపజేసుకోగల ప్రాంతమయిన ఆగ్నేయాసియా ఎడల భౌగోళిక, చారిత్రక, ఆర్థిక, సైనిక దృక్పథాల దృష్ట్యా ఆసక్తి ఉండాలి. ఆగ్నేయాసియాలోవున్న దేశాలు ఉత్తర వియత్నాం, ఉత్తర కొరియా, ఉత్తర లావోస్‌లు మినహాగా రాజకీయంగా సన్నిహితత్వం కలవి. మతదృష్టితో అత్యధిక సంఖ్యాకులు బౌద్ధులు. వీరూ ముస్లింలు, క్రైస్తవులుకూడా భారతీయ సిద్ధాంతానికి సన్నిహితులు. తూర్పు ఆసియా, ఆగ్నేయాసియాదేశాలలోని భారత దౌత్య కార్యాలయాల అధినేతలు గడచిన డిసెంబరు 13 వ తేదీన న్యూఢిల్లీలో సమావేశమై విశిష్టమైన, అపరిష్కృతమయిన సమస్యలను గురించి చర్చలు జరిపారు. ఈ మహాసభ ఒగు రోజులపాటు జరిగింది. ఇది ఈ విధంగా తీర్మానాలు చేసింది.

(1) భారతదేశం నాయకత్వాన్ని కోరక ఆగ్నేయాసియా దేశాలతో ఆర్థిక, తదితర సమస్యల పరిష్కారానికి సహకార దృక్పథం అనుసరించాలి. (2) భారతదేశం తన నిబంధ విధానాన్ని, సహజీవన విధానాన్ని కొనసాగించాలి. (3) పాకిస్తాన్, చైనాలతో వివాదాలను శాంతియుతమైన సంప్రతింపులతో పరిష్కరించుకోవాలి. (4) సమష్టి సంస్థల స్థాపనకోసం, విదేశీ పెట్టుబడులకోసం భారతదేశం విదేశాలకు ఆర్థిక సాంస్కృతిక ప్రతినిధివర్గాలను పంపడం, ఆ దేశాలనుంచి ఆహ్వానించడం జరుగాలి. (5) ఆర్థికాదిరంగాలలో ప్రాంతీయ సహకారంకోసం ఆసియా మంత్రుల మండలిని నెలకొల్పాలనే బాంగ్‌కాక్ నిర్ణయాన్ని సమర్థించాలి.

1968 డిసెంబర్‌లో బాంగ్‌కాక్‌లో ఆసియాలో తొలిసారిగా, తూర్పు ఆసియాకు మంత్రిమండలి నెలకొల్పబడింది. తూర్పు ఆసియా ప్రపంచంలోని ముడి పదార్థాలలో హెచ్చుభాగం ఉత్పత్తి చేస్తున్నది. ఈ ముడి పదార్థాలను వాడే

దేశాలు వెలువరిచి. ఈ మంత్రిమండలి చెల్లింపుల యూనియన్‌ను నెలకొల్పాలని, వ్యాపారపు సౌకర్యాలు కలిగించాలని సూచించింది భారతదేశం జపాన్‌తో పాటు తన వాణిజ్యాన్ని వృద్ధి పరచుకోవచ్చు హాంగ్‌కాంగ్, సింగపూర్‌లలోని స్వేచ్ఛా వాణిజ్యపు రేవులను వినియోగించుకోవచ్చు కాని, ఈ ప్రాంతంలో యూరోప్ ఉమ్మడి విపణివంటిది నెలకొంటుందని భావించడం తొందరపాటేమో!

పశ్చిమ ఆసియా యూరోప్, ఆసియా, ఆఫ్రికా దేశాలమధ్య వంతెన వలె వుంటూ, ఇస్లాం అరబ్ నాగరకతల ప్రభావాన్ని తక్కిన ప్రాంతాలకు చేరవేస్తున్నది మధ్యఆసియా, ఆగ్నేయాసియాలను అంచు ప్రాంతాలుగాను చైనా—రష్యాలను గుండె ప్రాంతాలుగాను వర్ణించవచ్చు ఈ ప్రాంతాలు, ఇరాన్, ఇరాక్, సవూదీ అరేబియా మొదలయినవి—విప్లవాత్మక సంక్షోభాలకు గురి అయ్యాయి ఈ సందర్భంలో అరబ్—ఇస్రేల్ వివాదాన్ని ప్రత్యేకంగా పేర్కొనవచ్చు. ఈ వివాదం జోర్డాన్ నదీ జలాలకు, పాలస్తీనా మొదలయిన ప్రాంతాలకు సంబంధించింది 1964 లోనే ఈజిప్టు అధ్యక్షుడు నాజర్ ఇస్రేల్‌పై యుద్ధ తంత్రరీత్యా దెబ్బతీయడానికి మధ్యప్రాచ్యంలోని అరబ్ రాజ్యాల మహాసభ ఏర్పాటు చేశాడు ఇస్రేల్ అస్తిత్వాన్ని అరబ్ దేశాలు అంగీకరించేటట్టు చేయడం, అరబ్ దేశాలతో, ముఖ్యంగా పాశ్చాత్య దేశాల ఎడల సుముఖంగావున్న లెబనాన్, జోర్డాన్‌వంటివాటితో మైత్రి నెరపడం, ఈ ప్రాంతాలలో సోవియట్ పలుకుబడిని నివారించడం అమెరికా యునైటెడ్ స్టేట్స్ విధానం ఇస్రేల్‌వారు అభివృద్ధి కావడానికి అవకాశం కలిగించడం అవసరం. నాజర్ 'అతి జాతీయరాజ్యం' స్థాపించాలనే తలపును వదులుకోడము అవసరం. ఈ అస్థిర రాజకీయ పరిస్థితి వున్నప్పటికీ, దేశాలు పరస్పర అవగాహన సహకారాలకోసం వివిధ సంఘాలుగా ఏర్పడడం త్వరితగతిని జరుగుతున్నది అసంతృప్తి, ఉద్రిక్తత చెలరేగినసమయాలలో ఎదుర్కొనవలసిన ప్రమాదాల విషయమై చరిత్రలో ఎన్నో తార్కాణాలున్నాయి ఉదాహరణకు—నాలుగు సంవత్సరాలక్రితం జెనీవాలో వాణిజ్య అభివృద్ధి విషయాలపై జరిగిన ఐక్యరాజ్యసమితి మహాసభ బడుగు దేశాలకు, సంపన్న దేశాలకు మధ్య ఏర్పడిన అంతరాన్ని తగ్గించడానికి ప్రయత్నించాలని పాశ్చాత్య దేశాలకు సలహా యిచ్చింది 1968 ఫిబ్రవరి ప్రారంభంలో న్యూఢిల్లీలో జరిగిన ఐక్యరాజ్యసమితి వాణిజ్య మహాసభ అంతర్జాతీయ కార్మిక విభజనకు, సుంకాల అడ్డుగోడలు తొలగించడానికి, సంపన్న దేశాల మార్కెట్లలో వర్ధమాన దేశాల పారిశ్రామికోత్పత్తులకు విశేషావకాశం కల్పించడానికి ఒక పద్ధతిని రూపొందించాలని నిర్ణయించింది. ఉత్తమ ఆర్థిక వ్యవస్థకోసం వ్యాపార వాణిజ్యాలు అభ్యుదయానికి సాధనాలుగా ఉండాలి. ప్రపంచ సాధన సంపత్తిని సహేతుకంగా వినియోగించాలి వర్ధమాన దేశాలలో ప్రస్తుతం అభివృద్ధి ప్రమాణం 5 శాతమే వుంది ఈ దేశాలు పశ్చిమ యూరోప్ దేశాలలోని ఇప్పటి తలసరి రాబడిస్థాయిని సంపాదించడానికి చాలకాలం పడుతుందని ఆర్థిక నిపుణులు భావిస్తున్నారు ఆసియా, దూర ప్రాచ్య ఆర్థిక విషయాల సంఘం టెహరాన్‌లో జరిపిన సమావేశంలో ఆసియాకోసం ఒక పథకాన్ని సిద్ధపరచింది ఇది ఈ ప్రాంతాల ఆర్థిక, సాంఘిక, సాంస్కృతికాభివృద్ధికి తోడ్పడుతున్నది

ప్రస్తుతం మనకు కనిపిస్తున్న రీతిగా తూర్పు ఆసియా చిత్రాన్ని స్థూలంగా ప్రదర్శించడానికి ప్రయత్నించాను ప్రపంచ రాజకీయ దశలు ఎప్పటికప్పుడు మారుతూ, అధికార సమస్థితిలోను మార్పులు వస్తున్నాయి, కనుక భవిష్యత్తు ఎలా వుంటుందో చెప్పగల అహంకారం ఎవరికీ ఉండదు. మానవుడు మంచీ చేయగలడు, చెడూ చేయగలడు అతనిలో దౌర్బల్యానికి ఆకరాలూ వున్నాయి. రాజనీతిజ్ఞులు, రాజకీయ నాయకులు పరిస్థితులను మెరుగు పరచడమేకాక, అవి చెడిపోకుండాను నివారించాలి ఆత్మగౌరవాన్ని గురించిన మనోభావమూ, మానవజాతి స్వభావానికి సంబంధించిన భాగధేయమూ, ఆత్మగౌరవాన్ని పరిగణించే సమాజ స్థాపనకు తగిన పరిస్థితులను కల్పించాలి. అప్పుడు ఆ భాగధేయం సఫలం కావడం సులభతరమవుతుంది సామాన్యంగా ఉదార ప్రజాస్వామ్యమనేది మానవుని వైయక్తిక ప్రతిష్ఠ గౌరవాలకు సంబంధించింది ఒక పౌరునికి నిజానికి తన ప్రభుత్వం చేయదలచిన న్యాయాన్ని, అన్యాయాన్ని మదింపువేసే అనుకూల పరిస్థితులు వుండవు మన కాలంలోవున్న రాజకీయ దోషాలకు అతిశయ ప్రాధాన్యం పొందుతున్న రాజకీయాలే కేవలం కారణమని చెప్పుతాము అన్ని దేశాలూ అవి అభివృద్ధి చెందినవైనా, వర్ధమానాలయినా—శాంతిని కోరుతున్నాయి మనం జాతీయ ఆత్మ—సంరక్షణమనే సహజ ప్రవృత్తిని కాపాడుకొంటూ, సంఘసామాన్యానికి, మానవజాతి ఉన్నత నైతికాదర్శానికి, సురక్షిత ప్రపంచానికి ఎలా సేవ చేయగలమనే విషయం ఆలోచిద్దాం.

# పంట కాలవ

## శ్రీ మా. గోఖలే

పెద్ద పిల్లగాడు శివాయి చుట్టుపక్కల కలియచూస్తూ లంబాడి కొట్టు అరుగుమూలకొచ్చి నిలబడ్డాడు, తెలవారంగానే

లంబాడికొట్టు వూర మొగదల్లో నడిబజారు పక్కనే వుంది లంబాడి కొట్టు నాలుగడుగుల ఎత్తున, యిరవై బారల పొడుగున, ఆరు బారల అడ్డాన, పన్నెండు నాటుకర్ర స్తంభాలతో పంచ అడ్డం తిరిగి, అరుగు పొడుగున అయిదు వడ్లకొట్లున్నయ్ వడ్లకొట్లక వెనక ఖాళీస్థలంలో కొట్టుగోడకు చిన్న తాటాకుల పంచ దించుకుని, పదేళ్ల పైచిలుకునుండి ఓ లంబాడికుటుంబం వుంటున్నది అంతకుముందర కూడా అక్కడే లంబాడి తండలు వుండిపోయి నందున ఆ వడ్లకొట్ల కట్టడం లంబాడి కొట్టయింది.

లంబాడి కొట్టుకు ఎడంపక్క యాభై బారల దూరంలో గొడ్ల సావిళ్ళు, గడ్డివాములు, మాగాణి పొలాలూ, కుడిపక్క కొంచెందూరంగా నాగాయి చెరువు, ఒడ్డునే పెద్ద గిలకల భావి, యింకొంచెం పక్కన వడ్డె కొంపలు, వాటిపైన చాకి చెరువు, దాని ఒడ్డున మర్రి, తాడి, చింతచెట్లు, అక్కడక్కడ వాముల దొడ్లు, ఆపైన మాగాణి చేలూ వున్నయ్ లంబాడికొట్టు మీద కూచుంటే వూళ్ళోకి వచ్చిపోయేజనం, చెరువుకు, పొలాలకు వచ్చి పోయే ఊరి మనుషుల్ని చూడవచ్చు

చేతికర్రలో చుట్టలు కాల్చుకుంటూ పొలాలకి పోయేవారు, గుడ్డలుతుక్కోటానికి చెరువుకుపోయేవారు, గిలకల భావికి బిందెలు, కడవలు, కావిళ్ళ ఎడాపెడా సాగుతున్నయ్.

వడి శివాయి చల్లగా వడ్లకొట్టు అరుగెక్కి, ఆమూలవున్న స్తంభాన్ని చాటుచేసుకుని, వడ్లకొట్ల వెనకవేపుగా ఓ చూపు చూశాడు లంబాడి రామయ్య చిన్నకూతురు చిన్న లచ్మి, గోగునారజడ చిక్కుతీస్తూ, పంచకు అటుమూలగా వచ్చి కూచుంది, అద్దాల ఎర్ర పరికిణీ, ఎర్ర రవికతో

'ఓయ్?' అన్నాడు శివాయి, వచ్చగా, ఎర్రగావున్న లచ్మిని చూస్తూ.

శివాయిని తలెత్తి ఓ చూపుచూసి, వెంటనే తల దించుకుని, నార జడ వూడదీయటం మొదలెట్టింది లచ్మి

'యియాల తెల్లార్లే తగులుకుందే నార నీకూ?' అన్నాడు శివాయి, లచ్మిని నవ్వుతూ చూస్తూ

'ఏం తగులుకుంటే? నీదేమన్నా సెయి కల్పుతావా?' అంది లచ్మి, లంబాడియాసతో

'కలపమంటే కలుపుతా—'అని శివాయి అంటున్నాడో లేదో అద్దాల ఎర్ర రవిక, ఎర్రముసుగు, ఎర్రలంగా, చెవి గంటలు, గవ్వల్తో గలగలమంటూ చిన్న లచ్మి కూచున్న అరుగు దిగువున వచ్చి నుంచుంది, ఆ జడల మనిషి.

ఆ మనిషి చిన్న లచ్మి అక్క పెదలచ్మి 'తెల్ల జామపండల్లే అంత పుటుగ్గల మనిషిని ఎక్కడా చూళే'దని, చప్పున అనుకున్నాడు శివాయి.

ఆ తెల్ల దంతాల గాజుల్తో గలగల చేతులాడిస్తూ, లంబాడి భాషలో, చిన్న లచ్మిని ఏదో కేక లేస్తున్నది పెద్దలచ్మి

తెల్లారే నార ముంగ లేసుకుని దారేపోయే వాళ్ళి చూస్తూ, యింటి పని పట్టనట్టు కూచున్న చిన్న లచ్మి వాలకం, పెద్ద లచ్మికి గిట్టనట్టని పించింది శివాయికి.

శివాయి అనుకుంటున్నట్టే చిన్నలచ్మి జడనారతో చప్పున అరుగు దూకి, వడ్లకొట్ల వెనకవేపుకు లగెత్తింది చప్పుడు కాకుండా లగెత్తిన చిన్న లచ్మికి యింకా పెద్దలచ్మికున్నట్టు ఎర్ర ముసుగు, గలగలమనే లంబాడి నగలు లేవనిపించింది శివాయికి పెద్ద లచ్మికి వయసొచ్చింది గనక యివన్నీ ఉన్నాయ్ అనుకున్నాడు శివాయి.

ఎవరో లాగి తన్నినట్టు చప్పున అరుగుదూకి, అరుగువెంట రెండు స్తంభాల వెనక్కువెళ్ళి, నక్కి చూశాడు శివాయి

లంబాడికొట్టుక అనుకున్న నడి బజారుకు అవతలివేపు ప్రహరీగోడ దరవాజామయాన, రాతి విగ్రహమల్లే నుంచున్న ఆరుంబాతికడుగుల మనిషిని చూసి శివాయి ఒక్క గుటక మింగాడు

ఆ మనిషి నూటపాతిక కెకరాల ఆసామి పెద్దరామయ్య పైనుంచి కింది దాకా పోత పోసినట్టుగావుండి బుగ్గమీసాల్తో నల్లగా నిగనిగలాడ్తూ, నీరుకాయకంటె మెడ చొక్కా, పంచ, ఒక భుజాన పాదాల్దాకా వేళ్ళాడుతున్న పైపంచ, మూరెడ పొగాకుకాడ పాయ చీలుస్తూ, నవ్వుబుగ్గల్తో లంబాడి కొట్టువేపు చూస్తున్న పెదరామయ్యను చూసిన శివాయి, అరుగుచాటున యింకొంచెం కిందికి వొంగాడు.

'యింకా నీలకాడే వున్నావు, మీ అమ్మ బువ వొండలేదా ఏంటి?' అనడుగుతున్నాడు పెదరామయ్య గలగల చప్పుడవుతుంటే

చేతిలో మట్టి ముంతతో బజారుమధ్యకొచ్చి నుంచున్న లంబాడి పెద లచ్మి, నవ్వుతూ లంబాడి యాసతో 'యిం కాలేదు' అంటూ ఒక్కసారి వెనక్కు తిరిగి, కావడి ఆడించుకుంటూ వస్తున్న బసవయ్యగారి సూరయ్యను చూసి, గలగల చెరువువేపుగా వెళ్ళింది.

నలభై ఏళ్ళ సూరయ్య నాయన బసవయ్య డెబ్బయ్యెకరాల ఆసామి. సూరయ్యతోబాటు వీరాఘవులస్వామి, కుటుంబయ్యని యింకో యిద్దరు కొడుకులున్నారు బసవయ్యకు పెద్దరామయ్యకు కుడి ఎడంగా వూళ్ళో పేరుంది బసవయ్యకు సూరయ్యకు వెంకట్రత్నం, కోటేశ్వర్లు, సీతమ్మని, యిద్దరు కొడుకులూ, ఒక కూతు రున్నారు వెంకట్రత్నం చెన్నపట్నంలో ప్లీడరీ చదువుతున్నాడు. కోటేశ్వర్లు తొమ్మిదోక్లాసు రెండుసార్లు తప్పి చదువు మానుకుని పేరుకు తండ్రితో వ్యవసాయం చేస్తున్నట్టు కనుపించినా అప్పుడప్పుడు తెల్ల గుడ్డ లేసుకుని బస్తీకి పోయి సినిమాలు చూసి వస్తూవుంటాడు. సీతమ్మకు పెళ్ళయి కాపురానికి వెళ్ళింది.

'ఏరా సూరయ్యా, కోటిగాడేం కావిడి పట్టడా ఏం? వాళ్ళ తోలు పోయినా కావిడికి?' అని సూరయ్యను పలకరించాడు పెదరామయ్య

'బాగా అడిగావు మావయ్యా! వాడు నామాటంటే ఎప్పుడో బాగు పడేవోడుగా! యీసారి నీకు కనిపిస్తే తలవాచేట్టు సివాట్లు పెట్టు'అన్నాడు సూరయ్య.

'ఏమంటాడేం? పని చెయ్యనంటాడా? అటు చదువూ ఎక్కక, యిటు పనికీ వాళ్ళు బరువై యిగనేందిరా యీళ్ళు మిణికేది? నీ పెద్దవాడు వెంకట్రత్నాన్ని చూసి బుద్ధి తెచ్చుకోగూడదూ? యింతకీ మీ అయ్య అణ్ణి గారాబం చేశాత్లే! దాంతో వాడు మన చెయి దాటిపోయినాడు బసవయబావ అందరికీ మంచోడు, నిజమే! మన చెడును ఏరేసుకోవాలని తెలుస్తేగా? సరేగాని, బసవయ బావను తీరిగ్గావుంటే ఓసారి యిటు రామని చెప్పు' అంటూ చుట్ట

మట్టుకుంటూ నడిబజారువేపు చూసిన పెదరామయ్యకు వూళ్ళోకి గుర్రబ్బండి రావటం కనుపించింది

'ఎవరా బండిలో? కొంచెం ఆపు బండిని—'అని గద్దించి బండి నాపాడు పెదరామయ్య

బండి ఆగటం, తెల్ల గుడ్డల్లో వెంకటేశ్వర్లు ఎగిరి కిందకి దిగటం ఒకసారే జరిగినై

'నేను—నేను మామయ్యా—వెంకటేశ్వర్లు ను—'అన్నాడు వెంకటేశ్వర్లు గతుకుతూ

'ఎవరూ?' అనడిగాడు పెదరామయ్య, వెంకటేశ్వర్లును కిందినించి పైదాకా చూస్తూ

'నేను కిష్టమ్మగారి వెంకటేశ్వర్లును—ఏమైనా పనుందా?' అన్నాడు వెంకటేశ్వర్లు పక్క చూపులు చూస్తూ

'తెలుసులేవోయ్! తెలియకనా! నువు మా కిష్టమ్మగారి వెంకటేశ్వర్లువా కాదా అని అడిగాలే! మనిషి మారినట్టుంటేనూ బండి నాపాన్లే! ఉద్యోగమేమన్నా చేస్తున్నావా ఏం?' అనడిగాడు పెదరామయ్య

'అప్పే—యింకారేదు మామయ్యా'అన్నాడు వెంకటేశ్వర్లు, గుటకమింగుతూ

'గుర్రబ్బండిమీద వస్తుంటేనూ వుద్యోగస్తుడు వయినావనుకున్నాలే!' అన్నాడు పెదరామయ్య

'అందుకే గుంటూరు వెళ్ళొస్తున్నా మామయ్యా! ఓ స్నేహితుడు పొగాక్కంపెనీలో వుద్యోగం చూస్తానంటేనూ—'మాట సహం మింగాడు వెంకటేశ్వర్లు.

ఏడ్చావు లేవోయ్! నీకూ నాకూ ఎవర్రా వుద్యోగం యిచ్చేదీ? నువు చదివింది ఆరోక్లాసా! పొగాక్కంపెనీలో నీకు ఉద్యోగమా! గుర్రబ్బండిలో రావటమా? ఒరెయ్ వెంకటేశ్వర్లూ, మా అయ్య కిష్టమ్మకు పదెకరాల బంగారం వంటి మాగాణి వుంది! కష్టపడి సాగు చేసుకుంటూ ఎనిమిదిని పది చేసుకున్నాడు! నువు చేస్తున్న దేమిట్రా గాడిద? గుంటూరు సినిమా కెళ్ళి గాదుట్రా నువు వొచ్చేది? వురేవ్, నీ కెప్పుడ్రా సిగ్గొచ్చేది? పో! నువు ఉద్యోగస్తుడివైనై నీది నువు దీపం వెలిగిస్తే మా అయ్యతోబాటు నేనూ సంతోషిస్తా! పోయిరా' అని తుబుక్కున ఉమ్మేసి, చుట్ట ముట్టిచ్చుకుని, దరవాజాపక్క కొండరాతి అరుగు మీద కూచున్నాడు పెద రామయ్య, కళ్ళు మూసుకుంటూ

లంబాడి కొట్టు అరుగు వెనక నక్కిన శివాయి అట్టాగే వెనక్కిదేకి, లేచి లగెత్తాడు.

## 2

పెదరామయ్యది మగ సంతతిలేని సంసారం పెళ్ళయిన పదిహేనేళ్ళకి పుట్టిన మాణిక్యం గారాబంగా పదిహారేళ్ళకు పెరిగింది పెళ్ళాం రాఘవమ్మ పెదరామయ్యకు చేదోడువాదోడుగా కలిసి మెలిగే మనిషి పెదరామయ్యకు తమ్ముడు రామసుబ్బయ్యంటే ప్రాణం మాణిక్యం పుట్టేదాకా పిల్లలులేని లోటు తీర్చటమేకాక పెదరామయ్య ఎన్నను సహం మోసేవాడు రామసుబ్బయ్య గుంటూరు వెళ్ళి చదువుతూ బి ఏ దాక వచ్చినాకగాని సుబ్బరామయ్యలో వచ్చిన మార్పును గమనించలేదు పెదరామయ్య తన పెళ్ళయినాక సుబ్బరామయ్య భాగం పంచుకుని గుంటూర్లో ప్రెస్సు పెట్టుకున్నందుకు తమ్ముణ్ని పెదరామయ్య ఏనాడూ తప్పు పట్టలేదు కాని రాజకీయాల్లో తలదూర్చిన సుబ్బరామయ్య ఆస్తి సర్వనాశనం చేసి, మూడేళ్ళ శిక్షతో జైలుకు పోవటం పెదరామయ్యకు మింగుడు పడలేదు గాంధిగారి రాజకీయాల్ని గురించి గౌరవం వున్న పెదరామయ్య యింకే రాజకీయ పార్టీలనూ నమ్మదలచుకోలేదు తనేగాదు దేశంలో చాలామంది ఆ అభిప్రాయంలోనే వున్నారని పెదరామయ్య గట్టిగా చెప్పగలడు అందుకే సుబ్బరామయ్య కొత్త రాజకీయాల్లో తలదూర్చటం తనకు చాలా లవమానం అనుకున్నాడు పెదరామయ్య

సుబ్బరామయ్య జైలుకు వెళ్ళినాక గుంటూరు వొదిలి తన యింటికి వచ్చి వుండమని పెదరామయ్య లన్నా ప్రెస్సు అద్దె కిచ్చి, పెద్దకొడుకు సత్యాన్ని బి ఏ, రెండోవాడు శివానందాన్ని స్కూలుఫైనలు చదివిస్తూ అక్కడే వుండి పోయింది సుబ్బరామయ్య పెళ్ళాం సుందరమ్మ

కూతుర మాణిక్యం పెళ్ళి చేస్తే బాగుండునని పెళ్ళాం రాఘవమ్మ అప్పుడప్పుడు పెదరామయ్య చెవిన వేస్తూ వచ్చింది మాణిక్యానికి పెళ్ళయితే తమకు ఎంతదూరం అవుతుందోననే ఆలోచనలు చేసిన పెదరామయ్య, పెళ్ళాం మాటల వినీవిననట్టు వూరుకుంటూ వచ్చాడు

పెదరామయ్య ఇంటి వెనక దొడ్డి ప్రహరీ గోడకు ఓ చిన్న కిటికీ లాంటిది వుంది అందులోంచి చూస్తే ఊరి నడిబజారుకు ఎడమపక్క మొదటి సందులో వున్న అప్పయ్యగారి ఇల్లు వీధి గుమ్మం, అరుగులూ కనుపిస్తయ్.

అప్పటిదాకా ఖాళీగా వున్న అరుగు మీదకు అప్పయ్య కొడుకు నాగభూషణం వచ్చి కూచోడం, ఆ కిటికీ దగ్గిర తచ్చాడుతున్న మాణిక్యం చూసింది

గుంటూరో రెండో ఏడు బి యస్ సి చదువుతున్న నాగభూషణం ఆ ఏడు తప్పాడ నాగభూషణం ముందెప్పుడూ ఏ క్లాసులోనూ తప్పనట్టు అప్పయ్యకు బాగా గుర్తు వుంది నాగభూషణం రాజకీయాల్లో వేలు పెట్టాడని వాకబుచేసి గుంటూరు వార్తలు విన్న అప్పయ్య, విషయం విని వూరుకున్నాడు. అయితే వేసంగి సెలవులయినాక కాలేజీకి వెళ్ళిన నాగభూషణం యిరవై రోజులకే తిరిగి వీధిగమ్మంలో అడుగు పెట్టటం చూసిన అప్పయ్యకు గుండెలో ఏదో చిక్కబట్టినట్టయింది 'కాలేజీలో సమ్మె జరుగు తున్నది; మూసేయటం వల్ల ఇంటి కొచ్చా' అని చెప్పేసిన నాగభూషణాన్ని అదోరకంగా చూశాడు అప్పయ్య

'అదేంటే మాణిక్యం, వద్దాకా దొడ్లోనే వుంటావూ? మా అయ్య నిన్ను రెండుసార్లడిగాడు నీలు మసుల్తుండయ్, ఎళ్ళి నీలు పోసుకుని జడేసుకోరాదూ, పొద్దెక్కుతుండదీ?' అన్నది వుప్పుచేటతో రోటి దగర కొచ్చిన రాఘవమ్మ, ప్రహరీ గోడ దగ్గిర కూతుర్ని చూసి

'గులాబి చెట్టు మొగ్గ లేస్తున్నయ్యేమోనని చూస్తున్నానమ్మా. ఆ వుప్పుచేట యిలా తే, నే దంచి తీసుకువస్తా; మళ్ళీ వంట కాకపోతే అయ్య కేకలేస్తాడు' అని వుప్పుచేట తీసుకుని రోట్లో పోసి దంచుతున్న మాణిక్యం అమ్మ లోపలికి పోవటం చూసి, చల్లగా ప్రహరీ గోడ కిటికీ దగిర కొచ్చి తొంగి చూసింది

మాణిక్యాన్ని చూసి నవ్వాడు నాగభూషణం నాగభూషణం నవ్వడం చూసి సిగ్గుతో నవ్వింది మాణిక్యం వో చిన్న చీటీచుట్ట ప్రహరీగోడ దాటివచ్చి మాణిక్యం దగ్గిర పడింది

అప్పుడే సందు మొగదల్లో కొచ్చిన వడ్లె పిల్లకాయ శివాయి అప్పయ్య కొడుకు నాగభూషణం, పెదరామయ్య ప్రహరీగోడమీదుగా ఏందో తెల్ల వుండ విసర్టం, కిటికీ వెనకమూల మాణిక్యం నుంచునుండటం చూసి, యీలెసుకుంటూ లగెత్తుకు పొయ్యాడు

## 3

అప్పుడే పొలం వెళ్ళి, చేలకు నీ రెక్కుతున్నదో లేదో చూసివచ్చి, లంబాడి కొట్టు లరుగుమీద కూచుంటున్న పెదరామయ్యను, అటుగా పోతున్న బసవయ్య చూసి, తనూ అరుగెక్కి పక్కన కూచున్నాడు

'ఏమయ్యోవ్ బసవయ్య బావా! నీకు బొత్తిగా తీరుబడి వుంటంలేదంటగా? అహా, అందరూ అనుకుంటుంటే అడిగాలే!' అని బసవయ్యను పలకరించాడు పెదరామయ్య

'అవును, నీకు ఎగతాళిగానే వుంటది నన్ను చూస్తే! నా యిబ్బందులు నీకేం తెలుస్తయ్!' అన్నాడు బసవయ్య, పై పంచ తీసి నడుమ్మీదగా మోకాళ్ళకు చుట్టి, ఊతంగా కూచుంటూ.

'మనం మనం ఒకటనిగదా యిన్నాళ్ళు అందరనుకునేది? మనకు తెలవకుండా అప్పయ్యబావ ఆ పొలం అమ్మటం పెదకోటయ్య ప్రెయిమ్మినిస్టరీ ... గెలిచినంతగా మీసాలు దువ్వుతున్నాడు' అన్నాడు అంకమ్మ

'అసలు విషయం నన్ను చెప్పమంటావా రామయబావా? అప్పయబావ ఆస్తి కాస్తి పల్చనని మనకందరికీ తెల్సిన విషయమే పెదకోటయ్యకు వందెకరాలపైనుంది పెద్ద కూతురు పెళ్ళయి, యింకా రెండో పిల్లకు కావాలి. మొగపిల్లలు లేరాయె తన కొడుకు నాగభూషణం పెద్ద చదువు చదువుతున్నాడు గనక పెదకోటయ్య రెండోపిల్లని తన కొడుక్కిస్తాడని అప్పయబావకు బాగా నమ్మకం కలిగింది'అని చెప్పాడు బాపినీడు, విషయాన్ని యింకొంచెం ఎదుటకి లాగుతూ.

'యిది యిషయానికి గండీ కొట్టడంకాక మరేందంటా బసవయ బావా?' అని చెర్నాకోల కొట్టినట్టు కాకరిచ్చి ఉమ్మేశాడు పెదరామయ్య

'యింతమాత్రాని కేమవుద్ది రామయబావా! తన యిషయమేదో తను చూసుకున్నాడు, అప్పయ్యబావ కాదంటానికి నువ్వెవరు నేవెవర్ని?' అన్నాడు బసవయ్య, తూర్పు దిక్కుగా చూస్తూ

'అసలు పాయింటు యింకా బసవయ్యన్నకు అర్థం కాలేదనేగా మనం అనుకోవాల్సింది? మొదట బసవయ్యన్న యిరవై య్యేకరాల పొలానికి యింక నీరెట్టా ఎక్కుడ్డనే విషయం అలావుంచి, మన్లోనించి అప్పయ్యబావ చీలి అటో పడితాడనే అర్థం రావటం లేదా అనేగా నేనడగటం? ఏమంటా అంకమ్మా?' అనడిగాడు బాపినీడు

అంకమ్మ పెదరామయ్యను చూశాడు పెదరామయ్య బసవయ్యను చూశాడు బసవయ్య తూర్పు దిక్కునుండి మొహం తిప్పకుండా 'మనూరి కేదో చీడ పట్టింది!' అనన్నాడు, తటుక్కు ఉమ్మేసి కళ్ళు మూసుకుంటూ.

# 4

ఆ మరనాడు తెల్లవారకమునుపే బసవయ్య మనమడు కోటేశ్వర్లు ముందటిరోజే గుంటూరెళ్ళి తిరిగొచ్చిన కిష్టమ్మగారి వెంకటేశ్వర్లును లేపుకుని తను సందు మొగదల్లో నిలబడి అప్పయ్య కొడుకు నాగభూషణాన్ని పిల్చుకు రమ్మని వెంకటేశ్వర్లును పంపటం, పక్కనే పంచాయతీబోర్డు ఆఫీసు పంచ స్తంభానికి ఆనుకుని వెళ్ళాడుతున్న పడ్డె శివాయి చూశాడు.

యింకొంచెం సేపటికి సైకిలు కట్టూ, కాలరు చొక్కా వేసుకుని నిద్ర మొహంతోవున్న నాగభూషణాన్ని వెంటపెట్టుకుని, కోటేశ్వర్లును కలుసుకున్నాడు వెంకటేశ్వర్లు

'ఒరేయ్, వీడి మొహం చూస్తుంటే తెల్లవార్లు నిదరపోనట్టు లేదంట్రా వెంకటేశ్వర్లూ? పెద్ద కాలవకు పోదామంట్రా నాగభూషణం?' అనడిగాడు కోటేశ్వర్లు

'ముందరగా చెప్పి చావగూడదూ—వుండు, వెళ్ళి తుండుగుడ్డ తెచ్చుకుంటా'—అంటూ వెనక్కి తిరుగుతున్న నాగభూషణాన్ని మధ్యలోనే చెయి పట్టుకుని ఆపి 'యిగసార్లేరా, నిదర మొహం నీవు! యిప్పటికే తెల్లగా తెల్లార్తున్నది! మాకాడ వున్నాయిలే తుండుగుడ్డలు లోపల డ్రాయరేం తగలేసుకోలేదా? అనంటూ పడమరపక్క పెద్ద కాలవవేపుకు దారితీశాడు కోటేశ్వర్లు గబగబ నడుస్తూ

నాగభూషణానికి వూరిబయట పిల్లకాలవల నీటిగాలి తగిలేసరికి నిద్ర మత్తు వొదిలింది ఊరిబయటనుండి డొంకదారిన ఒకటిన్నర మైలుంది పెద్ద కాలవకు క్రిష్ణానదినుండి వచ్చే పెద్ద కాలవ, ఆ చుట్టుపక్కల గ్రామాలన్నిటికీ నీటి పంపిణ చేస్తుంది

'నిన్న నేనో బుద్ది తక్కువ పని చేసి, లెంప లేసుకున్నా' అన్నాడు వెంకటేశ్వర్లు దారి మధ్యలో

'ఏం చేశావేం?' అనడిగాడు కోటేశ్వర్లు.

నిన్న నేను గుంటూరువెళ్ళి తిరిగివస్తూ పెద్ద ఒంతెన్న దగ్గిర బస్సు దిగి, మన ఊరి రాముడి గుర్రబ్బండి ఖాళీగా వస్తుంటేనూ ఎక్కి కూచున్నా. వాళ్ళింటిదగ్గర యముడల్లే పెద రామయ్యమామ బండి వాపి, దిగమన్నాడు! నా పై ప్రాణాలు పైకి లేచినయ్యంటే నమ్మండి! నేను గుర్రబ్బండి ఎక్కానని ఏకధాటిగా పురాణం విప్పి, నా తోలుతీసి వాళ్ళ ప్రహరీగోడమీద ఆరేశాడనుకోండి!' అన్నాడు వెంకటేశ్వరు.

'తస్సదియ్యక్క! మనిషంటే అట్టుండాలి! నాకు మటుకు నాకు రామయ మావను చూస్తే సింహాన్ని చూసినట్టుగా ఉంటుంది! అయితే నిన్నరామయ్య మావకు ఆహారంగా నీ ఖర్మ కాలిందన్నమాట!' అంటూ విరగబడ నవ్వుతున్న కోటేశ్వర్లతో వంత కలిపాడు నాగభూషణం.

నిన్న రాత్రి కలలో పెదరామయ్య మావ నా గుండెలమీద కొచ్చి కూచున్నాడు! యింక యీ ఎడవ నిద్రపోతే ఒట్టండి!' అన్నాడు వెంకటేశ్వర్లు, కోటేశ్వర్లు, నాగభూషణంతో కలిసి తనూ నవ్వుతూ

'అన్నట్టు నిన్న గుంటూర్లో బస్సుదగ్గిర సుబ్బరామయ్యమావ కొడుకు సత్యం కనిపించి నిన్ను అడగమని చెప్పాడ్రా నాగభూషణం' అన్నాడు వెంకటేశ్వర్లు, పెద రామయ్య తెర తగినాక

'అట్నాగా! సత్యం చాలా చురుకైనవాడు మే మెప్పుడూ గుంటూర్లో కలుసుకుంటునే ఉంటాం, కాలేజీలు వేరైనా'

'మీ కాలేజీ సమ్మె ఎందుకురా జరుగుతున్నదీ?' అనడిగాడు కోటేశ్వర్లు.

'మా విద్యార్థి యూనియన్‌ను గుర్తించ నన్నాడు ప్రిన్సిపాల్ సమ్మె నోటీసిచ్చి అసమ్మతిగా కాలేజీనుంచి వచ్చేశాం సత్యం మా యూనియన్ కార్యదర్శి' అన్నాడు నాగభూషణం.

రామసుబ్బయ్య మావ జైల్లో ఎడ్డందుకే రామయ్యమామకు కాకెక్కింది? యిప్పుడు సత్యం కూడా రాజకీయాల్లో చేరాడని తెలుస్తే వాళ్ల చదువుకు అప్పుడప్పుడు పంపించే పైకం యివ్వకుండా మానుకుంటాడేమో. అన్నాడు కోటేశ్వర్లు.

'రామయ్యమావ అంత నికృష్టుడని నే ననుకోను. రామసుబ్బయ్యమావ నిజాయితీ వున్నవాడనీ, సత్యం క్లాసులో ఎప్పుడూ ఫస్టనంటూ చదువంటే గురిగలవాడని రామయమామకు తెలుసు. తన ప్రెస్సుతో సుబ్బరామయ్య మావ మన సంస్కృతి, విజ్ఞానం గురించిన ఎన్నో పుస్తకాలు తెలుగులో అచ్చు వేయించాడు. సుబ్బరామయ్య మావ అందుకే పుట్టాడని నా నమ్మకం!' అన్నాడు నాగభూషణం

'మరి సుబ్బరామయ్యమావ జైల్లో పడ్డది ఎందుకంటా?' అనడిగాడు కోటేశ్వర్లు.

యివాళ రాజకీయవాదులు జైలుకు పోవటం విశేషమేం కాదు. చట్టాలను గౌరవించేందుకు మనకు కావలసిన మనుషు లున్నారు!' అన్నాడు నాగభూషణం

'అంతే నంటావా?' అన్నాడు కోటేశ్వర్లు, విషయం తనకు అర్థం కాలేదన్నట్టు.

'అదుగో ఆ నీలు పెట్టేది మీ చేలకి గాదుట్రా నాగభూషణం? అనడిగాడు వెంకటేశ్వర్లు, వాళ్ళు నడిచే డొంక కుడివేపు వేలుపెట్టి చూపిస్తూ.

'అవును, మావే అయ్య నాతో చెప్పనెలేదే యీ పక్క చేలకు నీరు పెడ్తున్నట్టూ!' అన్నాడు నాగభూషణం, అటువేపు చూస్తూ.

'ఆ దిగువనేగా మీ పొలం వుంది కోటేశ్వర్లూ?' అనడిగాడు వెంకటేశ్వర్లు.

'అవును. యింకా మా చేలకు నీలుపెట్టటం లేదేందుకనబ్బా? రాండిరా పోయి చూసొద్దాం—' అంటూ డొంక దిగి నాగభూషణం, వెంకటేశ్వర్లతో కలిసి చేలకు అడ్డం పడ్డాడు కోటేశ్వర్లు.

పంట చేలల్లో కొందరు రైతులు, జీతగాళ్ళు, కూలి మనుషులూ ఎరువు చల్లుతున్నారు, గడ్డి పిరుస్తున్నారు పంట కాలవల్లో కత్తివల్తో మెరక తీస్తున్నారు, నీటిపారుదలకు ఎండాకాలంలో ఎరువుకోసం పశువుల్ని కట్టేసేందుకు వేసిన తాటాకు పాకల యింకా ఒకటి రెండు అక్కడక్కడ వున్నయ్. పొలాలమధ్య మెరకమీద బావుల దగ్గిర, కొత్తగా పల్లాలు తీసిన జలల్దగ్గిర పిల్లకాలవల పక్కనా ఏతాల్తోనూ, గూడల్తోనూ నారుమళ్ళకు నీరు కడుతున్నారు పచ్చటి నారుమళు ఏటిగాలికి కెరటాల్లాగా ఆడుతున్నాయ్

నడుంపక్క అప్పయ్య అయిదెకరాలూ దిగువ బసవయ్య యిరవై ఎకరాలూ, కుడిపక్క పడమర పెదకోటయ్య ముప్పయి ఎకరాలూ, దిగువ బాపయ్య పదెకరాలకూ మధ్యగా పంటకాలవ పారుతున్నది పంటకాలవకు బసవయ్య చేలపగిర అడ్డీవేసి, అప్పయ్య దగ్గిర కొన్న అయిదెకరాలకు నీరు పెడుతున్నాడు, పెదకోటయ్య జీతగాడు ఏసోబు పెదకోటయ్య చేల్లో, బాపయ్య చేల్లో ముగ్గురు జీతగాళ్ళు, అయిదుగురు కూలీలు ఎరువులోలటం, గడ్డి పిరవటం చేస్తున్నారు ఎండనెత్తికి ఎక్కటం, తలగుడ్డ బట్టగా చుట్టి, చేత పొన్నుకర్రపట్టి, పిరప్పావిచెరువుదు కుండా చేపుకు లడ్డుంచి, అప్పుడే అక్కడకు వచ్చి గట్టుమీద తాటిచెట్టు క్రింద నుంచున్నాడు పడమర ముఠా బాపయ్య చుట్ట తాగుతూ బసవయ్య చేల్లో ముగ్గురు జీతగాళ్ళు, నలుగురు కూలీలు ఎరువు చల్లటం, గడ్డి పిరవటం చేస్తున్నారు

పంట కాలవపక్క అప్పయ్య చేను దగ్గిరకొచ్చి నిలబడ్డారు కోటేశ్వర్లు, వెంకటేశ్వర్లు, నాగభూషణం

'ఎవరు నువ్వు?' అడిగాడు నాగభూషణం, అక్కడ చేతికర్ర పుతమీద నుంచున్న జీతగాడు ఏసోబును

'పెదకోటయ్యగారి జీతగాణ్ణి ఏసోబును లే' అన్నాడు ఏసోబు.

'మా చేలకు నువ్వు నీరు పెడుతున్నావేం?' అడిగాడు నాగభూషణం

'పెదకోటయ్యగారు పెట్టమంటే పెడుతున్నా, ఏం తప్పా?' అన్నాడు ఏసోబు

'తప్పా, తప్పున్నర! అప్పయ్యగారి పొలంలో పెదకోటయ్యకేం పనుందీ?' అని గదమాయించాడు కోటేశ్వర్లు

'ఇదిగో నువ్వు అప్పయ్య కొడుకు నాగబూసయ్యవి కాదూ?' అడిగాడు వెనకనే గట్టుమీదగా అక్కడకు వచ్చి నుంచున్న బాపయ్య

'నా పేరు నాగభూషణం' అన్నాడు నాగభూషణం, బాపయ్యను ఎగాదిగా చూస్తూ

'అయితే ఏమి, యీ అయిదెకరాలు మా బాబుకాడ పెదకోటయ్య కొన్నాడని నీకు తెలవదనుకుంటాం అంతేనా?' చుట్ట పొగకు కళ్ళు చిలికిస్తూ అన్నాడు బాపయ్య

'తెలుసు, ఎందుకు తెలవదూ! నువ్వు చెబితే యింకా తెలవకుండా ఉంటుందా?' అనేసి వెనక్కి తిరిగాడు నాగభూషణం, వెటకారంగా చూస్తున్న బాపయ్య చూపు చూసి

'అసెంట్రా నాగభూషణం? నిజంగా అప్పయ్యమామ యీ పొలం అమ్మాడంటావా?' అడిగాడు కోటేశ్వర్లు, రహస్యంగా

'నాకు తెలియదు అమ్మకపోతే పెదకోటయ్యకు ఎన్ని గుండెలున్నయ్ మా పొలానికి నీరు పెట్టటానికి! అదీ పెద్దవాళ్ళు ఏమియుం చెప్పి చావరుగా!' అన్నాడు నాగభూషణం నెమ్మదిగా

'అప్పయ్య మామ యీపొలం అమ్మి కొంపముంచాడు! అప్పకీ, మనకీ అసలు పడదు! మా చేలో నీరు తెచ్చుకుండా కాలవకు అడ్డీవేసి ఆ చేలకే నీరు పెట్టుకుంటున్నారు' అన్నాడు కోటేశ్వర్లు రహస్యంగా

'పంటకాలవ ఆ బాపయ్యగాడి సొమ్మా ఏమిటి? వేయరా అడ్డీ?' అన్నాడు వెంకటేశ్వర్లు కోటేశ్వర్లు చెవిలో.

'కాలవకు అడ్డీ వేసిందెవరు? యీ కాలవ మీ బాబుగాడి సొమ్మా? మాచేలేం తడవక్కర్లేదా?' పెద్దగా అరిచాడు కోటేశ్వర్లు

కళ్ళు చికిలిస్తున్న బాపయ్యా, చేతికర్ర పూతమీద ఏసోబూ అట్లాగే నుంచున్నారు, నోరు మెదలకుండా, గడకర్రలమాదిరి

'అడ్డీ తీసేస్తున్నా, మగసిరుంటే ఎవరడ్డం వస్తారో రాండి!' అని కేకేసి కాలవలోకి దూకాడు కోటేశ్వర్లు

'చూస్తావేందిరా ఏసోబూ?' అరిచాడు బాపయ్య

కాలవ అడ్డీమీదకు ఒంగిన కోటేశ్వర్లు నడుం పట్టుకుని ఎత్తి కాలవపక్క చేలోకి విసిరేశాడు ఏసోబు క్రిందపడ్డ కోటేశ్వర్లు, నేలకు విసిరి కొట్టిన రబ్బరు బంతల్లే ఎగిరి, ఏసోబు చేతికర్ర పీక్కుని గిర్రున తిప్పి ఫెడీమని బాదాడు ఏసోబును దెబ్బకు గిర్రె పోటేలల్లే ఎగిర్న ఏసోబు, కర్రతోపాటుగా వెంకటేశ్వర్లును చావచుట్టకింద కాలవలోకి విసిరికొట్టాడో లేదో నాగభూషణం వెంకటేశ్వర్లిద్దరూ కాట్ల కుక్కలల్లే ఏసోబుమీదకు దూకి, గొంతుకా ఒకరూ, నడుం ఒకరూ వాటేసుకుని తపీమని కిందకి తోసి పైన దక్కి కూచున్నారు

పంటకాలవ దగ్గిర నిప్పురవ్వలు లేవటం ఓ కంట కనిపెడ్తున్న రెండు ముఠాల జీతగాళ్ళూ, కూలిజనం పలికర్రలు, గడ్డ పలుగుల్తో వెంటనే అక్కడకు దూకి, ఎటు వారటు కమ్ముకుంటున్న సమయంలో, పంచ పైకి బిగించి, బుర్రుతలగుడ్డ చుట్టి, చేతికర్రతో పెద్ద కాలవ డొంకమీదుగా చేల కడ్డంపడి పరుగెత్తుకుంటూ వచ్చిన కోటేశ్వర్లు నాయన సూరయ్య, అటువేపు, యిటువేపు కర్రలు, పలుగులు టంటూ కొట్టుకోవటం, మధ్యలో మొహం చితికి రక్తం కారుతున్న కొడుకు కోటేశ్వర్లును చూసి పటపట పళ్ళు కొరుకుతూ ఎగిరి గంతేసి రంగం మధ్యకు దూకాడు

బాపయ్య పొన్నుకర్ర అంతరిక్షంలో గిర్రున వెరిసి, టఫీమని సూరయ్య కపాలంమీద పడింది

సూరయ్య వెనకనే పరుగెత్తుకుంటూ వచ్చిన వడ్డె పిల్లకాయ శివాయి పంటకాలవమీద మంటలు లేవటంచూసి, వచ్చినవాడు వచ్చినట్టే గిర్రున వెనక్కు తిరిగి పెద్దకాలవ డొంకమీదుగా వూరి నడిబజారుకుండా అవ్వాయి చువ్వల్లే లంఘించి కొట్టు దగ్గిర కొచ్చిపడి, 'పెదకోటయ్య ముఠా బసవయ్యగారి సూరయ్యను సంపారు! కోటేశ్వర్లు ఎనిక లిరిగినై! రకతం! రకతం!' అని పొలికేకలు పెట్టాడు

మణికట్టు విరిగి, ఒళ్ళు చిరిగి రక్తం కారుతున్న ఏసోబు మంటల్నుంచి బయటపడ్డ కోడెదూడల్లే ఎగురుతూ పడమరపక్క పీరాస్వామి చెరువు మీదుగా పెదకోటయ్య ఇళ్ళ దగ్గిరకొచ్చి, 'బాపయ్యగారి కపాళం పగిలింది! గూ డిరిగింది! రాండి, రాండి!'' అరిచాడు వూరు గింగురుమనేట్లు

ఇళ్ళ తలుపులు పగిల్నయ్ కప్పులు లేచినై పెంకులు విరిగినై వీధులు, సందులు దడదడలాడినై. వూరంతా దుమ్ములేచింది

తూర్పు పెదరామయ్య ముఠా, పడమర పెదకోటయ్య ముఠా, కర్రలు, పలుగులు, గొడ్డళ్ళు, కొడవళ్ళు, పసికర్రలు, కావడిబద్దలు అందినవి అందినట్టు పీక్కుని, పెళపెళ చెట్లు దిమ్మలు పగిల్నట్టు వొచ్చి పంటకాలవకు యిటుగా పెదరామయ్య ముఠా, అటుగా పెదకోటయ్య ముఠా విరగతొక్కుకుంటూ నుంచున్నారు

రక్తంతో గుడ్డలు తడిసిన సూరయ్య, కొడుకు కోటేశ్వర్లు, నాగభూషణం, వెంకటేశ్వర్లు పెదరామయ్య ముఠాముందు కూచున్నారు, పళ్ళు కొరుకుతూ

అటు బాపయ్య, జీతగాడు ఏసోబు, ఆక్రోషం, సీతాయి, రక్తంతో ఎర్రపడి పెదకోటయ్య ముఠాముందు కూచున్నారు, ఘోరాలు నూరుతూ.

'బసవయ్యగారి సూరయ్య కోటేశ్వర్లు, అప్పయ్యగారి నాగభూషణం కిష్టయ్యగారి వెంకటేశ్వర్లును రకతం కారేట్టు కొట్టిందెవరు?' అని గర్జించాడు పెదరామయ్య.

'మూండెకరా నాపాయ్య చేం కుకుకొట్టిందే, యీ జీతగాళ్ళ ఎముకల. యిరగ్గొట్టేంది చెప్పుకు అయిలు ఒడగరదూ?' అనరిచాడు పెదకోటయ్య.

'ఆ మాట తేలార్చండి!' అని పెదకోటయ్య ముఠాజనం అరుస్తే 'అరవ కుండా పీకల్ని రాలగొట్టండి!' అని కేకలేశారు పెదరామయ్య ముఠా జనం.

'పంటకాలవకు అడ్డేసి అక్కడ సీరు పెట్టుకోవాలంట! యీ కాలవ అళ్ళ బాబుగాడి సొమ్మా?' అరిచాడు రక్తంలో తడిసిన కోటేశ్వర్లు.

'పర్యవసానం! నాశనం! అడి పళ్ళూడగొట్టండి! అబ్బా, కొడుకులా, అళ్ళంతా వేరే నా ఒంటి మీదగొట్టారు!' అరిచాడు బాపయ్య.

'వాడే పళు. ముందరే వూడగొట్టారు! యింకా ఏంవుంటయ్ వూడ గొట్టటానికి? నాయం వుండాక్కర, మనిషి ఒక్కసెత్తే నాకొ?' అని అంటున్న బసవయ్యమీదకు ఎవడు విసిరాడో చెప్పలేం, వెంటనే పది పసి క్కరలు పెదకోటయ్య ముఠామీద పడ్డయ్.

'పొడవండి!' అరిచారు పెదకోటయ్యముఠా.

'పలుగు దిగెయ్యండి ఎముకల్లో!' యింకా పెద్దగా గొంతులు చించారు పెదరామయ్య ముఠా.

అరుపులు! పెడబొబ్బలు! కణుపుకర్రలు విరుగుతున్నయ్. పలుగులు పలుపలుమన్నయ్. గొడ్డళ్ళు లేచినై. కానికి పళ్ళలు విరిగినై. కొడవళ్ళు పనికర్రలు వచ్చి తగిల్తున్నయ్.

ముందర పెదరామయ్య, పెదకోటయ్యలు నేలమీద విరుచుకుపడ్డారు, రక్తం చిమ్ముతూ.

'పెదరామయ్యబావ పడిపోయినాడు! అళ్ళ గుండెల్లో పలుగు దిగెయ్యండి' అనరుస్తూ రెండు చేతులా పైకెత్తిన బసవయ్యను పొన్నుకర్రతో చిన కోటయ్య ఒకే దెబ్బ లాగికొట్టేడు, ఎగిరి డొక్కల్లో తన్నిన తన్నుకు, గాలి వానలో వేళ్ళు పీక్కుని విరుచుకుపడ్డ చెట్టులాగే ఎగిరి పంటకాలవలో విరు చుకుపడ్డాడు బసవయ్య.

'బసవయ్యన్నను చంపాడు చినకోటయ్య! వీడి రక్తం తాగుతా!' అని పొలికేక పెట్టిన బాపినీడు పలుగు తీసుకుని చినకోటయ్య నెత్తిన కొట్టిన దెబ్బకు, అట్లాగే వెనక్కు వొరిగాడు చినకోటయ్య.

'ఒరే పీకండి! సంగ పగల్చెయ్యండి! ఎముకలు పొడిచేయండి!' అని గొంతులు చిగుల్తాంటే ఎవరో ఎగిరి నడుంమీద తన్నిన తన్నుకు బాపినీడు పల్టీకొట్టి బసవయ్య పక్కనే పంటకాలవలో కరుచుకున్నాడు.

ఎసిర్న పలుగులు, పారలు, గొడ్డళ్ళు, కొడవళ్ళు, కర్రలు, వసికర్రలు ఆకాశంలోకి ఎగురుతున్నయ్. భూమి అదురుతున్నది వీరంగంలో. చర్మాలు తూట్లు పడుతున్నయ్. ఎముకలు విరుగుతున్నయ్. అరుపులు, పొలికేకలు, పెడబొబ్బలు, ఏడుపులు, మూలుగులు. సంటచేలు నెర్రెల్లో రక్తం! పంటకాలవ నీరంతా ఎర్రబడింది.

పూరి మునుసబు వీర్రాఘవస్వామి జోడుగుళ్ళ తుపాకీతో పరుగెత్తు కొచ్చి, అక్కడున్న సైపోగుతోటే బండెక్కి 'మీ అందరిమీద కేసులుపెట్టించి వురి తీయిస్తా! పది నిముషాలుదాటి యిక్కడో మనిషి కనుపించాడంటే తుపాకి గుళ్ళతో కాల్చేస్తా! ఫోండి యిక్కణ్ణుంచి!' అని కేకేసి, టపటప రెండు గుళ్ళు గాల్లోకి పేల్చాడు.

ఎవరు ఎవరో తెలియకుండా ఒకర్నొకరు కుమ్ముకుంటున్న పెద రామయ్య, పెద కోటయ్య ముఠా మనుషులు, మునసుబు వీర్రాఘవస్వామి తుపాకి పేల్చటంచూసి, ఒక్కసారి రెండు పాయలుగా చీలిపోయి, ఒళ్ళు తూటుపడి రక్తం ముద్దలయిన ఎవరి మనుషుల్ని వారు మోసుకుని, పడమర వారు పడమరకూ, తూర్పువారు తూర్పుకూ అరుచుకుంటూ, ఏడ్చుకుంటూ వూళ్ళోకి వెళ్ళిపోయారు

కొంచెం సేపటికి పూరి సెడిబజారుకుండా నూటయాభై రెండెడ్ల బళ్ళూ, అందిన మేనాలు, పాలకీలల్లో, తలలు పగిలి, ఎముకలు విరిగి, ఒళ్ళు తూట్లుపడి రక్తం కార్తున్న రెండు ముఠాల మనుషులు, ముక్కుతూ, మూలు గుతూ గుంటూరు ఆస్పత్రుల వేపుగా తరలి వెళ్ళారు

5

కొట్లాటలు జరిగిన కొద్ది రోజులకు వూళ్ళో, గుస గుసలు తట్టుకో లేక, అప్పయ్యపెళ్ళాం నాగరత్తమ్మ, అప్పయ్యతో అనేసింది 'ఛీ! ఛీ! వూళ్ళో మొహం ఎత్తుకోలేకుండావున్నా! బుద్ధి బుగ్గయితే కర్మ యిట్టా కాల్తుంది!' అని

'ఏం? కర్మకాలాల్చొచ్చిన అవసరం ఏం వచ్చిందీ? అసలు సంగతేంటో బయటకు రానీ' అనడిగాడు అప్పయ్య, అప్పుడే చద్దెన్నం తిని, సావట్లో నులక మంచంమీద కూచుని, చుట్ట కాలుస్తూ

'ఆళ్ళంతా కొట్లాడుకుని, తలకాయలు పగలకొట్టుకుంటానికి నువే కారణమంటగా?' అనడిగింది నాగరత్తమ్మ

'ఏ లెక్క ప్రకారం?' అనడిగాడు అప్పయ్య

'ఆ లెక్కలేంటో నాకు తెలవదు! పడమర బసవయగారి పొలంపక్క మన అయిదెకరాల పొలాన్ని ఆ సచ్చినోడు పెదకోటయ్యకు నువమ్మావంటగా?' అనడిగింది నాగరత్తమ్మ

'అయితే ఏమంటా?' అన్నాడు అప్పయ్య

'అంటానికేం ఉంటదీ! యిన్నాళ్ళూ పెదరామయ్యన్న, బసవయల ఎనకనే తిరిగితివిగా! ఆ పెదకోటయ్య ముటా అంటే యిారికి సచ్చినా పడదుగందా! యీరికి తెలవకుండా ఆళ్ళ మొగాలకు పొలం అమ్మకపోతే నువ్వు మాటంటే యీరే కొనేవారుగా? యీ తలకాయలు పగలగొట్టుకోటం ఒరక్కనే సాయె దిగా?' అనడిగింది నాగరత్తమ్మ

'యీరూ, ఆరూ తలకాయలు పగలగొట్టుకున్నారంటే అది ఆళ్ళ పొగురూ, మదంఎల్లి! నే నెప్పుడూ ఎవరితోకలు పెట్టుక తిరగలేదు నా పొలం నే నమ్ముకుంటానికి రామయబావ సలహా లేంది నమ్ముకోగూడదా? చుట్టాలం, పొరిగింటివారం గనక పెదరామయ్య బావన్నా, బసవయ బావన్నా నాకుండే మర్యాద నా కెప్పుడూ ఉంటద అంతేగాని అరికి నాకన్న ఎక్కువ వుందనిమటుకు ఎప్పుడూ కాదనుకో! అళ్ళు చెప్పినట్టు నేను యినాలని వాళ్ళనుకుంటే అది నా తప్పు కాదు అప్పటికీ బసవయ బావతో చెప్పిచూశా, తనుగాని, రామయబావగాని పొలం కొంటారేమోనని యిక్కడ ఒసల కిటు కొటి వుంది, నువు తెలుసుకోవల్సింది! నాగభూషణం చదువుక నాకు డబ్బవ సరం అని అందరికీ తెల్సిన యిషయమే బసవయబావ పొలానికి ఆనుకునుంది మన అయిదెకరాల పొలం అమ్మటం అంటూ వుంటే, తమ మనిషినని అన కుంటున్నారు గనక, అయినకాడికి తనకే తప్ప పెదకోటయ్యకు పొలం అమ్మ నని బసవయ్యను నమ్మకం పక్కపొలాల ధర ఆరువేల చేస్తుంటే తను నాలుగువేలకన్న యియ్యలేనని బసవయబావ అన్నాడు ఎంటన్నాయమో చూశావా? అప్పటికే బసవయబావ దగ్గిర నూటికి పది వడ్డీ లెక్కన రెండు వేలు అప్పు చేశా తను అప్పిస్తే వడ్డీ ఎక్కువ కావాలీ? నేను అమ్మపోతే వున్న రేటుకన్న కనాకష్టంగా అమ్మాలీ? నాయం ఎక్కడుందో చూశావంటే? రామయబావకు యీ విషయాలన్నీ తెలిసి కూడా తెలియనట్టూరుకున్నాడు ఎందుకంటే, ఆపొలం తనుగా కొంటే పక్కన పెదకోటయ్య పొలంవుంది గనక, అది తనకు రొమ్ముల కుంపటవుతుందనీ, బసవయబావ కొంటే పొలంలో పొలం కలుస్తుందనీ, తెలిసే పెదాలు కదలకుండా కూచున్నాడు రామయ బావ నేనెంతమటుకు వాళ్ళ మనిషినో నీ కిప్పుడు తెలిసిందా? వాళ్ళు చుట్టూ పదిమంది చేరి వాళ్ళమీద ఆదారపట్తుంటే వారి కదొక గొప్ప! సచ్చినా నాకది గిట్టదు! పెదకోటయ్యకు పొలం అమ్మానంటే, ఎకరానికి ఆరువే లిచ్చాడు గనక అమ్మాను వీళ్ళూ, వాళ్ళు కొట్టుకు చస్తారని నేనేమన్నా కల గన్నానా? ఆ పుంఢాకోరుబుద్ధి నా కెప్పుడూ లేదు డబ్బు మదం, పార్టీ కచ్చలు వాళ్ళకు ఎప్పట్నుంచో ఉన్నయ్ సందెప్పుడు దొరుకుతుందా అని చూస్తున్నా రిన్నాళ్ళూ! ఆ జబ్బే పిల్లలకి కూడా పట్టుకుంది!' అన్నాడు అప్పయ్య

నిజం ఎవ్వరూ లగండిసచ్చినా యీ రగుల్కకంతా నువే పుడకలు పెట్టా వని ఆరు అందర్తో అంటున్నారు! పూరిజనం నమ్మేదికూడా అదే! యిన్నాళ్ళూ రామయ్యన్న కూతురు మాణిక్యాన్ని మనబ్బాయి కిస్తే ఎంత బాగుంటుందో నని కలలు కన్నా! మాణిక్యమంటే మాణిక్యమె! ఆంత అదృష్టం ఉండాలిగా' అని ఉసూరుమంది నాగరత్తమ్మ

'ఒసి పిచ్చిపక్షీ! యిదా నువనుకునేది! ఆమాటకొస్తే నాకుమటుకు లేదూ లోపల? అయితే రామయబావ చూపుకు మనం ఆనమని నాకెప్పుడో తెలుసు యిప్పు డసలే కత అడ్డంగా తిరిగింది' అన్నాడు అప్పయ్య

'అయినా మాణిక్యానికి మనబ్బాయంటే చాలా గుబులుంది! అబ్బాయి దెబ్బలుతిని యింట్లో పడున్నప్పుడు ఎవరికీ తెలియకుండా వచ్చి చూసిపోయింది నేను వంటింటి తలుపుసందుకుండా చూశా' అన్నది నాగరత్తమ్మ

'యిప్పటి కయింది చాలు యింకా ముదరపెట్టుకోడం దేనికి? రామయ్య బావ కీ విషయం తెలుస్తే చాలా ప్రమాదం! నువ్వు మాణిక్యంతో చెప్పు, యింకమీద యిక్కడికి రావద్దని' అన్నాడు అప్పయ్య కళ్ళు మూసుకుని చుట్ట పొగ ఒదుల్తూ.

6

ఒకరోజు మైల్లోవున్న రామసుబ్బయ్య, తపాల వచ్చిన కవరు చింపి చదువుకున్నాడు

సుబ్రామయ్య మామకు!

నాగభూషణం వందనములతో,

కిందటిసారి నేను రాసిన లేఖలో మన ఊరి కొట్లాటను గురించిన వివరాలు రాశారు నాకు గాయాలు నయమై, వారంకితం కొన్నాను అదృష్ట వశాత్తు ఆ కొట్లాటలో గాయపడినవారు కాక—ఎవరూ చావలేదు అలాంటి దేమైనా జరిగివుంటే పరిస్థితులు యింకా దారుణంగా మారివుండేవి కేసుల కొట్టి వేయించటానికి పూర్తు ఎదురుకక అలా మూడై వేల ఖర్చుమటుకే అయింది; డాక్టర్ల కరు చెప్పవలె అవసరంలేదు! గాయాలు, విరిగిన ఎముకల్ని బాగ చేయించుకుని, అందరూ మన ఊరికి చేరుకున్నారు బసవయ్య మావ యింకా తలకట్టు ఊడతియలేదు సొసం కుడిచేతి చూపుడువేలు సహం తీసేశారు బాపినీడుమావ మోచేయి యింకా సాపుగా రాలేదు అంకమ్మ కొద్దిగా ఎడంకాలుకుంటుతున్నాడు పడమర ముఠా చినకోటయ్య తలకట్టు కూడా యింకా ఊడతియలేదు కుడి చెవి తెగిపోయింది జొన్నలు రాములు, సీతాయి, వీరాంబాల కుంటుతున్నారు ఏసోబ ఎడం డొక్క ఎముక విరిగినా పనికి పోతూనే వున్నాడు దీనికంతకీ మూలం పార్టీ కచ్చలే

అసలు విషయాని కొస్తాను యీ విషయంలో నువు నన్ను అపారం చేసుకోవని నాకు నమ్మకం వుంది

చాలాకాలంనుండి నాకు మాణిక్యం అన్నా, మాణిక్యానికి నేనన్నా చాలా యిష్టం వుంది యిప్పుడది ఒక స్థాయికి చేరకుంది యిటీవలి కొట్లాటల వల్ల రామయ్యమావ మామీద ద్వేషం పెంచి నా మాణిక్యం మన మారలేదు మా ఇంటికి తన మనుషులు ఎవరు వెళ్ళినా కాళ్ళు విరగగొడతా నన్నాడు రామయ మామ రామయమావ ఇంటివేపు కన్నెత్తయినా చూడద్దన్నాడు నాన్న

భరించలేక నేనూ మాణిక్యం తెగించాం ఎవరికీ తెలియకుండా యిద్దరం నిన్న గుంటూరు వచ్చి, మా సత్యానికి తెలిసిన యిద్దరు పెద్దల సహకారంతో రిజిష్టరు పెళ్ళి చేసుకున్నాం రామయ్యమావ వాడి ఏకటాన జరిగినా జర వచ్చని ఎదురు చూస్తున్నాం!

మా తెగింపు నువు అపార్థం చేసుకోవనే గట్టి విశ్వాసంవుంది గనక, తిరుగు టపాలో నీ ఆశీస్సులు పంపమని ప్రార్థిస్తున్నాము

నాగభూషణం.

# ఇతరలోకాలలో ప్రాణులు ఉన్నాయా?

## డాక్టర్ మహీధర నళినీమోహనరావు

అంతరిక్ష పరిశోధనలు ఉరుకుల మీదా, పరుగుల మీదా జరుగుతున్న ఈ రోజులలో 'భూమి మీద కాక మరి యెక్కడైనా జీవరాసులు ఉన్నాయా? ఉంటే అవి మన మనుష్యులకన్న తెలివైనవా? కావా? అవి మనలాగే ఉంటాయా? ఉండవా?" వంటి సందేహాలు చాలా మందికి కలుగుతున్నాయి

నాలుగు వందల సంవత్సరాల క్రిందటి దాకా భూమి ఈ సువిశాల విశ్వానికి మధ్యలో ఉన్నదనీ, భూమి చుట్టూ సూర్యుడు, చంద్రుడు, గ్రహాలూ, నక్షత్రాలూ వగైరా జ్యోతిర్గోళాలన్నీ గిరగిరా తిరుగుతున్నాయనీ నమ్మి, భూమికి ఎక్కడలేని ప్రాముఖ్యం ఆపాదించాడు మానవుడు. ఈ భావం తప్పు అని ఇప్పుడు అందరికీ తెలుసు. సూర్యుని చుట్టూ తిరిగే నవగ్రహాలలో మన భూమి మూడవది. బరువులోగాని, సైజులోగానీ కొన్ని తోటి గ్రహాలకన్న అనేక వందల రెట్లు చిన్నది. సౌరకుటుంబంలో భూమికి ఏ విధమైన ప్రత్యేకతా లేదు పోనీ మన అందరిచేతా భగవానుడుగా కొలువబడే సూర్యుడైనా మహా గొప్పవాడా అంటే అదీ కాదు రాత్రివేళ ఆకాశంలో మినుకు మినుకు మనే కోటానకోట్ల నక్షత్రాలలో సూర్యుడు కూడా ఒక నక్షత్రమే పైగా సూర్యునికన్న తేజస్సులోనూ, పరిమాణంలోనూ అనేకవేల రెట్లు అధికమైన నక్షత్రాలు చాలా ఉన్నాయి ఉదాహరణకి అగస్త్య నక్షత్రం (Canopus) సూర్యునికన్న 80,000 రెట్లు తేజోధికమైనది రోహిణి (Aldebaran) సూర్యునికన్న తేజస్సులో 150 రెట్లు, ఘనపరిమాణంలో 125000 రెట్లు పెద్దది జ్యేష్ఠ (Antares) సూర్యునికన్న తేజస్సులో 340 రెట్లు, ఘనపరిమాణంలో 3380000 రెట్లు పెద్దది ఆర్ద్ర (Betelgeuse) సూర్యునికన్న తేజస్సులో 3200 రెట్లు, పరిమాణంలో 9730000 రెట్లు పెద్దది సూర్యుడు మనకు బహు సమీపంలో (9 29 కోట్ల మైళ్ళు) ఉండడం చేత ఇంత కాంతివంతంగా కనబడుతున్నాడు గానీ, కొన్ని నక్షత్రాలు ఉన్నంత దూరంలో సూర్యుణ్ణి తీసుకువెళ్ళి కూర్చోబెడితే మన కంటికి అసలు కనిపిస్తాడో కనిపించడో కూడానూ! ఇటువంటి నక్షత్రాలు సుమారు ఇరవైవేల కోట్లు చేరి ''పాలపుంత'' అనబడే నక్షత్ర కుటుంబం (గేలక్సీ) ఏర్పడింది ఇటువంటి గేలక్సీలు ఈ మహావిశ్వంలో కోట్ల సంఖ్యలో ఉన్నాయి.

ఇటువంటి అతి సామాన్యమైన గేలక్సీలో, సూర్యుడు అనబడే ఒక సంసార పక్షపునక్షత్రం చుట్టూ ప్రదక్షిణాలు చేసే తొమ్మిది గ్రహాలలోనూ బహు సామాన్యమైన భూగోళం మీద చీమలలా పాకులాడే మనుష్యులు ఈ విశ్వంలో ఇంకెక్కడా జీవులే లేవు అనుకోవడం ఎంతవరకూ సమంజసం? మానవుల కన్న తెలివైన జీవులు మరో ప్రపంచంలో ఎక్కడో ఉండి ఉండకూడదా? మన కన్న తెలివైన జీవులు ఉంటాయని ఒప్పుకోడానికి అహం అడ్డు వస్తుందేమో, పోనీ, ఏదో ఒక రకం జీవం మరో గోళం మీద ఎక్కడైనా ఉదయులుదేరి ఉంటుందా? ఇతర లోకాలను గురించి వైజ్ఞానిక సాధనాలు అందించే భోగట్టాను ఉపయోగించి, దానికి తర్కం జోడించి, ఈ ప్రశ్నకు సమాధానం వెతుకుదాం సూర్యుడు, చంద్రుడు, తక్కిన ఎనిమిది గ్రహాలు, గ్రహశకలాలు (Asteroids), ఉల్కలు, తోకచుక్కలు, ఇతర నక్షత్రాలు— అన్నింటినీ వరుసగా పరామర్శించి ఎక్కడేనా జీవులు కనిపిస్తాయేమో చూద్దాం.

ఇతర లోకాలన్నీ బహు దూరాన ఉండడం చేత, తిన్నగా అక్కడికి వెళ్ళి, జీవులు ఉన్నాయా లేవా అని పట్టి చూడడానికి ఇంకా చాలా కాలం




పడుతుంది కనుక, ఈ సమస్యను మరోవైపు నుంచి ఎదుర్కొందాం ఏయే పరిస్థితులు ఉంటే ప్రాణులు జీవించ గలవో గమనించి, అటువంటి పరిస్థితులు ఇతర లోకాలలో ఎక్కడెక్కడ ఉన్నాయో పరిశీలించి అనుకూల పరిస్థితులున్న చోట జీవం ఉంటుందని నిశ్చయించడం ఒక పద్ధతి.

భూమి మీది అనంత కోటి జీవరాసులలో పైకి ఎన్నెన్ని విభేదాలు, కనిపించినా, అన్నిటి శరీరాలూ ముఖ్యంగా బొగ్గు, హైడ్రోజన్, నైట్రోజన్, ఆక్సిజన్ పరమాణువుల గొలుసులతో నిర్మితమై ఉన్నాయి. వందల కొద్దీ, వేలకొద్దీ, లక్షల కొద్దీ పరమాణువులను పట్టుకుని, పెద్ద పెద్ద పరమాణు మాలికలుగా ఏర్పడ గల విశిష్టమైన ధర్మం సృష్టిలో ఒక్క బొగ్గు పరమాణువులకు మాత్రమే ఉంది ఇటువంటి అతి క్లిష్టమైన పరమాణుమాలికల నుంచే భూమి మీద అనేక వందల కోట్ల సంవత్సరాల వ్యవధిలో జీవం తయారైంది కనుక జీవోత్పత్తి జరుగడానికి బొగ్గు అత్యావశ్యకం. బొగ్గు లేని గోళం మీద జీవం ఏర్పడే అవకాశమే లేదు అయితే బొగ్గు ఉన్నంత మాత్రాన జీవం తయారవుతుందా? ఊహూ బొగ్గు ఒక్కటే ఉంటే చాలదు. నీరు ఉండాలి అనేక వందల కోట్ల సంవత్సరాలపాటు హెచ్చుతగ్గులు లేని సూర్య తేజస్సు కావాలి. సమశీతోష్ణం కావాలి ఇంకా ఎన్నెన్నో గొంతెమ్మ కోరికలు తీరాలి అనుకూల పరిస్థితులు తగినంత కాలం ఉంటే ఏ గోళం మీదనైనా సరే నిర్జీవ పదార్థం నుంచి జీవం దాని అంతట అదే తయారు అవుతుందని శాస్త్రజ్ఞుల ప్రగాఢ విశ్వాసం

బొగ్గు ఆధారంగా ఏర్పడ్డ జీవులు— అంటే మన భూమి మీది జీవులు అన్నమాట— ఏయే పరిస్థితులలో బ్రతుక గలవో ముందర ఒక పట్టిక తయారు చేద్దాం జీవం ఎక్కడ ఏర్పడినా బొగ్గు ఆధారంగానే ఏర్పడాలి కనుక, మనం తయారు చేసిన పట్టికలోని పరిస్థితులు ఉంటేనే ఎక్కడైనా సరే జీవం ఉంటుందనీ, ఆ పరిస్థితులకు భిన్నంగా ఉంటే అక్కడ జీవం ఏర్పడే అవకాశం లేదని నిర్ధారణ చేయవచ్చు ఈ పట్టికలో అన్నింటి కన్న ముఖ్యమైనది ఉష్ణోగ్రత. వేడిమి మరీ ఎక్కువైనా, మరీ తక్కువైనా జీవులు బ్రతుకలేవు పరిస్థితులకు అనుకూలంగా శరీర ధర్మాలు కొంతవరకూ మారుతాయన్నమాట నిజమే గానీ, దానికీ ఒక పరిమితి ఉన్నది కదా? చాలా భాగం పెద్ద జీవులు 70°c దాటితే బ్రతుక లేవు కొన్ని రకాల సూక్ష్మ జీవులు మాత్రమే 90°c వరకూ బతికి ఉండగలవు నీళ్ళు మరిగే వేడిలో—




అంటే 100°c వద్ద—ఏ జీవీ బ్రతుకలేదని నిస్సంశయంగా చెప్పవచ్చు. అందుకనే ఇంజక్షను సూదులు వగైరా వస్తువులను బాగా మరగ కాచుతారు

మగీ చలి అయినా ప్రాణులు తట్టుకోలేవు. పెద్ద పెద్ద జీవులు నీరు గడ్డ కట్టే ఉష్ణోగ్రత దగ్గర—అంటే 0°c దగ్గర - చాలాసేపు ఉంచితే చచ్చిపోతాయి. కాని, కొన్ని సూక్ష్మజీవులు ఎంత చలిలో అయినా చచ్చిపోకుండా, ప్రాణం ఉందా లేదా అన్నట్లు చైతన్యరహితమైన సమాధి స్థితిలో ఉంటాయి. ఇటువంటి సమాధి స్థితిలో పెరుగుదల, సంతానోత్పత్తి వంటి కార్యక్రమాలు ఏవీ ఉండవు. ఇంక అభివృద్ధి ఎల్లా సాధ్యం ? దీనినిబట్టి స్థూలంగా +100°c —100°c అనేవి గరిష్ఠ కనిష్ఠ ఉష్ణోగ్రతా పరిమితులుగా నిశ్చయించి ఏ గోళం మీదనైనా జీవం ఉండాలంటే ఈ పరిమితుల మధ్యలో ఉష్ణోగ్రత ఉండాలని నిశ్చయించవచ్చు.

ఉష్ణోగ్రతకు పరిమితులు నిర్ణయించాం కనుక నక్షత్రాలు, సూర్యుడు జీవరాసులకు నివాస యోగ్యాలు కావని లిస్టులనుంచి కొట్టి పారవేయవచ్చు. సూర్య గోళంలో మధ్యని రెండు కోట్ల డిగ్రీల ఉష్ణోగ్రత ఉంటుంది! సూర్య గోళంపైన సుమారు 6000°c ఉంటుంది ఇంత ఉష్ణోగ్రతలో జీవులు కాదు సరికదా, ఏ రసాయన సంయోగాలూ నిలువ లేవు అన్ని నక్షత్రాలూ ఇదే ఉష్ణోగ్రతలో ఉండవు. నీలి రంగులో కనబడే నక్షత్రాలు ఇంతకన్న ఎక్కువ వేడిగా (సుమారు 24000°c) ఉంటాయి. ఎరుపు రంగులో కనబడే చుక్కలు ఇంతకన్న తక్కువ ఉష్ణోగ్రత (సుమారు 3000°c) లోనూ ఉంటాయి వెలుగుతున్న నక్షత్రాలన్నీ ఈ మధ్యలోనే ఉంటాయి. కనుక నక్షత్రాలు ఏవీ జీవులు నివసించడానికి తగినవి కావు.

ఉష్ణోగ్రత తరువాత ముఖ్యమైంది నీరు జీవుల శరీరాలలో నీటిపాలు చాలా ఎక్కువ. భూగోళం మీద మొట్టమొదటి జీవులు నీటిలోనే పుట్టాయి. నీరులేకపోతే పెద్ద జీవులు ఏవీ బ్రతుక లేవని నిస్సంశయంగా చెప్పవచ్చును గానీ, నీరులేకపోయినా బ్రతికి ఉండగల సూక్ష్మ జీవులు కొన్ని ఉన్నాయి. అవి అయినా పెరుగుదల, సంతానోత్పత్తి వంటివి లేని జడావస్థలో ఉంటాయి.

వీటి తరువాత ముఖ్యమైనది సరియైన వాతావరణం. సరియైన వాతావరణం అంటే ఏమిటో చూద్దాం.

**జీవులలో అతి ముఖ్యమైనవి** చెట్లు (మనుష్యులు కాదు). వాటి తరువాతనే జంతువులు. నిర్జీవ పదార్థం నుంచి ఆహారాన్ని స్వయంగా తయారు చేసుకోగల సామర్థ్యం గలవి ఒక్క వృక్ష సంబంధమైన జీవులే. జంతువులకు వేటికీ ఈ శక్తి లేదు. కనుక జంతువులన్నీ తమ ఆహారం కోసం చెట్లమీద అధార పడవలసిందే. జంతువులు లేకపోయినా చెట్లు మహారాజులా బ్రతుకగలవు గానీ, చెట్లు లేకపోతే జంతువుల పని ఖాళీ.

జంతువులకు ఆహారం అందివ్వడమే కాక చెట్లు చేసే మహోపకారం మరొకటి ఉంది. ప్రాణవాయువు లేనిదే జంతువులు బ్రతుక లేవు ఆ ప్రాణవాయువును తయారు చేసి అందించేది చెట్లే. గాలిలోని బొగ్గుపులుసు వాయువును (కార్బన్ డై ఆక్సైడ్) నీటిని కలిపి చెట్ల ఆకులలో ఉన్న క్లోరోఫిల్ అనబడే ఆకుపచ్చని పదార్థం గ్లూకోజును తయారు చేస్తుంది ఈ తయారీలో మిగిలిపోయిన ప్రాణవాయువును చెట్లు గాలిలోకి విడిచి పెట్టేస్తాయి. బొగ్గుపులుసు వాయువు, నీరు పట్టినే కలుసుకున్నంత మాత్రాన గ్లూకోజు ఏర్పడి పోదు. ఈ తయారీకి శక్తి అవసరం ఆ శక్తిని సూర్యుడి దగ్గర నుంచి సరాసరి అప్పు తీసుకుంటాయి చెట్లు.

మొత్తం మీద జంతువులు బ్రతకాలంటే చెట్లు ఉండాలి. చెట్లు బ్రతకాలంటే బొగ్గుపులుసు వాయువు, నీరు, సూర్యరశ్మి ఉండాలి. మన భూవాతావరణంలో బొగ్గుపులుసు వాయువు సుమారు 0.03 శాతం ఉంది. సకల జీవరాసులకూ ఆహారాన్ని అందివ్వడానికి ఇది చాలు. గాలిలో ప్రాణవాయువు 21 శాతం ఉంది ఇది అంతా చెట్లు తయారు చేసినదే ఏదైనా గోళం మీద ప్రాణవాయువు ఉన్నదని తెలిస్తే అక్కడ చెట్లు ఉన్నాయని చెప్పవచ్చు. అయితే ప్రాణ వాయువు బొత్తిగా లేని గోళం మీద జీవం అనేది లేనేలేదని చెప్పగలమా? ఉహూ ప్రాణవాయువు లేకపోయినా బ్రతగ్గల సూక్ష్మ జీవులు— ఈస్ట్ వంటివి— కొన్ని ఉన్నాయి ప్రాణ వాయువు లేని గోళం మీద ఇటువంటి అల్పమైన సూక్ష్మ జీవులు ఉంటే ఉండవచ్చునేమో గాని పెద్ద పెద్ద జీవులు ఉండవని నిశ్చయించ వచ్చు.

**ఇంతవరకూ** చెప్పిన విషయాలను కొండ గుర్తులుగా పెట్టుకుని, ఫలాని గ్రహంలో, లేదా ఫలాని ఉపగ్రహంలో ప్రాణులు ఉండే అవకాశం ఉందో లేదో తేల్చవచ్చు

## చంద్రుడు

సూర్యుని చుట్టూ తొమ్మిది గ్రహాలూ, ఈ గ్రహాలకు 31 ఉపగ్రహాలు, కుజ గురు గ్రహాల మధ్యని వేల సంఖ్యలో గ్రహశకలాలూ, లెక్కలేనన్ని ఉల్కలు, తోక చుక్కలు— ఇవి అన్నీ సౌర కుటుంబంలోని జనాభా కిందే లెక్క. వాటిలో మనకు అత్యంత సమీపంలో ఉన్న గోళం చంద్రుడు. భూ చంద్రుల మధ్య సరాసరి దూరం 238000 మైళ్ళు. టెలిస్కోపు ఉపయోగించి చూస్తే చంద్రునిలో మచ్చలు, గోతులు, పర్వతాలూ అసంఖ్యాక గా కనిపిస్తాయి. పూర్వకాలపు శాస్త్రజ్ఞులు చంద్రునిలోని నల్లని మచ్చలను చూచి అవి సముద్రాలు, సరస్సులు అని భ్రమించి, వాటికి, తమస్సముద్రమనీ, మధు సముద్రమనీ, శాంతి సముద్రమనీ, తుఫానుల సముద్రమనీ చిత్ర విచిత్రమైన పేర్లు పెట్టేరు దరిమిలాని చంద్రునిలో ఒక్క నీటి చుక్క కూడా లేదని తెలిసిన తరువాత కూడా ఆ పాత సంప్రదాయాన్నే అనుసరించి ఆ మచ్చలకు సముద్రాలు, సరస్సులు అనే పేరులు పెడుతూ వచ్చారు.

చంద్ర మండలంలో ఒక్క నీటి చుక్క కూడా లేదు. అక్కడ నీరే కాదు, గాలి కూడా లేదు! చాలా చిత్రంగా ఉందే భూమిమీద ఇంత దట్టమైన వాతావరణమూ, పుష్కలంగా నీరు ఉండగా, మనకు అతి సమీపంలో ఉన్న మరో గోళం మీద గాలి, నీరు మచ్చుకైనా లేకుండా ఎల్లా పోయాయి? ఏయే గోళాల మీద జీవం బయలుదేరగలదో తెలుసుకునే ముందు ఈ ప్రశ్నకి సమాధానం తెలుసుకోవడం అవసరం.

నిష్క్రమణ వేగం:—ఒక గులకరాయిని బలం కొద్దీ పైకి విసిరితే అది కొంత ఎత్తువరకూ ఎగిరి, మళ్ళీ భూమి మీద పడిపోతుందని మన కంద




రకూ తెలుసు. దానినే మరింత వేగంగా విసిరితే ఇంకొంచెం పైకి వెడుతుంది ఉదాహరణకి: సెకనుకి 80 అడుగుల వేగంతో రాతిని పైకి విసిరితే అది 100 అడుగుల ఎత్తుకి ఎగురుతుంది. ఫిరంగిని సరాసరి పైకి బారు చేసి పేల్చితే మాటవరుసకి గుండు సెకనుకి 800 అడుగుల వేగంతో విసరబడిందనుకుంటే ఆ గుండు సుమారు 2 మైళ్ల ఎత్తు ఎగిరి మళ్లీ భూమి మీద పడిపోతుంది. సెకనుకి ఒక మైలు వేగంతో విసరగలిగితే 81 మైళ్ల ఎత్తుకి వెళ్లి తిరిగి వస్తుంది. సెకనుకి 5 మైళ్ల వేగంతో విసిరితే 4240 మైళ్ల ఎత్తుకి ఎగిరి కిందపడిపోతుంది సెకనుకి 6.9 మైళ్ల వేగంతో విసిరితే అది 172000 మైళ్ళ ఎత్తు ఎగిరి తిరిగి భూమి మీద పడిపోతుంది. ఆఖరికి సెకనుకి 7.1 మైళ్ళ వేగంతో విసిరితే ఆ వస్తువు తిరిగి భూమిమీద పడకుండా, భూమ్యాకర్షణ శక్తిని విదలించుకుని, సూర్యుని చుట్టూ మరొక కొత్త గ్రహంలా తిరుగ నారంభిస్తుంది. ఇదిగో ఈ వేగాన్నే (సెకనుకి 7.1 మైళ్ళు) నిష్క్రమణ వేగం (Escape Velocity) అంటారు. అంటే ఇంత వేగంతో ప్రయాణం చేసిన ఏ వస్తువు అయినాసరే భూమి నుంచి శాశ్వతంగా నిష్క్రమించగలదు. ఇది భూమి యొక్క గురుత్వాకర్షణ శక్తికి ఒక విధంగా కొలమానం అనవచ్చు. భూమి కన్న పెద్ద గోళాల మీద వస్తువుల నిష్క్రమణ వేగం ఇంతకన్న ఎక్కువగా ఉంటుంది. భూమి కంటె చిన్నవి అయిన చంద్రుని వంటి గోళాలకు ఆకర్షణ శక్తి తక్కువ కనుక వీటి మీద వస్తువుల నిష్క్రమణ వేగం తక్కువగా ఉంటుంది. ఇక్కడి పట్టికలో సౌర కుటుంబంలోని ముఖ్యమైన గోళాల సైజులు, బరువులు, వాటి మీద వస్తువుల నిష్క్రమణ వేగాలు చూపించాను.

ఒక గోళం మీద వాతావరణం ఉంటుందా ఉండదా అన్న విషయం ఆగోళపు నిష్క్రమణ వేగం మీద ఆధారపడి ఉంటుంది ఎందుచేతనో తెలుసా?

| గోళం | వ్యాసం (మైళ్లలో) | ద్రవ్యరాశి (భూమి=1) | నిష్క్రమణ వేగం (సెకనుకి మై॥లో) |
|---|---|---|---|
| సూర్యుడు | 862000 | 332100 | 392 |
| బుధుడు | 3100 | 0.044 | 2.4 |
| శుక్రుడు | 7700 | 0 82 | 6.5 |
| భూమి | 7927 | 1 00 | 7 1 |
| చంద్రుడు | 2100 | 0 0123 | 1 5 |
| కుజుడు | 4216 | 0.108 | 3 2 |
| గురుడు | 88700 | 317 1 | 38 |
| శని | 75100 | 94 9 | 23 |
| యురేనస్ | 32000 | 14 65 | 14 |
| నెప్ట్యూన్ | 27600 | 17 16 | 15 |
| ప్లూటో | 400(?) | 0 01 (?) | 2.2 (?) |

వాతావరణం అంటే రకరకాల వాయువుల మిశ్రమం. అందులో కోటానకోట్ల అణువులు చెల్లాచెదురుగా ప్రచండ వేగాలతో తిరుగుతూ, ఒక దానితో ఒకటి గుద్దుకుంటూ, నానా గందరగోళంగానూ ఉంటాయి. బరువైన అణువులు మందంగానూ, తేలికైన అణువులు వేగంగానూ పరుగెత్తుతూ ఉంటాయి. అల్లాగే ఉష్ణోగ్రత పెరిగితే అణువుల వేగం పెరుగుతుంది. వాయువులను చల్లబరుచుకుంటూ వెడితే అణువుల వేగం క్రమంగా తగ్గి ఆఖరికి 273°C దగ్గర అణువులు ఎక్కడివక్కడ గప్‌చుప్‌గా బుద్ధిమంతుల్లా కదలకుండా కూర్చుంటాయి. ఈ అణువులకూ పైకి విసిరిన గులకరాతికీ సామ్యం సరిపోతుంది. నిష్క్రమణ వేగం కన్న హెచ్చు వేగంతో పైకి పారిపోతున్న అణువులను ఆ గోళం వెనక్కి లాగి ఉంచలేదు. అవి ఆ గోళాన్ని విడిచి శూన్యాకాశంలోకి తప్పించుకు పోతాయి. కనుక నిష్క్రమణ వేగం తక్కువగా ఉన్న చిన్న చిన్న గోళాలు వేగంగా పరుగెత్తి పోయే అణువులను ఆకర్షించి పట్టుకోలేక నిస్సహాయంగా చూస్తూ ఉండిపోతాయి. దానితో క్రమక్రమంగా ఆ గోళం మీద వాతావరణం పలుచనైపోతుంది తేలికైన అణువులు ముందర జారి పోతాయి. బరువైనవి చివరికి మిగులుతాయి.

చంద్ర మండలంలో నిష్క్రమణ వేగం ఒకటిన్నరమైళ్ళు మాత్రమే కావడం చేత ఆ గోళం మీద వాతావరణం పూర్తిగా శూన్యమైపోయింది. బుధుని మీద కూడా వాతావరణం లేనట్లే. కుజుని మీద బహు పలుచగా ఉంది. నిష్క్రమణ వేగాలు అధికంగాగల గురుడు, శని, యురేనస్, నెప్ట్యూనులకు వేల కొద్దీ మైళ్ల లోతున, భూవాతావరణానికి అనేక వేల రెట్లు దట్టమైన వాతావరణాలు ఉన్నాయి.

గాలిలేని కారణం చేత చంద్ర మండలం మన భూమి మీద కన్న చాలా భిన్నంగా ఉంటుంది. అక్కడ నీళ్లు లేవు ఎక్కడ చూచినా రాళ్లు, బండలు, కొండలు, గోతులూనూ అంతటా ముదురు గోధుమవన్నె. భూమి మీద కనిపించేటన్ని రంగులు అక్కడ కనిపించవు. ఇంద్ర ధనుస్సులు, మబ్బులు, సూర్యోదయాస్తమయాలలో ఆకాశం రంగులు మారడం వంటివేమీ అక్కడ లేవు ఆకాశం నీలంగా ఉండదు. తారువూసినట్లు నల్లని రంగు. పట్టపగలే ఆకాశాన నక్షత్రాలు కనిపిస్తాయి. గాలిలేని కారణం చేత అక్కడ సంధ్యా సమయం అంటూ లేదు. సూర్యుడు ఉన్నంతసేపూ అక్కడ నిప్పులు చెరిగే వేడీ (120°C) ప్రచండమైన వెలుగూనూ. సూర్యుడు అల్లా కొండచాటుకి వెళ్లాడో లేదో ఇల్లా కటిక చీకటి. కన్ను పొడుచుకున్నా కనబడదు చీకటి పడీ పడగానే ఉష్ణోగ్రత అతివేగంగా పడిపోతుంది. రాత్రి ఉష్ణోగ్రత సుమారు

160°C ఉండవచ్చు. పగలు నీళ్ళు మరిగిపోయే వేడి రాత్రి గాలి కూడా గడ్డ కట్టేసే చలి. దీనికితోడు చంద్రుడు తన చుట్టూ తాను 27⅓ రోజులకు ఒక సారి తిరుగుతాడు. అంటే చంద్రునిమీద పగలు 13 2/3 రోజులకీ, రాత్రి 13 2/3 రోజులకీ సమానం అన్నమాట. తూర్పున ఉదయించిన సూర్యుడు నిప్పులు చెరుగుతూ, తాబేటి నడకలు నడుస్తూ ఓ పట్టాన అస్తమించడు.

ఇటువంటి దుర్భరమైన చంద్రమండలంలో చెట్లు, జంతువులు బ్రతుకలేవన్నది నిశ్చయం అయితే నేలలోపల సూక్ష్మజీవులు ఏవీ ఉండ వని బొత్తిగా కొట్టి పారవేయడానికిలేదు. అక్కడికివెళ్ళి పరిశోధిస్తే తప్ప ఆ సంగతి తెలియదు

## గాలి లే ని లో కా లు

నిష్క్రమణవేగం తక్కువగాఉన్న చిన్న చిన్న గోళాలమీద వాతావరణం ఉండదు కనుక అక్కడ జీవం ఉండే అవకాశం లేదని చెప్పవచ్చు సౌర కుటుంబంలో అటువంటి గోళాలన్నింటినీ ఏరి, మన పట్టికలోంచి తొలగించేద్దాం.

ఉల్కలు అనేవి చిన్న చిన్న రాళ్ళు కొన్ని ఇసుక రేణువులంత నలుసులు. పెద్ద పెద్ద రాళ్ళు అరుదుగా ఉంటాయి వీటికి వాతావరణం ఉండడం అనే ప్రసక్తేలేదు

తోకచుక్క సూర్యునికి దగ్గరగా వచ్చినప్పుడు కోట్లకొద్దీ మైళ్ళ పొడవుగల తోకతో భయంకరంగా కనిపిస్తుంది నిజానికి అందులో చిన్న చిన్న రాళ్ళు, నలకలు, దుమ్ము, ధూళి, వాయువులు కలిసి వదులు వదులుగావున్న పదార్థం అది దానిని ఘన పదార్థపుగోళం అనడానికే వీలులేదు వీటిలో కూడా జీవం ఉండే అవకాశంలేదు

పోతే ఇంక మిగిలేవి ఎనిమిది గ్రహాలు, కుజుని చుట్టూ 2, గురుని చుట్టూ 12, శనిచుట్టూ 9, యురేనస్ చుట్టూ 5, నెప్ట్యూన్ చుట్టూ 2 ఉపగ్రహాలు తిరుగుతున్నాయి బుధునికీ, శుక్రునికీ, ప్లూటోకీ ఉపగ్రహాలు లేవు ఇవికాక కుజ, గురు గ్రహాలమధ్యని తిరుగుతూ వేలకొద్దీ గ్రహ శకలా లున్నాయి

గ్రహ శకలాలలో అన్నింటికన్న పెద్దది సెరెస్ దీని పొడవు 485 మైళ్ళు మాత్రమే మిగిలినవన్నీ ఇంతకన్న బాగా చిన్నవి ఇవి గుండ్రంగా గోళాకారంలో ఉండక విరిగిపోయిన ముక్కలలాగ ఉండడంచేత వీటిని గ్రహ శకలాలు అంటారు వీటికి వాతావరణం లేనేలేదు. కనుక జీవమూ ఉండదు

ఇంక ఉపగ్రహాలు దగ్గరకు వద్దాం కుజగ్రహం చుట్టూ 12 మైళ్ళు 6 మైళ్ళు పొడవులున్న ఫోబోస్, డైమాస్ అనే చిన్నారి ఉపగ్రహాలు తిరుగు తున్నాయి వీటిమీద వాతావరణం లేదు గురుగ్రహం చుట్టూ తిరిగే 12 ఉప గ్రహాలలో కాలిస్టో, జనిమేడ్ అనేవితప్ప మిగిలిన పదీ బాగా చిన్నవి ఈ రెండూ అయినా దయ్యపు తట్టల్లా సైజులో పెద్దవేగాని, బరువు తక్కువ. వీటి నిష్క్రమణ వేగాల 1 మైలు, 1 3/4 మైళ్లూను ఇవికూడా మన చంద్రునిలాగే వాతావరణశూన్యంగా ఉన్నాయి కనుక వీటిమీద జీవంలేదని చెప్పవచ్చు

శని గ్రహానికిఉన్న తొమ్మిది ఉపగ్రహాలలోనూ టైటాన్ అనేది చాలా పెద్దది ఇది బుధునికీ కుజునికీ మధ్య సైజులో ఉంది ఈ ఒక్క ఉప గ్రహంమీద మాత్రమే వాతావరణంఉందికాని ప్రాణవాయువు లేదు మిథేన్ వంటి విషవాయువులే ఉన్నాయి కనుక అక్కడ కూడా జీవంలేదు

యురేనస్ ఉపగ్రహాలు ఐదూ వాతావరణం లేనివే ఇకపోతే నెప్ట్యూన్ ఉపగ్రహాలు రెంటిలో ట్రైటన్ అనేది బాగా పెద్దది దీనికికూడా టైటాన్‌కులాగ విష వాతావరణం ఉంది కనుక ఇక్కడ కూడా జీవంలేదు.

## అ తి శీ త ల లో కా లు

న్యాయంగా గ్రహోపగ్రహాలు అన్నీ చల్లనివే తమంత తాము వెలిగేవి నక్షత్రాలుతప్ప మరేవీలేదు. భూమి లోపలిభాగంలో బాగా వేడిగా ఉంటుంది,






గురుగ్రహం

నిజమేకానీ, ఆ వేడి భూమి పైభాగానికి రాదు, ఒక్క అగ్ని పర్వత విస్ఫోట నాలవల్ల తప్ప. మనకు తగిలే వేడి అంతా సూర్యుని దగ్గరనుంచి వచ్చేదే. కనుక, సూర్యునికి దగ్గరగాఉన్న గోళాలమీద వేడిగానూ, దూరంగా ఉండే గోళాలమీద చల్లగానూ ఉండటం సహజమే కదా

భూమి సూర్యునికి 9 29 కోట్ల మైళ్ళ దూరంలో మాత్రమే ఉంది అయినప్పటికీ భూమిమీద కొన్నిచోట్ల చాలా చలిగా ఉంటుంది. భూమి తరువాత సూర్యునికి 14 2 కోట్ల మైళ్ళ దూరంలోఉన్న కుజ గ్రహంమీద ఇక్కడికన్న బాగా చలిగా ఉంటుంది కానీ, మరీ భరించరానంత దారుణమైన చలిమాత్రం కాదు ఆటుతరువాత 34 కోట్ల మైళ్ళ వెడల్పు ఉన్న వలయంలో వాతావరణ శూన్యమైన గ్రహ శకలాలు వేల సంఖ్యలో తిరుగుతున్నాయి. వాటితరువాత మరో ఐదు గ్రహాలు ఉన్నాయి.

గు రు గ్ర హ ం —

గురుడు సూర్యునికి 48 33 కోట్ల మైళ్ళ దూరంలో తిరుగు తున్నాడు నవగ్రహాలలోనూ పెద్దది ఇదే. దీని వ్యాసం సుమారు 88 వేల మైళ్ళు భూమివంటి గోళాలు 1300 దాకా ఈ గురునిలో చులాగ్గా దూరి పోతాయి దీనిమీద నిష్క్రమణవేగం 38 మైళు భూమిమీదకన్న అనేక వేల రెట్లు దట్టమైన వాతావరణం ఉంది ఈ గ్రహం లోపల 22000 మైళ్ళ మందాన రాళ్ళూ, లోహాలూ మొదలైన ఘన పదార్థాలు ఉన్నాయి. దానిపైన 16000 మైళ్ళ మందాన గడ్డకట్టిన నీరు ఉంది దానిపైన 6000 మైళ్ళ మందాన వాతావరణం ఉంది ఈ గ్రహంమీద సరాసరి ఉష్ణో గ్రత 140°C స్పెక్ట్రోస్కోప్ అనే సాధనం ఉపయోగించి గురు గ్రహ వాతావరణంలో అమ్మోనియా, మిథేన్ అనే విషవాయువులు ఉన్నాయని తెలుసుకున్నారు ఇంతటి చలిలో, ఇటువంటి విషవాతావరణంలో జీవులు ఉండే అవకాశం లేదు

శ ని గ్ర హ ం —

గురుని తరువాతది శని ఇది సూర్యునికి 88 6 కోట్ల మైళ్ళ



శనిగ్రహం




దూరంలో 29న్నర సంవత్సరాలకు ఒక్కొక్క సూర్య ప్రదక్షిణం పూర్తి చేస్తోంది గ్రహాలన్నిటిలోకి బహు సుందరమైనది ఇదే దీని చుట్టూ వడ్డాణంలాంటి పలుచని చక్రం ఒకటి ఉంది ఈ వడ్డాణాన్ని తొలగించిచూస్తే శనికీ, గురునికీ చాలా దగ్గర పోలికలు ఉన్నాయి ఇది ఘన పరిమాణంలో భూమి కన్న 750 రెట్లు, బరువులో 95 రెట్లు పెద్దది దీని కేంద్రంలో 1400 మైళ్ల మందాన రాయి, దానిపైన 6000 మైళ్ల మందాన మంచు, దానిమీద 16000 మైళ్ల ఎత్తున వాతావరణం ఇంత లోతైన వాతావరణం మరే గ్రహానికీ లేదు దీనిమీద సరాసరి ఉష్ణోగ్రత–155°C దీని వాతావరణంలో కూడా అమోనియా, మిథేన్ వాయువులే ఉన్నాయి ఇక్కడ కూడా జీవం లేదు

యురేనస్ —

ఇది సూర్యుడికి 178 2 కోట్ల మైళ్ళ దూరంలో 84 సం కు ఒక సూర్య ప్రదక్షిణం పూర్తి చేస్తోంది ఇది 32000 మైళ్ళ వ్యాసం గల గోళం గురు, శని గ్రహాలకులాగే దీని వాతావరణం కూడా వేలకొద్దీ మైళ్ళ లోతున, మిథేన్, అమోనియా వాయువులతో నిండి ఉంది ఉష్ణోగ్రత–185°c. ఇది గురు, శని గ్రహాలకన్న కాస్త చిన్నది తప్పిస్తే జీవులకు నివాస యోగ్యం కాని పరిస్థితులు కలిగివుండడంలో వాటినే పోలిఉంది.

నెప్ట్యూన్ —

నెప్ట్యూన్ అన్ని విధాలా యురేనస్‌నే పోలి ఉంది సూర్యునికి 279 2 కోట్ల మైళ్ల దూరంలో ఉంది ఉష్ణోగ్రత–200°C వెలకొద్దీ మైళ్ల లోతున అమోనియా, మిథేన్ వాయువులు ఉన్నాయి ఇక్కడ కూడా జీవులు లేవు

దీని ఉపగ్రహమైన ట్రైటన్ 3000 మైళ్ళ వ్యాసం కలది దీనిమీద ఉష్ణోగ్రత–200°c మిథేన్, అమోనియా వాయువులు ఉన్నాయి. కనుక ఇక్కడ కూడా జీవంలేదు

ప్లూటో —

ఇది సూర్యుడికి 367 1 కోట్ల మైళ్ళదూరంలో ఉంది ఉష్ణోగ్రత సుమారు–210°C ఇది చాలా చిన్న గ్రహం దీనిమీద వాతావరణం అంటూ ఉంటే అందులో హైడ్రోజన్, హీలియం, న్యూవాన్ వాయువులు ఉండవచ్చు దీనిమీద సముద్రాలు ఉన్నాయికానీ, అందులో నీటికి బదులు ద్రవరూపంలో ఉన్న మిథేన్ ఉంది ఇక్కడ కూడా జీవం లేదు.

## అత్యుష్ణ లోకాలు

బుధగ్రహం:—

సూర్యునికి అత్యంత సమీపంలో ఉన్న గ్రహం ఇది సూర్యుడినుంచి దీని సరాసరి దూరం 3 6 కోట్ల మైళ్ళు 88 రోజులకు ఒక్కొక్క సూర్య ప్రదక్షిణం పూర్తి చేస్తోంది దీని వ్యాసం 3100 మైళ్లు. బుధుని వంటి గోళాలు భూమిలో 16 పడతాయి బుధునిలో ఒక చమత్కారం ఉంది. దీని ఒక అర్ధ భాగం ఎప్పుడూ సూర్యునివైపే తిరిగి ఉంటుంది రెండవ అర్ధగోళం ఎప్పుడూ చీకట్లోనే ఉంటుంది సూర్యునివైపు తిరిగిఉన్న అర్ధ గోళంలో ఉష్ణోగ్రత సుమారు + 410°C ఈ వేడిలో సీసం కూడా కరిగిపోతుంది ఇక్కడ జీవులు ఏవైనా వెళ్లి నిలుచుంటే మాడి బొగ్గు అయిపోతాయి అసూర్యంపశ్య అయిన రెండవభాగంలో ఉష్ణోగ్రత 200°C కన్న తక్కువ ఇంతటి చలికి కూడా ఏ జీవీ బ్రతుకలేదు ఈ గ్రహం సూర్యునిచుట్టూ అండాకార కక్ష్యలో తిరుగడంలో అటూ, ఇటూ కాస్త జరుగుతుంది అందుచేత దివారాత్ర సంధి ప్రదేశం కొన్ని వందల మైళ్ల వెడల్పున ఉండి, ఇక్కడమాత్రం శీతోష్ణ స్థితి మధ్యస్థంగా ఉంటుంది. ముందు ముందు వ్యోమ నావికులు ఈ గోళంమీద దిగదలుచుకుంటే ఈ ప్రదేశంలోనే దిగాలి దీని నిష్క్రమణ వేగం 2 4 మైళ్ళు మాత్రమే కావడం చేత దీనికి వాతావరణం కూడా ఇంచు మించు లేనట్లే కనుక, ఈ గ్రహం కూడా జీవులకు నివాసయోగ్యమైనదికాదు

శుక్రగ్రహం –

మనకు అత్యంత సమీపంలో ఉన్న గ్రహం ఇది ఆకాశంలో సూర్య చంద్రుల తరువాత అతి ప్రకాశవంతంగా కనిపించేది ఇదే ఈ గ్రహం సూర్యునికి 6 72 కోట్ల మైళ్ళ దూరంలో 225 రోజులకు ఒక్కొక్క సూర్య ప్రదక్షిణం పూర్తి చేస్తోంది భూమి, శుక్రుడు కవల పిల్లల్లా ఉంటాయి. వీటి వ్యాసములు 7927 మైళ్లు, 7700 మైళ్లూను భూమి బరువులో శుక్రుని బరువు 0 82 వంతు సాంద్రత 0 89 వంతు ఆకరణ శక్తి 0 86 వంతు ఈ రెండు గ్రహాల కక్ష్యలూ వృత్తానికి బహు దగ్గరగా ఉన్నాయి ఈ రెండిటికీ దట్టమైన వాతావరణం ఉంది ఇన్ని పోలికలు ఉండడంచేత శుక్రగ్రహంమీద పరిస్థితులు ఇంచుమించు భూమిమీద ఉన్నట్లే ఉంటాయనీ, కనుక ఆ గ్రహంమీద కూడా జీవులు అనేక రూపాలలో తామరతంపరగా ఉంటాయనీ అనుకునేవార శాస్త్రజ్ఞుల అమితోత్సాహంతో శక్తివంతమైన టెలిస్కోపులను శుక్రుని వైపు తిప్పి చూచారు వారి ఆశలన్నీ తలకిందులు అయినాయి అక్కడ సముద్రాలు, ద్వీపాలు, ఖండాలు, పర్వతాలు వగైరా ఏవీ కనబడలేదు అసలు ఏ గుర్తులూ లేని తెల నిగోళం మాత్రమే కనబడింది లోపల ఏమందో కనిపించనంత దట్టంగా దుమ్ము, ధూళి నిరంతరము ఆ గ్రహ వాతావరణంలో తేలుతూ ఉంటుంది ఆ వాతావరణంలో ప్రాణవాయువు మచ్చుకి కూడా లేదు నీటిఆవిరి లేదు రష్యనులు పంపిన వీనస–4అనే వ్యోమ నౌక 18–10–1967 తేదీని శుక్రగ్రహం మీదికి దిగి అక్కడినుంచి పంపిన సమాచారాన్నిబట్టి, ఆ గ్రహ వాతావరణంలో 98% బొగ్గుపులుసు గాలి అనీ వాతావరణపు పొరలలో 40°c, గ్రహపు నేలమీద సుమారు 280°c ఉష్ణోగ్రత ఉన్నటు తెలియవచ్చింది అక్కడి వాతావరణపు వత్తిడి భూమిమీదకన్న 15 రెట్లు ఉంది ఇంతటి వత్తిడికీ ఇంతటి వేడిమికీ కారణం శుక్ర వాతావరణంలో అత్యధికంగా బొగ్గుపులుసు గాలి ఉండడమే ఇంతవరకూ మనకు తెలిసిన సమాచారాన్నిబట్టి శుక్రునిమీద జీవముండే అవకాశం లేదనే తోస్తోంది

కుజగ్రహం:

సౌర కుటుంబమంతా తిరిగి తిరిగి—ఒక్కొక్క గోళాన్నే పరామర్శించి ఎక్కడా జీవం అన్నమాటేలేదని తెల్సుకుని, ఆఖరికి కుజగ్రహం దగ్గరకు వచ్చాం దీనికే అంగారకగ్రహం అని మరో పేరు ఈ గ్రహం సూర్యుడినుంచి నాలుగోది, భూమి తరువాతది ఇది భూమికన్న చాలా చిన్నది దీని



## కుజగ్రహం

వ్యాసం 4200 మైళ్లు భూమి దీనికన్న ఘనపరిమాణంలో 68 రెట్లు, బరువులో 9 రెట్లు పెద్దది భూమిమీద 200 పౌనులుతూగే సినీతార అక్కడ 76 పౌనులు మాత్రమే తూగుతుంది కుజుడు తన చుట్టూ తాను 24 గం. 37 ని. కు ఒకసారి తిరుగుతాడు సూర్యునికి 14.17 కోట్ల మైళ్ల దూరంలో 678 రోజులకు ఒక ప్రదక్షిణం పూర్తి చేస్తాడు. దీని చుట్టూ వాతావరణం ఉంది ప్రాణవాయువు ఉంది నీరు వుంది ఇక్కడ జీవం ఉందా లేదా అన్న విషయంమీద భేదాభిప్రాయాలు ఉన్నాయిగానీ, జీవం ఉన్నదనే ప్రస్తుతం శాస్త్రజ్ఞులలో అధిక సంఖ్యాకుల విశ్వాసం హమ్మయ్య! భూమిమీద కాక మరొక్క లోకంమీద, అందులోనూ మనకి పొరుగు ఇల్లులా వున్న కుజునిమీద ప్రాణులు ఉన్నాయిఅంటే ఎంతో సంతోషించవలసిన విషయం

శీతకాలంలో కుజగ్రహ ధ్రువముల దగ్గర మంచు పేరుకుని తెల్లని టోపీలా కనిపిస్తుంది, టెలిస్కోపులోనుంచిచూస్తే వేసవిలో ఈ మంచు టోపీలు కరిగి, నీరు పల్లపు ప్రదేశాలకు ప్రవహిస్తుంది నీరు ప్రవహిస్తూవుంటే రంగులు మారుతున్నట్లు కనిపిస్తుంది మొదట ముదురు ఆకుపచ్చ, తరువాత పసుపు, తరువాత గోధుమరంగుగానూ మారుతుంది నీటిపారుదల వల్ల చెట్లు పెరగడమే ఈ రంగుల మార్పుకు కారణమని శాస్త్రజ్ఞుల ఊహ. కుజగ్రహంలో చాలాభాగం ఎరుపు, నారింజరంగులలో కనిపిస్తుంది ఆ భాగమంతా ఎడారి ఈ ఎరుపురంగువల్లనే కుజునికి అంగారక నామం సిద్ధించింది. స్పెక్ట్రోస్కోపు ఉపయోగించి కుజగ్రహ వాతావరణంలో బొగ్గుపులుసువాయువు భూవాతావరణంలోకన్న రెట్టింపు ఉన్నదనీ, ప్రాణవాయువు, నీటి ఆవిరి బహు స్వల్పంగా ఉన్నాయనీ తెలుసుకున్నారు ఆ గ్రహంమీద అప్పుడప్పుడు 20 మైళ్ల ఎత్తుదాకా మేఘాలు కనబడతాయి

కుజగ్రహ నిష్క్రమణ వేగం సెకనుకి 32 మైళ్ళు మాత్రమే కావడంచేత ఆ గ్రహంమీద గాలి చాలా పలుచగా ఉంది 11 మైళ్ళ ఎత్తున మన భూమిమీద గాలి ఎంత దట్టంగా ఉంటుందో అక్కడ అల్లా ఉంటుంది. మిగిలివున్న గాలి, నీరు కూడా మరికొన్ని లక్షల సంవత్సరాలలో పూర్తిగా జారిపోయి, కుజుడు కూడా చంద్రునిలాగే బోడిగా, నిర్జీవంగా తయారు కాకతప్పదు. ప్రస్తుతం కుజగ్రహంమీద జీవం ఉన్నది కానీ, అక్కడ బాగా పరిణతి చెందిన పెద్ద పెద్ద జంతువులు, వృక్షాలూ ఉన్నాయా? ఈ విషయమై శాస్త్రజ్ఞులు చాలాకాలం తగవులాడుకున్నారు.

1877 లో కుజగ్రహం భూమికి అత్యంత సమీపంలోకి వచ్చినప్పుడు షియా పరెల్లీ అనే ఇటాలియను ఖగోళశాస్త్రజ్ఞుడు టెలిస్కోపు ఉపయోగించి విపుల పరిశోధనలు జరిపేడు. కళ్ళు చించుకునిచూడగా ఆ గ్రహంమీద నల్లని మచ్చలను కలుపుతూ రూళ్ళకర్రతో గీసినంత తిన్నగా సన్నని కాలువలు కనిపించాయన్నాడాయన లోవెల్ అనే అమెరికన్ శాస్త్రజ్ఞుడు కుజగ్రహపు కాలువలమీద సుదీర్ఘ పరిశోధనలు జరిపి, ఆ గోళంమీద మనుష్యులకన్న తెలివైన జీవులు ఉన్నాయనీ, ఆ జీవులు కలిసికట్టుగా బ్రహ్మాండమైన నీటి పారుదల స్కీములు అమలుపరచి, వ్యవసాయం చేస్తున్నాయనీ, తమ తమ మనుగడ కోసం ప్రకృతి శక్తులతో తీవ్రంగా పోరాడుతున్నాయనీ, ఆ కనిపించే కాలువలు వాళ్ళు తవ్వినవేననీ ఆయన వాదించాడు అసలు అటువంటి కాలువలు తమకు కనిపించనేలేదనీ, అది అంతా భ్రమ అనీ, ఊహాగానమనీ చాలామంది శాస్త్రజ్ఞులు తోసిపుచ్చారు

అంత తక్కువ నీటిలో, అంత తక్కువ ప్రాణవాయువులో పెద్ద పెద్ద జీవులేవీ బ్రతుకలేవనీ, మహా అయితే పాకుడు, బూజువంటి అల్ప వృక్షజాతి జీవులు మాత్రమే అక్కడ ఉండి ఉంటాయనీ ప్రస్తుతం చాలామంది శాస్త్రజ్ఞుల విశ్వాసం

### ఇతర గ్రహకుటుంబాలు

ఇంతవరకూ సౌర కుటుంబం అంతా తిరిగి భూమిమీదకాక మరియెక్కడేనా జీవం కనిపిస్తుందేమోనని కళ్ళు చించుకుని వెతికేం ఒక్క కుజగ్రహం మీద మినహా మరియెక్కడా జీవం అన్నమాటే లేదని తెలుసుకున్నాం. అక్కడ అయినా భూమిమీది జీవులతో పోల్చడానికైనా తగని అత్యల్పమైన జీవులు ఉన్నాయని తెలుసుకున్నాం

పాలపుంత అనబడే నక్షత్ర కుటుంబంలో ఇరవైవేలకోట్ల నక్షత్రాల దాకా ఉన్నాయి వాటిలో సూర్యుడు ఒక సామాన్య నక్షత్రం మిగిలిన నక్షత్రాలకి కూడా సూర్యునికి ఉన్నట్లే గ్రహాలూ, ఉపగ్రహాలూ ఉన్నాయా? ఉంటే, వాటి అన్నిటిమీదా కాకపోయినా కొన్నిటిమీదనైనా జీవం ఉండదా? వాటిలో కొన్నిటిమీద మనుష్యులకన్న తెలివైన జీవులు ఉండిఉండకూడదా? ఈ ప్రశ్నకు ఖచ్చితంగా జవాబు చెప్పడం చాలా కష్టం. ఏమంటే నక్షత్రాలు మనకు అనేక జ్యోతిర్వర్షాల దూరాలలో ఉన్నాయి సెకనుకి 186000



కుజగ్రహంలో కాలువలు




మైళ్ళ దూరం ప్రయాణం చేయగల కాంతి ఒక సంవత్సరకాలంలో ప్రయాణం చేయగల దూరాన్ని జ్యోతిర్వర్షం అంటారు. ఇది సుమారు ఆరు లక్షల కోట్ల మైళ్లకు సమానం. ఉదాహరణకు మనకు అత్యంత సమీపంలో వున్న అల్ఫా సెంటారీ అనే నక్షత్రం మనకు 4.2 జ్యోతిర్వర్షాల దూరంలో వుంది. మన పాలపుంతలోని కొన్ని నక్షత్రాలు మనకు 70,000 జ్యోతిర్వర్షాలదూరంలో కూడా ఉన్నాయి. అల్ఫా సెంటారీ చుట్టూ గురుగ్రహమంతగోళం తిరుగుతూ ఉంది అనుకున్నప్పటికీ, మనకున్న పెద్ద పెద్ద టెలిస్కోపులు ఉపయోగించి చూచినప్పటికీ అది మనకు కనబడదు. ఇంక మిగిలిన నక్షత్రాలు గ్రహాలమాట చెప్పేదేమిటి? గ్రహాలు స్వయం ప్రకాశాలుకావు కనుక, ఎంత సున్నితమైన పనిముట్లు ఉపయోగించినా వాటి ఉనికి మనకు తెలిసే అవకాశంలేదు. ఇంక ఈ చిక్కు విడేది ఎల్లాగ? దీనికి మరో డొంకతిరుగుడు పద్ధతి వుంది. సూర్యునిచుట్టూ గ్రహోపగ్రహాది బలగం ఏ పరిస్థితులలో ఏర్పడిందో తెలుసుకోగలిగితే, మిగిలిన నక్షత్రాలకు కూడా గ్రహాలు ఇదేవిధంగా ఏర్పడగల అవకాశాలు ఏపాటిఉన్నాయో ఊహించవచ్చు. కనుక, ముందుగా సౌర కుటుంబం ఎల్లా పుట్టిందో తెలుసుకోవాలి.

## సౌరకుటుంబపు పుట్టుక

సూర్యుని చుట్టూ గ్రహాలు ఏదో తోచినట్లు అవకతవకగా పడి తిరగడంలేదు. ఈ కుటుంబంలో అమోఘమైన నియమమూ, కట్టుబాట్లూ ఉన్నాయి. నవగ్రహాలు, వేలకొద్దీ గ్రహ శకలాలూ, ఉపగ్రహాలూ—ఇంచుమించు అన్నీ—ఒకే దిశలో, ఒకే సమతలంలో, ఇంచుమించు వృత్తాకారకక్ష్యలలో తిరుగుతున్నాయి. సూర్యుడూ, గ్రహాలూ, ఉపగ్రహాలూ అన్నీ తమ చుట్టూ తాము ఒకే దిశలో తిరుగుతున్నాయి. సూర్యుడినుంచి గ్రహ దూరములు బోడ్ సూత్రాన్ని అనుసరించి ఒక క్రమపద్ధతిలో ఉన్నాయి. మిలిటరీవాళ్ల కవాతులాగ ఈ సౌర కుటుంబంలో కట్టుబాట్లు బహు నిశితంగా ఉన్నాయి. అప్పుడే కొని తెచ్చిన చీట్ల పేకలోని ముక్కలలాగ సౌరకుటుంబం అంతా ఒక క్రమంలో అమర్చినట్లుగా ఉంది.

ఇదంతా చూస్తూంటే మన సౌర కుటుంబం ఏదో యాదృచ్ఛికంగా, వెర్రివాడి చేతిరాయిలా ఏర్పడ్డదికాదనీ, ఇంతటి నిశిత నిర్మాణక్రమం ఉండడానికి బలీయమైన కారణాలు ఉండిఉండాలనీ తోస్తుంది. ఈ నిర్మాణ సౌష్ఠవాన్ని సమర్థిస్తూ అనేకులు శాస్త్రజ్ఞులు రకరకాల సిద్ధాంతాలు ప్రతిపాదించారుకానీ, అన్నింటికీ తలో లొసుగూ ఉండి నమ్మడానికి వీలు లేకుండా ఉన్నాయి. వాటి నన్నింటినీ ఈ చిన్న వ్యాసంలో వివరించడం సాధ్యంకాదు. పోతే సౌరకుటుంబ జనన వృత్తాంతాన్ని తెలిపే సిద్ధాంతాలలో ముఖ్యమైనవి రెండు ఉన్నాయి. మొదటిది నక్షత్ర సంఘర్షణ సిద్ధాంతం :

నక్షత్రాలన్ని తలో దిక్కుగానూ గందరగోళంగానూ తిరుగుతూంటాయి. బహు పురాతనకాలంలో (అంటే 500–1000 కోట్ల సంవత్సరాలకుపూర్వం) ఏదో నక్షత్రం మన సూర్యునివైపుగా ప్రయాణంచేసి, కొన్ని లక్షల మైళ్ల దూరంలోకి వచ్చి, సరాసరి సూర్యునితో ఢీకొనక అల్లంతదూరంలోనుంచి అటే హైపర్ బాలిక్ వక్రమార్గంలో దూరంగా జరిగిపోయి ఉంటుంది. అప్పుడు పరస్పర గురుత్వాకర్షణవల్ల సూర్యుడినుంచి (ఆ నక్షత్రంనుంచి కూడా) కొంత ద్రవ్యం పైకి నాలుకలా లేచింది. సూర్యుడిలోనుంచి లేచిన ద్రవ్యం దూసుకుపోయిన నక్షత్రంవైపుగా వంగుతుంది ఆ నక్షత్రం దూరంగా సాగిపోయాక పైకి లేచిన ద్రవ్యం కొంత తిరిగి సూర్యునిలో పడిపోయింది. అందువల్లనే సూర్యుడు తన చుట్టూ తాను తిరుగ నారంభించాడు మిగిలిన ద్రవ్యం చల్లబడి, చిన్న చిన్న ముద్దలుగా అయి సూర్యునిచుట్టూ—నక్షత్రం కదలిపోయిన దిశలో తిరుగసాగాయి. ఈ ముద్దలు కొన్ని కలుసుకుని పెద్దవి అయాయి. ఆ పెద్ద ముద్దలు ఆకర్షణవల్ల గబగబా తమ చుట్టూ ఉన్న ద్రవ్యాన్ని కలుపుకుని, పెరిగి పెరిగి గ్రహాలయాయి.

రెండవది పలుచని చల్లని వాయుమేఘంనుంచి క్రమంగా గ్రహగోళాలు ఏర్పడ్డాయని రెండవ సిద్ధాంతం చెప్తుంది విశ్వావకాశంలో దుమ్ము, ధూళి, వాయువుల మేఘాలు అనేక జ్యోతిర్వర్షాల విస్తీర్ణంగలవి ఎన్నో ఉన్నాయి. కొన్ని వందల కోట్ల సంవత్సరాలకుపూర్వం గ్రహోపగ్రహాది వందిమాగధులు లేని సూర్యుడు హేలగా కులాసాగా సాగిపోతూ అటువంటి వాయుమేఘం ఒకదానిలో దూరేడు. ఆ మేఘాన్నిదాటి బయటికి వచ్చేసరికి సూర్యుని బ్రహ్మాండమైన వాతావరణం – నాలుగైదు వందల కోట్ల మైళ్ల



సూర్యుడి నుంచి నాలుకలా పైకి లేచిన ద్రవ్యం

వ్యాపకంతో— గురుత్వాకర్షణశక్తి వల్ల ఏర్పడింది. ఈ వాయువుల పరమాణువు లన్నీ సూర్యునిచుట్టూ వివిధ దూరాలలో వివిధ కక్ష్యలలో తిరుగుతూ తమలో తాము గుద్దుకుని, కక్ష్యలు మార్చుకుని, ఆఖరికి ఆ ద్రవ్యమంతా సూర్య మధ్యరేఖా సమతలంలోకి సర్దుకుని. కుమ్మరిసారెలో—శని గ్రహంచుట్టూ వడ్డాణంలాగ — పలుచని రేకులా — తయారవుతుంది. అటు తరువాత ఈ వడాణంలో పెద్ద పెద్ద సుడి గుండాలు ఏర్పడతాయి. ఈ సుడి గుండాల దగ్గర ద్రవ్యం గుమిగూడి, కొంత కాలానికి అవే గ్రహాలుగా పరిణతి చెందుతాయి.

ఈ రెండు సిద్ధాంతాలకీ కూడా అభ్యంతరాలు ఉన్నాయికానీ, చాలా ఇబ్బందుల్ని అతిక్రమించి నిలబడ్డవి ఈ రెండే.

సంఘర్షణ సిద్ధాంతమే నిజమైనది అనుకుందాం మాట వరసకి. అసలు రెండు నక్షత్రాలు దగ్గర దగ్గరగా రావడమే బహు అరుదు. దీనికి కారణం నక్షత్రాలమధ్య చెప్పనలవి కానంత దూరం ఉండడమే పాలపుంత పుట్టినప్పటినుంచీ ఇప్పటివరకూ సుమారు వెయ్యి కోట్ల సంవత్సరాలు) మహా ఐతే ఏ రెండు మూడు వందల నక్షత్ర సంఘర్షణలో జరిగి ఉంటా యని అంచనా. రెండు నక్షత్రాలు దగ్గరగా వచ్చినప్పుడల్లా ఆ నక్షత్రాల చుట్టూ గ్రహాలు ఏర్పడతాయని ఇదివరలో అనుకునేవారు కాని, అది నిజంకాదనీ, కొన్ని అతి ప్రత్యేక పరిస్థితులలో మాత్రమే గ్రహాల ఏర్పడుతాయని తరి [illegible] గ్రహించారు. కనుక కొన్ని వందల నక్షత్ర సంఘర్షణలలోనూ వేళ్ళ మీద లెక్కించదగ్గ బహుకొద్ది భాగం మాత్రమే గ్రహ నిర్మాణ సమర్థ మైనది. నక్షత్ర సంఘర్షణలవల్లనే మన సౌర కుటుంబ నిర్మాణం జరిగి ఉంటే మన గేలక్సీ అంతటిలోనూ గ్రహాలు ఉన్న నక్షత్రాలు మరి లేకపోయినా ఆశ్చర్యపడ నక్కరలేదు కనుక, జీవం మన భూమిమీద తప్ప పాలపుంతలో మరియెక్కడా ఇంచుమించు లేనట్టే.



సుడిగుండాల సిద్ధాంతమే నిజమై ఉంటే మన గేలక్సీలో కోట్ల సంఖ్యలో గ్రహాలు కలిగిన నక్షత్రాలు ఉంటాయి. వాటిలో జీవం ఉన్న గ్రహాలు అనేక లక్షలు ఉండవచ్చు. వాటిలో మనుష్యులవంటి తెలివైన జీవులుగల గ్రహాల వేల సంఖ్యలో ఉండవచ్చు. ప్రస్తుతం శాస్త్రజ్ఞులలో అధిక సంఖ్యాకులు గ్రహాలు వుండే నక్షత్రాలు చాలానే ఉండవచ్చుననీ, ఈ విష యంలో మన సూర్యుని ప్రత్యేకత ఏమీ లేదనీ భావిస్తున్నారు.

నక్షత్రాల చుట్టూ గ్రహాలు ఉన్నంత మాత్రాన వాటిలో జీవం ఉంటుం దని చటుక్కున తీర్మానించడానికి వీలులేదు జీవోత్పత్తి కత్తిమీద సాము లాంటిది. దానికి విధింపబడ్డ పరిమితులు బహు సంకుచితమైనవి. గ్రహం నక్షత్రానికి మరీ దగ్గరగా ఉంటే ఉష్ణోగ్రత మరీ ఎక్కువ. మరీ దూరంలో ఉంటే విపరీతమైన చలి. నక్షత్రానికి తగినంత దూరంలోనే గ్రహం ఉండాలి.

అంతతో సరిపోలేదు. ఆ గ్రహం మన భూమికన్న మరీ చిన్నది అయితే దానికి వాతావరణమే ఉండదు. భూమికన్న మరీ పెద్దది అయితే మరో ప్రమాదం వుంది గ్రహాలు పుట్టిన కొత్తలో వాటి అన్నిటిచుట్టూ హైడ్రోజన్ దట్టంగా ఉండేది. కాని ఈ వాయువు అన్నింటికన్న తేలిక అయినది కావడంచేత భూమివంటి సామాన్య గ్రహం ఆ వాయువును ఆకర్షించి నిలు పుకోలేదు. త్వరలోనే హైడ్రోజన్ అంతా భూమిని విడిచిపోయింది గురుడు, శని, యురేనస్, నెప్ట్యూన్‌వంటి బృహద్‌గ్రహాలు మాత్రం హైడ్రోజన్ వాయు వును పారిపోనివ్వకుండా నిలుపుకున్నాయి. హైడ్రోజన్ బొగ్గుతో కలిసి మిథేన్ అనే విషవాయువు, నైట్రోజన్‌తో కలిసి అమోనియా అనే విషవాయువు ఆ పెద్ద గ్రహాలమీద ఏర్పడ్డాయి. దానితో ఆ పెద్ద గోళాలు జీవులకు నివాస యోగ్యాలు కాకుండాపోయాయి హైడ్రోజన్ వాయువును నిలిపి ఉంచు కునే శక్తి చాలని భూమిది అది మంచిదే అయింది—కనుక జీవోత్పత్తి జరగా లంటే గ్రహం ఇంచు మించు భూమి అంత ఉండాలి మరీ పెద్దదిగాని, మరీ చిన్నదిగాని కాకూడదు.

అంతేకాదు. జీవోత్పత్తిని శాసించే విషయం మరి ఒకటి వుంది. అదృష్ట వశాత్తూ మన సూర్యుని తేజస్సు విపరీతమైన మార్పులు లేకుండా కొన్ని వందల కోట్ల సంవత్సరాలనుంచి స్థిరంగానే ఉంటోంది తేజస్సు కాస్త హెచ్చితే భూమిమీది జీవులు మాడిపోతాయి. తేజస్సు కాస్త తగ్గితే జీవులు చలికి బిగుసుకుపోతాయి నక్షత్రాలు అన్నీ సూర్యుడి అంత స్థిమ్యమైనవికావు. తేజస్సు విపరీతంగా హెచ్చుతూ ఉండే నక్షత్రాలు కొన్ని ఉన్నాయి వాటిని స్పందన నక్షత్రాలు (Pulsating Stars) అంటారు అటువంటి నక్ష త్రాల చుట్టూ గ్రహాలు ఉన్నప్పటికీ అక్కడ జీవోత్పత్తి జరుగదు. జంట నక్షత్రాలు (Double stars) అని కొన్ని ఉన్నాయి. రెండు నక్షత్రాలు ఒక దానిచుట్టూ ఒకటి ఒప్పులకుప్ప తిరుగుతూ ఉంటాయి. వాటికి గ్రహాలు ఉన్నప్పటికీ, వాటికి తగిలే తేజస్సులో విపరీతమైన మార్పులు ఉంటాయి కనుక అక్కడ కూడా జీవోత్పత్తి జరుగదు.

అంతేకాదు. నక్షత్ర తేజస్సు అథమపక్షం 300 కోట్ల సంవత్స రాలపాటు అయినా మార్పులు లేకుండా స్థిరంగా ఉండాలి నిర్జీవ పదార్థం నుంచి ప్రకృతి శక్తులవల్ల జీవులు ఏర్పడడానికి, అవి పరిణతి చెంది ఉన్నత స్థితికి రావడానికి సుమారు 300 కోట్ల సం లు పడుతుందని అంచనా. మనకు ఆకాశంలో కనబడే నక్షత్రాలన్నీ ఇంతింతకాలం స్థిరంగా నిలిచి వెలి గేవి కావు. కొన్ని బరువైన నక్షత్రాలు సూర్యునికన్న అనేకవేల రెట్లు కాంతితో ప్రకాశించి, ఇంధనం త్వరగా ఖర్చు చేసేసుకుని, త్వరలోనే ఆరిపోతాయి. తేలి కైన చిన్న నక్షత్రాలు స్వల్పకాంతితో పొదుపుగా వెలిగి, చాలాకాలం ప్రతి

ఉంటాయి. ఇక్కడి పట్టికలో నక్షత్రాల బరువులు, ఉపరితల ఉష్ణోగ్రతలు తేజస్సులు, వయఃపరిమితులు ఇచ్చాను.

| నక్షత్రం బరువు (సూర్యుడు=1 | వర్ణమాలా తరగతి | ఉపరితల ఉష్ణోగ్రత (సెం గ్రే) | తేజస్సు (సూర్యుడు=1 | ఆయుః పరిమితి (కోట్ల సం. లలో |
|---|---|---|---|---|
| 17 | $B_0$ | 24 000 | 10 000 | 0 8 |
| 6 | $B_4$ | 15,000 | 600 | 8 |
| 3 2 | $B_9$ | 12,000 | 50 | 40 |
| 1 8 | $A_4$ | 9,000 | 10 | 200 |
| 1 5 | $A_9$ | 7,600 | 6 | 400 |
| 1 3 | $F_5$ | 6,500 | 4 | 600 |
| 1 0 (సూర్యుడు) | $G_2$ | 5,800 | 1 | 1,300 |
| 0 7 | $G_8$ | 5,100 | 0 3 | 3,000 |
| 0 5 | $K_5$ | 4,500 | 0 08 | 7,000 |
| 0 3 | $K_9$ | 3,600 | 0 02 | 10 000 |

దీనినిబట్టి సూర్యునికి ఒకటిన్నర రెట్లకన్న తక్కువ బరువున్న నక్షత్రాల మాత్రమే 300 కోట్ల సం కన్న అధికకాలం నిలిచి ఉంటాయని తెలుస్తోంది కాని నక్షత్రం బొత్తిగా చిన్నది అయితే నివాసయోగ్యమైన సమశీతోష్ణ మండలం బహు సంకుచితంగా ఉంటుంది ఇంత ఇరుకైన మండలంలో సుమారు భూమి అంత ఉండే గ్రహం ఉండే అవకాశం చాలా తక్కువ కదా? కనుక సూర్యునికి 1 3 రెట్ల బరువుకి లోపు, సూర్యునిలో సగం బరువుకి పైనా ఉండే నక్షత్రాలు మాత్రమే జీవధారణ సమర్థములు అన్నమాట.

ఇంతవరకూ చెప్పిన దానినిబట్టి నక్షత్రాల చుట్టూ గ్రహాలు ఉండడమే అరుదైన విషయం వాటిమీద జీవోత్పత్తికి అనుకూల పరిస్థితులుండడం మరింత అరుదు లక్ష జ్యోతిర్వర్షాల వ్యాసం కలిగిన మన పాలపుంతలో జీవం ఎక్కడెక్కడ ఉన్నదో వెతకడానికి బయలుదేరితే లక్ష నక్షత్రాలలో ఒకదానిమీద, లేదా కోటి నక్షత్రాలలో ఒకదానిమీద జీవం కనబడుతుందేమో! ఇంత అరుదుగా కనిపించినా ఇది మరీ తక్కువేమీ కాదు. మన గేలక్సీలోని ఇరవై వేలకోట్ల నక్షత్రాలలో ఏ పదివేల నక్షత్రాలమీదనో జీవం ఉండవచ్చు ఇటువంటి గేలక్సీలు విశ్వంలో కోట్ల సంఖ్యలో ఉన్నాయి. ఈ మహా విశ్వంలో మనం ఒంటరిగాళ్ళం కాదు మనవంటి జీవులు, లేదా మనకన్న తెలివైన జీవులు ఇంకా ఎన్నోచోట్ల ఉండవచ్చు. ఆ లోకాలలోని జీవులు మన భూమిమీది జీవులలాగే పోలి ఉండాలని ఏమీ లేదు జీవ పరిణామం చిత్రంగా జరుగుతుంది స్థానికమైన శీతోష్ణాలు, నీరు పుష్కలంగా ఉండడం ఉండకపోవడం, గాలి దట్టంగా ఉండడం ఉండకపోవడంవంటి చిన్న చిన్న విషయాలు జీవ పరిణామాన్ని శాసిస్తాయి కనుక, మన భూమిమీది జీవులను పోలిన జీవులు మరియెక్కడా ఉండకపోవచ్చు

# ఆవలి గట్టు

శ్రీ నూతలపాటి గంగాధరం

ఏ పంచాంగమూ ప్రకటించలేదు ఈ దినం ఆకాశాన్ని
ఇన్ని మేఘాలు కప్పేస్తాయని! ఏ శాస్త్రవేత్తా చెప్పలేదు
ఈ రోజు అందరి మనసుల్లో ఇంత చీకటి వ్యాపిస్తుందని!
ఏ వైద్యుడూ వెల్లడించలేదు ఈనాడు పుడమి తల్లికింత జబ్బు చేస్తుందని!

ఇది కలత చెందిన కాసారం
దక్షతలేని సంసారం
తుఫానురేగిన సాగరం; ఉరుములతో పగిలిన అంబరం!
ఇది సంధి యుగం! సమస్యలతో నిండిన జగం!

పుడమి శిరస్సున కాలం కొరివి!
కొరివి తీసిన అగాధం!
అది చీకటికోన!
ఆకటి లోయ; విషవలయం!

అగడ్త కిద్దరి అనుభవాల పూరిగుడిసెలు!
అద్దరి ఆదర్శాల అద్దాలమేడలు!
నడుమ పెద్ద అగాధం—అదే ఈ దినం!
గుడిసెలు పెరగవు! అగడ్తలు తరగవు!
మేడలు దొరకవు!

అగడ్తలో కోడెత్రాచులు, కొరివి దయ్యాలు
గద్దె నెక్కిన పెద్దపులులు!
అన్నింటినీ కప్పేసే వింత చీకటి!
చీకటిలో మండే ఆకటి చిచ్చు!

గాంధేయకాంతిని అందుకోబోయే క్షణంలో ఇవన్నీ అడ్డు నిలిచేవి—
ఇనప మొద్దుల్లా! పెను తుఫానుల్లా!
మంచు తెరల్లా! కంచు పొరల్లా!

'రేపు మీద నీ కెందు కింత విశ్వాసం?' అని కాలం నన్ను ప్రశ్నించినప్పుడు—
ఆవలిగట్టున మెరిసే అద్దాలమేడను చూపేవాడ్ని!
అగధంవేపుచూసి పిడికిలి మరింత గట్టిగా బిగించే వాడ్ని!





జీవితంకోసం : శ్రీ కేతినీడి భాస్కరరావు.

# నవ్యాంధ్ర కవిత్వము - మానవతాదృక్పథము

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

వెం[illegible]దలు నిర్వచింపవలసిన యంశములు రెండు గలవు. మానవతాదృక్పథ మననేమి? కవిత్వ మననేమి? యనునందు మానవతాదృక్పథ మననేమియో చూతము. దానిని నిర్వచించుటకు శాస్త్రములకడకు వెళ్లనక్కరలేదు. పాశ్చాత్యులు వ్రాసిన గ్రంథరాజములను తిరుగవేయవలసిన పనిలేదు. ప్రాచీననవ్యాంధ్ర సాహిత్యములనుండి యొకరెండు పద్యముల నుదాహరించి, వాని తాత్పర్యములను దెలిసికొని, ఆపద్యములు వ్రాసిన కవుల హృదయమును దర్శింపగలిగినచో మానవతాదృక్పథమన నేమియో యిట్టే తెలియును.

దక్షిణాపథమును నిష్కంటకముగ నేలిన సార్వభౌములలో శ్రీకృష్ణదేవరాయ లగ్రగణ్యుడు. అల్లసాని పెద్దన యాప్రభువు సాహితీసమరాంగణ సార్వభౌమత్వమును కనులార గాంచిన యాంధ్రకవితాపితామహుడు. అష్టదిగ్గజములలో నొకడు. మూరురాయరగండడగు శ్రీకృష్ణదేవరాయలు కన్నుమూసిన నాడు దక్షిణాపథము తల్లిలేని బిడ్డయైనది. సస్యశ్యామలమై భాండసమృద్ధి గలిగిన గడ్డలో చీకటులు చెరలాడినవి. ఆనాడు పెద్దన చెప్పిన చాటు పద్యము—ఈపద్య మా మహాకవి వ్రాసిన శతకమునందలి దన్న విమర్శకులును గలరు—తెలుగువారి చేతికందినది. ఆపద్య మిది.

ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి
  కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొనువేళఁ బురమేఁగఁ
  బల్లకి తనకేలఁ బట్టి యెత్తె
బిరుదైన కవిగండపెండేరమున కీవె
  తగుదని తానె పాదమునఁ దొడిగెఁ
గోకటగ్రామాద్యనేకాగ్రహారంబు
  లడిగిన సీమలయందు నిచ్చె
    నాంధ్ర కవితాపితామహ! యల్లసాని
    పెద్దన కవీంద్ర! యని నన్నుఁ బిలుచునట్టి
    కృష్ణరాయలతో దివి కేఁగలేక
    బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు.

ఆ రాజకవికి, ఆకవిరాజునకు నడుమగల యాత్మీయత యీ పద్యములో నిండియున్నది. "బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబనగుచు" అన్న చివరి పాదము పెద్దన యాక్రందనమునకు మచ్చుతునక. పెద్దన యెదురైనచో రాయలు చేయూతనిచ్చి యేను గెక్కించికొనెను. మనుచరిత్ర కృతి యిచ్చిన నాడు పురమేగుటకై తన చేతితో పల్లకినెత్తెను. స్వయముగా రాయలు పెద్దన కాలికి గండపెండేరము తొడిగెను. అడిగిన సీమలలో కోకటము మున్నగు నగ్రహారముల నిచ్చెను. రాయలెప్పుడును "ఆంధ్రకవితా పితామహా!" యని పెద్దనను ఆమంత్రించెడివాడు. తాను పొందిన మర్యాదలను, రాజాదరణమును పెద్దన యీ పద్యములో తనివిదీర వర్ణించెను. మరొక విషయ మిందు గానరాదు.

మహాత్మాగాంధి మతాంధుని చేతిలో మరణము పొందుట, తరతరముల నుండి మత మీ భారతజాతిపై వేసిన మహాఘాతమునకు తార్కాణము. ఆ మహాత్ముని చావు తుమ్మల సీతారామమూర్తిగారి హృదయమును మథించినది. ఆ మథనముచేత యమృతప్రాయమగు "అమరజ్యోతి" కావ్య మావిర్భవించినది. దానిలో మహాత్ముని జీవనసారము, మతదౌష్ట్యము, బాపూజీ మరణము వలన కవి పొందిన యావేదనము పుష్కలముగా వర్ణింపబడినది. ఈ క్రింది పద్యము లా కావ్యమందలివి.

బుక్కు లొకనికి నొకనికి తెక్కుభజన
ప్రభుత యొకనికి నొకనికి బానిసమ్మ
గ్రామమొకనికి నొకనికిం గసటుగూడె
యేమి సౌభ్రాత్ర మేమి హిందూమతమ్ము

క్రుళ్లిన యెముకకై కుక్కగుంపులవోలె
  నధికారమునకు నారాడువారి
లంచాలగడ్డి కాసించి సేవాధర్మ
  నియమముల్ బలిసేయ నేర్చువారి
కుహనావణిజ్యోపగూహనోద్రిక్తులై
  సుధవోలె బ్రజనెత్రు జుఱ్ఱువారి
పరమతద్వేషాగ్ని నురగి నారీవృద్ధ
  శిశుమండలిని జీర్చి చెండువారి
    దేశహిత కృత్యముల పేర దెచ్చు నర్థ
    మాత్మబంధువులకు బంచునట్టివార—
    బ్రతుకు గనలేక కన్నుమూసితివి గాని
    కలదె నీగుండెపై బ్రేల్చగల [illegible].

బాపూని యెంపముక్కలు కపూర్ణముగా గుండు [illegible] తనం
విడ్డనవెల్ల జూసి; రపవిత్రనిధుల కథలం [illegible]
వృద్ధియొనర్చి రాతఁ డుదయించిన భూమిని [illegible]
బొద్దను నెట్టివైచిరి జనానుమయాయుం [illegible].

మొదటి పద్యములో హిందూమతముయొక్క అసహ్య[illegible] స్ఫటిక స్పష్టముగా చూపబడినది. రెండవ పద్యమునందు వక్రోక్తి కలదు. మహాత్ముడు మరణించిన మాట నిజమేగదా! గాడ్సే యనువాడు రివాల్వరు పేల్చినమాట నిజమేగదా! కవిగారు గాంధి మరణమునకు గాడ్సే కారణము గాదనుచున్నారు. గాంధి గుండెపై పేల్చగల పోటుమగండు లేనేలేడట! మరి మహాత్ముడెట్లు నిర్యాణము చెందెను? మహాత్ముని ప్రత్యక్ష శిష్యులైన వారు క్రుళ్లినయెముకకై కుక్క గుంపులు కొట్లాడుకొనునట్లు అధికారమునకు కొరాడుచున్నారు. లంచాల గడ్డికై సేవాధర్మనియమములను బలి చేయుచున్నారు. చీకటి బేరములు సాగించి ప్రజలనెత్తురు అమృతమువలె త్రాగుచున్నారు. మతద్వేషముతో ఆబాలగోపాలమును పూచికోతకోయుచున్నారు. దేశోపకారమున కని చెప్పి సొమ్ముదెచ్చి తన చుట్టములకు పంచుచున్నారు. వీరి బ్రతుకు చూడలేక బాపూజీ కన్నుమూసెనోగాని, గాడ్సే రివాల్వరు గుండ్ల

వలనగాదు. బుద్ధుడు చనిపోయినప్పుడు గూడ, గాంధిగారు మరణించినప్పటి వలెనే, స్మారకములు నిర్మించిరి మనుష్యుడయిన బుద్ధునకు దేవత్వమును ఆపాదించి పురాణములు వ్రాసిరి కడకు బౌద్ధ మతమును జన్మభూమినుండి యుత్తర దేశములకు గెంటి వేసిరి ఆ విధముగనే గాంధేయవాదము భారతదేశమునుండి పారద్రోలబడునని వ్యంగ్యము ఈ కావ్యము 1948 లో రచింపబడినది. ఇరువదేండ్లలోపల గాంధేయవాద మీ దేశములో నెంతకాలము నిలచెనో, ఏ రూపములో నున్నదో మెల్లరకు తెలియును కవి, ప్రవక్తయగుట కింతకంటె తార్కాణ మేమి కావలయును? ఈనాడు గాంధిగారిపేర జరుపు "జాతర్లు" గాంధేయవాదము యొక్క అభావమునకు ప్రత్యక్షనిదర్శనములు.

పెద్దన రాయల మరణమును గూర్చి వ్రాసెను తుమ్మల సీతారామమూర్తిగారు మహాత్ముని మరణమును గూర్చి వ్రాసిరి రెండును సమానమయిన సన్నివేశములే కాని పెద్దనగారు వ్రాసిన పద్యములలో, అల్లకల్లోలమయిన యానాటి సమాజము కానరాదు ఇచ్చెడి, మెచ్చెడి యేలిక యేగెనెయను బాధ యున్నది తుమ్మల సీతారామమూర్తిగారి పద్యములట్టివి గావు ఈ పద్యములలో మహావేదన యున్నది ఆనాటి— నేటిదిగాదనని చెప్పవచ్చు— భారతీయ సమాజము సాక్షాత్కరించుచున్నది కవి చారిత్రకదృష్టి గోచరించుచున్నది పెద్దన రాయల మరణమును వైయక్తికదృష్టితో చూచి యాత్మానుభూతిని వర్ణించెను సీతారామమూర్తిగారు ఆత్మవ్యక్తిత్వమును విసర్జించి, సాంఘిక దృక్పథమునుండి బాపూజీ మరణమును దర్శించెను ఆ ప్రాచీనకవి యానాటి సంఘమునకు ప్రతినిధి గాదు ఈ నవీనకవి యీనాటి సంఘమునకు ప్రతినిధి ఆ కవి యానాటి ప్రజలతో తాదాత్మ్యము చెందలేదు సాంఘిక పరిణామమును జూడలేదు ఈ కవి సమకాలిక సమాజముతో తాదాత్మ్యము చెంది, సాంఘిక పరిణామమును దర్శించెను పెద్దనది యరయన గొంతు కాగా, సీతారామమూర్తిగారిది ప్రజల గొంతయినది

మానవతా దృక్పథము నేమియో యిప్పటికిగాని తేటతెల్లమగుటలేదు ఒకకవి సామాజిక పరిణామమును అంగీకరించి, ఆయా సన్నివేశములలో ప్రజలు పొందు ననుభూతులను చక్కగా గుర్తించి, ఆ యనుభూతులను దనవిగా జేసికొని, ప్రజాప్రతినిధియై రంగమునకు వచ్చి, రచనలు గావించుట మానవతా దృక్పథము ఈ దృక్పథముగల కవి సకల బంధనముల నుండి సంఘమును విముక్తి చేయుటకై పాటుపడును ఆ విముక్తియే యాత్మవిముక్తియని భావించును. మతమో, ధనమో, యధికారమో, యహంకారమో సృష్టించిన తరగతులను తెగులను, జాతులను కవి తృణీకరించును అతని ప్రకారము మానవుడే పూజ్యుడు మానవాభ్యుదయమే మోక్షము చిత్తసత్త్వల నెన్నుచు ఇహలోకము నుపేక్షింపనొల్లడు రవీంద్రుని యీ పలుకులను వినుడు.

Leave this chanting and singing, and telling of beads! Whom dost thou worship in this lovely dark Corner of a temple with doors all shut? Open thine eyes and see thy God is not before thee.

He is there where the tiller is tilling the hard ground and where the path-maker is breaking stones. He is with them in sun and shower, and his garment is covered with dust. Put off thy holy mantle and even like him come down on the dusty soil.

Deliverance? Where is the deliverance to be found? Our master himself has joyfully taken upon him the bonds of creation; he is bound with us all for ever.

మానవతా దృక్పథమునందు విమర్శయుండును. అది సాంఘిక విమర్శ గావచ్చు. మత విమర్శ గావచ్చు. రాజకీయ వ్యవస్థా విమర్శగావచ్చు. ఈ విమర్శ మానవాభ్యుదయమున కభిముఖముగా సాగును మానవతా దృక్పథమునకు మానవుడే నాయకుడు మానవత్వమనే ప్రమాణము ఆంగ్లభాషలో ఈ మానవతా దృక్పథమునకు 'Humanitarianism'' అని పేరు దానిని తత్త్వశాస్త్ర నిఘంటువు Dictionary of philosophy నాలుగు విధములుగా నిర్వచించుచున్నది 1 కేవలము మానవజాతి విలువల యందే పరమాసక్తిని ప్రధానముగా కలిగియుండుట మానవతాదృక్పథ మనబడును. 2. మానవుల యార్తిని పోద్రోలి శ్రేయస్సును గూర్చు సాంఘిక నైతిక కార్యక్రమము మానవతావాదము ఈ కార్యక్రమము రాగానుప్రాణితమయిన యభినివేశముతో కూడియుండును. ఒక్కొక్కసారి యది జీవహింసా నిరోధక రూపము ధరించును జీవకారుణ్యము దానికి జీవగఱ్ఱ 3 కేవల విజ్ఞాన శాస్త్రములు ప్రమాణము లని విశ్వసించి మానవోపాసన చేయుటది మానవతా దృక్పథము పూజింపవలసిన విరణ్మూర్తి మానవజాతియే గాని భగవంతుడు గాడు, ప్రవక్తగాదు అని యీ దృక్పథము చాటును 4 క్రీస్తు దివ్యత్వమును తిరస్కరించు తాత్త్విక సిద్ధాంతము గలది మానవతా దృక్పథము దీనికి ఈ వ్యాసమున కెట్టి సంబంధము లేదు మిగిలిన మూడు నిర్వచనముల కిందు ప్రాధాన్యము గలదు

ఏది కవిత్వము? అను ప్రశ్నకు సమాధానము చెప్పుట కష్టము ఆంధ్ర సాహిత్య ప్రపంచములో ఈ విషయమున ఏకాభిప్రాయము లేకపోవుట దురదృష్టము మతము, రాజకీయములు, విశృంఖల ప్రవృత్తి— ఈ మూడును నేడు కవితా నిర్వచనమునకు ప్రతిబంధకములుగా సిద్ధమయినవి ఇతర మతములను దుమ్మెత్తి పోసినగాని తమ మతము యొక్క తేజస్సు వెల్లడికాదని భావించు వారు, తాము వలచిన వర్గ కలహమునో ప్రజాస్వామ్యమునో ప్రస్తుతింపవలయుననువారు, సంప్రదాయ ముద్ర వేసకొనిన దంతయు క్రాంతివిరోధక మనువారు కాసె బిగించి, కవచములు ధరించి, యొల మీదకు వచ్చుచున్నరోజులివి అట్టిచో కవితా నిర్వచనము నందు ఏకాభిప్రాయ ముండుట యసాధ్యము ఏరకమయిన "సులోచనములు" ధరింపకుండ సాహిత్య ప్రపంచమున అడుగుపెట్టిన వారికి గాని సత్యము సాక్షాత్కరింపదు మానవుని యనుభవమే యుత్తర ప్రమాణము కంటె మిన్నయగు ప్రమాణము సాహిత్య ప్రపంచమున "శిష్టు"డగు మానవుని యనుభవ మేమనుచున్నది?

ఏదైన నొక గ్రంథమును జదువు చున్నపుడు మన హృదయములో స్పందనమో, విక్రియయో పుట్టును. అవి పుట్టుటకు కారణము గ్రంథము నందున్న భావములు. ఆ భావములు మన మూహింపనివై, చమత్కారమును కలిగించుటకు శక్తిమంతములు కావున మన హృదయము వెంటనే స్పందించును. భావములకున్న యీ స్పందన శక్తికే "కవిత్వము" అని పేరు ఈ గ్రంథములో కవిత్వమున్నది", "ఈ గ్రంథములో కవిత్వము లేదు" అని మనము చెప్పుచున్న మాటల అర్థమేమి? ఈ స్పందన శక్తి యొకదానిలో నున్నది మరొక దానిలో లేదనియే గదా! కావున పాఠకుల హృదయ మెచట స్పందించుచున్నదో యచట "కవిత్వ" మున్నదన్న మాట. కవిత్వమున కింతకంటె నిర్వచనము చేయుట సాధ్యము గాదు. దీని నంగీకరించినచో జగన్నాథ పండితుడు చేసిన కావ్య నిర్వచన ముత్తమోత్తమమని యనిపించును. ఆ నిర్వచనము మానవుని యనుభవమును కాచి వడబోసి నట్టిది.

జగన్నాథ పండితుడు "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య"మ్మని సూత్రించెను. ఇందు ''రమణీయార్థ'' మనునది యతిప్రధానమయినది. అర్థమనగా లోకములో సామాన్యముగా మన మనుకొను శబ్దార్థము గాదు. ఆ సూత్రములో అర్థమను మాటకు భావము (Idea) అనియే యర్థము. రమణీయమనగా కేవలము సుందర మయినదను అర్థమును చెప్పరాదు. దానికి "లోకోత్తరమయిన చమత్కారము కలిగించునది" యని యర్థము చెప్పవలయును. కావున లోకోత్తరమయిన చమత్కారమును కలిగించు భావమును ప్రతిపాదించు శబ్దమే కావ్యమని జగన్నాథపండితుని సూత్రము యొక్క తాత్పర్యము. ఆహ్లాదకరమగు చమత్కారమును కలిగియుండుటయే సౌందర్యము. ఎంత చమత్కారముండునో, కావ్య మంత రమణీయముగా నుండును. ఈ చమత్కార హేతువు వలన— ఈ కవిత్వము వలన— పాఠకుల, శ్రోతల హృదయము స్పందించును. వారు పరవశింతురు.

పై వ్యాఖ్యానములో "కవిత్వము" "కావ్యము" అను రెండు పదములు గలవు. ఈ రెండు నొకటియే యను భ్రాంతి లోకములో గలదు. అదియు గాక కవిత్వము వ్రాయు చున్నాడన్నప్పుడు కేవలము పద్య కవిత్వమును వ్రాయు చున్నాడని యర్థము చేసికొను ఆచారము లోకములో కలదు. లోకోత్తరమైన యాహ్లాదము నిచ్చు భావము యొక్క శక్తికి కవిత్వమని పేరు. దాని పర్యాయ పదమే కావ్యత్వము. కవిత్వమున్న భావమును ప్రతిపాదించు శబ్దము కావ్యము. కావ్యము దృశ్యశ్రవ్యములని ద్వివిధము. కావ్యము పద్య రూపమున గాని, గద్య రూపమున గాని, చంపూ రూపమున గాని యుండవచ్చును. రూపకోక్త రూపక రూపమున నుండవచ్చు. ఛందస్సులలో వ్రాయలేదని, వ్యాకరణ దోషము లేనో యున్నవని కవిత్వము గల కావ్యము నీసడించుట తగదు. అట్లే ఛందస్సులలో వ్రాసెనని, యలంకారము లుపయోగించెనని, సంప్రదాయ మున్నదని వెక్కిరించుటయు పొరపాటే యగును. హృదయము నలరించుచున్నదా? లేదా? యను పరీక్షయే పరమ ప్రమాణము. మత మౌఢ్యమువలన, రాజకీయోన్మాదము వలన, విశృంఖల ప్రవృత్తి ప్రీతివలన హృదయము కలుషితము గారాదు. అనాడు కావ్య నిర్వచనమునందు తప్పక యేకాభిప్రాయమునకు రాగలము. ఇప్పటి యవ్యవస్థ తొలగి పోగలదు.

ఏ రూపమున నున్న కావ్యమున కయినను రసము ఆత్మ. శాస్త్రకారులు "రసము" అను పదమును తర్కశాస్త్రము నాలంబముగా గొని యెంతయైన చెడగొట్టిరి. "రసము" అనున దిట 'శాస్త్రము"ల ప్రకార ముపయోగింప బడలేదు. దాని క్రింద విశాలార్థము గలదు. ఆ యర్థమును రాళ్ళపల్లి యనంత కృష్ణశర్మగారు లెస్సగా వివరించిరి. వారి మాటలలో రసమనునది యీ రూపమున నుండును. "ఏ భావమునైనను దాని తీక్ష్ణదశలో నవిదిత వేద్యాంతర ముగా ననుభవింప గల్గుదుమేని, యానంద స్వరూపమునై రస శబ్ద వాచ్యము లగును; అనగా శిల్ప మందున్న మాట. జుగుప్స భక్తి వాత్సల్యాదులు గూడ రసములేయని వాదించువారు మనలో లేకపోలేదు. తర్కశాస్త్రము నోరు మూసినను హృదయమును మాయజాలదు. కావున, కవి తన భావనాబలముచే తనకు గలుగు వివిధములగు శోకము, మోహము, అసూయ, ద్వేషము, సంతోషము, ప్రణయము మొదలగు భావము లనబడు చిత్తవికారముల మూలమున వర్ణింప వలసిన పదార్థముల స్వరూపమును నిర్ణయించి, విగ్రహమును (ఏ విగ్రహమైనను సరే) సరళమగు భాషతో దీర్చి యెదుర నిలిపినపుడు, రసానుభవ సంస్కారము గల సహృదయుల కట్టి మనో వికారములే కలిగి, అవి యెట్టివైనను, శిల్పమందు గల యొకానొక యనిర్వచనీయమయిన మహిమచే ఆనందముగా బరిణమించును. ఆ యర్థమందే ప్రకృతము రసపదమును నే నుపయోగించెదను. అది యున్న విధమును పలకపై సుద్దతో వ్రాసి చూప సాధ్యము గాదు.

కవిత్వ సామాన్యమున కది ప్రాణము. కవి దానిని దీర్చినట్లెల్ల నందుకు దగిన మర్యాద బొందును. తక్కిన గుణములు, అలంకారములు, రీతులు, పాకములు మొదలగు సర్వశబ్ద ధర్మములన్నియు నా భావ ధర్మమున కుపస్కారకములు గాగలవు గాని దాని తరువాతివి. వానిని చక్కగా నిర్వహించుటచే గూడ నొక యానంద ముదయించును. కాని అది రసముతో దులదూగదు. వీనిని గూర్చిన యొండు రెండు లోపములను గమనింపక పోవచ్చును. కాని మూల మగు రసమున లేశమాత్రపు విఘ్నము గలిగినను రసికులు సహింప లేరు."

మానవతా దృక్పథ మన నేమియో, కవిత్వమన నెట్టిదో తెలిసికొంటిమి. "నవ్యాంధ్ర కవిత్వము" అని యనుచున్నాముగదా! దానికి మొద లెక్కడ? పాశ్చాత్య సంస్కృతితో పొత్తు ఏర్పడిన పిదప, నిద్రాణమయిన భారత దేశములో జాగృతి మొదలయినది. ఈ జాగృతికే సాంస్కృతిక పునరుజ్జీవనమని పేరు. ఆంగ్ల భాష రాజభాషయై, బోధన భాషగా అవతరించినది. విద్యావంతుల కహార మయిన యాంగ్ల భాష స్వాధీనమయినది. వారి కొక తేజోలోకము కన్పట్టినది. వా రాంగ్ల సాహిత్యమును తరచి తరచి చూచి నూతన భావ సంపదను కొల్లగొట్టిరి. పాశ్చాత్య సాహితీ సంబంధము ఇతర దేశ భాషలకు మాదిరిగా తెలుగునకు కూడ వికాసమును కల్గించినది. ఆ వికాసము మొదలయిన నాడే నవ్యాంధ్ర కవిత్వమునకు నాంది పలుకబడినది. ఆ పాశ్చాత్య సాహితీ ప్రభావమును రవీంద్రు డొకచో ఈ క్రింది విధముగా వర్ణించెను:

"When we first became acquainted with English literature, we gained from it not only a new wealth of emotion but also the will to break man's tyranny over man. Our ears rang with the proclamation abolishing the shackles of political slavery. And there was the stern challenge to the attempt to turn human labour into an economic commodity. This was a novel point of view. We had taken it for granted that the accident of birth or the fruits of action pursue us from our past lives and could never be disowned; that the resultant sufferings and the indignities of an inferior status had to be meekly accepted; and our lot could change only thro' an accident of rebirth. Even to-day, in our educated circles, there are people who believe in resisting political denials but ask us to be reconciled to the insult of social and religious disabilities. They forget that the habit of submitting to conditions into which one is born as predestined and inevitable is the strongest link in the chain of our political servitude. However, our contact with Europe has awakened us to the universal laws of cause and effect; and it has given us a set of values of against which scriptural dispensation and age old convention declaim in vain. It is on this ground that we take our stand in trying to improve our political status inspite of all our short comings. If, today, we challenge our rulers with demands which we would not have dreamed of presenting to a Mughal Emperor, it is because of the ideal voiced in the words of the poet: "a man's a man for a' that".

## 2

ఈ విధమయిన సాంస్కృతిక పునరుజ్జీవనము ననుసరించి విద్యావంతులు, ప్రజ్ఞామూర్తులయిన తెలుగు వారు సాహిత్య సృష్టి చేయుటకు పూనుకొనిరి. ఆ సాహిత్యము నందలి యేకదేశమునందు ప్రతిబింబించిన మానవతా దృక్పథమును పరామర్శించుటయే యీ వ్యాసము లక్ష్యము. సాంఘిక రాజకీయోద్యమముల రాపిళ్లకు లోబడ్డ కవులనేకులు, పరిణామములను గుర్తించి, కళాత్మక రచనలు చేసిరి. ఆ యుద్యమముల ప్రభావము, ఆ పరిణామ స్పర్శ దాదాపు ఒక శతాబ్దము పాటు వెలువడిన అనేక సాహిత్య ప్రక్రియలలో కన్పించును. సకల సాహితీ ప్రక్రియలలో ప్రతిబింబించిన మానవతా దృక్పథమును దర్శించుట యీ వ్యాసమున సాధ్యము గాదు. ఛందోబద్ధములయిన, ఛందోబద్ధములు కాని కావ్యముల సమీక్ష చేయుట యీ వ్యాసము యొక్క పరిధి యని చెప్పవచ్చును. పలు రకములయిన కావ్యములు పరశ్శతములుగా ప్రభవించినప్పటికీ, ప్రధానములయిన వానిని పరిశీలించుట సులభము. అంతమాత్రమున ఇతర కావ్యముల నుపేక్షించిన ట్లూహించుట సహృదయతకు లక్షణము గాదు.

## 3

ప్రాచీన నవీన సాహిత్యముల నడుమ యెంతో అంతరమున్నది. ఈ యంతరము బహిరంతరంగములతో ముడిపడినది. ఛందస్సులను

స్వీకరించుట సంప్రదాయ లక్షణమనియు, స్వీకరింపక పోవుట యభ్యుదయ లక్షణమనియు నొక ప్రవాదము చిరకాలమునుండియు సాహిత్యప్రపంచమున స్థిర పడినది ఛందస్సనునది కవిత్వమునకు కేవలము బాహ్య స్వరూపమే అట్లే వ్యాకరణ బద్ధమైన భాష వెనుకచూపునకు గుర్తనియు వ్యావహారిక భాష ముందు చూపునకు మూదలయనియు ననుకొనుట వాడుక యందునది శబ్దము కవిత్వమున సాధనము మాత్రమే ఆ బాహ్య స్వరూపము, ఈ సాధనము ప్రధానములు గావని చెప్ప వీలు లేదు కాని యీరెండింటికంటే కవియంతరంగము అతి ప్రధానము ఆ యంతరంగమున దర్శించుటకు రాజ మార్గము కావ్యము వస్తువు నెన్నికొనుటలో, సన్నివేశములను దిద్ది తీర్చుటలో, వర్ణనలు చేయుటలో, పాత్రలచేత పలికించుటలో కవియంతరంగము —లక్ష్యము— బయట పడుచునే యుండును. ఇట్లనుకొనిన గాని, నవీన కవులను నడిపించిన మానవతా దృక్పథమును కనుగొనలేము

శరవేగముతో మారుచున్న సంఘములోనివారు గావున, నవీనకవులు పరిణామమునకు స్వాగతము పల్కిరి ఆయా యుద్యమములు తల యెత్తినపుడు తమ హృదయము స్పందించినట్లుగా సంఘప్రతినిధులై కావ్యగానము చేసిరి ఇట్టి పోకడ ప్రాచీన కవులలో కానరాదు రెండు వేలేండ్ల యీ లోపల తెలుగు మాగాణమున ఎన్నో మార్పులు జరిగినవి ఆమార్పులు ఆకవుల గుండెలలో ఎట్టి స్పందనము కలిగించినవో మనకు తెలియకుండునట్లు చేయుట యాకవుల దోషమని నా యభిప్రాయము గాదు ఆనాటి జాతిని, నడిపించిన శక్తులు వేరు మతము, రాజ్య వ్యవస్థ, ధర్మశాస్త్రము లానాటి ప్రబల శక్తులు ఈనాడా శక్తులను ద్రోసిరాజన్న శక్తులు గలవు వానిలో ప్రబలశక్తి మానవతా దృక్పథము

వస్తు స్వీకారమునందు, తన్నిర్వహణమునందు ప్రాచీన నవీనకవులు భిన్న మార్గములలో ప్రయాణించిరి ప్రాయికముగా ఆనాటి కావ్య వస్తువు అమానుషము. అతిలోక మహిమలు చూపునది. ఆకావ్యముల యందలి పాత్రలు అద్భుతావహములై భక్తిని గల్గించునవి. శివకవులు వ్రాసిన గ్రంథములు, కాశీఖండ శివరాత్రిమాహాత్మ్య పాండురంగ మాహాత్మ్యములలోని కొన్ని యుపాఖ్యానములు, నిరంకుశోపాఖ్యానము వంటి ప్రబంధములు చారిత్రక సాంఘికేతివృత్తములతో కూడినవి కావచ్చును గాక! కాల ప్రభావమును బట్టి వాని యందును, అమానుషాంశములు చోటు చేసికొన్నవి ఇక దేశి కవిత్వము పామర కవిత్వమను బిరుదును పొందినదే తప్ప శిష్టులనబడువారి యాదరణమునకు పాత్రము కాలేక పోయినది నవీన కవులలో ఎక్కువమంది చారిత్రక సాంఘికేతివృత్తములను స్వీకరించిరి ఏదేశ చరిత్రయందైన, ఏ దేశసంఘమునందయిన ప్రజల కాదర్శమూర్తులుగా నుండదగు వారి కథ లెన్నో యుండును. ఆయాదేశముల కవులు వానిని గ్రహించి కళామయములుగా చేసి, స్వదేశీయుల నలరింతురు ఇట్టి పద్ధతి నవీనకాలమునందు ప్రచలితమయినట్లుగా ప్రాచీన కాలమున కాలేదు

తిరుపతి వేంకట కవులు ప్రాచీన కవిత్వమునకు భరతవాక్యము, నవీన కవిత్వమునకు నాందీ వాక్యము పలికిరని యొక విమర్శకు డుగ్గడించెను. తిరుపతి వెంకట కవులు పద్య కవిత్వమును ప్రజలలో బహుళ ప్రచారము చేసిరి. రాజాస్థానములకు పరిమితమయిన కవిత్వమును రచ్చలకు తెచ్చిరి. భాషా విషయమున పలుపోకడలు పోయిరి వారే మనిరో చూడుడు —

కాలము బట్టి, దేశమును గాంచి, ప్రభుత్వము నెంచి, దేశభా
షాలలితాంగి మారుటది సత్కవి సమ్మతమౌట, నన్యదే
శ్యాలును నాంధ్ర భాష గలవౌటను, నౌచితి బట్టి, మేము క
బ్బాలను వాడుచుంటి, మవి పండితు లేగతి నొప్పకుందురో!

ఈ భాషాప్రయోగమునకు దీటువచ్చునది వారి నిరాఘాట కవి— శయ్య వారు బుద్ధచరిత్రము వ్రాసిరి. శ్రవణానందాది సాంఘిక ప్రబంధములు వ్రాసిరి కాని వారి యాత్మ నానా ప్రాచీన సంప్రదాయములవైపు మొగ్గినది ఇతివృత్త నిర్వహణమున నేమి, లక్ష్యమునందేమి తిరుపతి వేంకటకవులది పురాణ మార్గము బుద్ధ చరిత్రాది కావ్యములను "సౌందర నందము"తో పోల్చి చూడుడు. గురుశిష్యుల యంతరంగ మిట్టే తెలియును. తిరుపతి వేంకట కవులు భాషా పరిణామమును గుర్తించినంతగా భావ పరిణామమును అంగీకరింప లేదు. వారు ప్రాచీన కవిత్వమునకు భరతవాక్యము నవీనకవిత్వమునకు నాందీ వాక్యము పలికిరన్నపుడు, దానికి భాషాశయ్యాపరముగనే వ్యాఖ్యానము చెప్పుకొన వలయునే కాని భావ పరిణామ పరముగా గాదు. పరివర్తనము చెందుచున్న సంఘమునందు బహుజన సుఖమును, బహుజనహితమును కల్గించు భావము లనియే యిచట భావము లనువాని కర్థము. ఒక్కసారి మొదట నిర్వచించిన మానవతా దృక్పథమును బరిశీలింపుడు.

వంగదేశమునకు రాజా రామ మోహన రాయల వలె ఆంధ్రదేశమునకు కందుకూరి వీరేశలింగము గారు "నవీన మానవుడు" వారు ప్రధానముగా సాంఘిక సంస్కర్త సారస్వతము వారి సాంఘిక సంస్కరణమునకు సాధనము. వారు భిన్న సాహిత్య ప్రక్రియలను వ్రాసిరి వా రేది. వ్రాసినప్పటికి అందు ఉపదేశము ప్రధానము. కళ గౌణము. మరి సాహిత్యము— కవిత్వము—కళానిలయము. శిల్పమయమయిన సృష్టి చేయలేకపోవుచున్నాడనే యని వీరేశలింగముగా రనుకొన్న రోజులు లేకపోలేదు వీరేశలింగము గారి చేత సారస్వత వ్యవసాయమును జేయించినది వారి మానవతా దృక్పథమే అది రసమయమయిన సాహిత్య సృష్టికి త్రోవదీయ లేదు సాంఘిక సమస్యనే ప్రధానముగా చేసికొని సారస్వతసృష్టి చేసినచో ఆసమస్యల యభావమున, ఆసారస్వతము దేశకాలబద్ధమగును కావ్యమును త్రికాలాబాధితముగా చేయునది యందలి రసమయమయిన శిల్పము

భాషాభావములందు, వస్తుస్వీకారమునందు, దానిని కళామయముగా దిద్ది తీర్చుటయందు సరికొత్త బాటలు వేసినవారు గురజాడ అప్పారావు గారు. తెలుగు ఏలుకుబడిలో గల జీవమును గూర్చి నొక్కిచెప్పిన వాడాయన. కన్యాశుల్కము మాట యటుండనిండు. చిన్న కథలమాట చెప్పనేల? అరిష్ట దాయకముగా లోకము భావించు తోకచుక్కను "సంఘ సంస్కరణ ప్రయాణ పతాకగాన్" భావించుట అప్పారావుగారి క్రొత్తదనమున కుదాహరణము ఆనాటి ఛాందసులు అప్పటి సంఘసంస్కరణోద్యమములను తోకచుక్క వలని కీడుగా భావించిరేమో యని నా యనుమానము

"ఎల్లలోకము వొక్క యిల్లై
వర్ణభేదము లెల్ల కల్లై
వేల నెరుగని ప్రేమబంధము
వేడుకలు గురియు.
మతము లన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును
అంత స్వర్గ సుఖంబు లన్నవి
యవని విలసిల్లున్"

అని యాకాలమున ననుట యాయనకే చెల్లినది సంఘము నంగరి మత వ్రాత్యమును చీల్చి చెండాడుట యాయనకే చెల్లినది. ఈ క్రింది పంక్తులను చదువుడు.

మనిషి చేసిన రాయిరప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయిరప్పల
కన్న కనిష్టం.
గాన చూస్తావేల బాలా?
దేవుడెకడో దాగెనంటూ
కొండకోనల వెతుకు లాడే
వేలా?

9229

కన్ను తెరిచిన కానబడడో?
మనిషి మాత్రుడి యందు లేడో?
యెరిగి కోరిన కరిగి యీడో
ముక్తి!

మానవత్వము ముఖ్యమని, వర్ణభేదముల నతిక్రమించిన యుదార దృష్టిని భిన్న సాహిత్య ప్రక్రియలలో చూపుట యప్పారావుగారి యుగానుకూలమయిన హృదయమునకు నిదర్శనము. 'లవణ రాజు కల' యందలి సన్నివేశములు వారి నవయుగదృష్టిని జూపును. రాజులో అప్పారావుగారే కన్పింతురు. రాజు మాలెతతో నన్న మాట లప్పారావు గారివి గాక మరెవరివి? ఆమాటలివి:

మలిన వృత్తుల మాలవారని
కులము వేర్చిన బలియు రాక దే
శమున కొందరి వెలికి దోసిరి
మలినమే, మాల.

కులము లేదట ఒక్క వేటున
పసరముల హింసించువారికి;
కులము కలదట నరుల ప్రేవేడి
క్రూరకర్ములకున్

మలిన దేహుల మాల లనుచును
మలిన చిత్తుల కధికకులముల
నెలవొసంగిన వర్ణధర్మ మ
ధర్మ ధర్మంబే

మంచి చెడ్డలు మనుజాలందున
యెంచి చూడగ రెండె కులములు
మంచియన్నది, మాలయైతే
మాలనే, అగుదున్.

ఆకాలమును బట్టి యెంతో సాహసమున్న వ్యక్తిగాని యీ భావములను ఉక్తి వైచిత్రితో చాటలేడు. మలిన దేహులు మాలవారట! మలిన చిత్తులు అగ్రవర్ణముల వారట! హేతువాదము, సర్వమానవసౌభ్రాత్రము ఇట్టి వ్రాతలకు మూలపదార్థములు. దేశభక్తి గేయము పరిమితావరణములను బ్రద్దలు చేసి బయట పడి జాతీయతాదృష్టిని పెంచుకొనవలయునని ప్రబోధించుచున్నది. భాషా విషయమున అప్పారావుగారితో ఏకీభవింపలేని వ్యక్తియైన వారి భావములను ప్రశంసింపకుండలేడు.

ఈనాటివారు కట్టమంచి రామలింగా రెడ్డి గారిని విమర్శకునిగా పరిగణించినంతగా కవిగా చూడరైరి. ఇది న్యాయముగాదు. రెడ్డిగారు 1899 సంవత్సరములో ''ముసలమ్మ మరణము'' ను రచించిరి. ''ఈ చిన్న పొత్తము ముఖ్యముగా స్త్రీలకొరకు జేయ బడినది. వారి కుపయుక్తముగా నొప్పిన యెడల నా ప్రయాస సఫలత నొందినట్లే'' యని "ముఖపత్రము''లో రెడ్డిగారు పేర్కొనిరి. కావ్య వస్తువు సాంఘికము. 'అనంతపుర చరిత్రము'' నందలిది. ''అయినను గొన్ని యెడల రసాధిక్యమునకై నూతన కల్పనలు చేసినాడ'' నని వారే యనిరి. బుక్కరాయ సముద్రము నందలి చెరువు పొంగి పరవళ్ళు చేయుచుండగా "బసిరెడ్డికి గడ కోడలు ముసలమ్మ'' యూరి వారి సౌభాగ్యము కొరకు బలియైనది. త్యాగమహిమను ప్రబోధించు కథ యిది. ఈకథలో ఆకాశవాణి పలుకు కరుణ రస పోషణమునకు నను కూలము

ప్రాచీన నవీన కవితా సంప్రదాయములు మేళవించిన కరుణ రస కావ్యము ''ముసలమ్మ మరణము''. భావకవితాచ్ఛాయలిందు కథతో అతుకుకొని పోయిన మితితప్పని వర్ణనలు కలవు.

రైతుకుటుంబమునందలి యుత్తమ దాంపత్యమును ఆర్యజన వాత్సల్య వ్యక్తినాలు సరససంభాషణములు కలవు.

వలదని వారించు భర్తను ముసలమ్మ యీ క్రింది విధముగా ప్రార్థించుచున్నది. రెడ్డిగారి సంభాషణ రచనా చాతుర్య మిట్లున్నది:

హేయంబైన యిహంబువాసనలు మిమ్మేలాగునం గ్రమ్మె? నా
ధా యత్యద్భుతమయ్యె; సంతతము నే దైవంబుగాఁ గొల్వ మీ
రే యిట్లాడిన నేమి చెప్పఁగల? నన్నీసారికిం 'బోయిరా
పో'యంచుం దయ బంపవే! గుణనిధీ! యే నిన్ను బ్రార్థించెదన్.

రెడ్డిగారు హోమరునుండి కొన్ని భావములను స్వీకరించిరి తుది వీడ్కోలు పొందుచున్న ముసలమ్మ వర్ణనము హోమరు వర్ణనమున కనుకరణమే. అయిన నట్లుండదు.

అనుచున్ బిడ్డను గౌఁగిలించి, తమి మూర్ధాఘ్రాణముంజేసి, యొ
య్యన భద్రంబని ప్రాణనాథునకు దానర్పించి; యర్పించుచో,
దనకుం బట్టక వచ్చు బాష్పముల నాతం డేడ లక్షించి, యే
డ్పు గా యుం జానన మొందుదిక్కునకు నా శోభాంగి త్రిప్పెన్వడిన్.

కవిత్వము, చిత్రలేఖనము కలిసిపోయిన పద్యమిది ''శోభాంగి యనుటలో ముసలమ్మ జీవననిర్లిప్తత, త్యాగ రక్తి తేటతెల్లములగుచున్నవి

తరువాత వచ్చిన వందలకొలది లఘుకావ్యములకు, సహజవర్ణనానుయములకు, మానవతావాద నిర్భరములకు ''ముసలమ్మ మరణము'' ఎంతగా నాదర్శ మైనదో పాఠకులు పరిశీలింప వలయును.

దేశభక్తి, మూఢవిశ్వాసములను ఖండించుట, వర్ణ భేదములను కాదనుట, దేవుని చోటున మనుజుని నిలుపుట యప్పారావు గారికి యాదర్శములు త్యాగాది భావములను ప్రచారము చేయుట, కథలో రసానుకూలమయిన మార్పులు చేసి శిల్పమయముగా కావ్యము చేయుట రామలింగా రెడ్డిగారి కవితా లక్షణములు. ఈ మనీషుల మార్గములలో పోయి, సాంఘికదృష్టితో కావ్యములు వ్రాయు విధానములు బృహద్రూపములో వారి తరువాతి వారు వ్రాసిన కావ్యములలో సాక్షాత్కరించును.

నవ్యాంధ్ర కవిత్వమునందలి మానవతా దృక్పథము రెండు సిద్ధాంతముల నూతగా గొనినట్లు కన్పట్టక మానదు ఒక సిద్ధాంతము దేశీయమయిన గాంధీయ వాదమునకు చెందినది. రెండవ సిద్ధాంతము విదేశీయమైన సమసమాజ వాదము (Communism) వలు నాధారపడినట్టిది. మొదటి దానికి మహాత్ముడు ప్రవక్త. రెండవది మార్క్సు చేసిన భాష్యములమీద నిలబడినట్టిది. నవ్యాంధ్ర కవితా ప్రపంచములో నిరువురు కవులు ఆసిద్ధాంత ద్వయమునకు అక్షర రూపము నిచ్చిరి. ఆ కవులలో నొకరు తుమ్మల సీతారామమూర్తి గారు. రెండవవారు శ్రీరంగము శ్రీనివాస రావుగారు ఇరువురును పరమాభినివేశముతో తమ తమ కవితా సిద్ధాంతములను స్వకీయ కావ్యములలో చెప్పిరివారే గాంధీకవి యయిన సీతారామమూర్తిగారు 'ఆత్మకథ'' ''మహాత్మకథ'' యను మహావీర కావ్యముల రూపమున మహాత్ముని జీవితము నంతయు తెలుగునకు దించిరి. కట్టమంచి రామలింగారెడ్డి యన్నట్లు సీతారామమూర్తిగారు మహాత్ముని యాస్థాన కవి. వారు ''ఆత్మకథ'' ను వ్రాయుటకు గల కారణములను ఈ క్రింది విధముగా చెప్పిరి.

ఏమూరినో పేరినో సుబ్బినో నిల్పి
పచ్చిసింగారంబు పల్కు కంటె
హేతువాదమ్మున కింత నిల్వంగ లేక,
బూతుల బుంగలై, జాతి వైర
ములకు, మతద్వేషముల కుపాధ్యాయులై,
యీయాదార్యమునకు దవ్వగుచు, నీతి
రతుల కెంతయు రోఁత రాజేయునట్టి పు
రాణమ్ములన్ బూని వ్రాయుకంటె
గాసులకు దాసుడగుచు ముక్కడిని బొగడి
కల్లకైతల వల్లించుటకంటె, నిట్టి

గుణగరిష్ఠుల దేశభక్తుల చరిత్ర
చెప్పుట జగద్ధితంబైన చేతగాదె.

బాపూజీ యంతరంగమూర్తికి ఎందరో గద్యపద్యరూపమున వ్యాఖ్యానములు చేసిరి. చేయుచున్నారు. సీతారామమూర్తి గారు దర్శించిన మహాత్ముని స్వరూప మిట్లున్నది.

ఉత్తమ వాగ్మినా నొప్పారె నురక గ
ర్జించియా కాదు, వర్షించి నుడులు
అఖిలోక బల సమంచితుఁడయ్యె గండలు
పెంచియా, కా దణయించి యొడలు
విరజయశ్రీ ధురంధరుఁడయ్యె రిపుల ఖం
డించియా కాదు, వండించి కృపలు
అమృతత్వ మందె యాగము లాచరించియా
కాదు, నిష్కామ యోగము వరించి

యతఁడు సామాన్యుడెట్లు? వీరత కపూర్వ
జీవములు వోసి, వాసి దెచ్చిన మహాత్ముఁ
డతని నడచిన బాటలయందు నడిచి
వందయును విక్రమ శ్రమా వ్రందుఁడయ్యె.

మహాత్ముని యీ మూర్తి, యాయన ప్రభావమునకు లోవడిన వారి కావ్యములలో వివిధ భూమికలతో గోచరించుట విమర్శకులకు తెలిసిన విషయమే

శ్రీశ్రీ ది క్రొత్త గొంతు. ఆయన ప్రతిపాదించిన భావము లాంధ్ర సాహిత్యమున నాయనకు ముందు కానరావు. మార్క్సు సిద్ధాంతములను వేడి పుట్టునట్లు వాడిగా కవితలో వ్యంగ్యముగా నెలకొల్పుట శ్రీశ్రీ ప్రత్యేకత. ఆయన కవితా సిద్ధాంతము—కాదు ప్రతిజ్ఞ—యిట్లున్నది.

"... కావున లోకపు టన్యాయాలూ,
కాల్చే ఆకలి, కూల్చే వేదన
దారిద్ర్యాలూ, దౌర్జన్యాలూ
పరిష్కరించే, బహిష్కరించే
బాటలు తీస్తూ,
పాటలు వ్రాస్తూ,
నాలో కదిలే నవ్యకవిత్వం
కార్మిక లోకపు కల్యాణానికి
సమర్పణంగా,
సమర్చనంగా,
త్రిలోకాలలో,
త్రికాలాలలో,
శ్రమైక జీవన సౌందర్యానికి,
సమానమైనది లేనే లేదని
కష్ట జీవులకు
కర్మ వీరులకు
నిత్య మంగళం నిర్దేశిస్తూ
స్వస్తి వాక్యములు సంధానిస్తూ
స్వర్ణ వాద్యములు సంరావిస్తూ
వ్యధార్త జీవిత యధార్థ దృశ్యం
పునాదిగా ఇక జనించబోయే
భావి వేదముల జీవనాదములు
జగత్తుకంతా చవులిస్తానోయ్!!

కష్టజీవుల, కర్మవీరుల కల్యాణమును కాంక్షించువాడే కవి దారిద్ర దౌర్జన్య రహితమైన సమాజమును స్థాపింపగా తపించువాడే కవి. ఈ భావముల కాలంబనమయిన భాషాచ్ఛందస్సులను గూర్చి సైతము శ్రీశ్రీ వక్కాణించెను.

"... నావిన్నవి కన్నవి విన్నవించగా
మాటలకై వెదుకాడగ బోతే—
అవి,
పుంఖానుపుంఖంగా
శ్మశానాలవంటి నిఘంటువుల దాటి
వ్యాకరణాల సంకెళ్లు విడిచి
ఛందస్సుల సర్ప పరిష్వంగం వదలి—
వడిగా, వడివడిగా
వెలువడినై, పరుగిడినై, నాయెద నడుగిడినై!"

ఈ రెండు ఖండములు శ్రీశ్రీ కవితామార్గము యాయునకు వేదోపనిషత్తులయినవి. ఈ వేదోపనిషత్తులు సంపూర్ణ సత్యమునకు చిహ్నములు గావని వాదించినప్పటికి, నవ్యాంధ్ర కవిత్వము మీద వాని ప్రభావమును గాదనుటకు వీలు లేదు.

## 4

గుఱ్ఱాలకు రెక్కలు గల
వైరియుగాల్ దాటిపోయె, విజ్ఞానంబున్
బుఱ్ఱగల గాంధి యుగమిది
కఱ్ఱలు ఖడ్గంబు లేలగా లేవు ప్రజన్.

అని జాషువాకవి చాటెను. గాంధేయవాదము నవీన కవిత్వమునకు మత్తేజ మొసగినది. హిందూమతమునందలి దురాచారములలో వర్ణ వ్యవస్థ మొదటిది. ఆ వ్యవస్థ వేసిన చిలిపి మొలకలలో అస్పృశ్యత యొకటి. బాపూజీ దీనిని మొదలంట త్రుంచి వేయవలయునని భావించి, పంచములకు "హరిజనులని" పేరు పెట్టెను. ఆ పేరే యీయుగపురుషుని యావేదనమును చూపున్న. హరిజన దేవాలయ ప్రవేశము బాపూజీ ప్రవచించిన సూత్రములలో ముఖ్యము. ఈ హరిజనులను గూర్చి తెలుగు కవులు కవిత్వము వ్రాసిరి. "గబ్బిలము" లో జాషువాకవి "అరుంధతీ సుతుడు" "భరతోర్వరకుక్కు గడగొట్టు బిడ్డడై" న వాని దౌర్భాగ్యస్థితిని గుండెలు కరుగునట్లు వర్ణించెను.

వాని తలమీఁదఁ బుఱిమిన పంకిలమును
గడిగి కరుణింప లేదయ్యె గగన గంగ
వాని నైవేద్యమున నంటు వడిన నాఁడు
మూఁడు మూర్తులకును గూడఁ గూడు లేదు.

పాముసకుఁ బాలు, చీమకుఁ బంచదార
మేపుకొనుచున్న కర్మ భూమిం జనించు
ప్రాక్తనంబైన ధర్మదేవతకుఁ గూడ
నులికి పడు జబ్బు గలదు వాఁడున్న చోట

వాని నుద్ధరించు భగవంతుఁడే లేఁడు
మనుజుఁ డెట్లు వానిఁ గనికరించు
వాఁడు జేసికొన్న పాపకారణ మేమొ
యింతవరకు వాని కెరుక లేదు

ఆ యభాగ్యుని రక్తంబు నాహరించి
యినుప గజ్జెల తల్లి జీవనము సేయుఁ
గసరి బుసగొట్టు నాతని గాలి సోఁక
నాల్కపడగల హైందవ నాగరాజు.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములను నాల్గు పడగలు గల హిందూ మత సర్పము పంచములను జూచినంతట బుసగొట్టిన మాట యెవ్వరు కాదనరాని నిజద్దీ. మరి హరిజన దేవాలయ ప్రవేశమును గూర్చి కాటూరి వేంకటేశ్వరరావుగారు రమణీయ కావ్యమును వ్రాసిరి దాని పేరు "గుడిగంటలు". అది హరిజనోద్యమమునకు వీర శంఖము. వేంకటేశ్వరరావుగారు హరిజనులకు

కొలువు దయ చేయువలయునని గుడి గంటలు మ్రోగించి వేంకటేశ్వరస్వామికి మేలుకొలుపులు పాడిరి. వారు హరిజనుల దుర్భర జీవన స్థితిని వర్ణించిరి. వారా శేషశైలవాసున కీ విధముగా చెప్పిరి.

చీఁకటి కొంపలో బ్రదుకు, చింకితలల్, మెయిఁ గాటిపోఁత, పె
ల్లాఁకటి కింత సంకటియు నంబలియున్, జవి కింత యుప్పుగల్
నేఁకటి కింత చప్పిడియు, వేఁకికిఁ బస్తులు నైన వీరిపై
నీ కరుణాకటాక్ష రస నిస్సరణమ్ములు పొంగిపారుతన్.

అంతేగాదు. సమాధానము చెప్పలేని రీతిగా నిలదీసి వేంకటేశ్వరస్వామి నిట్లడిగిరి.

ఎన్నేండ్లాయె నో కొండపై వెలసి సామీ! నీవు, నిత్యమ్ము నా
పన్నుల్ వత్తురు, నీవు నిత్తువు గదా భద్రమ్ము; లీనాఁటి ద
న్కన్నీ వాఁకిలి ద్రొక్కి, యీ హరిజనుల్ కైసాచిరే ? వీరలన్
జిన్నం బుచ్చుట దొడ్డ వేలుపుల కిస్సీ వన్నెయో వాసియో!

ఒరగం బండిన పంటచేలఁ గనరా, పుర్వీశ్వరాస్థానముల్
జొరఁబో, వంగడి బేర సారములలోఁ జూపట్ట, వీ యంత్ర మం
దిర నిర్ఘోషలలో వినంబడవు, తండ్రీ! వీరి పాలింటి కీ
గిరి శృంగమ్మున గూడ లేవయితివే, కీడెంచి మేలెంచవే!

పాపీ! వేంకటేశ్వర స్వామికి పంచములతోడి పొత్తు లేదా? ఎందుకు లేదు? వారి కష్టమును భుజించుచునే గదా యా దేవరయంగరంగ వైభవములు పొందు చున్నాడు! దానినే కవిగారు పరమ రమ్యముగా జెప్పిరి.

ఆలం గాచును, క్షీరముల్ పిదికి నీ కర్పించు; ముక్కారులున్
జేలం బైరులు పెంచు, నీ గరిసెలన్ నిండించు ధాన్యమ్ము; లి
ట్లాలుం బిడ్డల కొక్కప్రొద్దు లిడి నిన్నర్చించు ముప్పొద్దు; ప్రా
ల్మాలం డిన్నఁడు మాలఁ, డాతనికి నేలా మోము చూపింపవో!

తిన్నాఁడో, ప్రస్తులే యున్నాఁడో, ముప్పొద్దు
గుడువఁ బెట్టును నీకుఁ గడుపు నిండ
కట్టెనో, మైగోచి పెట్టెనో, దువ్వలు
వలు దెచ్చి నీ కిచ్చుఁ దలకు మొలకు
నీరాడెనో, ధూళి పొరాడెనో, సుగంధి
నీరమ్ము లార్చు నిన్ రేపు మాపు
ఎండెనో తడిసెనో, ఎండవానలు సోఁక
కుండ నీ కిడు గుళ్ళు గోపురములు

నేడు కాదుగదా యితం డూడిగమ్ము
సలుపు, టొకనాఁడు గోరిక దెలియ నడుగఁ;
వడుగ వచ్చిన గుడి దూరి గడియవైచి
కూరుచుంటివి కొండెక్కి గొప్పదొరవు

కవిగారు మర్యాద దక్కించుకొనుమని వేంకటేశ్వరస్వామికి ప్రబోధనము (**Warning**) చేసిరి.

భయమే యీ గిరిమీఁద నిన్ నిలిపె, నాపన్నగ్నులే వచ్చి నీ
దయ లొక్కమ్మిడి విల్తు; రేమిపుడు ప్రత్యక్ష ప్రమాణాగమా
ధ్యయనాగారములందు దేల్చితిమి నీ తత్త్వమ్ము నల్లంత; వెంక
కయ సామీ! తొలి నాళ్ల బోలె నిక సాగంబోవయా భోగముల్!

ఈ హరిజనుల విషయమున జాషువా కవిది యాత్మాశ్రయ కవిత్వము వేంకటేశ్వరరావు గారిది గాంధేయ వాదములో మునిగి తేలిన పరాశ్రయ కవిత్వము.

గాంధి తత్త్వము వ్యంగ్య రూపమున గల మహా కావ్యము ''సౌందర నందము '' ఇందు సుందరి, నందుడు నాయికా నాయకులు నందుడు ''కాంతి నిస్తంద్రుడు'' ''కోడెప్రాయపు టందగాడు '' సుందరి ''సార్థకాఖ్య.'' ''వడ పుల రాజహంస, తెలి నవ్వుల వెన్నెల వాక, ప్రేమ లూరెడు నును బల్కు దేనెపెర, రెమ్మలు వైచు విలాసవల్లి, వ్రేల్మిడి హృదయమ్ము నచ్చి చను మేలిమి చూపు సుమాస్త్రము.'' నందుడు "పొతరలాడు తద్భ్రుకుటివల్లి యొటుల్ చ యించునట్టులన్ జేతము తాండవింప ''విశ్వమెల్ల'' ''మరచెన్''.

ఆ జంట యొక్క యతిలోక శృంగారమును కవిద్వయ మీ విధము వర్ణించినది:

పలుకుల్ సేతలు నెమ్మనమ్ము లొకటై, భావింపగా రాని కూ
ర్మల పేర్మల్, వలకాకలన్ గసరుటల్, రోషారుణాక్షమ్ముగా
దిలకింపన్ బతిమాలుటల్, పులక లుద్దీపింపగా జేయు ము
ద్దులు గిల్గింతలు కౌగిలింతలును ప్రొద్దుల్ పుచ్చు నా జంటకున్

బ్రతుకు నిక్కమ్మయేని యవ్వారి పట్ల
విరతి లేని స్వప్నమ్ముగా జరుగ బోలు
బ్రతుకు నిక్కముగాక స్వప్నమగునేని
సత్యమై తోపబోలు నా జంపతులకు.

ఆ సుందరీ నందు లిట్టివారు. బుద్ధ భగవానుడు "ఉడురాజోపల ఘట్టనా నుభగమై వ్యోమమ్ము జుంబించు మేల్ పడకింటన్ లలితోపభోగకలనా పారీణు" లైన సుందరీనందులను "వెలివాడ చక్కటిన్" గల "ఒక గుడిసెలోనికిన్" చేర్చెను. ఆ వెలివాడ యెటువంటి దనుకొన్నారు? చూడుడు

చితచితలాడు నీరమున జేపల కంపున బంది ముట్టెయల్
కలికెడి చప్పరింపులను, గైకుయిలాడెడు కుక్క కూతలన్
బ్రతి నినదించు దర్దుర రవమ్ముల, నీదరమ్రోతలన్, దరి
ద్రత తలపేలు గ్రుక్కికొను తావులలో వెలివాడ చక్కటిన్

అశ్వఘోషుని "సౌందరనందము" తుది భాగ మిట్లున్నదా? గాంధేయ వాదము యిట్టి కావ్యాంతమునకు కారణము. వ్యక్తినిష్ఠమయిన ప్రణయము లోకనిష్ఠమయినది. ఇంకను జెప్పవలయునన్న దీనజనజాతి నిష్ఠమయినది

సౌందరనందము నందలి "ఉపదేశము" "ధర్మ సంవాదము" అను సర్గములు మానవతా దృక్పథమునకు ఆటపట్టు సమకాలిక సాంఘిక మతోద్యమముల తాకిడి వల్ల కవులు తమ పాత్రలచేత నెట్లు పలికింతురో చూపిచెప్పుట కాసర్గములు ప్రబలోదాహరణములు. సుందరీనందులకు రాగరంజిత ప్రపంచము వినా మరియొకటి తెలియదు. భోగలాలసుడై సూర్యోదయాస్తమయములు గుర్తింపనేరని రాచబిడ్డకు అన్యప్రపంచమును కన్నులకు గట్టినట్లు బుద్ధ భగవానుడు చూపెను. ఆ ప్రపంచ మిటున్నది.

వకనకలాడు పొట్టకు నింత గంజియే —
నొదవని నిరుపేద యుమ్మలికయు
వేకి యెత్తిన మందు మాకు పథ్యము పాన
మరయు వారలులేని యనదమూల్గు
అస్త్ర జర్జరితాంగులై రణక్షోణి ది
క్కరి యేడ్చు వారి యాహారవమ్ము
పతివియోగం బేకసుత వియోగము జత
యై పొక్కు నిర్భాగ్యురాలి కూయి

అంధ పంగ్వంధులగు వికలాంగు లెల్ల
సలుపు గగ్గోలు నేకమై జగతి, శోక
భీకర మహాంబునిధి యవుచు, విరతి లేక
యడలు చుండగ జెవి దూరదా కుమార!

ఆకలిసెకకు గాయమున మాంసాదులు
హరియించిపోవ, శల్యములు మిగిలి
పొలుసెత్తి, పాలి, కన్నుల గుంట లేర్పడి,
బోరయెండగ, బొజ్జ బూరటిల్ల
బుడకకాళులతోడ నడయాడు చల్లన
బెరటి లోనికి వేగి, బిడ్డ డచట

ఇంటి పెళ్లలు దినుచుంట గన్గొనియును
వలదని వారింప వాకు రాక

కుత్తుకన్ నల్ల పూసయు, గుండలోన
వడ్ల గింజయు, గనుల బాష్పములు లేక
కడుపు చుమ్మలు చుట్టగా నడలు చున్న
తల్లులం గాంచవో నీవు తమ్ముగుఱ?

అవియున్ గుండెలు రాతికైన గనుమన్నా! విశ్వదైన్యమ్ము; చా
లవు నీర్వెట్టగ వేయికన్నులు; భుజాలక్షల్ వలెన్ బావ కూ
ప విపన్నాత్ముల నుద్ధరింప; వెత బాపన్, సేద బోకార్ప, మై
నివురన్, బాష్పజలమ్ము బోదుడువ దండ్రీ! లెమ్ము సజ్జుండవై

మరి నందుడును మేదకుడు గాడు. ఆయన సిద్ధాంతము లాయన కుండునే యున్నవి. పూసగుచ్చినట్లుగా నందుడు తన ప్రణయ సిద్ధాంతమును వివరించెను.

చింతల్ సేరని తా, వుదారగుణముల్ శిక్షించు నాచార్యక,
మ్మంతశ్శత్రు సమాజమున్ దొలచు దివ్యాస్త్రంబు, నద్వైతభా
వాంతేవాసి, కృపాలతల్ మొలచు పా, దానంద విష్యంది, స
ర్వాంతర్యామి గదా, మహాప్రణయ భావావేశమో గౌతమా!

నాకీలోకముతో జనేమి విను మన్నా! పాలమున్నీటిలో
నేకాంతమ్మగుచో ప్రవాళములచే నేపారు ద్వీపమ్ములో
నాకుల్ రాలని పూలువాడని వసంతారామమధ్యమ్ములో
రాకాచంద్ర సహస్రముల్ వెలుగు హర్మ్యాగ్రమ్ము నందొక్కటన్

నాకున్ ప్రాణము ప్రాణమైన చెలితో, నానాసుఖమ్ముల్ లతా
నీకమ్మై పెనగొన్న డోలికలలో, నిఃఖేద దివ్యామృత
స్వీకారమ్ము భజింపుచున్, సమయముల్ సీమల్ వెసన్ దాటి, యే
కాకారమ్మును నిత్యమై నెగడు న య్యానంద మర్చించెదన్

ఈ ప్రణయ సిద్ధాంతమును భగవాను డొక్క దెబ్బతో కొట్టివేసెను 'కామ సంప్రీతి ఘటింపుచున్న' "క్రోతులజంట"ను జూపి యా "సౌఖ్యమునకున్ సుత! యేమని పేరు పెట్టెదో?" యని యడిగెను ఇంకా నిట్లు చెప్పెను.

ఆ చాన తత్కపికి నందపు బెన్గని, నీలతాంగియున్
నీకు వరాలమూట, మరి నిర్జరకాంతల నిత్యయౌవనా
స్తోక విలాస విభ్రమరుచుల్ చవిసూచిన, దక్కురూపముల్
చీకటి తోడబుట్టువు లిసీ! యనిపించుఁగదోయి, కంటికిన్.

తనయా! తాదృశమైన యచ్చరల సౌందర్యమ్మునున్ నాశమై
చను, ప్రేమింతువు నశ్వరమ్మయిన యాచక్కందన మ్మేవు, ని
త్యనవీనమ్మన, నాత్మభోగ్యమును, సత్యంబైన సౌందర్యమున్
గనరాదే? విషయ ప్రపంచమున గాంక్షల్ పండ వెవ్వారికిన్

"ఈ ముజ్జగమ్ము నాత్మసంసారముగ నెంచు నలఘు చరిత కాస్పదుం డౌట లెస్స నీయట్టివా"డని కనువిప్పు కలిగించెను "మమత్వ దోషమ్మె శోక కారణమ్ము సుమ్ము" "మమత లేనట్టి ప్రేమ నిత్యము, కుమార!" యని నొక్కి వక్కాణించి, చివరకు మానవజీవనలక్ష్య మిా క్రింది విధముగా ప్రతిపాదించెను

"తా" నొక గడ్డకట్టుకొని, తత్పరతన్ శిలలై నశించు న
జ్ఞానుల కేడనోయి! సుఖసంగతి, తా, దనయాలు, నాత్మసం
తానము, తోడఁబుట్టువులు, తల్లియుఁ దండ్రి, కులమ్ము,దేశమునౌ
మానవు, లెల్లప్రాణులు కుమార! సమస్తముఁ దాను గావలెన్

కొడుకులుఁ లేనివారలకు గూరిమి బిడ్డవు, మాతృహీనులౌ
బుడుతలకెల్లఁ దల్లివయి పోషణ సేయుము, "నా" యనంగలే
కడలెడు దీనులన్ మనువు, మార్తుల కాదరువై భజింపు, మీా
పుడమి దివమ్ము సల్పు మిదె పో, పరమార్థము బౌద్ధ జాతికిన్

విన్ను గృహమ్ము వీడుమని నేవచియించుట కర్థమిట్టిదో
యన్న! మమత్వ శూన్యమును, వ్యాజవిహీనమునైన ప్రేమవే
నెన్నఁడు కాదనన్ . . . . . ."

మమతా వ్యాజవిహీనమయిన ప్రేమ లోకములో సాధ్యమా? ఎందులకు సాధ్యముగాదు? పురుషకారము గావలయు నంతే! నిరక్షరాస్యులగు వారిలో సైతమిట్టి వారెడనెడ ఏ కాలములో నయిన నుందురు "విజ్ఞానము" పెరుగుటచే అట్టి ప్రేమ యసాధ్యమని యూహించుచున్నారము నందుని హృదయము మారినది

సుందరిలో విషయలాలసతాక్షాళనము—అంతరంగమథనము వలన—సంభవించినది ఆమెయు ఆర్తత్రాణ పరాయణయైనది.

విడుదులు గావించు వీధులఁ దిరుగు గో
శ్వానమ్ములకు గృహోద్యానమందు
నింటింట బిచ్చము నెత్తు పంగ్వంధుల
రావించి తన మందిరమున నిల్పుఁ
బథ్యపానములంపు జ్వరితుల, కెచరించి
వెజ్జుల ప్రణితుల వెతలు మాన్పు
మృత్యువు సొచ్చిన గృహము, లదృష్టదే
వతవోలె- జొచ్చి దుఃఖితుల నోము

నాడు నాటికి సహ మనాథబాల
కులకు విద్యాలయమ్ము, రుగ్ణులకు వైద్య
శాలయై ధర్మదేవత కాలయమ్ము
నగుడు- దానందుఁ బూజరి యయ్యె నబల.

ఇది సౌందరనందకావ్యము యొక్క మూలద్రవ్యము. అది బౌద్ధగాథ గావచ్చును కాని దాని కుద్బోధకమయినది సమకాలిక గాంధేయవాదమని కావ్య స్వరూపమే చెప్పుచున్నది. మానవ సేవా విషయమున బౌద్ధమతమునకు గాంధేయ వాదమునకు తారతమ్యము గానరాదు మరొక్కమాట. సౌందరనంద గాథను వరూథినీ ప్రవరోపాఖ్యానముతో పోల్చిచూడుడు. మనుచరిత్ర సుందరి యాకథ భోగమునకు ధర్మమునకు నడుమ జరిగిన సమరము తుదకు ధర్మమునకు విజయము చేకూరినది సౌందరనంద గాథ భోగమునకు మానవ సేవకు నడుమ చెలరేగిన కయ్యము. ఇందు మానవసేవకు విజయము చేకూరినది. అచ్చమయిన బౌద్ధమతమను చిత్రమును గాంధేయవాదమను దర్పణము ద్వారమున బాహిరపుచ్చిన కావ్యము సౌందరనందము.

## 5

మానవజీవితము పూలపాన్పుగాదు సుఖదుఃఖాది ద్వంద్వములతో కూడినట్టిది. నిజము చెప్పవలయునన్న దుఃఖమే యెక్కువయేమో! మానవుడీ దుఃఖమును మొదలెత్తిపోవునట్లు చేయలేడా? అతడు మహావిజ్ఞానమును వశము చేసికొనెను. చేసికొనుచున్నాడు అడవులలో దిస్సమొలతో తిరుగుచు, ఆకలములు వేరు వెల్లంకులు తినినమానవుడు ఆకాశగర్భాంతరాళములకు పోగలిగినాడు. ఇతర గ్రహములలో గుడారము లెత్తగా పోవుచున్నాడు కాని భూమిమీాద మానవజీవితమెంతో దుఃఖభూయిష్ఠ మగుచున్నది. కారణమేమి? మానవచరిత్రకు ప్రపంచగతికి మహామనీషులెందరో భాష్యములు వ్రాసిరి ఒక్కొక్కరిది యొక్కొక్క ప్రమాణము మానవచరిత్ర వర్గకలహములతో కూడినది యార్థికశక్తులు మానవ జీవితమును నడిపించినవని వంద యేండ్లనాడు మార్క్సు ప్రవచించెను. ఆయన భాష్యము సత్యసమ్మతమా? కాదా? యనునది వేరుమాట మార్క్సు వాక్కులు ప్రపంచములో మహాసంచలనమును సృష్టించినవి. ధనికవాదవ్యవస్థ యంతశ్శాల్ల్యములవలన శిథిలమై, కార్మిక కర్షక నియంత్రణము సాగిసాగి, తుదకు రాజ్యవ్యవస్థారహితమయిన సమాజము భూమండలమున వెలకొనునని మార్క్సుయొక్క, మార్క్సు ఛాత్రులయొక్క విశ్వాసము.మార్క్సు

చ్చినట్లుగా గతించిన వంద యేండ్లలో జరిగినదో, లేదో చెప్పవలసినవారు రాజనీతి కోవిదులు. మార్క్సు వ్రాతలను వేదములుగా భావించువాదమునకు సమసమాజ వాదము (Communism) అని పేరు.

ఈ సమసమాజవాదము ధనికవాదమునకు తోకచుక్క. "మానవసమాజమునందలి హింసకు, దౌర్జన్యమునకు, అధర్మమునకు, అన్యాయమునకు మూలకందము ధనికవాదము. మానవుని సుఖశాంతుల కొరకు దానిని సమూలముగా నిర్మూలింపవలయును. నిర్మూలించిననాడు భూమిమీద సర్వమానవులు సుఖశాంతులతో తులతూగుదురు. మిట్టలనుపడగొట్టి గుంటలను పూడ్చినగాని నేల చదునుగాదు. ఆనాడు "మరో ప్రపంచం" అవనిపై అవతరించును విశ్వాసముతో ఆ "మరో ప్రపంచ"మునకు "మహాప్రస్థానం" సాగించినవారు తెలుగుకవులలో నున్నారు వారు వ్రాసిన కవిత్వమునకు అభ్యుదయ కవిత్వమని పేరు. ఈ పేరు పెట్టుకొన్నవారు వారే.

"కుక్కపిల్లా
అగ్గిపుల్లా
సబ్బుబిళ్లా
హీనంగా చూడకు దేన్నీ!
కవితామయమేనోయ్ అన్నీ
.....................
ఉండాలోయ్ కవితావేశం
కానీవోయ్ రసనిర్దేశం
దొరకదటోయ్ శోభాలేశం
కళ్లంటూ ఉంటే చూసి
వాక్కుంటే వ్రాసి!
ప్రపంచమొక పద్మవ్యూహం
కవిత్వమొక తీరని దాహం"

అని శ్రీరంగము శ్రీనివాసరావుగారు 'ఋక్కులు' వ్రాసిరి. 'నవకవిత్వ' మెట్లుండవలయునో ఆయన చెప్పిరి.

సింధూరం, రక్తచందనం
బంధూకం, సంధ్యారాగం
పులి చంపిన లేడి నెత్తురూ
ఎగరేసిన ఎర్రనిజెండా
రుద్రాలిక నయనజ్వాలిక
కలకత్తా కాళిక నాలిక
కావాలోయ్ నవకవనానికి
.....................
.................
కదలేదీ, కదలించేదీ
మారేదీ, మార్పించేదీ
పాడేదీ, పాడించేదీ
పెనునిద్దుర వదలించేదీ
మునుముందుకు సాగించేదీ
పరిపూర్ణపు బ్రదుకిచ్చేదీ
కావాలోయ్ నవకవనానికి.

కవిత్వమునకు తీక్ష్ణత యుండవలయునని, అది సమసమాజవాదమునకు అభిముఖముగా నడువవలెననియు, దానిని స్థాపించుటకున్న యవరోధముల నన్నిటిని గాడిదవేయుటకు కవిత ప్రోత్సహింపవలయునని యీ పంక్తుల తాత్పర్యము.

"నిగనిగ తిరునుతే చెల్లీ! నిగనిగ తిరునుతే తల్లీ!
నవలోకం ప్రభవించునులే నవజీవం కుసుమించునులే
నగపేటికి చెల్లీ!
నగబూనుము"

అని తుమ్మల వేంకటరామయ్యగారు స్తైతము పాడిరి.

ఇంతేగాకుండ నిటువంటి నవకవిత్వానికి నేది యాలంబనమో, యేది భావమో, యేది ప్రాణమో శ్రీశ్రీ చెప్పెను.

"కమ్మరికొలిమీ, కుమ్మరి చక్రం,
జాలరి పగ్గం,
సాలెలమగ్గం,
శరీరకష్టం స్ఫురింపజేసే
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి
సహస్రవృత్తుల సమస్త చిహ్నాలు—
నా వినుతించే,
నా విరుతించే,
నా వినిపించే నవీనగీతికి
నా విరచించే నవీనరీతికి
భావం!
భాగ్యం!
ప్రాణం!
ప్రణవం!"

అనిసెట్టిసుబ్బారావు గారేమనెనో చూడుడు.

వచ్చాను వచ్చాను
వ్యాసంతతివాణ్ణి
వెళ్లిపోయిన కోటికోట్ల జీవుల విడిచి
కుళ్లిపోయే నేటి కోట్ల జీవులకొరకు
పార్లివచ్చే కోటి కోట్ల జీవులకొరకు
వచ్చాను వచ్చాను వ్యాససంతతి వాణ్ణి!

... ... ... ...

పగిలించి రణభేరి, పద్మవ్యూహము త్రెంచి
శిరమెత్తి విస్ఫులింగములు చిమ్ముతు లేచి
ఈ జగతిలో నూత్న జగతి కల్పిస్తాను
వచ్చాను వచ్చాను వ్యాస సంతతి వాణ్ణి!

.... .... .... .... .... ....

ప్రేమ మూర్తుల నిత్య నృత్యమై, సత్యమై
భువనముల్ సకలముల్ పొంగి ఆడంగా
విశ్వరానంద మావిర్భవించంగా
వచ్చాను వచ్చాను వ్యాససంతతి వాణ్ణి!

మొన్న మొన్నటి బాలగంగాధర తిలక్ స్తైతమూ కవిత్వ మెట్లుండునో చెప్పెను.

"నా కవిత్వం కా దొకతత్వం
మతి కాదు మీ రనే మనస్తత్వం
కాదు ధనిక వాదం, సామ్యవాదం—
కాదయ్యో అయోమయం, జరామయం

.... .... .... .... .... ....

అగాధ బాధా పాథః పతంగాలు
ధర్మపిరి[illegible] క్షతరక్తనాళాలు
త్యాగశక్తి ప్రేమరక్తి శాంతిసూక్తి
నా కళాకరవాల ధగద్ధగ రవాలు.

నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు
నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు"

'అన్నా! కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతంచెయ్యాలి
విస్తరించాలి చైతన్య పరిధి
అగ్ని జల్లినా, అమృతం కురిసినా
అందం, ఆనందం దాని పరమావధి'

అనాథల, అన్నార్తుల, అధర్మ పీడితుల ఆక్రందనమును ధ్వనింప జేయునది యభ్యుదయ కవిత్వము కాని బాలగంగాధర తిలక్ దగ్గరకు వచ్చు నప్పటికి కవితా ధ్యేయము మారినట్లు కన్పించుచున్నది. కవిత్వము చేత నిగూఢ జ్యోతిస్సీమలు బయటపడవలె. చైతన్య పరిధి విస్తరింపవలె ఎట్టి భావములను ప్రతిపాదించినను కవిత్వ పరమావధి సౌందర్యము, ఆనందమును, దారిద్ర్యమును, దౌర్జన్యమును పరిష్కరించునట్లుగా బాటలుతీయుచు బయలు దేరిన కవిత్వము, చివరకా చాయలొక కొన్ని కల్గియున్నప్పటికి, ఆనందమే, కావ్య ప్రయోజనమను వెనుకటి వారి వైపునకు మొగ్గుట గమనార్హము.

అభ్యుదయ కవితా లక్ష్యము అవగత మయినది దాని లక్షణములు రెండు కలవు ఒకటి గత చరిత్రకు విడియాకు లిచ్చి వర్తమాన చరిత్రను వలచుట మానవ పురోగమనమున కేవి యాటంకములని తానెంచుచున్నదో వానిని మట్టుపెట్టవలయునని యభ్యుదయ కవిత్వము చెప్పుచున్నది ప్రపంచము పరిణామము చెందినట్లు గుర్తింపక పోవుట ప్రగుడ్డితనమని యది చాటుచున్నది పురిపండా అప్పలస్వామిగారు ఏమనిరో చదవుడు.

తొలినాటి సంద్రాలు
తుహినగిరి శిఖరాలు
ఇంకిపోతున్నాయిలే!
క్రుంగిపోతున్నాయిలే!
తాతవేసిన పుంత
దైవమేలిన సంత
పల్లేర ప్రాకిందిలే!
బిల్లేడు మొలిచిందిలే!
రాజు కట్టిన కోట
రాణి పెట్టిన తోట
భూతాలు గెంతాయిలే!
బొనికలే నిండాయిలే!
నల్ల గుండే గాని
కళ్లిప్ప నంటావు
రాతిగుళ్లకె కాని
రాను పొమ్మంటావు
సుడిగాలి రేగిందిలే!
పిడుగు గర్జించిందిలే!

కుందుర్తి ఆంజనేయులు గారి "అకలి యాత్ర" యీ పరిణామమును తెలియ జయునదె.

కదిలిందొక మహాయాత్ర
కలవారిపై దండయాత్ర
సగం తిండి తిని బ్రతికే
శ్రమజీవుల క్షుధాయాత్ర!

.... .. .... .... .... ....

జగత్తు ఒక నిమిషంలో జడమయిపోతుంది!
పదిమంది స్వార్థ వ్యక్తులు పాలిస్తున్నారు మనల్ని
వాళ్ళు లేవ గాని మనం నూటికి తొంభై మందిమి!
వారిచేత కాకుంటే మనమే ప్రభుత్వాన్ని నడుపుకుందాం!
పదండి! పదండి! అడుగుదాం పరిపాలించే వారిని

అనెను శ్రీరంగము శ్రీనివాసరావుగారి యొక్క ప్రత్యేకమయిన వేదాంతమును వలికెను.

"... మాకు గోడలు లేవు
గోడలను పగుల గొట్టడమే మా పని
అలజడి మా జీవితం
ఆందోళన మా ఊపిరి
తిరుగుబాటు మా వేదాంతం......"

ఇక నక్కడ నుండి విప్లవము మొదలయినది ఆ విప్లవము వర్తమాన కాలము కేంద్రముగా కలది గిడుతూరి సూర్యంగారు ఈ విధముగా హెచ్చరించిరి.

వర్తమాన సత్యాన్ని నేను—
శాన్తిలేని విశ్వాత్మను,
ప్రగమించే విప్లవాన్ని!
ప్రళయ జ్వాలాముఖిని!
పీడితజన హృదయాన్ని నేను
నా కంఠం నా గీతం
నినదించును నిర్విరామ సమర ఘోష—
సంధ్యాసమయ హేష! ... .... ....

బెల్లంకొండ రామదాసుగారు

"మానవ మేధస్సుకు
సంకెళ్లను తగిలించిన
గత సాంఘిక శిలాశాసనం
పడగొట్టను
పగిలిన నా నిప్పుల కంఠం
పలికిన విప్లవ గీతం! "

అని బయలు దేరిరి "ప్రపంచము ప్రకృష్టనకు గూడుగా నున్నది దీనిని దహింపవలయును" అను విషయమును, రామాయణ ప్రతీకతో రామదాసుగారు వర్ణించిరి.

ప్రతుకొక అశోక వృక్షం
ప్రపంచ మొక లంకా నగరం
నేను సీతను
జీవితాశోక వృక్షచ్ఛాయలో
కూర్చున్నా,
నా చుట్టూ
బాధిస్తూ దానవులు— మానవులు
నేను సీతను
జీవితాశోక వృక్ష చ్ఛాయలో —
హనుమంతుని రాక ఎదురు చూస్తూ
లంకాదహనం ఎదురు చూస్తూ

ఈ యుద్యమమునకు "మాగ్నాకార్టా' వ్రాసిన వాడు బాలగంగాధర తిలక్ ప్రశ్రీకంటె ఈ విషయమున నొకడుగు ముందువేసిన వాడాయెను. ఈ క్రింది పంక్తులు చదువుడు

"మేం మనుష్యులం
మేం మహస్సులం
గుండెలోపలి గుండె కదిలించి
తీగ లోపలి తీగ సవరించి
పాటపాటకు లేచు కెరటం లాగ
మాట మాటకి మ్రోగు కిన్నెర లాగ
మేం ఆడుతాం
మేం పాడుతాం

. ... ....

మేం సహృదులం
మేం భావుకులం

పాత లోకపు గుండెలో శతఘ్ని పగిలించి
భావికాలం చంద్రశిలలు కరగించి
పాటపాటకి సోకు స్వర్గం లాగ
మాట మాటకి దూకు సింహం లాగ
మేం నిలుస్తాం!
మేం పిలుస్తాం!
మేం మనుష్యులం!
మేం మహస్సులం
మాకు శాస్త్రం లేదు
మాకు దాస్యం లేదు
మాకు లోకం ఒక గీటురాయి
మాకు కరుణ చిగురుతురాయి
మేం దివ్యత్వం నటించం!
మేం పరపీడన సహించం!"

.. .. .... .... ....

ఒకవేళ అభ్యుదయ కవులు చరిత్రను చదివినను, వారు దానికి చేయు వ్యాఖ్యానము వేరు ఆ వ్యాఖ్యానము మార్క్సు చేసినట్టిది శ్రీ శ్రీ రచించిన రమణీయ కవితా ఖండము "దేశ చరిత్రలు" మార్క్సు చారిత్రక భాష్యమే. తేదీలు, దస్తావేజులు, మతలబులు, కైఫీయతులు చరిత్ర గావు; రాజ్యోదయాస్తమయములు, రాణుల ప్రేమ పురాణములు చరిత్ర గావు; దారుణ హింసా కాండ చరిత్రలో విలయతాండవము చేసినది ఇట్లు భావించట మన మనుకొన్న రెండవ యభ్యుదయ కవితా లక్షణము. చరిత్రకు మార్క్సు వ్యాఖ్యాన మిట్లున్నది

"— అజ్ఞానపు టంధయుగంలో
ఆకలిలో ఆవేశంలో —
తెలియని ఏతీవ్ర శక్తులో
నడిపిస్తే నడిచి మనుష్యులు
అంతా తమ ప్రయోజకత్వం
తామే భువి కధినాథులమని
స్థాపించిన సామ్రాజ్యాలూ
నిర్మించిన కృత్రిమ చట్టాల్
ఇతరేతర శక్తులు లేస్తే
పడిపోయెను పేక మేడలై
పరస్పరం సంఘర్షించిన
శక్తులలో చరిత్ర పుట్టెను.

అటువంటి చరిత్రలో మనక సాక్షాత్కరించు చున్నదేమి?

వల్లారిన సంసారాలూ
మరణించిన జనసందోహం
అసహాయుల హాహాకారం
చరిత్రలో మూలుగు తున్నవి.
వైషమ్యం స్వార్థపరత్వం
కౌటిల్యం ఈర్ష్యలు స్పర్ధలు
మాయలతో మారు పేర్లతో
చరిత్ర గతి నిరూపించినవి

సామాన్య మానవపరముగా చరిత్రకు వ్యాఖ్యానము వ్రాయవలసిన యావశ్యక విూ క్రింది పంక్తులలో కన్పించును

ఇతిహాసపు చీకటి కోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
దాచేస్తే దాగని సత్యం.

నైలునదీ నాగరికతలో
సామాన్యుని జీవన మెట్టిది?
తాజమహల్ నిర్మాణానికి
రాళ్ళెత్తిన కూలీ లెవరు?

సామ్రాజ్యపు దండయాత్రలో
సామాన్యుల సాహసమెట్టిది?
ప్రభువెక్కిన పల్లకి కాదోయ్
అది మోసిన బోయీలెవ్వరు?

ఈ విధమయిన వస్తువుతో, ఈ రీతి వర్తమాన దృష్టితో, యిట్టి చారిత్రక భాష్యముతో బయలుదేరిన యభ్యుదయ కవిత్వము

" .. ...... ....... ...
ద్రోహాలను తూలగొట్టి
దోషాలను తుడిచిపెట్టి
స్వాతంత్ర్యం
సమభావం
సౌభ్రాత్రం
సౌహార్దం
పునాదులై ఇళ్ళలేచి
జనావళికి శుభంపూచి—
శాంతి, శాంతి, కాంతి, శాంతి
జగమంతా జయిస్తుంది
ఈ స్వప్నం నిజమవుతుంది
ఈ స్వర్గం ఋజువవుతుంది

.. . ..."

అని చాటుచు "పతితు"లను "భ్రష్టు"లను "బాధాసర్పదష్టు" లను "దగాపడిన తమ్ము"లను ఓదార్చినది చివరకు శ్రీ శ్రీ

ఈ సృష్టికి ఏమర్థం
మానవునికి గమ్యమేది
ఒక సకలాతీతశక్తి
ఉన్నట్టా లేనట్టా

అని ప్రశ్నవేసి, సమసమాజ వాదానుకూలముగా

"ఈవిల్, సిన్ మొదలైన ప
దాలను వాడేటప్పుడు
న్యాయం ధర్మం నీతి
త్యాదుల చర్చించేప్పుడు
ఎవరికి తోచిన అర్థం
వారలు చెప్పకతప్పదు
పరమార్థం సామాజిక
సామూహిక సద్వర్తన"

యని ఘంటాపథముగా చాటెను ఆయన యేనాడో

మాయంటావా? అంతా
మిథ్యంటావా?
నా ముద్దుల వేదాంతీ!
ఏమంటావు?
మాయం టావూ? లోకం
మిథ్యంటావూ?

అని సూటిగా ప్రశ్నించి జగత్సత్యత్వమును నిర్ధారించెను.

## 6

కార్మికులు కథానాయకులైన సాహిత్యముతోపాటు కర్షకులు ఘనులని చాటు సాహిత్యము వచ్చినది. కృషీవలుడు లోకమునకు అన్నదాత అయినను సామాన్యముగా యితడు కావ్యనేత కాలేడు. అలంకారికులు కవిభావ్యమానముగాని వస్తువు లోకములో ఏదియులేదనిరి శాస్త్రకారులు. నాట్యశాస్త్రకారులదిగాగా, కవుల కావ్యములు కల్పించు యెట్టినవి రైతు ధీరోదాత్తాది నాయకుల కోవకు చెందినవాడు కాలేకపోయెను. అతని వృత్తము సంభావ్యము కాలేదు. మానవజీవితమును సమచిత్తములో సంపూర్ణముగా సమీక్షించినచో రాముని జీవనమునందలి రమ్యత రైతు బ్రదుకునందును కన్పించును గదా! రాముని దివ్యత్వము మాట యటుండనిండు. రాము డాదర్శపురుషుడు, సకల సద్గుణశోభితుడు ననువారు నుండవచ్చును. కాదనువారెవరు? కవుల కంటకు వాడిగ నుండవలయునేగాని, సామాజిక రాజకీయ పరిస్థితులనుబట్టి యెట్టివానినైన నెంతవానిగానైన చిత్రింపగలరు. కావ్యకారణములలో ప్రతిభ గణుతికెక్కియుండుచో, ప్రతిభాసంపన్నుడగు కవి యేమి చేయలేడు? కవుల దృష్టులకందిన యిత్తడియైన పుత్తడియగును. మంటిగడ్డయైన మాణిక్యమగును— ఈ విధముగా భావించిన వారనేకులుండిరి. అట్టి భావనలతో కృషీవలుని గూర్చి పాడిన కవులు గలరు. దువ్వూరి రామిరెడ్డిగారు, ఏటుకూరి వెంకటనరసయ్యగారు రచించిన "కృషీవలుడు" "క్షేత్రలక్ష్మి" కావ్యములు లక్ష్యములుగ నుండును. కృషీవలుడు ప్రకృతిలక్ష్మి యంకపాళిలో కేరింతలాడు ముద్దుబిడ్డ. అందువె రైతును గూర్చి వ్రాసిన కావ్యములందు విధిగా జనపద ప్రకృతి సౌభాగ్యము లాస్యము చేయుచుండును. రామిరెడ్డిగారు, వెంకట నరసయ్యగారు పల్లెపట్టులవారి ముచ్చట్లను ఆయా ఋతువులయందలి సేద్యసాధ్యముల తీరుతెన్నులను గ్రామప్రకృతి శోభను ఉదారరమణీయముగా వర్ణించిరి. రామిరెడ్డిగారిది నెల్లూరి వ్యవసాయము. వెంకట నరసయ్యగారిది గుంటూరి పొట్ల సేద్యము.

"తరుల్ ధన్యాత్ములై యూర్ధ్వలోకస్థం గస్త పక్షపాతియని నిందా వాక్యముల్ పల్కరే" యని కావ్యము వ్రాయుచు రామిరెడ్డిగారు వితర్కించుకొనిరి. రామిరెడ్డిగారి ప్రకారము రైతు "భారతమాతలాత్మ గౌరవ పవిత్రమూర్తి" "అనుదిన పరిశ్రమమె' కృషీవలుని "మతము" "ధారుణీపతి పాలన దండమెప్పుడు నీ హలంబుకన్నను శ్లాఘనీయముగునె?" యని కవి కృషీవలుని నోదార్చెను. రైతు 'ఇరుగుపొరుగువారి సంపదకై యీసు గూరబో'వడు. అతని గృహము ఆతిథ్యమునకు కొలువుకూటము. అయినప్పటికి లోకము రైతును మరచినది ఎట్లు? 'ఫలముల్ మెక్కెడివారు తత్ఫల రసాస్వాద ప్రియాలోలురై పలుమారన్ మధురత్వమున్ మతుల సంభావింతురే కాని తత్ఫల హేతుక్రమ వృక్షముం దలప" రట్లుగా "రమాకలితుల్ భోగములన్ భుజించుచు' కృషీవలునివైపు చూపు సారింపకొల్లరు. అయినను "వాని పరిణామ మెవ్వరు పలుకగల"రనుచు రామిరెడ్డిగారు రైతునకు స్వస్తివాచనము పలికిరి.

కాపుల, కాపుటిల్లాండ్ర యనుదిన చర్యలతో, సహజరమ్య వర్ణనములను రామిరెడ్డిగారు మేళవించిరి. ప్రతిభావంతుడైన కవి రాచవన్నెల సింగారమునే గాదు, కాపు పడుచుల యొయ్యారమును చిత్రింపగలడు. కోత కోయుచున్న మాలెతను రెడ్డిగారెట్లు వర్ణించిరో చూడుడు

> వ్రాలిన కొప్పులోపలి పూలరేకులు
> సడలి యొక్కొక్కటి జారుచుండ

బరువంపు రొమ్ముపై బయ్యెద చినుగుళ్లు
  గాలికి నట్టిట్టు గదలియాడ
వెలుగెత్తి పాడెడి యేలలు విని బాట
  సారు లెక్కసకెము పలుపుచుండ
దమ్ములపుంబూత దవిలిన వాతె
  పై బలుచాలు నవ్వకయె నవ్వ

జేతి కొడవలి ఝళుళువుచు, జిన్నెలాడి
కన్నెమాలెత పిడిమట్టి మున్నమున్న
మునువు తరిగెడి నింటికి బోవువేళ
సందెడేడి యీలేవె కర్షక కుమార

రామిరెడ్డిగారు "ముసలిమాలెత" యను నొకకావ్య ఖండమును రచించిరి. అందున్నవి యిరువది నాలుగు పద్యములే తామున్న గడ్డలో కరువువచ్చి, పని పాటులులేక యిక్కట్టులు మూడినప్పుడు, కూలిచేసికొని పొట్ట పోసికొను వారు వలసదీయుదురు. ఆ వలసకు సంబంధించిన కథయే యీ కావ్యఖండములో కలదు.

పడమటి మెట్టదేశముల బైరులు పంటలు వానలేమికిన్
వడబడి యెండి కాటకము వచ్చిన, సన్నజనంబు, మంటలం
బడియెడి దోమగుంపటుల మాడి, దినంబున కొక్కసారియున్
గడి కబళంబు లేక, కడుకష్టము నొందుచు నుండి రచ్చటన్.

ఆనాడు "డెల నా భూముల బైరులు గలవని" యీ పడమటి యూళ్ల కూలీలు వలసవచ్చిరి అట్లు వచ్చినవారిలో ముసలి మాలెత యొకతె. రెడ్డిగారామె నిట్లు వర్ణించిరి

దారిద్ర్య దేవత తనరూపు గనుపింప
  వగ్గువాలక మూని వచ్చెనొక్కొ!
వేతాళునాజ్ఞ గావించు పిశాచంబు
  పీనుగు నొడలితో వెడలెనొక్కొ!
స్వార్థపరస్వాంతు డౌ రాజుచేబడి
  లావు దూలిన దేశలక్ష్మి యొక్కొ!
సకల వస్తు ప్రదర్శన శాలలో నిడ
  ముదిమి యవధి దెల్పు మూర్తి యొక్కొ!

యనగ, జేయూత కర్రను నవనినూని
నడువజాలక తడబడి యడుగు లిడుచు
నెండవేడిమికి మేనెల్ల నెరియుచుండ
జెట్టునీడకు దా నల్ల జేరవచ్చి.

ముసలిమాలెత కానకకన్న ఒక్కగానొక్క కూతురు, కొడుకు చనిపోయిరి. అయినప్పటికీ ఈ వృద్ధాంగన యతిస్వతంత్ర వ్యక్తిత్వము కలది 'కూలి యొనరించి కుడుచుటే మేలు నాకు' "కాలుసేతుల నున్నంతకాల మొరుల చేతి కూటికి నాశింప జిన్నతనము" అని యనగలిగిన ధీర "ఇకమీద నీ వెచటికిం జననెంచక ప్రత్యహంబు గైకొనుము మదీయగేహమున గోరినయట్టుల మజ్జిగన్నమున్' అని చూచిన కవియో లేక మరొకరో యామె కథ విని గుండె కరిగి పలుకగా, ఆమె యేమన్న దనుకొన్నారు? "అయ్య! కూలి చూపి నాకు గూడుపెట్టు,తిరిపె మెత్తి తిన్న దీరునా యాకలి?" యని యామె గంభీరముగా పలికినది కరుణ రసభరితమయిన కావ్యఖండమిది మానవజాతియందలి దీర స్వతంత్రతా ప్రవృత్తికి విజయపతాక

వేంకటనరసయ్యగారు కవియైన రైతా? రైతయిన కవియా? అలు పెరుగని కోతకోయు ఘట్టమును వర్ణించుచు నరసయ్యగారి విధముగా వ్రాసిరి.

మబ్బువ్రేలెను దూర్పుమలపైన నల్లగా
  బిట్టమేడెము నిల్వబెట్టరాదా?
కట్టగొయ్యల నిల్వగాళ్ల నిలిచిన యెడ్ల
  అతిగతి యేమైన దరయరాదా?
తటిపి సన్యాసి గత్తర దీర్ప మలుముకై
  గడ్డి సందెడు మోపు గట్టరాదా?
ఎదురుచూతురు బిడ్డ లేమి తెచ్చెదనంచు
  జల్లికంకులు కొన్ని గిల్లరాదా?
చూచినడుపుము దుంపలు సోకు ననుచు
మునుములో హెచ్చరించెడి ముద్దులాడి
భావబలత వర్ణించి ప్రస్తరింప
గవిత నేర్చిన బాగుండు గర్షకుండు.

అందుచేత నరసయ్యగారు 'వ్యవసాయదారు' ని బ్రతుకులోని "భావశతబలత" వర్ణించుటకై కవిత్వము నేర్చిన కర్షకుడని చెప్పవచ్చును. "క్షేత్రలక్ష్మి" కావ్యమంతయు దీనికి సాక్ష్యమే

"కవి మర్మజ్ఞుడు, భావలోచన చమత్కారమ్మునన్ సృష్టిలో నవలోకింపని తావులేదు" అనుచు త్రికరణశుద్ధిగా నమ్మిన "రైతుకవి" గావున, వెంకటనరసయ్యగారు కృషీవలుని జీవితములోని యాయాసన్నివేశములను పరమాభినివేశముతో వర్ణించిరి "వారే రైతులు విశ్వజీవన కళా పారంగతుల్ నీ కవిత్వారంభమ్మున కిద్ది స్వర్ణయుగ మన్నా! నాటికీ నేటికిన్" "ఈ దుఃఖప్రపంచార్త సంకలితున్ రైతును నుద్ధరింపగదె నిష్కల్మష స్వభావమ్మునన్" అని వేంకటనరసయ్యగారు కవిని హెచ్చరించిన "రైతుకవి" యయిరి ఒకవంక నానావిధ దృశ్యములను వర్ణించుచు, మరొకవంక వా రే విధముగా కవుల నడుగుచున్నారో కనుడు.

చుంగుల్ వాలిన ఖాదిచుట్టి ముదుగుం జొక్కాను గైసేసి, ముంజెంగుల్ గుచ్చెళులంట జెక్కి, కులుకుం జెప్పుల్ సమాళించి, పల్ రంగుల్ గుల్కెడు చెంద్రకోల ములుగ్రం బూని, కోటేరుతో సింగారమ్మయి పోవు రైతుసిరి వీక్షింతువా? లేఖినిన్?

సొరెకు మంచుబొట్లు చెవిజంపున ముత్తెము లట్లు వ్రేల జేజాతిన పగ్గమూని, యొరచాలున గోడె నదల్చి, మేడిపై భారము మోపి, కష్టపడు భాగ్యము చూడగదోయి! కైతసింగారము కింతకన్న దగు ఘట్టము లేర్పెదవా! కవీశ్వరా!

బారెడు తోకమట్టు లెగబట్టి, యెకాయెకి సందివాటుగా బేరెమువాటి, డొంక రొదవెట్టు ఖణిల్లున అంకెవేసి, దుర్వార జవంబునం, జెలికపట్టున నాగిన కోపుటెడ్ల సింగారము, భావనాబలము గల్గినచో గిలిగీసి నిల్వదా?

వేంకట నరసయ్యగారీ కావ్యమునందు అచ్చమయిన కాపుల పలుకుబడిని పుష్కలముగా వాడిరి.

కట్టమంచి రామలింగారెడ్డిగా రొకానొక సందర్భమున నిట్లు చెప్పిరి. 'ఐరోపాలోని కవీశ్వరులు కొందఱు కాపువారు, సైనికులు మొదలైన తక్కువ వృత్తులవారి బ్రతుకులను వర్ణనార్హములని భావించి యెంతో సుందరముగా గావ్యములలో వ్రాసియున్నారు మన గ్రంధముల మాత్రము చదివి యీ పుణ్యక్షేత్రమయిన కురుక్షేత్రముయొక్క స్థితిగతుల నరయజూచు వారికి ఈ దేశమున బీదసాదలపై నాదరముగల కవి యెవడైన నున్నాడా? తుదకు బీదసాదలైన నున్నారా? యను సంశయము పట్టినను తప్పు వారిది కాదు! శోకరసము (కరుణరసమని యనవలయును—వ్యాసకర్త) వర్ణింపవలయునన్న ననుకూలమగు సందర్భమెయ్యది? క్రొవ్వు కారెడి నాయికానాయకుల యూహామాత్రములైన కష్టములా? ప్రజలు దినదినము కన్నీరు గార్చుటకైన నవకాశములేక కుడుచుచుండు పరిపరివిధములైన గోడులా? శాంతరసమునకు బోషక మెయ్యది? తమకు గష్టము దేనట్టివైన రాజుల యొక్క యుదారచర్యలా? ఆకట వాడి మలమల మాడుచు నింటికివచ్చి వంట సిద్ధము కాకుండినను, భార్యపై గోపింపక, కన్నులు మూతవడుచుండ విధిని ధ్యానించుచు నొక మూల గూర్చుండు పాలము కాపులయొక్క

వడవడియా? ఆహా! జనసామాన్యముయొక్క ప్రతిదిన వృత్తములలో నెంత భావము, రసము, గుణము నుపగతములై యున్నవో మన కవులకుం దెలియవు గదా! రాజపుత్రులను, రాజకన్యలను, చాలనందుకు బ్రాహ్మణులను వేశ్యలనుబట్టి జంఝాటమాడుటతప్ప కవితకు మేలైన యన్య కర్మములు లేవా?" వేంకట నరసయ్యగారు కూడ కవి నేమని ప్రశ్నించుచున్నారు?

అలయక రాజుతోడ మధురానవమానెడు దివ్యకాంతలన్
మలిచిన సిద్ధహస్తమున, మంచెకు చేరువనున్న క్రావు కో
డలి నయగారి పల్కుల మిటారము నా నడతీరు, కన్నులన్
జిలుకు సమాయికత్వము రచింపుము నీ పస గాననయ్యెడున్

వేంకట నరసయ్యగారి కీ క్రింది విధముగా కృషీవలుడు సాక్షాత్కరించెను. ఈ పద్యమునందలి పదముల కూర్పు కవికి రైతుపట్ల గల సానుభూతికి, కృషీవలుని దుర్భర జీవనమునకు, అతని యమాయికత్వమునకు అద్దము వంటిది.

మినుగ వట్టి నలుదెసల్ మెఱసిపోయిన్నగాని
కనుతెఱ్ఱ గొట్టఁడా కర్మయోగి
మండువేసవి నిప్పు చెండు చుండిన్నగాని
కాయమ్ము డాఁడా కష్టజీవి
అరుగాలము లేమిడ్డై కృశించిన్నగాని
పడి వంచఁ ద్రొక్కఁడా భాగ్యశాలి
చుట్టు పక్కాలిల్లు చూఱకొన్నంగాని
తన్నుఁ దా నెఱుఁగడా ధర్మరాజా
విశ్వ మాదమఱచి విషమిచ్చుచున్నను
దోసిలొగ్గి కనులు మూసినాఁడు
వెనుక ముందులేని మనవంటివారల
నెత్తమంది నుద్ధరింపఁ గల్డఁడా.

నిజమయిన భారతదేశము పల్లెపట్టులలో చూపట్టుననుట నిక్కువము. అవి పాడిపంటలకు పొత్తు పొందికలకు నెలవులు అది గత చరిత్ర. ఎన్నో మార్పులు పల్లెలలో తలయెత్తినవి తల యెత్తుచున్నవి తెల్లవారి యేలుబడి చెల్లుచున్నప్పుడే ప్రాక్తన గ్రామ సౌభాగ్యము పంచబంగాళ మయినది ముగ్గురు తెల్గు కవులు గ్రామ పరిణామమునుగూర్చి గానము చేసిరి. జాతీయోద్యమ కాలమునాడు జనించిన దురహంకారముతో (Jingoism) మనలోని క్రుళ్ళునకు కువ్వాడమునకు పాశ్చాత్య సభ్యతయే మూలమని యెలుగెత్తి చాటుట యలవాటయిన దానాడు ఆ చాయ లింకను పోలేదు అట్టి యహంకారముతో వ్రాసిరని నేననసనుగాని, రామిరెడ్డిగారు "నవ్య పాశ్చాత్య సభ్యత నాగరకత, పల్లెలందు వస్పష్ట రూపములఁదాల్చి, కాలసమ్మానితము లయిన గ్రామ పద్ధతులను విముఖత్వముం గొంత గలుగఁజేసె" నని యనిరి. వారి యభిప్రాయముతో నెంద రేకీభవింతురో తెలియదు

1919 వ సంవత్సరము నాటికే పల్లె లెట్లున్నవో చూడుడు:

పంచాయతీ సభా భవనంబు లౌ రచ్చ
కొట్టంబు లొక మూలఁ గూలిపోయె
పేద బడులఁ జెప్పు విజ్ఞానధుర్యులు
నొజ్జలు దాస్యంబు నూతగొనిరి
గ్రామ పరిశ్రమఁ గలుగు నన్యోన్య మౌ
సహకార వృత్తంబు సమసిపోయె
సత్య జీవనము, విశ్వాసమ్ము, భక్తియు
నైకమత్యము, మున్నె యంతరించె
బూటకములు, కుయుక్తులు, మోసగతులు
కోర్టు వ్యాజ్యాలు, ఫోర్జరీల్, కూటమైత్రి
స్వార్థపరత, మౌఢ్యంబు, గర్వ ప్రవృత్తి
వేర్పు విద్యాలయంబులు నేటి యూళ్ళు.

గ్రామములలోని కుల సామరస్యము, అన్యోన్య సహకారము సమసిపోయినవని విచారించిన కవి కాటూరి వేంకటేశ్వరరావుగారు. పల్లెలలో "కమ్మరిజము లేదు, కళలు దాలిచిన మేస్త్రీలు లేరు" అయినప్పటికి జానపదులు "స్వస్వవృత్తిపరత సంఘమునకు మేలు" సమకూర్చిరి వారు నిరక్షరాస్యులే. మఱి 'నేటి యన్నుల కెడమొగాల్ పెడమొగాలు వచ్చి పడియె నెట్లు?" "పల్లె బ్రతుకుల మాధుర్య మెల్ల విఱిగి, పంచకోల కషాయ ముప్పతిల నేల?" "గ్రామము మేలుగోరి" 'తమతమ కార్యములు తరతమభావములేక స్వకుల ధర్మముగా" "సరిపెడి సుమతుల కెటు లొదవె నైజ సుఖ తత్పరతల్?" ఈ పరిణామమునకు కారణములు వేంకటేశ్వరరావుగారు చెప్పరైరి వచ్చిన, వచ్చుచున్న మార్పులు వర్ణించుటయే వారి పని. గ్రామము లెట్లున్నవి?

ఊరఁబండనట్టి యుప్పువకుం గూడ
కొలు చొసంగి న్వాఁడు విలిచికొనిరి;
చుట్ట నిప్పు గూడఁ బుట్టదు డబ్బియ
కిపుడు పల్లెటూళ్ల కేమి వచ్చె?

న్వాఁడును గిల్లు ద్రావిరి, ధనమ్ములు ముచ్చిలి, రన్యదారలన్
గూడిరి; కాని పాపమను కొంకును, పొక్కునొ యన్న భీతి వె
న్వాడెను వారి; నియ్యదన నట్టి భయ మ్మడిపోయి చప్పగా
మాడెను సిగ్గు; పాపరతు లార్జితులై విహరింతు రిప్పుడే.

స్వాతంత్ర్యము వచ్చిన తరువాత పల్లెలెంత క్రుళ్ళునకు కుదుళ్ళయినవో తుమ్మల సీతారామమూర్తిగారు వర్ణించిరి. పల్లెలలో పారుపత్తెమును పూనినవారు, అచటి కసుమాలమునకు కారణమని సీతారామమూర్తిగారి వ్యాఖ్యానము రాజకీయములు గ్రామ వినాశమునకు హేతువు లయినవని సారాంశము

పంచాయతి సభ్యతకై
కంచము మంచమ్ము నమ్మఁగా వలయునె? రెం
డంచుల కత్తులు వలయునే?
కొంచెపు బ్రదుకునకు నియ్యకొన్నఁగా వలెనే?

అని కవిగారు ప్రశ్నించుచున్నారు ఈవేళ పల్లెలలో నెట్టివారు కన్పట్టుచున్నారు?

పాపట దువ్వి, చెల్వములు ప్రబ్బిన వల్వలు దాల్చి, న్వాడె ముం
జూపు నలంక్రుతుల్ దొడిగి, జోకలు, వ్రాకలు గట్టి బొల్తురే
పాపలు వారలక్కరము పట్టని గిట్టని దుర్విదగ్ధు, లీ
క్రేపులు రచ్చలెక్కి తలక్రిందుగ బ్రతికఁజూడ సర్వగున్.

వీరు "బావిలోని కప్ప లావంత సంస్కృతి నెఱుగరు.' వీరికి తరుగులేని పొగరు "కూర్చు ప్రెగడ" వీరి యిండ్లలో ముల్లె సంచులు మూలఁబడుచుండును ఆ సొమ్మెక్కడిది? వీరిని పెంచి పెద్దచేసినవారు "గడ్డిదిని మేర దప్పిన పక్షులు గడించి"యిచ్చినట్టిది. అందుచే ఈ 'వినాయకులు' "సిరి పొంగొక గ్రుడ్డితనం బిడ నటించు క్రోతులు" వీరు "అన్నదమ్ముల నెడసేయ, నాలు మగల చివురుఁ గ్రాపురములఁ దీయఁదివురు చుందురు" వీరే "పెత్తనములెల్ల గుత్త గొనం జూతురు" "అధమ గుణవత్త సదామెత్తురు. మహత్త దెసకున్ జిత్తము వోనీరు" ఇట్టివారు నాయంకరమును వశము చేసికొను పోకడ యిట్లున్నది.

మతములఁ నెత్తి, విత్త పరిమాణములన్ వివరించి, కోపలన్
వెతకి కులమ్ములన్ దడవి వీధుల నూరు — సిపార్సు జూపి దు
ర్మతులగు వీరు లోకము నమాయికమున్ గికురించి, నాయక
స్థితిని గడించి, పల్లియల చెట్టకు నాదరువౌదు రక్కటా!

గ్రామములలో విద్యావంతు లెక్కువయయినకొలది యీ "వినాయకులు" తొలగిపోదురని కవిగారు తలంచుచున్నారు చదువు, సంస్కారము భిన్నము లయినటివి. కవిగారు తలంచినట్టిది సత్యముగునో కాదో కాలమే, తెల్పును.

# 7

వైయక్తిక సాంఘిక రాజకీయ రంగముల యందలి కశ్మలమును కడిగి వేయవలయు నను కావ్యములు, కావ్యఖండములు ఎన్ని వందలు వచ్చినవో చెప్పలేము. వానిలో కొన్నిటి సరసన్నర్సు యీ వ్యాసభాగమున నుండును నవ యుగ కవి చక్రవర్తి జాషువా కావ్యములలో మానవుని యార్తి నీరవనాదము (Noiseless sound) వలె వినిపించు చుండును ఒక్కొక్కసారి యిది యాలాప్త శయ కవిత్వమా? యను సూహకు నవకాశము కల్గించును. మతము, వర్ణభేదము, వర్గభేదము, కపట ప్రవృత్తి, మున్నగు వానివలన సమ కాలిక సమాజ మెన్ని రీతులుగా వికట తాండవము చేయుచున్నదో చూచి పాడిన వాడా "కవి కోకిల" వర్ణని గూర్చి వ్రాసినను, గబ్బిలము ద్వారమున సందేశ ములు పంపించినను, శ్మశానమును దర్శించినను స్వయంవరము"లు చాటి నను లోకములో జరిగిన జరుగుచున్న యన్యాయములను హృదయము, ద్రవించునట్లు వర్ణించుట జాషువా కవికే చేతనయినది లోకములో ఆర్తి, దైన్యము నెప్పటి నుండియో కలవు కాని ప్రాచీన కవులకు రామాయణములు రాచనగరులు తప్ప నితరములైనవి చూపట్టు లేదు జాషువా కవి యేమనెను?

ప్రభువుల పెండ్లి పేరంటాలు వర్ణించి
కాలంబు పెక్కేండ్లు ఖర్చు పెట్టి
విరహవేదన మేను మలచి మూర్ఛిలు నేవు
రాణి వాసంబును రచ్చ కీడ్చి
అంగాంగవర్ణన వ్యసనంబు రెచ్చి యం
యువక జీవిత కోటి కుచ్చులాడ్చి
పదియు నెన్మిది మారు పాడిన ప్రేరాము
చరితంబు నగరెక్కి తిరుగ బాడి
శరణు శరణటంచు బరుగులెత్తుచు వచ్చు
నార్తలోకరుత మనాదరించి
భువనహితము గోరు కవితా కళాశక్తి
స్వార్థజడధి నూరవైచినారు

"హృదయములేని లోకము సుమీ యిది, మాపుల బశ్చిమంబుగా
నుదయము తూర్పుగా నడచుచుండు సనాతన ధర్మ ధేనువుల్
పిదికినపాలు పేదకు లభింపవు, ప్రోగలవాని యాజ్ఞలో
బెదరి గదల్చు జాల రరవింద భవ ప్రముఖామృతాంధసుల్

ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించు-గాని, దుః
ఖిత మతులైన పేదల పకీరుల కూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్ప దీ భరతమేదిని, ముప్పది మూడుకోట్ల దే
వత లెగవడ్డ దేశమున భాగ్యవిహీనుల క్షుత్తులారునే"

అని యాయన గాక మరెవ్వరు వ్రాయ గిలరు?

"గబ్బిలము" కావ్యములో పంచముడు తాను నివసించుటకు సరియైనచోటెక్కడనైన నున్నదా? యని పక్షినడుగును ఆ చోటెట్లుండవలయునో యతడే వర్ణించెను. అది భారతదేశ భవిష్యత్స్వరూపమునకు చిహ్నము దానిని గాంచుడు?

భోగు లాహరించు భుక్తి కన్నులు జూచి
పరమ పేదలు దుఃఖపడని చోటు
సాంఘికాచార పంచాస్య గర్జనమున
బెదరక జ్ఞానంబు పెరుగుచోటు
జాతివైషమ్య రాక్షస పదాహతి జేసి
కందక కళలు పెంపొందు చోటు
పరిపాలక క్రూరతర కరాసికి లొంగి
పోక స్వేచ్ఛాలక్ష్మి పాదలుచోటు
అసద బిడ్డలు చూడ నెయ్యంపు సుతుల
ముద్దులాడని గుణనిధుల్ బుట్టు చోటు
చెప్పగిదవమ్మ చూచివచ్చితివె నీవు
విశ్రయింబగ వాసముండెదను నేను.

మాతృభాషల కర్వ మర్యాద లొసరించు
సర్వకళాశాల సాగు చోటు
ప్రజల నాహరించు బహుమత దేవతా
దైనందిన గ్లాని లేనిచోటు
నవనీతనిభమైన కవుల కమ్మని వాక్కు
వెఱపు లేకావిర్భవించు చోటు
సంతానమునకు వైషమ్యము నేర్పని
తల్లిదండ్రులు విరాజిల్లు చోటు
విసపు నవ్వుల లాహిరీవేషగాండ్ర
పాద చిహ్నాల మరక తేర్పడని చోటు
తోడునీడయు లేనట్టి దుర్బలులకు
గబ్బిలపు చాన నాసయోగ్యంబు గాదె?

జాషువా కవి రచించిన "స్వప్నకథ" కరుణ రసము దరులొరసి పార్వా తీన కబ్బము ఇందు రెండు చిన్న కథలు కలవు "మొలిచిన యవనంబు వ్యథపుచ్చి, దరిద్రుల దేబెరింపు చూపులను గ్రుంగి, స్వీయ సుఖమును బలి యిచ్చిన మచ్చెకంటి" దయనీయ గాథ యొకటి ఆమె 'ఒక రెడ్డిసానికి జనిం చిన మానవకాంత" "జననీ జనకులు" "పొడమిన రెండవ వారముననే మృత్యువు నకు భోజనమైరి" చనిరి ఇంటి కొప్పు విడివిఎట్టుగా గల పాము రెన్నాళ్ళు తేనె పెర పిండి యానెత్తురుకందును పెంచినది పిదప నొక సాలెపడతి పెద్ద చేసి నది జవ్వనము నివ్వటిల్లిన యామెను జూచి లోకము వారు క్రొవ్వుతో కోరి కల పెంచికొనిరి ఫలము లేదు పేదవాడొకడు కన్పింప, గుండె కరగి యారు గజాల బట్ట నేసి యిచ్చినది ప్రతి దినము తన కుండిలోని సగపాలతని కిచ్చె డిది కాని సాలెపడతి సంతానము సగవహించి యీమె నిలు వెడల నడిచినది ఆమె భికారి యయినది ఒక బ్రాహ్మణ స్త్రీయొక్క కరుణామయగాథ విని తాను గడించిన నాలుగణా లిచ్చినది ఒక ముసలి బిచ్చగానిని పోషించినది లోకము అంకు నంటగట్టినది అ కనుకలి వలపుగల యొక మార్వాడీ వర్తకుడు దినవెచ్చము పంపెడివాడు ఒక నాడా ముసలి బిచ్చగాడ కన్పింపలేదు లోక మామెపై హత్యాదోషము నారోపించినది ఈమె చెరసాల చేరి యక్కడ చని పోయినది ఆమెయే చంద్రునిలో నూలు వడుకుచున్న యవ్వ.

కథలోని యమానుషాంశముల మాట యటుండ నిండు తాను దుర్భర మయిన కష్టిగుడుచు చున్నను, మానవుడు తోడియనదలకు తోడ్పడునను రహస్య మీ కథలో కలదు ఇట్టివారే చంద్రమండలము వంటి తావులలో నిలిచి లోకమునకు వెలుగు పంచెదరు ఈ కావ్య మొదలి స్త్రీ గాథ భూమి మీద ఎడిన దుఃఖభాగుని గాథయే

"స్వప్న కథ"యందలి రెండవ కథ సంఘము నందలి మంచి చెడ్డ లను చూపును ఒకానొక యనాథకు ఆరుగురు పిల్లలు ఒక యింటి వసారాలో నున్న యామె నా యింటి క్రూరది గెంటివేసెను వివాహ భోజనముల జరుగు చున్న యింటికి కడుపు నింపుకొందమను నాసతో వచ్చినది ఎవ్వరు నీమె మొగము చూడరు ఒక యొయారపు చిలిపి పనుచువాడు సెకిలు త్రొక్కుచు పోవును డీకొనెను నెత్తురు మడుగులోనున్న యామె కు నొక పుణ్యాత్ముడు చికిత్స చేయించెను అంటుతగిలినదని యాయన యిల్లాలు ఆ పుణ్యాత్ముని నింట నడుగు పెట్టనీలేదు నెత్తురు మడుగులోనున్న యా యనాథను మేడపై నుండి చూచుచున్న యొక పడుచు జంట నవ్వుకొన్నది ఆ యనాథ బిడ్డ లనాథశరణాలయములో చేరిరి అచటి యయ్యవారికి తన యొడలితోలుతో చెప్పుల గుట్టి యిత్తునని చెప్పి యా యనాథ తన కృతజ్ఞతాభరము దీర్చు కొన్నది జోరున వాన కురియుచుండగా ఆమె యొక చావడిలోనికి పోయి నిలువబడినది "వానలోన దడిసి వచ్చిన పెంపుడు కుక్కకు" పరిచర్యలుచేయు యజమాని యీ యనాథను వెళ్లిపొమ్మని కసరుకొనెను యజమానురాలు వచ్చి "రక్షణ మవశ్య కర్తవ్యమే కదా? నరులకు, ధర్మమునకును గలుగునే కుల వివక్ష లు, జీవ్ని పెర భేదము"నని మగనికి బుద్ధిచెప్పి పేదరాలికి కూడువెట్టి నది. కథ ముగిసినది మనుష్యుల మనస్సు లెంత విచిత్రముగా పనిచేయునో

యీ కథ చూపును. ఈ కథలో జాషువాకవి యొక ప్రశ్న వేసెను. ఆ ప్రశ్నకు సమాధాన మెప్పటికయిన దొరకునా?

ఎవఁ డారగించు నమృత భోజనంబునఁ
గలిసెనో యీ లేమ గంజిబువ్వ
ఎవఁడు వాసము చేయు శృంగార సౌధాన
మునిఁగెనో యిన్నారి పూరిగుడిసె
ఎవని దేహముమీఁది ధవళాంబరములలో
నాదిగెనో యిన్నాతి ముదుకపంచె
ఎవఁడు దేహము సేర్చు మృదు తల్పములలోన
నక్కెనో యీ యమ్మ కుక్కిపడక

వసుధపై నున్న భోగ సర్వస్వమునకు
స్వామిత వహించి మనుజుండ ప్రభవమందు,
నెవఁ డపహరించె? నేమయ్యె నీమె సుఖము
కలుప మెఱుఁగని దీని బిడ్డల సుఖంబు?

తుమ్మల సీతారామమూర్తిగారు "ధర్మజ్యోతి" యననొక లఘు కావ్యము వ్రాసిరి. వారి తండ్రిగారే యీ కథకు నాయకుడు. ఉప్పర్ల నోళ్లు గొట్టి యైదు కట్ల బంగారము నొక కోమటి యొదిగించుకొనెను. పోలీకల కీ వార్త తెలిసినది. వారి బంటుల వణిక్కునింటిని జొట్టిముట్టిరి అప్పుడక్కడ నున్న కవిగారి తండ్రి దబ్బుజ కయ్యెనాడి, యింటనున్న యీ బంగారము నీవలకు తెచ్చిదాచెను ఒక రెండేండ్లు గడచినవి "లేమి కనుంగుఁగొడుకై పసివాడుచుండియున్" కవిగారి తండ్రి యీ బంగారమును ముద్దర సుద్దిగా చెలికాడయిన బేహారికి నిచ్చివేసెను పిదప ఆ కోమటి మఱొక నెయ్యునికడ, అల్లునికడ బంగారమును దాచెను వారు ముప్పుతిప్పలువెట్టి చివరకు దానిలో కొంతకు కొంత కాజేసి కోమటి కిచ్చిరి కోమటికి దక్కిన దాని వెల ఆనాడు పండ్రెండువేల రూపాయలు. బంగరు సుద్దలను దిరిగి యిచ్చునపుడు కవిగారి తండ్రి కోమటి కొక కొన్ని సుద్దులు గఱపిరి కవిగారితండ్రి సామ్య వాదము (Socialism) నెఱుగునో యెఱుగడో తెలియదు కాని సీతారామమూర్తిగారు తమ తండ్రినోట సమతావాదమును బలికించిరి సమ కాలిక ప్రభావమువలన కథాసన్నివేశము లెట్లు రూపొందునో చెప్పుట కీ ఘట్టము తార్కాణము. ఆ పలుకులను జదువుడు:

ఒక పుట్టుఁగుంక తనతా
లికి వచ్చిన రెండు రూకలే డెబ్బది వే
లక్కుఁ బెంచెఁ బెంచినది పో
టకమా? వివరింపు ముత్కటంబగు వథమా?

యుగ యుగాల నుండియును ధనవంతు లీ
రీతి నీతి పాపభీతి లేక
పీల్చుచున్నవారు పేదల రక్తంబు
తీయ తీయ కొండతేనెవోలె.

ఆఁకటికి గ్రుస్సి, చలి దెబ్బ కలమటించి
మొండి రోగాల కవమానములకు లోఁగి
నాగరక లోకమున కొక్క నవ్వు విసరి
పిలుచుచున్నాఁడు యము నహా! పేదవాఁడు

ఎవని యెముక లీ మేడల కిటుకలయ్యె
నెవని రక్తంబుచే గోడ లిట్లు బిగిసె
వతనికా యిట్టి పరమ హేయంపు బ్రదుకు
వానికా యిట్టి దుర్మరణానుభూతి.

బొఱ్ఱ బలిసి నేఁడు విఱ్ఱవీఁగుచున్న
సాహుకార్ల యాట సాగదిక్లె
రుద్రమూర్తియై దరిద్రుండు చిచ్చఱ
కన్నువిప్పి గజ్జకట్టు నెపుడొ.

స్వాతంత్ర్యము వచ్చినది. సేవా నియమములు వచ్చినవి. అవినీతి జంపిల్లుచున్నది. పాలకులు, పాలితులు విధులు మఱచిరి అధికారమును ధనార్జనము ఎల్లర నేడాట లాడించుచున్నవి ఎన్నో సమస్యలు తలయెత్తినవి. ఆ సమస్యలనుగూర్చి కవిత్వము వ్రాసి సీతారామమూర్తిగారు సదుపదేశము చేసిరి వారి కవనములో కొంతపాలీ కోవకు చెందినట్టిది. వారు గాంధేయ వాది కాంగ్రెసు భక్తులు అయిననేమి? చెప్పవలసిన నాలుగు ముక్కలను స్వపర భేదములేక నిప్పులు చెఱగుచు చెప్పిరి. ఆశ్చర్యకరములయిన వారి పద్యము లొక కొన్ని యిట యుదాహరింతును :

దొడ్డ తలఁపులున్న రెడ్డికైనను, మాల
బిడ్డకైన నిమ్ము పెత్తనమ్ము
కులము లింక నిల్వఁ గలవటోయీ! వేరు
పురువు పడియె, నాని పరువు సెడియె

మతమేలా? కులమేల? కల్పితము లీ మర్యాద, లీ శాస్త్రముల్
కత లంచుం బ్రవచించి పెత్తనములాఁగా నాకు సా మామకుల్
బితకన్ బిడ్డకు బావకున్ మఱఁదికిన్ బీరంబు దెమ్మంచు ని
బ్బితివో నాడిన వ్రాఁగొకండ మన కస్వాతంత్ర్యం బవాచ్యం బికన్

మేడకు మిద్దెకు గుడిసెకు
మాడఁ బ్రేలాడుచున్న యుట్టికిఁ గల దీ
నాఁ డోటు; తత్క ప్రార్థులు
గూడెమ్ములవారి సేవకుం జనవలయున్.

లక్షలున్నవాని లాలించి లాలించి
బక్కవానిఁ గొంచె పఱిచి పఱిచి
పోటుమగలు బిళ్లబీటుగాఁ బడిరయా!
యోటురాక నిలువ జోటు లేక

కారాగారములకుఁ జని
గారెలు మెక్కిన వలంతికా? క్రిమిరాసుల్
పేరిన పులుసుం ద్రావిన
వీరునకా? విరుదదండ వేయుట సెపుమా?

ఓనమా లెఱుంగఁ డొరిమయు గరిమయు
వానవా లెఱుంగఁ డైన నేమి?
గీత మంచిదగుట, కిగ్గాడి చావిఁక
రాంగదముల వచ్చె రంగమునకు

చీఁకటి బేర మెందనుకఁ జేసిరో? లంచము లెన్ని మెక్కిరో?
వాకున కెక్కరాని యలవాటుల కెన్నిటికిం దెగించిరో?
లేకులు, పాకలన్ గెడపి లేపిరి మేడలు, చంద్రశాలకున
ప్రాకిరి, కొయ్యమోర నడిబాటల నెత్తిరిఁకేని సెప్పెదన్?

తొలుసంజఁ బుట్టు వాఙ్మలకు బైసి దొఁగి
మలుసంజ నపరకర్మంబు సలిపి
కులపాశములఁ దగుల్కొని శుంరలను బిల్చి
యుత్తాల పదవిఁ గూర్చుండఁ బనిచి
లంచాల గడ్డి కాసించి లోకులఁ గ్రుమ్ము
నధికారి పశువుల కచ్చుపోసి
చీఁకటి బేరముల్ సృష్టించి పేద నె
త్తురు పీల్చు రక్కసి మురక విడిచి
వరువు దక్కించుకొన్నట్టి దొరతనంబు
లేదు భువనత్రయంబులో లేదు లేదు
చెప్ప నేటికి విద్యా విశిష్టుఁడైన
మంత్రిముంగడ ధర్మ మర్మంబు లెత్తి.

విద్వాన్ విశ్వముగారు రచించిన 'పెన్నేటిపాట' పశ్చిమాంధ్ర ప్రజల జండ బ్రదుకును ప్రదర్శించునట్టిది. ఒకవాడు రాయలసీమ కలిమికి కొటా

రము. ఈనాడు లేమికి బండారము. ఉద్యానవనములున్న వీడులు వల్లేరు గాయల బీడులయినవి. పైరుపంటలతో పచ్చగానున్న పల్లెపట్టులు నీటి యెద్దడికి, ఆటపట్టు లయినవి. కండల కరగించి, యెముకలు పిండిచేసి, రెక్కాడితేగాని డొక్కాడని ప్రజలకు. ప్రాచీన వైభవము స్వప్నముగా మిగిలి, పాలకుల యౌదాసీన్యమునకు బలియైపోయిన గడ్డ పశ్చిమాంధ్రము. అనతి విస్తృతమయిన కథను దీసికొని, వెట్టి చాకిరిచేయు పడుచుజంట బ్రదుకులోని లేమిని చేదును వెలార్చుచు విశ్వముగారు పశ్చిమాంధ్రమును జూడని వారిని సైతము బావురుమని యేడ్పింపగల వారయిరి. నారప్పరెడ్డి బ్రతికి చెడినవాడు. పొగడ్తలకు పూజలకు జరుగుబాటులకు ఇల్లు గుల్లకాగా నారప్పరెడ్డి కడకు నారప్పయయ్యెను. వాని కొడుకు రంగడు. అతని భార్య గంగమ్మ. అరణ్య వస్తువుల నమ్మువాడు రంగడు. ఇంటి యూడిగము చేయునది గంగమ్మ. దారిద్ర్యము, కాయకష్టము, దంపతుల దుంప తెంచినవి. గంగమ్మ గర్భవతి యయినది. ఏమి చేయుటకు పాలుపోని రంగడు స్తబ్ధుడయ్యెను. కవియు ఆక్రోశించెను.

కండలు గోసి, పాల్గడి, బికారులజేసి, జవాల నెత్తురుల్
పిండుచు, కుక్కకూడయిన పెట్టక, పొట్టలుగొట్టి, కూలలన్
దిండుల గానబెట్టి, జగతిన్ గరుణార్ద్రత కగ్గిపెట్టు పా
షండుల వల్లకాదు, మనసా! యిది మానవ సంఘ మెట్లగున్?

గుండెలు కోసి యివ్వగల కూరిమి, కొండలు మోయుతాల్మి, క
ట్టెండల నిల్చి బండల పెకిల్చిన బద్దలుకొట్టి, బంగరున్
చెండుల పైకిదీయగల చేవ, జితించిన వీరి కర్మమా
ర్తాండుల ఊచితాపడు వెలుఁగను పాతకమేల దైవమా!

సంప్రదాయచ్ఛందస్సులు, భావధారానుగుణముగా లయబద్ధ గమనము గల వివిధ రచనారీతు లీ కావ్యమందున్నవి

స్వాతంత్ర్యము వచ్చి, పారిశ్రామిక విప్లవము వచ్చిన తరువాత భారత దేశములో నగరములు ప్రాముఖ్యమును సంతరించికొన్నవి. ఆ నగరముల బ్రతుకు బండారమును బయటపెట్టుటకు ఆరుద్రగారు "సినీవాలి"లో ప్రయత్నించిరి

"పాడుతాను నాకు తెలిసిన నగరం గురించి
నగరంలో నాతి గురించి, నీతి గురించి
రకరకాల సన్నివేశాలలో ఆవేశాలలో
ప్రకటించుతాను మనలాంటి మనుష్యుల గురించి"

అని ఆరుద్రగారు కావ్యవస్తు నిర్దేశము చేసిరి. నగరమునకు వచ్చిన పడుచువాడు-- పేరు సూర్యుడు-- స్వైర విహారము చేయుబజారమును "రాజకీయ నవనంద" జగన్నాటకమును జూడలేక తిరిగి పల్లెకు వెళ్లెను. మరల నగరమునకు వచ్చి "గుమాస్తాగిరి" సంపాదించును. పెండ్లి చేసికొనును. అతని కోరికలు తీరవు బ్రదుకు పండదు పెండ్లి విషయమున తండ్రికొడుకుల భావ తారతమ్యము, వధువుల వాంఛలు, వరుని యూహలు నిందు చిత్రింపబడినవి. భావమును మించి శబ్దము చేయు సాము ఎక్కువగా గల యీ కావ్యములో నగర జీవితము స్థూలముగా గోచరించును. కావ్యాంతమున గల "తప్పొప్పుల పట్టిక" నూతన రూపకాలతో సిద్ధమయినది

భగవంతుని అచ్చాఫీసు
ప్రచురించిన మానవప్రకృతి కావ్యంలో
లెక్కలేని అచ్చుతప్పుల్ని
ఇక్కడ మానవుడే దిద్దుకోవాలి.

సాంఘిక గ్రంథాన్ని సనాతనులు
చాదస్తపు నియమాలతో బైండు చేశారు.
అకుట్లూ కట్లూ సడలించి మళ్లా
ఆధునికంగా క్యాలికో బైండు చేద్దాము.

అలాచేయడానికి ముందుగానే
అడ్డదిడ్డంగానున్న బ్రతుకుల ఫారాలను
యథాస్థానాలలో సర్ది, సామాజిక
కథాక్రమాని కద్దు లేకుండా చేద్దాము.

యుగపురుషులు ప్రూఫ్ రీడర్లు
జగత్ కావ్యాన్ని పరిదిద్దినా
పరిస్థితుల కంపోజిటర్లు
కరక్షన్లు చేయటానికి టైపులు లేవు.

కొత్త టైపులు సృష్టించుకొందాం
మొత్తం కావ్యం పునర్ముద్రిద్దాం
అంతదాకా ఈ తప్పొప్పుల పట్టిక
అందరం తయారు చేద్దాం గట్టిగ.

## 8

ఒకానొక మంగళ ప్రభాతకాలమున బంగారము పండించుచున్న యుషో రాగమును జూచి, దివ్యద్రష్టయయిన ఋషి "తమసో మా జ్యోతి ర్గమయ" యని గానము చేయగలిగెను చీకటినుండి వెలుగునకు చేర్చుమని యా ఋషివాణి కర్థము. ఋషుల వాక్కు నర్థము ననుసరించునని భవభూతి చెప్పెను. మహర్షులు చెప్పినట్లు జరుగునని భవభూతివాక్కుల తాత్పర్యము. కాని కర్మభూమియగు భారతదేశములో యాఋషీశ్వరుడు పలికినట్లుగా జరుగకుండుట దురదృష్టము. ధర్మము పేర, కర్మము పేర, కులముపేర, గోత్రము పేర, ప్రాచీన భారతీయసంఘమునందు నూటికి తొంబదిమంది వెలుగునుండి చీకటి గుయ్యారములకు నెట్టబడిరి. మహర్షివాణి విఫలమయినది.

ఆంగ్లదేశీయులు ఎదురులేని యేలుబడి చెల్లించుకొనుకాలమున భారతీయ సమాజమునందు సంభవించిన పరివర్తనము లెన్నియని చెప్పగలము? పఠన పాఠనములకు సర్వకులముల వారు యోగ్యులయిరి. కులమునుబట్టి యేర్పడిన ప్రాచీన శిక్షాస్మృతి విమర్శక పాత్రమయినది. ధర్మదేవత యెదుట సర్వ వర్ణములవారు సమానులయిరి. వర్ణాశ్రమ వ్యవస్థ సడలి పోయినది. కులముకంటే గుణము మాననీయమయినది. కర్మము శాశ్వత బంధనము గాదనియు, అవకాశములున్నచో అధమకులజు డయినను సంస్కారపరుడు కాగలడనియు భారతీయులు నమ్మజొచ్చిరి.

ఒకనాటి సమాజమును సమర్థించుటకు వ్రాయబడిన స్మృతులను, పురాణములను ఖండించుట మొదలయినది. పంచలక్షణ లక్షితములయిన పురాణములు విజ్ఞాన నిలయములు గాక అజ్ఞానమునకు, మూఢ విశ్వాసములకు, దురాచారములకు మూలకందములని భావించువారు బయలుదేరిరి. సంఘమునందలి యజ్ఞానమును జూచి యావేదనము చెందినవారు సత్యమును శోధించుటకు పూనుకొనిరి ముద్రణయంత్రముల మూలమున, విద్యావ్యాపనము వలన నిషేధములు లేక, ప్రాచీన కాలమున చదువకుండ వెలివేయబడినవారు సైతము శ్రుతిస్మృతులను పురాణేతిహాసములకును నూతన దృక్పథముతో చదువజాగిరి. మానవత్వమును మాత్రమే మన్నించు వీరు వేలకొలది యేండ్ల నుండి చెల్లుచున్న సిద్ధాంతములను సత్యపరాయణులై యుదారబుద్ధులై చీల్చి చెండాడుటకు సైతము వెనుదీయరైరి విజ్ఞాన శాస్త్రముల పురోగమనము కూడ వీరిని ప్రోత్సహించినది. లోకేశ్వరుడు చెప్పినది గావచ్చు. లొడారి బుచ్చిగాడు చెప్పినది గావచ్చు, ప్రతిగ్రంథము, ప్రతివిషయము హేతువాద పూర్వకముగా పరిశీలింపబడినది. భగవంతుడు, సృష్టి, విశ్వము, మానవజాతి, సంఘము, సాంఘిక పరిణామము, తదితర విషయములు శాస్త్రీయ దృష్టితో పరీక్షింపగా నాంది పలుకబడినది. ఎవరి కే తాపము కలిగినను, ఎవరెట్టి శాప మిచ్చినను తగ్గక, బందాటముతో బ్రతుకునందలి కసటును కడుగగా ఈ సాహసులు ప్రయత్నించిరి కలమును చేపట్టి కావ్యములు వ్రాసిన కవితాశూరు లయిరి. ఆ శూరులలో ప్రథమగణ్యుడు త్రిపురనేని రామస్వామి చౌదరి వారు

రచించినదే నూతపురాణము అది 'బరాతు పురాణముగాదు'' "ప్రాత పురాణమునుగాదు". "పూతపురాణంబ పుణ్యపురుషావళికిన్".

రామస్వామి చౌదరిగారు నూతపురాణమును గూర్చి యిట్లు భాషించిరి. "ప్రాకృత జనంబునకు వేదార్థము సులభైకవేద్యము గాదని యెరింగి వైదికులును, నిష్కాములును, లోకసంసర్గరహితులును, విసర్గ భూతదయాశీలురును నయిన ఋషిచంద్రుల నిర్వ్యాజకరుణావిశేషంబున 'స్త్రీ శూద్ర ద్విజబంధువు'లను ముక్తి మార్గమునుజూపి తరింప జేయుటకునై వేదార్థము నుటంకించి వ్రాసిరని యార్యోక్తి. ఈ యార్యోక్తియందు విశ్వాసముంచి, మూఢలోకంబు పురాణములు ఆప్తేయములనియు తదాచరణమున బ్రాహ్మ్యము అనియు తదంతర్గతధర్మములు, నీతులు కథల శిరోధార్యము లనియు విశ్వసించుచున్నది. ఈ విశ్వాసము వలన గలిగిన ప్రతిఫల మాత్మద్రోహముగ బరిణమించుట చేసి, పురాణము లెంతవరకు బ్రతికాలములో ఎంతవరకు నీతిబాహ్యములో, ఎంతవరకు పక్షపాత భూయిష్ఠములో మోడ్పుగన్నులతో నున్న విద్వల్లోకమునకు జూపించ తలంపుతో నూతపురాణము రచింపబడినది. తత్కారణమున నూతపురాణము కారణజన్మ.'

రామస్వామి చౌదరిగారిటి యుదారబుద్ధిలో బయలుదేరిరి వారి వ్రాతలకు దుర్వ్యాఖ్యానముల వ్రాసి లేనిపోనివి వారికంటగట్టుట శోచనీయము. హాసము, ఉపహాసము (Humour and Satire) వారి రచనారీతిలో అసుఖదమున పాలెట్లును చెప్పవలసిన దానిని ఎబట సాక్ష్యములతో, తెనుగుదనముతో చెప్పుట వారి పద్ధతి మహర్షులు వ్రాసిన గ్రంథములనే ప్రమాణములుగా దీసికొని రామస్వామి చౌదరిగారు విమర్శకు గడంగిరేకాని, నేల విడిచి సాము చేసినవారు గారు ఆ గ్రంథముల యందలి పొలుపొందికలు లేని విషయముల నెన్నిటినో రచ్చకీడ్చిరి యుగవిభజనము, తల్లక్షణములు ననుచితములని తీర్మానించిరి వర్ణవ్యవస్థ బండారమును బయట పెట్టిరి సంస్కృతాభ్యాసనమును గూర్చి వ్రాసిరి

రామస్వామి చౌదరిగారి హాసోపహాసములకు నెన్ని పద్యములయిన తార్కాణింపవచ్చును. వ్యంగ్యమయములయిన యీ క్రింది పద్యముల పరిశీలింప దగియున్నవి.

మలమల మాడు పొట్ట, తెగమాసినబట్ట, కలంతపెట్టగా
విలవిల యేడ్చుచున్న నిరుపేదకు జాలిని జూపకుండ, ను
త్తలపడి పోయి జీవరహితంబగు బొమ్మకు నిండ్లు వాకిళుల్
పాలమును బోట్ట నిచ్చెడి ప్రబుద్ధవదాన్యుల నిచ్చమెచ్చెదన్.

పసిన దోప విశ్వేశ్వరుని చింతనచే వశియించుచున్న వి
శ్వాసము కల్గి రేబవలు పాపమొనర్చుచు దీరినప్పు డే
లో సమయంబునం గలము దొందరగా గొని, రామకోటినిన్
వ్రాసెడి భక్తకోటి పదపంకజముల్ శరణంబు వేడెదన్.

కామపరీత బుద్ధి గుణకర్మ పరీక్షను మాని । బ్రాహ్మణ
స్వాముల జేసి కొండఱిని, బానిసలం బొనరించి కొందఱిన్
బరామెలు చెప్పి, యీ భరత భూమి గలంచెడి వర్తమాన హిం
దూమత సంప్రదాయమును దోసిలి యొగ్గి భజింతు నిచ్చలున్.

సంసార జంబాల పటలములో దిగబడిపోయిన దేవతలు ముక్తి యాలేరని రామస్వామి చౌదరిగారనిరి క్షుద్రదేవతలు లంచగొండులని వారి తీర్పు

ఇల్లు సువాకిలిం గలిగి యిప్పుడో ముగ్గురో యూండ్రు గల్గి, పై
బిల్లలు జల్లలుం గలిగి, వెక్కసమైన కుటుంబ భారమున్
వెల్పవ సీవలేక పలవించెడి దైవతకోటి నా మొఱల్
మెల్లగ నాలకించి లవలేశము ముక్తి నొసంగ నేర్తురే.

మొడుపు గట్టిన గాని సమ్మోదపడలు
పేట తల జూచి కాని మోసొటపడరు
నోటురాదా దే రెట్లు పూజసేతు
లంచగొండులనమ్మ గొల్పించుచుండ.

రామస్వామి చౌదరిగారు పురాణముల సత్య స్వరూపమును నిట్లు కనుగొనిరో తెలిసికొనవలయునన్న, వారు చేసిన స్వర్గ వర్ణనము నెల్లరు తప్పక పఠింప వలయును. ఆ వర్ణన మిట్లున్నది:

ఇంద్రా యున్నని కాని పెండ్లిండ్లు లేవు
అండ్రా యున్నారు గాని యిల్లాండ్రు లేరు
బాగు! శివ! శివా! యిది వట్టి భోగభూమి
యుండరాదింక మావంటి యోగులకును.

మిన్నేటి గట్టుపై నిడుకుద నందునా
కొంటె కన్నియ లీడగొట్టు బోటు
నందనోద్యానంబునం దుందు నందునా
గోవాంద్ర గవి గుంపుగూడు చోటు
పొన్నారి పొదరింట బవ్వళింతు నందునా
కాముకీ కాముకుల్ గలియు చోటు
కొండ నెత్తము నెక్కి కూర్చుందు నందునా
చారవల్లభ యాండ్రు తిరుగు చోటు
కాన యిట్టి జాబు చోటొక్క టేనె కైన
మానిజన వాసయోగ్యమా దాని నటుల!
బాగు! శివ! శివా! యిది వట్టి భోగభూమి
యుండ రాదింక మావంటి యోగులకును.

ఒకానొక దేవాంగన యన్నట్లున్న యీ క్రింది పద్యములు "అది స్వర్గమా? జారనిలయమా?' యను శంకను కల్గించుచున్నవి.

స్వైర విహార నిష్ణమెయి, సర్వదిగంతర దివ్య దేశ సం
చారము జేయు మాకు గ్రహచారము చాలక, సంతు గల్గినన్
వారల నెల్ల, గన్న మగవారికి నిత్తుము కాని, పెంచు నా
చారము లేదు స్వర్గమున, సత్యము జెప్పితి, సంచు నామెయున్.

అలకింపుము, స్వర్లోక మందున్న
మానినుల యందు పెండ్లిండు లేని కార
ణమున మరుతెత్తి మర్త్యలోకమును, దేశ
దేశముల వయింబడి వారు తిరుగుచుంద్రు.

"అల్ప కల్లోలమ్మై' యున్న "నాకపురము" లోని యొక సన్నివేశమిట్లు వర్ణింపబడినది.

విసవిస పోవుయూజి యొకవీధిని బోవుచు, వేశ్యవాండతో
గుసగుస లాడు పెల్వగని, కోపన గావున నోవిడమ్మ యుబ్బున్
బుసబుసలాడి, 'భూస్థలిని బోకడ లిట్టివి యున్నె?' యుంచు దా
దన తప పూవుటీర మొక దానిని దారెను వొంగదాలినిన్.

రామస్వామి చౌదరిగారి చారిత్రక దృష్టి పాఠకుల నాశ్చర్య చకితులను జేయును. ఆంగ్ల విద్యాలసుల నిష్కామ సేవవలన భారత దేశ చరిత్ర యందలి యథార్థము వెల్లడి కాకపోలేదు. ఈ దేశము నందతి ప్రాచీన కాలమున ద్రావిడులు నివసించి, మహారాజ్యముల నాగరకతను సృష్టించిరి. పరదేశముల నుండి రొంతెంచిన యార్యులు ద్రావిడులను జయించి పాలుకొని పోయిరి. రామస్వామి చౌదరిగారీ చూపుతో రామాయణమును జదివిరి దివ్యులలోని రాక్షసత్వమును, రాక్షసులలోని దివ్యత్వమును లోకమునకు చూపిరి. భాషా శాస్త్ర సహాయముతో దశగ్రీవాది శబ్దముల వ్యుత్పత్తి కనుగొనిరి వారి పాలికి రావణుడిట్లు కన్పించెను

పది దిక్కులను గెల్చి బహుళయ స్తంభముల్
పాతిపెట్టించిన బలి దుండ
పది శాస్త్రములు గటిసట్టతో బఠియించి
ప్రజా ధురీణుడౌ పండితుండు

పదునాల్గు లోకముల్ బవరాన నోడించి
కాలి క్రిందను బెట్టు కాలిబంటు
పదియారు కళల ప్రపంచంబు దనియించు
శశి చెంపఁ గొట్టిన సౌమ్యమూర్తి
కడుపులో చల్ల రవ్వంత కదలకుండ
ద్రవిడజాత్యభిమాని యధార్థవాది
ప్రాజ్య రాజ్య మేలుచునుండె రావణుండు
ఉర్వితాహిత లోక విద్రావణుండు

పలుగాకి పులుగాకుఁ బొలిపుచ్చి తినినాఁడు
చీకాకు పడకుండఁ జేసినాఁడు
గాటంబుగాఁ జెలగాటంబుగాఁ జెల
రేఁగి, మార్తాండుఁ జీల్చి రేఁగినాఁడు
గోపురంపు పురంబు బాపురే! యని పిల్చు
కొండ కొమ్మ మధ్య గూర్చినాఁడు
కలిచేత దన్ని, యాకలి మాన్పి, గిరి మాన్పి
నలిమాన్పి యెల్లర నిలిపినాఁడు
కుదురునకు బట్టుగొమ్మయై కుదిరినాఁడు
నాఁడు తాను గొల్వ నొనరించినాఁడు నాఁడు
నడుమలేని నాయకుఁడైనాఁడు నాఁడు
రావణుం డార్యలోక విద్రావణుండు

లక్ష్మే మహాభారత పాత్రల మంచి సెబ్బరల నెంచిరి శ్రీకృష్ణుని రాజనీతి చాతుర్యమును గుర్తించిరి రాముఁ డిరువురున్నారనియు, దశరథు లిద్దరనియు తెల్పిరి 'భారత వర్షమునకు ధృష్టద్యుమ్నుడు దత్తపుత్రుడని యూహించుచుంటిమి' యని నుడివిరి ధర్మజ భీములు కౌంతేయులు గాని పాండవేయులు గారనియు అర్జునుడే పాండవేయుడనియు చెప్పిరి 'భగవద్గీత' యందలి సత్యాసత్యములను బట్టబయలు చేసిరి వారీ గ్రంథమునకు వ్రాసిన పీఠిక నూతన వ్యాఖ్యానముతో కూడియున్నది వర్ణ శబ్ద విచారము చేసి ఆర్యమత వర్ణముల గుట్టుమట్టులను విప్పి చెప్పిరి వ్యాసకృత గ్రంథమగు 'జయ' మందు, భగవద్గీత కానరాదనియు, 'జయ' గ్రంథమును దండకవిలెగా బెంచి భారతమును, మహాభారతమును జేసిన సౌతియో, వైశంపాయనుఁడో భగవద్గీతను భారత సంహిత యందు నిక్షేపించియుండు' రనియు చాటిరి. రామస్వామి చౌదరిగారు క్రొత్తగా నొక 'భగవద్గీత'ను వ్రాసిరి బ్రహ్మనాయడు బాలచంద్రునకు చేసిన గీతోపదేశ మిది వారే యిట్లు వక్కాణించిరి

'కారెంపూడి యుద్ధమును, గురుక్షేత్ర యుద్ధమును సరిపోల్చి చర్చింపవలసిన యగత్యమేమి కలదైనా యని కొందరు శంకింపవచ్చును ఉత్తర దేశంబున దాయభాగము కొరకై యన్నదమ్ముల బిడ్డలు కొట్టుకొని చచ్చినది కురుక్షేత్ర యుద్ధరంగము కాలక్రమమున నందలి యోధులెల్లరు భగవదవతారములును, దేవాంశ సంభూతులు నైరి ఈ విధముగనే దాయభాగమునచే నన్నదమ్ముల పోరాడి మరణించినది కారెంపూడి రణరంగము ఇందు మరణించిన యోధులు గూడ భగవదవతారములుగను, దేవాంశ సంభూతులుగను వాసికెక్కి గుడి గోపురములు గట్టించుకొనిరి కురుక్షేత్ర సమరభూమి యందు గార్హ్యక భగవద్గీతోపదేశము జరిగినదని ప్రతీతి. ఇట్లులనే కారెంపూడి యుద్ధభూమి యందు బ్రహ్మ జగద్గీతోపదేశము జరిగినది కావున నీ రెండు మహాయుద్ధములను సరిపోల్చి చూడవలసిన యావశ్యకత యేర్పడినది '

హేతువాదము, హాసోపహాసములు పరాకోటి కెక్కిన కావ్యము 'భగవద్గీత.' రామస్వామిచౌదరిగారి భావములకు బ్రహ్మనాయుడు సాధనమయ్యెను. ఆదికాలమున నున్నది గుణత్రయము ప్రధానముగల మూడు కులములె మానవులు స్వార్థపరులై మిగిలిన వర్ణములను సృష్టించిరి పితృలోక మనునది యొకడు లేదు మానవుడు కర్మఫలము ననుభవింపగా భూలోకమున నడుచుండ నింక పితృలోక మెక్కడ నున్నది?'— ఇట్టి సిద్ధాంతము లీ 'భగవద్గీత'యం దున్నవి దీని యందలి 'విభూతి యోగము' చమత్కారముగా నుండును 'భగవద్గీత' తత్త్వమున కుదాహరణముగా నొండు రెండు పద్యముల నుద్ధరింతును.

అధిక సంఖ్యాకుల కరిష్టమైన కర్మ
మెల్లను, నహింస యయ్యును హింస యగును.
హింసయయ్యు నహింసయౌ నెది గరిష్ఠ
జనుల కల్యాణమును గూర్పజాలియుండు.

వెలుగుల రక్కసి వెలుగును
బులుగులలో రామబందు పులుగును పేనే
కలుగులను బుట్ట కలుగును
తెలుగులలో నెల్ల మాలతెలుగును నేనే

ఇతిహాసగత పాత్రల మనస్తత్వమునకు యుగానుకూలమయిన వ్యాఖ్యానము చేసిన కావ్య ఖండములు కలవు. వానిలో కాటూరి వేంకటేశ్వరరావుగారి 'పౌలస్త్య హృదయము' చక్కని చిక్కని కావ్యము రాముని రాక నెఱింగించిన సముద్రునితో రావణుడాడిన మాటలే యీ కావ్యమున కొక్కాణ్నవి. రావణుని వైరభక్తి బహుముఖములుగా వర్ణింపబడినదీ కావ్యమునందు

'ఎన్నాళ్లకు! ఎన్నాళ్లకు
కన్నులు వింశతియు నాకుఁ గల్గిన ఫల మా
సన్నమయి వచ్చె! భుజగ
ద్వేష్ణతి చరితార్థమగు ముహూర్తము వచ్చెన్.

నాఁటికి నేఁడా? తలఁపున
నాటెను సామికి వికుంఠ నగరోదితమౌ
మాటలు, దీర్ఘవిళంబము
నాటించి విభుండు నన్ను వంచించెఁగదే!!'

యని రావణు డనుకొనెను భక్తులు ధ్యాన తపోయోగాదులవలన రాముని దర్శింతురు రావణున కా మార్గములు దూరమయినవి 'కఠోరవృత్తినై సామిని మున్నెఘోరరణసత్ర నిమంత్రితు జేసి యుంచుటన్' అని రావణుడే చెప్పెను రామ దర్శనముకై 'జానకమ్మ తల్లినే హరియింపక తప్పదాయె'నని లంకేశ్వరు డనుకొనక తప్పలేదు రావణుడు సముద్రునితో నింకేమనెను?

అగుదురు మిమ్ముబోంట్లు చరితార్థులు కాదనఁగాని, మోము మున్నుగానిన తండ్రికంటె, దయతో, జను గ్రోల్చిన తల్లికంటె, పైనగమగు సీతకంటెఁ, బరిచర్య లొనర్చిన తమ్ముకంటె నీ
జగదభిభూతి రక్కసుఁడె సామికి మిక్కిలిఁ గూర్చు నెచ్చెలీ!

రాముని ముగ్ధ మోహనముఖారవిందమును, అపరాజిత విక్రమక్రమము దలచుకొన్నంతనే రావణుని కొడలు పులకరించును 'స్వీకృత వీరవ్రత పరిపాకము, వైరానుబంధ ఫలసిద్ధి యిదే నైక రణ ప్రణయిని! యెటు కాకుత్స్థున కాజిభిక్ష కల్పించెదరో' యని భక్తవరుడు వీరశిరోమణి యగు పౌలస్త్యుడు చంద్రహాసము నుద్దేశించి పలికెను

భారతీయులు ప్రజాతంత్రమును వరించిరి ఓటు ప్రబలకరణమయినది భారతదేశము తదితర దేశములవలె పురోగతి నందుచున్నది ఈ సహజముగా ప్రాత క్రొత్తలకు ఎక్కటి కయ్యము తప్పదు మానవ జీవిత లక్ష్యము వివరించుచు, ప్రజాస్వామ్యమును వర్ణించుచు, హేతువాద ప్రాశస్త్యము నుగ్గడించుచు, యుగానుకూలమయిన జీవన తత్త్వమును ప్రతిపాదించు కావ్యమును నార్ల వేంకటేశ్వరరావుగారు రచించిరి. ఆ కావ్యమే 'నార్లవారి మాట.' 'జీవితాన్ని గురించి, సంఘాన్ని గురించి, సాహిత్యాన్ని గురించి నా అభిప్రాయములను, నా అనుభవాలను ఈ పద్యాల రూపంలో వ్యక్తీకరించడానికి ప్రయత్నించాను . . నా అనుభవాలు నావే కావచ్చు, నా అభిప్రాయాలలో కొందరు ఏకీభవించక పోవచ్చు. అయినా వాస్తవిక జీవితానుభవాలనే ఇందు పొందుపరచానని, చిత్తశుద్ధిపూర్వకమైన అభిప్రాయాలనే వెల్లడించానని నా మనవి....' కాలము మారినది. ఒకనాటి మానవుని కలలు నిజమగుచున్నవి.

మానవుడు నూతన జీవన ప్రాంగణములో నడుగిడుచున్నాడు. ఈ నూతన జీవనమునకు, ఈ నవ యుగమునకు తగిన తాత్త్విక దృక్పథమును మానవుడల వరచుకొనవలెను అట్టి తాత్త్విక దృక్పథమునకు ఆకరమయిన కావ్యము 'నార్ల వారి మాట'

తన కాలమున నాటి సంఘమును వేమన యెట్లు చూచెనో, యట్లే యీనాటి సంఘమును నార్లవారు చూచిరి. ప్రజాతంత్రమునందు పాలకులు, పాలితులు నగు ప్రజల పాటింపదగిన, పరిగణింపదగిన సూత్రములను, సూక్తులను వారు వక్కాణించిరి. వ్యక్తిగా, గృహస్థుడుగా, పౌరుడుగా, మేధావిగా, ప్రజాస్వామ్య వాదిగా, మానవతా వాదిగా వెంకటేశ్వరరావు గారి కావ్యమున మనకు గోచరింతురు పత్రికా సంపాదకుడుగా వారత్యున్నత స్థానమెక్కిన వారు గావున పత్రికా వారా ప్రాభవమును వారిందు నుగ్గడించిరి.

'చరిత యనగ కాదు సామ్రాజ్య కీర్తన; చరిత యనగ కాదు సమర గాథ; చరిత యనగ సకల నరజాతి ప్రగతిరా' యని నార్లవారుద్ఘాటించిరి ఇది సమసమాజవాదులు చెప్పుచున్న వ్యాఖ్యానము కంటె భిన్నమయినది. ఈ గ్రంథకర్త వర్గదృష్టితో చరిత్రను చదువలేదు. కాలము మారిపోయినది. 'రాజు పోయెను; అతని రాణియు పోయెను; నంది పోయెను; అతని చెంబు పోయెను; సార్వభౌముడయ్యెను సామాన్య పౌరుడు' ఏ జాతియయిన నభివృద్ధి చెందవలెనన్న దానికి ముందుచూపు యుండవలయును. 'గతవిభూతి తోడ, వ్యర్థభాష తోడను, జాతి ముందు కెట్లు సాగగలదు; దారి చూపగలదె ఆరిపోయిన దివ్వె?' యని వారు ప్రశ్నింతురు. అంతేకాక హేతువాదము వలనే నరుని బ్రతుకుతో 'ప్రగతి మార్గము చూపు' ననియు, 'హేతువాద వహ్ని, హిమము రీతి కరగి నాశమందు నన్ని' 'నమ్మకమ్ము; నిత్య సత్యమేమొ నిగ్గుదేలు మరింత' యనియు గట్టిగా చెప్పిరి. అట్టి హేతువాద ప్రియులు గావుననే వారీ క్రింది విధముగా చెప్పగలిగిరి.

'ప్రోయాబోడ సుమ్ము వాల్మీకి నేటున్న
రఘుకులమ్ము గూర్చి, రాము గూర్చి
ప్రజకు నేడతండు పట్టమ్ము గట్టును.'

ఈ కావ్యమున రాజకీయాభిప్రాయములును కలవు.

'వర్గ కలహ మొకటె స్వర్గ మార్గము కాదు
ప్రగతి లేదు రక్తపాతమందె
మార్క్సు దొర యొకండె మార్గదర్శియు గాడు'

అని నిర్ధారించిరి కాని 'వర్తమాన జగతి వ్యాధుల న్నింటికి, నౌషధమ్ము సుమ్ము సోషలిజమ్ము; సోషలిజమె సర్వ శుభముల గూర్చురా' యని వెంకటేశ్వర రావుగారు విశ్వసించిరి. వారెంత దూరము పోయిరో చూడుడు:

'సోషలిజము వేదసూక్తమై వెల్లక
వర్తమాన మౌనె వసుధ నేడు
సోషలిజమె నేటి సుశ్లోక మతమురా'
'మార్పు లొందుచున్న మానవ సంఘాన
సోషలిస్టు కాని క్షుద్రనరుడు
మానవతకె నేడు మచ్చను తెచ్చురా.'

'సోషలిజము పెంచు సోదర భావమ్ము. 'అది' త్రుంచు సోదలనెల్ల' అది 'లేక శోభ లేదు' సోషలిజము దృష్టి శూద్రులనుచు లేరు; దాని దృష్టి, లేరు ధరణి సురులు; సోషలిజము భేదశూన్యమై వెలుగు. మొత్తము మీద 'వాస్తవమ్ము నార్లవారి మాట' యను మకుటము గల యీ కావ్యము ప్రజాతంత్ర సామ్యవాదము (Democratic Socialism)ను ప్రతిపాదించును.

మానవజాతి ప్రగతి మార్గమున బోవుచున్నను యీనా డది విషమ స్థితి యందున్నదనియు, అది యచిర కాలములో తొలగి పోవుననియు నార్ల వారి యాకాంక్ష. 'అణు యుగము నందు అడుగు పెట్టె నరుడు రాతి యుగము నాటిరీతి విడడు; నడత మారకున్న నరుడెటు మారురా?' యని వారనిరి. 'ప్రకృతినే జయించి పరమాణువును చీల్చి శాస్త్రవేత్త కూర్చె సకల సిరులు; రాజకీయవేత్త రణమును కూర్చె' ననియు, 'నరుడు తినడు గాని నరమాంసమునాడు బ్రతుకగోరు పరుల బ్రతుకు కాల్చి' యనియు వారు గుర్తించిరి. ఈ స్థితి తొలగుటకు మానవతావాదము, దాని నుండి పుట్టిన కరుణ ప్రేమ ముఖ్యగునవి హేతువులని వారి తలంపు 'ఎన్ని పేర తోచ నెన్ని మతములున్న, మానవతను మించు మతము లేదు మానవత ఫలింప మానవుండె తరించు' ననియు 'మతములనుచు పుట్టె మన్వంతరము లాయె; మనుజు నందు మిగిలె దనుజ వృత్తి, మతము లెప్పుడింక మనుజుని పెంచురా?' యనియు, 'ఏరులై పారలె కారుణ్య మొక్కటే, నరుని సురుని చేయు పరుసవేది' యనియు, ప్రేమ కారణాన పృథ్వి శ్రీలను చెందుననియు వారు పాడిరి.

## 9

ఏ కాలము నందైన మానవుని నెదుర్కొను సమస్యలను పరిష్కరించి కొనుటకు రెండే రెండు బాటలుండును. అందొకటి హింసా పద్ధతి ఇది సద్యః ఫలము నిచ్చునట్లు కన్పించును కరుణాది కోమల భావముల కిందు చోటులేదు. పగను పగతోడనే పరిమార్పగలమను తత్త్వము హింసామార్గమునకు పునాది. మానవ జీవితములో— ప్రపంచ చరిత్రలో సంభవించిన పరిణామములన్నియు హింసా పద్ధతి వలననే కలిగినవన్న భాష్యకారులుండిరి. 'నరజాతి చరిత్ర సమస్తం పరస్పర హరణోద్యోగం, నరజాతి చరిత్ర సమస్తం రణరక్త ప్రవాహసిక్తం' అనియు, 'రణరంగం కాని చోటు భూ స్థలమంతా వెదికిన దొరకదు, గతమంతా తడిసె రక్తమున, కాకుంటే కన్నీళ్లులతో' అనియు కవి నిగ్గు తేల్చుట ప్రపంచ చరిత్రలో హింస నిర్వర్తించిన పాత్రను పరిశీలించియే.

ఇక రెండవది అహింసా పద్ధతి ఇది విలంబితి ఫలము నిచ్చునట్లు గోచరించును ప్రేమ, కరుణ, మైత్రి, క్షమ మున్నగు సుకుమార భావము లిందు ప్రముఖములు. హృదయ పరివర్తనములో వైరమును పారద్రోల వచ్చునను సిద్ధాంతము దీనికి జీవగర్ర అహింస యనునది కేవలము జీవహింసకు వ్యతిరేకమయినది గాదు అది మానసిక, వాచిక, కాయిక రూపములలో పాదుకొనవలయును అనగా త్రికరణ శుద్ధి గలదియే యహింస

మానవ జీవితము ఈ రెండు పద్ధతులలో ఏ యొక్క దానితోడనే కూడి యుండునా? అట్లుండుట కవకాశ మున్నదా? తిలతండుల న్యాయముగా రెండు గూడి యుండునా? ఇవి అన్యోన్య పోషకములా? ఈ ప్రశ్నల కిదమిత్థముగా అతివ్యాప్తి అవ్యాప్తి దోషములు లేకుండ సమాధానములు చెప్పుట సాధ్యముగాదు.

పగ యడగించు టెంతయు శుభం, బది లెస్స యడంగునె పస్
పగ వగొన్న మార్కొనక పల్కక యుండగవచ్చునె, కడుం
దెగ మొదలెత్తి పోవ పగదీర్పగ వచ్చిన, క్రౌర్యమొందు, నే
వి గతి తలంచినన్ పగకు పోలిమి లేమి ధ్రువంబు కేశవా!

యన్న ధర్మజుని మాటలు అనాది కాలము నుండి యీ విషయమున మానవుని యంతరంగము క్రిందుమీదగు చున్నదని చూపి చెప్పుటకు తార్కాణములు.

ప్రవక్తలయినవారు ప్రేమాది భావములకే పట్టముగట్టిరి హృదయ పరిపాకము లేని పామరజనులను, వారు అహింసా మార్గము వైపునకే త్రిప్పిరి. మహమ్మదు మాట యటుండ నిండు ప్రవక్తల ప్రవచనములు హింసా సంతప్తమగు ప్రపంచమునకు పీయూషధారలవలె నున్నవి ఈ శతాబ్దమున అహింసా సిద్ధాంతమును దేశ సమస్యల కన్వయించి ప్రయోగములు చేసిన దివ్యపురుషుడు మహాత్మగాంధి బౌద్ధ మతమును భారతదేశములో పరిమార్చుటకు అయిదు వందలేండ్లు పటినది గాంధేయ వాదమును కాడ దజేయుటకు పట్టునని యిరువదేండ్లయిన పట్టలేదు ఇనను మహాత్ముని బ్రతుకుంగిల తీయదనమును స్వయముగా చవిచూచినవారు, బాపూసిద్ధాంతములకు ప్రాణము పోయును, దేశసమస్యలను పరిష్కరించుటకు పూనుకొనిరి అట్టివారిలో వినోబాభావే యొకడు ఆయన వక్కాణించు వాదమే 'సర్వోదయము' ఆసర్వోదయమునుగూర్చి గానము చేసిన కవి తెనుగులెంక తుమ్మల సీతారామమూర్తి.

'ప్రేమగలచోట నీరస పెరుగ బోదు
ప్రేమగలచోట గత్తి కప్పింపబోదు
ప్రేమగలచోట నాకటి పీడ లేదు
ప్రేమగల చోట ప్రాణికే భీతి లేదు'

అనువదియే భావే వాణి. అట్టి ప్రేమ సర్వోదయమునకు మూలకందము. సర్వోదయ సిద్ధాంతమే గాంధి ధర్మము. దానిని సీతారామమూర్తిగారిట్లు చెప్పిరి.

అది సర్వోదయ సారభూత, మది హింసాతీత, మన్యోన్య సౌ
హృదమూలం బది, సత్యశీల మది, సాహిత్యంబు, నిత్యంబు, ధీ
సదనుల్ మెచ్చిన గాంధి ధర్మమది, తచ్ఛాయన్ బ్రయాణించుచో
నెదిరింపంగలవాడు లేడొకడు నిన్నీ విశ్వ విశ్వంబులన్.

వినోబాభావే సర్వోదయ సిద్ధాంతమున ప్రధానమయినది భూదానోద్యమము. ఈ యుద్యమమునకు ఆంధ్రదేశము పురిటిగీమగుట తెలుగు వారి యదృష్టము. ఈ యుద్యమ గంగావతరణమునకు భగీరథుడు వెదిరి రామచంద్రారెడ్డి. ఆయన కాణాచి పోచంపల్లి. విప్లవాగ్ని శిఖల నుండి మండ్రాడుచున్న నల్గొండసీమలో 'విపన్న ప్రజా హృదయాంధకార హరణ కుశలుడు, సర్వోదయాంశుమూర్తి' 'గ్రామములు కొన్ని కడచి' 'పోచమ పల్లి చేరె'. ఆనాడు భూదానోద్యమము మొదలయినది. భూదానోద్యమవేళ భావే ప్రవచించిన నీతులకు, జరిగిన సన్నివేశములకు అక్షర రూప మొసగి తుమ్మల సీతారామమూర్తిగారొక కావ్యము రచించిరి. ఆ కావ్యమే 'సర్వోదయ గానము'

'విశ్వశ్రేయః కావ్య' మ్మను నన్నయ భట్టారక వాణికి వ్యాఖ్యానము వ్రాయుచు అప్పకవి తన లక్షణ గ్రంథములో

ఉపమ గలిగిన, శయ్యల నొప్పియున్న
సంప్రభవుని కావ్యంబు గ్రాహ్యంబుగాదు
పాయసంబైన, సంస్కార పక్వమైనఁ
గాకజుష్టంబు హవ్యంబు గాని యట్లు

అని రాద్ధాంతము చేసెను. మరి సీతారామమూర్తిగారేమనిరో చూచితిరా?

ప్రజల మేలు గిల్లఁ బాల్గొను వారికే
భావనాబలమ్ము బలసి యుంటఁ
బంటకాఁపు, చేతి పనివాఁడు బైరాగి
తక్క హొరుడు పల్కదగఁడు కైత.

గిరిగీచుకొన్న కవికృతి
చిరకాలము నిల్వఁ; దెల్ల సిద్ధాంతములన్
దరియించి, విప్లవముదెస
కరిగిన కృతి సత్యదర్శియై రాణించున్.

ఇట్టి కావ్యములు రచించు కవి యెట్లుండునో, యాతడెట్టి భాషను వాడవలయునో వారీ రీతిగా చెప్పిరి

ఒకని వాంఛకు కొకని యాజ్ఞకును లొంగి
కలము వారింపఁ గొల్లడు కవివరుండు
నిదురయును మెచ్చఁడాతఁడు, హృదయవీణ
కదిలినప్పుడిల్ల నమరవాణి కవిత పల్కు.

నియమబద్ధమ్ము మధురమ్ము నిపుణమైన
పలుకుతో సాహితీ సృష్టి సలుపవలయు
రాగరోషాది దుర్వికారములు లేని
కవులకే తోఁచు నిట్టి చక్కని వచస్సు.

'ప్రతికరణశౌచశ్రీ లేని కవులు వ్రతంబు లెన్ని నింపిన' 'అకలంకము కవితారస మొకబిందువు పాటియైన నూరద ఘూందున్' అని సీతారామమూర్తిగారి సిద్ధాంతము. ఈ కవి గారెట్టివారు?

భావ విప్లవమ్ము సచరించు కవి శాబ్ద
విప్లవమున కంగవింపడేని
గెలువఁడని బిభీషికలు కొట్టువారు నా
సృష్టి జూచి యేమి చెప్ప గలరో

యని గడగట్టిగంట వాయించిన కవి సీతారామమూర్తిగారు దేవుడు, దేవళము, యజ్ఞము మున్నగువానికి సీతారామమూర్తిగారు నూతన నిర్వచనములు చేసిరి.

దేవుఁడన మాతృదేశము,
దేవతలనఁ బ్రజల, యజ్ఞదీక్ష యనంగా
సేవావ్రతనిష్ఠ యివి
జీవన సూత్రములుగాఁ బ్రసిద్ధిం గనుమా!

ప్రజాతంత్రము పాదుకొనిన దేశము భారత దేశము. ప్రజల కెన్నో హక్కు లున్నవి హక్కులతో పాటు విధు లున్నవి. ఆ విధులలో మున్మొదటిది స్వార్థ త్యాగము. 'నేను నిడిచి మనమునై నిచ్చునిడనిచో, దేశ మెక్కి రాదు లేశమేని' యని కవిగారు చెప్పిరి.

చదువులేక గ్రుడ్డి బ్రదుకీడ్చు వానిపై
మందు లేక రుజలఁ గుందు పేద
కూడులేక రాలు వాడున్న గడ్డకు
శాంతిలేదు, జీవ కాంతి రాదు.

ఒక్కసారి దేశమును జూడుడు. పేద లెట్టి దుర్భర జీవనము ద్రోయుచున్నారో తేట తెల్ల మగును.

సోలుచు గూలికి నేగిన
మాలెత పాలమందె గొబ్బిమండల నడుమన్
బాలకుని గనియె, నతఁడీ
నేలకుఁ బిడుగో, వచింపు, నిక్కువు నినుగో?

నెలలునిండి రొప్పు నెలఁతను వరి కోఁత
కంపు రాజ్యమెట్లు పెంపువడయు
మాటలేల? మన సమాజ వ్యవస్థలో
మార్పువలయు దిద్ది తీర్పవలయు.

నిజమే! పేదరికమును దొలగింపనిది దేశము ముందునకు పోదు. ఈ పేదరికమును బోగొట్టుట యెట్లు?

నరుడు తెచ్చి పెట్టినది గాన లేవడి
యతని కణఁపరాని దగుట యరిది
యది యొఱంగి సిరుల నేలు దొరల్ పేద
లెదుర కుండ మేర గొదుగ వలయు.

సంఘములో దుర్భర దారిద్ర్య మొకవైపు! కుబేర సంపత్తి యొకచోట! వర్గ దృష్టితో హింసను ప్రయోగించి పేదరికమును బాపు పద్ధతి బాపూజీది గాదు. కాల పరిణామమును గుర్తించి శ్రీమంతులు మేల్కొనవలయును. సమాజ సంపత్తికి తాము న్యాసధారుల (Trustees) మని వారు భావింపవలయును. ఇది గాంధి సిద్ధాంతము

ఎముకల గూడులై బ్రదుకునీడ్చుట కోల్లక, త్రెళ్ళలేక శో
కములఁ దపించుచున్, తెగలు ప్రక్కదరిద్రులఁ ద్రోసిపుచ్చు కా
లము చనె, విప్లవాగ్ని దెసలన్ గబళింపకముందె యందరా
లమరినవారు మేల్కొని యహంకృతి నాణ నసేఁత లగ్గగున్

సంపన్నులు తమ బంగరు
గంపలకున్ దాము ధర్మకర్తల యని భా
వింప వలయు పేదలసిరి
పెంపవలయు, ద్రుంపవలయుఁ బిసిడి తనమ్మున్

ఇది జరుగనినాడు విప్లవము వచ్చును. కవిగారి హెచ్చరిక వినుడు.

ఉన్నవారు తెల్వియున్న వారగుచు, స
ర్వోదయమ్ము దెసకు రాగ రేని
లేనివారు తాల్మిలేనివా రగుచుఁ దీం
డ్రింపఁ గలరు, కట్లు త్రెంపఁగలరు.

గజగజతో వెడ చిక్కని
గజిబిజితో బ్రాపులేని కాపురములతో
గిజగిజ లాడిన ప్రజలే
నిజమైన జగచ్చరిత్ర నిర్మింతురయా!

విప్లవాగ్ని సమస్త దేశమును దహింప వలయునా? మరొక బాట లేదా? ఉన్నదని వినోబాభావే వంటివారు చెప్పుచున్నారు. అట్టివారు దూరదృష్టిగల వారు. సామరస్యము సమసి పోవని, శాంతి చావని, బాటలు దీయుచు, సర్వజన సౌభాగ్యము కొరకు శ్రమించు చున్నారు.

భూదాన యజ్ఞమని గురు
పాదులు దేశాలు పట్టి బడలుట విలయాం
భోదము గర్జింపమికే!
పాదులు చెడి సంఘ మార్తిపడకుండుటకే.

ఇది సీతారామమూర్తిగారు చేసిన సర్వోదయగానము. వారేది వ్రాసి నను దానికి సర్వమానవ సౌభాగ్యము లక్ష్యముగా నున్నది. సంక్రాంతి కర్షకుల పర్వము. కార్మికుల పండువు. ఈ పర్వమును గూర్చి కవులు వ్రాయుతేదు. సీతారామమూర్తిగారి ధోరణి వేరు. ఆయన సంక్రాంతిని చూచిన చూపువేరు.

భోగి మంటలందు గోగుబుల్లల గాదు
కామ రోషములను గాల్పవలయు
గ్రొత్త వబ్బమందు గోడిపుంజాల గాదు
దురభిమానములను ద్రుంపవలయు

మేడ ప్రక్క గుడిసె, మేలిమి బంగారు
పట్టు వలువ సరస బ్రాతగోచి,
తనివి చెంత నింత తలుగని కన్నీరు,
లేని పండు విది ఫలింపవలయు.

కుక్కలకు గదల్చి, ముక్కిడి పండుల
మందలించి, కడుపు మంట లార్పు
వెంగిలాకు నాకు పేనాది మూకలు
లేని పండు విది ఫలింపవలయు.

నూరు మతము, లైదునూర్ల కులమ్ములు,
వేయు తెగలు, రెండువేల నడత,
లైదు వేల బాస, లార్వేల వేసాలు
లేని పండు విది ఫలింపవలయు.

బిచ్చగాడు లేని, ప్రొచ్చులేని, కటారి
లేని, దొరతనమ్ము లేని, కుట్ర
లేని, యీ రసమ్ము లేని, దేశావధి
లేని పండువిది ఫలింప వలయు.

కవి రాజ్య వ్యవస్థారహితమయిన సంఘము (Stateless Society) నాకాంక్షించుచుండెను. సంఘమునందలి తారతమ్యము సమసిపోయిననాడు సంక్రాంతివంటి పర్వములు చరితార్థములు, అన్వర్థనామధేయము లగును.

నవ్యాంధ్ర కవిత్వములో ప్రతిబింబించిన మానవతా దృక్పథముయొక్క స్థూలపరామర్శ యిది. ఈ పరామర్శవలన రెండు మూడు విషయములు స్పష్టమగుచున్నవి సమకాలిక సమాజమునందు వచ్చిన మార్పులకు కవు లెల్లరు హృదయపూర్వకముగా స్వాగతము పల్కిరి. ప్రజల హృదయములు స్పందించినట్లుగా కవుల హృదయములు కూడ స్పందించినవి. ఆంధ్రజాతి హృదయ మీ కవిత్వమునందు అందముగా అచ్చుగుద్దినట్లు చోటు చేసికొన్నది. వ్యక్తియందలి సంఘమునందలి మాలిన్యమును క్షాళనముచేసి, తరతమ భావములను తొలగింపవలయును అని యీ కవులందరు చాటిరి. 'బహుజన సుఖాయ, బహుజన హితాయ' యన్న బుద్ధభగవానుని సూక్తి తెలుగుకవుల కొజ్జబంతి యయినది. సంఘ సౌభాగ్యమును గూర్చి గానము చేసినప్పటికి, దానిని సాధించు విషయమున కవులలో రెండు వర్గము లేర్పడినట్లు తెలియుచున్నది సంఘ సామరస్యము చెడకుండ, అఖండభారతీయ సంస్కృతిలో కాలానుగుణములగు మార్పులు చేసికొనుచు, ముందంజ వేయువలయునని చాటిన కవు లొక తెగవారు సంఘమును వర్గదృష్టితో చూచి, గత సంస్కృతిని పాతిపెట్టినగాని, పురోగతి సాధ్యము గాదను కవులు మరొక తెగవారు. ప్రథమ వర్గమువారి కవితా తత్త్వము దేశీయ సంస్కృతిలోనుండి పుట్టినది ద్వితీయ వర్గమువారి కవిత్వమునకు ప్రాణము అన్యదేశ చరిత్రలనుండి యావిర్భవించిన భావపరంపర. ఈ చెప్పినదంతయు భావ విప్లవమునకు సంబంధించినట్టి ది

రెండవది భాషా విప్లవమునకు సంబంధించినట్టిది భాషకు సంబంధించిన కట్టుబాటులను కూలద్రోసి, ఛందోలంకారములకు స్వస్తి చెప్పినగాని కవితా కళ రాణింపదనియు, అప్పుడు కాని కవిత్వము 'ప్రజా కవిత్వము' గాదనియు అనుకొన్నవారు, అనుకొనుచున్నవారు సాహిత్య లోకములో పలువురు కలరు. నూతన ప్రక్రియల పేర తలయెత్తిన యవ్యవస్థ యభ్యుదయ సూచకమనువారు నున్నారు ఈ సిద్ధాంతములు అవిచారిత రమణీయములని రుజువు చేసిన నవీన కవులు పెక్కురు కలరు. 'ప్రజాకవు' లని బహుళముగా ప్రశంసలు పొందిన పొందుచున్న వారికంటె మిన్నగా ఈ కవులు భావ విప్లవమును ప్రతిపాదించిరి వీరు ఛందోలంకారములను వాడిరి వ్యాకరణబద్ధమగు భాష వాడిరి. యుగానుకూలమయిన కవిత వ్రాసిరి. నియమములను విచ్ఛేదింపకయే, కాలానుగుణములైన కట్టుబాటులతో కవిత్వము పురోగమింప గలదనుటకు ఈ కవులు రచించిన కావ్యములు తార్కాణములు. వీరు 'ప్రజా కవులు' గారా? వీరిది 'ప్రజా కవిత్వము' గాదా?

చివర కొక్కమాట నానాకలుషభూయిష్ఠమయిన సంఘమును జూచిన వ్యక్తి తన ప్రపంచమును తాను సృష్టించికొని, యంతర్ముఖుడై, తన చైతన్యమునందలి యట్టడుగు పొరలను వెల్లడించుట 'నవకవిత' యని చెప్పుట యొక యాచారమగుచున్నది ఈ విధముగా అనుకొనుటవలన నొకానొకనాడున్న 'సాంఘికదృష్టి' యీనాడు కవిత్వములో క్రమక్రమముగా లోపించుచున్నది. 'సాంఘికదృష్టి' యున్నంతమాత్రాన ఉత్తమ కవిత యగునని నా యభిప్రాయము గాదు కవి సంఘమును సమీచీనముగా దిద్ది తీర్చవలయునన్న, తన చుట్టు తానే గోడలు కట్టుకొనరాదు అతనిలో జాతి ప్రతిబింబింపవలయును. వైరాగ్యము కాని వైరాగ్యమును పూని, పలాయనము కాని పలాయనము చిత్రించు వైయక్తిక ప్రవృత్తి పరాజయ వాదముగా పరిణమింపరాదు ఈ శతాబ్దము నందు మొన్న మొన్నటి దాక వచ్చిన కవిత్వము సంఘమును మరచిపోలేదు. రాను రాను కవిత్వము ప్రజలకు దూరమగుచున్నది ప్రజలకు దూరమగుచున్నదనగా అర్థమిట్లు చెప్పుకొనవలసియున్నది. సమకాలికజాతి యనుభవించు నానావిధ పరిణామములను వ్యంగ్యముగా నిరూపించుచు కవిత్వము వ్రాయు నాచారము ఏదేశము నందలి యే కవులయిన పాటింతురు ఆ లక్షణము నవ్యాంధ్ర కవిత్వములో ఒకనాడున్నంతగా ఈనాడుండుటలేదు.

మన కాంధ్రత్వము ప్రాణము;
తనువు సుమీ! భారతీయ ధర్మము, యావ
న్మనుజాభ్యుదయ ప్రవణత
యనుజా! విను, వజ్రకవచమై దిటవౌస-గుక్

(తుమ్మల సీతారామమూర్తి)

# పండుగ

## శ్రీమతి ఆర్. వసుంధర

ఒకప్పుడు నేను జీవించివుండే దాన్ననీ, ఆశల్తో ఉ(దేక)ంగా ఊగుతూ ఆనందించేదాన్ననీ, భవిష్యత్తు స్వర్గలోకంలా మెరుస్తూ మురిపిస్తూ వుండే దనీ యింకా నాకు గుర్తున్నది. అమ్మా, నాన్నగార్లూ, పిల్లలం ముగ్గురం ఎంతో ఆనందంగా ఉండేవాళ్లం. నేను లా, శ్యామల యం యస్సీ, సుందరి డాక్టరు కోర్సూ చదివాం శ్యామల చక్కగా డాన్సు చేసేది సుందరి బాగా పాడేది. నేను తెలివిగలదాన్ని. 'ఆడపిల్ల లయితేనేం, రత్నాలు' అనేవారు అందరూ ప్రపంచమంతా తీసికట్టుగా మా పాదాల ముందున్నంత గర్వంగా ఉండేవాళ్లం ఇప్పుడు నాన్నగారు లేరు అమ్మలేదు 'మేము' లేము ముగ్గురు అక్కచెల్లెళ్లం ఎవరి సంసారాలు వాళ్ళు చూసుకుంటూ, ఒకరితో ఒకరికి ఎక్కువ సంబంధం లేకుండా వున్నాం. ఆ ధీమా, గర్వం, ఆనందం ఏమైపోయాయో తెలియదు ముగ్గురం సామాన్యపు సంసార పక్షపు స్త్రీలమైపోయాము.. ..అది నా బాధకు కారణం కాదు.... .కాని యిప్పుడు నన్నావరించివున్న నిస్పృహ, నిస్సత్తువల్లోంచి ఒక్కోసారి గతం జ్ఞప్తికి వచ్చినప్పుడు యీ భేదం గుర్తుకు వచ్చి ఆశ్చర్యం కలుగుతుంది నేను జీవించటం, ఆశించటం, ఎప్పుడు మరచిపోయానో తెలియదు. జీవించటం, ఆశించటం అనేవి రెండు వేర్వేరు విషయాలా? నాకేవీ తెలియటం లేదు!

ఇవ్వేళ సంవత్సరాది పండుగ. అందరూ యిండ్లు రంగులతో మామిడాకులతో అలంకరించుకొని, తలంటు స్నానాలుచేసి, క్రొత్త బట్టల్తో అర్థం లేని కోలాహలం చేసుకుంటున్నారు ఆయన స్నానం కానిచ్చుకుని, ఇస్త్రీ బట్టలు వేసుకుని, పైన కూర్చున్నారు పేపరుచూస్తూ పండుగనాడు కొత్త బట్టలు వేసుకోవటం యిష్టం లేదుట! ఎనిమిది గంటలైంది పదేళ్ల బాబు నిద్రమంచంమీదనుండి యింకా లేవలేదు అయిదేళ్లపాప యానాదివాళ్ళ పిల్లల్తో ఆడుకోవటానికి వెళ్లింది. 'వెనకింటి చౌదరిగారి పిల్లలకి ఆటలు రావు. శాస్త్రిగారి పిల్లలు కొడతారు. యానాది పిల్లలు పాపమ్మా అంటూ బాగా ఆడతారు' అంటుంది. మరికి పిల్లల్తో ఆడవద్దన్నకొద్దీ వాళ్ల సుగుణాలు, వాళ్ల గొప్పదనం జాస్తిగా కనబడుతున్నాయి పాపకి. నిజం చెప్పాలంటే అందులోనూ కొంచెం నిజమున్నదని నాకూ అనుమానమే

నేను కాఫీ త్రాగి మామూలు యింట్లో నిస్సత్తువగా కూర్చునివున్నాను. వాళ్ళకి తలంట్లు కానిచ్చి—పోసుకుంటే—తరువాత నేనూ స్నానం చెయ్యొచ్చని కూర్చున్నాను. ఇల్లుమాత్రం కడిగించాను. రంగులూ, ముగ్గులూ, మామిడాకులూ అలంకరించలేదు. అవన్నీ అర్థంలేని పిచ్చిగా అన్పిస్తాయి అంతగా పెట్టే ముగ్గూ అరగంటలో పాదాల క్రింద తేమతో మట్టిలో కలిసిపోయి రొచ్చుగా తయారవుతుంది. సాయంత్రానికి మామిడాకులు ఎండిపోయి చెత్తగా వేళ్లాడుతుంటాయి. ఇల్లు కడిగించటంలో శుభ్రత అని అర్థం ఉందిట. మా యిల్లు వారానికోసారి బూజు దులపబడి కడిగించబడి శుభ్రంగా ఉంటుంది. అయినా సాటి మానవులతో సంబంధం కొంచెమైనా ఉండాలని మళ్లీ కడిగించాను వేపపూత తెప్పించాను. 'జీవితం వివిధానుభూతుల కలయిక' అనుకున్నా సరిపోతుంది. షడ్రుచులతో పోలికతెస్తే తప్ప తెలియలేని క్లిష్ట విషయం కాదు. కడుపు శుభ్రం చేస్తుంది అంటున్నారు. ఇందులో కొంత అర్థం ఉన్నది. కాని మా కడుపులు శుభ్రంగా పని చేస్తున్నాయి. ఇప్పుడు పండుగలనేవి అర్థంపర్థంలేని ఆచారాలు. పాతకాలపు అలవాట్లతాలూకు శవాలు. ఇలాంటి అపసవ్యపు పనులు చెయ్యాలంటేనూ మనసొప్పదు మానాలంటేమా మనసు ఒప్పదు. అందుకే యీ నిస్సత్తువ. రోజూ యీపాటికి పిల్లలూ నేనూ స్నానం చేసేవాళ్లం. యివాళ ముగ్గురం అలాగే ఉండిపోయాం. ఆయన రోజూ తొమ్మిదికి చేసేవాళ్ళు. 'ఎంతైనా పండుగ కదా' అని ఏడున్నరకే కానిచ్చుకున్నారు యివ్వాళ. ఈ యిల్లూ ఆ పండుగలాగే అర్థం లేకుండా ఉన్నది.

ఇదివరకు బాబు చిన్నపిల్లవాడుగా వున్నప్పుడు పండుగలు అందరిలా ఉత్సాహంగానే చేసేదాన్ని. అన్నిట్లోనూ అర్థంకోసం వెతికేదాన్నికాదు. అనాదినుంచీ వస్తున్న అలవాట్లు, అవి కల్పించే ఆనందమయ జగత్తు, వాటిలో వున్న పరమేశ్వరభావం—నే నెరిగిన యివన్నీ నా బిడ్డకు కావాలని చేశాను. వాడు మంచి పిల్లల్తో ఆడుకున్నాడు. బాగా చదువుకుంటున్నాడు. పాపలాగా ప్రతి దానికీ ఎదురువాదం చెయ్యడు. కాని పెద్ద వాడవుతున్నకొద్దీ వాడిలో ప్రస్ఫుటమవుతూ వస్తున్న Passive Resistance నాకు ఆశ్చర్యం కల్గించింది ఎక్కడో పొరబాటు ఉన్నది అనుకున్నాను. మంచి అన్న చట్రంలో బిగించి వాడి స్వాతంత్ర్యాన్ని అరికట్టి అన్యాయం చేశానా అనిపించింది. ఆలోచించగా మంచి అన్నదానికి స్వతహాగా విలువ ఉన్నదో లేదో నాకు తెలియలేదు మంచి చెడ్డల్లోనూ, తప్పొప్పుల్లోనూ దాక్కొని లేవేమో అర్థమూ, సత్యమూ, దేవుడూను! ప్రపంచమంతా అర్థంలేని కలగాపులగపు వ్యవహారంగా కన్పించింది. నేను ఎవరో, ఎటు నడుస్తున్నానో నేను ఉన్నానో లేదో నాకు తెలియటంలేదు

స్వభావతః పాప మంచిపిల్ల. భయం ఎరగదు. సూటిగా అలో[illegible]స్తుంది నాకే తెలియని తప్పొప్పులు దానికి నేను చెప్పలేదు. ప్రస్తుతం అది యానాది పిల్లల్తోనే ఆడుతుంది అనకూడని మాటలన్నీ అంటుంది. నేరేడు పండ్లూ, రేగుపండ్లూ, జామపండూ, సీతాఫలాలూ, వెలక్కాయలూ, [illegible]లెట్లూ—ఏవి దొరికితే అవి ప్రీతిగా తింటుంది అన్నం మాత్రం పరమశత్రువు. పాపది Active Resistance ఇద్దరు పిల్లలూ రెండు రకాలైన కొరకరాని కొయ్యలు పొద్దున్నే నీళ్ళు పోసుకొమ్మన్నందుకు ఒక్కళ్ళూ యింతవరకు చేతికి అందలేదు. ఇది ఒక కుటుంబం అనుకోవటానికి ఏమాత్రం వీల్లేకుండా ఉన్నది నలుగురు వ్యక్తుల సముదాయం అనుకోవలసిందే

పాప సుడిగాలిలా పరుగెత్తుతూ వచ్చింది 'ఊళ్లో వాళ్ళందరూ, చెంచీవాళ్ళు గూడా మామిడాకులు కట్టుకున్నారు మనం ఎందుకు కట్టుకోలేదు?' అన్నది. 'ఆ మామిడాకుల్లో నీకేమైనా అందం కనపడ్డదా? అందరూ స్నానాలు కానిస్తే నీ వెందుకు రాలేదు?' అన్నాను పాపకు ఆత్మాభిమానం బాగా దెబ్బతిన్నది నాకు అందకుండే దూరంలో బయటికి పరుగెత్తటానికి వీలుగా నిల్చుని 'గాడిదా, దున్నపోతూ, కెక్కాబిక్కీ' అన్నది నాకో అనుమానం వచ్చింది 'అన్నీ తెలిశాయిగాని కెక్కాబిక్కీ అంటే ఏమిటే?' అన్నాను. 'నీ మొఖం' అనేసి పారిపోయింది 'ఈ పిల్లకి ఎప్పటికైనా బుద్ధివస్తుందా', అనుకుంటూ బాబును లేపటానికి వెళ్లాను. పావుగంట లేపాక అట్నుంచి యిటు తిరిగి పడుకుంటూ, 'పండగనాడు ఎక్కువ సంతోషంగా ఉండాలా, తక్కువగా ఉండాలా? కాస్సేపుండి లేస్తాను' అన్నాడు అదీ నిజమే ననుకొని వచ్చేశాను. ఈ పండుగ పూర్తిగా అర్థంలేని వ్యవహారం అయిపోయింది పండుగనే కాదు, ఏ పని చెయ్యలేను నేను. నా మనసు ఏదో స్తబ్ధతలో చిక్కుకుపోయింది నన్ను నిర్లిప్తత ఆవరించింది.......

భోజనాలు కాగానే బాబు పరుగెట్టుకుంటూ వచ్చాడు. నాన్నగారు యిప్పుడే కావలి వెళ్దామన్నారు. తొందరగా.....' అనేసి పరుగెట్టాడు. విషయం

ఏమిటని కనుక్కుంటే కావలిలోవున్న మా బంధువులు ఎప్పుడో కనబడి తప్ప కుండా వాళ్ళింటికి రమ్మని చెప్పారుట. నాకు ఆశ్చర్యం కలిగింది మా తాతగారి అన్నగారి సంతతివాళ్ళు కావలిలో వున్నారు ఆస్తి విషయంలో తాతగారిని మోసం చేసి పుత్తచేతుల్తో బయటకు పంపి వాళ్ళు జమీందార్లుగా వెలుగుతున్నారు తాతగారు బెజవాడ వచ్చి చిన్న వుద్యోగం చేసి కష్టపడి నాన్నగారిని చదివించి లాయరుగా చేశారు. కావలివాడిమీద తాతగారి కేమీ ద్వేషం లేకపోయినా నాన్న గారికి వుండేది వాళ్ళకీ మాకూ రాకపోకలు లేవు అలాంటివారి యింటికి వెళ్లట మేమిటని నాకు అర్థం కాలేదు. 'జగ్గూ— మీ పెదనాన్న కొడుకట— నాకు ప్రెసిడెన్సీలో రెండు సంవత్సరాలు జూనియర్ బాగా కలసి వుండేవాళ్లం తప్పకుండా వస్తామని చెప్పాను' అన్నారు తాతగారికి వాళ్ళమీద ఏమీ కోపం వుండేది కాదు అదోకరకం అమాయకులు విచిత్రమైన మనిషి. మధ్య మధ్యలో తమాషాగా గ్రాంధికంలో మాట్లాడేవారు. 'భగవంతుడు వారి కా బుద్ధి నిచ్చెను. నా కిట్టి కర్మ నిచ్చెను. ఆహా, భగవల్లీలలు కడు విచిత్రములు గదా' అనేవారు. ఆయన మాటలకి చిన్న పిల్లలమైన మేము తెగనవ్వేవాళ్లం తరువాత దేవుడి పిచ్చిలో 'అది గదిగో పరమేశ్వరుడు నా కొరకై పంపియున్న దివ్య రథము వచ్చియున్నది' అంటూ చనిపోయారు. అందరూ ఆయన్ని 'వెపకాయంత వెర్రి' లెఖ్ఖలో భావించే వాళ్ళు. పైకి అందరితోపాటు నవ్వినా నాకు మాత్రం ఆయన మాటలు ఆసక్తి కల్గించేవి. 'వెర్రి అంటే ఏమిటి తాతయ్యా?' అన్నాను ఒక రోజున 'సగటు మనఃపరిజ్ఞానముకన్న తక్కువగా నుండిన బుద్ధిహీను డందురు విశేషముగా నుండిన వెర్రి యందురు' అంటూ నవ్వారు తాత

మా యింట్లో వుండే మిగతా ముగ్గురు మనుష్యులూ ఏదైనా తలచు కుంటే దానిని నేను మార్చలేనన్న విషయం నాకు బాగా తెలుసు. అందుకే బయల్దేరాను .

వాళ్ళు జమీందార్లు అయివుండటమే గాకుండా జమీందార్లుగా కన బడతారు కూడాను దాదాపు అందరూ పొడుగ్గా కొంచెం స్థూలంగా తెల్లగా వున్నారు అరటి గోడెల్లాగా నవనవలాడుతూ మెరుస్తున్నారు. ఎన్నో తరాల నుండి వస్తున్న 'ఐశ్వర్యం, సుఖ జీవనం ఆ మెరుపులోంచి తొంగిచూస్తున్నవి, వాళ్ళ యిల్లూ సద్దతులూ నాకు బాగా నచ్చాయి. క్రింద పెద్ద హాలుకిచుట్టూ ఒక్కొక్కళ్ళకి ఒక్కో బాత్ ఎటాచ్‌డ్ గది భోజనశాలా, వంటగదీ వేరుగా వున్నాయి మేడమీద వున్న ఒక విశాలమైన గది యిచ్చారు మాకు. అది అతిథు లకి యిచ్చేది నాలుగు మంచాల మీద మందపాటి మెత్తని బూరుగుదూది పరు పులూ తెల్లటి దుప్పట్లూ మనసుకు హాయి గొలిపాయి. గదికి అనుబంధంగా వున్న స్నానాల గది శుభ్రంగా వున్నది వాష్ బేసిన్ మెరుస్తూ వున్నది. ఎప్పటి కైనా మా యింటికి వచ్చిన అతిథులకు అలాంటి సౌకర్యం కలుగజేయాలని నా చిరకాల వాంఛితం కొంచెం సేపటికి చాలా మంచి కాఫీని తెచ్చియిచ్చిన పని మనిషి నన్ను 'పెద్దమ్మ' గారి గదికి తీసుకెళ్లింది ఆమె మా పెదనాన్న గారి భార్య, గృహ యజమానిని మిగతా అందరి కంటే లావుగా భారీగా వున్నది పెద్ద హంసతూలికా తల్పంలాంటి దానిమీద పడుకుని వున్నది నన్ను ప్రక్కన కుర్చీలో కూర్చోపెట్టిన పని మనిషి ఆమెకు కాళ్ళు ఒత్తుతూ నిలుచున్నది ఆమె నన్ను ఆప్యాయంగా పలకరించి మా కుటుంబం వివరాలన్నీ కనుక్కు న్నది.మా ఆస్తిపాస్తుల్ని గురించీ, మా జీవన విధానం గురించీ ప్రశ్నించింది ఆమెలో బంధు ప్రీతి కంటె బయటి ప్రపంచాన్ని గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి కన్పించింది జమీందారీ ఫాయాల్లో ఎంకంత మేడల్లో బంధితులైన వాళ్ళే ఆమె మాటల్లో కన్పించారు. తాము వేరే స్థాయికి చెందిన వాళ్లం అన్న నిజం ఆమె మాటల వెనుక స్థిరంగా వున్నా, గర్విష్ఠి అనటానికి మాత్రం వీల్లేదు ఆమె నాతో ముక్తసరితనం లేదు. తమకు వచ్చిన జబ్బులూ, వాటికి వైద్యం జరుగుతున్న విధానమూ ధారాళంగా చెప్పింది. గుండె డయాబిటిస్, బ్లడ్ ప్రెషర్, ఎలర్జిక్ తుమ్ములూ—అన్నీ ఎవరెవరికి వున్నాయో వాటి వైద్యానికి నెల్లూరినుండీవచ్చి వెళ్ళే డాక్టర్ శాస్త్రి, గుంటూరు నుండి వచ్చే డాక్టర్ కోదండపాణిగారూ, అవసరమై నప్పుడు మద్రాసు నుండి కారులో వచ్చి రెండువేల ఫీజు తీసుకునే ప్రసిద్ధ వైద్యులు కృష్ణన్ మొదలియార్‌గారూ అందరిని గురించీ చెప్పింది. కాని పెద నాన్నగారికి కడుపులో కాన్సర్ వచ్చి ఆపరేషన్ చేయబడిన వైనమూ, అప్పటి నుండీ ఆయన తగ్గిపోతున్న విషయమూ చెబుతున్నప్పుడు ఆమెలో దిగులు కన్పించింది. ఆమె దిగులు చూసిన నాలోనూ దిగులే కలిగింది 'ఇంత ఐశ్వ ర్యంలో సుఖంగా వుండవలసిన వాళ్ళు! వీళ్లకు కష్టాలు రాకూడదు' అను కున్నాను. ఇట్టి కష్టాలన్నీ తీర్చగల వరదాయిని అని ప్రసిద్ధి గాంచిన జొన్న వాడ కామాక్షమ్మ జ్ఞప్తికి వచ్చింది మేము అక్కడికి వెళ్ళినప్పటి అలౌకి కానుభూతి స్మృతిలో మెరిసింది అప్పుడు మేము నెల్లూరి దగ్గరగా సముద్ర తీరాన ఒక చిన్న వూళ్లో వున్నాం. రెండు రోజుల సెలవు వచ్చింది కొత్తగా కొన్న కారు వున్నది ఇవాళ్టిలాగే ఒక మధ్యాహ్నం వున్నట్టుండి 'యివాళ జొన్నవాడ వెళ్దాం' అని తీర్మానించారు మా యింట్లోని మిగతా ముగ్గురూ రెండు గంటలకి బయల్దేరి వెళ్లి దేవి దర్శనం చేసుకొని సాయం త్రానికి యింటికి రావాలని వుద్దేశ్యం వూరు ఎంత దూరంలో వున్నదని అడగ్గా 'నేను వెళ్ళలేదు గాని కోవూరికి రెండు మైళ్ళుంటుం దంటారు' అన్నాడు సందేహంగా మా జవాను రామయ్య కోవూరు దాటాక టాంక్‌లో పెట్రోలు కొద్దిగానేవున్న వైనం గమనించాం రెండుమైళ్ళేకదా తిరుగు ప్రయాణంలో వేసుకో వచ్చని ముందుకు సాగాం. నాలుగు మైళ్ళు దాటాక చిన్నవూరొకటి వచ్చింది జొన్నవాడ ఎక్కడని వాకబు చెయ్యగా యింకా ముందుకి పోయి పక్కకి తిరగాలి మట్టి బాటలోకి' అన్నారు. ఇంకో మూడు మైళ్ళు పోయాక మరో వూళ్లో అడిగాం అక్కడ ముగ్గురు మనుష్యులు సంప్రదించుకొని 'అబ్బో, యిక్కడెక్కడ జొన్నాడ యింకా నాలుగు మైళ్లు పోయి పక్కకి తిరిగి ఒక మైలు పైన పోవాలి' అన్నారు. మాకు ఉత్సాహం చల్లారింది. అయి పోతున్న పెట్రోలూ రాబోతున్న మట్టిబాటా మనసులో మెదిలాయి. 'ఆ మట్టిబాటలో చిన్నకారు పోగలదా' అనడిగాం 'బస్సులు కార్లు అన్నీపోతై' అన్నారు 'ఇక్కడ మనుష్యులకి రోడ్డు గురించి గాని దూరం గురించిగాని జ్ఞానం తక్కువ' అని గొణుక్కున్నారు ఆయన. 'మరి దేవుడు వూరికే కన్పి స్తాడా... వెతికి వెతికి వేసారేక గాని ...' అన్నా ఎవరూ నవ్వలేదు.

ఇలాగ పదిమైళ్ళు ప్రయాణం చేశాక కన్పించిన మట్టిబాటను చూడ గానే మాకు బాగా నిరాశ కలిగింది గుంటలు మిట్టలతో ఎగుడుదిగుడుగా అన్యా యంగా వున్నది అందర్లో కోపతాపాలు హెచ్చిపోయాయి. పెట్రోలు విష యం జ్ఞాపకం చెయ్యలేదని అన్యాయంగా నా మీద దండయాత్ర చేశారు ఆయన రామయ్య అజ్ఞానాన్ని కోపగించుకున్నాడు బాబు చోకలెట్లు మరచి పోయినందుకు ఏడుపు ప్రారంభించింది పాప నేను చెప్పినట్టు అంబాసిడరు కారు కొనివుంటే యీ రోడ్డులోనైనా వెళ్లి వుండొచ్చనీ పైమెరుగు చూసి హెరాల్డు కొన్నందుకు యిహ వెనక్కి వెళ్లటమే గత్యంతరమనీ తెలియపర చాను నేను. కారు విషయం దెప్పటం సహించలేక 'ఏమైనా నా సత్తే, ముందుకు వెళ్ళాల్సిందే'నని కారు స్టార్టు చేశారు. మట్టిబాటలో ఎంతో అవస్థమీద ఒక మైలు వెళ్లాక చుట్టూ చూశాం గుడిగాని వూరుగాని కన్పడలేదు. చుట్టూ పంట చేలు ఇంకొంచెం ముందుకు పోయి పొలం నుండీ వస్తున్న ఒక రైతును ప్రశ్నించాం. ఇంకో మైలు ముందుకు పోవాలన్నాడు. మైలు పోయాక దూరాన వూరు కన్పించింది వూరిని చూడగానే సంతోషంగా వుంది ఒక వేళ పెట్రోలు అయిపోయి యిక్కడే నిలిచిపోయినా తలదాచు కోను చోటివ్వగల షుమారుపాటి యిళ్ళున్నాయి. అక్కడ గుడికోసం వాకబు చేశాం. అది జొన్నవాడకు వెళ్ళేబాట అయిన విషయం నిజమే గాని, యీ వూరు జొన్నవాడ కాదనీ, యింకో మైలున్నర ముందుకు వెళ్లాలనీ తెలి సింది. జొన్నవాడను చేరగలమన్న ఆలోచన మాయమై పోయింది. వెనక్కి తిరిగి వెళ్లాలన్న ఆలోచనా రాలేదు అపరిచితమైన చోటులో నిర్జీవతలో నిస్పృహలో చిక్కుకు పోయిన ట్లనిపించింది ఎత్తు పల్లాలతో నిండిన మట్టిబాటలో యిసుకపాలు హెచ్చవుతూ ముందుకు వెళ్లటం కష్టమై పోయింది. చుట్టూ వుండే ప్రదేశం స్వరూపం మారిపోయింది పంటచేల బదులుగా చూపుమేర అంతా నిర్జీవమైన నేల. అక్కడక్కడ రాళ్ళ గుట్టలు

# తెలుగు సాహిత్యంలో సామాజిక చైతన్యం

## శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

సాహిత్యానికి సమాజానికీగల సంబంధం పూర్వంనుంచీ బహుథా గుర్తింపబడింది. సాహిత్యంలో సామాజిక చైతన్యం ప్రతిఫలిస్తుంది. సమాజం పరిణామశీలమై, ఉద్యమాల ద్వారా మారుతూ ఉంటుంది. ఈ ఉద్యమాలు నడిచే విధానంలో నాటికీ నేటికీ భేదం ఉండవచ్చు. కాని ఉద్యమాలనేవి సమాజంయొక్క జీవలక్షణం. అవి ఎప్పుడూ ఉంటున్నవే, ఉండేవే. ఉద్యమాలకు ఆలంబనమైన భావసంచలనానికీ (ideology సాహిత్యానికీ గల సంబంధం ఎటువంటిది ? అనే విషయం కొంత పరిశీలించదగింది.

కవులు అభూత కల్పనలు చేస్తారనీ, స్వప్నలోకంలో విహరిస్తారనీ కాబోలు ప్లేటో తన ఆదర్శ ప్రజారాజ్యంలో (Republic) వారికి స్థానం లేకుండా చేశాడు. ప్లేటో ఉద్దేశంలో సాహిత్యానికీ ఉద్యమ రూపమైన సామాజిక చైతన్యానికీ సంబంధం లేదు. షెల్లీ, 'కవులే సమాజానికి శాస్తలు, ప్రచ్ఛన్నులైన శాస్తలు (Poets are the Unacknowledged legislators) అన్నాడు. నేటిఅభ్యుదయ రచయితలు 'సమాజ ప్రగతికి దోహదం చేసేదే సాహిత్యం, సాహిత్యం ప్రజల ఉద్యమాల నంటిపెట్టుకొని నడవాలి' అంటున్నారు. సాహిత్యానికీ సామాజిక ఉద్యమాలకూ అసలు సంబంధం లేదన్న ప్లేటో అభిప్రాయాన్ని వదలిపెట్టినా, మిగిలే ప్రశ్న— సాహిత్యం శాసిస్తుందా? శాసింపబడుతుందా? అనేది.

## 1

వేదాలు, ముఖ్యంగా ఋగ్వేదము, సాహిత్యమే. ఉపనిషత్తులు కాకపోవచ్చు. స్మృతులు కావు. పురాణాలు, రామాయణ మహాభారతాలు బృహత్కావ్యాలు. భగవద్గీత భారతంలో అంతర్భాగం. ఈ సాహిత్యం హైందవ సంస్కృతినీ, జీవితాన్నీ శతాబ్దాలుగా శాసించింది. నేటివరకు ప్రభావితం చేస్తూనే ఉన్నది. ఇందులో చిత్రం ఏమిటంటే, ఉపనిషత్తులూ, ఉపనిషద్భాష్యాలూ మతంలో ఎన్నో ఉద్యమాలకూ విభేదాలకూ కారణమై సమాజంలో వర్గాలను సృష్టించినా, సామాన్య జీవనసరళి, అంటే హైందవ కుటుంబంలోని వ్యక్తుల మధ్య సంబంధమూ వారి నైతిక ప్రవర్తనా, ముఖ్యంగా రామాయణ మహాభారతాలవల్ల ఒకేవిధంగా ప్రభావితం అవుతూ వస్తూండటం. ఇందులో మంచి చెడ్డలు రెండూ కలిసే ఉన్నాయి. దాయాదుల మధ్య ఈర్ష్యాద్వేషాలు, ఈ దేశంలో సహజమూ అనివార్యమూ అయినంత యితర దేశాల్లో కావేమో అని తోస్తుంది. దీనికి భారతంయొక్క వారసత్వమే కారణం కావచ్చు. అట్లానే ఒక కుటుంబంలో జ్యేష్ఠుని మాట తప్పక శిరసావహించి తీరాలి అనే నైతిక శాసనం ఈ దేశస్థుల అంతఃకరణాలో ప్రత్యేకంగా ముద్రితమైందనిపిస్తుంది. ఇక భార్యాభర్తృ సంబంధం సంగతి చెప్పనక్కరలేదు. సంస్కృతంలో వ్రాయబడిన రామాయణ మహాభారతాలు దేశభాషల్లోకి అనువాదితాలు కావడమేకాదు, ఆయా సాహిత్యాల్లో ఎన్నో సార్లు పునస్సృష్టి అయ్యాయి, నేటికీ అవుతూనే ఉన్నాయి. ఈ విధంగా సాహిత్యం—ముఖ్యంగా రెండు కావ్యాలు మనల్ని శాసించాయి. మేధావులలో భావసంచలనం ఎలా ఉన్నా ఎన్నిరకాల ఉద్యమాలు నడచినా, ఎన్ని అవాంతరాలూ వచ్చినా, వ్యక్తినీ అతని ప్రవర్తననూ కుటుంబం స్థాయి ఈ కావ్యాలు ఒక చట్రంలో బిగించివేశాయి. ఒకవిధంగా యివి ఉపనిషత్తులకూ వ్యక్తి చైతన్యానికీ మధ్య తెరలుగా నిలిచాయి అనిచెప్పవచ్చు. తెరలను చీల్చిన మేధావులూ ప్రతిభావంతులూ సంసారాన్ని కుటుంబాన్నీ త్యజించినవాళ్లే! అంటే మేధావితప్ప సామాన్యుడైన వ్యక్తి స్వతంత్రంగా ఉపనిషత్సారాన్ని తన జీవితానుభూతిలో మథించి తన వ్యక్తిత్వాన్ని స్వచ్ఛందంగా రూపొందించుకొనే అవసరం అవకాశం లేకుండా ఈ రెండుకావ్యాలు చేశాయన్నమాట! పురాతనమైన హైందవ సంస్కృతి అవిచ్ఛిన్నంగా ఉండటానికీ, అక్షరాస్యులూ నిరక్షరాస్యులూ కూడా ఒక పద్ధతిలో జీవయాత్ర గడుపుతూ రావటానికీ ముఖ్య కారణం వర్ణవ్యవస్థకంటే రామాయణ భారతాలే కావచ్చు! ఈ దేశంలో మనిషి వ్యక్తిత్వం పుట్టుకనుంచీ, కుటుంబ వ్యవస్థలో, తర్వాత సమాజంలో అతనికి (ఆమెకు) నిర్ణీతమైన స్థానం ద్వారా, శృంఖలాబద్ధమవుతున్నది. అందుచేత జీవితంలో స్వచ్ఛందంగా వ్యక్తిత్వాన్ని రూపొందించుకొనే అవకాశం తక్కువ. దీని ఫలితమే మన పూర్వ సాహిత్యంలో వైవిధ్యం లేకుండా పోవటం. సాహిత్యంలో సృజనాత్మకమైన స్వేచ్ఛకు అవకాశం కొరవడటంవల్ల శాస్త్రపాండిత్యానికి ఉన్న గౌరవం సాహిత్యసృష్టికి పూర్వం ఏనాడూ లేదు. భారతీయ భాషల్లో సాహిత్యం శాస్త్రానికి దాస్యం చెయ్యటం, లేకపోతే పురాణాలనో రామాయణ మహాభారతాలనో పునశ్చరణ చెయ్యడం, పంధొమ్మిదో శతాబ్ది చివరదాకా జరుగుతూనే వచ్చింది. ఇప్పటికీ ఆ ధోరణి పోలేదంటే ఆ సంప్రదాయం ఎంతగట్టిదో అర్థమవుతుంది. దీనికి తొలికారణం: సాహిత్యం—రామాయణ భారతాలు—వ్యక్తినీ వ్యక్తిద్వారా సమాజాన్నీ శాసించడమే!

ఆంగ్లేయుల సామాజిక చరిత్ర పరిశీలిస్తే వారి భాషలో చెప్పుకోదగ్గ సాహిత్యం ఛాసర్ నుంచీ ప్రారంభమవుతుంది. ఛాసర్‌నుంచి షేక్స్‌పియర్ దాకా ఆంగ్ల సాహిత్యం, యూరప్‌లోని భిన్నభాషా సాహిత్యాలనుంచి నేర్చుకున్నదీ తెచ్చుకున్నదీ ఎంతో ఉన్నప్పటికీ, అది ఆంగ్ల సామాజిక చైతన్యానికి చక్కని ప్రతిబింబంగానే రూపురేఖలు దిద్దుకున్నది. అక్కడ మత సంబంధమైన భావసంచలనమూ, రచనలూ వేరుగా ఉంటూ సాహిత్యంతో కలగాపులగమై ముడివడలేదు. బైబిలు యితిహాసమూ, దివ్యమైన నీతిశాస్త్రమూ తప్ప దానిలో భావనాశక్తీ, రసదృష్టినీ ఆకట్టుకొనే కావ్యత్వం తగు మాత్రమే! పైగా ఆంగ్ల సామాజిక చైతన్యంలో ఉద్యమరూపమైన సంచలనానికి కారకులైన వారు మతగురువులు, రాజులు, వారు కవిత్వం చెప్పలేదు. కవిత్వం చెప్పిన ఛాసర్, స్పెన్సర్, షేక్స్‌పియర్ మత సంబంధమైన విషయాల్లో పాండిత్యం గాని అధికారంగాని బొత్తిగా లేని వాళ్ళు. అందువల్ల ఉద్యమాలకు ఆలంబనమైన భావసంచలనం సాహిత్యంమీద ఆజమాయిషీ చెయ్యలేదు. అలాగే సాహిత్యం కూడా సామాజిక చైతన్యాన్ని శాసించే అధికారం కైవసం చేసుకోలేదు. కాని ఈ పరిస్థితి మిల్టన్ నాటికి కొంత మారింది. మిల్టను లాటిన్ భాషలో, శాస్త్రాలలో నిష్ణాతుడు; ఆదర్శవాది, మతవిషయాల్లో రాజకీయాల్లో సాధికారంగా జోక్యం చేసుకున్నవాడు, పైగా దైవభక్తుడు. మిల్టన్ వ్రాసిన 'పారడైజ్ లాస్ట్', వాక్స్వాతంత్ర్యాన్ని గూర్చి వ్రాసిన 'అరియోపజెటికా', సమాజాన్ని ప్రభావితంచేసి ఆధ్యాత్మిక రాజకీయరంగాల్లో శాసింపగల సాహిత్యంగా తయారైంది. ఫలితం ఏమిటంటే యించుమించు $1\frac{1}{2}$ శతాబ్దాల కాలం ఆంగ్ల సాహిత్యంలో స్వచ్ఛందత, సామాజిక చైతన్యాన్ని సమగ్రంగా ప్రతిబింబించే లక్షణం కొరవడింది. రాజకీయాలనో, సంఘంలో మారుతున్న ఫాషన్లనో, లాటిన్ సాహిత్యాన్నో అంటిపెట్టుకుని వాటికి దాస్యం చేసింది. డ్రైడన్, పోప్‌లు వ్రాసిన కవిత్వం రాజకీయ కవిత్వం. కాంగ్రీవ్ వంటి నాటక రచయితలు వ్రాసిన సాహిత్యం ఆనాటి పై తరగతివారి నాగరక జీవితాన్ని గూర్చి. వర్డ్స్‌వర్త్ కాల్పనికోద్యమం (Romatic Movement) ప్రారంభించడంతో సాహిత్యం తన శృంఖలాల్ని వదల్చుకుని, సామాజిక చైతన్యాన్ని సమగ్రరూపంలో స్వచ్ఛందంగా ప్రతిబింబించడం మళ్ళీ ఆరంభమైంది. వర్డ్స్

వర్త్‌కు ఫ్రెంచి విప్లవంతో గల సంబంధం, అతని కవిత్వంలో స్వచ్ఛందతకు దోహదం చేసిందేకాని, కవిత్వాన్ని రాజకీయ భావసంచలనానికి తొత్తుగా మార్చ లేదు బైరన్ విషయంలోనూ అంతే విక్టోరియారాణి కాలంనాటికి కాల్పని కోద్యమ సాహిత్యం, ముఖ్యంగా కవిత్వం, సామాజిక చైతన్యాన్ని అంటే దాని సమకాలీన స్వరూపాన్ని సమగ్రంగా ప్రతిబింబించే లక్షణం కోల్పోయింది ఆనాటికి రాజకీయాలకు సంబంధించిన విప్లవ భావాలు (వర్డ్సువర్త్, షెల్లీ బైరన్‌ల నాటివి) సద్దుమణిగి, ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన అసంతృప్తి సామాజిక చైతన్యంలో క్రొత్త ఉద్యమ రూపం దాల్చే స్థితి ఏర్పడింది. కవిత్వం దీన్ని ప్రతిబింబించే స్థితిలో లేదు. కాని డికెన్స్ నవలలు, ఈ నూత్న చైతన్యాన్ని ప్రతిబింబించాయి. అందుకే ఆంగ్ల సాహిత్యం తన జీవలక్షణాన్ని పూర్తిగా కోల్పో లేదు. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత టి. ఎస్. ఎలియట్ ప్రభృతులు కవిత్వంలో స్వచ్ఛందతను పునరుద్ధరించారు; నాటి జీవితంలో అసంతృప్తి ఆర్థికమే కాదు మానసికమైన రుగ్మతగా, లక్ష్యశూన్యమైన ఆనందరహితమైన జీవితం పట్ల నిరాశగా కూడా సామాజిక చైతన్యంలో వ్యక్తం కాగా, ఎలియట్ ప్రభృతుల కవిత్వం దాన్ని ప్రతిబింబించ గలిగింది డి. హెచ్. లారెన్స్, జాయ్స్ నవలలు కూడా అదే చేశాయి.

## 2

ఇంతసుదీర్ఘంగా ఇక్కడ ఆంగ్లసాహిత్యానికీ ఆంగ్లేయ సమాజ చైతన్యానికీగల సంబంధాన్ని పరామర్శించటానికి కారణం, ఆధునిక ఆంధ్ర సాహిత్యం ఆంగ్ల సాహిత్యానికి, ముఖ్యంగా అక్కడి కాల్పనికోద్యమానికి ఋణపడి ఉండటమే! అలా ఋణపడటంలో దోషమేమీ లేదు ఛాసర్‌నుంచీ షేక్స్‌పియర్ దాకా వారూ ఫ్రెంచి, ఇటాలియన్ భాషా సాహిత్యాలనుంచీ నేర్చుకున్నదీ తెచ్చుకున్నదీ ఎంతో ఉన్నదని చెప్పాను ఎటొచ్చీ ఏ సాహిత్యమైనా తెచ్చుకున్నదాన్ని ఎలా ఉపయోగించుకున్నది? అనేదే ముఖ్యమైన సంగతి ఆంగ్లసాహిత్యసంపర్కంతో తెలుగు సాహిత్యానికి సాంప్రదాయికమైన శృంఖలలు తెగినవి అనటంలో సందేహంలేదు. వాడు సమాజ చైతన్యంలో ప్రథమంగా మత సంఘ సంస్కరణోద్యమం తర్వాత స్వరాజ్యోద్యమం వచ్చాయి. నవ్య సాహిత్యానికి యుగకర్తలుగా వీరేశలింగం, గురజాడ అప్పారావుగార్లను స్మరిస్తూ ఉంటాము వితంతు వివాహాలూ, దేవదాసీల బహిష్కరణ, వీరేశలింగంగారు చేపట్టినవి. వీరేశలింగంగారి సాహిత్యసృష్టి ఆయువ సంస్కరణోద్యమానికి లోబడి జరిగినట్టిది. అందుకే నవ్యమైనా దానికి స్వచ్ఛందత సమగ్రత లేదు ఇది చాల ముఖ్యమైన విషయం: ఎందుకంటే స్వచ్ఛందత, సమగ్రతలేని సాహిత్యం ప్రాణంలేని బొమ్మవంటిది. ఉదాహరణకు వీరేశలింగంగారి దృష్టిలో 'ఓడోవిమారేజి' చేసుకునే యువతీ యువకులు ఆదర్శమూర్తులు, సుగుణాల ప్రోవులు; వేశ్యల సంఘానికి వేరుపురుగులు. ఇది ఉద్యమనాయకుని దృష్టి; ఈ దృష్టిసాహిత్యంమీద అజమాయిషీ చేస్తే నిర్జీవ సాహిత్యం తయారవుతుంది! అయితే నాటి సామాజిక నవచైతన్యాన్ని ప్రతిబింబిస్తూ తన స్వచ్ఛందతను నిరూపించుకునే సాహిత్యం ఎలాఉంటుంది? గురజాడ వారి 'కన్యాశుల్కం'లో మనకు సమాధానం లభిస్తుంది అందులో గిరీశం బుచ్చమ్మల పాత్రచిత్రణ ఒకవైపు, మధురవాణి మరొకవైపు, సంస్కర్త పాక్షికదృష్టికి పెద్దసవాలు! 'కన్యాశుల్కం' ఆనాటి సామాజిక చైతన్యాన్ని స్వచ్ఛందంగా సమగ్రంగా ప్రతిబింబించిన సాహిత్యసృష్టి. 'కన్యాశుల్కం' ఉద్యమానికి దాస్యం చెయ్యలేదు!

నాటి సమాజంలో చైతన్యం రెండు విధాలుగా ఉంది. పాశ్చాత్య సంస్కృతి ప్రభావంతో ఉత్తేజితమైన చైతన్యం ఒకవైపు; దీని స్వరూపానికి భయపడి సంప్రదాయ రక్షణ కోసం ఉద్యుక్తమైన చైతన్యం మరొకవైపు. మేధావులు రెండు వైపులా ఉన్నారు సృజనాత్మక శక్తి రెండు పాయలుగా చీలింది సాహిత్యం కూడా రెండు విధాల సముద్భూతమైంది ఒకదానికి వీరేశలింగం, గురజాడలు యుగకర్తలైతే, రెండవదానికి తిరుపతి వేంకట కవులు యుగకర్తలు. గురజాడ వారి 'కన్యాశుల్కం' ఒకవర్గం వారి సామాజిక చైతన్యానికి ప్రతిబింబమైతే, తిరుపతి వేంకటకవుల 'శ్రవణానందమూ' 'పాండవోద్యోగ విజయా'లూ మరొక వర్గం వారి సామాజిక చైతన్యానికి ప్రతిబింబాలు. గురజాడవారి సాహిత్యం హేతువాదాన్నీ మానవతావాదాన్నీ పురస్కరించుకుంటే, తిరుపతి వేంకట కవుల సాహిత్యం దేశీయతను, సంప్రదాయాన్నీ పురస్కరించుకుని నిలువబడింది. కాని కాలం, అంటే సామాజిక చైతన్య పరిణామం గురజాడ వైపే ఉంది. పైగా గురజాడ వారి సాహిత్యం ఒకవర్గం వారి భావసంచలనాన్నే ప్రతిఫలిస్తూ తన స్వచ్ఛందతను, సమగ్రతను పోగొట్టుకోలేదు సామాజిక చైతన్యంలో క్రొత్త పాతల మధ్య ఏర్పడుతున్న ప్రతిష్టంభనను నిష్పాక్షికంగా ప్రతిబింబించటమే 'కన్యాశుల్కం' విశిష్టత, గొప్పతనం గురజాడ తర్వాతి వారిలో స్వచ్ఛందత ఉన్నా, వారి సాహిత్యంలో సామాజిక చైతన్యంలోని ద్వైవిధీభావం సమగ్రంగా ప్రతిఫలించడానికి బదులు, పాక్షికంగా కాల్పనికోద్యమం తాలూకు నవచైతన్యమే ప్రతిఫలించింది అందుకు కారణం పైజెప్పిన రెండు వర్గాల మధ్యా ప్రతిష్టంభన, వైరుధ్యం తీవ్రం కావడమే అనుకోవాలి. 'దేశీయత'ను వనికిమాలిన దానిగా నిరాకరించిన పాశ్చాత్య సంస్కారం కాని, దాన్ని దోషంగా ప్రతిఘటించిన 'దేశీయత' కాని సామాజిక చైతన్యాన్ని సాహిత్యంలో సమగ్రంగా దర్శింపలేకపోయింది ఇది కేవలం. సాహిత్యం యొక్క అశక్తత కాదు! ఇక్కడ ఆనాటి రాజకీయాలను పరామర్శించక తప్పదు. భారత దేశానికే ప్రజా రాజకీయాలు క్రొత్త. గాంధిగారు రాజకీయాల్లో నాయకత్వం వహించక పూర్వం రాజకీయ చైతన్యం ఆంగ్ల విద్యాగంధం ఉన్నవారికే అందులోనూ కొందరికే, పరిమితమై ఉండేది గాంధిగారు రావడంతో రాజకీయాలు సామాన్య ప్రజానీకందాకా వెళ్లాయి. గాంధిగారి వల్ల పాశ్చాత్య సంస్కారానికీ, 'దేశీయతకు' రాజకీయాల్లో పొత్తు కుదిరింది; రాజకీయమైన ఉద్యమానికి నిండుదనం, ఏకోన్ముఖత్వం వచ్చింది కాని, ఇతరత్రా ఆ రెండింటికీ వైరుద్ధ్యమే. రాజకీయాల్లో కూడా గాంధి రెండు వర్గాల వారికీ రెండు రకాలుగా అర్థం అయ్యాడు. అందువల్ల నాటి సాహిత్యం రెండు పాయలుగా ప్రవహించక తప్పలేదు అందులో నవజీవనం వైపు ఉన్ముఖమైన చైతన్యాన్ని ప్రతిబింబించే నవ్యసాహిత్యమే మనకు ప్రస్తుతం పరిశీలించదగింది రామాయణ భారతాలు మళ్లీ వ్రాయబడినా క్రొత్త ప్రబంధాలూ యితిహాసాలూ రాజకీయ చైతన్యం దృష్ట్యా కావ్యాలుగా మలచబడినా, ఆ సాహిత్యం ప్రస్తుతాంశం మాత్రం కాదు.

## 3

నవ్యసాహిత్యంలో ప్రతిఫలించిన చైతన్యం యొక్క స్వరూప మేమిటి? అని ప్రశ్నిస్తే మనకు ముఖ్యంగా కనిపించే విశేషం—మానసికమైన సంకెళ్ళు విడిపోటం భారతీయుని వ్యక్తిత్వం కుటుంబంలో దానికి విర్ణీతమైన పాత్ర ద్వారా జీవితయాత్రలో శృంఖలాబద్ధమై ఉంటుందని యిదివరకే చెప్పాను. ఆ శృంఖలలు విడిపోవటం ఆరంభమైంది అందులో మొదటిది— 'పెండ్లాడిన వ్యక్తినే ప్రేమించాలి' అనేది. పెండ్లికి పూర్వమే ప్రేమించడం, లేక పెళ్ళితో నిమిత్తం లేకుండా ప్రేమించడం, యిది జీవితంలో సామాన్యంగా. ఎదురయ్యే అనుభవమే అయినప్పటికీ, దాన్ని గుర్తించి అంగీకరించే చొరవ పూర్వం లేదు దాన్ని గుర్తించి మానసికంగా అంగీకరించటమే ఒక స్వేచ్ఛ, ఒక సాహసం ఈ 'ప్రేమ' శారీరక వాంఛకు అతీతమూ, ఎటువంటి ప్రతిఫలాపేక్ష లేనిదీ కావడంవల్ల నైతికాదర్శంతోనూ, సాంఘికమైన కట్టుబాట్లతోనూ దీనికి సంఘర్షణ లేదు! ఈ 'ప్రేమ' అనంతమైన నిస్పృహ, నిర్వేదమే కావచ్చు గాక; ఇది ఉదాత్తమైన, నవ్యమైన అనుభూతి సాంఘిక వ్యవస్థతో ఘర్షణ పడకుండా వ్యక్తిత్వం సాధించగలిగిన స్వచ్ఛందమైన మానసిక అనుభూతి, ఈ 'ప్రేమ' స్వర్గమో, నరకమో, స్వచ్ఛందతను, క్రొత్తదనాన్ని ఆకాంక్షించే నాటి మనస్థితికి పెన్నిధి అయింది *

---

* కాల్పనిక సాహిత్యంద్వారా ప్రచారానికి వచ్చిన తర్వాత సమాజంలో ఈ 'ప్రేమ' వివాహవ్యవస్థతో ఐక్యం చేసుకోవడం అది వేరే పరిణామం. సాహిత్యంలో ప్రథమంగా దాని ప్రవేశం ఎటువంటిదో, నాటి సామాజిక చైతన్యంలో దాని స్థానం ఏమిటో గుర్తించటం మాత్రమే ప్రస్తుతాంశం.

దీన్ని పిరికితనంగా భావించి, సెక్స్ విషయంలో స్వచ్ఛంద ప్రవృత్తికే పట్టం కట్టి, సాంఘికమైన కట్టుబాట్లను అన్నింటినీ త్రెంచి వేయమన్న కాల్పనిక వాది చలం. చలం రచనల్లో సంఘసంస్కరణదృష్టి, సాహిత్య సృష్టిని దెబ్బతీసిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. కేవలం వివాహితుడు లేక వివాహిత కావడమే ఒక పాత్రలో పెద్ద దోషమైన విధంగా పాత్ర చిత్రణ జరిగిన చోట్లు ఉన్నాయి. కాని మొత్తంమీద మన సమాజంలో సెక్స్ జీవితం ఎలా ఉన్నదో చలం చిత్రించిన తీరిగా అంటే స్వచ్ఛందంగా సమగ్రంగా ఆ విషయాన్ని చిత్రించిన రచయిత మరొకరు కనిపించరు. సెక్స్ తప్ప జీవితంలో మరేదీ లేదా? అని దిగ్భ్రమ కలిగించేటట్టు ఆయన కలం నడిచింది. సెక్స్ జీవితాన్ని (పర్వర్షన్‌తో సహా) సమగ్రంగా చిత్రించినా, ఆయన రచనల్లో సామాజిక చైతన్యానికి మాత్రం సమగ్ర ప్రతిబింబం కనిపించదు. ఆర్థిక సమస్యల రాజకీయాలా, కుటుంబ సమస్యలూ (సెక్స్‌తో సంబంధంలేనివి) అంటే చలంగారికి విసుగూ, విరక్తీ! అందుకే ఆయన రచనల్ని సంఘ సంస్కరణ పథకాలుగా భావించి యువతీయువకులు చివరకు తికమకపడి, భంగపడటం జరిగింది. పైన చెప్పిన భావనాత్మక 'ప్రేమ'కంటె చలం చిత్రించిన 'సెక్స్' వ్యక్తులలో మానసికమైన స్వేచ్ఛను, సెక్స్ పట్ల క్రొత్త దృష్టినీ పెంపొందించిందనటంలో సందేహం లేదు.

నవసాహిత్యం వదలించిన మరొక శృంఖలం—మనకు ఇతిహాసం అంటే రామాయణ భారతాలు తప్ప మరి ఇతిహాసం లేదు అనే భావన. తెలుగుదేశానికి ఒక ప్రత్యేకత ఉన్నదనీ, తెలుగువారికి చరిత్ర ఉన్నదనీ తెలుసుకుని, ఉద్రేకపడి, ఉప్పొంగి పోవడం ఈ చైతన్య లక్షణం. తెలుగుదేశాన్ని ఇతిహాసికంగా దర్శించిన తర్వాత తెలుగుదేశపు నదులూ కొండలూ, పొలాలూ, ఊళ్లూ అన్నీ వింతగా విచిత్రంగా, క్రొత్తకాంతుల్ని రంగుల్ని విరజిమ్ముతూ కవుల దృష్టికి కనిపించాయి. వాటికి 'తెలుగు' అన్న విశేషణం తగిలించటమే ఒక మధురాతి మధురమైన భావోద్రేకాన్ని రగిలించేట్టు కవులు ఆ పదాన్ని మరీ మరీ వాడారు. ఇది సామాజిక చైతన్యం యొక్క ప్రభావమే కాకపోతే, ఆ పదాన్ని పదే పదే ప్రయోగించి కవి పొందిన భావోద్రేకం వంటిదే పాఠకులందరిలోనూ కలగడం సంభవించదు! ఒక్క పదానికి అంతటి వ్యంజక శక్తి ఉండటం ఏ భాషలోనూ కవిత్వంలోనూ అరుదు. ఇప్పుడు ఆ పదానికి ఆ పొంగు కొంత తగ్గినట్లు కూడా కనిపిస్తుంది! 'తెలుగు' అంటే వ్యుత్పత్తి 'తెనె అగు' అన్నారు ఆ రోజుల్లోనే ఇది కవిత్వమో భాషాశాస్త్రమో తెలియడం లేదు!

ఆనాటి సాహిత్యం ద్వారా తెగిన మరొక శృంఖలం—పురాణాలు సత్యమనీ నిత్యమనీ, స్వర్గనరకాలు ఎక్కడో దూర సీమలో ఉన్నాయనీ (Located in Space) అనుకునే విశ్వాసం పురాణ పురుషుల్ని ఎదురింటి ఎల్లయ్యలూ పొరుగింటి పుల్లయ్యలూ అయినట్లు సామాజికమైన నీతులతో ఆదర్శాలతో కొలిచి అపహాస్యం చేసి రవాటు పెట్టడం జరిగింది. పురాణాలు సాహిత్యం, అపూర్వమైన భావనాశక్తి వాటి ప్రాణం. అందులోని అభూత కల్పనలు సమాజాన్ని శాసించి మభ్యపెట్టాయంటే, సామాజిక చైతన్యం తద్వారా స్తబ్ధమై పోయిందంటే, సామాజిక చైతన్యానికి మేలుకొలుపు అవసరమే! కాని పురాణాల్ని సృష్టించిన వాళ్లు ఏదో కుట్ర చేశారని ఆరోపిస్తూ ఆ కుట్రకు సమాజంలో ఒకవర్గం వారిని బాధ్యులను చేసి ఆవేశం రేకెత్తింప జేయడంతో ఈ సాహిత్యోద్యమం రాజకీయమైన ఉద్యమంగా మారిపోయింది. కాని ఈ ఉద్యమం ద్వారా పాశ్చాత్య తార్కిక సంప్రదాయంతో యువతరానికి గాఢపరిచయం ఏర్పడటం, తర్కించి ప్రశ్నించే ప్రవృత్తి వృద్ధి కావడం జరిగింది. సాహిత్య కాల్పనికోద్యమ పరిధుల్ని దాటి మరింత స్వచ్ఛందతను పెంపొందించుకొని సమాజ వ్యవస్థనూ దాని తత్వాన్నీ పరిశీలించడానికి పూనుకున్నది.

పైజెప్పిన సంకెళ్లన్నీ సంకెళ్లు కావు; హైందవుని హిందూత్వమూ, తెలుగువాని తెలుగుదనమూ అందులోనే ఉన్నాయని నిరూపించేందుకు ప్రయత్నించిన సాహిత్య సృష్టిలో 'విదేశీయతా' ప్రభావాన్ని ప్రతిఘటించే 'దేశీయత' వంటిది కనిపిస్తుంది. కాని ఈ 'దేశీయత', 'విదేశీయతా' ప్రభావం ప్రసాదించిన మానసికమైన స్వేచ్ఛ నుంచీ, నూతన చైతన్యం నుంచీ ఆవిర్భవించిందే! పైజెప్పిన భావనాత్మక ప్రేమనూ, సెక్స్‌లో నైతిక వ్యతిక్రమణనూ భారతీయతకు భిన్నమైన తెలుగుదనాన్నీ, స్వర్గానికి నిచ్చెనలు వేసేవాళ్ల మోసాన్నీ— అన్నింటినీ అంగీకరించి, చిత్రిస్తూనే, అవి అవి కానట్లుగా, కుసి పూసి మారేదు కాదు అన్న ధోరణిలో, 'దేశీయత', 'సంప్రదాయం' అనే ముసుగు పెట్టడం గతాన్ని వర్తమానం లాగ వర్తమానాన్ని గతంలాగ చూపించడం, ఈ కాల్పనికోద్యమ సాహిత్యంలో జరిగిన ఒక విద్రోహం. దీనికి ఈ విద్రోహం తెలియజేసినంతగా మన సామాజిక చైతన్యంలో ఏర్పడిన ద్వైదీభావం పొందుతున్న పరిణామాన్ని మరేదీ తెలియజెయ్యదు; ఈ పరిణామమే తర్వాత తర్వాత మాటలకూ చేతలకూ సంబంధం లేని సామాజిక ప్రవర్తనగా కనిపించి సామాజిక చేతనలో విపరీత వైకల్యంగా నేడు దర్శనమిస్తున్నదంటే అతిశయోక్తి కాదు. ఆనాడు ఇది పరాయివాడి నుంచి నేర్చుకుంటున్నందుకు స్వాభిమానం వల్ల వాడి మీద వచ్చే కోపం లాంటిది; మానసికమైన శృంఖలాలు విడిపోవటంతో స్వధర్మాన్నీ కర్తవ్యాన్నీ స్వేచ్ఛగా నిర్ణయించుకుని భవిష్యత్తుని నిర్మించుకునే బదులు, స్వేచ్ఛ అంటే భయపడి గతంలోకి తిరోగమనం సాగిస్తూ దాన్ని భవిష్యత్తుగా భ్రమించే ప్రవృత్తి; దీన్ని మతసంబంధమైన పిడివాదంగా రూపొందించడం సమాజంయొక్క 'న్యూరాసిస్' లక్షణం. నేడు సామాజిక చైతన్యాన్ని పట్టి పీడిస్తున్న న్యూరాసిస్ ప్రథమదశ ఆనాడే ప్రారంభమైంది దాన్ని ప్రతిబింబించే సాహిత్యం ఈ నాటికీ సమాజాన్ని కలవరపెడుతూనే ఉంది.

బ్రహ్మసమాజము, ఆర్య సమాజము, బెంగాలీ కవిత్వము, ఆంగ్ల సాహిత్యము, హేతువాదము, ఆధ్యాత్మికవాదము దేనితోనూ సంబంధం ఎరుగని కావ్యాలు కాల్పనికోద్యమంలోకి వచ్చినవే కొన్ని ఉన్నాయి; నండూరివారి యెంకి పాటలు, విశ్వనాథవారి కిన్నెరసాని పాటలు, 'మా బాబు' నవల, చలంగారి కథలు కొన్ని. ఇవి వర్డ్స్‌వర్త్ 'The Solitary Reaper' వంటివి. కాలంతో, ఉద్యమాలతో సంబంధం లేకుండా సాగిపోయే జానపదుల నిసర్గసుందరమైన జీవితం తాలూకు సుఖ దుఃఖానుభూతి, చైతన్యం ఈ రచనల్లో ప్రతిఫలిస్తున్నవి.

## 4

శృంఖలాలు ఊడిపోయి, సమాజం జాగరితమౌతున్న దశలో భవిష్యత్తును గూర్చి ఆలోచనలూ, సిద్ధాంతాలూ పైనుంచీ రాకతప్పదు. సామాజిక చైతన్యం వాటిని ఆలంబనం చేసికోక తప్పదు. ఇది అవసరమైన దశ. కాని ఈ దశలో కూడా కవిలో, రచయితలో వ్యక్తిగతమైన స్వచ్ఛందత కనిపిస్తుంది. అది నూతన సాహిత్య ప్రక్రియల ద్వారా వ్యక్తమౌతుంది. శ్రీశ్రీ కవిత్వమూ, గోపీచంద్ కథలూ ఈ కోవకు చెందినవి.

సమాజంలో నిద్రాణమై ఉన్నవర్గం రాజకీయచైతన్యం ద్వారా క్రమంగా మేల్కొనడం ప్రారంభమైంది. ఈ వర్గంవారి అనుభూతి ముఖ్యంగా బ్రతుక్కు సంబంధించినబాధ,ఆవేదన,రాజకీయ,సాంఘిక దురన్యాయంవల్ల, లేమివల్ల దీనత్వం వల్ల మానవ చైతన్యం అనుభవిస్తున్న ఈ బాధ నిత్యమైనది. దానికి చరిత్రలో, సాహిత్యంలో, సమాజంలో నడిచిన ఉద్యమాలలో పూర్వం ఎప్పుడూ గుర్తింపు లేదు. ఆ గుర్తింపు మార్క్సిజమ్ ఉద్యమరూపం దాల్చి, రష్యాలో రాజకీయంగా విజయం సాధించటంతో ప్రారంభమైంది. మన సమాజంలోనూ, ఈ నవ చైతన్యం జాగరితమై విప్లవోన్ముఖం కావటాన్ని ఊహించి దర్శించి తన కవితా హృదయాన్ని దానికి అర్పించినవాడు శ్రీశ్రీ. కాని మార్క్సిజమ్ సిద్ధాంతాలకిగాని, దాని తాలూకు రాజకీయాలకుగాని కవిత్వాన్ని తాకట్టు పెట్టక పోవడమే కవిగా శ్రీశ్రీ విశిష్టత రాజకీయ ఉద్యమమైన మార్క్సిజమ్ అతని రచనల్ని ఉపయోగించుకోవటం వేరు ఆ ఉద్యమ ప్రయోజనంకోసం శ్రీశ్రీ కవిత్వం వ్రాయలేదంటే అది అసత్యం కాదేమో! అభ్యుదయ కవిత్వోద్యమాన్ని గూర్చి దానికి సంబంధించిన కవులందరినీ గురించి ఈ మాట చెప్పడం సులువు కాదు. శ్రీశ్రీ అనుయాయులైన చాలమంది కవులకు, తర్వాత అభ్యుదయ రచయితల ఉద్యమంలో చేరిన కథకులకీ నవలా రచయితలకీ, మార్క్సిజమ్‌పట్ల స్వచ్ఛందమైన దృక్పథంలేదు. ఆ మేరకు వారి సాహిత్యానికి స్వతంత్ర ప్రతిపత్తిలేదు. పూర్వం ఉన్న దాన్ని కొందరు పోగొట్టుకొన్నారు. సోమసుందర్, ఆరుద్రవంటివారు దాన్ని తర్వాత సంపాయించారు.

శ్రీశ్రీ తర్వాత ఆ స్థాయిలో ఎన్నదగిన కవి బాలగంగాధరతిలక్. సామాజిక చైతన్యాన్ని సమగ్రంగా శ్రీశ్రీ కంటె గాఢంగా తన భావనలో కేంద్రీకరించుకొని గొప్ప సృజనాత్మక శక్తిని వ్యక్తం చేసిన కవి తిలక్. శ్రీశ్రీ తిలక్‌కు గల భేదం గమనింప దగింది. శ్రీశ్రీ ద్రష్ట (Prophet) అయితే తిలక్ స్రష్ట (Creator). శ్రీశ్రీ భావనలో చూచినది చూచినట్లు పలుకుతాడు; ఆ పలుకులు బాణాలవలె, 'త్రాచులవలె రేచులవలె' అంతస్సీమల లోకి చొచ్చుకుపోతాయి. తిలక్ అనుభవించిన దాన్ని స్వప్నాలుగా, మల్లెపువ్వులుగా, కన్నీటి ముత్యాలుగా సృష్టించి స్నేహపూర్వకంగా నివేదిస్తాడు. ఇద్దరి కవితా ధ్యేయమూ ఒకటే! 'పతితులారా! భ్రష్టులారా! బాధాసర్ప దష్టులారా!' అని శ్రీశ్రీ ఎలుగెత్తి పిలిచి దగాపడిన తమ్ముళ్లతో, 'మీకోసం కలంపట్టి.... జగన్నాథుని రథ చక్రాల్, రథ చక్ర ప్రళయఘోష భూమార్గం పట్టిస్తాను! భూకంపం పుట్టిస్తాను' అంటాడు. తిలక్:

ఒక్క నిరుపేద ఉన్నంతవరకు, ఒక్క మలినాశ్రు
బిందు వొరిగినంతవరకు,
ఒక ప్రేగు ఆకలి కవలినంతవరకు,
ఒక్క శుష్క స్తన్య సన్నిధిని క్షుధార్తి నేడ్చు పసిపాప
ఉన్నంతవరకు,
ఒక తల్లి వీరవాక్రోశరవమ్ము విన్నంతవరకు,
ఒక క్షత దుఃఖిత
హృదయ మూరడిల్లనంతవరకు,
నాకు శాంతి కలుగ దింక నేస్తం, నేను నిగర్వినైనాను,
ఈ సిగ్గులేని ముఖాన్ని
చూపించలేను,
ఈ గుండె గూడుపట్లు ఎక్కడో కదిలినవి, ఈ కనులు
వరదలై పారినవి,
ఈ కలలు కాగితప్పు పేలికలై రాలినవి.
ఈ ఆర్తి ఏ సౌధాంతాలకు పయనింపగలదు?
ఏ రాజకీయవేత్త గుండెలను
స్పృశింపగలదు? ఏ భోగవంతుని
విచలింపచేయగలదు? ఏ భగవంతునికి
నివేదించుకొనగలదు?......'అంటాడు.

సామాజిక చైతన్యంలో శతాబ్దాలుగా గుర్తుకురాని దీనజనుల ఆర్తి, బాధ, నిరాశ, నిస్పృహ సాహిత్యంలో ప్రతిబింబంగా స్వరూపం దిద్దుకుని సమాజం గుండెల్లో కుంపటిగా రగిలేందుకు అభ్యుదయ కవులు చేసిన ప్రయత్నం గొప్పది. కాని ధ్యేయం గొప్పదైనా అది సాహిత్యంయొక్క స్వచ్ఛందతకు భంగం కలిగించేది కారాదు. శ్రీశ్రీ వ్రాసిన 'కవితా! ఓ కవితా!!', తిలక్ వ్రాసిన 'ఒక శ్రుతి' పరిశీలిస్తే, ఆ కవు లిద్దరూ మొదట కవులూ, తర్వాత అభ్యుదయకవులు అనే సత్యం బోధపడుతుంది. ఇద్దరి కవిత్వాల మధ్యగల రీతిభేదం కూడా ఈ రచనల్లో వాళ్లే స్పష్టం చేశారు. ఉదాహరణకు—

శ్రీశ్రీ.— 'నాసుడుల తీగలపై సాగిన
నాదబ్రహ్మపు పరిచుంబనలో
ప్రాణాపాన వేణుజనితం
నానాగానామాన స్వనావళితం
బ్రదుకును ప్రచండ భేరుండ గరు
త్పరిరంభంలో పట్టిన గానం
సుఖదుఃఖాదిక ద్వంద్వాతీతం
అమోఘ, మగాధ, మంచిత్య, మమేయం

ఏకాంతం, ఏకైకం,
క్షణికమ్మై శాశ్వతమ్మైన దివ్యానుభవం
బ్రహ్మానుభవం కలిగించిన,
నను కరగించిన కవనఫ్రుణీ!
రమణీ!
కవితా! ఓ కవితా!'

తిలక్:— 'ఒక లేత నెత్తావి చరణమ్ము
వానువ్వ సౌందర్య హృదయమ్ము
లో మెత్తగా మెల్లగా
నడచినటు పరుగిడినటు
ఝణంఝణ క్వణ రవళి
గిరునం దిరిగినటు
కుచ్చెళుల చెరగు లోరసికొని
ఓరసికొని
తలుపు చివరల మెరసినటు
నాలోన
లోలోన
ఒక శ్రుతి
ఒక గతి.'

శ్రీ శ్రీ కవితా దేవత భద్రకాళి తిలక్ కవితా దేవత బాలా త్రిపుర సుందరి

శ్రీ శ్రీ — 'నా ఆకాశాలను
లోకానికి చేరువగా,
నా ఆదర్శాలను
సోదరులంతా పంచుకునే
వెలుగుల రవ్వల జడిగా
. ..............
అర్పిస్తానో
నా విసరిన రస విస్మయ
కుసుమపరాగం!
ఓహో! ఓ రసధుని! మణిఖని! జననీ! ఓ కవితా!
కవితా! కవితా! ఓ కవితా!!'

తిలక్:— .......... నేను
నిర్వాత దీప ని
శ్చలముగా నిలువగా
నిర్వేతు కానంద
నీరవగీతాన పిలువగా
కిన్నరులు కొనగోట
వెండిచుక్కల మీట
కలలొత్తి అలలొత్తి
కడలిలా పరచుకొను
నాలోన
లోలోన
ఒక శ్రుతి
ఒక గతి"

ఒకటి వెలుగుల రవ్వల జడి కురిపించే ఆకాశమైతే, మరొకటి కలలొత్తి అలలొత్తి పరచుకొనే కడలి.

## 5

శ్రీ శ్రీ, తిలక్ యిద్దరూ విన్నటివాగు.

ఉద్యమం ఏ పేరుతో వ్యవహరించినా విన్నటి సాహిత్యంలో ప్రతిబింబించిన చైతన్య స్వరూపం వ్యవస్థలో నలిగిన మనిషి ఆర్తి, అతనుపడే బాధ, రాల్చే కన్నీళ్ళు. దానితోబాటు ఒక ఆశ, భవిష్యత్తు బాగుంటుందన్న ఆశ, కూడా ఉండేది "ఎంచేతనంటే భవిష్యత్తుమీదే ఎప్పుడూ నా నిఘా ఉంటుంది. ఇవాళ కంటె రేపే ఎంతో బాగుంటుందంటాను నేను" అనీ, "ఆ స్వర్గం వేరే కడు దూరంలో లేదు లేదు, ఈడే నేడే వున్నది నీలో నాలో వున్నది" అంటూ శ్రీ శ్రీ భరోసా యిచ్చాడు కాని, ఆ ఆశ, ఆవిశ్వాసం నేటి కవుల్లో లేదు. శ్రీ శ్రీ, తిలక్‌వంటి కవులు కూడా మాటలతో దగా చేశారని వీరి భావన 'నీలో నాలో వున్నది స్వర్గం' అన్న శ్రీ శ్రీ మాటకు నేడు నీలో నాలో కనిపిస్తున్నది నరకమేనే! అని వీరి ఆక్రోశం ఈ నిస్పృహ క్రొత్తది అభ్యుదయ కవులకువలె ఒక వర్గం మీద నేరం మోపి, ఆ వర్గం యొక్క పతనాన్ని కాలగమనంలో ఆకాంక్షిస్తూ శాపనార్థాలు పెట్టుతూ కూర్చోవడ మంత సులువుగా కనిపించడంలేదు సమస్యా పరిష్కారం వీరికి. ఈ సమాజంలో దొంగెవ్వరు? దొర ఎవ్వరు అని ప్రశ్న ఇది వట్టి గాంధీజమ్, మార్క్సిజమ్‌లకు లొంగే ఆకలి సమస్యా, ఆర్థిక సమస్యా కాదు! కవిత్వం రంకెలు వేసినా, కన్నీళ్ళు కార్చినా ఈ నిస్పృహ పొలిమేరల్లోకైనా రాలేకపోతున్నది. యువతరంవారి చైతన్యం పొందుతున్న అతివేలమైన నిర్వేదమూ, జుగుప్స యిక్కడ సమస్య. దానికి కారణం సమాజంలో సరే సర్వత్రా మాటలకూ, చేతలకూ పొంతన లేకపోవడం. ఇక్కడ వర్గ విభేదంలేదు—కాల్పనికోద్యమం నాటి పాశ్చాత్య సంస్కారం గల వర్గం, దేశీయతనూ, సంప్రదాయాన్నీ అంటి పెట్టుకున్న వర్గం అనే విభేదంగాని అభ్యుదయవాదులనాటి ధనికవర్గం పీడిత వర్గం అనే వర్గ విభజన గాని యిక్కడ వర్తించదు ఇంగ్లీషు వచ్చినా, రాక పోయినా, డబ్బున్నా, లేకపోయినా మనుష్యుల్లో నేడు కనిపిస్తున్న సామాన్య లక్షణం. మాటలకూ, చేతలకూ గల వైరుధ్యం ఇది 'న్యూరాసిస్'. ఉద్య మాలు క్రొత్తవి ఉద్భూతం కాగలిగినప్పుడే సమాజంలో మార్పుకి అవకాశం ఉంటుంది. సామాజిక చైతన్యం క్రొత్తగా రూపం దిద్దుకుంటుంది అది జీవ లక్షణం. కాని యిక్కడ ఉద్యమాలమీదే నమ్మకం పోయింది స్తబ్దత ఆవరించింది. సమాజంలో "మాదా కవళం మేధావులూ, లంగామార్క్సిసి మాలూ, వంటింటి పత్రికలూ, అగాధవిూలనే అనాథ శరణాలయాలూ"[1] కనిపిస్తున్నప్పుడు స్తబ్దత తప్ప, క్రొత్తదైన ఊహా, శక్తివంతమైన ఊపూ ఎక్కడినుంచీ రావాలి? క్రొత్త ఉద్యమం రావడానికి మేధావి అయిన వాడికీ లేక నాయకుడైన వాడికీ మొదట తన మాటలమీద తనకే నమ్మకం ఉండాలి; తర్వాత తన చేతలద్వారా ఆ నమ్మకాన్ని నిరూపించాలి అదే ఉద్యమానికి నాంది అవుతుంది కాని అందరిలోనూ లోపిస్తున్నది ఈ నిజాయితీనే! "సభల్లో శాసనాల సంధ్యావందనాల్లో, ఉపన్యాసాల ఊకదంపుళ్లల్లో, హక్కుల రుక్కుల చిక్కుల్లో, తీర్మానాల తీయందనాలలో, ప్రణాళికా వసంతాల మందిళ్లలో చిక్కు చిక్కుమంటున్న దిక్కులేని బీద సత్యాల మానభంగం సంప్రదాయ సిద్ధంగా జరుగుతూంది[2] వ్యక్తి ఈ సామాజిక చైతన్యం పొందుతూన్న న్యూరా సిస్‌లో చిక్కుపడి, నిస్సహాయుడై "కాలం వెలయాలితో రమిస్తున్నాడు"[3] నేటి సామాజిక చైతన్య స్వరూపాన్ని దాని అస్వస్థతని జుగుప్సాకరంగా, బీభత్సంగా చిత్రిస్తున్న 'దిగంబర కవుల' నిజాయితీని మెచ్చుకోక చేసేదేముంది?

దిగంబర కవులు ఆరుగురు జంటకవులు తెలుగుదేశంలో ఒక సంప్ర దాయం కాని ఆరుగురు కవులు, ఏకంగా, వైయక్తిక భేదం కనిపించనీకుండా కవిత్వం చెప్పడం ఒక విశేషమే! ఇది కూడా ఈనాటి సామాజిక చైతన్యం యొక్క విలక్షణతేనని తోస్తుంది ఈమధ్య నలుగురైదుగురు రచయితల చేత ఒక గొలుసు కథను నడిపిస్తున్నారు పత్రికలవాళ్లు నేటి సమాజంలో వ్యక్తికంటె సమూహానికే గౌరవ, సాహసం, ఎక్కువ. సాధారణంగా ఉద్యమ మనేది ఒక వ్యక్తివేసే ముందడుగుతో ప్రారంభమై తర్వాత సామూహిక

1 'కాస్మిక్ జాతికోసం': దిగంబర కవులు, సంపుటి 2, పుట 12

2 'కిలికించితం'- దిగంబర కవులు, సంపుటి 2 పుట 25

3. 'ఊబి', దిగంబర కవులు, సంపుటి 2, పుట 35

మౌతుంది రాచకీయాల్లోగాని, తత్త్వచింతనలోగాని, సాహిత్యంలోగాని యిలానే జరుగుతుంది అది సమాజంయొక్క స్వస్థతకు లక్షణం నేటి సమాజంలో జరుగుతున్నది యిందుకు భిన్నంగా ఉన్నది. వ్యక్తిలో చొరవ కనిపించదు చొరవకు కావలసిన ఆత్మ విశ్వాసం లేదు. అందువల్ల ఏది కావాలన్నా, ఏమి చెయ్యాలన్నా ప్రప్రథమంగా ఒక గుంపుని, ముఠాని తయారు చేస్తున్నాడు. ఇదీ సామాజిక చైతన్యాన్ని పట్టుకున్న స్తబ్దతకు రూపాంతరమే సృజనాత్మకమైన శక్తివంతమైన భావాలు లేకపోవడంవల్ల, అశక్తి లోపాన్ని సామూహిక శక్తి ద్వారా పూరించుకోవడం జరుగుతున్నది పదిమంది సమూహంగా ఏర్పడి స్వార్థంకోసం, వర్గ ప్రయోజనాలకోసం దురాగ్రహం చెయ్యడం, దౌర్జన్యమూ, హింసాపూర్వకమూ అయిన కాండ నడపడం, నేడు సమాజంలో హక్కులపేరిట రాజకీయ, పారిశ్రామిక, సాంఘిక రంగాలన్నింటిలోనూ జరుగుతున్నదే. ఇది సామాజికమైన న్యూరాసిస్ తప్ప మరొకటి కాదు. ఇక్కడ నీతి, ధర్మం, పుణ్యం, పాపం ప్రశ్న కాదు. శ్రీ శ్రీ అన్నట్లు "ఈవిల్ సిన్ మొదలైన పదాలను వాడేప్పుడు, న్యాయం, ధర్మం నీతీత్యాదులను చర్చించేప్పుడు ఎవరికితోచిన అర్థం వారలు చెప్పక తప్పదు" అనే సూత్రం అంగీకరించినా, శ్రీ శ్రీయే ఆశించిన "పరమార్థం సామాజిక సామూహిక సద్వర్తన" మాత్రం మృగ్యం అవుతున్నది కాబట్టి అభ్యుదయవాదులు ఆశించే వర్గ చైతన్యమూ, ప్రగతీ యీ పరిస్థితిలో కానరావు అందుకే వారి కవిత్వం నేడు పాతబడిపోయింది

అయితే ఈ విష వలయంనుంచీ ఎలా బయటపడటం? నేటి సామాజిక చైతన్యాన్ని అంటే దాని అస్వస్థతను ప్రతిబింబిస్తున్న కవిత్వమే, సాహిత్యమే, నేటి పరిస్థితుల్లో అందుకు మిగిలిన ఏకైక సాధనంగా కనిపిస్తున్నది స్వచ్ఛందమూ, శక్తివంతమూ అయిన సాహిత్యం, నేటి స్థితిని ప్రతిబింబించడం ద్వారానే ఆత్మ విచారం చేసుకునేందుకు వ్యక్తుల్లో, తద్వారా సమాజంలో అవకాశం ఏర్పడుతుంది ఈ గందరగోళాన్ని కనీసం ఉపలక్షించేందుకు అయినా పట్టుదొరకాలి కదా! ఆ అవకాశం యిచ్చేందుకే 'దిగంబర కవిత 'నేటి స్థితినిగూర్చి పాఠకుని మనస్సుని' ఆఘాతపరచడమే (to shock) లక్ష్యంగా పెట్టుకొన్నట్లు తోస్తుంది దిగంబర కవిత కేవలం తిట్లు కవిత్వంగా కనిపిస్తున్నదంటే ఆశ్చర్యపడవలసిం దేమీ లేదు!

సమాజచేతననీ దాని అస్వస్థతనీ ప్రతిబింబించడంలో 'దిగంబర కవిత' నగరవాసం చేస్తున్నది. అన్నీ నగరంలో జీవితానికి సంబంధించిన చిత్రణలే! గ్రామీణ జీవితానికీ, ప్రకృతికీ యిందులో స్థానంలేదు కాని నేటి పరిస్థితిని ప్రకృతి దృశ్యాల రూపేణా, ధ్వన్యాత్మకంగా చిత్రిస్తున్న వరవరరావు, తద్వారా సామాజిక స్వస్థత ఎక్కడనుంచీ రావాలో రాగలదో కూడా సూచిస్తున్నాడు. సమాజంలోని స్తబ్దతకు సంకేతం రాత్రి. 'ఈ రాత్రి దొంగపనానికి బంజరుదొడ్డిలాగున్నది రాత్రి నిన్నటి జ్ఞాపకాలకు రేపటి కర్తవ్యాలకు మధ్యన కూలిపోయిన వంతెన లాగున్నది ఈ రాత్రి చిత్తకార్తెలో కుక్కలు మొరిగే వీధిలాగున్నది మనస్సు; వీగిపోయిన మనస్సు ఈ రాత్రి దొంగలు దోచుకుపోయిన ఇల్లులాగున్నది ఇది ఆత్మహత్యా సదృశమైన రాత్రి, ఇది ఆత్మవంచనలని చదువుతున్న రాత్రి 4 ఇందులో వర్ణితమైన సమాజం, దిగంబర కవులు చిత్రించే సమాజం ఒకటే మార్గం భిన్నం.

రాత్రి తెల్లవారడం ప్రారంభమైనదంటూ ఒక ఆశాభావాన్ని వ్యక్తం చేస్తున్నాడీ యువకవి. అతనికి తెల్లవారటంలోనూ ఒక చిక్కు కనిపిస్తున్నది సూర్యుడికోసం ఎదురు చూస్తున్నా చలీ, మంచు తెరలూ చీకాకు పెడుతున్నాయి. ఇక్కడ చలీ, మంచు తెరలూ గడచిన ఉద్యమాల, శేషించిన ఇజాల తాలూకు భావాలకు సంకేతం. నిజాన్ని చూడాలనే యువతరాన్ని ఇజాలు కలవరపెడుతున్నాయట; యువకుల అమాయకత్వం తికమక పడుతున్నది. "మంచి నీరనకుని రాత్రి మల్లెపూవు తాగిన మంచి నీరు గడ్డ కట్టి కుత్తుక జారడంలేదు"5 అంటాడు. కాని 'శ్రామికుని కివేమీ చలి సందేశాన్నివ్వజాలవు .. ''6 "కృషీవలుని అనాచ్ఛాదిత దేహానికి దుక్కిటెద్దుకూ, మోటబారుకూ చలి ఉండదు "7 కాబట్టి చదువుకున్నవారికంటె 'ఇజాల'ను తల కెక్కించుకోని స్వచ్ఛంద మనస్కుల ద్వారానే సామాజిక స్వాస్థ్యం సాధ్యమని అభిప్రాయపడుతున్నాడు ఈ సత్యం తెలిసిన తనకూ్కడా 'ఇజాల' ప్రభావంనుంచీ తప్పించుకోవడం కష్టంగానే ఉందట! "ఉషోబాలను నికషోపలంగా పెట్టుకొని రోషావృత కశ్మలజగంలో ఆషామాషీల నరయుదామనుకున్న నాకూ శిశిర వేశ్యాలోలత్వంలో వెగటుగుణాలు కొన్ని అలవడ్డాయి. సాక్షికత్వం గిట్టని నా కళ్లమీద కూడ ఏదో మంచుతెరలాంటిది కప్పివేసింది చలి ఉంపుడు కత్తె."8 రాజకీయ వివాదాలూ, నిన్నటి 'ఇజాలూ' ఉంపుడుకత్తెల్లాగ వ్యామోహం కలిగిస్తూంటే, సాహిత్యంలో, ఆలోచనలో స్వచ్ఛందతను అన్వేషిస్తున్న వరవరరావులాంటి యువ కవుల నిజాయితీ మెచ్చుకోదగింది. కాని వరవరరావు ఊహకుకూడా సమస్యా పరిష్కారమార్గం స్పష్టంగా అందిన సూచనలేదు.

అటువంటి సూచన కొంతకు కొంత వేగుంట మోహనప్రసాద్, వరిగి రాధాకృష్ణ ప్రభృతుల రచనల్లో లభిస్తుంది అందులో ముఖ్యమైనది మనస్సుయొక్క తత్వాన్ని స్వీయమైన అనుభూతి ద్వారా అర్థం చేసుకోవాలనే జిజ్ఞాస ఇది సమాజంలో ఆత్మ విచారం యిప్పుడిప్పుడే ప్రారంభమౌతున్న శుభసూచన. తత్త్వవిచారంలో క్రొత్తదనం ఏమీ లేకపోవచ్చు. కాని ఎవరికివారు ప్రపంచాన్ని, సమాజాన్ని, తాత్విక సిద్ధాంతాలను సొంతంగా అనుభూతిద్వారా స్పృశించి అవలోకించి, ఆలోచించి ఆనందించాలనుకుంటారు. ప్రతి వ్యక్తికీ కూడూ, గుడ్డా ప్రాథమికావసరాలైనప్పటికీ, తర్వాతి అవసరం ఈ మానసికమైన సృజనాత్మకమైన స్వేచ్ఛే. నేడు యువతరంలో ఈ స్వేచ్ఛకే తహతహ కనిపిస్తున్నది. అందుకే వాళ్ళు అటు సంప్రదాయవాదుల వేదాంతాన్నీ, మతాన్నీ వద్దంటున్నారు, యిటు కాల్పనికవాదుల, అభ్యుదయవాదుల, 'ఇజాలనూ' వద్దంటున్నారు. వాళ్ల సొంత ఇజమ్ వాళ్ళల్లోని నిజం, వాళ్ళు వెతుక్కోవాలనే జీవలక్షణం నేటి యువతలో భాసిస్తున్నది.

ఈ వ్యాసం మొదట్లో సూచించాను, ఈ దేశంలో శతాబ్దాలుగా మనిషి వ్యక్తిత్వానికి పుట్టినప్పటినుంచీ ఒక చట్రం, ఒక మూస నిర్ణీతమై ఉండేదని. ఎన్ని ఉద్యమాలు నడిచినా దానికేమీ భంగం ఉండేదికాదు. కాల్పనికోద్యమం నాటికి అది ముక్కలై దాని తాలూకు సంకెళ్ళు విడిపోవడం ప్రారంభించినా దాని శైథిల్యం దేశ స్వాతంత్ర్యం తర్వాతే పూర్తి అవుతూ వచ్చింది ఇలా వ్యక్తికి ప్రాప్తించిన విశృంఖలత్వం మానసికమైనది ఈ విశృంఖలత్వం, స్వాతంత్ర్యం ఒకటికావు. వ్యక్తిలో విశృంఖలత్వం, నిజమైన స్వాతంత్ర్యంగా రూపొందేటందుకు కావలసిన అనుభూతి వైవిధ్యమూ, సంయమనమూ జీవితం ఒక్కటే ప్రసాదించగలదు. ఇందులో ప్రమాదం ఉండవచ్చు. సంప్రదాయంలో ఉన్న భద్రత సాహసంలోలేదు కాని సాహసమే జీవ లక్షణం. విశృంఖలత్వాన్ని మాత్రమే పొందిన వ్యక్తి కేవలం స్వార్థపరతతో, సంకుచితమైన మార్గాలలో, అర్థంలేని విధ్వంసక ప్రవృత్తితో కొంతకాలం ప్రయోగం చేస్తాడు. దీన్ని సరిదిద్దడానికి బాహ్య నిబంధనలు కాని, 'ఇజాలు' కాని, దేశీయమైన మతాలు, ప్రబోధాలుకాని చాలవు. వ్యక్తిలో స్వతంత్రమైన ఆలోచన అనుభూతినిష్ఠంగా సాగాలి. సంయమనం ఏర్పడాలి కాల్పనికోద్యమంగాని, అభ్యుదయవాదంగాని వైయక్తికమైన, స్వతంత్రమైన చిత్తమథనానికీ, ఆత్మ దర్శనానికీ యిచ్చిన అవకాశం తక్కువ. అటువంటి చిత్తమథనమూ, ఆత్మ దర్శనమూ కవిత్వంలోకంటె నవలలో, కథలో, నాటికలో యింతకుముందే ప్రారంభమయ్యాయి బుచ్చిబాబు కాల్పనికోద్యమం తాలూకు 'ప్రేమ'నీ, గోపీచంద్ హేతువాదాన్నీ, సామాజిక ప్రగతి ఆదర్శాన్నీ నిరాసంచేసి వ్యక్తిగతమైన అనుభూతిద్వారా జీవిత సత్యాన్ని మథించినవారు రాచకొండ విశ్వనాథశాస్త్రి 'అల్పజీవి'లో సంప్రదాయంకంటె సాహసమే ఎలా జీవలక్షణమో చిత్రించాడు. అటువంటి స్వతంత్రతే తిలక్‌చేత–

4. 'రాత్రి' : చలినెగళ్ళు, పుట 10
5. 'శిశిరోషస్సు' : చలి నెగళ్ళు, పుట 22
6 'శిశిరోషస్సు' : చలినెగళ్ళు, పుట 23
7 'హిమయవనిక' చలినెగళ్ళు, పుట 29
8. 'శిశిరోషస్సు' : చలి నెగళ్ళు, పుట 23

'నా కవిత్వం కాదొక తత్త్వం
మరికాదు మీ రసే మనస్తత్త్వం
కాదు ధనికవాదం, సామ్యవాదం—
కాదయ్యా అయోమయం జరామయం......
నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు"

అనిపించింది అందుకే ఈనాటి కవులమీద తిలక్ ప్రభావం అజ్ఞాతంగా ఎంతో వుంది. బుచ్చిబాబు, గోపీచంద్, తిలక్, వేళ్లమీద లెక్కించదగిన రచయితలు తమని ప్రభావితం చేసిన ఉద్యమాల 'ఇజాల' గోడలమధ్యనుంచి పైకి వచ్చి స్వచ్ఛందతను నిరూపించుకోగలిగారు. నేటి యువత 'ఇజాల'ను నిరాసం చెయ్యడం ప్రారంభించింది. నేటి కవుల వైయక్తిక దృక్పథం ఏర్పడేదాకా పయనించాలి, పయనించకతప్పదు అప్పుడే సామాజిక చైతన్యం పునరుద్దీపిత మౌతుంది అప్పుడే 'తెలుగుదనం' మొదటిసారిగా స్వతంత్రమౌతుంది, ప్రకాశిస్తుంది.

## 6

చివరి మాటగా 'స్త్రీల సాహిత్యాన్ని' గూర్చి ప్రస్తావించక తప్పదు. నేటి 'స్త్రీల సాహిత్యం' అంటే స్త్రీలు వ్రాస్తున్నదే కాదు; ముఖ్యంగా స్త్రీలూ వారితోపాటు పురుషులూ వ్రాస్తున్న ఒక రకం కథలూ, నవలలూ అని ఉద్దేశం ఈ సాహిత్యం విరివిగా వస్తున్నది ప్రతియింటా, అక్షరాస్యు లందరిచేతా చదువబడుతున్నది మనకు రామాయణ మహాభారతాలతోపాటు అనుబంధంగా 'స్త్రీల సాహిత్యం'—ఊర్మిళనిద్ర, లక్ష్మణదేవర నవ్వు, కుశ లవులకథ వంటివి— ఉంటూనే ఉన్నది దాన్ని స్త్రీలు మాత్రమే వ్రాయకపోయినా అది 'స్త్రీల సాహిత్యమే' అలాగే నేడూ అనుబంధ సాహిత్యం ఉన్నది. బాగా విస్తరిస్తూ ఉన్నది ఈ సాహిత్యంలో కనిపించే చైతన్యం తాలూకు భావాలు యాభై ఏళ్లనాటి విప్లవంయొక్క మలికెరటంగ చెప్పాలి ఆనాటిభావాలు క్రమంగా అక్షరాస్యత పెరగటంతో ఈనాటికి వివిధ దశల్లో, రూపాల్లో జనసామాన్యంమీద, ముఖ్యంగా స్త్రీలమీద చూపుతున్న ప్రభావాన్ని ఈ సాహిత్యం ప్రతిబింబిస్తున్నది అంటే వీరేశలింగం, చలం, కాల్పనికోద్యమం ఒక వైపు, నేటి సినిమాలూ, సాహిత్య ప్రతిపత్తిని అందుకోని విదేశీ నవలలూ మరొక వైపు ఈ రచనలకు 'ఇన్‌స్పిరేషన్!' ఇదంతా స్త్రీల సాహిత్య కృషిని కించపరచటం కాదు స్త్రీలలో యింతటి రచనా వ్యాసంగం, పఠనాసక్తి వ్యాపించడం సాహిత్య భవితవ్యానికే కాదు, సామాజిక స్వస్థతకు కూడా శుభ సూచన కవి పరిశీలించి చూస్తే నవ్య సాహిత్య వికాసంలో స్త్రీల పాత్ర నాటికీ నేటికీ ఉత్సాహజనకంగా లేదు నాడు కాల్పనికోద్యమంలో కవిత్వం వ్రాసిన స్త్రీలు ఎంతమంది? సౌదామని, విశ్వసుందరమ్మ, బసవరాజు రాజ్యలక్ష్మి అనే పేర్లు కొన్ని కవితా సంకలనాలో సకృత్తుగా కనిపిస్తాయేతప్ప వాళ్ల కవితా సంపుటాలు ఏవీ? అభ్యుదయ సాహిత్యోద్యమంలో చెప్పుకోదగ్గ కవయిత్రులు ఎవరైనా ఉన్నారా? బహుశా నాకు తెలీదేమో! నేడు వచన కవిత్వం వ్రాస్తున్న స్త్రీలు ఎవరు? కార. చీకటిలో కాంతిరేఖ అను కవితా సంపుటికర్త సి. విజయలక్ష్మి పేరుకు మాత్రమే స్త్రీ అన్నారు! నిజమేనా? నేటి సామాజిక చైతన్యానికి మార్గం చూపగల అగ్రగామి సాహిత్యాన్ని సృష్టిస్తున్న స్త్రీలు ఏరీ? అటువంటి సాహిత్య ప్రతిపత్తికి అర్హమైన కథలు స్త్రీలు వ్రాసినవి కొన్ని వచ్చాయి ఒకటి రెండు నవలలకు కూడా ఆ అర్హత ఉండవచ్చు అంతకంటె చెప్పుకోలేని స్థితి

* * *

సాహిత్యం శాసిస్తుందా? శాసింపబడుతుందా? అని మొదట వేసుకున్న ప్రశ్నకు సమాధానం ఇప్పుడు లభించవచ్చు సాహిత్యంయొక్క సముచిత కర్తవ్యం, సామాజిక చైతన్య స్వరూపాన్ని ఎప్పటికప్పుడు స్వచ్ఛందంగా ప్రతిబింబిస్తూ ఉండటమే! సాహిత్యం సమాజాన్ని శాసించిన సందర్భాలలో క్రమంగా ఎటువంటి స్తబ్ధత సామాజిక చైతన్యంలో ఏర్పడిందో పరిశీలించాము అలాగే ఉద్యమాలు—మత, రాజకీయ సంబంధమైన ఉద్యమాలు—సాహిత్యాన్ని శాసించే సందర్భంలో సాహిత్యం పొందే శైథిల్యమూ, చివరకు చేసే తిరుగుబాటూ అవగతమే ఒక పోలిక చెప్పాలంటే, సమాజంలో నడిచే ఉద్యమాలకూ సాహిత్యానికీగల సంబంధం, మనిషి చేతనలో తెలిసిన భాగానికీ (Conscious) తెలియని భాగానికీ (Unconscious) ఉన్నటువంటి సంబంధమే ఈ రెండింటిమధ్యా యిచ్చి పుచ్చుకోవడమూ, సామరస్యమూ ఉన్నప్పుడే స్వస్థత ఒకటి రెండవదానిమీద దాడి చేసినా, ఒక దానికీ రెండవ దానికీ మధ్య ప్రతిష్టంభన ఏర్పడినా అది అస్వస్థత లక్షణం.

# రైలు గ్రహణం

## శ్రీ వాకాటి పాండురంగారావు

సుందరరావుకు బలే ఉషారుగా వుంది.

అసలు అంతకుముందు రాత్రి నిద్ర పడితేనా? గంటకోసారి లేచి క్రామని రైలు గోపాల్ స్టేషన్‌కు వచ్చివుంటుంది. . బ్యారియర్ దాటి వుంటుంది. . . . బోనా దగ్గరికి వస్తుంటుంది. . . . . అంటూ అంచనాలు వేస్తూ పడుకున్నాడు.

ఎలాగయితే నేమి, తెల్లవారింది.

అయిదింటికే లేచి కాలకృత్యాలు తీర్చుకున్నాడు సుందరరావు ఎన్నడూ అంత తెల్లవారు జామున లేచినవాడు కానందువలన కొంత, ఆపూట నీరద వస్తున్నందువలన మరింత, అతగాడికి యావత్ చరాచర ప్రపంచమూ వినూత్నంగా, శోభాయమానంగా కనిపిస్తూంది. పనిమనిషి ఆరింటికి వచ్చింది. ఆ పూట నాలుగ్గిన్నెలూ తోమిపెట్టింది. వెళ్తూ వెళ్తూ అడిగింది: 'అమ్మగారు ఇవాళొస్తారు కదండీ—'

'అవునవును. . . . ఇవాళ పదింటికి రావాలి . . . ఆ వెధవ బండి సరిగా వచ్చి ఏడిస్తేను . . చూశావు మంగమ్మా! మనదేశంలో రైలుబళ్ళున్నాయే, అవి జపానులో ఎద్దుబండ్లకన్న స్లో అన్నమాట... ఒక్కోసారి ఇవాళ రావాల్సిన రైలుబళ్ళు రేపు కూడ వస్తుంటాయి ..ఇవి అసలు రైలు బళ్ళు కావు శాపగ్రస్తలయిన నత్తగుల్లలన్నమాట—' అంటూ గడగడ ఆవేశంతో మాట్లాడేస్తున్నాడు. ముక్తసరిగా ఏదో ఒక మాట చెప్పేస్తే ఎక్కువగా మాట్లాడని బాబుగారిట్లా నిముషాల తరబడి మాట్లాడడం—మంగమ్మకు వింతగా వుంది.

రైలుబళ్ళు, రైట్ సోదరులు, జంబోజెట్లు, వ్యోమనౌకలు ఇత్యాది విషయాలమీద అనర్గళంగా మరో నాలుగు నిముషాలపాటు మాట్లాడిన తర్వాత తన ఎదుట నిల్చుని వింటున్నది—అక్షరం ముక్కరాని అంట్లుతోమే మనిషి అని తెలుసుకుని అవుటర్ సిగ్నల్ దగ్గర ఎర్రదీపం చూచిన రైలుబండిలా టక్కున ఆగిపోయాడు సుందరరావు.

'అయితే, నేను మధ్యాహ్నం వస్తాను లెండి—'అంది మంగమ్మ.

'సరే, రా' అన్నాడు సుందరరావు.

ఆవేళ సోమవారం. మామూలుగానయితే, నీరద పుట్టింటికి వెళ్ళిన ఈ రెండు నెలలపాటు, మంగమ్మ, ఒక్క ఆదివారం మినహాయిస్తే పొద్దున పూట మాత్రమే వచ్చి వెళ్తుండేది. ఇవాళ ఇంటిల్లాలు వస్తూందిగనుక మంగమ్మ షిఫ్ట్ మారుతుందన్నమాట.

మంగమ్మ అలా వెళ్ళగానే కాఫీ తయారు చేశాడు. సదరు దివ్యపానీయాన్ని సేవిస్తుండగా పేపరు కుర్రవాడు 'డెయిలీ న్యూస్' పడేసి వెళ్ళాడు.

యథాలాపంగా ఎడంచేత్తో దాన్నితీసి—'79మంది మరణం ' అన్న శీర్షిక చూచిన సుందరరావు తన కుడిచేతిలోని వేడి వేడి కాఫీని నోట్లో పోసుకుని తెనాలి రామలింగడి పిల్లిలా కుయ్యోమన్నాడు. అంటూనే దృష్టిని మరల్చకుండా దినపత్రిక నవలోకించాడు. 'పశ్చిమ జర్మనీలో గెట్స్‌విల్ విమానాశ్రయంవద్ద అప్తన్ విమాన పతనం' అన్న ఉప శీర్షిక చూచి సుందరరావు మనసు కుదుటపడింది; ఆ వెనువెంటనే అతడికి ఆ దినపత్రికమీద కోపం వచ్చింది.

వెధవన్నర వెధవ శీర్షికా, వీడూను—ఎవడీ సబ్‌ఎడిటరు? ఇట్లా గుండె ఆగిపోయేలా ''79 మంది మరణం' అన్న దానిని పై పంక్తిలో వీడి బుర్ర కాయలంతేసి అక్షరాలలో వేసి, అసలు వివరాలను ఆ క్రింద పంక్తిలో వీడి బుర్ర లోని సరుకంత చిన్నక్షరాలలో వేస్తాడేమి? వీడేటి జర్నలిస్టండీ—హా! భరతదేశమా! ఆఖరికి పత్రికలు కూడా అసమర్థుల చేతిలోకి వచ్చివేశాయి కదా—అని మొదట కోపించి తదుపరి శాంతించినవాడై ఆ పత్రికారాజంపు మొదటి పుటలోని ఇతర శీర్షికలను పరికించాడు.

'దొమ్మగూడెంలో నక్సలైటు సంఘర్షణ—నలుగురి మరణం'
'కాశీ విశ్వవిద్యాలయంలో లెక్చరర్‌కు కత్తిపోటు'
'భోపాల్‌దగ్గర పెళ్ళి బృందం దోపిడి'
'ఢాకాలో తుపాకులకు ఎనిమిదిమంది ఎర'
'ఆగ్రాలో మహిళా అడ్వకేటు మానభంగం'
'వియత్నాంలో 256 అమెరికన్ల బలి'
—అబ్బబ్బబ్బా!

హాయిగా తెల వారింది ఆకాశం నిర్మలంగా నీలంగా వుంది సూర్యుడి లేలేత కిరణాలు అందంగా వెలుగుతున్నాయి పక్షులు కలకల మంటున్నాయి. వీధిలో పిల్లలు కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నారు పక్కింటావిడతో ఆమె మొగుడు సరసాలాడుతున్నాడు 'కనుల విందుగ నేడు—'అని కమ్మగా పాడుతూంది రేడియో.

ఇంత హాయిని, ఇంత సుఖాన్ని, ఇంత ఆనందాన్ని మంటగలిపి నాశనం చేసి శోకసముద్రంవంటి మనసున నిప్పులవాన కురిపించడానికి తయారవుతూంది దినపత్రిక—అని విసుక్కున్నాడు సుందరరావు.

అసలు కొన్నాళ్ళు దినపత్రికలను ఆపివేస్తే ఈ యుద్ధాలు అవీ ఆగిపోయి, ఈ భూమిమీద శాంతి నెలకొంటుందేమో......ఎవరన్నా ఉ థాంట్ కీ మాట చెబితే బాగుండును.....లేకపోతే కనీసం దినపత్రికలేవీ పొద్దుటిపూట అచ్చయి బజారులోకి రాకూడదనీ, ఏ మధ్యాహ్నమో, సాయంకాలమో మాత్రమే రావాలనీ శాసనం చేయించాలి—అదీ వీలుకాకపోతే ఈ హత్యలు, శవాలు, మంటలు, మానభంగాలు వీటన్నిటిని ఏమధ్య పేజీలోనో అఘోరిస్తే బాగుండును—అని దినపత్రికలను గురించి కాస్త సవివరంగానే అనుకున్నాడు సుందరరావు.

ప్రక్కింటి వాళ్ళమ్మాయి బడి బస్సు హారన్ మోగింది వీధిలో ఎనిమిది అవుతూందని తెలిసి ఉలిక్కిపడ్డాడు సుందరరావు.

ఇక వెధవ పత్రిక చదివి ఉల్లాసమూ, ఉత్సాహమూ పాడు చేసుకోదలచుకోలేదు. ఆ పత్రిక నలా విసిరివేశాడు ఈలవేసుకుంటూ, మధ్య మధ్య ఆపుతూ షేవింగ్ చేసుకున్నాడు. వేన్నీళ్ళతో స్నానం చేశాడు. సబ్బు ఓమారు ఎక్కువగానే రుద్దుకున్నాడు. తీరా స్నానం అయ్యాక చూస్తే ముందుగానే తువ్వాలు తెచ్చిపెట్టుకోలేదని తెలిసింది. ఇస్త్రీ పంచెలో ఒళ్ళు తుడుచుకున్నాడు రేపటి నుండి నీరద అన్నీ జాగ్రత్తగానే ముందరే అమర్చుతుంది. ఇట్లాటి మతిమరుపు పనులేవీ చేయకుండా వెయ్యికళ్ళతో, చిరునవ్వుల జల్లులతో తన్ను చూచుకుంటుంది—అనుకున్న సుందరరావు గుండెలో వెన్నెల వెలిగింది.

స్నానం అయ్యాక బట్టల అధ్యాయం దగ్గర మళ్ళీ నీరదే తయారయింది. ఆమె కిష్టమయిన చాకలేటు రంగు టెరిలీన్ ప్యాంటూ, ఆకాశనీలపు రంగు స్లాక్ తొడుక్కున్నాడు

ఫ్లాస్కులోకి కాఫీ పోశాడు మరి అలిసిపోయిన నీరద టాక్సీ దిగగానే—ఇవ్వాలి కదా హోటల్‌వాడితో 'కేరియర్' పంపించమని చెప్పాడు ఆ కేరియర్‌ని ప్రక్కింటావిడ తీసి వుంచుతానంది పెరుగు సరే, రాత్రే తోడు పెట్టాడు. ఇల్లూ, ఇల్లూ నీరదకు స్వాగతం చెప్పడానికి సిద్ధంగా ఉన్నాయి

ఎనిమిదిన్నరయింది సుందరరావు వీధి తలుపుకు తాళంపెట్టి బయలుదేరాడు పాట పాడుకుంటూ వెళ్ళి బస్‌స్టాండ్‌లో నిల్చున్నాడు అట్లా వెళ్ళి నిల్చున్న ఇరవైతొమ్మిది నిముషాలకుగాని బస్సు రాలేదు. ఆ ఇరవైతొమ్మిది నిముషాలలో సుందరరావు మౌనంగా చేసిన విమర్శలను వినివుంటే ఆ బస్సు రవాణా సంస్థ వారందరూ మూక ఉమ్మడిగా ఆత్మహత్య చేసుకుని వుండేవారు సరిగా ఆ ఇరవైతొమ్మిది నిముషాలలో ఆ వట్నపు పెద్ద రోడ్డుమీద ఒక్క టాక్సీగాని, ఆటోరిక్షా కాని రాకపోవడ చూచిన సుందరరావు మనసున ఒక్క క్షణం—'చూచావా, నా సంకల్పం ఎంత బలహీనమైనదో!' అన్న వేదాంతభావం మొలకెత్తింది ఆ మొలక పూరాకు తొడక్కముందే ఎదహారో నెంబరు బస్సు వచ్చి ఆగింది

ఎక్కేక్క సిలబడన సుందరరావు వాచీ చూచుకున్నాడు తొమ్మిదీ ఇరవై అయింది ఇంకొక పావుగంటలో తాను స్టేషను చేరుతాడు అప్పటికిక రైలుబండి రావడానికి ఇరవై నిముషాలుంటాయి

బస్సు దిగాడు స్టేషనులోకి అడుగుపెట్టి ప్లాట్‌ఫారం టిక్కట్టు కొనుక్కున్నాడు స్టేషను హాల్‌లోని గడియారం తొమ్మిదీ ఇరవైరెండు చూపిస్తోంది లోపలికి వెళ్ళాడు

ఎంక్వైరీ టికి దగ్గర జనం విపరీతంగా గుమిగూడి వున్నారు. నేకలూ గుసగుసలూ, అరుపులూ ఆశ్చర్యార్థకాలూ—గందరగోళంగా వుంది పరిస్థితి గుంపులోకి దూరిబడి కంచువంటి కంఠంతో అడిగాడు నీరదాపతి—'19 డవున్ ఎప్పుడు వస్తోంది, ఏ ప్లాట్‌ఫారమ్మీద వస్తోందీ?'

గుమాస్తా చెప్పాడు— '19 డవున్ ఎప్పు డొస్తున్నదీ తెలియదు ఆరు మైళ్ళ స్టేషను వదిలాక ఆ బండియొక్క ఆచూకీ ఏమీ తెలియలేదు'

సుందరరావు చెవులు నమ్మముగాక నమ్మము—అని సమ్మె చేశాయి—జెకాస్లొవాక్ పౌరులవలె 'నిజంగా నిజంగానే?'

'ఎక్స్‌ప్రెస్ ప్రమాదానికి గురి అయినట్లేమీ వార్తలు లేవు కనుక ఏమి జరిగిందీ కనుక్కోవడానికి ఇటునుంచీ అటునుంచీ కూడా ప్రత్యేకపు అన్వేషణ బృందాలు బయలుదేరి వెళ్ళాయి. వారినుండి ఇంకా ఏ సమాచారమూ రాలేదు.

'ఇంతకీ ఏమయ్యుంటుందంటారు?' అంత కలకలంలోను ఒక భారత పౌరుడికంఠం వినిపించింది.

'బండి మొగ్రాను విడిచింది. కాని ఇక్కడికి రాలేదు దారి మధ్యలో తంతి సౌకర్యాలు విచ్ఛిన్నమయి ఉన్నాయి' అన్నాడు గుమాస్తా—

'అక్కడ బయలుదేరి ఇక్కడకు రాలేదు కాని ప్రమాదానికి గురికాలేదు, అంటే—'

'రైలు కనపడకుండా పోయిం దన్నమాట!'

'ఏ—మి—టీ— రై—లు—బం—డి— క—న—ప—డ—లే—దా—' ఒక్కొక్క అక్షరమూ ప్రాగ్‌లో రష్యన్ టాంకుల్లా దొర్లి వచ్చింది.

సుందరరావు మూర్ఛ పోయాడు.

*　　　　*　　　　*

'డెయిలీ బ్లైజ్' విలేకరి గుర్నామ్‌సింగ్ స్టేషన్‌నుండి హడావిడిగా ఫోన్‌చేశాడు సంపాదకుడు వ్యాసమూర్తికి.

వ్యాసమూర్తికి గుర్నామ్‌సింగ్ అంటేనే మంట అంతకుముందు సర్దార్జీల గురించి ఎన్నో జోకులు విన్నాడుగాని వ్యాసమూర్తి—అట్లాంటి వోకు ఒకటి ఆరడుగుల ఎత్తుది, గుబురైన గడ్డంకలది, రెండు కాళ్ళతో ఎం పి సిఫార్సుతో నడిచివచ్చి తన పత్రికలో తన అభీష్టానికి వ్యతిరేకంగా ఉద్యోగంలో చేరుతుందని అనుకోలేదు పోతే ఆ గుర్నాముసింగ్‌లో పత్రికా రచయిత లక్షణాలు ఒకటికాదుకద దానిలో నూరవ వంతయినాలేదు వెళ్ళి ఒకరిని ఇంటర్‌వ్యూ చేసి రావయ్యా అంటే అడగరాని ప్రశ్న లడిగి చివాటు తిని వచ్చాడు వివాహాశ్రయానికి రిపోర్టింగ్ కని వెళ్ళి పోలీసుల రిమాండ్‌లోకి వచ్చాడు ఇహ 'సబ్బింగ్' సరే బొత్తిగా తెలియకపోయె మూడు రోజులనాటి పుచ్చిపోయిన వార్తనో చచ్చు హెడ్డింగ్‌తో మొదటి పేజీమీద వెలిగిస్తాడు లేదా ఏదయినా మంచివార్త నిస్తే, దానిలో ఆయువుపట్టువంటిదానిని నిర్దాక్షిణ్యంగా 'ఎడిట్' చేసి అవతల పారవేస్తాడు.

నిన్నసగానిన్న రోజురోజంతా ఊరు ఊరంతా తిరిగి ఒక్క సెంటిమెటర్ వార్త కూడా సేకరించలేకపోయాడు పైపెచ్చు లీరిగ్గా బల్ల దగ్గర కూర్చుని 'నగరంలో ట్రాములైన్ల పొడవు' అంటూ రెండు కాలమ్స్ మేటర్ సిద్ధం చేశాడు బృహస్పతి ఇట్లాంటివాడితో దినపత్రిక నడపడంకన్న అడిగిన జీతంబియ్యని మిడిమేలపు దొరను గొల్చుట ఎంతో మేలు—నా బ్లడ్‌ప్రెషర్ మరీ ఎక్కువగా అయిపోకముందే వీడు నన్ను విడిచిపోవాలి—లేదా నేను వీడిని విడిచిపోవాలి— అంతేకాని ఈ దినపత్రిక—అనే ఒరలో ఈ కత్తీ, మంగలి కత్తీ ఇమడవు ఇమడజాలవు, ఇమడబోవు—అన్న నిశ్చయానికి వచ్చివున్నాడు దూర్వాసుడైన వ్యాసమూర్తి.

అట్లాంటివాడిని అందులోనూ ఆ తెల్లవారుజామున రెండుగంటలదాక ప్రెస్‌లోవుండి, సుప్రసిద్ధ నర్తకి మైనాదేవి గురించిన ఫీచర్‌తో నాగపూర్ మేయర్ ఫోటో అచ్చులోకి వెళ్ళడాన్ని, ఆఖరిక్షణాన చూచి, కట్టిన ప్రేమను విప్పించి మేయర్ బాక్సానే మైనాదేవి బ్లాక్‌ను వొప్పించి, అన్నీ ఒకసారి మళ్ళీ సరిజూచి చచ్చి సున్నమై కొంపజేరి మంచానికి అడ్డంగా పడి నిద్రపోతున్నవాడిని—తొమ్మిదిన్నర గంటలవేళ ఫోనుమీద లేపి కూచోబెట్టి—గుర్నాక్ సింగ్ తన పత్రికా రచనా జీవితంలో కెల్లా గొప్పదయిన స్కూప్ సంపాదించానన్న విజయగర్వంతో

'మేష్టారూ! బ్రహ్మాండమైన వార్త—'బడ్డింగ్ జర్నలిస్టుల' పాలిటి వరప్రసాదంలాటి వార్త—మన 'మార్నింగ్ ఎడిషన్'లోకి వెళ్ళవలసినవార్త—పోతే పోన్లెండి, దీనినీ రెండు ప్రకటనలనూ కలిపి ఓ సప్లిమెంటు వేయవచ్చునేమో చూడండి—'

'ఏమిటయ్యా నీ వాగుడు—తెల్లగుర్రంమీద రిపోర్టింగ్‌కి వెళ్ళొద్దు మొర్రో అంటే వినకూడదూ?' అని విసుక్కున్నాడు వ్యాసమూర్తి

'కాదండీ స్వామీ! హాట్—హాటర్—హాటెస్ట్ వార్త—మన 19 డవున్ ఎక్స్‌ప్రెస్ ఉంది చూశారూ— అది ఇవాళ కనబడలేదండీ బాబూ—ఏకంగా ఒక రైలుబండి బండే కనబడుటలేదు ఇహ చెప్పండి—మీ యాభైఏళ్ళ పత్రికా జీవితంలో ఇట్లాంటి వార్త నెప్పుడయినా విన్నారా?'

'ఏమిటీ—రైలుబండి క—న—బ—డ—లే—దా— ఇదుగో గుర్నామ్‌సింగూ! ది పీస్ ది లిమిట్ ఇంక ఒక్కక్షణం కూడా నే భరించలేను ఆ తర్వాత నా ఉద్యోగం పోతే ఫీడాపోయెగాని ఈ క్షణంనుండి నువ్వు మాజీ విలేకరివి. తెలిసిందా? యు అర్ డిస్‌మిస్‌డ్!' అని ఫోన్ పెట్టేసి పడక మీదకు వాలిపోయాడు వ్యాసమూర్తి.

*　　　　*　　　　*

మైనాదేవి ఆ బండిలో రావాలి.

సాయంకాలం ఆమె నృత్య ప్రదర్శన వుంది.

ఆ నృత్య ప్రదర్శన నేర్పాటు చేసిన 'రసమంజరి'వారు ఆ ప్రదర్శనకు ఒక వెల రోజులనుండి మాంచి 'పబ్లిసిటీ' ఇచ్చారు. లయిదారువేల రూపాయల

దాక వసూ లయింది. నగరంలోని రసికలోక మంతా ఆ కార్యక్రమంకోసం తహతహ లాడిపోతున్నారు. అవ్వాళ పొద్దున 'డెయిలీ న్యూస్'లో మైనాదేవిమీద వ్యాసం చదివి, ఫోటో చూచి వారి తహతహ తహతహాన్నర తహతహాన్నరయింది.

కాని ఆమె రావలసిన రైలుబండి కనబడలే దుట! ఇ దెక్కడి చోద్యం! రసమంజరి కార్యదర్శి మురళీధర్‌కు మతిపోయింది. ఆ వార్త నతడు మొదట, మిగతా అందరూ మామూలు మనుష్యుల్లాగే నమ్మలేదు. తీరా స్టేషన్‌కు వెళ్ళి అడిగితే అక్కడ స్వయంగా రైల్వే ఉద్యోగి—'అయ్యా ఫలానా రైలుబండి ఏమయిందో ఎవరికీ తెలియదు—' అని అక్షరాలా చెబుతుంటే నమ్మకుండా ఎట్లా ఉండడం—దాని దుంప తెగ, ఇది స్వతంత్ర భారతదేశమే నయ్యా ఇది నానా రకాల వింతలకు పుట్టినిల్లయ్యా—అయినా అలనాడు జార్జి స్టీవెన్‌సన్ కనిపెట్టినప్పటినుండి నేటిదాక రైలు బండి అన్నది ఆ పట్టాలమీద నడవాలిసిందే గదా—తిన్నగా నడిచి స్టేషనుకు వచ్చి ఆగవాలి, లేదా పట్టాలు విడచి నేలమీద కూలాలి. కాని అట్లాంటి వార్త ఏమీ లేదుట. ఇంజను, పదిహేనో, పదహారో పెట్టెలు, ఓ వెయ్యిమందిదాక జనం, వారి సామాన్లతో—ఇత్యాదులు గల ఒక రైలుబండి హఠాత్తుగా కన బడకపోవడం ఏమిటి? దాని నెవరూ ఎత్తుకుపోరు కద! ఏమో, వచ్చే యుగాంత కాలం! ఏమి జరిగినా విడ్డూరం కాదు.

అయినా వెధవ రైలుబండి ఏమయితే ఎవరి కేమి? సాయంకాలానికి మైనాదేవి రాకపోయినా, అవమానం అట్లా వుంచి, ఆ ప్రేక్షకుల చేతిలో నడి బజారుకడం కష్టం—కళాసేవతోబాటు కడుపుసేవ కూడా చేసుకుంటూ బ్రతుకు తున్నవారి పొట్ట నిలా కొట్టడం ఆ 19 డవున్‌కు తగునా?

—అంటూ జుత్తు పీక్కోసాగాడు ఒత్తైన జుత్తుగల మురళీధర్.

*    *    *

పీక్కుందామన్నా ఒక్కగా నొక్క కేశరాజంబు కూడా లేని డాక్టర్ ద్విగుణ కపూర్—కుతకుత ఉడికిపోతున్నారు.

పదకొండయింది. పదకొండున్నరయింది.

హాల్లో పన్నెండు వందలమంది విద్యార్థులు కూర్చుని వున్నారు పరీక్షలకు సిద్ధంగా. కాని ప్రశ్న పత్రాలు వస్తేనా?

ప్రిన్సిపాల్ కపూర్‌గారు ప్రళయకాల రుద్రు డయిపోతున్నాడు.

ఎన్ని ఎక్స్‌ప్రెస్ ఉత్తరాలు, ఎన్ని తంతులు, ఎన్ని ట్రంకుకాల్స్ వృథా చేశాడు తాను! అయినా ఆ యూనివర్శిటీలోని శుంఠలకు బుద్ధి వుంటేనా—తీరా చివరిదాకా పంపించకుండా ఆలస్యంచేసి ఈపేత బండిలో పంపామని, తీసుకోమని టెలిగ్రాము కొట్టారు. ఆ వెధవబండి పదిగంటలకు వచ్చి ఏమస్తే పరీక్షలు సక్రమంగా ఆరంభమై వుండును. కాని అసలు బండే రాలేదుట. కొంపదీసి ఈ విద్యార్థులే ఆ ప్రశ్న పత్రాలు వస్తున్నా యని తెలుసుకుని ఆ బండి కెక్కడో డైనమైటు పెట్టలేదు కద—కాని ప్రమాదం ఏదీ జరగలేదని చెబుతున్నారుగా.....అనుకుంటున్న కపూర్‌గారికి బ్రహ్మాండం బద్దలయినంత చప్పుడు వినిపించింది.

ఇహ నేముంది?

—విద్యార్థులందరూ ఏకమై, ప్రచండమైన కోపావేశాలతో కుర్చీ లను తన్నుతూ, మేజాలను బద్దలు గొడుతూ, నినాదాలుచేస్తూ, హాలు విడిచి బయలుదేరారు.

'విద్యార్థుల కీ అవమానం సహించరానిది.'

'ప్రశ్న పత్రాలకోసం పరీక్షల నాపరాదు.'

'పాసవడానికి పరీక్ష లెందుకు?'

అన్న అద్భుతమైన నినాదాలతో భూనభోంతరాళం దద్దరిల్లేటట్లు' అరుస్తూ వీధిలోకి వచ్చారు. కపూర్‌గారు వాళ్ళ ఎదుట పోవడానికి కూడా వెనుకాడారు. సాక్షాత్తు పరమశివుడే వచ్చినా వాళ్ళ నాపశక్యంకాదు.

దుకాణాలవాళ్ళు గబగబ తలుపులు మూసుకుంటున్నారు. శత్రుదేశం వారి విమానాలు బాంబులు కురిపించడానికి వస్తున్నట్లుగా జనం పరుగెత్తి తలలు దాచుకుంటున్నారు.

—అసలే ఆ ఊళ్ళోని ఎం. ఎల్. ఏ. లకు కాపలా ఏర్పాటు చేయడంతో సతమతమవుతున్న పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ వల్లభంది కీ విద్యార్థుల గొడవ సరిక్రొత్త శిరోవేదనగా పరిణమించింది.

*    *    *

'ఏడీ మన వెంకయ్య?'

'ఇంకా రా డేమీ మన దేవుడు?'

'పన్నెండింటికి వుంది అవిశ్వాస తీర్మానం—ఈరోజా మాటా.'

'అయినా విమానంలో రాకూడ దుటండీ—'

'అయ్యా! పోనీ, రైలే ఎక్కా డనుకుందాము......దారిలో రైలుకి ఏద యినా అయితే అక్కడినుండి కారులో రావాలగా? అతడు వేళకు రాలేకపోతే మనందరి కొంపలు మునిగిపోతాయి అని తెలుసు కదా—'

'అయినా నీ పిచ్చిగాని రైలు కేదయినా అయితే వెంకయ్యకూ—'

'ఛీ! ఛీ! అమంగళపు మాటలు అనకండి. మన ప్రగతి పార్టీ కిది పరీక్షాకాలం. మొన్నటి ఎన్నికలనుండీ మనం క్షణం ఒక యుగంగా ప్రభు త్వాన్ని నడిపిస్తున్నాము. కనుక అశుభం పలక్కండి—'అని వారించారు పార్టీ నాయకుడూ, ముఖ్యమంత్రీ అయిన నారాయణ ప్రభు.

అసలు కథేమి టంటే ఆ రాష్ట్రంలో ప్రగతి పార్టీ వారు (గన్నెలం వారి ఎన్నికల గుర్తు) రాజ్యం ఏలుతున్నారు. అసెంబ్లీలో వున్న మొత్తం అరవై మూడు స్థానాలలో ప్రగతిపార్టీ ఎన్నికలలో ముప్పైయొక్క స్థానాలు గెలిచి ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఆరు నెలలయినా అయిందో లేదో ఎదటి పురోగ మనం పార్టీ వాళ్ళున్నారే ('గాలికోడికే మీ ఓటు') దొంగముండా కొడుకులు— ఎంతసేపూ తా మొకళ్ళే దోచుకు తినాలని, వారి స్వార్థం. తమలాగే మరి నాలుగు పార్టీలున్నాయి కదా, అవి కూడా ఇంత తిని బతకాలి కదా అన్న ధర్మచింతనే లేని అయోగ్యులు. వాళ్ళ కాస్త నెరపి మూడు లక్షలకు పేపనాడి అయిదు గురిని తన్నుకుపోయారు. అప్పుడిహ ప్రగతి పార్టీలో ముప్పైనుంది మాత్రమే సభ్యులు మిగిలారు. నారాయణప్రభు ఏమి తక్కువ తిన్నవారా, తమ మంత్రి వర్గాన్ని పన్నెండునుండి పదహారుకు పెంచారు. పదిహేనవ, పదహారవ స్థానాల నిమిత్తం పురోగమనంగాళ్ళు ఇద్దరు ఇటు వచ్చి పడ్డారు. దాంతో ప్రభుత్వపక్షం మళ్ళీ ముప్పైరెండుకు పెరిగింది. అయినా ఒకే ఒక సీటు మెజారిటీ వుండడం ఎప్పటికయినా ప్రమాదమే. దానికితోడు పురోగమనంగాళ్ళు మళ్ళీ బేరం పెడుతున్నారని తెలిసింది. వాళ్ళకేమి ఆయుదేళ్ళు అధికారంలో వుండి బాగా గడించారు. కనుక హోల్ మొత్తంగా టోకు వ్యాపారం చేయగల స్తోమత వుంది. తాము గద్దె నెక్కి నాలుగు నెలలయినా నిండలేదు. అంచేత ఎంతసేపటికీ బస్సు రూట్లు, చక్కెరకోటా, మంత్రిపదవి—లాటరీ టిక్కెట్లు పట్టుమని ఓ లక్ష పలుకు దామంటే తమ పార్టీకి స్తోమతే లేదాయె.

సరిగ్గా ఈ అదను చూచుకుని ఎదటివాళ్ళు అవిశ్వాస తీర్మానం ఒకటి ఏడిచారు. అసెంబ్లీలో మధ్యాహ్నం పన్నెండింటికి మొదలవుతుంది రభస. ఇవాళ సోమవారం ఈ తద్దినం వుంది అనగా నారాయణ ప్రభుగారు తమ తాలూకు తలకాయలు ముప్పై ఒక్కటింటినీ శుక్రవారంనాడే ప్రజా స్వామ్య భవన్'లో భద్రపరిచి—వారందరికీ ఆ భవనంలోనే నిద్రా, భోజన శయ్యాది వసతుల నేర్పరచి, ఒక వైద్యుడినీ నియమించి, సదరు భవనానికి తలుపులు మూయించి, పన్నెండు లీవర్ల తాళంకప్పలు నాలుగు వేయించి, దాని చుట్టూరా యూనిఫారంలోను, మఫ్టీలోనువున్న రక్షకదళంచేత పహారా కాయి స్తున్నారు. ఏమో ఎవ రెరుగుదురు. ఆ పురోగమనం పార్టీ నాయకు డున్నాడే వాడికి విమానమూ అవీ కూడా వున్నాయి. మన దద్దమ్మలు, అలా చుట్ట తాగుతూ డాబామీద నిల్చునుండగా ఏ హెలికాప్టర్‌మీదనో వచ్చి అటునించి అటే

ఓ ఇద్దరిని ఎత్తుకుపోయినా పోవచ్చును అందుకని డాబామీద విహారం సుత రామూ సిషిద్ధం అని 'విప్' జారీ చేయించారు నారాయణప్రభు. ఇంతశ్రమ ఇంతవ్యయం, ఇంత ప్రయాస, ఇంత ఖర్చు—అంతా ఆ ఒక్క వెంకయ్య వల్ల బూడిదలో పోసిన పన్నీరవుతగాంది కదా ఎప్పుడో గాంధీతో కలిసి జైల్లో ఉన్నాడట—గ్రిబాగుల వెంకయ్య—ఇంకా ఈ 1969 లో న్యాయమూ నిజా యితీ అని పిచ్చి పిచ్చిగా వాగుతుంటాడు వద్దు మొర్రో అంటుంటే విని పించుకోకుండా తన నియోజకవర్గంలో ఏవో వరదలు వచ్చాయట, జనాన్ని పరామర్శించి వస్తానని బుధవారంనాడు బయలుదేరి వెళ్ళాడు ఇక్కడ ఈ దౌర్భాగ్య దామోదరం సరిగ్గా శుక్రవారంనాడు పీకలమీదికి తెచ్చారు తీర్మా నాన్ని సోమవారంనాడు 'అవి'యా 'తుమీ యా' తేల్చాలని పట్టుబట్టారు.

ఆ వెంకయ్య మహానుభావుడికోసం అంతులు పంపారు. టెలిఫోను చేశారు సోమవారం పొద్దుటికి వస్తున్నానని చెప్పాడు వెంకయ్య కాని ఈ లోగా ఈ రైలు ప్రమాదం వచ్చిపడింది

అయినా, ఆ పుణ్యసమయానికి ఈ వెంకయ్య వస్తున్నాడని తెలిసి విసంగా రైలు రైలునే ఎత్తుకుపోలేదు కద

ఆ ఆలోచన వచ్చేసరికి నారాయణప్రభు నిలువెల్లా దహించుకుపోసాగం భించింది

ఈలోపుగా ఎ టి పి సర్కారుంటిపుండి ఫోను వచ్చింది. 'విద్యార్థులు సమ్మె చేస్తున్నారు ప్రొత్తఉజారు దగ్గర కాల్పులు జరిగాయి' అంటూ వివరాలు చెప్పసాగాడు

*　　　　*　　　　*

అసలింతకూ ఏయిం దేమిటంటే—

—ఆదివారం ముగిసి సోమవారం పుట్టిన నాలుగ్గంటలకు అంటే సోమవారం తెల్లవారుజామున 19 డౌన్ ఎక్స్‌ప్రెస్ పది నిముషాలు ఆలస్యంగా వాల్తేరు జంక్షన్ చేరింది అక్కడ ఏది నిముషాలు ఆగాలి ఇక వాల్తేరు వదిలితే ఎక్కడా ఆగకుండా ఏకుగంటయు ప్రయాణంచేసి పెద్దపట్నానికి చేరు కోవాలి

ఆ బండిలో—ఒకానొక పెట్టెలో ప్రయాణం చేస్తున్న ఎమ్మెల్యే వెంకయ్యగారే కాకుండా, అంతకన్న ఘనాతిఘనమైన వి ఇ పి ఒకాయన పయనం చేస్తున్నారు ఆయనే ఢిల్లీ మంత్రిగారయిన ఆర్ దురంధర్‌గారు. శ్రీ దురంధర్‌జీ ఒక ప్రత్యేకపు 'సెలూన్'లో ప్రయాణం చేస్తున్నారు అసలు సిసలు గాంధీవాది అయిన ఆయన హృదయం ఈ భారతదేశపు జన సామా న్యపు కష్టాలను చూస్తే కరిగి నీరులుగా గడ్డకట్టి నోట్లోకి వస్తుంది అంచేతే అంతటి సున్నిత హృదయం కలిగిన ఆయన—మూడవ తరగతి ప్రయాణికుల బాదలను చూడలేనివారయి కిటికీలకు వెల్వెటు తెరలున్నదీ, క్రింద తివాసీలు పరచినదీ, వంట గదితోసహా అన్ని సౌకర్యాలు కలదీ అయిన ప్రత్యేకపు రైలు పెట్టెలో ప్రయాణం చేస్తున్నారు

'అయ్యా! ఇదేమిటి ఈ ఘోరం—మీరు ఆ పీడిత ప్రజల ప్రతినిధులు కదా—' అని అడిగితే ఆ యోగి పుంగవు డనును గదా—'మీరు రుత్త వెర్రివా రండీ . ఈ పెట్టె, ఈ పరుపులు, ఈ తెరలు ఇవన్నీ నా కోసం అను కున్నారా—ఎంత అపచారం! గాంధీవాదిని నా కెందుకండీ ఇవన్నీ ? ఇవి మన దేశపు గౌరవాన్ని కాపాడడానికి ఉన్నాయి. ఇవి మన ప్రభుత్వ ప్రతిష్ఠను నిల బెట్టడానికి వున్నాయి, అంతే . . ఏ విదేశపు నాయకుడో, రాజో వచ్చి చూస్తా డనుకోండి. అతగాడి కంటికి కాస్త నదరుగా కనిపించాలి. లేకపోతే మన దేశం ఎంత అపఖ్యాతి పాలవుతుందో చూడండి... ..'

ఆ తర్వాత శ్రీవారిని—'అయ్యా! ఆ చూచే విదేశీయుడు కేవలం ఈ ఒక్క మొదటి తరగతి పెట్టెనే చూడడు కదా—ఈ పెట్టెలోబాటు ఇటూ అటూ ఫర్లాంగు పొడవున వున్న మిగతా పెట్టెలను చూస్తాడు కదా—'అని అడగ బుద్ధివేయదు మర్తి.

సదరు దురంధర్‌జీ ఆ ఎక్స్‌ప్రెస్‌బండి వాల్తేరు జంక్షన్‌లో నిలిచి వుండగా యథాలాపంగా రైల్వే టైమ్‌టేబిల్‌ను చూడసాగారు హఠాత్తుగా ఆయనకంట పిసాపురం అన్న పేరు పడింది!

పిసాపురం!! తన మధుర మధుర బాల్య జీవితంలో కొన్ని ఏళ్ళు గడిచిన పిసాపురం కళ్యాణిని కలిసిన పిసాపురం... .తాను చూచి ఇరవై యేళ్ళు దాటిన పిసాపురం. ..

ఆహా! ఈ వాల్తేరుకు ఇరవైనాలుగు మైళ్ళల్లో వుంది! కాని ఆ పిసా పురంలో 19 డవున్ పిసమయినా ఆగదంటున్నది ఆ టైమ్‌టేబిలే వెంటనే గార్డుని పిలిపించి దురంధర్‌జీ చెప్పారు—బండిని పిసాపురంలో ఆపమని.

క్షణంలో సగంసేపు నీళ్ళు నమిలాడు గార్డు.

బండిని పిసాపురంలో ఆపితే, పెద్దపట్నం వెళ్ళాక ఉద్యోగం పోవచ్చు. ఆపకపోతే ఇక్కడి కిక్కడే పోవచ్చు. మంత్రిగారని కాదని ఈ రాజ్యంలో ప్రాణ వాయువుని పీల్చుకున్న మార్కండేయు డెవ డున్నాడు గనుక అక్కడ, పెద్ద పట్నంలో తన శాఖలో పెద్దవారు ఎంత పెద్దవారయినా వారిని, దురంధర్‌జీ తలచుకుంటే వారిని చాల చిన్నవారిగా చేసేయగలరు కనుక తన పేచి కను ఇటే వేయడం మంచిది అని అరక్షణంలో బేరీజు వేసుకున్న గార్డు సాబు తక్షణం 'ఇట్లు మీ విధేయుడు'వలె తల ఆడించాడు. ఇంజన్ చోద కునికి ఆదేశం జారీ చేశాడు ఇంజన్ చోదకుడు లెస్లీ జాన్సన్ తన ఆశ్చ ర్యానికి సూచకంగా కనుబొమలు ఎగురవేశాడంతే . అత డెందరో మంత్రి మహాశయులను చూచినవాడు గనుక, వారితో నిర్ణీత కాలము, ఆగాలమునకు రైలు చేరుట, ప్రయాణికుల సౌకర్యములు—వంటి సిల్లీ విషయాలు వగైరా లేటువంటి అజ్ఞానంనుండి బయటపడినవాడు గనుక— ఏమ్మనకుండా వాల్తేరు వదలిన అరఘంటలో బండిని పిసాపురం చేర్చివేశాడు అయితే అంతకుముందు రోజే ఆపాటిక మైళ్ళ మేర టెలిఫోను, టెలిగ్రాపు రాగి తీగలను, ఎప్పుడూ ఆ పని చేసే నిపుణులు అరాస్తా పనిని చేసిపెట్టారు

అందుచేత ముందుగానే ఇంటిమేషన్ లేకపోయింది లేకపోతే స్టేషన్ మాస్టర్ సౌందరరాజన్—స్వయంగా దురంధర్‌జీ అంతటివారు వస్తుంటే ఆ సందర్భాన్ని వినియోగించుకుని, నాలుగు పూలమాలలు—చిన్న సన్మానసభ— ఒక పంచరత్న 'పొడల్‌గల్'—ఇవన్నీ ఏర్పాటు చేసేవాడే—కాని ఇన్ని లోపాలూ కప్పిపుచ్చడానికి సరిపడినంతగా దురంధర్‌జీకి సాష్టాంగపడి, పాద ధూళి నెత్తి మీద ధరించినంత పని చేశాడు.

—తా మొకసారి వూళ్ళోకి వెళ్ళి తాము తిరిగిన వీధులను, చదివిన బడిని, మునిగిన చెరువును, ఎక్కిన చెట్లను చూచి వస్తామని, అందాక రైలుబండిని అవతల పక్క లైన్‌మీద ఆపివుంచ మన్నారు. గార్డు సాబూ, లెస్లీ జాన్సనూ జీహుజూ రన్నారు.

మంత్రిగారి తనివి తీరేసరికి తొమ్మిది దాటింది ఆమాత్రం వ్యవధి దొరుకుతుంది అనుకొని సౌందరరాజన్ అది దొరికిందని తెలియగానే స్టేషన్‌ను, బుకింగ్ క్లర్క్‌కు అప్పగించి, హడావిడిగా తిరిగి, స్టేషన్ ఆవరణలోనే సకల లాంఛనాలతో చిన్నసభ ఏర్పాటు చేయించి, మంత్రిగారిని నాలుగు మాటలు చెప్పి తమ గ్రామాన్ని తరింపచేయవలసినదిగా కోరాడు

అప్పటికే తమ కాలం మించిపోయినా, అవతల తమ కెన్నో అర్జంటు పనులున్నా, ప్రజలంటే తమకున్న విశేష ఆదరాభిమానాలవలన కాదనలేక ఆ సందర్భాన్ని తీసుకుని ఓ "అయిదు నిముషాలు" ప్రసంగించారు ఆయన కాలమా నంలో అయిదు నిముషాలు అంటే మామూలు కాలమానంలో అయిదు ఇంటూ పది నిముషాలు అన్నమాట—

వెరసి, మొత్తంమీద, ఎటు కేలకు, చిట్ట చివరకు కూతవేసి 19 డవున్ రైలుబండి, పిసాపురంనుండి బయలుదేర నిశ్చయించేసరికి సదకొండయింది.

సమాచార సౌకర్యాలు పడిపోయివున్నాయి గనుక—అటునుండి ఇటు నుండి కూడా 19 డవున్ స్థితిగతులను ఖద్దన తెలుసుకుందామని బయలు

చేరిన అన్వేషణ బృందాలు క్షేమంగా వీసాపురానికి చేరుకున్నాయి ఆ బృందాల నాయకులు దురంధర్‌గారికి వందనము లాచరించి క్షమాపణలు చెప్పుకుని—అబ్బే ఏమీ లేదండీ—హిహిహి— ఈ ఎక్స్‌ప్రెస్ బండి కనబడకుండా పోయింది అని ఎవరో పిట్టనివాళ్ళు పుకారు లేవదీస్తే వాళ్ళని శాంతింపచేయడానికని ఇటు వచ్చాము సుమండి అంతేగాని తమరు ఈ బండిలో వస్తున్నారని, తమ చిన్ననాటి వూరిని చూడడానికి ఈ 19 డవున్ అవకాశం ఇచ్చిందని తెలిసే వరాకు అమిత సంతోషం కలిగింది నిజంగా తమలాటివారికీ మాత్రం సాయం చేయగల్గడం భారత రైళ్వేల భాగ్యం సుమండీ భవిష్యత్తులో తమకు ఇతోధికంగా సేవచేసే అదృష్టం కలుగజేయవలసిందిగా ఆ పరాత్పరుడిని వేడుకుంటున్నాము"—అంటూ యుగళగీతం పాడారా బృందాల నాయకులిద్దరూ

ఎవ్వరూ చూడకుండా జాన్సనును చూచి కన్నుగీటాడు గార్డ్‌సాబు.

మంత్రిగారి ప్రక్కన నిలబడి ఫోటో తీయించేసుకున్నానుకదా అని గోదావరిలా ఉప్పొంగిపోయాడు సోదరరాజన్

మొదట ఎందుకీ ఎక్స్‌ప్రెస్‌బండి ఈ నట్టడివిలో చిన్న స్టేషను దగ్గర ఆగిందో తెలియక, తెలిసిన తర్వాత ఏమీ చేయలేక, ఆకలి దప్పులతో పిల్లాజెల్లాతో యాతనపడ్డారు. వారిలో ఒకడుగా ఎక్కడో ఒక మూడవ తరగతి రైలు పెట్టెలో, దేశమూ, విలువలూ అంటూ చచ్చు కబుర్లుచెబుతూ కూర్చున్నాడు వెంకయ్య.

రైలు కదిలింది.

* *

సాయంకాలం ఆరింటికి—

మూర్ఛనుండి కోలుకున్న సుందరరావుకు నీరదను చూచి మళ్ళీ మూర్ఛ వచ్చినంత పనయింది.

గుర్నామ్‌సింగూ, వ్యాసమూర్తీ మళ్ళీ అశాంతియుత సహజీవనం గడపడానికి అంగీకరించారు.

మైనాదేవి నాట్యం కాస్త ఆలస్యంగా మొదలయినందుకు క్షమాపణ చెబుతూ వేదికమీద నిల్చున్న మురళీధర్ బట్టతల నియాన్ దీపాల నీలంపు వెలుగులో తళతళమంది

చావగా, దెబ్బలు తినగా మిగిలిన విద్యార్థులు కొంపచేరుతూండగా డాక్టర్ ద్విగుణకపూర్ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి రమణాశ్రమము చేరడానికి సన్నద్ధులవసాగారు

నగరంలోని అసాధారణ పరిస్థితుల మూలంగా ఆనాటికి అసెంబ్లీలో అవిశ్వాస తీర్మాన చర్చను వాయిదా వేయించిన నారాయణప్రభు, వెంకయ్యను "ప్రజాస్వామ్య భవన్"కు చేరవేయించి, ఆ రాత్రే 'ప్రజాస్వామ్యం గెలిచితీరుతుంది' అంటూ సుదీర్ఘమైన అభిభాషణ చేశారు

అన్ని విధాలా వెనకబడివున్న వీసాపురంయొక్క ప్రగతి నిమిత్తం నాల్గవ ప్రణాళికలో కేటాయించవలసిన నిధుల గురించి ప్లానింగ్ కమిషన్ వారికి ఒక నోట్ తయారు చేయించసాగారు ధురంధర్‌జీ.

# నృసింహ పురాణ పాఠశోధన

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

ఎఱ్ఱన నృసింహపురాణము కాళిదాసుని కుమారసంభవము వంటిది ఆయన హరివంశము అతని రఘువంశమునకు సాటి. హరివంశము రఘువంశము వలె వేరు వేరు కథల సంపుటి నృసింహపురాణము కుమారసంభవము వలె అనుస్యూతమైన ఒక కథ గల తీర్పు హరివంశమును ప్రాత పేరే నిలిపి రఘువంశములో నామసామ్యమును గూడ సాధించినాడు ఎఱ్ఱన మరి కుమారసంభవమువలె నృసింహ సంభవమని పేరుపెట్టక తన గ్రంథమునకు 'లక్ష్మీనరసింహావతారము' అని నామకరణము చేసినాడు; కారణము సంభవ శబ్దము కంటె అవతార శబ్దము భగవంతుని విషయమున ఉచితతరమని భావించె నేమో! అసలు కాళిదాసు రచన కుమారస్వామి పుట్టుకకు ముందే పార్వతీ పరమేశ్వరుల దివ్య వివాహ లీలతో తీర్మానమైనదని, తరువాతి కవిత ఇంకెవడో చేసి గ్రంథముతో కూర్చిన ఛద్మకృత్యమని భావించువారున్నారు ఒకరి మాటేమి? మల్లినాథుడే ఆ భాగమునకు వ్యాఖ్య చేయలేదు చేసియున్నను ఇప్పటి కది దొరకలేదు కనుక సంభవము అను మాటకు సంభోగము అని వైదికార్థము చెప్పి 'కుమారుని కొరకు నడిచిన సంభవము' అని వివరించువారు గలరు నా మట్టుకు ఈ వాదము యుక్తముగానే తోచుచున్నది అది యట్లుండగా ఎఱ్ఱన భక్తితో పెట్టిన 'లక్ష్మీనరసింహావతారము' అన్న పేరు గూడ తెలుగు చదువరులకు చాలా పెద్దగా తోచినది సామాన్యముగా నామకరణ సమయములలో పెట్టిన పెద్ద పేళ్ళకు పట్టిన గతియే దీనికిని పట్టి ఇది నృసింహ పురాణముగా కుంచితమై నిలిచినది మరి కాళిదాసుతో స్వరూప సామ్యమును గూడా సూచించు 'శంభుదాసు' డను ఇతని 'లక్షణాభిధేయము' తాత యెఱపోతన్న పేరుతో ఎఱ్ఱనగా ఇంటిలో మొదలై బైట చెల్లివచ్చినది. అరణ్య పర్వశేషోన్నయము చేసినప్పుడే ఇతడే తన్ను తాను 'ఎఱ్ఱనార్యుండు' అని పేరుకొన్నాడు ఇది అచ్చపు తెలుగు పేరని కొందరు నేడు తృప్తిపడవచ్చును.

సుకుమారమై ప్రేమతో నిండిన మధుర హృదయము, మితి మీరిగిన చిక్కని అర్థ భావములు, ధారాళమైనను కుదింపుగల ప్రసన్న భాష, అసాధారణమైన వినయము, అపూర్వమై కమనీయమైన కల్పన— ఇవి యెఱ్ఱన్నను కాళిదాసుతో సాటికి దించునట్టి మహాకవి ధర్మాలు కాని నన్నయ తిక్కనలు హిమాచల వింధ్యగిరులుగా నిలిచి నడుమ కౌగిలించుకొని కాపాడిన ఆరణ్య పర్వశేషము మాత్రము చెదరక నిలిచి నడిచి వచ్చినది ఐనా ఆ రెంటి యెత్తులో ఈ వామనమూర్తిని నేటికిని గమనించువారు తక్కువ. హరివంశ—నృసింహ పురాణములు రెండును చాలా అపడ్డపాలై కలుషితములైనవి రామాయణ మిప్పటికి లభింపనేలేదు—అందందు లాక్షణికు లుదాహరించిన పిడికెడు పద్యములు తప్ప

హరివంశము మొట్టమొదట "కొ అనంతాచార్యులచే పరిష్కరింపబడి, యద్దనపూడి సంజీవయ్యగారిచే చెన్నపురి స్టార్ ఆఫ్ ఇండియా ముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రకటింపబడియె" ఇది 1901 వ సంవత్సరమున. అదే సంవత్సరముననే తాము దానిని ముద్రించినట్లు వావిళ్ళవారు తెలుపుకొన్నారు. [1]కాని అది నా దృష్టికందలేదు. నా వద్ది ప్రతి యద్దనపూడివారిదే. అప్పై, ఇంకేమి సప్తతి పూర్తి శాంతి కానున్నదనగా దాని రెండవ ముద్రణము మొగముచూపినది దానిని పరిష్కరించు పని బూనినవారు సర్వతోముఖ ప్రతిభా పాండిత్య భూషితులై కీర్తిమూర్తులై యున్న వేలూరి శ్రీ శివరామశాస్త్రిగారు. వారి ప్రామాణికమైన పరిశ్రమ 36 పుటలు నిండినను సంగ్రహముగానే తోచు పీఠిక, 32 పుటల పదార్థ పట్టిక, 14 పుటల పాఠాంతరములు—ఇవి నేటి యాంధ్ర గ్రంథ పరిష్కరణ వ్యాపారములో అసాధారణములైన ఆశ్వాస స్థానములు దేహము మనస్సు రెండును అనారోగ్యముతో క్రుంగియుండగా ఈ పెద్దపని చేపట్టి, పుస్తకము బైటబడుటకు మునుపే వారు ముక్తులైరన్నది గమనించిన వారికి వారి కైంకర్యము నిలువ కొంతైనను తెలియగలదు

నృసింహ పురాణము గూడ వారి సేవచేతనే దర్శనీయమై, 1653 లో మన కబ్బినది హరివంశముకన్న ఎంతో చిన్నదైనను దీని పరిష్కరణ కార్యము దానికంటె చాల పెద్దది దీని వ్రాత తాటాకు ప్రతి ఒకటే యిప్పటికి దొరికినదని, అది గూడ చాల శిథిలమై యుండినదని, నా వినికి దానిని తొలిసారి ప్రకటించినపుడు పరిష్కరించు పని కీ శే మానవల్లి రామకృష్ణ కవిగారు కొంత చేసిరనియు విన్నాను అది వావిళ్ళవారి ప్రకటన కాబోలు. 1897 వ సంవత్సరమున 'వైజయంతి'యందు ఇంకొక ముద్రణము జరిగి యుండినదట[2] ఆ రెండును నేను చూడగల్గలేదు మూడవది శ్రీ వేలూరి వారిది 30 పుటల పీఠిక, 25 పుటల పదార్థ వివృతి, 3 పుటలంత నిఘంటువులందును అప్రకటీయమునందును కనబడు పాఠభేదములు—వీనితో నిండుదనము గల దీ కూర్పు; వావిళ్ళవారిది నాలుగవది ఈవల ఆంధ్ర సాహిత్య అకాడమీ అల్పమూల్య గ్రంథమాలలో వెలువరించినది; అసాధారణ వైదుషీ వ్యాసంగ సంపన్నులగు ఆచార్య శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు విపుల పీఠికతో సంతరించి యిచ్చినది అది 'శ్రీ శివరామశాస్త్రిగారి ప్రతినే ప్రధానముగా గ్రహించి'చేసిన పని యని వారే అన్నారు[3] ఇంతేకాదు. మూలములైన మూడు ప్రతులును 'కొంచె మించుమించుగా నొక మాదిరిగానే యున్నవి' అని శాస్త్రిగారు 'ఇచ్చిన పాఠాంతరములలో ననవసరములని తోచిన వానిని గొన్నింటిని దొలగించితిని ఈ కావ్యమున సరిగా నర్థముగాని పద్య గద్య భాగము లేడెనిమిదియున్నవి బహుతాళపత్ర ప్రతులను బరిశీలించిన పిమ్మట గాని వానిని సవరించుట కవకాశములేదు. అట్టిచోట్ల నేను ప్రశ్నార్థక చిహ్నము నుంచితిని విజ్ఞులు వానిని బరిశీలించి సరియైన పాఠములు సూచింతురని వేడుకొనుచున్నాను' అనియు వినయముతో ఈ కార్యమందలి బరువును తెలుపుకొనిరి[4] శ్రీ శాస్త్రిగారు గూడ నృసింహ పురాణమందలి పదములు కొన్నిటికి అర్థములు వ్రాయుచు 'ఈ గ్రంథమునందు చాల అపపాఠము లున్నవి. అప పఠిత పద్యము లర్థమగుటలేదు' అని విసుగుకొన్నారు[5] వారి హరివంశ పీఠికయందును 'శోధకుల కీ యెడల ఇంకను తీరని పనియున్నది. ముద్రితమగు నీ పుస్తకమునందు అనన్వితములగు పద్యములు కొన్నియున్నవి. మనస్సును తృప్తిపఱపని పాఠాంతరము లున్నవి. యతిభ్రంశము లున్నవి కవి ప్రయుక్తములా లేఖక ప్రమాదములా యని సందియము పడదగిన పదముల శోధనమున కివి జరుగఁబోవు ముద్రణమును కనిపెట్టుకొనియున్నవి. శోధన చేయఁగల పాఠకులందఱును ఈ భారము వహింపనిదే యిది నెఱవేఱదు.

---

(1) వారి 1967 వ సంవత్సపు ముద్రణ విజ్ఞప్తిలో.

(2) ఆంధ్ర సాహిత్య అకాడమీ ప్రతి పీఠికలో శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు. పు 61.

(3) వారి పీఠిక పు 61 (4) అదే (5) పదములు అర్థములు క్రింది సూచిక పు. 215. వావిళ్ళవారి ప్రతి.

అందఱకును తలా యొకటి తోఁపవచ్చునుగాని ఒకనికే అన్నియుఁ దోఁపవు కదా.' అని నిర్విణ్ణ వినయముతో తెలిపినారు. 6

నిజమే. కాని హరివంశమునకైనా రెండు మూడు వ్రాతప్రతులు దొరకుననే ఆశ గలదు; నృసింహపురాణము విషయమున అది వట్టి భ్రమ యనియే తోచుచున్నది—ఇప్పటికి. భవిష్యత్తు మాట భగవంతు డెరుగును. అట్టిచో ఉన్న ఒక అతి శిథిలమైన తాటాకుల ప్రతి నాధారముగా గొని 7 గ్రంథముసు పరిష్కరించువారు కొంత ప్రతిభా బల ముపయోగించు చొరవ తీసుకొన్నప్పుడే ఆపని కొంతైనను సార్థకమగును. ప్రతిని వ్రాయునప్పుడు వ్రాతగాని వ్యుత్పత్తి, అవ్యుత్పత్తి, అభినివేశము, ఆశ్రమము, అభ్యాసము మొదలైన ధర్మా లన్నియు యథాసంభవముగా మూలగ్రంథమును కెదకి పెట్టుననుట క్రొత్త విషయముగాదు వ్రాత ప్రతులు అనేకములు దొరికినా అవి అసలు గ్రంథ పాఠమును మనకియ్యలేక పోవచ్చును అట్లొచో ఒక శిథిల ప్రతిమాట చెప్పబనిలేదు. కనుక కావ్యవాసనా పరిపక్వబుద్ధులైన శ్రీ శాస్త్రి—అవధానిగార్లవంటి దోషజ్ఞులు ఈ సవరణ పనికి వెనుదీయుట అనావశ్యకమైన సంకోచ మనుకోక తప్పదు.

కనుక ఆ విద్వాంసు లిద్దరును చేసిన సూచన ననుసరించి నృసింహపురాణము ప్రథమాశ్వాసమందలి ముద్రిత పాఠములు కొన్నిటికి నాకు యుక్తములని తోచిన సవరణ లిందు సూచించుచున్నాను. వీని యౌచిత్యము సహృదయ పండితులు పరిశీలింతురుగాక వారి యామోదము ననుసరించి, ఆవశ్యకత కొలది అవకాశముకొలది, తక్కిన యాశ్వాసముల పాఠములను గూర్చిన నా సవరణ సూచనలు ప్రకటింతును.

(1) ఆ. 1; ప 3.

'వేలుపుం బెద్ద నయంపు మత్కృతి కభీష్ట చిరస్థితి
దాయి గావుతన్'.

ఇక్కడ 'నయంపు మత్కృతి' అను ప్రయోగము వింతయైనది. నయము అను పదము విశేష్యముగా గ్రహించినను విశేషణముగా గ్రహించినను శాస్త్రమునకు చాలునుగాని యిట్టి కూర్పు తెనుగు సంప్రదాయమున రూఢముగా నా దృష్టికి తగులలేదు. చేయబోవు తన కృతిని ముందుగానే పొగడుకొన గోరినను ఈ చోట ఎఱ్ఱనకు మనోజ్ఞ—ఉదార—వంటి సాధారణ శబ్దము లెన్నో లేఖిని కందియుండకపోవు కనుక పెద్ద+అనయంబు అని సవరణ చిన్నది చేయవచ్చును. అనయంబు=మిక్కిలి అని అన్వయింపవచ్చును. 'అత్తునకు సంధి బహుళ'మన్నారు గదా కాని యీ సంధి గూడా అసాధారణమే యన్న యాక్షేపముండనే యున్నది. అయినా పెద్దారుగ, పెద్దిల్లు, పెద్దేటి గొల్లలు మొదలగు సంహితరూపములు లేకపోలేదు. అప్పటికిని సమస్త పదములందేకాని వ్యస్తపదములందు, ఇక్కడ నున్నట్లు, సంధి యున్నదా యను సందేహము తలచూపుట సహజమే దానికి నా సమాధానము లేదు. 'నయంపు' అనుటకంటె 'అనయంబు' అని యుండుట యెఱ్ఱనార్యుని వినీత చిత్తవృత్తికి, సంప్రదాయమునకు, యుక్తతరమని మాత్రమే చెప్పగలను. మరి పెద్ద పెద్దు—అను రెండు రూపములును—దొడ్డ, దొడ్డువలె—తెలుగులో ఉండియుండునని భావించు నవకాశ మున్నది. కన్నడమున పెద్ద—పెద్ది—పెద్దు అను మూడు రూపములతో ఈ పదమున్నది అక్కడ 'దొడ్డ' కలదుగాని 'దొడ్డు' లేదు కాని 'దొడ్డు'నుండి వచ్చినదే 'దొడ్డ' యని, ఆ మూలరూపము నేటికివి తెలుగులోనున్నదని—కిట్టెల్ చెప్పినాడు. రెండు భాషలలోను అర్థమొకటే 'పెద్దు' అనునది మట్టుకు బుద్ధిలేనివాడు అను నర్థమున కన్నడులు నేడు వాడుదురు. అది విపరీత లక్షణ కావచ్చును. ఏమైనా మనకు తెలుగులో 'పెద్దు' కానరాదు. కాని యిది శబ్ద శాస్త్రమునకు సంబంధించిన శాఖా చంక్రమణము సంధివైచిత్ర్యము నోర్చుకొని అర్థౌచిత్యము సాధింపదగునని మాత్రము నా సూచన.

(2) ఆ 1; ప. 6.

'కరకమలంబునందు స్ఫటికంపుఁ గమండలు వచ్చకాంతి భా
సురమగు మౌక్తికంపు జపసూత్రము దాల్చుట, బ్రహ్మవాదియై
వరఁగిన హంసముం బిలిచి బాల మృణాళముఁ జూపు చందమొ
సిరిఁ దిలకింప నొప్పు బుధ సేవిత మూర్తిఁ దలంతు భారతిన్.'

కమండలువు జపసూత్రము రెండును ఒక చేతనే తాల్చియుండవలసిన యక్కర భారతీదేవి కేమి? ఆమె చతుర్భుజ గదా! కనుక 'కర కమలంబులందు అని ఎఱ్ఱన పాఠముగా సవరింపదగును. 'కరయుగళంబునందు' అనియే అసలు పాఠమని యూహించినను చెల్లును మరి హంసము 'బ్రహ్మవాది' అను టేమి? బ్రహ్మపరివారములన్నియు బ్రహ్మ గొప్పతనముకు చర్చించి స్థాపింపగలవని భావింపవచ్చును గని యిక్కడ ఆ ప్రస్తావముచే వచ్చిన విశేష మేమి? 'బ్రహ్మవాదమై'అను పాఠాంతరము చూపబడినది.8 అది మరీ అర్థములేనిది గనుక వాదియై' అను సవరణ జరిగినది. విశేషణ విశేష్యభావము కుదిరి వాక్యము సరిపడినది. కాని అర్థపుష్టి రాలేదు. కనుక 'వాదమై' అనుదానిని 'వాహమై' అని సవరింపవచ్చును. 'వాదియై' అనియే తాటాకుల ప్రతిలో పాఠమున్నచో దానిని 'వాజియై'గా దిద్దవచ్చును. బ్రహ్మకు వాహనమైనది గనుకనే ఆతవి యిల్లాలు దానిని పిలిచి ప్రీతితో తామరతూడును మేపుచున్నట్లున్నది అను అందమైన యర్థభావములు లభించును. ఇట్లే 'సిరిందిలకింప' అను ముద్రిత పాఠమునకంటె 'సిరి తిలకింప' అను పాఠాంతరమే మేలు. 'అందము ప్రకాశింపగా' అని యర్థము. తిలకించు ధాతువును అకర్మకముగానే యెఱ్ఱన వాడునట్లు తోచును. తరువాతి రచనలలో ఇది సకర్మకముగా మారినది

(3) ఆ. 1; ప 2

'వీనుల తేనెయై కురియు వింతగు కావ్య రసంబు గ్రోలి య
మ్మానవ కోటికిం బశు సమానత మానఁగఁ జేసె నెవ్వఁడు...'

ఇది వాల్మీకిస్తుతి అతఁడు తానుమాత్రము కావ్యరసము త్రాగితే ఆకాలపు మానవకోటికి పశు సమానత యెట్లు మానును? ఆయన, పాపము, తాను రచించిన రామాయణ రసమును కుశలవులకు అదేపనిగా నేర్పి, వారిచే దేశ దేశములందు పాడించినాడు. కనుక ఇక్కడి '(క్రోలి)' అని చిన్న మార్పు చేయక విధిలేదు. అట్లే 'అమ్మానవకోటి' గూడ 'ఇమ్మానవకోటి' గావలసియున్నది. లేకున్నచో ఆ త్రేతాయుగమువారిజోలి మన కెందుకు?

(4) ఆ 1; ప. 21.

'నీ మధురోక్తి గుంభన మనీషులు మెచ్చఁగఁ బ్రస్తుతింపు, నీ
కేమెయి సంభవించు నఖిలేప్సిత పుణ్య ఫలోదయోన్నతుల్.

ఇక్కడ 'నీ కీ మెయి' అని యుండఁదగును. 'ఈ కార్యముచేత అనుట. 'ఏమెయి అనగా 'ఎట్లైనను అని యర్థమగును. దానికి ఎఱ్ఱనకు తాత యెఱపోతన్న చేసిన యీ యుపదేశమునందు సంగతిలేదు. ఇట్టివి అచ్చు తప్పు లనుకోవచ్చునుగాని రెండు ముద్రణములందును ఉండుటచేత పరిష్కర్తలు వ్రాతప్రతులను నమ్మి, వాని జోలికి పోలేదని సందేహపడవలసి యున్నది మరి ప్రాత వ్రాతలలో 'కీ—కేలు' ఒక విధముగానే యుండుట అపురూపముగాదు.

(5) ఆ. 1.; ప. 32.

'నిత్య వివేకాపేక్ష ని
రత్యయ తత్పునకు నిరుపమాసత్వునకున్'

---

(6) వావిళ్ళవారి హరివంశ పీఠిక పు XXXIII (7) నృ. పు. పు 215 క్రింది సూచికలో 'వ్రాతప్రతులందలి కొన్ని పాఠములు అపపాఠములో సుపాఠములో భాష అంతయు బయటఁ బడనిదే తెలియదు ' అన్న శ్రీ శాస్త్రిగారిది 'సామాన్యే బహువచనం' అనుకోవలసి యున్నది. తక్కిన యేడెనిమిది చోట్ల వారు ఏకవచనమే ప్రయోగించినారు. చూ. పు. ఋ. 119, 191 ఇత్యాది

8 పాఠాంతరములు వ్రాతవో అచ్చువో శ్రీ శాస్త్రిగారు—క్వచిత్తుగా తప్ప—తెలుపలేదు. వారు పరిష్కరణలో అసలు మూల ప్రతులమాటే యెత్త లేదు.

# ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి

1956వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత, ముఖ్యంగా రెండవ, మూడవ పంచవర్ష ప్రణాళికలనూ, ఆ తరువాత వార్షిక ప్రణాళికలనూ అమలు చేసిన పిమ్మట రాష్ట్రం అన్ని ఆర్థిక రంగాలలోనూ గణనీయమైన అభివృద్ధిని సాధించింది. విశాలమైన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించిన అనంతరం రాష్ట్రంలో జరిగిన పురోభివృద్ధిని గురించి దిగువ ఇచ్చిన అంకెలు యథార్థ విషయాలు వివరిస్తాయి

## ఆంధ్రప్రదేశ్‌లో అభివృద్ధి సంక్షిప్త వివరాలు

| వ. నెం. | అంశం | ప్రమాణం | కాలం | ఆంధ్ర | తెలంగాణా | ఆంధ్ర ప్రదేశ్ |
|---|---|---|---|---|---|---|
| 1 | రెండో ప్రణాళిక పెట్టుబడి | రూ కోట్లలో | 1956–61 | 124 18 | 64 42 | 188 60 |
| | | | | (65 8) | (34 2) | (100 0) |
| 2 | మూడో ప్రణాళిక పెట్టుబడి | ,, | 1961–66 | 205 82 | 146 60 | 352 42 |
| | | | | (58 4) | (41 6) | (100 0) |
| 3 | తరువాత మూడేండ్లలో | ,, | 1966–69 | 130 33 | 102 57 | 232 90 |
| | | | | (56 0) | (44 0) | (100 0) |
| 4. | ఈ పదమూడేండ్లలో ప్రణాళికల మొత్తం పెట్టుబడి | ,, | 1956 69 | 460 33 | 313 59 | 773 92 |
| | | | | (59 5) | (40 5) | (100 0) |
| 5 | కేంద్రరంగంలో పెట్టుబడి | ,, | మార్చి 1968 వరకు | 41.77 | 84 40 | 126 17 |
| | | | | (33 1) | (66.9) | (100 0) |
| 6 | విద్యుచ్ఛక్తి పొందిన పట్టణాలు, గ్రామాలు | సంఖ్య | 1956–57 | 545 | 18 | 563 |
| | | | 1968–69 | 4,049 | 1,939 | 5,988 |
| 7. | పంపుసెట్లకు విద్యుచ్ఛక్తి | ,, | 1956-57 | 4,699 | 231 | 4,930 |
| | | | 1968 69 | 87 078 | 43 301 | 1,30,379 |
| 8 | రోడ్ల నిడివి (అదనపు మునిసిపల్ రోడ్లు అన్నీ) | మైళ్ళు | 1956–57 | 15,676 | 3,647 | 19 323 |
| | | | 1965–66 | 20.819 | 9 024 | 29 843 |
| | | పెరుగుదల శాతం | 1965-66లో 1956-57మీద | 32 8 | 147 4 | 54 4 |
| 9 | ఆసుపత్రులలో పడకలు | సంఖ్య | 1956 57 | 8,780 | 5 215 | 13 995 |
| | | | 1965–66 | 16,392 | 9 563 | 25,955 |
| | | పెరుగుదల శాతం | 1965 66లో 1956–57మీద | 86 7 | 83 4 | 85 5 |
| 10 | ప్రాథమిక/ప్రాథమిక పూర్వదశ పాఠశాలలు | సంఖ్య | 1956–57 | 21,316 | 7,684 | 29,000 |
| | | | 1966-67 | 26 388 | 10,807 | 37 195 |
| | | పెరుగుదల శాతం | 1966-67లో 1956 57మీద | 23 8 | 40 6 | 28 3 |
| 11 | మాధ్యమిక/జూనియర్ ప్రైమరీ పాఠశాలలు | సంఖ్య | 1956–57 | 104 | 169 | 273 |
| | | | 1966-67 | 1,562 | 1 087 | 2 649 |
| | | పెరుగుదల శాతం | 1966 67లో 1956-57 మీద | 1 402 | 543 | 870 |
| 12 | ఉన్నత/హైయ్యర్ సెకండరీ మల్టీపర్పస్ పాఠశాలలు | సంఖ్య | 1956–57 | 627 | 105 | 732 |
| | | | 1966–67 | 1 600 | 1,055 | 2 655 |
| | | పెరుగుదల శాతం | 1966-67 లో 1956–57 మీద | 155 | 905 | 263 |
| 13 | కళాశాలలు (సాంకేతిక కళాశాలలతో సహా) | సంఖ్య | 1956-57 | 68 | 30 | 98 |
| | | | 1966-67 | 101 | 80 | 181 |
| | | పెరుగుదల శాతం | 1966-67లో 1956-57 మీద | 49 | 167 | 85 |
| 14 | ఇంజనీరింగ్ డిగ్రీ కళాశాలల్లో విద్యార్థులను చేర్చుకునే అవకాశం | సీట్ల సంఖ్య | 1956-57 | 240 | 185 | 425 |
| | | | 1965-66 | 953 | 677 | 1 630 |
| | | పెరుగుదల శాతం | 1965 66లో 1956-57 మీద | 297 | 266 | 284 |
| 15 | పాలిటెక్నిక్‌లలో విద్యార్థులను చేర్చుకునే అవకాశం | సీట్ల సంఖ్య | 1956–57 | 490 | 370 | 860 |
| | | | 1965-66 | 2 093 | 1 370 | 3,463 |
| | | పెరుగుదల శాతం | 1965–66లో 1956-57 మీద | 327 | 270 | 303 |
| 16 | వైద్యకళాశాలల్లో విద్యార్థులను చేర్చుకునే అవకాశం | సీట్ల సంఖ్య | 1956-57 | 280 | 158 | 438 |
| | | | 1965-66 | 700 | 420 | 1,120 |
| | | పెరుగుదల శాతం | 1965 66లో 1956–57 మీద | 150 | 166 | 156 |

ఈ శాస్త్రిగారి పాఠమును అవధానిగారు 'తత్త్వ' 'సత్త్వ' అని తావత్తు చేర్చి ముద్రించినారు. అది యుక్తమే ఇది ఉచ్చారణలో భేదములేని వట్టి శాస్త్రపు మాట యని శాస్త్రిగారు ఉదాసించిరి గాబోలును. అది యుండనీ. నిరు పమ+అసత్వనకున్ అని అకార ప్రశ్లేషము చేయకున్నచో యతిభ్రంశముతప్పదు. చేసినను అర్థము కానరాదు. 'ఆ సత్వనకున్' అని విరిచి 'అభివ్యాప్తమైనసత్త్వము —సత్త్వ—గలవాడు' అని యాడ్పవచ్చునేమో. 'సక్త్వనకున్' అను పాఠాంతర మున్నది అప్పటికిని 'నిరుపమ+అసక్త, లేక ఆసక్త' అని అందిక పొందికలు లేని కూర్పు లభించును. కాక తరువాతి రెండు విశేషణములు 'సిద్ధ్వనకు— శుద్ధ్వనకు' అని యీ పద్యమున అంత్యప్రాస నిబద్ధమగా నుండుటచేత మొదటి రెండు గూడ ఆ నియమముతోనే కవి కూర్చియుండునను కొనుట న్యాయము. ఈ రగడకంటె 'నిరుపమాజత్వనకున్' అని తిద్దవచ్చునని సూచించుచున్నాను. అజత్వము అనగా పరత్వము; అది నిరుపమముగా—సాటిలేక—కలవాడు ఇంకను ఒక చిన్న మార్పు సహ్యమేని 'నిరుపధాజత్వనకున్' అనవచ్చును; ఉపద—ఆరో పణ; అదిలేని—స్వతస్సిద్ధమైన—అజత్వముగలవాడని యర్థము ఎ(రన యతి భ్రంశము గమనింపలేదని, ప్రాసకొరకు అర్థములేని సమాసము పెడినాడని భావించు నపచారముకన్న ఇట్టి చిన్నమార్పేదో సూచించుట ఉచిత కార్యమని నా తలపు.

(6) ఆ 1; ప. 32.

'ఉరుతర భవనిజ సింహత్వ దళిత భవకలభునకున్'

ఇక్కడ 'భవనజ' అను పాఠాంతర మున్నది. అదే పాఠముగా మీరి కెత్తదగినది భవన+జ=ఇంటిలో పుట్టిన, సింహత్వము; ఇతర సింహములు వనజములు, అడవిలో జనించినవి నరసింహుని యవతారము ఇంటిలో కలిగి నది ఈ తారుమారు అచ్చు కాలమున అయినది కావచ్చును కాని రెండు ముద్రణములందును కాజాది నిల్చినది. ఉరుతర=గొప్ప, భవ=పుట్టుక— ఆకారము—కల, నిజసింహత్వ=తన సింహభావము—ఇట్లు డొంక తిరుగు డుగా టీకింపవచ్చును. కాని అది సరస మనుకొలేను.

(7) ఆ 1; ప 199

'ఇచ్చుటఁ దొల్లి జనార్దను-
డచ్చుపువాలారు గోళ్ళ నసురవరేణ్యున్
వెచ్చెనన '

'వెచ్చు' ధాతువు 'వేడియగు' అను నర్థమున గలదు ప్రయోగ ములు గలవు. నిఘంటువు లంగీకరించినవి ఇక్కడ దానిని సకర్మకముగా వెచ్చ జేయు—పీడించు—అనునర్థమున గ్రహింపవలసి యున్నది. దాని కాకరము కానరాదు, అగతికముగా'అంతర్భావితణ్యర్థము అనుకొనుట తప్పు. కాని గతిలేక పోలేదు. 'వ్రచ్చె' అను పాఠాంతర మున్నది గోళ్ళతో వ్రచ్చుట సహజరీతి. దానిని క్రిందికి దించి 'వెచ్చె' అను పాఠము నేల మన్నింపవలెను?

(8) ఆ 1; ప 20

'అఖిల లోకేశ్వరుండగు రమాధిపుతోడ
విడువని వైరంబు దొడరునట్టి
పోటుక పేటికో మొలచె దైత్యుని బుద్ధి
నెబ్బంగి నిష దైత్యేంద్ర సుతుడు
శ్రీవత్సవక్షు మెచ్చించె శ్రీ నరసింహ
మూర్తి యే కారణమున ధనించె
విభుఁడహోబల నాథ విఖ్యాతి నెట్టద్యె
నీ తీర్థవరమున కిందుగలుగు
పుణ్య తీర్థంబు లెయ్యవి....'

ఇవి కథకున్న దేవ(శవుని గాలవుష ... నా ... గితగల చోట్ల మార్పులు చేయకున్నచో వ్యాఖ్యానయము సరిపోదు. కావున

'శ్రీ నరసింహమూర్తి యే కారణమున ధరించె విభుడు' 'అహోబల నామ విఖ్యాతి యెట్లయ్యె నీ క్షేత్రవరమునకు' 'ఇందుగలుగు పుణ్య తీర్థంబు లెయ్యవి' అను సవరణలు సూచించు చున్నాను.

'ధనించె' అను ధాతువు విన్నదిగాదు ఇక్కడనే కన్నది. 'జనించె' అను దాని పాఠాంతరము కొంతమేలైనా వెనుక ముందుల కతుకదు. 'అహోబల నాథ' పదము 'విభుడు' అను పదముతో కలుపవచ్చునుగాని అప్పుడు 'ఈ తీర్థవరమునకు' అను పదము అంతరాళములో (వేలును 'తీర్థవరమునకు' అనుదానితోనే కూర్చుటకు అది అహోబలమే కాని అహోబల నాథము గాదు. కనుక 'నాథ' పదము నామ' కాదగియున్నది. ఇక అహోబలము క్షేత్రము. తీర్థమనగా పుణ్యక్షేత్రమని కూడ నైఘంటికు లర్థమిచ్చినారు గాని బహుళ వ్యవహారమున క్షేత్ర శబ్దము వ్యాపకముగా తీర్థశబ్దము వ్యాప్యముగానుండును. కనుకనే 'ఇందుఁ గలుగు పుణ్య తీర్థంబు లెయ్యవి' అను తరువాతి ప్రశ్న ఉప పన్నముగా నున్నది ఆ కారణమున 'ఈ తీర్థవరమునకు' అను పదమును 'క్షేత్ర వరమునకు' అని సవరించుట ఆవశ్యకమని తోచినది.

(9) ఆ. 1; ప 29

'క్రొన్నరువు వెట్టిన యంతయుఁ జూడ నొప్పు .
'వెట్టిన నెంతయుఁ జూడ నొప్పు' అని యుండదగును.

(10) ఆ 1; ప 30

'ఎక్కుడు వేడ్కఁ గ్రోలికొని యెండకయున్న పయోధి పళ్ళమున్
గక్కెడునో సుధాకిరణకాంతి చయంబు లనంగ..

ఇక్కడ 'యుందక' అని యుండదగును. ఇందు' ధాతువునకు అడగు, రుచించు అను నర్థము లున్నవి. క్రక్కుటకు కారణము అడగక పోవుట కాని, రుచింపక పోవుట కాని, కావచ్చును. కాని యిక్కడ మొదటి యర్థమే సంగ తము. 'ఎక్కువ వేడ్కఁ గ్రోలికొని'యనియున్నది గనుక. మరి 'యెండక' అను మాట కే యర్థము లేదు ఎండిన తర్వాత క్రక్కుట దేనిని?

(11) ఆ 1; ప 32.

'ప్రేపులు రేలు బెద్దయును బేర్చి సమీప నగేంద్ర చంద్ర కాం
తోపల తోయదంబు నదు లొక్కమొగిం జనుదెంచి యాదటన్
బైపడ దాను నుల్లసిత భాతి దదీయ నదాభిసారమున్
దీపెసలారఁ గైకొని మదించు నదీపతి కోర్కి వింతగన్.

అన్వయశుద్ధిలేని పద్యములలో ఇదొక్కటి దీని సవరణ నేనిట్లు సూచింతును

'ప్రేపుల రేలఁ బెద్దయును బేర్చి .. తోయదంబు నదు లొక్క....
నవాభిసారమున్ ..

ప్రేపు—పేర్చుధాతువు భావార్థకృదంతరూపమైన పేర్పు అను దాని కిది రూపాంతర మనుకొనవచ్చును. కాని దీనికి ప్రయోగాంతర మొకటే 'వీని— నేపు మాపెద దూపుల ప్రేపు లెగయ' అను భాస్కరరామాయణ యుద్ధ కాండ మందలిది చూపి, సూర్యారాయ నిఘంటువు 'పరంపర, వరుస' అని యర్థ మిచ్చినది శబ్ద రత్నాకరము 'ఉషఃకాలము, వేకువ' అనునొక యర్థమే యిచ్చి యీ నృసింహపురాణము పద్యమునే, అచ్చులో నున్నట్లే, యుదాహ రించినది సూ ని ఆ మాటే అనువదించి 'ప్రేపులఁ రేలు బెద్దయును బేర్చి ..' అని మాత్రము ఈ పద్య భాగమునే చూపినది ఈ శ. ర. చెప్పిన యర్థమున కాకరమేమో తెలియదు. 'పరంపర' అనుదానినే మన మిందు గ్రహించి 'పై పై వృద్ధియగు' అని తాత్పర్యము సాగించవచ్చును (10) అప్పుడు

---

9. ఈ పద్య సంఖ్య కథా ప్రారంభమునుండి

(10) ఇదిగాక 'ప్రేఁపుడు' అను అరసున్నతోడి పద మొకటి గ్రహించి శ ర. 'అధికుఁడు' అని టీకించి ప్రయోగ మొకటి చూపినది. దాని యౌచిత్య చర్చతో మన కిందు పనిలేదు. సూ ని. దానిని గ్రహింపలేదు ఆ యర్థము రూపము రెండును ఇక్కడ అతుకవు.

'ప్రేపుల రేలన్' అనగా, ప్రకృత విషయములు సముద్రము పోటెత్తుట, చంద్రకాంత శిలలు కరగుటయు గావున రెండును సంభవించు శుక్లపక్షముల రాత్రులందు అని యర్థము లభించును రేలు అని ప్రథమాంతముగా నున్నను తొందరలేదు కాలవాచకము గనుక సప్తమికి ప్రథమ విభక్తి వచ్చుట యుక్తమే

రెండవ సవరణ తాయుడంబు, తాయుత్+అంబు—పెరిగి వచ్చుచున్న నీరు అను నర్థము నిచ్చును ఇక్కడ ఒక చిన్న చిక్కు 'తాయు సంతాన—పాలనయోః' అను ధాతువు ఆత్మనేపది 'తాయమాన' అని యగునుగాని 'తాయత్' అను పరస్మైపది రూపము దానికి రాదు కాని ఆ ధాతువునకు వెను కనే అవ్యవహితముగా పఠితమైన 'స్ఫాయీ' ధాతువునకు 'స్ఫాయన్నిర్మోక సంధి' అని ప్రాచీన ప్రయోగ మున్నది ఈ గుంపులోని 36 ధాతువులు అనుదాత్తేత్తులు. అట్టి వానిపై వచ్చు ఆత్మనేపదము నిత్యము కాదని వైయాకరణుల పరిభాష కనుక ఆ చిక్కు అంత విడదీయరానిది గాదు. ఈ 'అగతిక గతి' యెందుకని నా మిత్రులు పండిత కవిప్రకాండును శ్రీ అవ ధానం చంద్రశేఖర శర్మగారు 'తోయదంభ' అను సవరణ నాకు సూచించిరి. మంచి సవరణయే కాని, చంద్రకాంతోపలములు వెన్నెలకు కరిగినప్పుడు తోయమేమై ప్రవహించును గనుక దానిమీద దంభ మెట మునకు ప్రయోజన ముండదని నా సంకోచ మంతే

మూడవది 'నవాభి సారమున్' అనునది 'నదాభిసారము' అను పాఠ మసంగతము నాయకుడు నదీపతి, నాయికలు నదులు వీరి నడుమ నదములు చొరదగినవి కావు ఈ పదమునకు టీక చేయుచు శ్రీ శివరామశాస్త్రిగారు 'నదాభిసారము— నదముల ప్రవాహము అభిసరణము అను శ్లేషకు నడగతి మగు పుంలింగ మననుగలము ఐనను కవులు దానిని నద్యభిన్నముగా సూచింతురు' అని మనసు నొప్పితో వ్రాసినారు (పు 228) సామాన్య కవుల రచనలలో నదీ—నదములకు భేదము లేదని మన మంగీకరించినను ఇక్కడ 'తదీయ' అను పద మొకటి కంటకముగా నున్నది దానికి 'నదులదైన' అను నర్థమే చెప్పుకోవలయును గదా అప్పుడు మరల 'నదాభిసారము' మనకు మ్రింగుడు పడదు కనుక 'నద'ను 'నవ'గా మార్చుట విధిలేని పని ఇప్పుడీ పద్యార్థసంగతి యిట్లు —

'శుక్లపక్ష రాత్రులందు పెద్దగా పెరిగి సమీపమందలి పెద్ద కొండల లోని చంద్రకాంత శిలలనుండి జారి మొత్తమైన నీటి నదులు ఒక్కరీతిగా వచ్చి ప్రేమతో తనపై బడగా, నదీపతి తాను ఉల్లాసముతో ఆ నదుల క్రొత్తయెదురుకోలును వింతకోర్కెతో, తియ్యదన ముప్పొంగునట్లు, గ్రహించి పొగరు గొనును.' నదుల యభిసారము వెన్నెలకాలపు రాత్రులందే లభించునది గనుక నవము.

(12) ఆ 1; ప 33

'ఆ చ్చటనచటన్ బొజుంగుపడి ప్రసగ్గిన బాడబకీలలో యనన్'

'పొజుంగు' అను శబ్దము కానరాదు 'బొజుంగు' అనగా 'విటుడు' అనియే యర్థము 'పొనుంగు' అన్న సార్థక పాఠాంతరమున్నది గనుక దానిని గ్రహించుట యుక్తము వ్రాతలో 'పొణుంగు' అను రూపము 'బొజుంగు' అను భ్రాంతిని గల్గించునట్లున్నదేమో!

(13) ఆ. 1; ప. 38

'ఆదియు మహిమయు నేర్పడ
నాది పురుషుఁడొకఁడ యెఱుఁగు నన్యులకెఱుఁగం
గా దరము గాదు కమలభ
వాది దివిజవంద్య మది మహాద్భుతము మహిన్'

ఈ పద్యమునకు వెనుకనే 'విపుల రూపంబై శ్వేతద్వీపంబు దీపించుచుండు' అను సమాపక వచనవాక్య మున్నది వెంటనే 'ఆదియు మహిమయు నేర్పడ నాది పురుషుఁ డొకఁడ యెఱుఁగు' అనగా ఎవ్వరి 'ఆదియు మహిమయు?' తరువాతి వాక్యమందలి 'అది'ని 'అపకర్షము' చేసి, ఆ పదమును 'విభక్తి విపరిణామము'తో 'దాని'గా మార్చుకొని అన్వయ సంగతి కుదుర్చుకొనవలెనా? ఏమంత కష్టార్థి యెత్తునకు? మరియు ఆదిమధ్యాంతములను పలుకుబడి మనకు పరిచితముగాని 'ఆదియు మహిమయు' అను కూర్పుగాదు కనుక 'ఆదీవిమహిమ నేర్పడ' అని తిద్దుపాటు సూచించుచున్నాను తాటాకు వ్రాతలలో ఇ—ఉ—ఏల హ్రస్వ దీర్ఘరూపములు ఒక విధముగానె యుండుట సామాన్యము కనుక 'అదివి మహిమ' అని యుండగా 'ది' హ్రస్వమనుకొని యెవరో చేసినపని యిది. ఇక్కడ 'యెఱుఁగనన్యుల' అన్న శ్రీ శాస్త్రిగారి ప్రతిలోని లవపాఠమును 'యెఱుఁగు నన్యుల'అని శ్రీ అవధానిగారి సవరించి మంచిపని చేసినారు ఇట్టివే మరికొన్ని వారు చేసిన తిద్దుపాటు అభినంద్యములు.

(14) ఆ 1; ప 42

'హరిభక్తి తేపగా దు
స్తర సంసారాబ్ధిఁ గడచు సాధుజనులకున్
గరమై దివిజగణ నిరం
తర నిత్యానందమయ పదస్థితి నెసఁగున్'

ఏది యెసఁగునది? వెనుకటి పద్యమందలి కర్త 'శ్వేత ద్వీపనివాసులు'. కనుకవారు ఎనికిరారు దాని వెనుకటి పద్యమందు కర్తగా 'దీవి' యున్నది దాని నిక్కడికి కష్టదాటులతో తెచ్చుకొని వాక్యార్థ పూర్తి చేయవలెను! ఈ 'మండూక ప్లుతి' మహావైయాకరణు లెఱుఁగుదురుగాని కావ్యరసికులు కానరు మరి 'నిరంతర నిత్యానంద మయ పదస్థితి దివిజగణము లందరికిని లభించునా! వారికి మాత్రమే సిద్ధించునా? మరి సంసారాబ్ధిఁ గడచి కర' యెక్కిక సాధుజనులు ఆ కరదాటి పోగూడదా? కనుక నా దృష్టిలో మీది 39వ పద్యమునందువలె ఇందలి 'దివిజగణ' పదములోను 'దీవి' తలదాచుకొనినట్లున్నది దీని ఘన నిరంతర అని పాఠము సవరించుట మేలు

(15) ఆ. 1; ప 48

'సమగ్రశృంగారరసాధి దేవత జగద్రమణుండు మురారి యట్టి శృంగారి రసైక పాత్రమనఁగాఁ దగదే పురరత్న మెమ్మెయిన్'

ఇక్కడ 'అట్టి' 'అట్టె' యని యుండదగును 'శృంగారరసైకపాత్ర' అనుపాఠాంతర మున్నది దానిని మీదికెత్తుట యుక్తము 'సమగ్ర శృంగార రసాధి దేవత'ను మురారిని మరల మరల 'శృంగారి' యని పేర్కొను పునరుక్తి యెత్రనమీద వేయరాదు

(16) ఆ 1; ప 49

ఎల్లసంతోసమునన్ ముకుందు సయిదోడులు తత్పురి పుణ్య బావిసల్'

లక్ష్మీనారాయణుల పెండ్లికి పెద్దలై సేసలు పెట్టినవారు వారు; చతుర్ముఖుడు పుట్టినప్పుడు బాలింతను బిడ్డను బుజ్జగించిన వారు వారు కనుక ఆ యమ్మలు 'ఎల్ల సంతోసములన్'— ఆనందమయ సందర్భములందును— ముకుందునికి సయిదోడులు ముకుందుడు ముక్తినిచ్చువాడు అతనితోడి అనాది నిత్యముక్తులు వీరు, క్రొత్త ముక్తులు గారన్నమాట. 'సంతోసమునన్' అను ఏక వచనము సరసముగా అన్వయింపదు కనుక 'సంతోసములన్' అని యుండదగును.

(17) ఆ 1; ప. 50

'హరిదాస్య సంపత్తి కరులు శ్రీకరులెల్ల......

వైకుంఠ పురమునందున్న యేనుగులు, గుఱ్ఱములు, పురుషులు (స్త్రీల మాట ముందే చెప్పియైనది) గృహములు, రత్నములు, హంసలు, పద్మములు— అన్నిటికిని శ్రీ మహావిష్ణువుతో సాక్షాత్తుగానో పరంపరగానో సాదృశ్య సంబంధమును జూపు పద్య మిది ఏనుగుల కన్వయించు పై వాక్యమునకు భావము కుదురదు తక్కిన వేనికిని లేని ప్రాకారము కరులకు మాత్రమేల! లక్ష్మికి గజ వాహనము ప్రియమైనది గనుక అక్కడి కరులన్నియు ఆమె యాస్తియైనవని కవిభావమేమో! ఎట్లైనను అవి మాత్రమేనా హరిదాస్యసంపత్తి' చేయునవి? తక్కినవన్నియు చేయునది యింకెవరి దాస్యము? 'హరిదాసులను హత్తి కరులు' అన్న పాఠాంతర మింకను బిగిసిపోయిన గంటు.

కనుక 'హరిలాస్యసంపత్తి కరువులు కరులెల్ల' అను సవరణ సూచింతును. హరికి లాస్యమేమియని ప్రశ్నింపవచ్చును. యుక్తమే. పార్వతీ పరమేశ్వరులకే లాస్యతాండవములు సొంతమైనవి. కాని సృష్టి లయముల నిర్వాహాధికారములను బ్రహ్మ—రుద్రుల కిచ్చి వారు చేయలేని రక్షణ కార్యమును తానే యుంచుకొన్న పరబ్రహ్మ శ్రీ మహావిష్ణువని భావించి యుపాసించు వైష్ణవులు ఆయన వ్యాపారము లన్నిటిని కమనీయమైన మధుర నృత్తముగా భావించిరి వేదాంత దేశికులు శ్రీరంగనాథ పాదుకాసహస్రమున,

'నిజసంహనన ప్రసక్తలాస్యం చరతి త్వా మధిరుహ్య రంగనాథః,
పదరక్షిణి పావనత్వ మాస్తాం రసికాస్వాదమతః పరం న విద్మః'
'రంగేశ్వరేణ సహ లాస్య విశేషభాజో లీలోచితేషు తవ రత్నశిలాతలేషు
మధ్యే స్థితాని కలిచి న్మణి పాదరక్షే సభ్యాన్ విశేష మనుయోక్తు

మితి ప్రతీమ'

అన్నారు (సంచారపద్ధతి, శ్లో 9, 31)

భగవల్లీల నృత్తమై సమాహిత చిత్తులకు తోచుట సహజ ప్రవృత్తి అది శైవులలో శాస్త్రీయమై వైష్ణవులలో అలంకారికమై నిలిచిన దంతే ఇక్కడ వైకుంఠపురమందలి కరులు హరిలాస్య సంపత్తి కరువులు—పోతపోసిన రూపములు అని యీ సవరణ కర్థము భగవంతుని మంద—స్వతంత్ర—గంభీర నిర్భయ—రమణీయ గమనమును అందలి యేనుగులు నడక ప్రతిబింబించుచున్నట్లున్న వనుట 'హరిలాస్య సంపత్తికి+అరులు=కానుకలు'అనికాని, 'సంపత్తికి+కరులు=సాక్షులు' అనికాని ఉన్న పాఠమున కుపపత్తి కల్పింపవచ్చును కాని సరసముగా తోపదు

(18) ఆ 1; వచ. 54

'పాతాళంబునుంబోలె విశ్వంభరోద్వహన సమస్త భోగీంద్ర భోగాస్పదంబును'

ఇందు 'సమర్థ భోగీంద్ర' అని పాఠముండును.

ఇందే ఆశ్చర్యంబులకు ననేక ధుర్యంబును' అనునది 'నేక ధుర్యంబును' అని యుండుట న్యాయము వైకుంఠపురము ఒక్కదానినుండియే అన్ని ఆశ్చర్యములును వెలువడునని భావము.

ఇక్కడనే 'సకల భువన భూషణంబును సకల దురితనిస్తారంబును' అను ముద్రిత పాఠమునకంటె 'సకల భువన పోషణంబును సకల భవ విశోషణంబును' అను క్రింది పాఠాంతరము మేలైనది; దీని తరువాతి జంట విశేషణములు 'వర్ణనీయంబు' 'కర్ణనీయంబు' అని అంత్యానుప్రాస బద్ధములై యున్నవి గనుక.

(19) ఆ 1; ప. 57.

'భూరిభుజంగ పుంగవో—న్మాన మనోజ్ఞ భోగ గరిమంబున'

'భూరి' 'ఉన్మాన' అను రెంటిమీద 'గరిమము' అధిక ప్రసక్తము. 'తలిమంబు' అని సవరింపదగును. తలిమము—తల్పము.

(20) ఆ. 1; ప 58.

'హేమస్తంభమణి ప్రదీప మణులింపేపారు'.

రెండు 'మణులు' వ్యర్థము. 'ఘృణులు' కావలయును.

(21) ఆ 1; వచ 62

'విష్వక్సేనుండను మహాపురుషుండు. . . . శ్రీ మహాలక్ష్మిం గూడుకొని' ఇక్కడ శ్రీ అవధానిగారు ప్రశ్న చిహ్నము వేసియుండుట చాలా ఉచితము విష్వక్సేనుడు శ్రీ మహావిష్ణుని సేనాని అతని దేవేరి సూత్రవతి 'వందే వైకుంఠ సేనాన్యం దేవం సూత్రవతీ సఖమ్. యద్వేత్ర శిఖర స్పందే విశ్వమేతత్ వ్యవస్థితమ్' అని ఆ దేవత ధ్యాన శ్లోకము. విష్ణువునకు విష్వక్సేనుడను పేరొక్కటి యున్నను ఇక్కడ అది ప్రసక్తము గాదు. ఇక్కడివాడు నారాయణ ప్రసాదభాజనుండు.' అనంతగరుడ విష్వక్సేనులు ముగ్గురును ముఖ్యముగా భగవదాత్మకులే కాని వారిని లక్ష్మీపతులనుగా ఎవరును భావింపరు కనుక ఇక్కడ శ్రీ 'సూత్రవతీదేవి గూడుకొన్ని' అని సవరించుట అగత్యము. లేదా ఎర్రన్న కింతమాత్రము వైష్ణవ సంప్రదాయముగూడ తెలియదనుకోవలెను. శాంతం పాపమ్.

(22) ఆ. 1; ప 63.

'పద్మనివాసిని పట్టపు దేవులు'

శ్రీ శాస్త్రిగారు తప్పొప్పుల పట్టికలో 'దేవియు' అని తిద్దినారు. శ్రీ అవధానిగారు ఆ తిద్దిన రూపమునే గ్రహించినారు కాని 'దేవులు' అనునది భక్తి గౌరవమును తెలుపు రూపమే కాని అందు బహువచన వివక్ష లేదు. కన్నడమందలి 'దేవియరు' 'దేవేరు' అను బహుమాన బహువచన రూపమే తెలుగులో దేవేరియై యేక వచనమేయైనది దానివంటిదే తెలుగు 'దేవులు' కాగలదు. ఇది ఒజ్జలు, రాచవారు అను పదముల వంటిది కనుక రూపము మార్చవలెలేదు. మరి 'పట్టాన దేవులు' అను పాఠాంతర మున్నది దాని మూలము ఇప్పటికి నాకు సుగమము గాదు

ఈ పద్యమందే (అతిలోక నందకం బద్భుతోజ్జ్వల హేతి) అని చిప్ప గుర్తుల నడుమ ముద్రితమైనది 'ఇది పూరణము' అని క్రింది సూచిక. ఇది శ్రీ శాస్త్రిగార పూరించినదికాదని తలచెదను. విష్ణుపంచాయుధములలో చక్రము ప్రధానము దానిని ప్రత్యేకముగా మంత్ర తంత్రములతో ఉపాసించు సంప్రదాయమున్నది షోడశాయుధ సంకలితముగా ఆ మూర్తిని పూజించుటయు కలదు. దాని తరువాతి ప్రధానాయుధము శంఖము. 'ఘన పాంచజన్య ముత్కటపుం జిందము' అని యీ సీసపాదము తర్వాతి వాక్యము. కనుక 'అతుల సుదర్శనం బద్భుతోజ్జ్వల హేతి' అని పూరణమును తిద్దుట సంప్రదాయశుద్ధికి మంచిది

(23) ఆ 1; ప 65.

'భూరి రజోగుణ స్ఫురణ పద్మజుం డనా
భువన ప్రపంచంబు పొడవుం జేయు
మహనీయ సత్త్వ సమాధి విష్ణుండనాం
బొదలించు జగములం బోలువుం దెలువ
గాఢతమోగుణాకలన నీశుండనా
నొక్కట నిఖిలంబు నుడిచి యడంచుం
గలిత గుణత్రయోజ్జ్వల పరాత్ముండనా
నెగడి విశ్వమునకు మిగిలి వెలుగుం'

ఈ పద్యమున 'స్ఫురణ పద్మజుండు' 'సమాధి విష్ణుండు' అనిసమస్త పదములుగా శ్రీ శాస్త్రిగారు భావించినట్లున్నది కాని మూడవ పాదములో 'కలన నీశుండనా' అని యున్నది గనుక మొదటిది 'స్ఫురణం బద్మజుండనా'అని యుండదగును రజోగుణ స్ఫురణ భువన ప్రపంచ సృష్టి కి ఉపకరణముగనుక తృతీయ అందుండదగినది 'సమాధి విష్ణుండ' అని విడదీసిన చాలును ఆ యర్థము స్ఫురించును. నాల్గవ పాదమున గూడ ఈ క్రమము నిర్వహించుటకై 'ఉజ్జ్వలత నాత్ముండనా' అని యుండునేమో! అద్వైత సంప్రదాయమువాడైన యెఱ్ఱనకు ఆత్మ—పరాత్మల భేదము గమనింపవలసియుండదు

ఈ నాలుగు పాదములందును 'అనాన్' అను రూపమే శాస్త్రిగా రంగీకరించినట్లు కలిపి ముద్రించినారు నాక నాంగ నావుడు అను పదముల వాసన తగిలి 'అనన్' 'అనాన్'గా ఉచ్చారణలో రూపందియుండవచ్చును కాని దానికి నిర్ధారక ప్రయోగము కానరాదు కనుకనే అవధానిగారు 'పద్మజుండనా' అని అంతటను విడదీసి ప్రకటించిరి కాని తమ పీఠికలో (59 పు) 'అనా' ను 'నా' యని 'దిద్దుట కావశ్యకము కలదా?' యని తామే సందేహించిరి న్యాయమే. కాని 'పద్మజుండ' 'విష్ణుండ' అని యన్ని చోట్లను అవధారణమగు అకారమును భావించుటవలని ప్రయోజనమేమి?

ఇక మూడవ పాదము తుద అరసున్న పెట్టుటచే తరువాతి పదము 'కలిత' యైనది నా దృష్టిలో అది యుచితముగాదు 'గలిత (గళిత) గుణ త్రయ' అను రూపమే శుద్ధాత్మ స్వరూపమునకు తగినది ఆత్మ నిర్గుణము. గదా. అప్పుడే 'పరాత్మ' యను ఔపచారిక నామము దానికి తగును.

(24) ఆ. 1 ; ప 67

'అప్పుడు దలంపొప్ప నొక్క మరి సర్వమునైన రమేశు పేరితి
యుప్పు బలుకింపు మీఱ నెదయం దొడగూర్పగ నేర్పు గలినన్'

ఇందు 'ఎద' యనుచో 'సన'యను పాఠాంతరమున్నది కనుక 'ఇంపుమై రసన' అని మూలపాఠము సంభావ్యము. 'అప్పుడు దలంపొప్ప' అని మీదనే యున్నది గనుక మరల 'ఎదయందు' అనుట పునరుక్తి మరియు పలుకు 'ఎద'కంటె 'రసన'యందు పెట్టబోనుటయే యుచితతరము శ్రీ అవధానిగారి ప్రతిలో పాఠాంతరము వట్టి 'సన' కాదు మరి 'గారసన' అప్పుడీ పాఠమును సందేహించుపనియే యుండదు. మీది రెత్వుట మాత్రమే కావలసినది.

(25) ఆ. 1.; వచ 70

'నీలమణి సుందరంబగు నిందిరా సుందరీ దివ్య దేహంబునం బొదలు గాంతి ప్రవాహంబు సిగ్గున వెలుకం బాఱిన పోలికం జలకనై వెలిమొగులు మొత్తంబులు దెసలకడ నడలు వడి తూలన్'.

ఇందిర 'హిరణ్యవర్ణ'గాని నీలమణి వర్ణగా ఎక్కడను ఎవరును జెప్ప లేదు. కాక ఈ వచనమున వర్ణితములైన శరత్కాల పరిణామములన్నియు విష్ణు చిహ్నములతోనే పోల్పబడియున్నవి. కనుక 'ఇందిరా సుందర దివ్య దేహంబు' అని పాఠము సవరింపదగును. మరియు 'కాంతి ప్రవాహంబు' తరువాత ఏదో సంబంధక పద మొకటి యుండవలెను లేకున్న తరువాత సిగ్గు దానికే అంటు కొనును కనుక 'ప్రవాహంబునగ్గలికకు' అని కాని, వేరొక విధముగాగాని, పూర్తి చేయదగును నా సూచనలో 'సిగ్గున'కు ప్రాస యొకటి దొరకును.

ఈ వచనమందే 'బంధుర బంధూకంబుల వంధ్య సహస్ర దీప్తిం దిల కింప' అను పాఠము గూడ పూరణ సాపేక్షముగా నున్నది ప్రాసతోడులేక 'అవంధ్య' శబ్దమును, అన్వయము లేక సహస్ర శబ్దమును తనుకులాడుచున్నవి. కనుక 'అవంధ్య సాంధ్య సహస్రకర దీప్తిం' అని సమాసము నింపవచ్చును.

(26) ఆ 1.; ప 72.

'నెరసిన చిక్కని యిరుచన్నుగవ చెన్ను'

ఇందు ఇరు—కవ అను రెంటిలో ఒక టెక్కువ కనుక 'యిఱి చన్నుగవ' యని తిద్దవలయును. పట్టుదల గలవారు దానికి తగినట్లు 'నెరసిన'లో బండిరా పెట్టుకోవచ్చును. నెరయు—నెఱయు రెండును నిఘంటువు లంగీకరించి నవే, అర్థ భేదములేక

ఇందే రెండవ పాదము మొదటి 'చెలిక్రాలు కన్నులు' 'తెలిక్రాలు కన్నులు'గా నుండదగును. శరత్కాలమందు మేల్కన్న భర్తకు నీరాజనము లెత్తుటకు లక్ష్మీదేవి క్రాలు కన్నులు చాలును. తోడుగా ఏ 'చెలి'యు రానక్కర లేదు.

ఈ పద్యము కడకటి పాదమున 'లీలాబ్జ' యనునది 'నీలాబ్జ'గా పడినది. శ్రీదేవి చేతి లీలాబ్జము సుప్రసిద్ధమే మరి కలువలలో నీలవర్ణముగలవి కలవు గాని కమలములలో కానరావు

(27) ఆ. 1; ప. 73

'సుందర మహనీయ నీల వసుధా ధర శృంగము పోల్పఁబట్టగన్'

అది 'పోల్పఁబట్టగన్' అని సవరింపనగును. పోల్పుటకు పాత్రముగా అనుట. 'మేదినీ ధరములఁ బోల్పఁ బట్టగు సుదగ్రపు మూర్తులు (ఉల్య 1.176) అని సోమయాజి గారీ పలుకుబడినే వాడినారు ఎఱ్ఱన గూడ హరివంశ పూర్వ భాగమున (ఆ. 7. వచ. 6) 'అంబురాశిఁ బోల్పం బట్టగుటక దగి' దీనిని ప్రయోగించినాడు ఇదే కొంచెము మార్చి 'కాంచన భూధ్రముఁ బోల్పఁ బాత్రమై' హరి. పూ 1 20 పద్యమున గలదు.[11] ఇట్లే నృసింహ పురాణము రెండవ యాశ్వాసము 20 వ పద్యమున 'కొనియాడఁగఁ బట్టుగ' అని యీ పలుకుబడి రూపాంతరమే కలదు.

(28) ఆ. 1 ; వచ 76

ఇందు 'కొండొకసేపు' అనుమాట రెండుసారులు ఆద్యంతములందు న్నది. రెండవది చాలును.

(29) ఆ. 1.; ప 84.

'సాగర జన్య కాంతితో', 'సాగర కన్య కాంతతో' అని పాఠాంతరము రెంటిని పరిశీలింపగా 'సాగర కన్య కాంతితో' అని యుండదగుననిపించును.

(30) ఆ. 1 ; ప 89.

'లక్ష్మీశ విభుమీఁది మత్సరము కిన్కయుఁ గాఁడియఁ జెట్టు గాత మీ
భ వము లిప్పుడే పగిది బాములు పెక్కగు నిక్కమింతయున్'

ఇది సనకసనందనాదులు జయవిజయుల కిచ్చిన శాపవాక్యము 'మీభావము లప్పుడు' 'ఈ పగిది బాములు' 'నిక్కమింతయున్' అని సవరింపనిచో వాక్యార్థము సరిపడదు

(31) ఆ 1; ప 97.

'మేదినిసురులు . జగత్సంభావ్య కోటి ప్రసాదారంభ ప్రతిభా విభాసితులు'

'కోప ప్రసాదా అని యుండును కోటికి ఇక్కడ ప్రవేశములేదు.

(32) ఆ 1; వచ 101

'ఉదియు సుదాత్త సిద్ధి ప్రదంబ, యట్టని శత్రుండు .. ..'
'యెట్టిన' అని యుండకున్న తరువాతి సమర్థన వాక్యముతో పొందదు.

(33) ఆ 1 ; ప 103

'భవ్య పదముం బ్రాపించువాఁడున్ మదిన్'
ఇక్కడ 'తుదిన్' అని యుండుట యుచితము.

(34) ఆ. 1 ; ప 108

'భవ్యాత్మ లక్ష్య ధర్మాధ్యక్ష'

ఈ శాస్త్రిగారి ప్రతి పాఠమునందలి యూవత్తులను అవధానిగారు తీసివైచి నందు కభినందనీయులు నాలుగు సంబోధనలలో మొదటి రెండును 'పక్ష—దక్ష' యని వట్టి క్ష కారములోనే ముగిసినవి. తరువాతి రెండు గూడ అట్లే యుండదగును. లక్ష—లక్ష్య రెండును సమానార్థకములే అది తెలి యని వ్రాతగాడు 'లక్ష్యను' గ్రహించి దానితోడి ప్రాస పొందికకై 'అధ్యక్ష్య' పదము సృష్టించి చేర్చినట్లున్నది

(35) ఆ 1,; ప. 110.

'దను సుఖ ఖండన మండన సునిశిత నిర్వక్ర చక్ర శోభిత హస్త'
దీని పాఠము 'దనుసుత ఖండన ఖండన' అని యుండుట సాధువు

ఈ యాశ్వాసమునందు సవరింప గలిగినవి చిన్నవి మరికొన్ని గలవు. తీర్పలేనివి కొన్ని మిగిలియున్నవి. ఇప్పటికి కింతటితో విరమింతును

---

11. ఇది యద్దనపూడి వారి ప్రతిలోని పాఠము. శివరామశాస్త్రి గారి ప్రతిలో 'లొప్ప బాత్రమై' అని కలదు కాని సంగతి చాలని పాఠ మది. ఈ పద్య పాఠము శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు చక్కగా ఉచిత ముగా సవరించి చూపినారు. (చూ. తెనుఁగు మఱుఁగులు. పు. 32, 33.)

# అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా

శ్రీ నోరి నరసింహశాస్త్రి

## పాత్రలు :

| | | |
|---|---|---|
| యజమాని | ... | యజమానురాలు |
| పెద్దకోడలు : | ... | పెద్ద కుమారుడు |
| రెండవ కోడలు : | ... | రెండవ కుమారుడు |
| మూడవ కోడలు : | ... | మూడవ కుమారుడు |
| పెద్దకూతురు | ... | పెద్దల్లుడు |
| రెండవ కూతురు | ... | రెండవ అల్లుడు |
| | | మూడవ కుమార్తె |
| నాల్గవ కుమారుడు | ... | నాల్గవ కుమార్తె |
| రంగము : | ... | యజమాని ఇంటిలో |

పెద్దకూతురు : నాన్నగారూ, అసలు మీ కెందుకు ఈ ఆలోచన కలిగింది?

పెద్ద కుమారుడు నాన్నగారూ, తొందర పడకండి!

రెండవ కూతురు నాకు తెలుసు. నాన్నగారు నవ్వులాట కంటున్నారు కాదుటండీ?

రెండవ అల్లుడు మామగారికి ఎప్పుడూ హాస్యమే.

**మూడవ కుమారుడు** . నాన్నగారూ, శైత్యంగా ఉన్నట్లుందికాని కళ్లు మూసుకొని పడుకోండి.

**నాలుగవ కుమారుడు** : ఏమిటి, మీరంతా ఇట్లా గోల చేస్తారు?

యజమానురాలు (పెద్దమ్మాయితో) అమ్మాయి, అంతా తెలిసినదానివలె అహంభావంకొద్దీ మాట్లాడుతావుకాని, మీ నాన్నగారి సంగతి నీకేమీ తెలియదు. ఆయనకు పిచ్చి. నలుగురూ వచ్చి ఇంట్లో హాయిగా ఉన్నారంటే, ఆయనకు ఏదో కొత్త పిచ్చి పుడుతూ ఉంటుంది. నువ్వు మాట్లాడించినకొద్దీ ఆయన రెచ్చిపోతారు.

**పెద్ద అల్లుడు** : మీ అమ్మ చెబుతున్నది కాస్త పట్టించుకోరాదూ, పోనీ!

రెండవ కుమారుడు నాన్నగారూ, నాకు అర్థంకావడంలేదు, ఏమిటండీ?

**యజమాని** : ఒరే, నీకు కూడా అర్థంకావడం లేదురా? రోజూ పురుషోత్తమప్రాప్తియోగము పారాయణ చేస్తావుగా! 'అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా' అంటె ఏమిరా—నీ కర్థం తెలియకపోతే మీ పెద్ద బావను అడుగు, దాని కర్థం!

**పె. అ** అసంగమనే శస్త్రముచేత దృఢంగా ఛేదించి—అంటే దృఢమైన అసంగమనే శస్త్రముతో కోసివేసి—అన్నమాట—అంతే కదండీ?

**యజమానురాలు** : ఆయన నోటికి శుభమా అని మంచి మాటలురావుగాని, ఆయ న్నెవరూ పలకరించకండి. ఇవతలకు రండి.

పె కూ : దేనిని ఛేదించి?

యజమానురాలు : దేనికే ఈ విచారణ అంతాను, పిచ్చివారి మాటలు పట్టుకొని?

పె అ పెద్ద తెలిసినదానిమల్లే మాట్లాడుతావు. మీ అమ్మమాట విను. మీ నాన్నగారు జ్వరం తీవ్రంలో ఉన్నట్లున్నారు.

పె కూ నాన్నగారి మాటలు అసందర్భంగా లేవు జ్వరపు మాటలు కావు. ఆయన పరమశాంతంగా అంటున్నారు. సన్యసిస్తాననీ— దేనిని దృఢేన ఛిత్త్వా ?

**పె. అ** గీతలో ఆ అధ్యాయంలో ఈ సంసారాన్ని అశ్వత్థవృక్షముతో పోల్చారు. దాని రూపము కనబడదట. దాని అంతమేదో, దాని ఆది ఏదో, అది ఎలా నిలిచి ఉన్నదో, అంతా అగమ్యగోచరమైనదట! దాన్ని అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా—ఆపైన ఏదో దాన్ని వెదకాలట!

పె. కూ . దేనిని?

పె అ అది ఏదో స్థానమట ఎక్కడికి చేరుకుంటే అక్కడినుంచి మళ్లీ తిరిగిరారో, అటువంటి స్థానమట దాన్ని బాగా వెదకాలట!

యజమాని . అమ్మా, ఇప్పుడు తెలిసిందా? ఆ స్థానం కోసరమని బాగా వెదకాలని నిశ్చయించుకొన్నాను—ఆ రావిచెట్టుకు ప్రకాండ మమ్మా మీ అమ్మ!

యజమానురాలు . ఇంతకూ నేనూ అందరికి పనికిరానిది! మీరే కావాలి ఆ అధ్యాయం పారాయణచేసే జ్ఞానులు మా నాన్న కూడా చచ్చిపోయేదాకా రోజూ ఆ అధ్యాయం పారాయణచేసేవాడే!—మా ఇంట్లో అందరికీ నోటికివచ్చు!—అట్లా నిత్యపారాయణం చేసినా మా నాన్న ఒక్క క్షణమైనా పెళ్లాన్ని బిడ్డలినీ వదిలివేయవలె ననుకున్నాడా?

యజమాని బాగుంది మీ నాన్నే లోకానికంతా ఆదర్శ పురుషుడైతే భగవద్గీతలు—ఉపనిషత్తులు అన్నీ కట్టలుకట్టి మూల పారేయ వచ్చు!

యజమానురాలు అబ్బో! మహా మీరే లేండి అవి చదివి ఆచరణలో పెట్టే వారు!

పెం. కు · అమ్మా, సరేకాని గీత చెప్పేది చెయ్యనిదానికి పారాయణ చేయడ మెందుకే!

యజమానురాలు . అరే, నీకు తెలియదుకాని నువ్వూరుకో!

పె కూ . ఓహో, అదా? అయితే సరేగాని నాకు ఒక అనుమానం కలుగు తున్నది చెబుతారా, నాన్నగారూ?

యజమాని . ఏమిటమ్మా? అడుగు!

పె. కూ : మా కందరికీ మీరంటే ఇంత ప్రేమకదా! మేము మీమీద ఉండే అపేక్ష వదిలిపెట్టవలసిందేనా?

యజమాని . ఎవరు వదిలిపెట్టమన్నారమ్మా?

పె. కూ : మీరు సన్యసిస్తే, మేమంతా ఇట్లాగే నాన్నగారూ, నాన్నగారూ అని తిరుగుతూ ఉండవచ్చునా?

యజమాని · సన్యసించేది మీరుకాదమ్మా, నేను. మీ అపేక్ష వదుల కోవడ మెందుకు? ఎవరు వదులుకోమన్నారు? వదులుకోమంటే మాత్రము వదులుకుంటారా?—సన్యసించేది నే నమ్మా!

పె కూ పోనీ, సరేకాని మీరు మాత్రం మా అందరిమీదా అపేక్ష వదిలి వేస్తారా? ప్రేమ వదలివేస్తే ఒరిగే దేమిటి?

పె అ : ఏమి టలా అర్థం లేకుండా మాట్లాడుతావు? పెద్ద తెలిసినదానికి మల్లే ముందుకు వస్తావు, ప్రతిదానికి!

పె కూ ఏదో తెలుసుకుందామని అడుగుతుంటే, నన్ను ఊరుకోమంటా రేమిటి?

యజమానురాలు . అమ్మా, నువ్వు మీనాన్నే మహ తెలిసినవాళ్ళు కాని, నా మాట విని, ఈ పిచ్చి మాటలు చాలించి ఇవతలకు రా!

యజమాని . అమ్మా, మీ అమ్మ మాటలు వింటున్నావా? మీరంతా అవతలికి వెళితే, నాక దారి తేలికవుతుంది. వెళ్లమ్మా, వెళ్ళు!

పె కూ : అమ్మా, వింటున్నావా, నాన్నగా రనేది? మనమంతా దూరంగా వెళితే ఆయన దారి తేలిక అవుతుందట!

యజమానురాలు . అయితే ఉండు తల్లీ! ఏదో తేల్చుకురా, మీ నాన్న గారితో!

పె కూ : నాన్నగారూ, నాకు అడిగిన దానికి జవాబు చెప్పరేం?

యజమాని : దేనికమ్మా?

పె. కూ : మా అందరిమీదా ప్రేమ కోసేసుకుంటే, మీకు మాత్రము ఒరిగేది ఏమిటి, అని.

యజమాని : నేను ప్రేమ కోసేసుకుంటా నన్నానా?

పె. కూ . మరి అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా అంటే ఏమిటి, ప్రేమ కోసివేయడం కాక?

యజమాని · అందులో ప్రేమకోసివేయడ మేమున్నదమ్మా? ఏమి లేదే. ప్రేమ కోసివేసే వాడికి ఉత్తమ పదం ఎట్లా వస్తుంది?

పె కూ : ఏమండీ, నాన్నగారి మాటలు వింటున్నారా? ఆ శ్లోకాలకు మీరు అట్లా అర్థము చెప్పినారేం?

పె. అ : నువ్వొక ఇడియట్‌వలె ఉన్నావు. మాటల కర్థం నేను చెప్పాను. ఆ మాటలకు నేను అర్థం సరిగా చెప్పినానో లేదో మీ నాన్నగారినే అడుగు పోనీ!

పె కూ ఏమండీ, నాన్నగారూ?

యజమాని అతను మాటలకు సరిగ్గానే అర్థం చెప్పినాడమ్మా!

పె కూ నాన్నగారూ, భగవద్గీతలో ఒకచోట అర్జునుడు శ్రీకృష్ణునితో 'వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే' అన్నట్టుగానే ఎగుడు దిగుడు మాటలతో బుద్ధి భ్రమపెడుతున్నట్టున్నారే.

యజమాని అంతేనమ్మా భ్రమపడేవాళ్లంతా ఇతరులు భ్రమ పెట్టినా రనుకుంటారు!

పె కూ అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా—అనే మాటలలో ప్రేమను కోసి వేయడము లేదా?

యజమాని లేదమ్మా, లేనేలేదు. అసంగమంటే వ్యామోహము మమకారము లేకపోవడము నీమీద నాకు ప్రేమ ఉన్నదే, అది నా కూతురు అని ఉండే ప్రేమ అవుతే సంగము అవుతుంది అట్లాగే మీరంతా నా కొడుకులు, నా కూతుళ్లూ, నా మనవలు, నా మనమరాళ్లూ, నా అల్లుళ్లూ, నా కోడళ్లూ—అని వ్యామోహంతో ఉంటే మమకారమూ సంగమూ అనిపించుకుంటుంది అందులో 'నా' తీసివేసి ప్రేమమాత్రం మిగిలితే అది సంగముకాదు సన్యాసులకు కావలసినది అసంగముకాని ప్రేమ చంపుకోవడము కాదమ్మా—ద్వేషము పెంచుకోవడంకాదు మమ కారంతో కూడిన ప్రేమను పవిత్రంచేసి విశ్వవ్యాప్తం చేయడం. తెలిసిందా?

పె కూ అంతేనంటండి? అయితే మేమంతా మీకు ప్రతిబంధకంగా ఉండడ మెందుకు?

యజమాని అంతేనమ్మా!

పె కూ . (భర్తతో) ఏమండీ, నాన్నగారికి జ్వరపుమాట లంటిరే? (తల్లితో) అమ్మా, నాన్నగారివి పిచ్చిమాట లంటివే?

యజమానురాలు ఏమమ్మా, ఇంతసేపు ఆ పిచ్చిమనిషితో ఆలోచించి ఏం తేల్చావు?

పె కూ : నాన్నగారు సన్యసించడమే మంచిదని.

యజమానురాలు ఇంతసేపూ విచారణచేసి తేల్చిన దిదా? మీ కిద్దరికీ మతి లేదు కాని ఇవతలికి లేచి రామ్మా, తల్లీ!

పె కూ : అమ్మా, నిజం చెబితే నీకు కోపము వస్తుందని, నన్ను చంపుతా వని భయంగాని, నిజం చెప్పాలంటే.......

యజమానురాలు . చెప్పు!

పె. కూ చెప్పేదా? అమ్మా, పూర్వజన్మలో ఎప్పుడో ఏదో పుణ్యం చేసుకున్నావు కాబట్టికాని, లేకపోతేనా, నాన్నగారిని చేసుకోవలసినదానివి కాదమ్మా!

యజమానురాలు మీ నాన్నగారు మహా పుణ్యాత్ములు నేను పాపాత్మురాలిని. మరి నువ్వు మీ నాన్నగారంత పుణ్యాత్మురాలివేగా! మరి ఇంత పాపాత్మురాలి కడుపున నువ్వెట్లా పుట్టావే?

పె. కూ · అమ్మా, ప్రతిదానికీ పెడర్థం తీస్తావు దేనికి? నీవు పాపాత్మురాల వన్నానా నేను! పుణ్యం చేసుకోబట్టే నాన్నగారిని చేసుకున్నా వంటినిగా!

య. రాలు : ఓహో! అంతమాత్రము నా కర్థంకాదా! నీవూ మీ నాన్నగారే నమ్మా, అంతా తెలిసిన పుణ్యాత్ములు!—ఇంతకూ ఆయనకు సన్యాస మిప్పించి దేశంమీద భిక్షలకుపంపిరా అమ్మా!

పె. కూ · నాన్నగారు సన్యసిస్తే, నా ఒంట్లో ఊపిరి ఉన్నన్నాళ్లూ నేనే భిక్ష చేస్తాను!—దేశంమీదికి భిక్షలకు పోనక్కరలేదు.





"వడ్డెర్లు":                    శ్రీ కొండపల్లి శేషగిరిరావు.

యజమానురాలు : నీవు పెట్టే భిక్షా నేను చేసే భిక్షా తింటూండేదానికి సన్యాసము కూడా ఎందుకు?—అదొక వేషమా?

యజమాని నీవు చేసే భిక్ష పనికిరాదు అమ్మాయీ, అల్లుడూ భిక్షచేస్తే పనికి వస్తుంది

రెం. కు మేము చేసే భిక్ష పనికిరాదా?

యజమాని మీదీ పనికి వస్తుంది నాయనా!

యజమానురాలు ఇంతకూ పనికిరానిది నేను! రాజభోగంగా ఇంతమంది అపేక్షతో ఉపచారాలు చేస్తుంటే పనికిరాక భిక్ష కావలెనంటారు!—ఇంతకూ—

యజమాని పస్తాయిస్తా వెందుకు? అనదలచిన దేదో అనేసెయ్యి!

యజమానురాలు : ఇంతకూ ముష్టి బుద్ధులు పోవు, ఏమి చదువుకుంటేనేమి, ఎంత ఉంటేనేమి!

యజమాని నే నెప్పుడూ ముష్టి ఎత్తినవాణ్ణికాదే! మా పెద్దలు కూడా ఎవరూ ముష్టి ఎత్తినవాళ్లు ఎరిగినంతవరకు లేరే! ఏదో ఇంత ఉన్నది తిని ఉన్నంతవరకు ఇంత పెట్టినవాళ్లేనే అంటా!—భిక్షను ముష్టి అనే దానితో నే నెట్లా వేగగలను!

యజమానురాలు నాతో వేగలేరు, ఆ ముష్టి ఎత్తేటప్పుడు తెలిసివస్తుంది!

యజమాని అదుగో యతి భిక్షను ముష్టి అంటే నేను ఊరుకొనేదిలేదు.

యజమానురాలు కాక, మరేమిటి?

యజమాని ఛీ! మళ్లీ అమాటే అంటావు! నేను ఇంటికి ఆహ్వానించి భక్తి శ్రద్ధలతో పూజచేసి భిక్షచేసిన యతీశ్వరులకందరికీ, ముష్టి పెట్టినట్లె లర్పించావా?—ఛీ! రోజూ, పరమేశ్వరికి పెట్టే నైవేద్యము కూడా ముష్టిగానే పెడుతున్నావా?—ఛీ! నీ ముఖం చూడకూడదు! ఫో!

పె కు అమ్మా లోపలికి వెళ్లమ్మా! నాన్నగారికి కోపమువస్తే రక్తపు పోటు ఎక్కువవుతుంది!

యజమానురాలు ఏమీ మాట్లాడేందుకు వీలులేదు నోరు నొక్కుకుని ఉంటాను

మూ కు అమ్మా, నాన్నగారి సంగతి నీకు తెలుసుగా—కోపము తెప్పించ వాకమ్మా!

పె అ మామగారూ, కాస్త శాంతించండి!

యజమాని ఏమిటయ్యా, నీవు యతులకు భిక్షలు చేసిన వాడనేగా ముష్టిగానే చేసినావా?

పె అ నిజమే అనుకోండి!—లోకంలో సామాన్యార్థంలో భిక్షకూ ముష్టికీ భేదము లేదు కనుక, మీరు సన్యసించడ మిష్టములేక అట్లాఅన్నారు. కాని యతి భిక్ష చేసేప్పుడు ఎంత శ్రద్ధగా చేసేవారో మీకు మాత్రము తెలియదా?—శాంతించండి!

యజమాని ఏమిటి, శాంతించేది!—ఈ ఆడజాతి ఉన్నదే, మనిషికి ఎంత అసహ్యం కలిగిస్తుందో నీకు తెలియదు మగవాళ్లే సిగ్గులేక, సన్యసించే ధైర్యాలు లేక, ఈ ఆడజాతికి కట్టుబడి ఉంటున్నారు!

పె అ నిజమే. మీ పెద్దమ్మాయి నన్ను రోజూ చంపుకుతింటున్నది నేనూ మీతోపాటు సన్యసించేదా?

యజమాని . (శాంతించి) ఏమే అమ్మాయి, ఏమంటావు?

పె కూ నాన్నగారూ, నన్నడగడ మెందుకు?—వారికి సన్యసించవలెనని ఉంటే ఈ క్షణము సన్యసించమనండి! నే నింత అడ్డుపెట్టను

పె అ. ఏమండీ! సన్యసించేముందు భార్య అనుమతి కావలెనంటారు నాకు మీ అమ్మాయి అనుమతి వచ్చింది. కాని మీకు అత్తగారు అనుమతి ఇచ్చేట్లు లేరే!

యజమాని . సన్యసించేవాళ్లకు ఈ బోడి అనుమతులు అవసరంలేదు. తల్లి అనుజ్ఞ, భార్య అనుమతి కావలెనని లోకంలో చెప్పుకొనే మాటలు వట్టి బూటకాలు!—వీళ్ల అనుమతులే కావలెనంటే లోకంలో సన్యాసాశ్రమమే ఉండదు

పె అ లోకమంతా, పండితులతో సహా, అట్లా అంటూంటారేమండీ?—అంతా తప్పేనా?

యజమాని అక్షరాలా! వేద శాస్త్ర వచనాలమీద ప్రమాణములేని వాళ్లు చెప్పే మాటలవి! యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్ అని శ్రుతి ఒక చెంప ఉద్ఘోషిస్తూఉంటే, ఈ బోడి అనుమతు లెందుకయ్యా, విరక్తి కలిగిన వాళ్లకు!

పె అ తెలియక అడుగుతున్నాను శ్రీ విద్యారణ్యులు వ్రాసిన శంకర విజయములో శంకరులవారు మాతృఅనుజ్ఞ సంపాదించడానికి, మొసలి పట్టుకోవడము ఇత్యాదులు జరిగినట్లు చేసినారని ఉన్నదిగదండీ?

యజమాని అదేకాదు అక్కరలేని మాతృఅనుజ్ఞకై మోసగించుటకాదు. అందులో ఇంకా చాలా ఉన్నవి పరకాయ ప్రవేశము, రాజపత్నులతో భోగించుట, తల్లికి ప్రేత కర్మాదికము చేయడము, వ్యాస జైమినులను శ్రాద్ధ భోజనమునకు రప్పించుట—ఇంకా ఎన్నో అసందర్భ విషయాలందులో ఉన్నవి శ్రీ విద్యారణ్యులవారివంటి ప్రామాణిక పురుషు లట్టి రచన కావించి ఉండరు

పె అ అయితే సన్యసించదలచినవారికి ఇంకొకరి అనుమతి అవసరము లేదంటారా?

యజమాని నేను కాదు అనేది శ్రుతి అంటున్నది!

పె కూ ఏమండీ, ముందు సన్యసించేది, మీరా మా నాన్నగారా?

పె అ ఇడియట్, ఊరుకో! నీ అనుమతి నాకేమీ అక్కరలేదు నాకు బుద్ధి పుట్టినప్పుడు సన్యసిస్తాను!

యజమాని . బుద్ధి పుట్టినప్పుడుకాదు, నాయనా, విరక్తి పుట్టినప్పుడు. యదహరేవ విరజేత్—

మూ కు . బావా, నీవు సన్యసిస్తావా? నీకు మా అక్కయ్య భిక్ష చేయకూడదు కదా!—మేము భిక్ష చేస్తాములే!

రెం కు మేము కూడా, బావా!

పె కు : మేము కూడా, బావా!

రెం కు మేము కూడా బావా!

మూ కూ నేనూ, బావా!

నా కూ నేనూ, బావా!

నా కు : ఏం బావా! నీవు సన్యసిస్తే వందనము చేయవలెనా?

రెం అ మామగారికి భిక్షచేసేది ఒక పెద్దమ్మాయిగారే ఐతే, అన్నగారికి అంతా భిక్షచేసేవారేనే!

పె కూ ఇంతేనా!—ఈ సంగతి తెలిస్తే మా పెద్దమ్మాయి మాత్రము గంతువేసి చేయదూ?

యజమాని అవును నవ్విన నాపచేనే పండుతుందన్నారు. ఏమో నాయనా నీకే ఆ మహదైశ్వర్యం పట్టుతుందేమో!

పె అ అదే ఆలోచిస్తున్నాను. నేను వద్దన్నా, మీ అమ్మాయి నాకు సన్యాసము బలవంతాన ఇప్పించేట్లు ఉన్నది!

యజమాని నాయనా, సన్యసించే విషయము నవ్వులాటలోకి దింపబోకండి. కొన్ని మహత్తర విషయాలను భక్తి శ్రద్ధలతో ప్రస్తావించవలె. ప్రవ్రజనము అటువంటివాటిలోనిది.





"వడ్డెర్లు"    శ్రీ కొండపల్లి శేషగిరిరావు

యజమానురాలు : అమ్మాయీ, ఊరుకో! ఈ పిచ్చాయనను బాగానే అడుగుతున్నాడు అడగనీ!

పె. అ చెప్పండి. అంతా వింటాము!

యజమాని : మీ అత్తగారే ఉన్నదనుకో! ఆవిడను నేను వివాహము చేసుకుని 50 ఏళ్ళు దాటినది కొడుకులు, కోడళ్ళు, కూతుళ్ళు, అల్లుళ్ళు, మనుమలు, మనుమరాండ్రూ—ఈవిధంగా సంసారము వృద్ధిఐనది. ఒక్కొక్కరు కలిసినకొద్దీ ఒక్కొక్కరకమైన ప్రేమా, దానితో పాటు మమకారమూ వృద్ధి అవుతూ వస్తున్నది—ఊరుకుంటే ఇంకా పెరిగిపోతుంది

పె అ అవును ఇందులో కష్టమేమున్నది?

యజమాని ఒకవిధంగా చూస్తే అదీ మంచిదే సౌభాగ్యమంటే ఇట్లాగే ఉంటుందనుకో!

పె అ అవును.

యజమాని . నాకీ మధ్య జబ్బు చేసినది కద! ఇంకా ఎంతకాలమని జీవించగలను!

పె అ ఏమంత జబ్బు?—ఎంత కాలమైనా జీవించవచ్చు!

యజమాని : ఈ బులిబుచ్చికపు మాటలు కట్టిపెట్టు! మీరంతా ఇప్పుడెందుకు వచ్చారు? నేను శాశ్వతంగా జీవించేవాణ్ణయితే మీ అత్తగారు టెలెగ్రాము లెందుకిప్పించినది? మీరంతా వచ్చి నా జబ్బేమయినా నయము చేశారా?— నీ వన్నట్లు ఎంత కాలమైనా జీవించవచ్చుగాని శాశ్వతంగా జీవించను గదా!

పె అ అవుననుకోండి! రెండో కారణము చెప్పరేమి?

యజమాని నేను చెబుతున్నదే అది. అసంగత్వము తెచ్చుకోవలెనంటే పళ్ళు బిగబట్టి ఎప్పుడో ఒకసారి నిశ్చయం చేసుకోవలె! లేకపోతే ఈ సంగము సంగముగానే ఉండిపోతుంది—అది వదలిన తర్వాత గదా 'తతః పదం తత్పరిమార్గితవ్యమ్' అనేది జరగడము?

పె. అ ఉపాసనాదులవల్ల వైరాగ్యము రావలెగాని దానికి బలవంత మెందుకు?

యజమాని : నీవు కొన్నాళ్ళు సిగరెట్లు కాల్చేవాడివి జ్ఞాపకమున్నది గదా ఆ అభ్యాసము పోగొట్టుకోడానికి నీ వెంత సతమతమైనావో జ్ఞాపకమున్నదా?

పె అ జ్ఞాపకమున్నది అది దురభ్యాసము కాబట్టి దాన్ని పోగొట్టుకోడానికి నెల రోజులు తబ్బిబ్బులైనాను.

యజమాని : అది సరేగదా! వెధవ సిగరెట్లు కాల్చే అభ్యాసము మానడానికి అంత ప్రయత్న మవసరమైతే, యాభైఏళ్ళ పైకాలంనుండీ క్షణక్షణమూ బహుముఖాలుగా వృద్ధి పొందుతూ అల్లుకొన్న ఈ మమకారము దానంతట అది జారిపోతుందా?

పె. అ : జారి పోకపోతే బలవంత బ్రాహ్మణార్థ మెందుకు, అంటాను. సుఖముగా ఇట్లాగే కాలక్షేపము చేయవచ్చుగా!

యజమాని మనము కూడా ప్రయత్నము చేయకపోతే ఫలితము 'పునరపి జననం పునరపి మరణమ్'.

పె అ . ఈ సంసారము వ్రణమువలె మిమ్మేమైనా బాధపెడుతున్నదా కోసివేయడానికి?

యజమాని . ఈ వ్రణ మున్నదే పెరుగుతున్నకొద్దీ చక్కిలిగింతలుపెట్టి సంతోషము కలిగిస్తుంది. భగవద్గీత ఉన్నదే, వట్టి నీతులూ నిషేధాలూ చెప్పే గ్రంథం కాదు అనుభవానికి ఉపయోగించే గ్రంథము! అందుకనే అది వృక్షముతో పోల్చి, దృఢమైన శస్త్రముతో నరికి వేయమంటున్నది గీతాకారునికి నీబోటివాళ్ళ సందేహాలు ముందుగ తెలుసును కాబట్టే తెగింపు చేయమని ఉద్బోధిస్తున్నాడు—పురుషోత్తమ ప్రాప్తియోగము రోజూ ఎన్నిసార్లు పారాయణ చేసినా ప్రయోజనము లేదోయి!—వ్యాధి కుదరవలెనంటే ఔషధము సేవిస్తే కుదురుతుందా, లేక అది చేతులో పెట్టుకొని ఔషధము ఔషధము అని రాత్రింబవళ్ళూ జపంచేసుకుంటూ ఉంటే వ్యాధి నయమవుతుందా? ఇప్పుడు గీతార్థము బోధపడ్డదా?

పె. అ నాకూ తెలియక కాదు అంటున్నది. నిజమే నాకు ఒక సందేహము మనస్సులో ఉండి ఈవిధంగా డొంక తిరుగుడుగా అన్నాను

పె. కు : అక్కయ్యా, ఇంతకూ బావా నాన్నగారూ ఏకాభిప్రాయానికి వస్తున్నట్లున్నారు

మూ. కు నీవూ సన్యసించడమే కర్తవ్యమంటావా?

పె. అ : నే ననడం కాదు పురుషోత్తమ ప్రాప్తియోగములో శ్రీ కృష్ణభగవానుని వాక్యాలనుగూర్చి మాట్లాడుతున్నాము.

మూ కు ఏమన్నాడు?

పె. అ మరి విను తెలియడానికి పెద్ద సంస్కృత భాషాజ్ఞానము అక్కరలేదు.

నిర్మానమోహా జిత సంగదోషా
అధ్యాత్మ నిత్యా వినివృత్త కామాః,
ద్వంద్వై ర్విముక్తా స్సుఖ దుఃఖ సంజ్ఞైః
గచ్ఛం త్యమూఢాః పద మవ్యయం తత్.

అసంగ శస్త్రముతో సంసార వృక్షాన్ని ఛేదించి ఆపైన వెదకగా ప్రాప్తమయ్యే పదమది!—గీత చెప్పేది అంతే అందులో సందేహము లేదు.

రెం. కు : నేనూ రోజూ పారాయణ చేస్తున్న ఈ అధ్యాయములో ఉన్నది ఇంతకూ సన్యాసమా?

పె. అ సన్యాసము కాదు సన్యసించిన తర్వాత బాగా వెదకగా ఎప్పటికో సిద్ధించే పదము!

రెం కు గీతాధ్యాయాలలో చిన్నదనీ—20 శ్లోకాలే ఉన్నది గదా!- అంతామంచి దంటారనీ నేనూ పారాయణ చేస్తున్నాను

యజమాని మా మామగారూ పారాయణ చేసేవాడు మీ అమ్మకు నీమీద అందుకనే ఎక్కువ పక్షపాతమేమో! మా మామగారివే ఈ జన్మ ఎత్తినావేమో!

మూ. కు : ఆ అధ్యాయము అంత గొప్పదా?

పె. అ : గొప్పదే సందేహములేదు చివరి శ్లోకానికి శంకర భగవత్పాదులు భాష్యము వ్రాస్తూ, ఈ అధ్యాయములో సంక్షేపముగా కేవల గీతాశాస్త్రమేకాక, 'కింతు సర్వశ్చ వేదార్థ ఇహ పరి సమాప్తః' అంటూ ఇది సరిగా తెలుసుకున్నవాడే బుద్ధిమంతుడూ కృతకృత్యుడూ అని సెలవిచ్చారు!

యజమాని ఇంతకూ నీవు నీ సందేహమేదో అడగక పోతివి! ఏమిటది?

పె. అ . ఏమీలేదు. ఆ—ఏమీలేదు మీకు ఎంత అసంగము సాధించవలెనని కోరిక ఉన్నా, మీకు మా అందరిమీదా ఎంత మమకారమున్నదో నాకు తెలుసు. మా మీదనే కాదు.

యజమాని : మరి?

పె అ మీరు వ్రాసిన గ్రంథాలమీద కూడాను.

యజమాని : అవును, నా రచనలలో లోపాలు చూపినవాళ్ళమీద ఎప్పుడైనా కోపించానా? కాని మంచి భాగాలను వికృతంగా ప్రదర్శించి కువిమర్శలు చేసినవాళ్ళను నోటికి వచ్చినట్లు తిట్టేవాణ్ణి. నిజమే కోపము

యజమాని : శ్రద్ధగా ప్రయత్నించి కూడా సిద్ధి పొందలేనివాడు యోగ భ్రష్టు డనబడుతాడంటూ, అట్టి యోగ భ్రష్టుడై ఛిన్నాభ్రమువలె నాశనము పొందడని, ఉత్తమ లోకాలలో సుఖించి ఉత్తమ జన్మ ఎత్తి ఆ పైన,

పూర్వాభ్యాసేన తేనైవ
హ్రియతే హ్యవశో పిసః
జిజ్ఞాసు రపి యోగస్య
శబ్ద బ్రహ్మాతివర్తతే

అనేక జన్మ సంసిద్ధ
స్తతోయాతి పరాం గతిం
పార్థ నైవేహ నాముత్ర
వినాశ స్తస్య విద్యతే

నహి కల్యాణ కృ త్కశ్చి
ద్దుర్గతిం తాత గచ్ఛతి"

అనే భగవాను డభయ మిచ్చినాడమ్మా!

పె కూ అయితే అమ్మా, నీవు నాన్నగారి సన్యాసానికి అడ్డపడడము మంచిది కాదనుకుంటానే!

పె అ : నాకూ అదే తోస్తున్నది

పె కు నాన్నగారికి ఇంత పెద్ద వయస్సులో కలిగిన ఈ కోరికకు మనమంతా మనస్ఫూర్తిగా తోడు పడడము మంచిదనుకుంటాను

రెం కు నాకూ అదే తోస్తున్నది

మూ కు అంతా సరేనంటే నాదే మున్నది? నే నీ మధ్య వ్రాసిన నవల చదివి దిద్దుతా ననుకున్నాను

యజమాని ఇప్పుడు మాత్రము దాని కభ్యంతర మేముంటుంది! కొడుకులూ కోడళ్ళూ, కూతుళ్ళూ, అల్లుళ్ళూ ఎవరు భిక్ష చేసినా చేస్తూ సుఖంగా భగవద్ధ్యానముతో కాలము గడపవచ్చు!

పెద్దకోడలు అందుకు అత్తగారు మాత్రము కాదంటారా?

రెండవ, మూడవ కోడళ్ళు : ఎందుకంటారు?

కూతుళ్ళు అందరు : నాన్నగారు నాస్తికులుగా ఉంటే భగవద్భక్తి కలిగించినది మొదలు అమ్మే! అమ్మ ఎందుకు కాదంటుంది?

రెం అ అత్తగారికన్న భక్తి ఎవరికీ లేదు.

నా కు అమ్మా, ఏమంటావు నీవు?

యజమానురాలు అంతా ఆయనకు ఏదో మహదైశ్వర్యం కావలెనంటే, నే నెందుకు అడ్డుపడవలె, అడ్డుపడ్డా ఆగుతుంది గనుకనా?

యజమాని : అబ్బా! నా మనస్సు ఎంత తేలికపడ్డది. మీరంతా ఏకగ్రీవంగా ఒప్పుకుంటే!

పె కు . నాన్నగారూ, సన్యాసానికిముందు ఏమి చేయవలె?

యజమాని : నాయనా, దానికి చాలా తతంగ మున్నది నీవూ, మీ పెద్దబావా వెళ్లి మన యాజ్ఞికులను పిలుచుకొని రండి! ఆయనవల్ల ఈ తతంగ మవుతుందో, మరి ఒకరిని పిలవవలెనో కనుక్కుందాము ఆయనవల్ల నవుతే, ఏమేమి సంభారాలు కావలెనో జాబితా వ్రాయించి సిద్ధము చేయండి. బీరువాలో వెయ్యి రూపాయలున్నవి, మొన్ననే నా నవలకు రాయల్టీక్రింద పంపించారు—రేపు నేనూ మీ పెద్దబావా కలసి వెళ్ళి గురుస్వాములవారి చెవినివేసి వారి అనుజ్ఞ తీసుకొంటాను—ఈ సన్యాస ప్రక్రియయైన తర్వాత ప్రణవోపదేశానికి వారి పాదాలు ఆశ్రయించవలె!

పె. కు . అట్లాగే నాన్నగారూ! బీరువాలో పైక మక్కరలేదు. నా దగ్గర ఐదు వందలు ఉన్నవి.

రెం. కు: నేనూ ఐదువందలు తెచ్చాను

మూ కు : నా వద్దనూ వెయ్యి రూపాయ లున్నవి.

పె. అ : మీ పెద్దమ్మాయి కూడా ఆరువందలు తెచ్చినది పైకానికి లోంచర లేదు.

యజమాని కాబట్టి అవిడగారు టెలిగ్రాములు ఇప్పించినది కనుక నాకో హెచ్చు తగ్గువస్తే ఖర్చులకందరూ సిద్ధపడి వచ్చారన్నమాట!—సొంత డబ్బులా, అప్పులా?

మూ కు అదంతా మీ కెందుకు? కావలసినది ఖర్చు చేయండి

రెం కు కొంత జీతము, కొంత అప్పు. ఏదయితే మాత్ర మేమి?

పె కు : నేను అప్పు చేయలేదండీ!

పె కూ . మా పెద్దల్లుడికి అప్పనేది లేకుండా ఉండదు బట్టలకొట్లో అడిగి చేబదులు తెచ్చాను.

యజమాని : మహా బాగున్నది! ఇట్లా అప్పులు చేస్తూవుంటే మీ రెట్లా కాపురాలు చేస్తారమ్మా తల్లీ!

పె కూ ఇప్పుడు చేయుడము లేదా?—ఇట్లాగే

యజమానురాలు మీరు అప్పులు చెసిన పైకా లెందుకురా! ఇంట్లో బీరువాలో పైక మున్నది గదా! అదే ఖర్చులకు వాడండి!

పె కూ చూచావా మా అమ్మకున్న నెతుంటారితనము మాన కవరికీ లేదు.

యజమానురాలు ఇప్పటివరకు వారు కొడుకుల సంపాదనమీద ఏమాత్రము ఆధారపడలేదు వారి పుస్తకాలమీద వచ్చే డబ్బు నాకు సరిపోకపోదు ఈ కాస్త భాగ్యానికి మీ అందరి డబ్బులూ ఎందుకు? ఇంట్లో బీరువాలో డబ్బే ఖర్చులకు వాడండి!—ఇదుగోరా పెద్దవాడా, తీసుకో!

పె కూ ఇప్పుడు డబ్బెందుకమ్మా? యాజ్ఞికులతో మాట్లాడి వచ్చిన తర్వాత గదా!—నాన్నగారూ యాజ్ఞికులను పిలుచుకొని వస్తాము.

పె అ : వెళ్లి పిలుచుకొని వస్తాము.

యజమాని : మంచిది సాయంకాలము రమ్మనమనండి. అప్పుడయితే తీరికగా మాట్లాడవచ్చు!

పె అ . అట్లాగే!

(పెద్ద కుమారుడూ, పెద్ద అల్లుడూ బయులుదేరి వాకిటి దాకా వెడతారు)

యజమాని నాయనా!—

పె కూ : (బిగ్గరగా) నాన్నగారు ఎందుకో పిలుస్తున్నారు!

పె కు : ఏమి నాన్నగారూ?

పె అ ఏమన్నా చెప్పవలసిన దున్నదా?

యజమాని : అదికాదు. మీరంతా ఇట్లా అప్పులు చేస్తూ ఉంటే ఎట్లాగా అని ఆలోచిస్తున్నాను

పె అ : ఆ ఆలోచనలు కట్టిపెట్టి మీరు శాంతంగా ఉండండి!

మూ. కు : వాళ్ళు వచ్చేలోగా నా నవల చూస్తూ ఉండండి.

యజమాని : నీవు తెచ్చిన వెయ్యిలో అప్పెంత?

మూ. కు . ఎనిమిది వందలే.

యజమాని . నీదో?

రెం. కు · మూడు వందలు అప్పు.

యజమాని . ఇట్లా అయితే ఎట్లా నాయనా? నా సంపాదన లేకపోతే మీ రేమైపోతారు? ఎంత అవస్థపడతారు? మీ అమ్మ నెట్లా పోషిస్తారురా? నాకు భిక్ష లెట్లా చేస్తారురా?

పె. అ : అవన్నీ మీరు పటించుకోబోకండి!

యజమాని . అదే చూస్తూ ఎట్లా పట్టించుకోకుండా ఉండగలను!

పె. అ : ఏమిటి ఆలోచిస్తున్నారు!

యజమాని · అదే! నీవు ఆరూఢపతితుల సంగతి ప్రస్తావించావు గదా! దాని సంగతే!

పె అ : యోగభ్రష్టుడు ఆరూఢపతితుడు కాదంటిరిగా.

యజమాని : అదే ఆలోచిస్తున్నాను. నిజమే. కాని మీరంతా ఇట్లా అప్పులు చేశారని తెలిసినంతనే ఎట్లా బాగుపడతారు, వాళ్ళ అమ్మను ఎట్లా పోషిస్తారు, అని ఆదుర్దాపడితినే! నావంటివానికి ఏషణత్రయము వదుల తుందా అని సందేహం కలిగినదోయి. అదిగాక మూడోవాడు తన నవల దిద్ది పెట్టమనేప్పటికి, నేనీమధ్య వ్రాస్తున్న శాతవాహనుల కాలపు నవల పూర్తి చేతామా అనే ఉబలాటం కలిగింది అది చూదామా అంటే, శాలివాహనుని గాథాసప్తశతి ఆధారంగా వ్రాస్తున్న కేవల శృంగారమయమైన సరికొత్త నవల!—ఏం జేసేది!

పె. అ : అయితే పూర్వకాలపువాళ్ళ ఏషణత్రయమే ఆలోచిస్తే, మీకు నాలుగవది నవలైషణ అనండీ పెద్ద అంటారా?

పె. కోడలు . దాన్ని కావ్యైషణ అంటే బాగుంటుందేమో!

యజమాని : బాగా అన్నావు తల్లీ!

(బయటినుండి పోస్టు అని కేక).

యజమాని · ఉత్తరాలు ఎక్కడినుంచిరా?

పె కు : ఒక్కటే ఉత్తరం, పెదనాన్న వ్రాశాడు. ఇదుగో!

యజమాని : (ఆనందం విరిసిన దేహంతో) చదువు నాయనా, చూచారురా పెద్దనాన్నకు స్వయంగా కర్మలు ఆచరించడంలో శ్రద్ధ లేకపోయినా, ఏమి వ్రాశాడో! 'తమ్ముడా, నీవు కర్మిష్ఠివి నీవు సోమయాగం చేస్తే బాగుంటుంది' అని వ్రాసి, తాను దగ్గర ఉండి అంతా సక్రమంగా జరిగేట్టు చూస్తానన్నాడు.

పె అ : మీరు యజ్ఞము చేయదలిస్తే మేము తెచ్చిన డబ్బంతా యజ్ఞ దక్షిణగా తీసుకోండి!

పె కుమారుడు · నాన్నగారూ, డబ్బు కేమిగాని, ఈ అస్వస్థతతో యజ్ఞ దీక్ష శ్రమకు తట్టుకోగలరా?

(అంతా సందడి డాక్టరుగారు వచ్చారు అంటూ. డాక్టరు వచ్చి యజమాని పక్కవద్ద కుర్చీలో కూర్చుంటూ)

డాక్టరు : మీరంతా ఎప్పుడు వచ్చారయ్యా? విశేష మేమిటి?

(అందరూ ఒకరి ముఖాలు, ఒకరు చూచుకుంటారు. కొంచెము నిశ్శబ్దము తర్వాత)

పె. అల్లుడు · మామగారిని చూడడానికి వచ్చాము జబ్బు చేసినదని.

డాక్టరు : మీ మామగారికి జబ్బు చేసినదా, నాకు తెలియకుండా?

(అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకుంటారు)

పె. కు · ఈమధ్య జబ్బు చేసినప్పుడు మీరుకాదా చూచినది!

డాక్టరు : మీ నాన్నగారికి జబ్బా? ఒకపూట కళ్ళు తిరిగినట్లున్నదన్నారు బ్లడ్ ప్రెషరు చూచాను. ఏమీలేదని చెప్పినానే!

యజమానురాలు · మీరు మేము అధైర్యపడతామని చెప్పక దాచినారని నేనే పిల్లలను రమ్మని వైర్లు ఇప్పించాను లెండి. ఆరోజు వారు పైత్యంతో ఎంత బాధపడ్డారో చూచారుగా!

డాక్టరు · బాగున్నది. మీ కిద్దరికీ పిల్లలను చూడవలెననిపించి ఈ వంక పెట్టి టెలిగ్రాములు ఇప్పించి అందరినీ గాభరగా రప్పించారన్న మాట!

పె అ : గాభరా ఏమిటిలెండి, పెద్దలు గదా!—ఇప్పుడు యజ్ఞము చేయవలెనని ఆలోచిస్తున్నారు.

పె. కు · డాక్టరుగారూ, మీరు చెప్పండి యజ్ఞదీక్షకు నాన్నగారు ఈ స్థితిలో తట్టుకోగలరా? పది పదకొండు రోజులు నియమము పాటించవలె!

డాక్టరు . మీకు నిజంగా యజ్ఞము చేయవలెననే ఉన్నదా?

యజమాని : బ్రాహ్మణుడైనవాడు సోమయాగము తప్పక చేసి తీరవలసినదే. లేకపోతే దౌర్బ్రాహ్మణ్యము వచ్చే అవకాశమున్నది.

డాక్టరు · అయితే చేయండి. మే మెప్పుడూ యజ్ఞం చూడలేదు. ఈవిధంగానైనా చూస్తాము

పె. కుమారుడు నాన్నగారు ఈ స్థితిలో శ్రమకు తట్టుకోగలరా?

డాక్టరు దివ్యంగా. యజమాని చేసేది చాలా తక్కువటగా! అంతా ఋత్విక్కులూ అధ్వర్యుడే చేస్తారుటగా!

యజమాని · అవును మీ రిట్లా వచ్చారు విశేషం?

డాక్టరు · మీ వీధిలోనే ఏమీ లాభములేని కేసు చూడడానికి రమ్మని ప్రాణం తీశారు. నేను పొద్దున్నే చూచాను లాభము లేదంటే వేధించారు. డబ్బు కలవాళ్ళు. వదిలించుకుందామని రు. 500 లు ఇస్తేకాని రానన్నాను. వెంటనే రు 500 ఇచ్చారు ఇక తప్పనిసరి అయి బయలు దేరివచ్చాను. ఇంకో గంటకంటె జీవించడు. వచ్చానుగాని అన్యాయంగా రు 500 లు తీసుకున్నానే అని కాన్షన్సు పీకుతున్నది—ఆ! మీరు చేసే యజ్ఞానికి యజ్ఞ భిక్షగా తీసుకోండి. ఇదుగో నోయి! (డాక్టరు డబ్బు ఇస్తూఉంటే పెద్ద కుమారుడు పుచ్చుకోడానికి తటపటాయిస్తుంటాడు. )

యజమాని · నాయనా, తీసుకో. యజ్ఞ భిక్ష ఇస్తానంటే నిరాకరించవద్దు. అది ముడుపుగా కట్టి ఉంచు!

డాక్టరు . అబ్బా, బరువు తీరింది. వస్తా!

(అంతా డాక్టరును పంపి వస్తారు.)

పె అ : దీన్ని యజ్ఞైషణ అందామా?

పె. కోడలు : కర్మైషణ, ధర్మైషణ అంటే బాగుంటుందేమో!

యజమాని . బాగా అన్నావు తల్లీ, నూరేళ్ళు సుఖంగా వర్ధిల్లు!

పె. అల్లుడు: అయితే యాజ్ఞికుడివద్దకు సన్యాస ప్రక్రియకు వెళ్ళనక్కరలేదుగా.

యజమాని : అక్కరలేదు. యజ్ఞ ప్రక్రియకు ఆయన చాలడు

రెం. కూ : నేను చెప్పలా? నాన్నగారు మనల నందరినీ ఆట పట్టించడానికి వచ్చులు కంటున్నారని!— ఎంత నాటక మాడినారండీ నాన్నగారూ!

రెం. అల్లుడు, నేను చెప్పలా? మామగారు ఎప్పుడూ హాస్యమే! (తెర)

## సాహిత్య వేదిక:

# వర్తమాన సాహిత్యం - పోకడలు

*శ్రీ కుందుర్తి ఆంజనేయులు

వర్తమాన సాహిత్యమంటే ఒక అర్థంలో వీరేశలింగం, గిడుగు, గురజాడ ప్రభృతుల రచనల నుండి నేటివరకు ప్రవర్ధమానమవుతున్న సాహిత్యం. మరొక అర్థంలో కవితకు సంబంధించినంతవరకు శ్రీ శ్రీ నుండి నేటివరకు వస్తున్న సాహిత్యం. సాహిత్య ప్రక్రియలకు సామాజిక శ్రేయఃపరమైన ప్రయోజనం వున్నదనే అభిప్రాయం ఏర్పడినప్పటి నుండి ఆధునిక యుగమని మనం వ్యవహరిస్తున్నాం. కవితారంగంలో యిది స్పష్టంగా గోచరమై తన విశ్వరూప ప్రదర్శనం చేసినది శ్రీ శ్రీ కవితలో కాబట్టి అక్కడ నుండి శ్రీ శ్రీ యుగంగా వ్యవహరించబడుతున్నది. సుమారుగా గత 30 సంవత్సరాల కాలంలో అభివృద్ధి అవుతూ పూర్వపు కవితా ప్రమాణాలనూ, నిర్వచనాలనూ, సిద్ధాంతాలనూ ఒక్క తోపు తోసి, పునాదులనే కదిలిస్తున్నదా అనే అనుమానం కలిగేటంతగా శ్రీ శ్రీ యుగంలో కవితా విజృంభణ జరిగింది. దీని బాగోగులనుగురించి అసంఖ్యాకంగా వాదోపవాదాలు జరిగినవి. సమర్థనలు, ఖండనలతో సాహిత్య లోకంలో కనీ వినీ ఎరుగనంత సంచలనం కలిగింది. ఏదైనా ఒక నూతన సృష్టి, ఎంత చేవ గలిగినదైతే, దానికి అంత ఎక్కువగా వ్యతిరేకత వస్తుంది. యిది సృష్టిధర్మం. చేవలేని దానిని గురించి జనం పట్టించుకోరు కాబట్టి దానిపై అంతగా చర్చ జరుగదు. అది ఎలా పుట్టిందో అలాగే పోతుంది. శ్రీ శ్రీ యుగంలోని కవిత్వం జవసత్వాలు కలిగినది కాబట్టి దాన్ని గురించి అంత చర్చ జరిగింది. అది స్వల్ప కాలంలోనే స్థిరపడి పోవడానికి కూడా యిదే దోహదం చేసింది

ఆధునిక యుగంలోని సాహిత్యానికంతకూ ప్రధాన లక్షణం విశ్వశ్రేయశ్చైతన్యం. విశ్వశ్రేయోభావన పూర్వులు చెప్పినది కాదా అంటే చెప్పినదే. ఏ యుగంలోనైనా నూటికి నూరుపాళ్ళు క్రొత్త అంటూ ఏదీ పుట్టదు. క్రొత్త అని చెప్పబడిన దాని బీజాలు పూర్వకాలంలో వుండనే వుంటాయి. అయితే విస్మరింపబడిన కొన్ని విలువలకు మళ్ళీ ప్రాణం పోయడం జరుగుతుంది. అవి క్రొత్త క్రొత్త భావాలుగా భాసిస్తాయి. అదేవిధంగా ప్రబంధ యుగం నుండి క్రమంగా గాడి తప్పి సామాజిక చైతన్యం మృగ్యమై, సమాజంలోని ఉన్నత వర్గాల వారి కాలక్షేపానికీ, పండిత ప్రకాండుల అవగాహనకు మాత్రమే పరిమితమై పోయిన కవిత్వం ఆధునిక యుగంలో, ప్రజలనేవారు కొందరున్నారనీ, వారి శ్రేయస్సు అన్నింటి కంటే ముఖ్యమైనదనీ, వారిని ఉత్తేజపరచడం మానవ సమాజ పురోగమనానికి అవసరమనీ, అది తన ధర్మమనీ గుర్తించింది. ఇదే కాలంలో "గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్" అనే సంప్రదాయానికి చెందిన కవులు లేకపోలేదు. వారి రచనలూ వస్తూనే వున్నాయి. వారికి దేశ కాల పాత్రాదులతోగానీ, సమకాలీన సమాజ పరిస్థితులతో గానీ, కళలు నిర్వహించవలసిన చారిత్రిక కర్తవ్యాలతో గానీ సంబంధం లేదు. వీటన్నిటికీ అతీతమైన శాశ్వత విలువలు కొన్ని ఉన్నాయనీ, ఆ ధోరణిలో రాసిన రచనలే నిలుస్తాయనీ వారు నమ్ముతారు. ఒక విధంగా పూర్వులు చెప్పిన అనేక విషయాలను విశాల దృష్టితో అవగాహన చేసుకోకుండా, సంకుచితంగా అర్థం చేసుకున్నందువల్ల కలిగిన విశ్వాసాలతో వారు కావ్య నిర్మాణం చేస్తుంటారు. అటువంటి కావ్యాలు ఎన్ని వచ్చినా, ఏ కాలంలోనైనా ప్రజలు అభిమాన దురభిమానాలకు లోను కాకుండా ఆలోచిస్తారు కాబట్టి విప్లవ భావాలనే ఆదరించి అనుసరిస్తారు. ఆధునిక యుగంలో కూడా అదే జరిగింది. సాహిత్య రంగంలోనే కాదు ఏ రంగంలోనైనా ప్రగతికి మూలకారణం యీ ప్రజాభిమానమే,

కావ్య వస్తువుకు సంబంధించినంతవరకూ యీ కొత్త కవిత్వంలో సామాన్య ప్రజల సమస్యలకు అగ్రపీఠం లభించింది. స్థూలంగా చూస్తే యీ యుగంలో అభ్యుదయ కవిత్వం, వచన కవిత్వం, యిటీవలి దిగంబర కవిత్వం అనే మూడు పేర్లు ప్రముఖంగా వినవచ్చాయి. ఈ మూడింటిలోనూ నాకు తెలిసినంతవరకు కావ్య ప్రయోజనం, లక్ష్యం ఒకటే. ప్రస్తుత సమాజాన్ని గురించి అసంతృప్తి, యీ నాటి వ్యవస్థపై తిరుగుబాటు, కొత్త సామాజిక వ్యవస్థ కోసం ఆకాంక్ష, దాని రూపు రేఖలు తీర్చిదిద్దాలనే ప్రయత్నం ఆధునిక కవిత్వానికి పునాది. అయితే అభ్యుదయ కవిత్వపు దశలో వున్నంత లక్ష్యశుద్ధి వచన కవితా వికాస కాలంలో లేకపోవడం, అంటే ఆ లక్ష్యానికి చాలా దూరంలో వుండే కావ్య వస్తువులను కూడా కవితలో నిబంధించడం జరిగింది. అలాగే దిగంబరకవులు తమది అభ్యుదయ కవిత్వపు లక్ష్యమే అని చెప్పడానికి ఇంకా సంకోచిస్తున్నట్లు కనిపిస్తుంది. తమది వేరైన లక్ష్యంగా నిర్వహించడానికి ప్రయత్నిస్తున్నారు. సూక్ష్మ విభేదాలు ఏవైనా వున్నా యివన్నీ ఒకే పునాదిని ఆశ్రయించుకుని వున్నవనే విషయం మాత్రం నిర్వివాదం

ఆధునిక కాలంలోని అనేక నూతన పరిస్థితుల వల్ల కావ్య వస్తువు పరిధి చాలా విశాలమైంది. ప్రతి కవిలోనూ అంతర్జాతీయ భావనా చైతన్యం కట్టలు త్రెంచుకుని ప్రవహించింది. పూర్వ కాలంలోనైతే కవుల అవగాహనకు అందని అనేక వస్తువులకు, సంఘటనలకు కావ్య గౌరవం లభించింది. మానవ జాతి అంతా ఒకటేననే సౌభ్రాతృత్వ భావన బాగా పైకి వచ్చింది. ఏ మారుమూల దేశంలోనో, ఏ సామాన్య వ్యక్తికో ఒక చిన్న అన్యాయం జరిగితే, దానికి తెలుగుకవి హృదయం స్పందించడం మొదలు పెట్టింది. మార్క్సిజం, సోషలిస్టు భావాలలోని మానవ కారుణ్యవాదం తెలుగు కవులను యీ యుగంలో బాగా ఆకర్షించింది. ప్రస్తుత సమాజ వ్యవస్థలోని అనేక లోటుపాట్లవలన వ్యక్తులకు కలిగే అన్యాయాలను ఎలుగెత్తి ఖండించడం, వారిలో వాటిని గురించిన చైతన్యం కలుగజేసి వారు తిరుగుబాటు చేసేవిధంగా పురికొల్పడం కవిత్వం యీ యుగంలో తన కర్తవ్యంగా భావించింది. అందుకే ఆధునిక తెలుగు కవిత్వంలో అనేక చోట్ల కవితా పరిధి, రాజకీయ పరిధి కలిసిపోయినట్లుగా కనిపిస్తూ పూర్వ విధా సంప్రదాయ వాదులకు అదొక వింతగా తోచింది. కాని కవులు మాత్రం తాము వర్తమాన రాజకీయ భావాలకూ, సాంఘిక సాంస్కృతిక వాతావరణానికీ దూరంగా వుండి రచనలు చేయలేమని ఆచరణ రీత్యా గట్టిగా వాదించి చెప్పారు. పైగా సమకాలీన సమాజ పరిస్థితులకు స్పందించలేక పోవడం హృదయం వున్న కవుల లక్షణం కాదని వాదించారు. సమకాలీన పరిస్థితులకు కూడా శాశ్వత సాహిత్య విలువలు కల్పిస్తామని కంకణం కట్టుకుని సాధన చేశారు. అంటే కావ్య వస్తువుకు సంబంధించి గురజాడ, వీరేశలింగం ప్రభృతులు చూపిన మార్గం యీ యుగంలో బాగా స్థిరపడి పోయింది

ఏ యుగంలోనైనా ప్రధానంగా ప్రచారం అవుతూవుండే యుగధర్మం ఒకటి వుంటుంది. అధిక సంఖ్యాకులైన కవులు దానిని గుర్తించి రాస్తుంటారు.

కాబట్టి ఏమి రాయాలి అనే సమస్య దానివల్ల చాలాభాగం పరిష్కారం అవుతుంది. మిగిలినది ఎలా రాయాలి అనే విషయం కవిత్వరంగంలో యిది చాలా గడ్డు సమస్య ఆలంకారిక శాస్త్ర చర్చలన్నీ దీనికోసమే జరిగాయి అయితే సూక్ష్మంగా చూడ గలిగితే దీనికి శాశ్వత పరిష్కారం అంటూ లేదనీ, ఏది చెప్పబడుతున్నదో అదే తన వ్యక్తీకరణ రూపాలను సృష్టించుకుంటుందనీ తెలుస్తుంది ఉదాహరణకు భారతం రాసిన రోజుల్లో ధర్మ ప్రచారం బాహాటంగా, స్పష్టంగా చేయవలసిన ఆవశ్యకత చారిత్రకంగా ఏర్పడింది కాబట్టి సూటిగా ప్రజలకు అంద గల విధంగా పురాణ కథాకథన పద్ధతిలో రచన నడిచింది అలాగే శివకవుల యుగంలో కూడా ధర్మ ప్రచారం అధిక ప్రాధాన్యం పొందింది ప్రబంధయుగం వచ్చేసరికి పై వర్గాల కాలక్షేపానికీ, తీరిగ్గా కూచుని చదువుకోడానికీ వీలైన గూఢపద్ధతి ప్రాచుర్యం వహించింది రాచకార్యాల కంటే ద్వ్యర్థికావ్యాల పఠనానికి రాజదర్బారుల్లో ఎక్కువ కాలం వినియోగించే అవకాశం ఆనాడు వున్నది విశ్రాంతి పుష్కలంగా వున్న రోజులు కనుక ఆవిధమైన శైలులు, కవితారీతులు ఏర్పడి వుంటాయి ఆధునిక కాలం వేగవంతమైన కాలం, చైతన్యవంతమైన కాలం; శుష్కకవిత్వాలతో కాలహరణం చేయడానికి మనకు తీరిక లేదు కాగా అభ్యుదయ కవితా యుగంలో మళ్లీ ధర్మ ప్రబోధన పద్ధతి ప్రారంభమైంది దానికి శివకవుల వంటి ఆవేశం తోడైంది ధర్మారంభకాలమైన ఆ రోజుల్లో అంతటి ఆవేశం అవసరమే ననిపించింది ప్రజల దృష్టిని తన వైపు మళ్లించుకోడానికి కవిత్వం ఆవేశ వర్షాధారలుగా ఆవిర్భవించింది ఒక ఆలోచనకుగానీ, ఒక అలంకారానికిగానీ ఒక వర్ణనకుగానీ వ్యవధి లేకుండా ఆనాటి అభ్యుదయ కవిత్వం కుండపోతగా అభ్యుదయ భావాలను క్రుమ్మరించింది సంప్రదాయ ఛందస్సులలో ఆధునిక కాలానుగుణమైన భావ సముదయాన్ని వ్యక్తీకరించడం సాధ్యంకాదని గుర్తించిన కవులు ఆవేశ వర్షం కురిపించడానికి అనువైన రీతిగా మాత్రాఛందస్సులను మలచుకొని, పద్య కవితకు బంధమైన కావ్యభాషా సంస్కారాన్ని కూడా పూర్తిగా వదలకుండానే ప్రగతివాద కవితా విజృంభణకు పునాదులు వేశారు ఇది శ్రీశ్రీ వాడుకున్న మాత్రాఛందస్సుల పరిస్థితి కావ్యభాషా సంస్కారం పూర్తిగా జీర్ణించుకున్నవి కావడంచేత శ్రీశ్రీ గేయాలకు నాటి సాహిత్యవేత్తల ఆదరం సులభంగా లభించింది కాని రానురాను శ్రీశ్రీ అనంతర అభ్యుదయ కవులు యీ కావ్య భాషా ప్రాబల్యాన్ని క్రమేణా తగ్గించివేశారు శ్రీశ్రీకి వున్నంతగా కావ్య భాషా పరిచయం వీరికి లేక అలా జరిగిందని కొందరు వ్యాఖ్యానిస్తారు కాని అది తప్పు. నిజానికి జరిగినదేమంటే కావ్య భాషఎట్ల క్రమంగా మోజు తగ్గింది కృత్రిమమై సంస్కృత పదభూయిష్ఠము, సంప్రదాయ భావ, కవి సమయ ప్రాబల్యము గల కావ్య భాషకంటే, సూటిగా హృదయాన్ని అందుకోడానికి వ్యవహారిక భాష పనికి వస్తుందనే భావం బాగా వ్యాపించినందువల్లనే యిది జరిగింది పైగా ఛందోబంధాల పట్ల గల మోజు శ్రీ శ్రీ కాలంలో కంటే తరువాతదశలో బాగా తగ్గిపోవడం వల్ల, మాత్రాఛందస్సులను సైతం విసర్జించి కవులు వచన గేయ ప్రక్రియను రూపొందించుకున్నారు ఈ వచన గేయ రూపంలో పూర్వ కావ్య భాష ఏమాత్రం యిమడలేక పోయింది వ్యవహార భాషలో పద్యం ఎంత అసందర్భంగా వుంటుందో వచన గేయంలో కావ్య భాష అంత వికారంగా వుంటుంది కాగా ఆధునిక కవులు తమకు తెలియకుండానే కవిత్వంలో వ్యవహార భాష వైపు, సారళ్యం వైపు ప్రయాణం సాగించారు. మాత్రాఛందస్సువల్లా కావ్య భాషాగుణం వల్లా వచ్చిన వూపు, విసురు, తెలుగు నుడికారపు సొంపులు తేవాలనే ప్రయత్నం వచన గేయంగా రూపొందింది యిదొక చారిత్రిక పరిణామం

ప్రగతి వాద కవితావిజృంభణ జరిగిన రోజుల్లోనే ప్రయోగ వాదులని చెప్పదగిన కొందరు కవులు క్రొత్తకోసం అనేక ప్రయోగాలు చేశారు 'విబ్‌గ్యార్' వంటి మణిప్రవాళశైలి రచనం నుండి, శ్రీశ్రీ ఆరంభించిన సర్రియలిస్టు సింబాలిస్టు మొదలగు పద్ధతుల కవితల వరకు అనేకం వచ్చాయి ఒకానొకదశలో యివన్నీ ప్రబంధ కవుల చందకవిత్వాలు, ద్వ్యర్థికావ్యాలులా ప్రజలకు దూరమైపోయే పరిస్థితి కూడా ఏర్పడింది పాఠకుల మనస్సులను రంజింప జేయడానికి కాక వేధించడానికి తలపడిన యీ రచనలకు ప్రజామోదంగానీ, సాహితీ బంధువుల ఆమోదం కానీ లభించక పోవడం, సహజం చూడడానికీ, వినడానికీ గమ్మత్తుగా వుంటాయే గాని, వాటి వల్ల కవితా ప్రయోజనమేదీ సిద్ధించదనే విషయం క్రమేణా రూఢి అయింది ఒక వైపు కవిత వ్యవహారిక భాషను వూతగా తీసుకుని సారళ్యంవైపుకు పోతున్న దశలో యీ ప్రయోగవాద రచనలు పానకంలో పుడకల్లా అడ్డుపడి రసభంజక స్థితిని సిద్ధింప జేశాయి. కళ కళకోసమే అన్నవాదంలా, ప్రయోగం ప్రయోగంకోసమే అన్న వాదాన్ని కూడా ప్రజలు నిరసించారు శ్రీశ్రీ తర్వాత ఒక ఆరుద్ర మినహా ప్రయోగ వాద రచనలు చేసి నిలబడగలిగిన కవి లేడంటే అతిశయోక్తి కాదు ఆరుద్ర అయినా ఆయన చేసిన అనేక యితర మంచి రచనల వల్లనే ప్రజామోదం పొందగలిగాడు

ఆధునిక కవిత్వంలో వచన గేయరూపం స్థిరపడడానికి గత రెండు దశాబ్దాల కాలంలో బహుముఖంగా కృషి జరిగింది శ్రీశ్రీ, శిష్ట్లా, నారాయణ బాబు ప్రభృతుల తర్వాత దీనిని పెంచి పెద్దచేసి పోషించిన వారిలో ఆరుద్ర, తిలక్‌లు ముఖ్యులు ఈ రూపంలో సంపూర్ణకావ్యాలు, నాటకాలు, రేడియో నాటికలు రాయడానికి గట్టి ప్రయత్నాలు జరిగాయి వచన గేయమే యీనాటి సాంఘిక, రాజకీయ పరిస్థితులను ప్రతిబింబించడానికి సరియైన మార్గమనే విశ్వాసం కవుల్లోనూ, పాఠకుల్లోనూ బాగా వ్యాప్తి చెందింది ఫలితంగా యిటీవలి యువకులు పద్యంజోలికే పోకుండా ఆరంభంలోనే వచన గేయంతో తమ కవితా వ్యాసంగం ప్రారంభించడం మొదలు పెట్టారు అంటే అప్పటికే వచన గేయం తగినంత పరిపుష్టమై, యువకవులకు మార్గదర్శకం కాగలిగినంత వైవిధ్యాన్ని చేకూర్చుకోగలిగిందన్న మాట వచన గేయంలో చెప్పబడుతున్న కావ్య వస్తువు కూడా కేవల ప్రగతివాద వస్తువులకే కాక శృంగారం, భక్తి మొదలగు కావ్య వస్తువులకు కూడా వ్యాపించి తన పరిధిని పెంచుకున్నది యిదొక విచిత్రపరిణామం. వచన గేయ మార్గం ద్వారా పోయి పోయి మళ్లీ కవులు

ప్రేమ కవిత్వాల్లో పడతారా అనే సందేహం కొందరిలో కలిగింది. కాని కావ్య వస్తువును నిర్ణయించే అధికారం ఎవరికీ లేదు కాబట్టి, యింకా ప్రయోగ దశలోవున్న వచన గేయం యితర రసాలను కూడా ఎంత విజయవంతంగా నిర్వహిస్తుందో ప్రయత్నించి చూడవలసిందేనన్న పట్టుదల గల అస్మదాదులు యీ కావ్యవస్తు విస్తృతిని ఆమోదించడం జరిగింది తిలక్ ప్రేమ కవిత్వాన్ని వచన గేయ రూపంలో రసవంతమైన రీతిలో నడిపి ఒప్పించాడు అలాగే సుప్రసన్నాదులు భక్తి వేదాంతాలను దీనిలో సమర్థంగా ప్రకటించ గలిగారు ప్రగతి వాద భావన కేవలం దేశ కాలానుగుణమైన తన సహజ శక్తివల్ల నిలుస్తుంది గాని తాను సృష్టించుకున్న కవితా రూపంవల్ల నిలబడదు గదా ఒకానొక కవితా రూపము సర్వరస నిర్వహణ సమర్థమని రుజువైన తర్వాత విభిన్న సిద్ధాంతాలను విశ్వసించే కవులు దానిని వాడుకోదలచుకుంటే ఎవరూ ఆపలేరు. ఆధునిక కవుల్లో కొందరు దానిలో యితర రసములను ఒప్పించడానికి ప్రయత్నం చేసినందువల్ల వారి ప్రగతి వాదానికి వచ్చిన బాధ కూడా వుండదు. మరొక ముఖ్య విషయం కూడా గమనించవలసి వుంది. ఈ వచన గేయ కవితా విధానానికి వ్యామోహితులైగానీ లేక యీ ఆధునిక కవితా రూపంలో చెప్పితేగాని తమకు కూడా ప్రజామోదం రాదనే అభిప్రాయంతోగానీ, లేక యిది మనం మాత్రం రాయలేమా అనే చులకన భావంతో గానీ, ఎలాగైతేనేమి అనేక మంది పద్య కవితాభిమానులు యీ మార్గంలో వచ్చిపడ్డారు ఈ మార్పు గత 10 సంవత్సరాల కాలంలో బాగా జరిగింది కాని వీరు యీ మార్గాన్ని అవలంబించి రాయడం ప్రారంభించేసరికి వారు ఎంచుకుంటున్న కావ్య వస్తువు కూడా మారడం జరుగు తున్నది నగర వర్ణన మనో, సామాన్యుని కథాగానమనో ఏదోవిధంగా వారు కూడా ప్రగతి వాద కావ్య వస్తువు వైపుకు ఆకర్షితులవుతున్నారు. ఈ విధంగా వచన గేయం ఒక తరం కవులకు ప్రతినిధిగా నిలిచి, పై తరం వారిని కూడా వ్యామోహ పెట్టగలిగిందిందంటే దానిలోగల జవసత్వాల వల్లనే అది సాధ్యమైంది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో పెనవేసుకు పోయిన నేటి కాలానికి నిజమైన ప్రతినిధిగా నిలిచింది వచన గేయ కవితా విధానం.

వచన గేయంలో కావ్య భాషా సాంకర్య దోషాన్ని నేను సహించ లేను. వ్యవహారిక భాష యితర సాహిత్య ప్రక్రియ లన్నింటిలోనూ చాలా ముందుగానే ప్రవేశించి విజయం సాధించిందనీ, అది కవిత్వంలో ప్రవేశించడానికి జరుగుతున్న ప్రయత్నమే వచన గేయ రూపమనీ నా మతం అంతేకాక కవిత్వాన్ని ప్రజల దగ్గిరకు తీసుకు వెళ్ళడానికి వ్యవహారిక భాషా సంప్రదాయాలను అనుసరించిన కవిత ఒక్కటే పనికి వస్తుందని కూడా విశ్వాసం వచన గేయం యొక్క ప్రధాన లక్షణాలు నిరాడంబరత; నిరలంకారత కాదుగాని అనవసర అలంకార భార రాహిత్యం అలాగే కవితలో వర్ణనాధిక్యమునకు స్వస్తి; కథాభంజకం కానంతవరకే అలంకారాల వర్ణనల స్వీకరణ; కవితలో సారళ్యం; సూటిగా హృదయానికి తాకే విధంగా శబ్దాల తీర్పు; తెనుగు నుడికారపు సొంపులను రసపోషణకు తగినంతగా వినియోగించుకోవడం; అన్నింటి కంటే ముఖ్యమైనది కవిత తెలుగు ప్రజల సంభాషణ స్థాయికి దగ్గిరగా రావడం యివన్నీ నిజానికి వ్యవహారిక భాష యొక్క లక్షణాలే వాటినే ఆధునిక వచన కవిత తనలో జీర్ణించుకోవాలని అస్మదాదుల ఆశయం. ఇలా చేయడం వల్ల కవిత్వంయొక్క స్థాయి తగ్గిపోవడం లేదా అనే సందేహం పలువురు వెలిబుచ్చుతారు. కావ్యమంటే సంస్కృత భూయిష్ఠమైన కావ్యభాష అనీ, ఆముక్తమాల్యద వంటి అయఃపిండాలే తెనుగుకవిత్వమనే భ్రాంతి మనలో చాలా మందికి వుంది. ఆ భ్రాంతి వల్లనే యిటువంటి అనుమానాలు కలుగుతుంటాయి. కాని యీ మార్పు జరిగినందువల్ల తిక్కన గారిలో వలె తెనుగు పలుకు కులుకుతుందే గాని మనం నష్టపోయేది మాత్రం ఏమీ వుండదు. కవిత్వంలో యీ వ్యవహారిక భాషా సంప్రదాయానికి పూర్తిగా మారడం ఒక చారిత్రిక పరిణామమనీ, అనేక మంది ఆధునిక కవులే యీ పరిణామాన్ని గుర్తించలేక గ్రాంధిక శబ్ద రూపాల బంధంలో యింకా ఇరుక్కుని వున్నారనీ నేను ఆరోపిస్తూ వుంటాను. ఈ వాదమే సరియైనదైతే శ్రీశ్రీ కూడా కవి కాకుండా పోతాడేమోననే భయ సందేహాలను యిటీవల ఒక సమీక్షాకారుడు వెలిబుచ్చాడు శ్రీశ్రీ ముప్పయి సంవత్సరాల క్రితం రాసిన గేయాలను యీనాటి ఆలోచనా రీతుల ప్రమాణంతో మనం కొలవము గదా ఆయన రాసిన నాటి పరిస్థితులతోనే ఆయనలోని విప్లవతత్వాన్ని అంచనా వేస్తాం. ఏ విప్లవకారుడైనా తన కాలంలోని పరిస్థితులకు అనుగుణంగా ముందడుగు వేసి చూపగలడుగాని, మునుముందు రాబోయే కవితా స్వరూపాన్ని సర్వసమగ్రంగా వూహించ లేడు. తరువాత వచ్చేవారిలోని ఆలోచనాపరులు కూడా విప్లవాన్ని యింకా ముందుకు తీసుకు పోవడానికి దోహదకారులైన ప్రయత్నాలు చేస్తూనే వుంటారు నిరంతర ప్రవాహశీలమైన యీ కాల స్వభావాన్ని కూడా మనం గుర్తించాలి. వ్యవహారిక భాషా సంప్రదాయానికి అనుగుణంగా కవిత్వం యిలా వుండాలి, అలా వుండాలని చెప్పడం ఒక నియమాన్ని నెత్తిన రుద్దడం వంటిది కాదు. అనేక పూర్వ నియమాల మీద తిరుగుబాటు చేసిన ఆధునిక కవులు యీ కొత్త నియమాలను సృష్టించుకోవడ మెందుకనే ప్రశ్నకు కూడా తావులేదు ఎందుకంటే ఎవరెంత వద్దన్నా ఆధునిక కవిత మనకు తెలియకుండానే వ్యవహారిక భాషా లక్షణాలను సేకరించుకుంటుంది ఈ మార్పును మనం పరిశీలిస్తూ వుంటాం. అంతే. నిజానికి కవిత్వం రసవంతంగా వుండాలని చెప్పడం కూడా ఒక నియమమే అయితే అటువంటి నియమాలను తప్పని సరిగా పెట్టుకోవలసిందే.

ఇక పోతే దిగంబర కవులను గురించి. వీరందరూ వచన కవితోద్యమంలో పుట్టి పెరిగిన వారు ఆరంభంలోనూ, యిప్పుడు కూడా వీరు ప్రజల దృష్టిని తమ కవిత్వం వైపు ఆకర్షించడానికి కొన్ని చిత్రవిచిత్రాలు చేస్తున్నప్పటికీ అదలా వుంచితే, వీరి ద్వారా అభ్యుదయ కవిత్వం మళ్లీ పుంజుకుంటున్నట్లుగా కనిపిస్తుంది కొంచెం విశ్రాంతి తీసుకుంటున్న కవితా విప్లవాన్ని మళ్లీ నిద్రలేపి కూచోబెట్టారు దిగంబర కవులు మరికొంత సాధన జరిగితేనే గాని దిగంబర కవిత్వపు మూలతత్వానికీ, అభ్యుదయ యుగపు మూలతత్వానికీ భేదం ఏమైనా వున్నదా అనే విషయం స్పష్టంగా తెలియదు

వర్తమాన సాహిత్యం అప్పుడప్పుడు ఎన్ని వక్రమార్గాలలో పయనించినా, ప్రయోగవాద ధోరణిలో పడి ఎన్ని అపశ్రుతులు పలికినా మొత్తం మీద యీ 30 సంవత్సరాల కాలంలో కవితా వికాసం అభ్యుదయ కవితా యుగం, వచన కవితా వికాసం అనే రెండు దశల్లో జరిగిందని చెప్పవచ్చు. దిగంబర కవిత్వం మూడవ దశ అవునా కాదా అనే విషయం తేల్చడానికి కొంత కాలం పడుతుంది.



# అభ్యుదయ-యుగానంతరం

## శ్రీ కె. వి. రమణారెడ్డి

ప్రసంగ సందర్భంలో ఆయన అవునన్నది నేను కాదన్నాను. తానేమో భావ కవిత్వయుగం మనిషి నేనో అభ్యుదయ కవిగా పేరూ దూరూ పడిన ఘటాన్ని అయినా నిజమనేది మనిషినీ అతని ఇష్టాన్నిబట్టి మారదుకదా!

ఆయన అంటారూ, ఈ రోజుల్లో కవులూ, పాఠకులూ తగ్గిపోయారు, స్థాయి సరేసరి.

ఆయన ఎద్దేనికి నా తెద్దేమే సరైన సమాధానం కాగలిగినా, పెద్దవాడు కదా అని, స్థాయి మాటకేమిగాని సంఖ్య విషయంలో మీరు పొరపాడుతున్నారు అన్నాను.

అంతటితో మా ప్రసంగం మరొక మలుపు తిరిగింది.

ఇప్పుడు ఈ సమీక్షా వ్యాసంలో విఘ్నేశ్వరపూజగా ఆ పండిత కవికి ఒక నమస్కార బాణం పంపుకొని, ప్రపంచంలో కంతటికీ జన సంఖ్యను బట్టి పెద్దదై అనతికాలంలో మరీ పెద్దది కానున్న మన భారత ప్రజాతంత్ర దేశంలో, నాలుగుకోట్లకు చేరుకోబోతున్న ఆంధ్ర ప్రదేశాన్ని తనిగా చూచినా, కవులూ, పాఠకులూ ఆరోగ్యకరమైన పరిమితి నెన్నడో దాటిపోయారని చెప్పవలసి వస్తున్నది భావ వ్యక్తీకరణ ప్రతి ఒక్కనికీ ప్రాణతుల్యమైనదని, వ్యక్తిత్వ సంపదకు అదొక ఉపకరణమని అంగీకరిస్తూనే, ఆడిదం సూరకవి చాటు పద్యంలోవలెనో, వేదం వేంకటరాయశాస్త్రి విమర్శలో వలెనో కవిజన సంఖ్యోల్బణం గురించి చింతించకుండానే, దేశ పునర్నిర్మాణానికి పనికిరాగల బుద్ధిమంతులైన నవయువకు లెంద రెందరు తమ చదువులు పూర్తి కాకమునుపే కలంయోధులౌతున్నారో, దానిలో చదువులు చెడగొట్టుకొనీ, నిరాశ పెంచుకొనీ లోకంమీద కసిపుట్టి కత్తిగట్టి కవిత్వంలో తిట్లూ, బూతులు కుప్పించి కారం అంగారం దట్టించి నిర్వేద తత్వ సాధకులై పోవలసి వస్తున్నదో గమనించి వ్యాఖ్యానించకుండా ఉండడం నాతరంకాదు. కవిత్వసమస్య యువజన సమస్య కూడా యువనవ్యసనమే (adolescence) మంచికీ చెడ్డకీ ప్రారంభకాల మనుకొన్నప్పుడు, పేదరాసి పెద్దమ్మ ఇంట, అనిశ్చిత జీవిత పార్థక్యం ఎదురైనప్పుడు రెండు దశాబ్దాల స్వతంత్ర జీవనం కూడా మనస్సులకు స్వాస్థ్యం చేకూర్చనప్పుడు, కవులైన నవ యువకు లెలా రాయగలరో అలాగే రాస్తున్నారు కవి మనస్సు జబ్బు పడింది కవిత్వం గుణం' చూపుతూంది. 'కసిత్వం' కవిత్వ రూపం ధరించింది నీరసం తత్వాన్ని ఆశ్రయించింది క్రమరూపం క్రమగాపం స్మృతులుగానే మిగిలాయి.

ఈ రుణ పక్షానికి అవతలిదాన్ని జత చేర్చకపోతే నేను పాక్షికతా దోషానికి పాల్పడుతాను వెనకటి రోజులలోకంటె ఇప్పుడే విద్యాధికులనుంచి, ఆంగ్ల విద్యా విజ్ఞాన ముద్రగలవారినుంచి కవు లెక్కువ సంఖ్యలో బయల్దేరివస్తున్నారు లనుకరణ అనవ్యామై వైయక్తికవైలక్షణ్యం మీరి వస్తువైవిధ్యమూ భావౌన్నత్యమూ దృష్టివర్తులత్వానికి జత కలిశాయి. సిద్ధాంత వివాదాలూ ఇజాలఇరుకులూ లాభంలేదని యావన్మానవ జాతికి సమానమైన విషయాలకే కావ్యాలలో ప్రాముఖ్యం లభిస్తున్నది ఏడుపుగొట్టుమొగాలూ దేబిరింపువస్తువులూ దోషరుణ నేత్రాలా కనిపించడం తగ్గి జీవన విలాసాలు, జీవితరాసిక్యాలు అనుభోగపరత్వం అనుభవవిపులత్వం కవులలక్ష్యాలుగానైనా దర్శన మిస్తున్నాయి.

అయితే, నాగరికతా నిరసనం, విజ్ఞాన శాస్త్ర విషయాపకర్షణం, ప్రగతి గురించి అవిశ్వాసం, సకల నియమ నిరాకరణం, నిర్విచక్షణతో కూడిన సిద్ధాంత ఖండన, మానవతావాదం పేరిటి అలసత్వం, మార్మికవాదం పేరిటి పలాయనత్వం, వ్యక్తివాదం పేరిటి అరాచకత్వం—మన కవిత్వంలోకి చొరబారి వచ్చిన పాశ్చాత్య భావ వికారాలు తెలుగు కవులు తెలుగు మీరడమే అయితే సంతోషించవచ్చుగాని, తెంపరితనం అని భ్రమించే దుస్సాహసం కావ్య రూపానికీ, వస్తువుకూ శైథిల్యాన్ని సమకూర్చినంతగా పూర్ణాంగీణ శోభను సమకూర్చడం లేదు నవ్యత ఉన్నంతగా భవ్యత లేదు.

ఒక యుగాంతపు కల్లోలమో మరొక యుగారంభపు వైక్లబ్యమో మరణయాతనో ప్రసవవేదనో—లేక తదుభయాల సమ్మిశ్రమమో ఇంకా ముందు ముందునగాని తెలియరాదు. ద్రవస్థితి (Fluid state) లాంటిది నేటి తెలుగు కవిత్వాన్ని ఆవహించి ఉన్నది. అయినా ఆధారలోని ప్రధానమైన తీరుతెన్నులను బయల్పరచడం దుష్కరమైన విషయమేమీకాదు.

## అభ్యుదయ యుగ చరమ సంధ్య:

సామ్యవాదం మావేదం, సాహిత్యం మా ప్రాణం, సామాన్యుడు మాదేవుడు, ప్రగతి మా లక్ష్యం.

ఇలా అనుకొన్న అలనాటి అభ్యుదయ కవులు 1955 ఎన్నికలనాటికి తమ దృక్పథాన్ని విస్మరించినట్లు రాస్తూ, ఆ ఏటి ఎన్నికల సందర్భాన భావ స్వాతంత్ర్యం గురించి తెలుగుదేశపు మేధావులు చేసిన ప్రకటన సాహిత్యంలో రాజకీయాల ప్రభావానికి 'దింపుడు కళ్ళం' అయిందని ఒక ప్రసంగ వ్యాసంలో ఆరుద్ర రాశారు. తెలంగాణా ఉద్యమం అభ్యుదయ కవిత్వానికి కలిగిన చిట్టచివరి ప్రేరణ[1] అంటున్నారు డా. సుప్రసన్న స్వతంత్ర రాజ్యాంగం ఏర్పడి జాతీయ ప్రభుత్వానికి సామ్యవాదం ఆదర్శమయ్యాక,[2] ఆచరణ ఎలాగున్నా తమ పాతకలలు కొన్ని తీరి, రష్యా దేశపు రాజకీయ పరిణామాలు కారణంగా కొన్ని నమ్మకాలు బద్దలై అభ్యుదయకవులు తమ దృక్పథాన్ని విడనాడుకొన్నారని గూడా అన్నారు ఆరుద్ర ఆయనలాంటి ఒక రిద్దరిలో ఈ పరివర్తన జరిగి ఉండవచ్చునేమో! ఇతర్వు, నీరు గారిపోవడమో మొద్దుబారిపోవడమో మాత్రమే జరిగింది. అయినా, రాజకీయ ధోరణులకూ, సాహిత్య యుగోదయాస్తమయాలకూ మధ్య ఇంతటి నేరైన మతానుత సంబంధమున్నదని చారిత్రికభౌతికవాదులు గూడా సిద్ధాంతం చెయ్యలేదు. ఆ వాదాన్ని వికృత పరిస్తేనే, ఈ నిర్ధారణ సాధ్యం.

ఏ భావధోరణి అయినా తన ప్రాభవదశనుమీరి కూడా జీవించగలగడానికి దీర్ఘమైన అభ్యుదయ కవిత్వయుగ చరమసంధ్యను ఉదాహరణగా స్వీకరించవచ్చును.

అభ్యుదయ కవులుగా ఈ నాటికీ మిగిలిపోయి ఉన్నవారి నటుంచి, జారిపోయిన ఆరుద్రనుగానీ మొదటినుంచీ ఉద్యమోపజీవి నంటూన్న దాశరథినిగానీ కవులుగా పరిశీలిస్తే వారిలోనూ ఈ నాటికిగూడా అభ్యుదయాంశ కనుదగలకపోదు అభ్యుదయ యుగానంతర కవులలోకంటె గాఢంగానూ బహుళంగానూ కనిపిస్తుం దిది దానికి కారణమేదో వారికే బాగా తెలుసు. ఆరుద్ర అంటారూ.

'మన కవిత్వం ప్రజలకోసం . మనకు అభ్యుదయ దృక్పథం ఉండడం మనం సుకవుల మవడానికి తప్పనిసరి కొంతమంది కాదన్నా మనం మన విశ్వశ్రేయః కాంక్షని ఒదులుకోలేము '[3]

ఇక దాశరథి

'నేను చాలావరకు ఉద్యమోపజీవిని కళ ప్రజలను, దేశాన్ని, ప్రజోద్యమాలను విడిచి దూరంగా ఉండలేదని నా విశ్వాసం [4]

తెన్నువారితే మారిఉండవచ్చునేమోగాని, తీరు అభ్యుదయమోద్యమానిదే అలాగే దిగంబరకవులలోనూ అభ్యుదయరశ్మి ప్రతిఫలిస్తున్నది. దర్పణం వేరనేగాని బింబం అభ్యుదయ ప్రతిబింబమే అయినా అది వికృతమైన దర్పణం కాబట్టి బింబమూ వికారంగా ఉంటున్నది అభ్యుదయ కవిత్వంలోని రుణపక్షాన్ని, విధ్వంసక గుణాన్ని ఆధునిక జీవన పరిస్థితులకు అన్వయించి క్షీణమానవమైన పాశ్చాత్య భావ విశేషాలతో కలిపినప్పుడు, దిగంబర కవిత్వం అవతరించింది వ్యక్తి స్వేచ్ఛావాదాన్నీ శుష్కమానవతాదృక్పథాన్నీ ఆదిమత్వాన్నీ (Primitivism) అసంస్కృతత్వాన్నీ నోట కొడుతున్నా, ప్రస్తుత ప్రపంచ సమస్యా పరిష్కారానికి మార్క్సవాదం పనికి వచ్చినంతగా మరొకటి పనికిరాదని దిగంబరులే అంటున్నారు. ఆ మేరకైనా వారి దృక్పథంలో అభ్యుదయాంశ అత్యల్పభాగంగానైనా కనిపిస్తున్నది.

జీవకళ మందగించిందనేగాని, అభ్యుదయ కవిత్వ సంప్రదాయం కాపుడిగిపోలేదు పదేళ్ల కిటీవల తెలుగుకవిత్వప్రవాహం తన దారిని మార్చుకోగా పాత దారిలో ఇసుక మేట వేసిన మాట నిజం. అదంటేనే ముఖం మొత్తినందుచేత మాత్రమే ఈ పెనుమార్పు జరిగిందని భావించడం, చారిత్రిక ఘటనను పైపై చూపులతో తేలిక పరిచి మనం తేలిక పడడమే.

విశ్వ వ్యాప్తమై ఉన్న యువజన మానసిక వ్యగ్రతను లెక్కలోకి తీసుకోకుండా, ఆఖరుకు తెలుగు కవిత్వంలోని నవీన యుగాన్ని అంచనా వేయడం కూడా అసాధ్యమౌతుంది విశ్వ వీచిక మన తీరాలను కూడా తాకి తట్టింది. ధిక్కార, మహోశంబం బాధిర్యాన్ని బాధిస్తూవుంది పడమటి గాడ్పు సుడి తిరుగుతూ ఉద్రేకాల సెగలనూ ఊహాల వగలనూ ఎగబోస్తూ ఉంది అసంతృప్తికి వెర్రితలలు వెయ్యిన్నొకటిగా వేయించి నిరసనను పెంధూళిగా రేపి భారతీయ భాష కవిత్వాలన్నిటా ఉన్మత్తతగానూ, వికటత్వంగానూ సాక్షాత్కరిస్తూ

ఉంది దురుసూధగాకుడూ, తిట్లూ,బూతులు కవిత్వాన్ని విస్ఫోటీకరిస్తున్నాయి. వికారమే సౌందర్యమౌతున్నది కసిత్వమే, కవిత్వమౌతున్నది దీనికి అబ్బా కొడుకులు తరాలవార (Generation Gap) ఒక్కటే కారణం కాదు విరిగిన జాతుల విసిగిన జీవితాలనుంచి బయటపడి, ప్రపంచ రాజకీయ చదరంగంలో ఇజాల మతివూలిన జూదంనుంచి తప్పించుకొని 'లఘు మానవుడి'కి చిత్తశాంతి చేకూర్చి, 'మానవతా తీరాల'కు తసుకొనిపోవాలని, గుండె గుండెకూ ధైర్యాన్ని, ప్రాణమూ పంచే దీపికల నందించాలని మన దిగంబర కవులు తహతహపడుతున్నారు అది తీవరింపుగా మారితే, రక్కసితనంగా కనిపిస్తే, వాళ దేనా తప్పు? దిగంబర కవిత్వం తెలుగు కవిత్వపు సంచితమే కైవారాలూ, పొగడ్తల పూదండలూ, అకాడెమీ పాలుపట్టి పెంచే మర్యాదగల గ్రంథాలూ, పండగ పబ్బాల కవిత్వాలూ, Establishment సాహిత్య రాజకీయాలూ, అవసర నైవేద్యాలూ, పంచ రత్నాల మార్కు పద్యాలూ, కృతి సమర్పణ పరస్పరాభినందన పరమ పాతివ్రత్య రాజసేవకత్వ నాటకాలూ— ఇవన్నీ కూడా కవిత్వ విప్లవాన్ని అవసరం అభిలషణీయం చేశాయి సురవౌళి అనే యువ రచయిత వివరించినట్లు,

సరైన దారుల్ని దిగ్బంధనంచేస్తే ఆ తపన తప్పుడు దారుల్లోంచి బయట పడడం సహజమేకదా![5]

We get what we deserve అన మనసౌతున్నది నిర్మాణాత్మక దృష్టిని విడనాడిన అభ్యుదయ కవులే ఈ దిగంబరులు అనవచ్చునా? వీళ్ళకు దేనిమీదనూ నమ్మకంలేదు పవిత్రాలన్నవే పనికిరాని బ్రేకులు నిర్బంధాలు. సర్వ వినాశనమైనాసరే, తమ నరాలూ రక్తమూ ఉద్రేకాలూ సహజాతాలూ ( Instincts ) చెప్పిందే వేదం, చూపిందే మోక్షం.

ఒక సాహిత్య పత్రికను చదివాక సంపాదక లేఖ రాస్తూ, ప్రపంచంలో ఎన్నో ఇజాలుండగా ఈ తరం రచయితలకు మార్క్సిజంమీదనే కక్ష ఎందుకని ప్రశ్న వేశారు

మన యువ రచయితలు పారిపోదలిస్తే కమ్యూనిజంనుంచే పారిపోవాలి. మిగత ఇజములన్నీ Absolutely safe [6]

కమ్యూనిజంనుంచి పారిపోవడం కుటుంబరావుగారి తరంనుంచీ మొదలైంది ఎప్పుడూ కమ్యూనిస్టులుగాని, మేధావులు కూడా తా మెందుచేత తద్వ్యతిరేకులు కావలసి వచ్చిందో సంజాయిషీ ఇచ్చుకొంటూ మెహర్బానీ పుచ్చుకొంటూ ఆరుద్రగారి 1955 బార్డర్ లైన్' తర్వాతనె పత్రికల క్కారు వార్ధక్యంలో వారికి కలిగిన జ్ఞానోదయం నవ యువ్వనంలోనే వీరికి కలిగింది— అంతే తేడా మొత్తానికి భావ జాలం ((Ideology) పట్ల బాగా సడలిన కాలమిది మన దేశ సుగుణం మాత్రమేకాదు మార్క్సిజం పునాదిలోనే మానవతావాదం ఉన్నదని తెలియక, ఆ రెంటికీ పరస్పర బాహ్యత్వాన్ని ఊహించుకొని, యధార మానవులను విడిచి మానవత్వ భావననే ఆదర్శీకరించుకొంటున్నారు ఈ కొత్తకారు రచయితలు ఇది రాజకీయ వైముఖ్యం మాత్రమేకాదు—ప్రమాదకరమైన రాజకీయాలు కిట్టుబాటు కావడంలేదు. పైగా, నాగరికతా విధ్వంసన ప్రణాళికలో రాజకీయ నిరాకరణం అంతర్భాగమే వరదలాగా ముంచుకొస్తున్న హేతువాద వ్యతిరేక దోరణి (Irrationalism) లో ఇది తప్పనిసరి

ఇజంతో యంత్రిసిజమ్ అయితే యాంత్రిక జ్ఞానం కలిస్తుంది
ప్రిజం లాంటిది జీవితం, వేర్వేరు కోణాలు ప్రదర్శిస్తుంది.

అని తిలక్ కావ్యంలో ఉద్ఘాటించారు ఆదారిఒట్టి ఎందరో! ఇజంకూ ప్రిజమ్‌కూ లయ కుదరడు కూడా వరవరావువంటి నవకవిచేత అలాంటి చరణం రాయిం చడమేక, ధ్యానికీ, రణానికీ గూడా పొత్తు కలిపింది మెదళ్ళ దళ్ళు పిర క్కొట్టి కళ్ళ పరదాలు కత్తిరించి చూపు దాని శుభ్రం చేసుకొమ్మని ఆరుద్ర ఆదేశించారు. 'జండాలకోసం—పుండాకోర్లకొసం – గుండెలు చించుకోకు' మని దాశరథి హితవు 'జండాలకు కన్నీన్న లేవు' అని అజంతా కావ్య శీర్షిక అంటే కుటుంబరావు గారన్నట్లు అన్ని ఇజాలకూ, ఈ ప్రవాదం లేకపోవడ మంది మన కవులకు మాత్రమే ప్రత్యేకత. ప్రభాతంలో కూడా మూడు రంగులను చూచి ముడిసిపోయి కాడెగ్గలకు కావ్య హారతు లిచ్చే కవులే ఇలా కమ్యూనిజాన్ని నిరాకరిస్తున్నారు. దేశీయ మహానేత కోటు బొత్తాం భాజాకి కూర్చున్న ముద్దుల గులాబి గురించి కావ్యాలకు కావ్యాలే అవతరించాయి. విదేశీయనేతలు నిందలూ నిష్ఠురాలూ తలమోయవలసి వచ్చింది. దేశభక్తి మన కవులకు పట్టిపోయింది. జాతీయ వాద ప్రకోపాన్ని కూడా గమనించ నేరని అర్భకత్వం ఆవేశపరత్వం (Jingoism) కావ్య సంతానంలో కానవస్తున్నాయి. కాబట్టి అభ్యుదయ యుగానంతర కవుల రాజకీయ భావ వైఖరి నిష్పాక్షికమనిగానీ తాత్వికమైన సర్వ సమత్వమనిగానీ నిర్లిప్తత అనిగానీ అనడానికి వీలేలేదు. మధ్యమ వర్గానికి సహజమైన లక్షణాలూ, అవలక్షణాలూ కవులను జాలిదలచి విడుస్తాయా? 'ప్రజా తంత్రం' భావనవే రోజులు.

స్వరాజ్యానికి ముందు వచ్చిన రచనలే మేలైరంగా ఉన్నాయని పదేళ్ళ క్రితం ఆరుద్ర ఒక వ్యాసంలో రాశారు ఆ వెనకటి పోరాటం' ఇప్పుడు పట్టి 'ఆరాటం'గా మారి, ఆశించినవేవి సమకూరక, శోచనీయంగా ఉన్న జీవిత వాస్తవానికి సాహితీపరులు కళ్ళు మూసుకొన్నారని అన్నారు[7] నిర్దిష్టమైన సాంఘిక ప్రయోజనంలేక లక్ష్యసిద్ధి కలిగిన ఫలితంగా, జాతి సంకటస్థితికీ జీవిత నీరసత్వానికీ ప్రతిబింబంగానే సాహిత్యం విస్మరణవాదం పాలబడిందంటూ 'స్వాతంత్ర్యానంతరం కవిత్వానికి గ్రహణం పట్టింది' అని మరొకడు తీర్పు చెప్పాడు[8] జీవితానుభవంతోబాటు కవులలో తాత్వికదృష్టి కూడా విసర్తిలి కవిత్వం గాఢత్వాన్నీ, సౌష్ఠవాన్నీ సంతరించుకోవడం లేదే అని చింతిస్తూ, ఆధునిక కవులలో ప్రతిభా వ్యుత్పత్తులు శూన్యమైపోయాయి కాబట్టి 'భారంలేని కవిత్వం, వెలువడుతూన్నదని రెంటాల గోపాలకృష్ణ ఒక ప్రసంగ వ్యాసంలో చెప్పారు[9] ఆధునిక కవిత్వ వస్తువుల నిర్ణయాన్ని అటుంచి అందులో ప్రముఖాంశ కనిపించక తప్పని తాత్వికమైన ఆర్తినీ ఆలోచనాభావాన్నీ అనుభూతి వైవిధ్యాన్నీ ఆయన ఎందుకు చూడలేకపోయారో? ఆరుద్ర అన్నట్లు, నిజంగానే

ఆధునిక కవిత్వంలో గుండెకన్న మెదడు ఎక్కువ పని చేయడం మొదలుపెట్టింది జిఘాంసకు బదులు జిజ్ఞాస ప్రారంభమైంది[10]

ప్రగతి వాద కవులుగా పేరుబడిన కుందుర్తివారిలోకూడా ఆధ్యాత్మికతను దర్శించగలుగుతూన్న సుప్రసన్నలాంటి సహృదయ విమర్శకులుండగా, సోమసుందర్‌లాంటి అభ్యుదయ కవి ఆరుద్ర, ఇంకా అనేకులు కాలంయొక్క తత్వాన్ని గురించి కావ్యాలు రాస్తూండగా, 'త్వమేవా హం', 'సినీవాలి' లాంటి కావ్యాలేగాక 'విరిగిన కల్చర్' వంటి అత్యాధునిక కావ్యంలో కూడా మేధా ప్రధానమైన సంవిధాన కల్పన ప్రముఖాంశమై ఉండగా, ఎవరుగానీ ఆధునిక కవుల శక్తి సామర్థ్యాలను శంకించవలసిన పనిలేదు అభ్యుదయ కవుల ఏక తార సంగీతంకంటె ఈ జంత్ర గాత్ర సమ్మేళనం మెరుగే కవిత్వం గ్రహణం పాలుగాలేదు సరిగదా, గ్రహణం విడిచిందనేవాళ్ళ లెక్కకు మిక్కుటంగా ఉన్నారు అసలు ఆధునికతలోనే ఈ తాత్విక భావన అంతర్నిహితమై ఉంటున్నది.

## "ఆధునిక భావ చేతన"

'ఆధునికత' కాలవాచకం కాదని, నా మట్టుకు నాకు స్టీఫెన్ స్పెండర్ కృత The Struggle of the Modern చదివేంత వరకూ తెలియదు 'త్వమేవా హమ్' కావ్యానికి వ్యాఖ్య కూరుస్తూ, వర్తమాన కాలిక కవులకూ ఆధునిక కవులకూ భేదం చూపిన దాశరథి మతాన్ని గురించిన దృష్టిగానీ గతాన్ని గురించిన వలపోతగానీ లేక భవిష్యద్దృష్టి ఉండడమే ఆధునికతా పరమార్థ మన్నట్లు రాశారు పాశ్చాత్యుల దృష్టిలో కూడా టీవలి వరకూ ఆధునికతకు సమకాలికతకూ (Contemporariety) అభేదమే. సమకాలికతను ధ్వంసించే వైఖరినే ఆధునికతగా స్పెండర్ పేర్కొంటున్నారు! అది గతైకమగ్నం కావడమే గాకుండా, సంప్రదాయాన్ని ఆయుధ వికేపం చేసుకొని సమకాలిక సమాజాన్ని చీల్చి చెండాడుతూ, దాదాపు భవిష్యద్దృష్టి వష్టి అయేవిధంగానే వ్యవహరిస్తుంది.

దాశరథి పేర్కొన్న 'నవదృష్టి', తెలుగులో ప్రయోగవాది కావ్యాలైన నారాయణబాబు 'రుధిరజ్యోతి' ఖండికలనూ పఠాభి 'ఫిడేలురాగాలడజను' వచన పద్యాలనూ ఆరుద్ర కావ్యాలనూ బైరాగి 'నూతిలో గొంతుకలు' నీ తనపరిధిలో ఇముడ్చుకొన్నదా? ఈ ప్రయోగవాదులు నామాంతరం లేకనే — గత్యంతరం లేక మాత్రం కాదు— చాలాకాలం వరకు అవిభక్త కుటుంబంలాగుండిన అభ్యుదయోద్యమంతోటి అంటకాగుతూ వచ్చారు. కొందరు దానికి పూర్వులే అయినా ఆ ముద్రను ధరించక తప్పింది కాదు కొత్తకుండ పెట్టుకున్నాక కూడా, లోకులకా పాతపేరుతోనే కనిపించారు నిజానికి ఈ కవులందరిలోనూ అభ్యుదయ భావచేతన ఏదో ప్రమాణంలో ఉంటూనే వచ్చింది శిల్ప, సంవిధానాల కోసం పారక సామాన్యపు స్థాయిని మించి సాంకేతిక ప్రావీణ్యంతోటి మేధా ప్రధానమైన రచనలు చేసినంత మేరకు, ఈ ప్రయోగ వాదులకు ఆధుని కాంశకూడా చేకూరుతున్నది ఇలియట్‌నూ జాయిస్‌నూ మరొకరినీ ఇంకొకరినీ అనుసరింప జూడడమే నిదర్శనం నాగరికతా మరు భూములను(Wasteland) కావ్యీకరిస్తూ ఒకరు, జీవన శకలత్వాన్ని నిరూపిస్తూ ఇంకొకరు ఆధునికతకు అద్యస్థానంలో నిలుస్తున్నారు. సవ్యతా ముద్రగల ప్రతి అభావాన్నీ చేతులు చాపి ఆహ్వానించే రోజులవి అందుచేత పేరుకు ఎవరైనా, అభ్యుదయ కవులతో ఈ ప్రయోగవాదులకు భావంలోనూ రీతిలోనూ సామ్యం తక్కువనే అనాలి. ఈ అంశాన్ని గుర్తించి డా. సుప్రసన్న ప్రయోగవాదాన్నిలా వివరించారు.

మనో వైజ్ఞానం, వైయక్తిక పరివేషములకు ప్రాముఖ్యము, భగ్నత్వము, అవసానము, కుంఠ, అతృప్తి మొదలైన లక్షణాలు ప్రయోగవాదులలో వ్యక్తమవుతవి [11]

శబ్దకోశ సాహాయ్యాపేక్షకాలైన ఈ పడికట్టురాళ్ళు ఆధునికతను చూచేందుకు పనికి రావడం లేదు అభ్యుదయాంశ తమలో మిగిలినంతమేరకు ప్రయోగవాదులకు ఆధునికత ఒంట బట్టలేదనాలి వైయక్తిక దృక్పథ మొక్కటే ఆధునికతా వైలక్షణ్యమని అనలేము కూడా, కవి స్వీయాత్మిక (Private) ప్రమేయాలే కావని ర్ణాయక శక్తులు గాని, లోక (Public) ప్రమేయాలు కావడమే ఆధునికత రాజకీయ పరిభాషలోని వ్యక్తి వాదానికి ఇది ఛాయ మాత్రమే గాని, అదే కాదిది అనుభవం బాహిరమే అయినా అనుభూతి ఆత్మికం కావాలి. అనుభవ స్వీకరణ తర్వాత, లోకంతో కవికి ఇలాకా లేదు. ఆత్మావిష్కృతి దాని పరమోద్దేశం కాబటి కవిత్వానికి లోక ప్రాముఖ్యంతో పని లేదు. దాని ధ్యేయం Importance కాదు, Significance అని ఆధునికుల అభిప్రాయంగా స్పెండర్ వివరించాడు

ప్రధాన అనుభూతుల ఆకృతితోనే కవిత్వం దర్శన మివ్వాలి గాని, అది వస్తుపరం కథనాత్మకం కా నక్కర లేదని చెప్పినప్పుడు, తిలక్ ఈ స్వీయాత్మిక వైఖరినే ఉద్దేశించారనిపిస్తుంది. మరొక సందర్భంలో, దీని ప్రమాదాలను కూడా ఆయన గమనించారు. తదనుభూతికి విశదమైన రూపం చేకూరనప్పుడు సరేసరి, కవి తనకు మాత్రమే పరిమితమైన సంకుచితానుభూతి నుంచి కావ్య భావ ప్రతిమలనూ సంకేతాలనూ తయారించుకొన్నప్పుడు తన కావ్యావబోధకు తానే అడ్డు తగులుతాడని తిలక్ అన్నారు ఈ పాడి మాట లనే కావ్యీకరించి, కవిత్వావబోధ దురవబోధగా (obscurity) కాగూడదు, ట్రాన్స్పరెంట్ చీకటిలా ఉండవచ్చునంటూ,

తనకే తెలియని అస్పష్టపు అనుభూతిని
అర్థంలేని ఇమేజరీ కలగాపులగపు వర్ణనలతో
డిలాన్ థామస్‌కు చేతకాని అనుకరణలతో
ఒక దేశం నిర్దేశం లేని వాక్యాల వికారంతో ..

మోడరన్ కవులు రాస్తున్నారని చెణికారు అంతేగాని, తమ వాదంలోనే ఈ దౌర్బల్యం ఉన్నదని గ్రహించలేదు. ఇంతకూ తాను ఆధునికుడు జీవిత శైథిల్యాన్ని రోసి సహజ (Organic) జీవిత సౌందర్యాన్ని ఆలపించి, అది ఆచరణ సాధ్యం కానందున తీరని కోరికలతో దానికోసం తపిస్తూ (nostalgia) కావ్యాలెన్నో రాశారు తిలక్‌లోని అభ్యుదయాంశ, అతని కవిత్వం లోకంతో పడిన రాజీకి వాస్తవానికి లొంగుబాటుకు మాత్రమే నిదర్శనం. అతనిది మంత్రనగరి; ప్రధానంగా కాల్పనిక వైఖరి. అదే ఆధునికతకు మాతృస్థానమని స్పెండర్ రాశాడు

ఆధునికత గురించి అద్దేపల్లి రామమోహనరావు కూడా ఒక నిర్వచనాన్ని ఇచ్చి ఉన్నారు .

సమాజంలోని ప్రతి వ్యక్తి ఎవరి పరిధిలో వారు ఆనందాన్ని అన్వేషిస్తూ సమగ్రతవైపు సాగిపోవడం ఆధునిక దృక్పథం [12]

విడివిడిగా ఉన్న అణువుల కూడికే సమాజం కాగలిగినప్పుడు, తన గిరి లోనే ఉండి ఏ వ్యక్తికా వ్యక్తి ఆనందాన్ని సంపాదించుకొని సాఫల్యం పొందడం సాధ్యంగాని, అది Every one for himself and Devil take the hindmost అనే స్పెన్సర్ ముద్రాంకితమైన వితండ వినాశనకర వ్యక్తి వాదానికి దారి తీస్తుంది No man is an Island; We are parts of one another అనే 'లిబరల్' తత్వానికి గూడా చోటివ్వనప్పుడు, సమష్టి వాదాన్నెలా సహిస్తుంది? స్వచర్మమాత్ర సంవృతత్వమేనా వ్యక్తిత్వమనగా? కొంపెల్ల జనార్దనరావుగారి మాట నరువు దీసుకొని, వ్యక్తిత్వమనగా కవికి సంబంధించినంతవరకు కావ్య సృజనలో 'ఐకాంతికత్వమే' అనుకొంటే దీనితో కటిక సమష్టివాదికి గూడా పేచీ ఉండదు. కాక, కవి—వ్యక్తిపాలిటి కిది ద్వీపాంతరవాసంలోని విడి కైదు అయేట్లుంటే మట్టుకు, ఆధునికత కావచ్చునేమోగాని తనకూ, మనకూ ఉపకరించే ఆరోగ్యకరమైన వైఖరి కాబోదు స్పెండర్ నిర్వచనం ఈ అంశాన్ని కూడా స్ఫురింపిస్తుంది. భావానురూప్యం లేక సమకాలికజగత్సృజతోటి సహానుభూతినీ సానుభూతినీవిడిచి ఒంటరితనంలో ఒంటరితనాన్ని అనుభవిస్తూ, ఆత్మ కేంద్రంనుంచి మాత్రమే ప్రపంచాన్ని ఓంప్రథమంగా కనుగొంటూ (Invent), సమాజ బాహిరాలూ సమకాలాతీతాలూ అయిన మేధా ప్రధాన (Intellectualized)కావ్యప్రపంచాన్ని సృజించుకొంటూ,లోక నిరాకరణవల్ల కలిగిన దృష్టి వైపుల్య నష్టాన్ని ఆంతరలోక నిమగ్నతవల్ల సంపాదించుకొన్న అనంతత్వ, అగాధత్వాల లాభంతోటి సరిపెట్టుకొంటున్నాడు.

రామమోహనరావు గారిచ్చినంతకంటె విస్తృతమైన ఆధునికతా, నిర్వచనాన్ని డా సుప్రసన్న పూర్వోదావృతమైన వ్యాసక్రమంలో ఇచ్చారు 'ఆధునిక భావచేతన' అనేది ఆయన ముద్రించి విడిచిన ప్రయోగమే ఇందులో wishful thinking అనే దానివల్ల కాబోలు, పాశ్చాత్య తాత్విక విశేషమైన అస్తిత్వవాదం Existentialism, తత్సంబంధమైన మానవుని ఆర్తి Anxiety, క్రమంగా మన ఆస్తికవాదంతోటీ 'జీవుని వేదన' తోటి అద్వైతస్థితి పొందుతున్నాయి. శాస్త్రవేత్తలకు ఇంతవరకు అజ్ఞాతంగా ప్రశ్నగా ఉన్నది, పారలౌకికల అజ్ఞేయమూ విశ్వాసమూ అవుతున్నది డార్విన్, ఫ్రాయిడ్, మార్క్స్, ఐన్‌స్టీన్ మూల స్తంభాలతుంది చాలక అరవిందయోగి మరో స్తంభమవుతున్నాడు రోగి కోరుకొందీ వైద్యుడు తీసుకోమందీ పాలేనన్న బాపతుగా, భారతీయమైన ఆధ్యాత్మికత ఇలా ఆధునిక వేషధారణ కావించుకొంటున్నది విశ్వనాథవారి 'బూటక నాగరకతా' నిరసనానికీ ఆధునికుల నాగరకతా నిరసనానికీ నామ సామ్యమే ఉంది ఇలియట్ ప్రభృతులు మత విశ్వాసాలకు కాయ కల్ప చికిత్స చేసినా, లీవిస్ తదితరులు Great Tradition ను తిరగదోడినా, పారిశ్రామిక సమాజ శైథిల్యమూ, విలువల హరింపూ మాత్రమేగాని ఆర్షధర్మ ప్రకర్షకూ వారి ఆవేదనకూ ఉన్న అంతరం ఎద్దుబండికీ, రాకెట్‌కూ ఉన్నట్టిది సార్త్ర Sartre పేర్కొంటున్న ఆర్తి, మానవస్థితి Human condition గురించే గాని, తదతీతమైన అధిభౌతిక బ్రహ్మపదార్థంకోసం కాదు పాశ్చాత్యుల ఆధునికతకు గూడా పారలౌకిక తత్వ స్పర్శ ఉండవచ్చునేమోగాని, అది ప్రధానంగా మానవీయమైనట్టి దానికి సాహిత్య స్వరూపమే కృత్రిమ యంత్ర వేళా వళియులమైన మహా నగర జీవితం, ఉట్టి కెక్కలేని మనకు స్వర్గప్రాయమే అయినప్పుడు, జీవన శైథిల్యానికి ముందుగా జీవిత పరిణతి సమకూరనప్పుడు. మనం ఇంకా యాత్రాక్రమంలో తొలి మజిలీలోనే ఉన్నప్పుడు, ఆధునికతా గమ్యం, మనకు యథార్థం, సన్నిహితం కావడంలేదు.

వెల్స్, షా, ఆర్నోల్డ్ బెనెట్ ప్రభృతి వచనరచయితలSociological వైఖరికినీ, లారెన్స్, జాయిస్, ఇలియట్ ప్రభృతుల Imagistic వైఖరికినీ గల తారతమ్యమే సమకాలికతకూ, ఆధునికతకూ మధ్య గలట్టిదని స్పెండర్ అంటాడు. మానవాభ్యుదయంలో ఆధునికులకు విశ్వాసమేలేదు నిరాశ ముట్టడిలో వారికి భవిష్యత్తంతా మరుభూమే అదృష్టవశాత్తు తెలుగు కవు లింత ఆధునికులు కాలేదు

ఇది అల్ప సంతృప్తి మాత్రమే ఎందుచేతనంటే, ఆధునికతారంగ ప్రవేశానికి హంగు లీవరకే మొదలై నేపథ్య రచన బాగా సాగి ఒక కొలిక్కి వచ్చి ఉంది

వెనకటివాళ్ళ మాట కేమిగాని, స్వాతంత్ర్యానంతర సాహిత్యంలో పలాయనవాదంగా తిలక్ కవితలోనూ, ప్రయోగవాదంగా ఆరుద్ర, బైరాగి, అజంతాల కవితలోనూ ఆధునికత సనసన్నగానే బలంగానే ఆగమించింది ప్రబంధాలనుంచీ భావకావ్య సమష్టి నుంచీ తిలక్ కావ్య పదజాలం మార్దవాన్నీ సున్నితత్వానీ సంక్రమింపజేసుకొని ఉండవచ్చు అయినా ఆంగ భాషా పదాలనూ ఇంగ్లీషు పలుకుబడులనూ ఆయన కూడా వాడుకొన్నారు చందనశాలలూ చిత్రలోకాలూ ధూప దీపాలూ అగరువత్తులూ అత్తరూ — ఈ జీవన రసికతా వస్తు సమూహంలో కూడా ప్లాటినం, స్టేషను, ఫెన్స్, కాస్మిక్, కాస్మోపాలిటన్ వంటి మాటలు వచ్చి తిలక్ భాషనూ, భావాన్నీ ద్వైధీకరించాయి నిజానికి, ఆయన హృదయమంతా కాల్పనికమైతే మనస్సు కొంతవరకు ఆధునికమైనది మొదటిది కాల్పనికం అయినందుచేతనే, రెండవది ప్రయత్నపూర్వకంగానూ ప్రయాసాభరితంగానూ భావకవుల శృంగార భావాన్ని కొంత సంస్కరించి సంకోచ దోషాన్ని తొలగించి కరుణార్ద్రమైన విశ్వ జీవన విలోకనంగా, నాగరకతా కాఠిన్య క్రౌర్య విమర్శనంగా, రాజకీయ, శాస్త్రీయాభ్యుదయ నైష్ఫల్య నిరసనంగా—ఆధునికంగా రూపు కైసేసుకొన్నది తాను ఆధునికుడుగా పూర్ణాకృతిని సాధించుకోలేకపోయినా, ఆధునిక భావాన్ని నీటి చెలమ దశనుంచి కొండవాగు దశకు అభివృద్ధి పరచిపోయా రాయన అలసిన ఏకాంతం తనకు ప్రవాసమైనా, స్వీయాత్మక దృక్పథానికి పురిటి గది అయింది కవిత్వం మళ్ళీ ఆత్మనాయకం కావడమేగాక ఆత్మాశ్రయం కాగలిగింది. అనుభూతి వైయక్తికమైతేనేమి, సంకుచితమైతేనేమి, లోతైపోయింది మార్మికత దానికి తత్వవాసన నిచ్చింది మానవతా దృక్పథం దానికి మహనీయతాభమాపాదకమైంది తిలక్ ఆధునికుడేగాని, with a difference

త్వమేవాఽ హమ్ రచన ఆరుద్రలో ఆవరకే ఉన్న ఒక ధోరణిని నిర్ధరించిందేగాని, దానితోనే ఆయనలో ఆధునికత శ్రీకారం చుట్టుకోలేదు. శ్రీ శ్రీ ప్రయోగ పరత్వం ఆరుద్ర మనస్సును లాగినంత బలంగా శ్రీ శ్రీ అభ్యుదయ పరత్వం లాగలేదు నారాయణబాబు, పఠాభి కవుల వైచిత్రి ఆ మనస్సు పసితనంమీద గట్టి అచ్చువేసింది సహజంగానే స్వచ్ఛందతా ప్రేమి కావడంవేతనేమో, ద్వితీయ యుద్ధకాలపు సేనా పరివార జీవితంలో తాజా పాశ్చాత్య సాహిత్య బావాంకురాలను తెచ్చి నాటి మొక్కలుగా పెంచి మరెవ్వరూ చేయనంతగా తెలుగు కవిత్వంలో ఆధునికతకు ఒక తోపు వేశా రాయన తెలంగాణా భూమి పోరాటంతోటిగాక రజాకార్ల దౌర్జన్యకాండలో ఒకా నొక సంఘటన కలిగించిన తొలి కదలిక ఆయన మనస్సును వదిలి కావ్యంగా వెలువడేటప్పుడు మట్టుకు కాలసాకల్యచికిత్సగా చిత్ర విచిత్ర సంకేతాల సంభారాన్ని మోయుహాని అత్యాధునిక శబ్దజాలంతోటి పురాణాలనుండి ఏరిన పరిగ మాటలతో కలిసి క్లిష్టంగానూ, బరువుగానూ వెలువడి 'త్వమేవాఽ హమ్' అయింది. ఫలశ్రుతిలోనూ, దండకంలోనూ తథాస్తులోనూ యధార్థ జీవితంలోని దృశ్యాలు కనిపించి రాజకీయ హృదయం సాంఘిక ప్రమేయం తొంగి చూచినప్పటికీ, మేధా ప్రధానమైన ఈ విలక్షణ కావ్యం ఆధునికతా ముద్రను తాల్చినట్టుగా అభ్యుదయ ముద్రను తాల్చలేదు ఇక, ఇటీవల ఆరుద్ర మరో ప్రయోగమైన సినీవాలి మరింత దూరంపోయి లఘు (little) మానవుడి సగటు జీవితంలోని నీరసనిర్వేదాలను వర్ణించినంతగా 'చారిత్రిక' ('historical') మానవుడి సమష్టి జీవితంలోని విశ్వాస విజయ దీక్షలను వర్ణించి

జూసుకోలేదు. రెండూ నిరూప విషయాలే (abstractions) కావచ్చు; ఉద్ధార్య మానవుడు వ్యక్తిగా లఘువూ కాడు, గురువూ కాదూ. చారిత్రిక శక్తుల శలాకలు బొమ్మా కాదు. వాటిని ముందుకుతోసే మావటీడు కాదు. అంటే కాలమనే వాక్యంలో కర్మస్థానంలో లేనట్టుగానే కర్తస్థానంలోనూ లేడు. అయితే వ్యక్తుల సమష్టిగల క్రియాశక్తి వ్యక్తికీ సంక్రమించి అతని లఘుత్వాన్ని అపహరించివేస్తుంది. శ్రీ శ్రీ అన్నట్టు వ్యక్తికి బహువచనం శక్తి కాగలదు ఆరుద్ర వర్ణించిన సూర్యారావనే గుమాస్తా—కార్కు సూర్యారావు—ఆత్మహత్య చేస కొని తన వైఫల్యాన్ని ఇతరులకు చెడ్డదారిగా (Bad example) చూపక చూపిపోయాడు అందుకే, ఈ కావ్యంలో అభ్యుదయాంశ, అమావాస్య ముట్టడిలో కనిపించని శశిరేఖ అనవలసి వచ్చింది.

కురుక్షేత్రంలో అర్జునుడు, షేక్స్పియర్ నాటకంలో హేమ్లెట్, డాస్టోయ్‌వస్కీ నవల Crime and Punishment లో రస్కాల్నికాఫ్ ఈ ముగ్గురి మానసిక సంక్షోభం ఏకవిధమైనది కాకపోయినా, సంక్షోభం మాత్రం సర్వ సామాన్యమే కాబట్టి, బైరాగి నూతిలో గొంతుకలు కావ్యంలో ఆధునిక మేధావి చిత్తచాంచల్యమూ డోలాందోళనమూ, ఆ కావ్య పాత్రల స్వగతాల ద్వారా ఆవిష్కృతా లయ్యాయి కవిమాత్రం ఆ అనిశ్చయ వైఖరిని వదిలిపెట్టి చాలా ముందుకు నడిచి వచ్చారు. నేటి బైరాగి రచనలలో ఆ మేరకు ఆధునికతను అభ్యుదయ దృక్పథం ఆక్రమించింది. ఇది తిరోగమనమనేవాళ్ళు ఉండవచ్చుగాని అభివృద్ధి అనే నే ననుకొంటాను.

కవిగా పుట్టీ పుట్టకముందే ఆధునికతను స్వీకీయం చేసుకొన్న అజంతా వివి రచనలన్నీ ఆ ధోరణికి పాఠశాలలై కొత్తకారు కవులలో ముఖ్యంగా హైదరాబాదీయులకు వరవడి పెట్టగలిగాయి. చెట్లు కూలుతున్న దృశ్యం వంటి ఖండికలలో గుమాస్తా వెంకట్రావు మరొక లఘు మానవుడు ఆ పాత్ర ద్వారా కవిచేసే సమాజ విమర్శ ధ్వనిప్రాయంగా ఉండి సంకేతాలలో కప్పబడి అజంతా కవిత్వానికి అనితరమైన తీవ్రతనూ, గాఢత్వాన్నీ ఇస్తుంది. ఇంత దీక్షతో తదేకతతో కావ్య నిర్మాణంచేసే కవి కూడా మరొకడు ఆధునికులలో కనిపించడు. పదాలకు రంగూ రుచీ వాసనా ఉంటాయని అజంతా కవిత్వం నిరూపించినంతగా మరొకటి నిరూపించదు రాసిన ఖండికల సంఖ్య చేతివేళ్లమీద లెక్కింపదగినంతదే కావచ్చుగాని, వాటి ప్రభావం అతుల్యం.

నేటి కవిత్వంలో కేశవరావ్, మోహనప్రసాద్, ఇస్మాయిల్, అశోక్‌వంటి కవులు ఇంగ్లీషు పద్యా లేమో నన్నంత భ్రమ గొలిపే తెలుగు వచన కావ్యాలను రాస్తున్నారంటే, తమకు తెలిసో, తెలియకో ఈ ఆధునిక కవుల వారసులై ఉండుచేతనే. దాశరథి, నారాయణరెడ్డి కూడా కాదు, తిలక్ పుణ్యమా అని కాల్పనిక దృక్పథం మళ్లీ మూర్ధాభిషేకం చేసుకొని, ఆరుద్ర, అజంతాలధర్మమా అని అవిశ్వాస పూర్ణమైన గవేషణాత్మకమైన ప్రయోగపరతకు పునర్జన్మ ప్రాప్తి కలిగి, కొండవాగుగానే ఉండిన ఆధునికత ఇప్పు డిప్పుడు దరులొరసి పారు గాంగ నిర్ఝరిణి కాలుగుతున్నది. హేళన చేసిన వారిప్పుడు దాని నారాధించవలసి వస్తున్నది యువ కవులకు అశ్రవ లబ్ధమైన పిత్రవ్య ధనం అయి, ఆస్తి అయి చివరకు అస్థిగత రక్తసారం అవుతున్నది. ముందున్నది ముదుసళ్ల పండుగ కవిత్వానికి కాదు, అభ్యుదయ కవిత్వానికి మాత్రం ఇది రాహుగ్రహణమే!

## మయూర నృత్యం:

మూగిన వానకారు మబ్బులను జూచి మురిసి పురివిప్పి వివశమై, నర్తిస్తున్న అడవి నెమిలికి, మోహరించి ఉన్న మబ్బులనుంచి ఊడిపడబోయే చిచ్చరపిడుగు గురించిన స్పృహ లేదు అలాగుంది, మార్మిక, తాత్త్విక, మత విషయిక, వైయుక్తిక, విధ్వంసాత్మకాది నానావిధ వాదాల వాగ్వివాదాలతో ఘూర్ణితమౌతున్న సాహిత్యావరణాన, సాధిక్యతా ప్రలోభమై, స్వాధీనతా పరవశమైన నేటి తెలుగు కవి స్థితి నేటి తెలుగు కవిత్వంలో వస్తువైవిధ్యం లేదన్న వాళ్ల కనుజూపు నమ్మదగిందికాదు వైవిధ్యం మాత్రమేకాదు, విభిన్నత స్పర్ధామగ్నత ఉన్నాయి దానికి.

ఒక వైపు తన జాగాలో అభ్యుదయ తరువు కొమ్మ రెండవారి మోడవుతున్నా, ఉమ్మకాపు కాస్తూనే ఉంది. విశ్వాసోత్సాహాల తైలం అడుగంటి 'జేజి' కొట్టుకలాడుతున్నా అది ఇంకా కొండెక్కలేదనే ఆశ కలిగిస్తూ, అడపాదడపా కలనుంచి మేల్కొన్నట్టు సంభ్రమంగా సోమసుందర్, ఆ అగి ఒళ్ళు విరుచుకొంటున్నటుగా ఈ వ్యాసకర్తనైన నేను, వాసనాబలంవల్లనూ, మనస్సు చేతవల్లనూ పక్క దారులనుంచి కాళ్లను పాత దారులకు మరల్చుకొంటున్నట్టుగా కుందుర్తి, ఉడిగిఉడగని మనోయవ్వనాన్ని పూన్చుకొని బాగా వలచనైన నన్నగిరి పూర్వాఖండశోభకు కొనసీడలాగా శ్రీ శ్రీ, అభ్యుదయ కవిత్వ వస్తువుగా లోకానికి అవసరమైనంతకంటె ఎక్కువగానే పరిచితమైన దానికి కొత్త రంగు లద్దుతూ మాసికలు వేస్తూ బండకేసికొడుతూ నీరిమ్మూలీ దానికి పూర్వ ప్రాభవాన్నీ ప్రాచుర్యాన్నీ కలిగించ జాల పోతున్నారుము 'రష్యాగురు ధూప' వాసనలో చీని చీనాంబర ధారణలో మణిగి మాటుబడ్డాయి. రష్యా యాత్ర సందర్భంలో శ్రీ శ్రీ రాసినది అవసర నైవేద్యం అయినంతగా హృద్యమైన కవిత్వం కాలేకపోయింది అయితే, దేశ దేశాంతర రాజకీయ ఘటనలు—ఎన్నికలు, కలవారి ఆగడాలు, ప్రజాతంత్రం బండారాలు, ప్రభుత్వ సామ్యవాదం లొచ్చులు, నీగ్రో పరితాపాలు, క్యూబా ప్రతాపాలూ, కెన్నెడీ ప్రలాపాలూ, వియత్నాము సంతాపాలు—కావ్య వస్తువును సరఫరా చేస్తూనే ఉన్నాయి. దేశీయార్థిక భగీరథ యత్నంలో ఒక సిద్ధి అనిపించి, పలనాటి గుండె దిటవుగల కుందుర్తిచేత నాగార్జునసాగర నిర్మాణానికి ఒక పాట రాయించిందికూడా. అయితే ఇవేనీకావు, అభ్యుదయ కవిత్వపు దాళువా పంట అనదగినవి. అట్లని ఇవి కుక్కమూతి పిందెలూ కావు.

ఆ పందిరి వెదురుపూటీలు ఈనాడు ముఖ్యంగా, మాత్రాచ్ఛందస్సులతో గ్రాంథిక వాగ్డంబరంతో అవహేళనాత్మక ధోరణిలో రాజకీయరంగాన్ని వ్యాఖ్యానిస్తూ విస్మరణవాదసాహిత్యరంగాన్ని కడిగివేస్తూ కావ్య రచనలు చేస్తున్న రాజకీయోపజీవి గజ్జల మల్లారెడ్డి ఒకరు యతి నియతినీ ప్రాస ప్రయాసనూ గాలికి వదిలి నిర్నిబద్ధ వచన శుద్ధ గతులతో దిగంబర కవుల దూకుడూ, మత పునరుద్ధరణ వాదుల దురుసూ జోడించుకొని కపట మర్యాదలకూ మన్నికలకూ బలాదూర్ చెప్పి పాత్రలనేపాన గానీ, ద్వారానగానీ అచ్చపు తెలుగు తిట్టుకూ అలగా మాటలకూ కావ్య ప్రవేశ గౌరవం కలిగించి మహోగ్రగంగా రాక్షస రాజకీయాన్నీ మౌఢ్య మగ్న సమాజాన్నీ తెగనాడి నిప్పులాంటి నిజాయితీతో—కసితో కాదు—ఇప్పటికి రెండు కావ్య సంకలనాలను వెలువరించి ఉన్నసి విజయలక్ష్మి మరొకరు. ఇద్దరి కిద్దరే ఉద్దండ పిండాలు. కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన చీలికలేగాక రష్యా—చైనా సిద్ధాంత వివాదాలుకూడా మల్లారెడ్డి పుస్తకాల కెక్కాయి. ఎంత ప్రతిభావంతుడైనా కావచ్చు, వ్యుత్పన్నతాలోపం లేకుండా ఉండవచ్చుగాని చర్వితచర్వణమూ తక్షణ మాత్ర ప్రాముఖ్యమూ సంకుచిత పాక్షికత్వమూ మల్లారెడ్డి గేయాలకు చిచ్చుబుడ్ల గుణాన్ని మాత్రమే ఇవ్వ గలుగుతున్నాయి. విజయలక్ష్మి ఆశయం ఎంత ఉదాత్తమైనదైనా కావచ్చుగాని, ఆవేశవిజృంభణం ఔచిత్య భంజకమైనప్పుడు, కళామూల్యాలు దెబ్బతినకపోవు. సత్యానికైనా నగ్నత కవిత్వంలో కూడదు. నిర్భీకమైన ప్రకటనా వైఖరికీ నట్టి (baldness) కూ తేడా లేక పోలేదు. కావ్యం బూతుల బజారు కాగూడదని దిగంబరకవుల అనుభవం చెబుతున్న పాఠం. రాజకీయ కవిత్వమే కత్తిమీద సాముకాగా, శుద్ధ వచన గుణాన్ని విరవలేకపోతే రాజకీయ వస్తువుయొక్క మహోన్నతకు కవిత్వం ఆవిరైపోగలదు. ఈ ప్రమాదం విజయలక్ష్మికే కాదు, రాజకీయకవులందరికీన్నీ ఉంది. సరిహద్దు సైనిక ఘర్షణ సందర్భంగా ప్రభుత్వపరంగానూ కవులపరంగానూ వెలువడిన సమర కవిత, మల్లారెడ్డి లేళ గుంపు కవిత, ఆరుద్ర కుక్క చంపిన బిడ్డ వగైరా కవిత, కవితగా మాత్రం అమరత్వం పొందజాలకపోవడం ఈ సమరబుద్ధిచేతనే.

'కాంగోలో, క్యూబాలో, సైప్రస్‌లో, లావోస్‌లో కాలి కమురు కంపు కొట్టే కాలం కథ' మానవ వ్యథ ('నిన్నరాత్రి') గురించి తిలక్‌లాంటి సుకుమార భావుకు డెంతో పరితపించి ఉండవచ్చు. అభ్యుదయ రచయితల సంఘ సమావేశాలకు పోతూ శ్రీ శ్రీని అభిమానిస్తూ అనుసరించ జూస్తూ వచ్చిన రోజులలో ఆయన రచించిన 'టూలన్', 'సైనికుడి ఉత్తరం' లాంటి ఖండికలు వేరు,

ఇటీవలివి వేరు. సమాజంలో ఒక వర్గాన్ని విశ్లేషిస్తూ, రాసిన రచనలలో అభ్యుదయ వాదులకు కనీసం సిద్ధాంతంలో ప్రధానమైన ఉండిన శ్రామిక వర్గాభిమానంగాక, ఆధునికతకు మాతృపదమైన మధ్యమ వర్గాభిమానమే కనవస్తుంది. అభ్యుదయ కవులకు రెండు తలల నాగుగా తోక వెంబడి నారాయణగా కనిపించిన ఈవర్గం, తిలక్‌కూ, నారాయణరెడ్డికీ అనేకు లాధునికులకూ సానుభూతి చూపదగిన దేవునికీ ఆతని దేవేరికీ సిఫార్సు చేయదగిన కూటమిగా కనిపిస్తున్నది. తిలక్ 'గొంగళీ పురుగులు' లోని వైఖరి అపహాళనాత్మకమైనదే కావచ్చు గాని, అది విదిలింపుకాదు, మెత్తటి మందలింపు మాత్రమే నిజానికి, తిలక్ తానే ఒక 'మెత్తని పులి' అనిపిస్తారు. 'చిన్నమ్మా'లో లక్ష్మీదేవిని సంబోధించి మధ్యమవర్గ యోగ్యత గురించి ఆయన తీసుకొని నిర్వహించిన వకాల్తా వటుంచి, ఆయనకు ఒక విధమైన రాజకీయాలే షష్టమనిపిస్తాయి. అయినా తద్విషయకమైన అభిమాన దురభిమానాలు తన కవిత్వాన్ని శాసించి నిర్ణయించనందుచేత, అలంకార ప్రాయంగాతప్ప అభ్యుదయ కావ్య వస్తువు ఆయనకు ఉపయుక్తం కాలేదనాలి

ఉద్యమోపజీవినన్న దాశరథిగానీ, అభ్యుదయ దృక్పథం సుకవిత్వానికి అనివార్యమన్న ఆరుద్రగానీ, తమ అభిభాషణలకు అనుగుణంగానే ఇప్పటివరకూ తమ కావ్యాలను మలచుకొంటూ వస్తున్నారు. ప్రాంతీయాభిమానంతోటిగానీ దేశభక్తితోగాని గొప్పవనదగిన కావ్యాలను రచించి ప్రజా ప్రబోధాన్ని కర్తవ్యవదేశాన్ని పటిష్ఠంగాచేసి కంఠీరవప్రాయుడైన దాశరథి ఇటీవల ఎందుచేతనోగాని కవిత్వాన్ని మరీ పలచన జేసుకొంటున్నారు. అతి చిక్కన అయోమయత్వమైనట్లే అతిపలచన మరొకటి కాగలదని తెలియక మాత్రం కాదనుకొంటాను వేగిరపాటొక కారణమై ఉండవచ్చు దీమా—విపరీతమైన ఆత్మ విశ్వాసం—మరొకటి కావచ్చు. కారణమేదైనా ఫలితంమాత్రం ఇదే. 'తెల్లని చీకటి—నల్లని వెలుగు'లో పదాలను నిర్లక్ష్యంగా వాడినట్లు 'నల్లదనం తెలదనం తలపడుటకు కారణం ప్రల్లదనం! నేను చీకటి తెలుపు! వెలుగు నలుపు' అన్నంత వరకు చమత్కార స్ఫురణ అయినా ఉంది లెమ్మని సరిపెట్టుకొన్న పాఠకుడే, తుపాకీలకు మహాత్ము లిలా బలవ్వవలసిందేనా? నో.. నో......నో.....,అలా జరగడానికి వీల్లేదు. మంచి గెలవాలి! మనిషి నిలవాలి..... ఎలా ....ఎలా ..ఎలా. . .'న్న చూచి కవి ఆవేదనలోని చిత్తశుద్ధినే సందేహించేంతగా (Too Patent) గా మహ తేలికపరుస్తూ భావప్రకటన చేశారని అనుకోవలసి వస్తుంది. 'నేనూ దిగంబర కవిని' అన్న రచనలో వచనంకూడా కవిత్వ రూపాన్ని—రూపాన్నే పొందింది 'మహా శివుడు దిగంబరుడు, శివకవిని నేను కనుక దిగంబర కవిని—' 'నోరి' వారి సూక్తిని నోరార కొనియాడి, మాటికి మారుపాళ్ళు బలపరుస్తున్నాను నేను' అంటూ అప్పటమైన వచనాన్ని విరిచి కవిత్వ చరణాలుగా పేర్చారు. 'నీవు జ్వాలవు నీకు చేలాలు చాలవు పంకంలో పంకజంలా వికసించు' వంటి మంచి గట్టి చరణాలు రాయగలిగిన కవే 'మతాలకోసం మల్లయుద్ధాలు చేయకు జండాలకోసం పుండాకోర్ల కోసం గుండెలు చెండుకోకు—నక్క జిత్తుల్తో పక్కవాణ్ణి మోసం చేయకు! నిరుపేదవు, నీకు పోయేదేమీలేదు నిగళాలు తప్ప!' అని విధ్వంసక నిషేధార్థక ప్రకటనా కదంబాన్ని ఏకధాటిగా పడవేశారు! ఇది కవితా దిగంబరత్వమే. పుండాకోర్లూ, లుచ్చాలూ ఆ కోవలోని మాటలే. పై పంక్తులలోని చివరి మాటలు you have nothing to loose, but your fetters అన్న సూక్తికి కావ్యానువాదమనిపిస్తుంది. ఇంతకూ, దాశరథివంటి కవికి 'సమాధి' చాలా అవసరం. అప్పుడు మళ్ళీ అసలు దాశరథి నారసింహమైపాషాణస్తంభం బద్దలు కొట్టుకొని ప్రవాహినీ గమనంతో పద్యచ్ఛందస్సులోగానీ ముక్తచ్ఛందస్సుగాని విద్యుచ్ఛందస్సులోగానీ శోభిల్లగలరనిపిస్తుంది. 'పెనూష్ణ—గనూష్ణ' లయలుగాక విలయలయలే రువ్వగల ప్రతిభావంతుడాయన.

ఉభయ కవి మిత్రుడా అని భ్రమ గొలిపే సవ్యసాచిత్వం ఆరుద్రది. తన ప్రథమ కావ్యాన్ని మానసిక సోమరులైన 'అనెడ్యుకేటెడ్ ఆంధ్రా' మెచ్చుకోలేదని గాక అర్థం చేసుకోలేదని బాధపడి, తాత్కాలానికి 'హైబ్రో' వైఖరిని విడిచి 'అల్లాటప్పా పాటలు రాజకీయ పద్యాలు, కార్డ్బోర్డు పద్యాలు . పజ్జల కవిత్వం......జీర్ణమంగే సుభాషితం' రాసినా వీటన్నిటికే ఆరుద్రముద్ర ఉండిపోయింది. తెలంగాణావారైన వీర కవులు దాశరథి కూడా గమ్మునుండగా, నిన్న మొన్నటి అలజడుల గురించి వెనువెంటనే ఆరుద్ర కవిగట్టుగలిగారంటే ఆయన కవితాత్మకుగల అభ్యుదయ స్వభావం స్పష్టమవుతుంది. ఆ పేరుగల రచయితల సంఘాన్నీ, దాన్ని పెనవేసుకొని వచ్చిన రాజకీయపక్షాన్నీ దాని అభిమాన కేంద్రమైన రష్యానీ భారతదేశ భూతమైన చైనానీ తిట్టినా శపించినా, ఆయన నీ దృక్పథం విడనాడలేదనేందుకంటె ఈ దృక్పథాన్ని ఆయన విడనాడలే దనడమే సరి 'కవితా సముద్రంలోంచి జీవిత ప్రవాహంలోకీ ప్రపంచ వాహినిలోంచి సాహిత్యసాగరంలోకి' ప్రవేశిస్తూ ఉండగోరుతారు. ఒక్కటే చిక్కు. ప్రపంచం నది, కవిత్వం వాహినీపతి కావడమే విద్వారం. స్థాన విపర్యయం పొందినప్పుడు యథార్థమైనవిగా నిలుస్తాయి ఇటీవలి కాలాన ఆరుద్ర చేసిన రచనలలో మేలైనది మంత్రపుష్పం అనే ఖండిక. 'చైత్రం—పవిత్రం లవిత్రం—తోరణాలు వీరణాలు—హేమంతం విక్రాంతం' వంటి లయ విన్యాసం దీనికి బిగువు నిచ్చింది పాన—నిచ్చెన బంహీనతా పాదకమైనది. కవి భావన కాల ప్రవాహగతతరంగాన్నీ నీలాకాశ స్థితమేఘాన్నీ, ఆశ్రయించి, ప్రస్తుత హేమంత శైథిల్యాన్నీ విషాదాల అసావేరి ఆలాపననీ మీరి ఆమని హిందోళానికి ఆత్రుతపడుతూ, "సహస్రశీర్షాలతో ఒక జీవం రూపించి—సహస్ర కంఠాలలో ఒక గీతం వినదించి—చిగురించిన చైతన్యం చిద్విలాస మొలికిస్తే—పడగవిప్పి మేధస్సే పరవశించి నటియిస్తే—లోహఘంటమ్రోగి మ్రోగి—మెరుపు తీగె సాగిసాగి—నిద్ర వీడి చిద్రూపం—నీహారపు చిత్రపత్రే—రాకెట్టుల తోరణాలు—స్పూట్నిక్కుల వీరణాలు—అణువు గుండెలో మునిషికి—అమరత్వం లభించాక—ఈ కెరటం తరగమీద—ఆ మేఘం తునకమీద—ఫెళఫెళనట్టి గీతంగా— చిరకాలం జీవిస్తా'నని మిన్నంటుతున్నది తథాస్తు అనాలనిపిస్తున్నదిగాని ఆ విముక్తి దినం 'డీ—డే' నేడే అన్నప్పుడు అంతటి ఊహా కుప్పగూలుతున్నది. 'సమ్మె—దొమ్మి—బందు చిందు' పోవాలనడం, వాటికి దారితీసే పరిస్థితులు పోవాలనడమేనా? ఈ జాబితాకు లాకౌట్ కూడా చేర్చి ఉంటే బాగుండేది. ఆరుద్ర దృక్పథంలో వచ్చిన మార్పు ఈ మినహాయింపువల్ల కూడా అసంకల్పితంగా బయల్పడకపోదు. అయినా గుడ్డిలో మెల్ల పది వేలు.

ఈ కాలంలో Fashion లయి కూచున్న మానవతావాద విషయంలోను ఆరుద్రే మేలనిపిస్తున్నారు. కారుణ్య దృష్టి ఒక్కటే మానవతావాదంకాదు. మానవ ప్రయత్నం సాఫల్యం పొందేటట్లుగా మానవశక్తి విస్తృతమయేట్లుగా, హేతువాదానికి నిలిచి పారలౌకికాన్ని నిరాకరించి ప్రాపంచిక వ్యవహారం మానవ ప్రమేయం మాత్రమే అయేట్లుగా స్వతంత్రాలోచననూ అనుభూతినీ కార్యకరణనూ ప్రోత్సహించే తాత్విక వైఖరిని Humanism అని వ్యవహరిస్తున్నారు. ఇది ప్రగతి విశ్వాసభరితమైనది.దీన్నే Promethean view of civilization అంటున్నారు. నాగరికతా పారమ్యాన్ని ఆకాంక్షిస్తుందిది. ప్రొమిథియస్, హెర్క్యులస్‌వంటి క్రియాపరులైన మానవ మహా సాహాయ్యకులకు పట్టం కడుతుంది. మత విశ్వాసపరతను తుడిచివేస్తుంది మానవ వ్యక్తిలో సహనం, సమదృష్టి, నిష్పాక్షికత, దయ, సానుభూతి వంటి సద్గుణాలను పెంచుతుంది. 'మంచిని' పెంచుతుంది. ఇది స్వాప్నికంకాదు 'ఏకాంత యవనికాభ్యంతరాలకు' పంపదు. ఉదారమైన (Liberal) వైయక్తిక చిత్తవృత్తిమీదనే ఆధారపడి ఇది చాంచల్యమయుంగాక, ఒక క్రియాశీలమైన నిరంతరమైన భావ వైఖరి (Temper) గా భాసిస్తుంది 18

జీమూత వాహనత్వం ఏ వ్యక్తి నావహిస్తే అత డొక హాస్యామనిష్టు కావచ్చు. హృదయౌదార్యం ఆ వ్యక్తికి ఇతోధిక ఘనత నిస్తుంది. ఉత్కృష్ట మానవీయ పతాక నెగురవేసి ఎన్నో కావ్య రచనలు చేసిన తిలక్, ఈ ధోరణికి తెలుగు కవితలో ఆద్యుడూ, బాధ్యుడూనూ మానవాశ్రువులను తుడిచే ప్రతిదీ గొప్పదనే. అయినా అశ్రుప్రవాహ జన్మస్థానాని గమనించి దాన్ని తీసివేయునంత వరకు ఇది ఆరాటంగానే మిగిలి త్వరలో అలసత్వానికి దారి తీస్తుంది, దౌర్బల్యాన్ని కనికరిస్తే చాలదు, దానికి వత్తాసినిచ్చి బలంగా మార్చాలి. కానప్పుడు ఆత్మ రక్షణాసహమౌతుంది—ఇంకా ఇంకా. తిలక్ మానవతావాదంలోని లోపమంతా ఇదే అది నివేదనతో అంతమౌతున్నది నిర్వేదంగా పరిణమిస్తున్నది. 'జనతా హృత్ కల్హార వికాసోత్సవం జరిపించబూనుకొన్నప్పుడు' సోమసుందర్‌లో

గానీ ('ఆగతానికి శుభారంభం') మానవుడు నిజానికి పరమాణువు అయినా అతని కతడే ప్రభువు అని ఆరుద్ర 'కాస్మిక్ కావ్యం' చాటినప్పుడుగానీ, నిరాశ లవలేశమైనా కనుదగులదు సాహసే జీవన సమరంలో గెలుస్తాడని తెలిసీ, 'శిఖరారోహణ'లో తిలక్ ఇలా తీర్మానించడం ఆయన దోరణికి అనువుగానే ఉంది.

మురికి కాల్వమీద ముసలితనంమీద మృషా జగతిమీద
మహోదయం వికసించదు వసంతం హసించదు

ఈ భావపేశలత్వం తిలక్‌కూ, అనేకు లితరులకూ మార్మికవాదంనుంచి సంక్రమించిందేమో! నేటి కవుల కీ వాదం కూడా వస్తు భిక్ష పెట్టింది సోమసుందర్‌చేత చిన్ననాడే 'మిణుగురులు' రాయించింది. తిలక్ సరేసరి—తెలుగు రవీంద్రుడే ఈ విషయంలో యోగుల, యోగ సాధకుల మార్మికానుభూతికీ కవుల కావ్యానుభూతికీ సామ్యం—రసానందానికీ బ్రాహ్మానందానికీ మోస్తరే అయితే అదే కాదిది. మార్మికవాదుల ఈశ్వరుడు సగుణుడేగాక మానవ సాహచర్యం వినా తనీగా అతీతంగా జీవించలేడు. ఒకరి కొకరు లోపపూరకులు. ఒకరితో ఒకరి కక్కర. ఈ అనుభూతి కావ్యగతమైనప్పుడు మధు పాత్రల సంకేతాలూ వీణా నిక్వాణాలూ తంత్రీ ప్రకంపనాలూ, పూలూ చేలూ పక్షులూ వృక్షాలూ జీవన విలాసం సర్వాంగ సుందరిగా దర్శన మిస్తుంది ప్రకృతి పులకిస్తుంది శూన్యం సైగ చేస్తుంది. రవం రహస్యా లూదుతుంది ఇంత అందమైన సమ్మోహకరమైన భ్రమ కవిత్వంలోకి వస్తే రమణీయాక్షర రూపిణి అవుతుంది. ప్రణయ సంబంధమైన మార్మికవాదం యోగులకూ రసయోగులకూ సామాన్యమైన సాధన జ్ఞాన సంబంధమైనది ఐహికాన్ని నిరాకరిస్తే ఇది తల దాలుస్తుంది మనిషిలో దేవుణ్ణి దేవునిలో మనిషిని దర్శిస్తుంది ఇది ఆనంద యోగం [14]

'రత్న కంకణ హస్తం' దిగ్జరేఖ నావలినుంచి పిలవడం, తన వెనక ఎవరో నీళ్ళు కలిచిన ధ్వని చేయడం, ఆకాశం విశ్వ రహస్యాన్ని వినిపించడం, దేవుడే దిగివచ్చి ఎదురు తిరిగిన కుమారుడి విషయమై కళ్ళనీళ్ళు పెట్టుకోవడం వగైరా ఈ సామగ్రే తిలక్ అభిమానులకు ఆయన కావ్యగత ప్రణయ వర్ణనల కప్పుడే రాధా మాధవ వ్యవహారానికి లాగా ఆముష్మికంతో ముడివేశారు

కాలం అనంతత్వ, అఖండత్వాలను గురించి గానం చేయడం కూడా ఆధునికతకు ఒక లక్షణమని డా సుప్రసన్న రాసిఉన్నారు నిరూప (abstract) పదార్థమైన కాలాన్ని జ్ఞానతత్వంగా భావించిన కవులలో ఆరుద్ర, కుందుర్తి, సోమసుందర్ ప్రముఖులుగా కనిపిస్తున్నారు. తమ 'నగరంలో వాన' సంకలనం చివర 'అముద్రిత కావ్యం'లో ఒకనాటి విప్లవ భావుకుడైన కోటేశ్వరరావనే పుట్టనిబిడ్డ పుట్టే ఉంటే పెరిగి తల బట్టగట్టాక 'దేవుడికి నమ్మిన బంటు' ఎలా అయిఉండేవాడో చమత్కారంగా కుందుర్తి కథనం చేశారు. దాన్ని వీలు చేసుకొని సుప్రసన్న, ప్రగతి వాద కవులలో కూడా ఆముష్మిక చింత ఎలా మొనజూపిందో నిరూపింపబోయాడు [15] ఆయనకు పూర్తిగా తృప్తి కలిగించే మోతాదులో ఇది ఇంకా పెరిగిపోలేదు ఇదికాదు, కాలం తీరులో కుందుర్తి కాలా న్నొక రంగుల రాట్నంగా భావించి దానికి వర్తులమైన గతిని సమకూర్చిన పద్యే గమనింపదగింది కాలం కూడా జీవిత ప్రతిబింబంగానే కనిపించేంత జీవిత నిబద్ధుడు కుందుర్తి. దేవుడికేమోగాని మానవుడికి 'నమ్మినబంటు', ఆస్తికుడు కానక్కర లేకుండానే మానవుడిలో దైవ సాక్షాత్కారం పొందగలరు. సోమసుందర్ కూడా 'కాల జ్ఞానత్రయి' అంటూ అవిరళమైన దోరణిలో ఒక ఖండిక రాశారు వీరంతా ఆరుద్రకు లోకువే. 'ఆవాహన' అనే ఖండికలో కాలం అనే ఇంద్రజాలం విభ్రమం కొలిపినట్టు రాస్తూ, 'తాను కాల జ్ఞాన రహస్యం తెలుసుకొంది, 'కావ్యాలు చదివాను చదివాను తత్త్వం, కర్మ యోగులను దర్శించాను చేశాను తపం, ఎత్తులకు ఎగిరాను లోతులు శోధించాను' అని తన సాధనను వివరించారు అయితే సర్వవిపానం 'కాలం స్వరూపం విరి, కాదు ఆవిరి కాలం రహస్యం పురి, కాదు ఊపిరి, మానవుని నిట్టూర్పికి వోదార్పు మార్పుల కూర్పు ఏ నము చేతకాని నేర్పు, పర్వలోకైకనాథుని చేతిసి మూడు తీగల హార్పు' సిద్ధులకూ, సాధకులకూ తెలియవలసిందేగాని, ఈ కాల స్వరూప నిరూపణలోని మాటల కూర్పు నా కంతు జిక్కలేదు కాల జ్ఞాన తత్వగాన మిలా అర్థాన్ని అడవికి తోలుతున్నది.

ఈ ముసుగులో గుద్దులాటలు లేకుండా నేరుగా తత్వాన్నీ, తద్విచారన్నీ కావ్యస్థం ప్రయత్నాలూ లేకపోలేదు నిరూపమైన కాల తత్వ జిజ్ఞాస నుంచి పై మెట్టే, నామరూపరహితమైన ఈశ్వరతత్వ జిజ్ఞాస శ్రీశ్రీ సదసత్సంశయం' ఇలా సాగింది ఇదివరలో ఈశ్వరపద జిజ్ఞాసువులుగా పేరుబడిన వారిని, వృద్ధ నారీ పతివ్రతా బాపతు మనుషులను లోకద్వేషులను నిలదీసి 'ఫిలోసఫర' జీవిత ద్వేషాన్ని నిరూపించి, నైతిక పదజాలాన్ని వాడేప్పుడు ఎవరికి తోచిన అర్థం వాళ్ళు చెప్పుకోవలసిందే నంటూ పరమార్థం సామాజిక, సామూహిక సద్వర్తన'మని శ్రీ శ్రీ ముగింపు జేసిన ఆ బృహత్ గేయం ఆయన ఆస్తిక్యానికి కాదు, సంశయవాదానికి (agnosticism) నిదర్శనం కావచ్చునేమో! అనుభూతి' అనే గేయంలో వేగుంట మోహన ప్రసాద్, నాదస్వర శ్రవణంనుంచి క్రమ క్రమంగా మాతృ మధురస్మృతి మీదుగా చైతన్యంనుంచి 'ప్రప్రథమ జీవకణ సంచలనానికి', స్వస్వరూపానికి తీసుకుపోగోరుతున్నారు ఇదీ నేరుగా తత్వగానమేకాదు. తత్వం, గిత్వం లేక అహం నియంతృత్వం తెగ మీరి భౌతికవాద ప్రవృత్తిమీద తన పదమూడవ శతాబ్దినాటి వంకి కత్తితీసి పాల్కురికి సోమనాథుని ఆధునికావతా న్నంటూ శివ మెక్కి గావుకేకలు వేసి రక్తబలి కోరిన క్షుద్రదేవతలా గణాచారిలా ప్రమథుడిలా మతాన్ని మళ్ళీ పునరుద్ధరి చాలంటూ ముదిగొండ శివప్రసాద్ రాసిన 'మహాసర్గ' సంకలనాన్ని వీపుదట్టి పురిబెట్టిన పత్రికలూ పాఠకులూ ఉన్నాయి 1 రు ఆధునికత అంటే ఇదేనని కూడా అనగంరు.

శృంగార వస్తువు తెలుగు కవిత్వాన్ని విడిచిపెట్టదూ, ఆ అక్కరకూడా లేదు జీవితానికి ఉల్లాసాన్నిచ్చేది కాబట్టి అది ఉండవలసిందే అయితే అర్హమైన స్థానంలో ఉండవలసిన మితిలో ఉండాలి యువకులను ప్రలోభపెట్టి పక్కదారుల కీడ్చుకు పోగలగడంలో ఈ పేరు బెట్టుకొన్న ప్రతిదీ చాలా గట్టిది సినిమాలూ పత్రికలూ ఒకలాంటి క్షుద్ర శృంగారాన్ని పోషిస్తూ ఉన్నాయి అడపాదడపా కవులూ దాన్ని చేబడుతూ ఉన్నారు 'స్త్రీ రితి నామాపి మధురం'కదా! బూతు మాటల ద్వారా 'సెక్సు' దాహాన్ని ప్రత్యామ్నాయ పద్ధతిలో దిగంబర కవులు తీర్చుకొంటూంటే, తదితరులు నఖాల నెలవంకలు ముద్రిస్తూ పెదవుల సూర్యాస్తమయ దృశ్యాల నడుమ దంతాల శశిరేఖలను చూస్తూ తృప్తి పడవలసి వస్తున్నది క్లుప్తంగా కుదించినటు గా ఉన్న 'భగ్న కామం'లో ఇస్మాయిల్ 'నిన్న—నా చేతి వేళ్లను కొవ్వత్తులుగా వెలిగించుకున్నా, రేపు నీ నర నరాల శిఖరారోహణ చూడాలనుకొన్నా, ఇవాళ—ఒక్కణ్ణే చీకటి తిమింగలం కడుపులో తొడలు విరిగి పడుకొన్నా'నని జాలి గొలుపుతున్నారు 'నే భయంకర కాముకుడ, నా కరాలచితిని కన్యకలు వెన్నవలె కరిగిపోదురు' గుర్తు వస్తున్న దెందుచేతనో! వయస్సుచేసే అందమైన మోసం అన్ని తరాలకూ ఒక్కలాగే ఉండి ఒక్కలాంటి కావ్యాలనే రాయిస్తుంది కాబోలు! వయస్సు మీరినా ఊహలు పచ్చగా వెచ్చగా ఉండే అదృష్టవంతులూ ఉంటారు సుఖానుభూతి అనుభూతిదాహ మవుతుంది. రసికత లోలుపతగా మారుతుంది అలాంటి చిత్తవృత్తిలో సోమసుందర్ కొన్ని ప్రణయ కావ్యాలను రాశారు 'ఖరారు—బిడారు, పిసాళి—విరాళి, రాకేందువదనా— కుందరదనా, జాగేల— పరాకేల'వంటి పదాల పొందికలోనూ, 'మామక'వంటి ప్రయోగాలలోనూ బావానికి తగిన భాషే సమకూరింది ('వధూమధూలిక') 'మేఘ రంజని' 'సోమరసం సుందర కాండ' వంటి పెద్ద రచనలు స్వీయచరిత్రస్ఫోరకాలూ ఆత్మావిష్కార పరతంత్రాలూ అయినా, వాటిలో వస్తువునుబట్టి భాష మారకపోగా, అంటే ఆ రెండింటికీ పొందిక లేకపోగా, వచనపు వదులూ భావాల సాగతీతా వాటిలో పాలౌతున్నాయి ఇంతకూ ఆ కవి సంధియుగ కవిత, లక్షణాలను కోరికోరీ ముడి వేసుకొన్నారు—అది పీటముడి అయింది రసోల్లాసమయమైన జీవిత చంద్రశాల, రాక్షసత్వ పూర్ణమైన జీవిత వధ్యశాల—ఈ రెండింటి నడుమ ఆయన భావమూ భాష సరిగిపోతున్నాయి. రెండూ కాబోయి పూర్తిగా ఏదీ కాలేని స్థితి ఇది.

కథా కథనానికి గూడా ఆధునిక కావ్యంలో స్థానం కల్పించేందుకు కుందుర్తి సంకల్పించిన ఫలితంగా 'ఆశ' అనే వచన గేయ నాటికను ఆయన నిర్మిస్తే, ఆ ప్రభావంవల్ల కాబోలు శీలా వీర్రాజు (చిత్రకారులూ నవలా కారులున్నూ) 'కొడిగట్టిన సూర్యుడు' రచించారు వస్తుపరమై పాత్రగతమై ఆత్మ దుర్భకుద్యాన్ని విడిచి మరింత వస్తు పరత్వాన్ని (objectivity) సాధించుకొన్న ఈ మేలైన అలంకారాల సాయంతోనే వచన నీరసత్వంనుంచి బయటపడగలిగింది రంధి సోమరాజు 'విరిగిన కల్బల్' కూడా కదన ప్రధానమైన కావ్యమే దీనిలో సంవిధాన కల్పన విశేషాంశం పి వరవరరావు 'చలి నెగళ్ళు' సంకేతమయమై కూడా పిచ్చి వేషాలకూ క్షుద్ర వినోదాలకూ పోక సమాజ జీవిత ఖండాలను కావ్యీకరించడంలో చాలావరకు కృతార్థత పొందింది

కావ్య వస్తు విలా వైవిధ్య సంపన్నంగా నెమలిపురి చందంగా ఉంటున్నది అభ్యుదయ కవిత్వ వస్తువు పూర్తిగా విస్మృతి గర్భాన పడలేదుగాని బలమైన పోటీదారులవంటి ధోరణు లెన్నో వచ్చి, దాని నొక చిన్న మూలకు నెట్టి వేశాయి అయితే దానికీ, వీటికీ ప్రధాన వాహిక మాత్రం వచన కవిత్వమే.

## "రూప విప్లవం"

ముద్దుకృష్ణ, అడివి బాపిరాజులు ప్రారంభించారని శ్రీ శ్రీ వర్ణించిన వచన కవిత్వాన్ని పరిపుష్టం చేసి లోకానికి బాగా పరిచితం కావించింది శ్రీ శ్రీ తర్వాత, పటాభి, పా ప నారాయణబాబు, చిట్ట చివరకు కుందుర్తి, తిలక్, ఆరుద్ర, అజంతా ప్రభృతులు నేటి కదే దాదాపు ఏకైకమై పోయినంతగా పద్యేతర మార్గానికి సింహద్వారమై పోయింది చివరకు దేవులపల్లి కృష్ణశాస్త్రి కూడా ఆ రోజుల్లోనే వచన గేయ మొకటి రాసినట్టు దాఖలా చూపార మిత్రులు సోమసుందర్ తమ పత్రిక తాజా సంచికలో

అంతా నిజమేగాని, వచన కవిత్వ శరీరం నాటిదీ, నేటిదీ ఒక్కటే కాదు ముద్దుకృష్ణ వచన ఖండికలైనా నారాయణబాబువీ శ్రీ శ్రీ వైనా శబ్ద సామగ్రి పదవిన్యాసం విషయాలలో పద్యపు గర్భచెరలోనే ఉండి ఉండేవి భావ 'కవిత్వ' భంగిమ నిలిచి ఉండేది తిలక్, 'ఆర్తగీతం' వాటిబిడ్డే. 'స్మృతి—రుతి—దుస్థితిలాంటి' ప్రాసలు 'సింగారమ్ము—శయ్యా సజ్జితమ్ము' 'రసప్లావితము' లాంటి గ్రాంథిక కావ్య రూపాలు సూచికలు శ్రీ శ్రీ 'కవితా, ఓ కవి 'గేయాన్ని మాత్రాబద్ధ రచనగా నిరూపించే విఫలయత్నం చేసిన కుందుర్తి 'కొంపెల్ల జనార్దనరావుకోసం' గేయాన్ని ముట్టుకోలేదంటే వచన కవిత్వ ప్రగతిలో శ్రీ శ్రీ ఎంత పెద్ద అంగ వేశారో గమనించారన్నమాటే. అయితే పత్రికలో విడిగా వచ్చి, పుస్తకాని కెక్కని శ్రీ శ్రీ రచన ఒకటి, ప్రారంభకాలంలో శ్రీ శ్రీకి గూడా అనివార్యమైన భావ కవిత్వ పదబంధ దాస్యానికి నిదర్శనంగానైనా ఇక్కడ ఇవ్వడం బాగుంటుంది అది చిన్నదే

పగలు రెక్కలు ముడిచి, ఎగురు టాపగానే, రాత్రి రాక్షసిలాగు ధాత్రిని పూనుతుంది.

రాత్రి కొలిమినుండి, రాలిన నిప్పుకణాలు, రేగిన దట్టపు పొగలు—ఆకసపు చుక్కల్లా, అల్లాడు మబ్బులూ!

రాత్రి కృష్ణసర్పం, ఫూత్కరిస్తూ ఉంటే, వేదోండ కుహాంలో, లోదోంతరాన చీకట్లు!

రాత్రి రాక్షసి కన్య, కాలంతో వ్యభిచరిస్తే, ధాత్రికి భూకంపాలు, భూమికి మహామారి, విషూచి మశూచికాలు![16]

'మాత్ర'లను మింగే ఆరోజుల్లోనూ శ్రీ శ్రీ మార్క్సపద్యాల సంఘటిత శబ్దశక్తి నియమాలమీద నిఘా పాదాలకూర్పుపట్ల మెలకువ—దీనికిన్నీ 'మహాప్రస్థాన' ఖండికలకున్నూ బాంధవ్యాన్ని నిరూపించక పోవు, అయినా ..

ఇలా జంకుతూ కొంకుతూ మొదలై ఇప్పుడు నిశ్శంకగానూ నిబ్బరంతోనూ సర్వే సర్వత్రా వర్ధిల్లుతూన్న వచన కవిత్వ విషయమై ఇప్పుడిప్పుడే, జిజ్ఞాస ప్రారంభమవుతున్నది. 'ఫ్రీవెర్స్ ఫ్రంట్' అనే దొకటి ఏర్పాటు చేసి వచన కవితగా మేలైన పుస్తకానికి 'తిలక్ బహుమతి' పెట్టి సంస్థాకృతి నిచ్చిన కుందుర్తి, గోపాలచక్రవర్తి సంపాదకత్వాన 'వచనకవిత' అనే విమర్శ గ్రంథం వెలువడడానికి కారణభూతులయ్యారు కవిత్వ రూపంలో వచ్చిన ఈ మార్పుకు 'రూపవిప్లవం' అని నామకరణం చేసిందీ వారే[17]

యమాతా రాజభానసలగాన్ని ముందుంచుకొనీ సులక్షణ సారాన్ని భట్టీయం వేసీ ఏ కొత్తకవీ కవిత్వరచన కుపక్రమించడం లేదీ రోజుల్లో—సరాసరి నేరుగా వచనకవిత్వంలో వచ్చి పడుతున్నాడు ఎటొచ్చీ ఛందస్సు నరనరానికీ పట్టిపోయిన అన్నయ్యలకంటే వీళ్లే ధారాళంగా రాయగలుగుతున్నారు 'జాబిల్లి—జడమల్లి' 'నీతి — నాతి', 'జాడ—ఓడ'ల ప్రాసపేర్పులు గానీ, 'నక్కలు కుట్రపన్నే నట్ట డివిలోకి', 'నత్తగుల్లలు పిలిచే రత్నాకరంలోకి' వంటి పాదాద్యక్షద్వితీయాక్షర నిర్బంధాలుగానీ వీరిని బాధించడంలేదు ఇది చేదనికాదు. అనవసరమని మాత్రమే ఇవి ఉండీ వచనం కవిత్వం కానట్టే, ఇవి లేకా కవిత్వం వచనం కాబోదు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ఎన్నడనగానో కవిత్వానికి లయను కలపడం నైచ్యాన్ని ఆరోపించడ మంటూ, 'ఆలోచనావృతమైన దానికి, ఆపాత మధురమైనది తోడ్పడుతుందనుకోడం హాస్యాస్పదమైన విషయం'గా కొట్టి వేశారు[18] యతిప్రాసలేవో ఒరిగిస్తాయని కాకుంటే, 'సహజ సూర్యోదయం కోసం ఇహ నిరీక్షించలేను' వంటి హంసపాదులు వచ్చి దూరకపోయేవి; 'రంగు రంగుల కలలు — కంగారు పెట్టే కలలు—బంగారంలాంటి కవ్వులు — సంగీతం పాడే కలలు' సంగీతం పెట్టె పలికించే వర్ణాలు అనవసరమయ్యేవి శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి వృద్ధుడైనా యువకుడుగా అలా రాసిపోతే, ఒక ఆధునిక విమర్శకుడు, కవిత్వగుణంలేని రచనకు గూడా మాత్రాచ్ఛందస్సు 'కృత్రిమకవిత్వ భావన' కలిగిస్తుంది, అంటున్నారు[19] అయితే వట్టి బహిరాకృతి చేసే మోసమూ పెట్టే భ్రమా వచన గేయంలో కంటే కవిత్వ రూపమాత్రమే గల మాత్రా బద్ధ గేయంలో ఎక్కువ. ఇదే ఎక్కువ ప్రమాదకారి

శబ్దలయ ఉన్నా, లేకున్నా భావలయ ఉండి కవిత్వానికి శోభనిస్తుందని సుప్రసన్న అన్నారు హంగులు మరెన్నైనా కావలసి రావచ్చునేమోగాని ఆకార పుష్టి నైవేద్యనిష్టకి దారితీయక, వచనకవిత్వం ముందుగా కవిత్వమై ఉండాలి. ఈ రంగాన వినవచ్చిన నీరస నిర్జీవ కంఠాలు కొన్ని తిలక్‌కు కవిత్వం సామాన్యత్వస్థాయికి దిగజారి పోతున్నదనే బాధ కలిగించింది గాని, 'నవత-కవిత' వంటి రచనలలో ఆయన చూపిన దారి మంచిదికాదు ఈసామాన్యత్వాన్ని వచన కవిత్వానికి కలిగించడంలో మిగతావారికంటే ఆరుద్ర ఎక్కువ బాధ్యుడు దాని ప్రచురం చేయడంలోనూ ఆయనే ఎక్కువ కృషి చేశారు అన్ని ప్రయోగాలను ఈరూపంలో మంరొకరు చేయకపోగా, అవిరళమైన సృజనలో వచనానికీ కవనానికీ మధ్య గల రేఖను దాదాపుగా తుడిచివేయడం జరిగింది ఆయనచేతనే గొప్పవీ చప్పనివీ వచన కావ్యాలను ఆయన వెలువరించారు 'మంత్ర [illegible]' రాసిన హస్తమే 'ఆహా! విజయవాడ!' లాంటి Thin కవిత్వాన్ని రచియించదని ఎవరనుకోగలరు?

వచనకవిత్వం ఒక ఉద్యమమని అరిపిరాల విశ్వంలాంటి వారంటే ఒప్పుకో బుద్ధికాలేదు అభ్యుదయోద్యమంలాగా ఇది ఒకేబోదెనుంచి వెల్వడి వివిధంగా సాగిన శాఖానికరం కాదు ఇందులో వైవిధ్యంకంటే విభిన్నత ఎక్కువ పలుపెన్నులు పట్టిపోయే రచయితలుండబట్టి ఇదొక్కటే సర్వసాధారణ లక్షణ మవుతున్నది.

ఈ రూపం భావకవిత్వ పద్యగేయ రూపంమీద తిరుగుబాటుగా అవతరించిందా? అవునంటున్నారు రాచమల్లు రామచంద్రారెడ్డి! (రా రా) లలిత (Lyrical) ఇతివృత్త నిర్వహణకు గాకుండా, తాత్విక వేదనాభావాన్నీ ఆలోచనా భారాన్నీ వెలువరించేందుకు వాటికంటే ఇదే బాగా అక్కరకు వస్తుందని,

ఆధునిక కవిత్వపు యతి వృత్తాలకు శుద్ధ గేయాల లయబద్ధమైన కురంగ గమనం కంటే క్రమలయలేని వచన గేయపు అలసగమనం అనుగుణంగా ఉంది[20]

చెప్పారు. అయితే లలితమైన ఇతివృత్తాలకు గూడా తిలక్, సోమసుందర్ ప్రభృతి కవులు మంచి వచనగేయాలే దక్షతతో సృజించారు వివేక భ్రష్టంగాకున్నా ఈ సంపాతాలు పద్యచ్ఛందస్సుల దుర్గమ, దురవబోధక శిఖరాల

నుండి, మాత్రాచ్ఛందోరూపాల పేత భూములను వదిలి ముక్తచ్ఛందాల విరివి విప్పూగల బయళ్ళకు దిగివచ్చాయి. అవతరణమైనా అధిరోహణమైనా ఇవి అపూర్వమైన భావవు ప్రకటనావకాశ విస్తరణమని అద్దేపల్లి రామమోహనరావు అంటున్నారు. ప్రజల జీవన విధానానికీ సాహిత్యరూపానికీ అంతస్సంబంధమున్నదని విశ్వనాథ, శ్రీశ్రీలు చెప్పిన మాటల అర్థాన్ని బాగా సాగదీసి, నేటి వ్యక్తివాద ప్రజాతంత్రయుగానికి ఈ రూపమే తగినదని వాదిస్తూ, 'స్వేచ్ఛా ధృక్పథంయొక్క చరమ వికాసమే' 'వచనగేయం సామ్మంటున్నారు.[21] పరిణత సమాజం(!) యొక్క అనంతకోటి వైవిధ్యాలను ప్రతిబింబిస్తుందట వచన కవితావిధానం వ్యక్తివాదులుగాని అభ్యుదయులూ ఈ విధానాన్నే అనుసరిస్తున్నప్పుడు ఈ మాత్రీకరణ లెలా నిలుస్తాయి? పూర్తి అరాచకాన్ని కోరే నిర్నిబద్ధ జీవనవిధానవాదులైన దిగంబరులదీ ఈ విధానమే నాయె, వారు కాదన్నా కూడదన్నా! కవిత్వానికి ఇది హైరోడ్ అనేవారు అన్ని దేశాలలోనూ ఉన్నారుగానీ, రామమోహనరావు ఆపాదించిన అన్ని సల్లక్షణాలను దాని కాపాదించినవారు లేరు. సమస్త శిల్పాల్నీ జీర్ణించుకొని ప్రపంచమంతటి విశ్వరూపంతో వికసిస్తే మంచిదే గాని, అత్యుక్తికీ అన్వతీకరణకూ వెంట్రుక వాసి దూరంకంటె ఎక్కువ ఉండదు. ఇది విద్యుచ్ఛందస్సు, ఎందుచేతనంటే దీని యక్స్‌రే కిరణం హృదయాలను శోధించిగానీ విడవదని దాశరథి చెప్పినదాని సారాంశం కూడా, అతిశయోక్తులు తీసివేసిన రామమోహనరావు వర్ణనలోని అంతస్సత్వమే.

## 'సాహిత్య స్టంటు'

దిగంబర కవుల ప్రస్తావనలేని ఏ నవ్యసాహిత్య సమీక్ష కూడా సమగ్రతను సాధించుకోలేదు సరిగదా, 'ఘర్మసాలాను' కోల్పోయి ఉప్పులేని చప్పిడి తిండి కాగలదు ఇప్పటికి మూడు 'దిక్‌ల' సంపుటాలను వేళకానివేళలో ఊరుగాని ఊళ్ళలో విచిత్ర వ్యక్తులచేత ఆవిష్కరింప జేసిన ఈ అరడజను ముసుగు కవులు ఇప్పటికే కవిపంక్తి బాహ్యులయ్యారు; అక్షర రాజ్యంలో out law అయ్యారు. వీళ్ల విద్యుచ్చికిత్స (Shock Treatment)లోకంమీద పని చెయ్యకుండా వచ్చింది. పాఠకులకు ఈ తిటూ బూతులూ అలవాటై ఆమాటలకు గల భావప్రకోపక శక్తి ఉడిగిపోయింది. ఒక ఆంగ్లపత్రికలో ఒకరు రాసినట్లు, **Obscenity can no longer be counted on as a trigger word.** హిందీలోని 'నయీకవితను' సమీక్షిస్తూ, దిగంబర కవి ప్రముఖులైన నిఖిలేశ్వర్ 'సాహిత్యస్టంటు' అని వర్ణించింది, తమతలలకు టోపీగా సరిగా అమురుతుందేమో![28] పొయిట్రీ ఎలాగుండరాదో అలా రాస్తే, అంటే దానికి గల సుపరిచిత విశేషాలను తీసివేస్తే, **anti-poetry** అవుతే, దిగంబర కవులదీ అలాంటి దిణుసౌతున్నది. జుగుప్సకోసం-కోసమే— గుప్తాంగాల వర్ణన, సెక్సు పదాలమోజు— ఇవన్నీ 'మానసిక రుగ్మత'కు లక్షణా లంటున్నారు నిఖిలేశ్వర్. 'నయీకవిత'కూ దిగంబర కవితకూ సాజాత్యం ఉందని చెప్పబన్లేదు.

బూతులూ తిట్లూ తెలుగు కవిత్వంలో పాతరపడి ఉన్నాయి. వాటి గురించి పరిశోధక గ్రంథాలూ వెలువడుతున్నాయి. 'జిననాథ దేవుని శిరస్సు,' యోనిద్వారం, 'సర్గద్వారం', 'దొంగలంజకొడుకులు' (శ్రీ శ్రీ) 'ముక్కాలి' పీట వగైరా (ఆరుద్ర) నవకవిత్వంలో దీనికి ప్రారంభకులయ్యారు. తిలక్ అన్నట్లు, ఇలాంటి నగ్న విప్లవం వెనుకనే మొదలైంది శ్మశానాలు, నెత్తుటేర్లు, రాక్షసరతులు, కుష్ఠురోగి కాలిపుండు, రంగుల నద్దుకొన్న సంధ్యాంబరాలు, కుమురుకంపు, యిలాంటి జుగుప్సాకరమైన కావ్య సంభారం, నిజానికి అభ్యుదయ కవులది కాదు. ఆ పేరుతోనే వ్యవహరించిన నారాయణబాబులాంటి ప్రయోగవాదులది. అది బీభత్స కవిత్వంగా కూడా లోకాన్ని హడలు గొట్టజూచింది. అయితే దిగంబరులకు ఒక తత్వం ఉంది, **There is method in madness** అన్నట్లు.

'నవజీవన విధానాన్ని రూపొందించాలని మా తపన'. 'మానవుణ్ని అశ్లీలత, వికృతి, మూఢనమ్మకాలు, చాదస్తాలనుండి వేరు చేయాలని మా ప్రయత్నం' మంచి ఉద్దేశాలు కావని నేననలేను. వజ్రం వజ్రేణ భిద్యతే అనుకొన్నారేమో, అశ్లీలతను పరిహరించడానికి అశ్లీలతనే వాడుకుంటున్నారు. పెద్ద అశ్లీలాన్ని, నిజమైన, అశ్లీలాన్ని, ఈ చిన్న, నోటిమాటల అశ్లీలాలతో మాత్రమే ఎదుర్కో గోరుతున్నారో! అయితే చాదస్తం నుంచి లోకాన్ని పైకెత్త గోరుతూ కొత్త పంచాంగం లాగ సంవత్సరాలకూ నెలలకూ పేర్లు మార్చి తమ పేర్లూ తమ రచనల పేర్లూ మార్చి ఎందుకిలా మతసంస్థ రూపాన్ని ధరించడం?

అంతేకాదు. వైజ్ఞానికులను 'బత్తలబజారు' కీడ్చడం, 'అమాయక మానవ జాతిని అనాదిగా అధ్వాన్నముగా పరిపాలించే పిడికెడు మేధావులకు పిరామిడ్లు.' కట్టాలనడం, నాగరికతనూ వైజ్ఞానికాభ్యుదయాన్ని నిరసించే హేతువాద వ్యతిరేకత (Irrationalism) ను చాటుతున్నవి. ఐదేళ్లు పైబడిన వారినందరినీ కాల్చి వేస్తే ఈ దేశం సుఖిస్తుందనడం ఉన్మాద ధోరణి. అయినా వీళ్ల తపన అబద్ధిక మనలేము. ఆరుద్ర, తిలక్ కవిత్వాలలోని వసుధైవ భావన, మేధాస్వేచ్ఛలాంటివే వీరి దిణుసులున్నూ-అయితే అతిశయ రూపంలో నగ్నపద్ధతిలో బలప్రయోగ ధోరణిలో వెలువడ్డాయి. మానవుని బుద్ధినిగాక ఉద్రేకాలనూ సహజాతాలనూ (Emotions and Insticncts) నమ్ముకొనేవైఖరినీ, ఆదిమత్వాన్ని (Primitivism) కోరుకునే వైఖరీ కనిపిస్తాయి. మానవతావాదపు వికృత రూపమే ఇది. దిగంబర కవుల భావనాసౌధ నిర్మితిలో హిప్పీల దెంతవంతో, Angry youngman ది ఎంతో, స్వాతంత్ర్యానంతర కాలాన యువజన నిర్వేదానిదీ అంతే ఆధునికతను గురించి రాసేపట్నుని అది కొసవరకు సాగితే Fascism గా పరిణమిస్తుందన్నాడు. దిగంబర కవులు పట్టిపోతున్న తెన్ను చిట్టచివరి సైన్ బోర్డు 'ప్రమాదం' అని, తుది హెచ్చరిక ఇచ్చి ఊరుకుంటుంది. మనుషులకే గాని, ప్రమాదం అని రాసిన బోర్డుకేం ప్రమాదం? నాగరకతానిరాకరణం మానవతావాద నిరాకరణమే సామూహిక హత్యలోనో పంఘాత మరణంలోనో ఇది సార్థక్యం పొందుతుంది. తస్మాత్ జాగ్రత జాగ్రత్త!

**Doctor, heal thy self** అన్నట్లు, లోకానికి వారు ఆపాదిస్తున్న నానావిధ వ్యాధులు తమకీవరకే సోకి ఉంటే ముందు తమకు తాము చికిత్సజేసు కొన్నాక మందుల పొది పట్టుకుని లోక చికిత్సక బయల్దేరమంటే బాగుంటుంది పూర్వాశ్రమంలో ఉదయించని ఉదయాలు' రాసిన కేశవరావ్, అగ్నిశిఖలు—మంచు జడులు' రాసిన కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు కవిత్వం—మంచి విత్వం—రాయజాలరని నేనైతే అనలేను దిబంగరకవులుగా కసిత్వం' వల్లనే తమ కవిత్వాన్ని ఘోరంగా వధించుకొంటున్నారు. హద్దుపదులులేని ఆవేశం ఆత్మహత్యా సదృశం, ఆత్మహత్య నేరం.

ఇలా అభ్యుదయ యుగానంతర కవిత ప్రతిభా దారిద్ర్యం పాలైపోకుండా వివిధ మార్గానుయాయుల సంఘర్షణ రంగంగా రంగు మారి ఉంది. పితూరీ దారులో కూడ అభ్యుదయాంశ అజ్ఞాతవాసం చేస్తున్నది ఆరణ్య అజ్ఞాతవాస పర్వాల యుద్ధ పర్వాలకు తాపీయక తప్పనిరోజు ముందుంది సాహిత్యంలో యుగాలు చక్రభ్రమణం లాంటివి *



# వర్తమాన సాహిత్యంలో

శ్రీ రామమోహనరాయ్

విద్యుచ్ఛక్తి లేకముందు ప్రపంచం ఏవిధంగా ఉండేదో వీరేశలింగంపంతులు గారు కలం పట్టకముందు ఆంధ్రసాహిత్యం ఆవిధంగా ఉండేదని యెంచవచ్చు వీరేశలింగంగారి రాకతో మన సాహిత్యానికి జవమూ, జీవమూ వచ్చింది. అయితే యిది ఏనాటిమాట ఇప్పటి కప్పుడే కొన్నియుగాలు గడిచి వచ్చేశాము తిరుపతి వేంకటకవుల రచనలు నవ్యత్వానికి 'నాంది' వాక్యాల పలికినా, నవ యుగ కవితావైతాళికునిగా గురజాడనే పేర్కొనటం, సబబు సంప్రదాయ కవిత్వపుతీరు క్రమంగా మారింది సంఘ సంస్కరణమూ, వ్యావహారిక భాషోద్యమమూ కలిసి నవత్వాన్ని రూపొందించాయి. ఇంగ్లీషు భాషావ్యాప్తి, పత్రికల వ్యాప్తి, హేతువాదము నవ్యకవిత్వానికి బలాన్ని పెంపొందించాయి. సంప్రదాయ కవిత్వపు తీరు క్రమంగా మారి కవుల రాజభక్తి, విద్యావికాసంతో దేశభక్తిగా మారింది. దేశభక్తి ప్రపూరితమైన కవిత్వం జాతిని మేల్కొల్పింది. వీరగీతాలు, చారిత్రక కావ్యాలు, ఆంగ్లజాతిని యీసడించి దేశాభిమానం రేకెత్తించేపద్యాలూ శౌర్యాన్ని రేకెత్తించి ప్రజలను కార్యోన్ముఖుల్ని చేశాయి. వీరాంధ్ర పౌరుషంతో జాతి నడుము బిగించి జాతీయోద్యమంలోనికి ఉరికిన తరువాత 'మార్చింగ్ సాంగ్స్', నినాదాలూ రుచించినంతగా ఆంధ్రుల సంస్కృతిని చాటే కావ్యాలు రుచింపలేదు కవి హృదయం విశ్వ సాహిత్య సంచారం చేసింది కాల్పనిక కవుల (Romantic) కవితలలోని కమ్మదనం కవి హృదయాన్ని లోగొన్నది భావ కవితా యుగంలో సౌందర్యోపాసన దృష్టి మన సాహిత్యంలో ప్రబలింది స్త్రీకి గౌరవం పెరిగింది భాషకు సౌకుమార్యం, మాధుర్యమూ హెచ్చింది కాని ప్రణయానుభూతితో మత్తెక్కిన భావకవికి, కనుపించని ప్రేయసికోసం శపించిపోతూ ఆక్రోశించడంలో నందం కనిపించింది. జగమంతా కనుమరుగైంది. 'లోకముతో మన కేటికి లోలాక్షీ రా పోదము' అన్నది భావ కవిత్వానికి లక్ష్యంగ కనుపించింది మొదటి ప్రపంచ యుద కాలంలో ప్రపంచం అనేక సమస్యలతో అట్టుడికి పోతున్నా, దేశం పారతంత్ర్యంలో మగ్గుతున్నా పట్టనట్లుగా భావకవులు వియోగ గీతాలను వ్రాసుకుంటూ, వాటిని ప్రేయసికి నైవేద్యం పెట్టటం యీతరం వారికి ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నది భావ కవితా స్రోతస్విని రాను రాను చలంగా రన్నట్లు 'స్నైడు కాలువలో' పలికింది భావ కవిత్వ యుగానికిముందే కొన్ని విషాదాంత కావ్యాలు 'ముసలమ్మ మరణము' 'నలజారమ్మ అగ్నిప్రవేశము'వంటి కావ్యాల వెలువడినా కవులా తర్వాత వాటి నంతగా అనుసరించలేదు కొందరు కవులా కాలంలో గ్రామీక జీవుల జీవితాన్ని వర్ణిస్తూ 'కృషిక కవిత్వం' వ్రాయసాగారు పల్లీయుల వ్యావసాయిక జీవితం వీరి కావ్య వస్తువు కృషీవలుడు—క్షేత్రలక్ష్మి—పరిగపంట—లొలకరి కావ్యాలీ కోవలోనివి. ఈ కవుల మార్గాన్ని కొందరు స్వీకరించినా యిది ఒక ఉద్యమంగా రూపొందలేదు

భావ కవిత్వం సహృదయుల ఆర్తిని తీర్చలేకపోయిన తరువాత కవులు నూతన మార్గాలకై అన్వేషించారు ప్రపంచమతంటిలోనూ ఉన్న మానవులను బంధించే ఏకసూత్రం వారి భావనకు తగిలింది దగాపడిన తమ్ముళ్ళను గురించీ, సమాజంలో అట్టడుగున పడిపోయిన అన్నార్తుల గాథలను గురించి స్వచ్ఛందంగా నిప్పులు కురిపించే కంఠాలతో గీతాల రచించటం ప్రారంభించారు. వీరేశలింగం, గిడుగు, గురజాడలు మళ్ళీ జీవించటం ఆరంభించారు ఛందస్సును త్రోసి రాజని, ప్రయోగాలతో ఆరంభించి ప్రగతిని స్వీకరించి అభ్యుదయ కవిత్వం వచ్చింది. అభ్యుదయ కవిత్వ ప్రభావం నేటికీ కవులను విడిపోలేదు

అభ్యుదయ కవిత్వం భావ కవిత్వంపై తిరుగుబాటుచేస్తూ పాశ్చాత్య సాహిత్య రంగాలలోనూ, చిత్రకళలోనూ, సంగీతంలోనూ వచ్చిన, వస్తున్న నూతన రూపాలకు తెలుగులో ప్రతిరూపాలను సృష్టించింది కొన్నాళ్ళు.

---

* 1 నేటి కవిత్వంలో కొత్తపోకడలు (సారస వ్యాసావళి)
2 భూమిక (చేతనావర్తం)
3. కవిహృదయం(త్వమేవాఽహమ్-రెండవ కూర్పు)
4 శ్రీ దాశరధితో ఇంటర్వ్యూ (నవత—జనవరి—మార్చి—1968)
5 యువతరం (సృజన—నవంబరు-1963)
6 సాహిత్యలేఖలు (సృజన—ఫిబ్రవరి-ఏప్రిల్—1968)
7 పదేళ్ల సాహిత్యవైఖరి (ఆంధ్రపత్రిక షష్ఠ సంవత్సరాది సంచిక)
8 మాత్రాబద్ధ శంఖారావం — ఆర్వీయార్ (సంవేదన, జనవరి 1969(
9 ఆధునికాంధ్ర కవిత్వ తత్త్వం. ఒక పరిశీలన (సృజన, మే —జూలై 1967)
10 కవి హృదయం.
11 భూమిక (చేతనావర్తం)
12 వచనగేయం. అంతస్తత్త్వం (జనధర్మ జనవరి 1969)
13 Objections to Humanism
Ed. H. J. Blackham (Pelican) 1965
14 Mysticism F C. Happold (Pelican) 1963.
15 'అముద్రితకావ్యం' లో తాత్త్వికదృష్టి (జనధర్మ, జనవరి 1969).
16 పిశాచి (జ్వాల, 16—12—1934)
17 ఆధునిక కవిత్వంలో రూపవిప్లవం (జనధర్మ, జనవరి 1969)
18. అనుభవాలూ—జ్ఞాపకాలును, మూడవభాగం పు 22
19 మాత్రాబద్ధ శంఖారావం చూడు 8 )
20 'అమృతం కురిసినరాత్రి' సమీక్ష (సంవేదన, జనవరి 1969)
21 వచనగేయం – అంతస్తత్త్వం (చూడు 12)
22 The Four—Letter Word (ENCOUNTER, December 1968)
23 నయాకవిత—అతర్వాత—నిఖిలేశ్వర్ (సృజన, నవంబరు 1968)

శిష్ట్లా ఉమామహేశ్వరరావు ముద్దుకృష్ణ, శ్రీరంగం నారాయణబాబు, పురిపండా అప్పలస్వామి, శ్రీ శ్రీ, పఠాభి, పాలగుమ్మి పద్మరాజు తొలితరం అభ్యుదయ కవులు. తరువాత వచ్చిన అభ్యుదయ కవులు వీరికి ప్రతిధ్వనులు కారు. కవిత్వమూ, పదార్థం అందరికీ ఒకటే అయినా వాటిని వెలువరించిన రీతులు వేర్వేరు. అభ్యుదయ కవిత్వం ఆదినుండీ రెండు మార్గాలుగా ప్రయాణం కొనసాగించింది. ఒకటి ప్రయోగవాదుల మార్గమొకటీ, ప్రగతి వాదుల మార్గం మరొకటిన్నీ. తొలితరం అభ్యుదయ కవులందరూ ప్రయోగవాదులు కావటం ఒక విశేషం. ప్రయోగవాదములో వీరేగాక దేశిరాజు, వరదా, ఆరుద్ర, బైరాగి, అజంతా, రమణారెడ్డి మొదలైనవారు కూడ ప్రఖ్యాతి గాంచినవారు. ప్రగతివాదులలో శ్రీ శ్రీ, పురిపండా, సోమసుందర్, దుర్గానంద్, గోపాలచక్రవర్తి మొదలగువారు ప్రముఖులు. చలంగారు వ్రాసిన యోగ్యతాపత్రం చదివాక ఆధునిక కవిత్వమంటే ఏవిధంగా ఉండాలో ముఖ్యంగా కవులు గుర్తించారు. కవిత్వ ప్రయోజనాన్ని శ్రీ శ్రీ పద్ధతిలో మలచుకోవటానికి పలువురు ప్రయత్నించారు. శ్రీ శ్రీ సామ్యవాద దృక్పథాన్ని కవిత్వంలో ప్రవేశపెట్టి కమ్యూనిస్టు వ్యవస్థను మరో ప్రపంచంగా భావించి మహా ప్రస్థానం సాగించారు. కమ్యూనిస్టు వ్యవస్థ ఏర్పడే వరకు తాను 'ఎక్సెప్షియన్'గనైనా నిలువటానికి సిద్ధంగా ఉన్నానని ఆయన స్పష్టం చేశారు. శ్రీ శ్రీ మార్గంలో వచ్చిన నారాయణబాబు, ఆరుద్రగారలు కమ్యూనిస్టు వ్యతిరేకులుగా మారిపోయారు. నారాయణబాబుగారు కమ్యూనిస్టు వ్యతిరేకిగా మారి, అందుకు వ్యతిరేకంగా వ్యాసం కూడ వ్రాశారు. ఆరుద్రగారు సామ్యవాద దేశం సోవియట్ రష్యాను 'భూతల స్వర్గం'గా అభివర్ణిస్తున్నా రప్పుడు. కమ్యూనిజాన్ని పొగడిన దామే, ప్రజాస్వామ్యాన్ని వరించి పంచవర్ష ప్రణాళికలపైన అపార విశ్వాసాన్ని ప్రకటిస్తున్నారు. కమ్యూనిస్టు పద్ధతులను దుయ్యబడుతున్నారు. గడచిన రెండు మూడు దశాబ్దాలలో కవిత్వానికీ, రాజకీయాలకూ సంబంధం ఏర్పడినట్లైనది. కమ్యూనిస్టుపార్టీ అభ్యుదయ కవితోద్యమానికి బాసటగా నిలిచింది. నవయుగ కవితా వైతాళికులు దురదృష్ట వశాత్తూ, ఒక పార్టీ తాళికులుగా మారినందుకు శ్రీ ఆరుద్ర విచారం వెలిబుచ్చి, అట్టే వారి కవిత్వంలో విశ్వ జనీనత లోపించక మానదన్నారు. కాని కమ్యూనిజాన్ని తమ కవిత్వానికి ఆయువుగా భావించినవారు, కవిత్వం కవి నమ్మిన సిద్ధాంతాలను నిష్కర్షగా, కళాత్మకంగా చెప్పినపుడే ఉత్తమ కవిత్వం వస్తుందని భావించి తమ ప్రస్థానం కొనసాగించారు. అభ్యుదయ రచయితలనేమాటే పునరుక్తి యనీ, అభ్యుదయవాది కాని వారెవ్వరూ రచయితలు కారనీ శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు అభిప్రాయపడ్డారు. సమాజాభ్యుదయాన్ని కోరని కవులకు సమాజం ముందుతరాలలో చోటివ్వదేమోనని ఆధునిక కవులు పలువురు శంకించారు. అందరూ అభ్యుదయ రచయితలమేనని చెప్పుకోవటం ప్రారంభించారు. అభ్యుదయ రచయితల సంఘం యీవిధంగా వివిధములైన అభిప్రాయాలుకలవాళ్లు చేరటంవలన తన లక్ష్యాలను సరిగా ఏర్పరచుకోలేకపోయింది. సాధించిన దెంతో ఉన్నా లిన గమ్యమేదో తెలియని స్థితికి వచ్చింది.

అసలు అభ్యుదయమంటే ఏమిటి? ఆధునిక కవు లేవిధమైన అభ్యుదయాన్ని వాంఛిస్తున్నారు? అందరూ సమాజ ప్రగతి కోరుతున్నవారే అయితే ప్రగతికి వారు చెప్పుకుంటున్న అర్థాలు మాత్రం వేరు. ఈ ప్రగతి విషయంలో ప్రధానంగా నాలుగు బాటలను చూడగలుగుతాము. అవి కమ్యూనిస్టు దృక్పథంలో పయనిస్తున్న అభ్యుదయమార్గం ఒకటి. ప్రజాస్వామ్య పద్ధతిలో జనావళికి ప్రగతిని వాంఛిస్తున్నవారి దారి మరొకటి. నీతి విరుద్ధమైన కళ నిష్ప్రయోజనమని భావించి, నైతిక విలువల పునరుద్ధరణ ద్వారా ముందడుగు వేయాలనేవారి తెరువు వేరొకటి. కారుణ్యమే మానవ జాతిని రక్షింపగలదని నమ్మి మానవత్వాన్ని కవిత్వంలో నిలిపితే మానవజాతి మనుగడ సుఖవంత మవుతుందని భావించే కారుణ్య వాదుల త్రోవ యింకొకటి. వీటిలో తరువాతి మూడింటినీ ప్రగతి మార్గాలుగా సామ్యవాద దృక్పథంలో నడుస్తున్నవారు నమ్మకపోవచ్చు. కాని మిగిలిన మార్గాలు గూడ నేటి కవిత్వంలో కనిస్తున్నాయి.

అభ్యుదయ కవిత్వపు కాలంనుండి కవుల స్వతంత్ర దృక్పథాలను విడివిడిగా చూద్దాం. తొలితరం అభ్యుదయ కవులలో శిష్ట్లా 'నవమి చిలుక' 'విష్ణుధనువు' కావ్య సంపుటాలలో 'ప్రహ్లాద' కవిత్వం చెప్పారు. హృదయ సభామంటపాన్ని ఛేదించి మనస్సనే నరసింహమూర్తి, అధైర్యమనే హిరణ్య కశిపుణ్ణి వధించి ఆశ అనే ప్రహ్లాదునికి ఆహ్లాదం కల్పించినట్లుగా వర్ణించినది ప్రహ్లాద కవిత్వమని చెప్పుకున్నారు. కావ్య కల్పనలో అస్పష్టత ఎక్కువ. కావ్యమంతా సంకేతాలు. పాఠకుడా సంకేతాల కర్థం తెలిసికోవటానికి ఎక్కువ శ్రమ పడవలసి ఉంటుంది. ఛందోరహితంగా నవ కవిత్వం చెప్పటానికి వీరు ఒరవడి పెట్టారు. కవులకు రుచించినంతగా వీరి కవిత్వం 'కావ్యానుశీలనం' తక్కువగా ఉన్న పాఠకులకు కొరుకుడు పడదు. ఆయన అవలంబించిన స్వేచ్ఛ తరువాతి వారికి మార్గదర్శకమైనది.

ముద్దుకృష్ణ పురాణాల విశ్వాసాలను తలక్రిందులు చేస్తూ, శిష్ట్లా ప్రభావంతో గీతాలు వ్రాసి అభ్యుదయాన్ని సాధించటానికి మార్గం సుగమం చేశారు. 'జ్వాల' అనే పత్రికను స్థాపించి అభ్యుదయోద్యమానికి పట్టుగొమ్మయైనారు. నవ్య సాహిత్య పరిషత్తువారి 'ప్రతిభ' పత్రిక అభ్యుదయ కవులకు చోటిచ్చింది. మరికొన్ని పత్రికలు కూడ దోహదం చేశాయి. తరువాత అభ్యుదయ రచయితల సంఘం 'సందేశం'—'అభ్యుదయ' పత్రికలను సాధించుకొన్నది.

ఆస్కార్‌వైల్డు వచించిన 'విచిత్రమే సౌందర్యం, సౌందర్యమే విచిత్రం' అనే సిద్ధాంతానికి లక్ష్యగ్రంథంగా పఠాభి 'ఫిడేలు రాగాల డజన్' ప్రకటించి వచన పద్యాలు దుడ్డుకర్రలో పద్యాల నడుములు విరుగగొట్టారు. పఠాభి పుణ్యమా అని ఫ్రాయిడ్ తెలుగు కవులకు దగ్గరివాడయ్యాడు. పఠాభి పుణ్యమా అని నగర జీవితం కవికి వర్ణనీయ వస్తువైంది. 'కవి హృదయం లోని రాగాలాపన ఎట్టి తీగలు సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలి' అని శ్రీ శ్రీ పఠాభి పుస్తకానికి ముందు మాటగా (ఇంట్రో) తన నిశితాభిప్రాయం ప్రకటించారు.

నారాయణబాబు తన కావ్య సంకలనానికి సరియైన పేరు 'రుధిరజ్యోతి' యని పెట్టుకున్నారు. అది పుస్తక రూపంలో రాకపోవటం అభ్యుదయోద్యమానికే గాక ఆంధ్ర కవిత్వానికే తీరని వెలితి. 'రక్తపతాకం, శక్తి నాలుక, అగ్ని కిరీటం ఆకాశమున మునిమాపు కేకలు వేస్తూ పిలిచింది' అని 'సావి-చేని' అనే గీతంలో వ్రాశారు. ఈ నకవనానికి తప్పక కావాలని శ్రీ శ్రీ 'నవ కవిత' అనే గీతంలో పేర్కొన్నారు. 'దేశమాత' అనే గీతంలో నారాయణబాబు 'గుప్పెడు అన్నం గుక్కెడు నీళ్లకు స్వాతి వర్షముకు ముత్యపు చిప్పై, కరువే రూపం దాల్చి కడుపే చెరువై యేడ్చే నెలత ఒక్కతే నిలబడ్డాది భిక్షాపాత్రికతో'—అని ఆమె రూపాన్ని కళ్లముందు నిలిపారు. తాను దర్శించిన దేశ స్వరూపాన్ని చూచి నిలువెల్లా కరిగిపోయి, వ్యథను అక్షర రూపంలో పెట్టారు. ఆ వ్యథను ఛందస్సు అందించలేదు. అందుకే స్వచ్ఛందంగా చెప్పటంలో ఛందో బంధాలను త్రెంచివేశారు. సామాన్యులు అందుకోలేని పరుగు నారాయణబాబుది. సంప్రదాయంలో చిచ్చు రగిల్చి, అభ్యుదయాన్ని కోరి, ఒక మార్గం ఏర్పరచుకుంటే నారాయణబాబు పట్టు తప్పిపోయారు. కవిత్వంలో అస్పష్టతను జయింపలేకపోయారు. చెదరిపోయిన ఆణిముత్యాల నారాయణబాబు గీతాలు.

పురిపండావారు మంచి పండితులు. ఆధునికత్వాన్ని అర్థం చేసికొని అభ్యుదయ మార్గాన్ని నిర్మించటంలో పాటుపడ్డారు. 'తొలినాటి సంద్రాలు; తుహినగిరి శిఖరాలు; ఇంకిపోతున్నాయిలే; క్రుంగిపోతున్నాయిలే' అని నవ కవులకు ధైర్యం చెప్పారు. మంచి గతమున కొంచెమే ననుటకుగాను గతమువుని ఉన్నా స్థలకోసం కలహించిన దేశీయుల మౌఢ్యాన్ని నిదర్శనంగా చూపి యీసడించారు. వీరి కవితలో 'దైవం' అనే గీతం విశిష్టమైనది.

'కదలని బొమ్మకు కాంచన మాలిక!
పలుకని మూర్తికి పళ్లూ పూవులు!

చెక్కిన బొమ్మకు చెవులుంటాయా?
కర్కశ శిలకు కన్నుంటాయా?
రాతి విగ్రహం రక్షిస్తుందా?
పూజా మంత్రం బుస్సెడుతుందా?—యీ హేతువాద భావ విప్లవాన్ని త్రిపురనేని కవిరాజు పద్యాలలో యింతకంటె ముందుగానే స్థాపించారు. పురిపండావారిలో ప్రయోగాన్ని మించి ప్రగతివాదం చోటుచేసుకున్నది దేశిరాజు, పాలగుమ్మి పద్మరాజు, తెన్నేటి సూరిగారలు కూడ అభ్యుదయ కవిత్వ మొక స్థిర రూపాన్ని పొందటానికిముందు ప్రయోగాల ద్వారా పాటుపడినవారే

## శ్రీ శ్రీ మార్గం:

సంప్రదాయబద్ధమైన రచనల నాకళించుకొని, విశ్వ సాహిత్య విజ్ఞానాన్ని జీర్ణించుకొని, ప్రయోగ వాదుల సహకారం అందుకొని శ్రీ శ్రీ మహాప్రస్థానాన్ని కొనసాగించారు శ్రీ శ్రీ కవితావృక్షం శాఖోపశాఖలుగా విస్తరించినా ఆ వృక్షం వేళ్ళు సంప్రదాయాన్ని అంటిపెట్టుకొని ఉన్నవే 'సంప్రదాయం నిలిచే ఉంటుంది హమేషా' అనేది శ్రీ శ్రీ విశ్వాసం. వేదన కవిత్వానికి పర్యాయపదంగా వీరు యెంచారు. అందుకే 'శ్రీనివాసరావు వ్రాస్తున్నది మానిషాద గీతంలో ఉన్నది' అన్నారు 'అలజడి మా జీవితం; ఆందోళన మా ఊపిరి తిరుగుబాటు; మా వేదాంతం—' యిది శ్రీ శ్రీ కవిత్వ తత్వం.

అభ్యుదయ కవిత్వం సామాన్య ప్రజల నుద్దేశించి వ్రాసినదేగాని సామాన్య ప్రజలందరికీ అర్థమయ్యేలా వ్రాసింది కాదు శ్రీశ్రీ బ్రతికి ఉండగానే దుర్వ్యాఖ్యానాలకు గురియౌతున్నారు. మహాప్రస్థానం చదివి ఆనందించదగినది మాత్రమే గాదు; అధ్యయనం చేయతగ్గది భావ కవిత్వంపై తిరుగుబాటు చేస్తున్న కాలంలో తన భావాలకు తగిన పద్ధతికై విశ్వసాహిత్యవీధులో వెతుకుతున్న కాలంలో వెలువడిన రచనలే 'ఖడ్గసృష్టి' అధి వాస్తవిక కవిత (Surrealism) డాడాయిజమ్, ఫ్యూచరిజమ్, సింబలిజమ్ యివన్నీ కొంత కొంత ఖడ్గ సృష్టిలో కన్పిస్తాయి E A Poe, Swinburne, Browning Baudelaire కవుల ప్రభావం శ్రీ శ్రీపైన కన్పిస్తుంది గురజాడ ప్రభావం శ్రీ శ్రీ పైన ప్రబలంగా ఉన్నది ఆది శంకరుల శైలీ విన్యాసం శ్రీ శ్రీ లో చక్కగా కన్పిస్తుంది మహాకవులకు మాత్రమే సాధ్యమయ్యే విధంగా ప్రపంచంలోని అన్ని రకాల వ్యక్తుల మన స్తత్వాలు శ్రీ శ్రీ కవిత్వంలో దర్శన మిస్తాయి దగాపడిన తమ్ములూ, అణగారిన ఆర్తులూ, చల్లారిన సంసారాలలోని జీవులుగా శ్రీ శ్రీ మనస్సును వేదనతో నింపారు శ్రీ శ్రీ వారికోసం జగన్నాథ రథ చక్రాలను నవ సమాజ నిర్మాణాన్ని) భూమార్గం (వర్గ భేదం పొతుకొన్నచోటు) పట్టించి భూకంపం (వర్గ పోరాటం) పుట్టిస్తానని ప్రతినలు పలికారు ఆయన ఎదురు చూసిన నవ సమాజం యింకా నిర్మితం కాలేదు సరిగదా బాధలు రెట్టింపయ్యాయి ఆరుద్రగా విషయాన్ని వివరిస్తూ 'శ్రీ శ్రీ పని అయిపోలేదు అతను ఏ బాధలు, ఏ గాథలు అవగాహన చేసుకొని మహాప్రస్థాన గీతావళి రచించాడో ఆ బాధలు, ఆ గాథలు యింకా సంఘంలో విలయ తాండవం చేస్తున్నాయి పరిస్థితులు అప్పటికన్నా దుర్భరంగా ఉన్నాయి అభ్యుదయాన్ని వాంఛించేవారు అనేకులు నిరపరాధులై చెరసాలలో చిక్కుతున్నారు లోహ రాక్షసుల పద ఘట్టనచే కొన ప్రాణంతో కనలేవాళ్ళు కష్టం చాలక కడుపుమంటచే తెగించి సమ్మెలు కడుతున్నారు నానాటికీ కూటికీ, గుడ్డకీ కరువై పోతున్నది పౌర హక్కులు గూడ ఏవ్వామై పోతున్నవి స్వార్థపరుల మత భేదాలను ప్రజలలో రెచ్చగొట్టి సామ్రాజ్యవాదులు కొత్త కుట్రలని పన్ని తమ జండా నింకా ఎగుర వేస్తూనే ఉన్నారు దేశం అశాంతికీ అరాజకానికీ గురి కాబోతున్నది' అన్నారు.

ఈ బీభత్సాలను సమూలంగా నాశనం చేయటానికి కవులే నాయకత్వం వహించాలనీ, వర్గ రహిత స్వర్గాన్ని నిర్మించుకోవాలనీ ఆరుద్రగారు తమ ప్రగాఢ కాంక్షను వ్యక్తీకరించారు శ్రీ శ్రీ తరువాత అభ్యుదయ కవిత్వంలో యెన్నదగినవారు ఆరుద్ర తెలంగాణా విముక్తి పోరాటంలో 'త్వమేవాహమ్' కావ్యం ద్వారా సంచలనం కలుగజేశారు. ఛందస్సుపై పూర్తి అధికారం ఉండి హృదయంలోని భావం ఎటు తీగలు సాగితే అటు మాటల్ని పెట్టిన నేర్పు యీ కావ్యంలో కన్పిస్తుంది శ్రీ శ్రీ అన్నట్లు ఆరుద్ర ఛందస్సుల చేత వెట్టి చాకిరీ చేయించుకున్నారు. శాస్త్రీయమైన పరి భాషనూ, వంకే తాలనూ అత్యధికంగా వాడటంవలన కవి మేధా శక్తికి అచ్చెరు వందుతూనే పాఠకుడు కావ్యాన్ని ఆస్వాదించటానికి మిక్కిలి శ్రమపడవలసి వస్తున్నది. కవి గైకొనిన ప్రతీకలను జాగ్రత్తగా పరికిస్తేతప్ప కావ్యానందం పొందటం కష్టం. ఈ క్లిష్టత సినీవాలిలో తగ్గిపోయింది. జీవితాన్ని గూర్చి ఉపమానాలు చెప్పటంలో ఆరుద్రకు సాటి మరియొక అభ్యుదయ కవి లేడనిపిస్తుంది సమాజంలోని లోపాలను కళ్ళకు కట్టిస్తూ, నగర జీవనంలోని దౌర్భాగ్యాన్ని నైపుణ్యంతో వివరిస్తూ సామాన్యుల కడగండ్లు, వాటికి కారణభూతమైన అంశాలనూ వర్ణించారు వ్యక్తి బలహీనతలను సమాజానికి ఆరుద్ర ఆపాదించినట్లుగా శ్రీ కె వి రమణారెడ్డిగారు ఆరోపించారు. దేశీయమైన పలుకుబడి ఆరుద్ర సొత్తు కవిగా పాతికేళ్ళకుపైగా నూతనత్వం కొరకు తపించి, అభ్యుదయంలో నూతన మార్గాలు వెతుక్కునే నిరంతరాన్వేషి ఆరుద్ర

T S Eliot ప్రభావంతో నగర జీవితం గూర్చి, ఆధునిక మానవుని యంత్ర దాస్యం గూర్చి, యాంత్రిక జీవనం గూర్చి జీవితంలో నిరాశ తప్ప మరేమీ మిగుల్చుకోని నైరాశ్యం గూర్చి కవిత్వం వ్రాసిన అభ్యుదయకవి బైరాగి పతితమైన మానవుడు ఔన్నత్యాన్ని పొందటానికి యత్నించి ఏవిధంగా ఔన్నత్యాన్నందుకోలేక పోతున్నారో 'నూతిలోని గొంతుకలు' కావ్యంలో బైరాగి నేర్పుతో వివరించారు ఆంగ్ల శబ్దాడంబరమూ, సంస్కృత సమాసాల కూర్పు మితిమించి లేకపోయినప్పటికీ బైరాగి కవిత్వం అర్థం చేసికోవటం కష్టం ఈ లోపం నేటి చదువరులదేగాని కవిదిగాదు ఆలోచనాపరులుమాత్రం బైరాగి కవిత్వాన్ని చదివి తన్మయత్వం పొందగలరు

శబ్దంమీద తగినంత అధికారం ఉండి, అభ్యుదయమంటే సామ్యవాదం మాత్రమే కాదని భావించి 'అభ్యుదయ ప్రబంధం' వ్రాసిన మరొక కవి దుర్గానంద్ వీరు మిక్కిలి వ్యుత్పన్నులు వీరి అభిప్రాయాలతో ఏకీభవించనివారు గూడ వీరి కవితా శైలికి విస్మయం పొందుతారు అతి తక్కువ గీతాలు వ్రాసినా ప్రథమ శ్రేణిలో లెక్కించదగిన అభ్యుదయకవి 'అజంతా' చెట్లు కూలుతూన్న దృశ్యాన్ని ప్రతిభావంతమైన అజంతా మాత్రమే సామాన్యుని జీవితంతో పోల్చి కన్నీళ్ళు తెప్పించగలరు 'జండాలకు కన్నీళ్ళు లేవు', 'కొత్త సంవత్సరం' ఏ గీతమైనా అజంతా వ్రాసినది చదివేక సహృదయుడే నాటికీ అజంతా కవిత్వాన్ని విస్మరించలేడు అజంతా కవిత్వానికి జరామరణాలు లేవు. శ్రీ అనిసెట్టి సుబ్బారావు 'రిక్షావాలా' గీతం, 'శాంతి' నాటిక మొదలైన వాటి ద్వారా అభ్యుదయ కవిత్వంలో చక్కని సంప్రదాయం యేర్పరచి ఖ్యాతి గడించుకొన్నారు రెంటాల 'సర్పయాగం'లో ప్రజాశక్తుల బెదిరించే సర్పాలను 'స్వాహా' చేశారు దుష్టశక్తులపై రెంటాల క్రోధాన్ని చక్కగా వ్యక్తీకరించారు. వీరు కవిత్వంలో వాడే సంకేతాలు సులభంగానే బోధపడతాయి

కుందుర్తి 'తెలంగాణా' కావ్యం ద్వారా ఆనాటి తెలంగాణ ప్రజల కడగండ్లను కళ్లకు కట్టించారు 'నయాగరా'లో ఏల్చూరి, బెల్లంకొండ రామదాసు గారలతో కలిసి ప్రగతి పథాన్ని తీర్చటంలో బాగా పాటుపడ్డారు 'యుగే—యుగే' లోనూ మానవునిలో దైవత్వాన్ని చూచారు భగవంతుని సంబోధిస్తూ మానవలోకం ఎంత అస్తవ్యస్తంగా ఉన్నదో, భగవంతుడంటే పురాణాలు సనాతన పండితులు చెప్పేది నిజమైతే ఆ భగవంతుని పదవి ఎంత హేయమైనదీ సూటిగా చెప్పారు కవి చిత్తశుద్ధి కావ్య గౌరవాన్ని బాగా కాపాడింది సూటిగా చెప్పినా కళాధర్మాన్ని వీరు విడిచి పుచ్చలేదు

శ్రీ బాలగంగాధర తిలక్ గీతాలు ఆయన మరణించాకగాని పుస్తక రూపంలో రాకపోయినా, కవిగా ఆయన లబ్ధప్రతిష్ఠులు 'ప్రార్థన', 'ఆర్తగీతం' మొదలైన ఎన్నో గీతాలు సమాజ ప్రగతికై తపించి, కవి యనుభవించిన వేదనతో వెలువడినవే మానవ కారుణ్యమూ, సౌందర్యోపాసనా, అభ్యుదయమూ త్రివేణి సంగమంలా తిలక్ కవిత్వం నిండునా ప్రవహించి నవ్యాంధ్ర సాహిత్యాన్ని పునీతం చేసింది.

తెలంగాణా ప్రజోద్యమానికి కవిత్వంలో స్థానం కలిగించి ఆంధ్రు లెల్లరకూ చైతన్య దీప్తి కలిగించిన వారిలో దాశరధి, కుందుర్తి, ఆరుద్ర, సోమసుందర్ గారలు ప్రముఖులు. సోమసుందర్ వజ్రాయుధంతోనూ, కాహలి తోనూ కవిగా ఉద్యమాన్ని ఆరంభించారు. 'ఒక వీరుడు మరణిస్తే వేలకొలది ప్రభవింతురు' అనే సూక్తిని, విన్నవ యోధులు కలకాలం జ్ఞాపక ముంచుకో దగిన దానిని పలికారు. అభ్యుదయాన్ని వాంఛించినా సౌందర్యాన్ని వదులుకోని కవులలో సోమసుందర్, దాశరధిగారలు పేర్కొనదగినవారు. అంగారమూ, శృంగారమూ విరుద్ధాలు కావనీ, కవి రెండింటా తన శక్తిని చూప వచ్చుననీ విశ్వసించిన కవులు వీరు. సోమసుందర్ Mystic పద్ధతిలో 'మిణుగురులు'నూ, దాశరథి ప్రణయ కవిత్వాన్ని చెప్పి కీర్తి గడించారు.

దాశరధి మహాంధ్రోద్యమానికి ప్రత్యక్షంగా నాయకత్వం వహించిన వారు. కవిగా బాధ్యత వహించి, నిజాం కిరాతకత్వాన్ని యెదిరించినవారు. ఆంధ్రప్రదేశ్ ఔన్నత్యాన్ని తలంచి పరవశించినవారు. తెలంగాణాను 'కోటి రతనాల వీణగా' సంభావించినవారు. పద్య రచనలోనూ, అభ్యుదయ గీతాలలోనే గాక నేటి వచన కవితా గీతాలలో కూడ తన ప్రతిభను ప్రకటించిన మహాకవి దాశరథి. మాత్రాఛందస్సుల్లో మహా కావ్యాలు వ్రాయవచ్చునన్న నమ్మకం కలిగించినవారు దాశరధి తమ జాతి గొంతుకను వినిపించిన మహా కవిగానూ, తమ దాస్యాన్ని రూపుమాపటానికి యత్నించిన మహా నాయకునిగానూ ఆంధ్రదేశం ఆయనను ఎప్పటికీ కీర్తిస్తుంది నేటి వచన కవిత్వంలోనూ దాశరధి రీతి మహోన్నతంటే కాలానికి ముందే ఉండి కవి సమాజాన్ని నడిపించటం యథార్థ మని మళ్ళీ నమ్మకం కలుగుతుంది

మాత్రా ఛందస్సులకు ఒరవడి దిద్దింది దాశరధియైతే, ఆ బాటలో వెలుగు కంబాలను నాటిన ఖ్యాతి శ్రీ నారాయణరెడ్డిది నాగార్జునసాగరం, విశ్వనాధనాయుడు, కర్పూర వసంతరాయలు, అక్షరాల గవాక్షాలు, అన్నింటి లోనూ నారాయణరెడ్డి కవితా మాధురిని పంచిపెట్టారు అభ్యుదయ కవిత్వం సౌందర్య దృష్టిని విడనాడకుండ చేసిన వారిలో వీరు కూడ ఒకరు. నేటి వచన కవిత్వంలోనూ శ్రీ నారాయణరెడ్డి ముద్ర బలీయం. కేవలమూ వచనము కవిత్వంతో ఎక్కడ భేదిస్తున్నదో నారాయణరెడ్డిగారి రచనలు చదివితే బాగా తెలుస్తుంది ప్రజా హృదయాన్ని దోచుకొన్న కవి శ్రీ నారాయణరెడ్డి.

ఇటు తెలంగాణాలో ప్రజలను కదిలించి ముందుకు నడిపింది ప్రజా కవి కవితను కాళోజీ వ్రాస్తే, అటు రాయలసీమలో విద్వాన్ విశ్వం 'పెన్నేటి పాట'తో రాయలసీమ కఱవును హృదయ విదారకంగా చిత్రించారు.

అభ్యుదయ కవిత్వోద్యమం కొన్నాళ్ళ మరుగునపడి కవులు చెల్లా చెదరుగా పోయినా యిటీవల మళ్ళీ శ్రీయుతులు గజ్జల మల్లారెడ్డి, సి. విజయలక్ష్మి, వరవరరావుగారల విజృంభణతో మళ్ళీ అభ్యుదయ కవిత్వోద్యమం జీవం పోసుకుంటున్నది. గజ్జల మల్లారెడ్డిగారు శ్రీ శ్రీ చేత శేవటి కవిగా ప్రశంసింపబడ్డారు. కాని యిటీవల వారి రాజకీయాభిప్రాయాలను శ్రీ శ్రీ ఆమోదించటంలేదు. మల్లారెడ్డిగారు వ్రాసిన 'శంఖారావం' కవితా సంపుటికి శ్రీ శ్రీ 'హలో పాటకుడా' అనే ముందుమాటలు వ్రాస్తూ మల్లారెడ్డిగారు ఘుయ్యుమన్నట్టైనా రాజకీయాలను తాము అర్థం చేసికొని గూడ ఆమోదించలేక పోతున్నానని నిష్కర్షగా చెప్పారు. రష్యాని తిడితే తన కెంతకోపం వస్తుందో, చైనాను తిట్టినా తన కంత కోపం వస్తుందని శ్రీ శ్రీ తన అభిప్రాయాన్ని నిస్సంకోచంగా వెల్లడించారు. ఉమ్మడి శత్రువును ఎదుర్కోవటానికి కలిసి కట్టుగా దూకుతూ కవిత్వాన్ని కూడ ఒక ఆయుధంగా చేసుకోవాలంటారు శ్రీ శ్రీ. మల్లారెడ్డిగారి కవిత్వంలో Satire ఎక్కువ. అక్కడక్కడచోట Satire కూడ తగ్గిపోయి ఉపదేశాలూ, ఉపన్యాసాలూ ఎక్కువవుతాయి. కవిత్వం నినాదప్రాయమై తన కవితాగుణాన్ని కోల్పోతుంది.

శ్రీ సి. విజయలక్ష్మి కవితలో సమాజంలోని అన్యాయాలపట్ల ఆక్రోశం అధికం. ఈ క్రోధం కవిత్వానికి తప్పక కావలసిందే. 'స్వాతంత్ర్యభానుణ్ణి ఫ్యూడల్ శక్తుల రాహు కేతువులు మింగేశాయి; దేశానికి గ్రహణం పట్టింది; జాతి వెన్నెముకన్న అవినీతి రాచపుండు పుట్టింది; దారుణమైన ఆపరేషన్ జరగాలి' అని కోరుకుంటారు. దేశం వీరికి విషాద భారతంగా కన్పించింది. కన్నీటితో కలం పట్టించింది. వాస్తవికత పేరిట వర్ణిస్తున్న దృశ్యాన్ని విశదంగా చెప్పటంలో కవిత్వం తగ్గి శుష్క వచనమే మిగులుతున్నది. దృశ్యాన్ని కళ్ళకు కట్టించాలంటే ఎక్కువ వివరాలు చెప్పనక్కరలేదు. సమస్యకు పరిష్కార మార్గాన్ని సూచింపదలచుకొన్న కవి మరీ సూటిగా ప్రబోధాలు చెయ్య నక్కరలేదు. ఉపన్యాసాలు చెయ్య నక్కరలేదు. కవిత్వంలో ప్రబోధనలు పెత గటాన కవితాశక్తి పలుచబారిపోతున్నది.

శ్రీ వరవరరావు అభ్యుదయ పథంలో సామాజిక ప్రగతిని కోరుకుంటున్నవారు సమాజ స్థితిని శిశిర ఋతువులోని మంచుతో పోలిక చెప్పుకుని అభ్యుదయాన్ని ఉషోదయంగా భావించారు కొన్ని సంకేతాలతో అభ్యుదయ సమాజం గూర్చి ఆశల్ని రేకెత్తించి ముందుకు నడుస్తూ నడిపిస్తున్నారు. పద చిత్రాలను కట్టడంలో వరవరరావు నేర్పును ప్రదర్శించారు.

ఈవిధంగా దశలవారీగా సాగిన అభ్యుదయ కవిత్వోద్యమంలోని కవు లందరూ సమాజ ప్రగతిని కోరినవారైనా అందరూ సామ్యవాదం ద్వారానే ప్రగతి సాధ్యోనిస్తున్నవారుకారు.

అధిక సంఖ్యాకులు సామ్యవాదాన్ని కోరుకున్నా పైన పేర్కొన్నట్లు ఋంజా ప్రజాస్వామ్యమార్గం, సర్వోదయమార్గం, కారుణ్యవాదుల మానవతా మార్గం కూడ అభ్యుదయం పేరిటే చలామణి అయి, ఆ ఉద్యమాన్ని వక్ర త్రోవలు పట్టించి కొంతవరకు నిర్వీర్యం చేశాయి ప్రజాస్వామ్యంపట్ల విశ్వాసం పెంచుకున్నవారిలో ఆరుద్రగారు ప్రముఖులు. కుందుర్తి, తిలక్, దాశరధి, నారాయణరెడ్డిగారలు కూడ కొంతవరకు ప్రజాస్వామ్య పద్ధతుల్లో విశ్వాసం కలవారుగా పేర్కొనవచ్చు సర్వోదయమార్గంలో తుమ్మల సీతారామమూర్తిగారు ప్రసిద్ధులు. కారుణ్యవాదులలో కాటూరి—పింగళిగారల సౌందరనందం జాషువాగారి కావ్యాలు—అంత కావ్యాలు, ఇటీవల తిలక్ రచించిన ప్రార్థన, ఆర్తగీతం, బైరాగి గీతాలు పేర్కొనదగినది.

అభ్యుదయోద్యమం లక్ష్యాలను శ్రీ శ్రీ మహాప్రస్థానంలో స్పష్టం చేశారు. అభ్యుదయ కవిత్వ స్వరూపాన్ని క్లుప్తంగా ఆరుద్రగారు "సామ్యవాదం మా వేదం, సాహిత్యం మా ప్రాణం, సామాన్యుడు మా దేవుడు, సమరం మా ఊపిరి, ప్రగతి మా లక్ష్యం" అని సమగ్రంగా సంక్షిప్తంగా చెప్పారు.

## వచన కవిత్వం:

అభ్యుదయ కవితలో 'నయాగరా' కావ్య సంకలనంతో ప్రగతిని కోరిన కవులు కుందుర్తి, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బెల్లంకొండ రామదాసుగారలు. వీరిలో కుందుర్తి ప్రగతివాదంతో ఆగక కవిత్వంలో నూతన ప్రయోగాలను ఆహ్వానించారు అభ్యుదయ పథంలో వీరికి వచన కవిత్వ పద్ధతి బాగా నచ్చింది. వృత్తాలను కమ్మగా నడిపించగలిగిన వీరు వచన కవిత్వాన్ని ఒక ఉద్యమంగా నిర్వహిస్తున్నారు. అభ్యుదయ కవులందరిలోనూ వచన కవితా గీతికలు కన్పిస్తాయి. వచన కవిత్వ మొక అసిధారావ్రతం ఏమాత్రం ఏమరుపాటు పడినా శుష్క వచనమో, లేక వృత్తాల సంప్రదాయమో ఏర్పడుతుంది. వచన కవిత్వానికి బీజాలు తాళ్ళపాకవారికాలంనుంచీ ఉన్నాయనీ, పూర్వుల వృత్తగంధి రచన లిటువంటివేననీ వాదించేవారు కొందరున్నారు ఇది అన్యాయం. ఆధునిక కవితకు వలసిన ప్రక్రియగా కవు లెన్నుకున్న వచన కవిత్వానికి వేళ్ళక్కడో ఉన్నాయని చెప్పటం కవులను తక్కువగా అంచనా వేయటమే. వచన కవిత్వం యీనాడు బాగా విస్తరించి ఉన్నది. వచన కవిత్వం వ్రాస్తున్న వారందరూ ప్రగతివాదులేనని చెప్పటానికి వీల్లేదు. వచన కవిత్వం వ్రాస్తూ గూడ దీనిని ఒక ఉద్యమంగా భావించనివా రున్నారు ఉదాహరణకు దిగంబర కవుల 'దిక్కు'లకూ వచన కవిత్వానికీ భేదంలేదు. అయినా వారు తమ కవిత్వాన్ని వచన కవిత్వం అననివ్వ మంటున్నారు. వచన కవిత్వంలో గూడ రసాత్మకమైన వాక్యాలు కావ్యాలౌతాయని కవులు భావిస్తూ ఉండగా శ్రీ కుందుర్తి వచన కవిత్వం కథా ప్రధానంగా ఉండాలంటున్నారు. శ్రీ బాలగంగాధర తిలక్ వచన కవిత్వంలో ఆత్మీయతాముద్రను వైచి తన అనుభూతులను ఆవిష్కరించి, మానవతనూ

ప్రగతినీ సమంగానే అందించి వీటికి సౌందర్యాన్ని జోడించి రసజ్ఞుల హృదయంలో నిలిచిపోయారు గోపాలచక్రవర్తి, మాదిరాజు రంగారావు, అరిపిరాల విశ్వం, చలం, బోయి భీమన్న, శీలా వీర్రాజు, రంధి సోమరాజు, బుచ్చిబాబు, వజీర్ రహ్మాన్, కేశవరావు, యాదవరెడ్డి, అద్దేపల్లి, ఇస్మాయిల్ మొదలైన వారు ఇటీవలి వచనకవులుగా పేర్కొనదగినవారు ఈ వచన కవులలో గోపాల చక్రవర్తిగారు 'ఆనందం జీవనది' ద్వారా ప్రతిభావంతంగా సామాన్యుని జీవిత పరమార్థాన్ని వివరించారు "జీవితం కరిగిపోయే మంచు, ఉన్న దాంట్లోనే నలుగురికీ పంచు" అని వర్తమానాన్ని గూర్చి హెచ్చరించి, వర్తమానంలో జీవించమని హితవు చెప్పారు ఇటీవల 'చేతనావర్తం' అనే కవితా సంకలనం నయాగరావలె ప్రతిభావంతులైన కవులచేత వలసినంత వ్యుత్పన్నతతో వెలువడింది

కొందరు ప్రేమకథలను వచన కవిత్వంలో ప్రవేశపెట్టి, కొత్త రూపాలను సృష్టిస్తున్నారు శ్రీ శీలా వీర్రాజు వ్రాసిన 'కొడిగట్టిన సూర్యుడు' అటువంటిదే మార్మికవాదులు (Mystics) కొందరు వచన కవిత్వాన్ని ఆలంబనంగా చేసుకొన్నారు. అద్దేపల్లి, ఇస్మాయిల్ యీ కోవలోని వారు మరికొందరు సౌందర్యోపాసకులు చలం, బుచ్చిబాబు, వజీర్ రహ్మాన్, రంధి సోమరాజు గారలీ విషయంలో పేర్కొనదగినవారు జీవిత తత్వాన్ని మథించి తమ అవలోకనాన్ని వెల్లడించటానికి వచన కవిత్వాన్ని ఆలంబనంగా చేసికొన్నవారు మాదిరాజు, అరిపిరాల, కేశవరావు, కమ్మిసెట్టి, యాదవరెడ్డి మొదలైనవారు శ్రీ భీమన్న శ్రీవర్సులో పేమ లేఖలు కూడా వ్రాశారు ఈ విధంగా చూచినప్పుడు వచన కవిత్వం ఏకోన్ముఖంగా సాగిపోతున్నదనటానికి వీల్లేదు వచన కవిత్వానికి అనిబద్ధ కవితయనీ, స్వచ్ఛంద కవితయనీ, ముక్తచ్ఛందం అనీ మరి కొన్ని పేరులు కూడ వాడుకలో ఉన్నాయి

ఆత్మాశ్రయమైన పద్ధతిని వదలి, నాటకీయతను అలవరచుకొని సామాన్య ప్రజల జీవిత కధనే ఆలంబనగా తీసుకోవాలని కుందుర్తి వచన కవుల నుద్బోధిస్తున్నారు. వీరి అభిప్రాయంతో చాలమంది వచన కవులేకీభవించటంలేదు సమకాలికమైన జీవిత చిత్రణ, తెనుగుదనం, ప్రగతిశీలమైన దృక్పథం వ్యవహార భాషాపద ప్రయోగ పరత్వం, ఛందో గ్రాంధిక బంధ విచ్ఛేదనం, అస్పష్టతా దోష బహిష్కారం మొదలైనవి సమకూర్చుకోవాలని కుందుర్తి చెప్పిన హితవు కవులెల్లరూ వినదగినది అట్లాగే అవసరాన్ని మించి సంస్కృత శబ్దాలకై వ్యామోహపడటం ఎంత వ్యర్థమో ఆంగ్ల శబ్దాలను బలవంతంగా చొప్పించటమూ అంతే వీటిలో ముఖ్యంగా అస్పష్టతా దోష బహిష్కారం కవులు పాటించటం ఎంతైనా అవసరం ముక్కుమొగం లేనంత కఠినంగా వచన కవిత్వం ఉంటున్నదంటే దాని బాధ్యత వచన కవులదే. ప్రాచీన కవిత్వంలో శబ్దానికి అర్థం తెలిస్తే అన్వయంకోసం అంతగా ప్రయాసపడనక్కరలేదు కాని నేటి కవిత్వంలో కొన్నిచోట్ల శబ్దాలు ఉచితమైనా, చక్కగా తెలిసినా, భావం ఒకంతట కాదుగదా తలబ్రద్దలు చేసుకొన్నా బోధపడటంలేదు కవిత్వం ఆలోచనావృతమనీ కవిత్వంలో అనిర్వచనీయత ఉండాలనీ, సులభ గ్రాహ్యత అక్కరలేదనీ, అరసికులకు కవిత్వ నివేదనం ఉండుగనీ కవుల తప్పుకుంటారేమోగాని, రసజ్ఞులు మాత్రం అన్వయం దుర్గ్రాహ్యంగా ఉన్నప్పుడు దాన్ని 'పాషాణ పాకంగానే పరిగణిస్తారు పాషాణాలలో మట్టి రంగు రంగుల గులకరాళ్ళున్నాయనీ, వాటి నేరుకోవటంలోనూ ఆనందం ఉన్నదనీ కవులూ, పాఠకులూ అనుకుంటే వాటి ప్రయోజనం అంతంత మాత్రమే. వాటికి కళా జగత్తులో స్థానం ఉండదు కవి అనుభూతి పాఠకునికి అందనిది ఉత్తమ కవిత్వ మెప్పుడూ కాదు ఇక వచన కవిత్వ మసలు ఉద్యమమే కాదనీ దీని ఉద్యమంగా భావించేవారు వస్తువు (Content) కంటె,

బహిరాకృతి (Form) కి అనవసరంగా ఎక్కువ ప్రాధాన్య మిచ్చి సమాజాన్ని మార్చటంలో కవి బాధ్యతను విస్మరిస్తున్నారనీ, దిగంబర కవుల ఆరోపణ. ఇక ఆకృతి విషయంలోనూ గీతమూ, వచనమూ కాని యీ రచనలు పాఠకుల రసతృష్ణను తీర్చడం లేదనీ, ''ఈ కవిత్వంలో వేడి ఉంది—వాడి ఉంది కాని ఆ వైభవ సంపన్నమైన భాష లేదు ఆ తంత్రాలసమైన సంగీతంలేదు. ఆ భావ తన్మయత లేదు ఇది ఒక మెరుపు వంటిది ఒక్క మెరుపుతో ఒక్క విరుపుతో పాఠకుడు ఎంతసేపు ఆనందించగలడు? హృదయాంతరాళంలో క్వణితమై అతని సర్వనాడులను ప్రసుక్కింపజేసే పారవశ్యం కొరకు అతడిప్పుడు తహతహలాడుతున్నాడు''[1] అని దుర్గానంద్‌గారు తిరిగి పద్య రచననే చేపట్టటం మేలుగా భావిస్తున్నారు ''గ్రాహకుడు కోరాడని చెప్పి కవి మధువు నమ్మే అంగడిలో టాయిలెట్టు సామానులు తెచ్చి అమ్ముతున్నాడు'' అని కవి కర్తవ్యాన్ని గూర్చి హెచ్చరిస్తున్నారు కాని యీ పద్ధతి మేలైనదిగాదు

గ్రాహకుడికోసం కవి నూతన ప్రయోగాలను చేపట్టటంలేదు తన మనస్సులోని ఆలోచనలు తీగలు సాగినప్పుడు వాటికి రూపమివ్వటానికి నూతన కవితా ప్రక్రియకై తపించి, ప్రయోగాలుచేసి తనకు నచ్చిన రూపంలో వెలువరిస్తున్నాడు. మాతృగర్భం ఎంత సురక్షితమైనా తిరిగి దానిలోకే వెళ్ళాలని కోరుకోనవసరంలేదు. దుర్గానంద్‌గారి సలహా ననుసరిస్తే నవ కవుల శక్తి నిర్వీర్యం పొందుతుంది కవి భావన సీమారహితమైనట్లే కవితకు కావలసిన ఛందస్సును కవి హృదయమే నిర్ణయించుకొంటుంది భావుకత అంతా పద్య చిత్రానికి ఒదిగేటందుకు నవ కవి ప్రయత్నించటం వృథా ప్రయాస శబ్ద శక్తినీ, శబ్ద విస్తృతినీ, శబ్దౌచితినీ కవి గుర్తించి స్వాయత్తం చేసికోవటం అవసరం ఛందోభంగమవుతుందని కవితా గుణాన్ని విడిచి పుచ్చటం, లేదా తగ్గించుకోవటం సంప్రదాయ భీరువులు చేసే పని వృద్ధ భావ కవి ఒకరు అభ్యుదయపథమే సరియైనది కాదని భావించి 'పారపాటే తిరుగుబాటు, తిరుగుబాటు తిరిగి చాటు' అని శ్రీశ్రీని హెచ్చరించినట్లు దుర్గానంద్‌గారు వచన కవులను ప్రాచీన కవుల ప్రమాణాలతో తూకంవేసి విలువ కడుతున్నారు. ఈనాటి కవికి కావలసినది సమాన ధర్ముల హృదయ స్పందనమేగాని పోషకు లిచ్చే దాన ధర్మాలూ, బిరుదులూ, అందలాలూ కావు.

## దిగంబర కవితోద్యమం:

వచన కవిత్వంలోని వాడి వేడి సరిపోక యింకా నూతనత్వం కోసం అన్వేషించి 'యీ దేశంలో యీ గోళంలో ఊపిరిపీల్చే ప్రతి మనిషి ఉనికికోసం తపనపడి, అతడి భావిని చూసి వెక్కి వెక్కి ఏడ్చి పిచ్చెత్తి ప్రవచించిన కవిత'గా దిగంబర కవితోద్యమం మొదలైంది తాత్కాలికంగా రంగంనుండి నిష్క్రమించిన అభ్యుదయ కవులీ ఉద్యమాన్ని మనసారా ఆహ్వానించారు రెండు సంపుటాలు వెలువడిన తరువాత దిగంబర కవుల లక్ష్యాలను అర్థం చేసికొని హర్షించినా వారి కవితా పద్ధతిని, అందరినీ దూషిస్తున్న వారి మాటలు దురుసుతనాన్ని, విధ్వంసననే పరమార్థంగా పెట్టుకొన్న వారి కవిత స్వరూపాన్ని, ముఖ్యంగా బూతు మాటలతో కుష్ఠురోగి శరీరాన్ని కెలుకుతున్నట్లున్న వారి పద చిత్రాలనూ, తద్వారా కలిగే జుగుప్సను చూచి పెదవి విరిచారు. ఏ 'ఆచ్ఛాదనకీ తలఒగ్గని, ఏ భయాలకీ లొంగని నిరంతర సజీవ మానవుడికోసం ఎలుగెత్తి పిలుస్తున్నాం' అనే దిగంబర కవుల సంకల్పాన్ని ఆమోదించటానికి అభ్యంతరం ఉండనక్కరలేదు 'నిజం రేజర్‌లాంటిది అది సీజర్‌ను సైతం క్షమించదు' అని చెప్పే ఒడుపునూ 'బాపూ! మోసపోలేదు కదా నువ్వు' అని బాధగా, మానవుడుగా కదలిపోయి కరగించే కవితనూ మెచ్చుకోగలం వ్యక్తికి బహువచనం శక్తి 'అనే' మాటను పూర్వపక్షం చేస్తున్నట్లు, అసలు విలువలకోసం బ్రతికే మనిషికి మానసిక ఏకాంతం కావాలని కోరడం కొందరు మెచ్చగలరు. కాని తమతో ఏకీభవించని అందర్నీ బట్టలొలిచి దిగంబర కవిత్వపు కొరడా కొసర్ని రుచి చూపిస్తామంటూ తాము బట్టల్ని విప్పి, మరేదో ఆచ్ఛాదన అడ్డు పెట్టుకొని ప్రలాపిస్తే వారితో సమాజం ఎలా కదిలి వస్తుంది? ఆచ్ఛాదనా లక్కరలేని వారి కవిత్వానికి దోహదంగా కలం పేరు లెందుకు? పోనీ సంవత్సరాల పేర్లు, ఋతువుల పేర్లు మార్చటం ఎందుకు? అచ్చులో పిచ్చి చమత్కృతు లెందుకు? వీటన్నింటినీ వదలినా వస్తువులో వీరు సాధించదలచుకొన్న నూతనత్వం యేమిటి? 'Shock' నిచ్చి ప్రజల కళ్ళు తెరిపించడమే ఉద్దేశమైతే మూడు సంపుటాలు ప్రకటించటం అనవసరం. విధ్వంసన తరువాత వీరు నిర్మింప జూస్తున్న సమాజ స్వరూపం వీరి కవితలో కనిపించటంలేదు మనిషికి మానసిక ఏకాంతం, స్వేచ్ఛ తప్పక కావాలనే కోరికను వెల్లడించటానికి మరొక ఉద్యమంయొక్క అవసరం కనిపించదు అభ్యుదయ కవిత్వానికి మరికొన్నింటిని చేర్చుకుంటే చాలు దానిని చెప్పటానికి అందరినీ బూతులు తిట్ట నవసరంలేదు ప్రతియుగంలోనూ కవులు పూర్వకవులపై తిరుగుబాటు చేస్తున్నారు కాని బూతులు తిట్టటం లేదుకదా? బూతులు తిట్టటం వీరి ప్రత్యేకత అనుకుంటే అదీ కవిత్వానికి కొత్తకాదు. పట్టరాని ఆవేశంలో శ్రీశ్రీ, రాచకొండవంటి రచయితలు ఒకటీ ఆరా బూతు మాటలు వాడలేదా? కావ్యం నిండా బూతు మాటలు వ్రాసి వాటిని బూతు మాటలుగా పేర్కొన్నందుకు 'నీ మెదడు పురుగు తినేసింది' అని తిడుతూ యింకా యిక్కడ వ్రాయటానికి వీల్లేని బూతులు వ్రాశారు వీరిని రేపటి మనుష్యులు ఉపేక్ష చేస్తారు. వెనుకటి సర్రియలిజమ్‌లాగే యీ ఉద్యమం ఎత్తుగా, ఏపుగా పెరిగి కాయని కొబ్బరిచెట్టులాగ, వారి మాటల్లోనే చెపితే 'మాచకమ్మ' లాగే మిగిలిపోతుంది అంతేగాని 'పిచ్చాసుపత్రి అంతా ఖాళీ' అని వారు పిలిస్తే జనులు వారి వెనుక నడవరు 'మానవజాతిమీద ఉమ్మివేస్తాము . సర్వతర్కానికీ 'డాడా' వ్యతిరేకము. ప్రపంచంలో ధ్వంసం చేయవలసినది ఎంతో వుంది ప్రతి దానినీ ఊడిచి వేయాలి పరిశుభ్రం చేయాలి' అన్న డాడాయిజమ్ వీరికి బాగా సన్నిహితం.

## రేపటి కవిత్వం:

ఇంక రేపటి కవిత్వం ఏవిధంగా ఉండబోతున్నదని ఆలోచించినప్పుడు మేధావులు కొందరు నిరాశ చెందుతున్నారు శ్రీ జి వి కృష్ణరావు 'సాహిత్య భవితవ్యం' అనే వ్యాసంలో 'జీవితం నిలుకడలేక త్వరిత గతిని మారుతున్నప్పుడు తదనుగుణమైన మార్పులే సాహిత్యంలోనూ, తక్కిన లలిత కళలలోనూ వస్తవి సమాధ్యవస్థాపాదకాలైన కృతులకు అవకాశం తక్కువ. తదాస్వాదన శక్తి గూడ సన్నగిల్లక తప్పదు. వెనుకటివలె నవ్య కృతులు ఇక మీదట మూడు కాలాలపాటు నిలవటం అసంభవంగా కనిపిస్తున్నది ఇంతకు మున్ను సమాదృతాలైన కృతులనే అయినట్లు, కానట్లు విశ్వ విద్యాలయాలు ఆదరించవచ్చును క్రొత్తగా వెలువడే రచనలు స్వల్పకాలం నిలిచి ఆమీద విస్మృతిపథంలో లీనమైపోతవి రచనయందలి వస్తు శిల్పాలు కూడ పత్రికా వార్తలవలె ఉద్వేజకాలుగా ఉంటవి అంటే పత్రికా రచనమే (Journalism) సాహిత్యంగా చెలామణి లవుతుంది ఈ లక్షణాలు అప్పుడే కొంత వరకు గోచరిస్తున్నవి' అని మహా కావ్యాలు వెలువడే అవకాశాన్ని శంకిస్తున్నారు శ్రీ కుందుర్తి ఖండ కావ్యాలకు కాలం తీరిపోయిందనీ, కథా ప్రధానమైన పరిపూర్ణ కావ్యాలే పది కాలాలపాటు నిలుస్తాయనీ భావిస్తున్నారు ఈ సమయంలో మనం 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అనే సూక్తిని విస్మరించరాదు 'నిన్నటి మహా కావ్యం పద్దెనిమిది పర్వాలైతే నేటి మహా కావ్యం పద్దెనిమిది పేజీలే'నని శ్రీశ్రీ వచించారు నేటి జీవితాని కనుగుణమైన, నేటి సమాజాన్ని ప్రతిబింబించే మహాకావ్యం నేడూ వెలువడుతుంది ఛందస్సును వీడినంత మాత్రాననే వాక్యానికి కావ్యత్వం సిద్ధించదు హృదయ స్పందనను మాటలలో పెట్టటానికి ఛందస్సుకై వెదకనక్కరలేదుకాని అస్పష్టమైన కలగా పులగపుటాలోచనలూ, జుగుప్స కలిగించే భావాలూ, శబ్దాలూ నవ కవిత్వంలో చోటు సంపాదించుకుంటున్నాయి. వాటి గూర్చి ఎవరూ విచారించ నక్కరలేదు కాల ప్రవాహమే ఆ మాలిన్యాన్ని క్షాళనం చేస్తుంది

'ఎప్పుడో ఒక మహాకవి భగీరథుడిలా వస్తాడు.
కొంగ్రొత్త కవితా గంగను తెస్తాడు'

అని శ్రీ కుందుర్తివలె మనమూ ఆశతో నిరీక్షించవచ్చు. ఆ మహాకవి కావ్యంలో తెలుగువారలు, తెలుగు ఊరులు ప్రతిఫలించాలని ఆశించుదాం

---

1. వచన కవిత్వం పేరిట కొన్ని నిజాలు...దుర్గానంద్—సృజన.

# దేవి మృగవాహిని

## శ్రీ డి. ఆర్. వర్మ



అస్టార్టీ, అష్టారెత్ ఇత్యాది నామధేయాలతో క్రీస్తు పూర్వం ఎనిమిదవ శతాబ్దంలో పూజింపబడిన మాతృదేవి ఎటలో స్తనాలు ఒత్తుకుంటునట్టున్న విగ్రహం పోలికలు బెలూచిస్తాన్‌లోని కుల్లి లిపి లాహ్లో లభించిన విగ్రహంలో ఉన్నాయి (ఇస్రాయెల్ ప్రభుత్వ సౌజన్యంతో)

గతించిన జమీందార్ల రూపచిత్రాలు, దేవిడీల్లో ఆయుధాలు, వారి చిహ్నం (మోనోగ్రాం) వగైరాల్లో క్షాత్రం కన్పించినా వారు ఆయుధ జీవులు మాత్రం కారు. అవన్నీ లాంఛనాలు. నేటి రాజకీయ పక్షాలకు, మత, వృత్తి సంస్థలకూ చిహ్నాలు పతాకాలు ఉన్నాయి. పూర్వం ఫలానా వ్యక్తి అని గుర్తించేందుకు అతని జెండా, రథం, దుస్తుల రంగు, ఆయుధం వగైరా కొండగుర్తు. అనేక దేశాల్లో మనుష్యులు పక్షులు, చతుష్పాత్తులు,వృక్షాలు పేరిట వ్యవహరింపబడినారు ఆ యా సాంకేతిక చిహ్నాలున్నవారే—అంటే 'రామాయణం'లో కపులు కోతులు కారనే భావం. ఆ యా సాంకేతిక చిహ్నాలున్నవారి కాయా చరాచర జీవాలు పరమ పవిత్రం.

మన ప్రాంతాల్లో సాతవాహనుల నాటికేవున్న సింహలాంఛనం—చారిత్రకంగా క్రీ. శ. 13 వ శతాబ్దం వర కనేక రాజవంశాలు అనుసరించాయి. గోత్రములవలె ఇవి ఫలానా అని ప్రకటించే జనాంగ సాంకేతిక నామాలు.

సురుల సృష్టించిన నరులు తమ అలవాట్లు ఆచారానుసారంగా దేవతలకూడా సాంకేతిక చిహ్నాలిచ్చారు—తిరుపతి వెళ్ళే ప్యాసింజర్ బస్సుకు నామాలు పెట్టినట్లే. మానవుడు మలచిన దేవతల రూప కల్పనలో ఆ యా చిహ్నాలను ఆ యా దైవాల ప్రతినిధులు, ధ్వజం, వాహనం ముఖంగా కూడా మార్చారు.

* * *

పూర్వం కుర్రకారు ముద్రగూత లూగించిన ఠొక పటం-విరబోసిన శిరోజాలు, చేత నో ఆయుధం లేక త్రివర్ణ పతాకం, చేరువ నొక సింహం, వెనుక (బ్యాక్‌గ్రౌండ్) మొండిగాక నిండుగానున్న భారతదేశ పటం—ఆమె మన దేశమాత భారతమాత, హిందూ ముస్లిం, క్రైస్తవ,పార్శీ, సిక్కు, జైన—యావద్భారత ప్రజల తల్లి. విశాఖపట్నంలో విద్యార్థి దశ ముగిసేవరకూ నా పెట్టెలో అతి జాగ్రత్తగా ఉంచుకొన్న పటం—ఆలోచిస్తుంటే అహింసా[illegible] దౌర్జన్య రాహిత్యం అనే నాటి కాంగ్రెస్ సిద్ధాంతానికెంతో విరుద్ధంగా పటంలో సింహం—ఆయుధం ఎందుకా అనిపిస్తుండేది

బ్లేడ్ తెగునేమో అని భయపడే నేను ఆయుధపూజ చేయడమేగాదు విజయదశమికి మాడుగుల వడ్డాది మాడుగుల) బంధువులింట ఊరేగింపు, వివిధ యుద్ధప్రయోగ నైపుణ్యప్రదర్శన వీక్షణం జరిపాను ఈ బంధువులకు(భూపతి దేవులు) కండబలమూ లేదు, ఎస్టేట్ లేదు,కాని కళింగ రాజ్యంలో వీరి పూర్వులు యోధులూ రాజులూను వంశాచారం అనుకుంటూ ఆడా మొగా ఆయుధ విద్యాశక్తి, ప్రదర్శన—ముప్పయేళ్ళక్రితం సంగతి

నేను నమ్మలేని మా కుల కరవంశకర్త మేనత్త—అత్త పరశురాముని తల్లి. పురాణాల్లో వీరమాత, వీరపత్ని రేణుక ఆమెగా ఏ ఆయుధాలు వాడలేద



ఆదిలో అమ్మవారి ఆకారాలు,
(ఇస్రాయేలు ప్రభుత్వ సౌజన్యంతో)



చక్రేశ్వరి. జైన దేవత. (రాజస్థాన్ ప్రభుత్వ సౌజన్యంతో.)



యోగీశ్వరి (కోరలున్నాయి.)



బాబిలోనియాలో లభించిన ఒక ముద్ర. ప్రసూతి భావం తెలిపేది. చేతులు పైకెత్తుకోనడం ఈజిప్టు శిల్పాలలో వుంది. ఇది ఆలంపూర్‌లోని రేణుకా భూశక్తిని పోలినది. (ఇటలీ ప్రభుత్వ సౌజన్యంతో.)



నృత్య లక్ష్మి కాకతీయ కుడ్య శిల్పం.

దేశం, రాష్ట్రం, భాష, మతం, శరీరవర్ణం, వృత్తి, ఆర్థిక వ్యత్యాసాలు, ఏ వర్గాని కా వర్గం, ఎవరి గొప్పలు వారు డప్పు వేసుకునే రోజుల్లో వింత గావచ్చును కాని, లభించిన శిల్పచారిత్ర కాధారాలబట్టి చూస్తే సింహలాంఛనీదేవి అనేక దేశాల్లో ఉండడంవలన మానవుని మేధా ప్రగతి కొలతల్లో అంతా ఒకటే—విశ్వమానవ సిద్ధాంతానికి బహుచేరువ అనే విషయం కాన్పిస్తుంది.

అపౌరుషేయాలంత పురాతనం అనిపించే— ఏ ఇతర దైవానికీ తీసిపోనంత చిత్ర, శిల్ప, సాహిత్యారాధనా వ్యాప్తి దుర్గ కున్నది. సింహలాంఛనీదేవి విశ్వవ్యాప్తంగా ఉన్నా ఒక్క మన దేశంలో మాత్రమే మహిష మర్దని. వైదిక సాహిత్యంలో అమ్మవార్లు లేకపోలేదుకాని వారెవరూ దుర్గను పోలిన ట్లగపడదు. మన దేశంలో చోళరాజుల నాటినుండే దుర్గాపూజ, శిల్పం బహుళ వ్యాప్తి నొందిన వంటారుకాని, అది సరికాదేమో! ఆ పోలికలున్న శిల్పం బౌద్ధంలోనూ ఉంది.

అంబిక 'వాజసనేయ సంహిత' నాటికి రుద్రసోదరి కాని 'తైత్తిరీయారణ్యకం' నాటికి భార్యగా మారె నంటారు. ఈవానివరుసల పోలిన కథలు ఇతరదేశ పౌరాణిక వాఙ్మయంలో లేకపోలేదు.

ఉమ 'కేనోపనిషత్' నాటికే బ్రహ్మ విద్యామూర్తియట. దుర్గ నామే కాళీ, కరాళీ అంటుంది 'ముణ్డకోపనిషత్'—కాళీ, కరాళీ అగ్నిదేవుని సప్తజిహ్వల్లో రెండిటిపేళ్ళు. అంటే అగ్ని సంబంధం—అందుకే దేవీ ప్రతిమా శిల్పాల్లో శిరశ్చక్రం అనిపించక తల వెనుక జ్వాల. కన్యా, కుమారీ, కాత్యాయనీ అనబడిన ఈమెయే సూర్య (తేజస్సు, అగ్ని) పుత్రియైన వైరోచని.

కాకతీయుల కాకతి దుర్గయే అన్నారు. మైసూరురాష్ట్రంలో కాకతి



గోధాసనీదేవి (పాదాల దిగువ ఉడుము ఉన్నది)

వైష్ణవి — (కటక్ జిల్లా — డాక్టర్ బి వి. నాథ్ సౌజన్యంతో)

పాలస్తీనాలో దొరికిన క్రీ పూ. 17 వ శతాబ్ది ఒంగారు ఆభరణం (ఆది సాంకేతిక రూపం అండాకారం, రక్షరేకుగాను వాడారు — ఇటలీ పురాతత్వ శాఖ సౌజన్యంలో)

యమి, శిశువుతో. (తల వెనుక అలంకరణ శిల్పం ఇతర దేశాల్లోను వుంది. (డాక్టర్ బి. వి. నాథ్ సౌజన్యంతో)

అనే గ్రామం ఉన్నట్లూ, అక్కడ దేవి మహాలక్ష్మి (లక్ష్మి కాదు) దుర్గ అనే సంగతి మన పరిశోధకు లనేకు తెలుగరు. ఓరుగంటి కాకతి వీరులు కొల్చిన దేవత కాదేమో అనిపించే సందర్భం—విజయార్థం నాటి వీరులు పూజించినది మొగిలిచర్లలో ఏకవీర, ఐనవోలులో, మైలార దేవుడు ఆతర్వాత నాయకుల నాడూ పదవీడు ఏక వీరాదేవి విజయార్థం పూజింపబడినదే—కాకతివలె ఏకవీర (రేణుక) కూడా దుర్గ మరో రూపం లనాలి

ప్రాంతీయంగా పేర్లు వేర్వేరు గావచ్చును మా చాముండా పరమేశ్వరియే మహిషమర్దనియని కన్నాడువారంటే, కాదు మా మహాలక్ష్మి యని మహారాష్ట్రులంటే, ఆ పనిచేసినది మా కాళీమాయి అని వంగీయు లంటారు క్రీ శ. 6 వ శతాబ్దానిదనే దేవీ 'మాహాత్మ్యం' ఓటు మహారాష్ట్రులకే 'పద్మపురాణం'లోవైష్ణవియే మహిషమర్దని చాముండతోపాటు వైష్ణవిని కూడా సప్త మాతకల్లో ఉన్నది

నర నారాయణాంశ, నారాయణి సరస్వతుల యంశ, త్రిమూర్తుల వివిధ దైవాల అంశ, కాత్యాయని అందరూ 'ఆల్ కరక్ట్' కారణం దేశీ విదేశీ ప్రాంతీయ భావ సమ్మేళనంలో అనేక గుణాలు, పేర్లు, రూపాలు ఏర్పడినవి సృష్టి, పుష్టి, నష్ట సమ్స్కారాల దేవతాపరంగా వ్యాప్తమయ్యాయి

హిందూ మతం నాటి ఆర్యుల వైదికం కాదు వైదికంలో ఈ అమ్మవారు లెదు ఆదిముల అమ్మవారిని ఆర్యులు కొంతకాలం తర్వాత తమ సంప్రదాయంలో చేర్చుకోడం జరిగిం దన్నారు.

* * *

బెంగాలీల కాళీమాయి పూజలు పురాతనం గావట మహారాష్ట్రులు రాష్ట్రంలో జాతీయత సమైక్యం సాధించడానికి—ఒక విధంగా రాజకీయం—వినాయక పూజ వ్యాప్తి చేసినట్లే, మహమ్మదీయ పాలన కాలంలో బెంగాల్‌లో దుర్గాపూజ వ్యాప్తి చెందివుంటుంది.

నీలశ్యామలదేహి, శంఖ చక్ర ఖడ్గ భల్లధారిణి, భుజానికి పాము (వాసుకి) నారిగాగల విల్లు, వ్యాఘ్రచర్మ ధారిణి—సింహచర్మ ధారిణి—గజ చర్మధారిణి, చతుర్భుజ—బహుభుజ, విటలాక్షి, తెల్లని పలువరుస, ఎర్రని పెదవులు, ఒకకాలికి కట్టుతాడు, మరో కాలికి మంజీరం, ఫణిభూషణి, జటలు, శశాంకచూడ, సింహలాంఛని, పాశపాణి—వైరిభమర్దని.

నెమెసిస్. స్తనాలున్న సింహి, గ్రీకుల దేవతామూర్తి. ఎరెజో తవ్వకాల్లో దొరికింది. (ఇస్రాయేల్ ప్రభుత్వ సౌజన్యంతో.)



ఏకజట, తార, బౌద్ధుల దేవీ రూపాలు (శాలిహుండాం శిల్పం.



సప్త మాతృకలు



దుర్గను పోలిన హిత్తీయుల తర్వాతి కాలపు దేవీ శిల్పం. (టర్కీ పురావస్తు శాఖ సౌజన్యంతో.)

ఈ ఆకారం, అలంకారం, ఆయుధాలు గూర్చి ఆలోచిస్తే వివిధ కాలాల్లో వివిధ ప్రాంతాల్లో జన జీవన సంప్రదాయాలు, వారి వారి భావ సంపదా సమ్మేళనం అనిపించకపోదు. ఇతర దేశాల్లో కూడా ఇలా చర్మం ధరించినవారూ ఇంకా అనాగరకం అనిపించే ఆయుధాలు ధరించిన దైవాలు లేకపోలేదు. ప్రకృతి, పరిసరాలు, భూమిపై చూసిన మార్పులవలెనే జ్యోతిర్మండల సంబంధమైన గాథలూ, కల్పనామూర్తులు ప్రపంచమంతటా ఉన్నాయి.

మన దేవీ స్వరూపంలోని బహు గుణ రూపాల్లోని 'అశ్లీలం', బూతులూ, నగ్నరూపం పోలికలు, ఇతర దేశాల్లోనూ ఉన్నాయి. ఆధునికులానాటి శిల్ప సాహిత్యాన్ని పేర్కొంటూ నేటి జన వ్యామోహం కారణంగా పూర్వం 'టాప్ లెస్' (వక్షోజ ప్రదర్శన) వగైరా ఉండేవనేంతవరకూ వచ్చేశారు. అది తల్లీ బిడ్డా 'మార్కు' దైవం, సృష్టి పోషణ సూచించే శిల్పం అని వీరికి తెలియదు. మదగజ కుంభ సన్నిభంగా కుచ వర్ణన కవుల నేమనగలం? శిల్పంలో అలా మలచడం అమ్మ అనే భావమే. జైనాది శిల్పాల్లో మాత, శిశు ప్రతిమా రూపాలున్నట్లే హిందూమతంలో ఉన్నాయి. ఇతర దేశాల్లోనూ ఉన్నాయి. బిడ్డకు పాలిస్తున్నట్లు అమ్మవారి విగ్రహాలు మనదేశంలోనే ఉన్నాయి. అలాంటిదే చనుబాలు పిండుతున్నట్లున్న విగ్రహం 'బైబ్లస్' శిథిలాల్లో (లెబనోను) లభించింది. మన పురాణాల్లో ఒక దేవికి స్తనాలు మూడున్నట్లున్నది. చంద్ర కళాధిష్ఠానదేవి, బహుస్తని విగ్రహం ట్రిపోలిటానా (లిబ్యా—ఆఫ్రికా)లో లభించినది.

* * *

'రామాయణ' కథానాయకుడు విజయాభిలాషియై అపరాజితా దేవిని పూజించెనట— అలా రాజులనేకులు పూజించారు. ఆ దేవియే దుర్గ అన్నారు. 'కాదంబరి, మాలతీ మాధవం' చదివిన వారికి క్రీ. శ. 7—8 శతాబ్దాలనాటికే శాక్తేయ ప్రభావం సమాజంలో ఎట్లున్నది తెలుస్తుంది.

'వైదికార్యుల ఇంద్రుడు అనే దేవరాజు పాకశాసన పోషక రక్షక దేవుడే విజయ దాతగా, రణదైవంగా మారినట్లుంది. అమ్మవారి సంగతీ అంతే. ఆదిలో అమ్మయైయ్యుండీ తర్వాత, కన్య కుమారి. ఇంకా ఆ నమ్మకాల్లో ఆలయంలో అర్చకుడు చీరగట్టుకోడం—అలాంటిదే ఎర్రనారికలవాడు, గరగలెత్తుకొన్న వారూ గాగరా (పరికిణి) కట్టుకునే ఆచారం. అమ్మవారు అంతటా కేవలం స్త్రీల యారాధ్య దేవత. పిల్లల తల్లియైన గ్రీకుల దేవత—ద్యూయస్ భార్య (సోదరి) కూడా కన్యగా భావింపబడింది.



ఆరుగొలను కోటమ్మ అనబడే చండిక. సృగాల వాహిని. (నక్క చిహ్నం స్పష్టంగా వుంది.)



గోర్గోనీ (తలమాత్రం కల) ఎట్రూస్కన్‌ల అమ్మవారి భీకర రూపం.
(ఇటలీ ప్రభుత్వం సౌజన్యంతో



గోర్గోన్ (తలమాత్రం కల) ఎట్రూషన్‌ల అమ్మవారి సౌమ్యమూర్తి
మన ఎల్లమ్మను బోలినది. (ఇటలీ ప్రభుత్వం సౌజన్యంతో.)



నైక్ (విజయ దేవత, అస్కాలోన్ వద్ద శిల్పం (ఇస్రాయెల్ ప్రభుత్వ
పురాతత్వ శాఖ సౌజన్యంతో.)



డయానా – బహుస్తని (ట్రిపోలిటానా పురావస్తుశాఖ సౌజన్యంతో)



స్లావిక్ పురాతన దైవ రూపాలు (సబటినోవ్కావద్ద తవ్వకాలలో లభించినట్టివి. సాంకేతిక నిరాకార రూపాలనుంచి సాకార విగ్రహ రూపాలు పరిణమించడం చూడవచ్చు — రష్యా పురావస్తుశాఖ సౌజన్యంతో)



...ల్పదేవి. సృష్టి, పోషణ, మాతభావం తెలుపడానికి స్తన పుష్టి, యౌవనం చూపడానికి కాదు.



మన వారాహిని పోలిన సస్యాధిష్ఠానదేవి (ఇస్రాయేలు ప్రభుత్వ సౌజన్యంతో.)

సైంధవ సంస్కృతి కేవలం సింధునదీ తీరాన్నే అంటి పెట్టుకోలేదు. లోథాల్ త్రవ్వకాల్లో బయల్పడిన అమ్మ రూపం చిన్న శిలాఖండం. అటాంటి శిలాఖండాలు, వ్యక్తావ్యక్త రూపాలు అనేకదేశాల్లో (ఈజిప్టు, టర్కీనియా వగైరా) ఉన్నాయి. సుప్రసిద్ధ దేవీ పీఠాల్లో ఒకటైన కామరూపంలో (అస్సాం) ఆదిలో కామాఖ్యదేవి రూపం స్త్రీ మర్మాంగమేనంటారు. మన కథల్లో సతి (దక్షయజ్ఞానంతరం) శరీర భాగాలు రాలినచోట (చంద్ర కళల షోడశి) దేవీ పీఠాలు. ఈపోలిన కథే, పూర్వం ఈజిప్టులో అమ్మవారు ఛిన్నా భిన్నమైన భర్త శరీరభాగాలు ఏరుకొన్నకథ—ఆయన పురుషాంగం మాత్రం లభించనందున ఒకానొక దారు నిర్మాణం.

*          *          *

వైదిక సాహిత్యంలో ఒకానొక దేవత ననా. వైదికార్యులు భారత్ చేరక ముందు ఐరాన్ (ఆర్యావన) నేటి ఇరాన్ వాసులు.

నేడు మనం నామకరణాల్లో ఫలానీ దేవ వరప్రసాద్ . అంటున్నట్లే, శైవులు తాము శివుని కుమారుల మనుకున్నట్లే అమ్మవారి పేర్ల వ్యవహరించారు. ఆంధ్ర చక్రవర్తులూ వారి ననుకరించినవారు గోత్రనామం అస్పంతగా ఫలానావారి పిల్లలమన్నారు. అఫలానా కన్నతల్లికాదు. ఆగోతమి, మాఠరి హారితీలు అమ్మేవార్లే. కొందరు పరిశోధకులు బహు భార్యాత్వ కారణంగా అలా తల్లిపేరు చెప్పుకొన్నారనుకోడం సరికాదేమో.

కుషాన్ రాజులు నేటి రష్యా ప్రాంతీయులు. మన దేశంలో పాలించిన కుషానుల నాణెములపై వారి యమ్మవారు ననైయా (ననా) ముద్రించారు. ఆమె సింహవాహిని.

నేటి ఈరాక్ ప్రాంతంలో సహస్రాబ్దాల పూర్వం పాలించిన ఒక రాజ వంశంవారి ఇలువేల్పు, రణదేవత, జయకరి ననా రెండు సింహాలపై నిలచివున్నది. ఆ వంశీయులనుండి వచ్చిన పేర్లే కశ, కుశ, కూశ్, కార్య, కాశ్యప, కశ్మీర, హిందూకుశ్ రాష్ట్ర పర్వత గోత్ర ప్రజానామాలు. బైబిల్ కూశేయు లన్నది.

కుషానుల తర్వాత రాజులు బ్రాహ్మణ ధర్మ సంస్థోద్ధారకులైన గుప్తులు ముద్రించిన నాణెములపై వారి అమ్మవారు సింహం చేరువనున్న శ్రీ. ఈ రాజుల పూర్వుల్లో నొకడు తన తల్లి లిచ్ఛవీ ఆడపడుచు అని సగర్వంగా ప్రకటించుకొన్నాడు. ఐతే మన (బ్రాహ్మణాచార) ధర్మ స్మృతులు లి (వి) చ్ఛవీల న్యూనతా దృష్టినే జూచుట మను స్మృతిలో గూడా ఉన్నది.



సారదేవి మరీచి — శాలిహుండం శిల్పం.

మన పూర్వులు (సంతానార్థం) పూజించిన జ్యేష్ఠాదేవిరథం లాగేవి సింహాలు జ్యేష్ఠాదేవినే నృతి, నైఋతి అన్నారు. జర్మను లీమెనే నెర్తెస్ అన్నారు. గత శతాబ్దంవరకూ సంతానార్థులైనవారు దిసమొలతో (శంభరీ వ్రాతములు—క్రీడాభిరామం చూడుడు) పోయి పూజింపబడిన రేణుక (ఏక వీర) కూడా సింహలాంఛనియే బీహార్‌లో మహామాయాదేవి మృగలాంఛనియే.

నేటి సిరియా, లెబనాన్ ప్రాంతాలనుండి సహస్రాబ్దాలనాడు వివిధ దేశాలకు వ్యాపించిన వీరులూ, ఈరాక్ ప్రాంతాల పాలించినవారూ సింహలాంఛనులు, మన సాతవాహన విష్ణుకుండినాదులవలె ఆరాజులే బైబిల్ ఒకటేగాదు మన పురాణాలు కూడా హిత్తి, అమొరి, అమర, పురు, కాత్య, కిత్తక క్షత్రియు లన్న వీరాధి వీరుల. వీరు సౌరోపాసకులు, సింహరాశిని పూజించినవారు వారి అమ్మవారు మా (త,) అమా, ఉమా ఈమెకూ సింహలాంఛన మున్నది టర్కీ పురావస్తుశాఖవారికి లభించిన హిత్తీయుల అనంతర కాలపు అమ్మవారు సింహ వాహని

వీర తర్వాతి రాజులు అస్సిరీ (అసుర) లనే ప్రచండ వీరులు పూజించిన దేని అంతే సెన్నాకెరీబ్ రాజనాటి శిల్పంలో పురావస్తుశాఖకు లభించిన దానిలో దేవి కైబిలి సింహాసని—సింహం కుక్కవలె చాచుకుపడుకోగా దానిపై కర్చీ వంటి ఆసనంపై నున్నదీమె కుబ, కుబబ, కుంబబ అన్న బహు పురాతన దేవతకు ఈ కైబిలీయేనట

మన రేణుకాదేవి మూర్తివలె తల మాత్రమే కాల్పించే బాబిలో నియా నిన్‌హుర్‌సాగ్; ఆ పోలిన ఈజిప్టు ఈరి (ఈసిస్), హస్‌హోర్, గ్రీకుల ఆర్టెమిస్ అమ్మవార్లకూ సింహప్రమేయం ఉన్నది క్రీ పూ 7 వ శతాబ్దపు శిథిల శిల్పాల్లో ఆర్టెమిస్ చేతుల్లో సింహమున్నది లభించింది పూర్వం సిసిలీ ప్రజలు ఆమె జాతరకు ఆడసింహాలు ఊరేగించేవారట

ఇస్రాయేలు పురావస్తుశాఖవారికి లభించిన శిల్పం కనాన్ (కాణ్వ?), ఫ్రిజీ (భార్గవ?), ఎనీశ (పణి వణి, ఫ్యూనిక్,) పిక్రిసీ (పౌలస్త్య?) వగైరా



అమ్మన్‌దైవం. ఈజిప్టులో బహు పురాతన కాలపు వ్యక్తావ్యక్త దైవం. ఈ దైవంలో ద్విలింగ భావమూ ఉంది. సాకారం అనడానికి చేతులు, తల, కిరీటం కనిపిస్తాయి. సింహవాహనం. జీవునికి లాంఛనం.



అఫోడైటెక్ — వారసింహుడు. క్రీస్తుపూర్వం ప్రథమ శతాబ్ది అంతం లోని శిల్పం సూడాన్. (సూడాన్ ప్రభుత్వం సౌజన్యంతో.



సప్త మాతృకలు (ఆయా దేవతల వాహనాలు చూడవచ్చు).



అథేనానైక్. (గ్రీకుల [illegible]) (గ్రీస్ ప్రభుత్వ సౌజన్యంతో.)

ప్రజలు పూజించిన దింగ్రైమేది, అస్టారి (అష్టోరెత్) అమ్మవార్లూ, క్రీట్ దీవిలో ర్టియా (రెంయా) సింహ లాంఛనులే కొన్నిట వీరితో సింహ కిశోర

ఉన్నవి. క్రీటు దీవిలో లభించిన ఒక అమ్మవారి ఆకారంలో—స్తనాలకుమాత్రం ఆచ్ఛాదన లేదు రెండు చేతుల్లో పాములు పట్టుకొని బారచాచగా తలపై సింహం గ్రీకుల నెమిసెస్ సాంకేతిక రూపం పక్ష్మాలు, స్త్రీ వక్షోజాలున్న సింహ బాబిలోనియా సెమిటిక్ భాషలవారి ఇస్తారు శృంగారాధిష్ఠాన దేవేగాదు మహామాత కుంభస్తని, పక్షిపాదాలు, రెక్కలున్నవి, పార్శ్వాల్లో ఉలూక ఉన్నవి. రెండు సింహాలపై నిలిచిన దేవి

చారిత్రకంగా ఆ యా ప్రజలకన్న పురాతనులు సెమిటిక్, ఇండో యూరోపియన్‌లకూ చెందని మూడోవర్గం సుమేరియన్‌ల (వీరిగూర్చి కొంత ఆంధ్రపత్రిక 1968 69 ఉగాది సంచికలో చర్చించాను) అమ్మవార వారి ఆదిశక్తి, అమ్మతల్లి (విశాఖపట్నం జిల్లాలో అమ్మవారిని అమ్మతల్లి అనడం మహామాత—జగదంబ అనడమే), భూమాత వగైరా 'కి' ఆమె మర రూపం తల మాత్ర మున్నది నిన్‌హుర్‌సాగ్ పార్వతి పోలిక, నిన్తు అధితి పోలిక అంతా ప్రకృతి, సృష్టి బాంధవ్య భావాలు వారి జీవాధిష్ఠానదేవి, స్వర్గరాణి ఇనన్నా కొంతకలపు ఇణ్ణిని ఇనన్నావారి రణ విజయ దేవత న నా, నన్నగ్ దైవాల పేర్లకు మాతృక ఇనన్నా అయ్యుండును ఇనన్నా భర్త దుముజి పశుపతి వీరి శిథిల శిల్పాల్లో సింహాలు, నరముఖ సింహాలున్నాయి వీరి సూర్యదేవుడు ఉతు శిల్పంలో రెక్కలున్న సింహంపై ఒక కాలుంచి రెండవ కాలు క్రింద నెవరినో త్రొక్కివేస్తున్నట్లున్నది మనకు నటరాజు కాలిక్రింద అపస్మారు డున్నాడు



కనానీయుల దెవతా విగ్రహం. నెహోరియాలోని ఒక దిబ్బ తవ్వకాలలో దొరికిన పాత మూసలలో పోసి కొత్తగా తయారు చేసిన విగ్రహం. (ఇస్రాయేలు ప్రభుత్వం పురాతత్వ శాఖ సౌజన్యంతో.)



ఇందుశేఖరి — సీరపాణి శ్రీకాకుళం

బహు పురాతన కాలపు వ్యక్తా వ్యక్తరూపంలోనున్న ఈజిప్టు—లమున్ వద్ద సింహాలున్నది జాగ్రోస్ శిథిల శిల్పాల్లో ఇస్తార్ సింహవాహనియే గాక 'సారూఢితం మహాసురం పాదా నాక్రమ్య కంఠేచ శూలేనైన మ తాడయత్' అనే మన పౌరాణిక వర్ణనకు (సైరిభమర్దని) పోలినట్లు భంగిమం ఇస్తార్ పడియున్న పరాజితుని దేహములో దిగబడియున్న ఆయుధపాణి

ఈ అమ్మవార్లందరిలో మన దుర్గపోలిక లున్నవికాని వీరెవరూ మహిష మర్దనులు మాత్రం కారు

* * *

ఏ దేశంలోనూ లేని మహిష మర్దన గాథ మనకున్నది బహుశా ఒకానొక కాలపు కథ కావచ్చును కొందరు దేవుళ్ళు కూడా మహిషాసురమర్దను లనబడినారు కేరళలో శబరిమల అయ్యప్ప (విష్ణు జగన్మోహినీ దేవికి శివ బీజంవలన పుట్టిన) దేవుడూ మహిషాసురుని వధించినట్లు చెబుతారు

సాహిత్యంతో, ఒక వర్గానికి చెందినవారూ, సింహాని వ్యవహరించినా, సాధారణంగా జనసామాన్యం 'వాడా పులి' అంటే ధైర్య సాహసాలకూ బలానికీ మరోపేరు పల్లవ రాజుల్లో సింహ (సింహవర్మ) నామలున్నారు కాని వారి రాజుల్లో నొకడని గొప్ప చిత్ర శిల్ప నైపుణ్యంగల వాడనే అర్థంలో శాసనాల్లో 'రూపకార పులి' అన్నారు

వేంగీ విష్ణు (వహ్ని) కుండినులూ సింహలాంఛనులే వీరూ, పల్లవులూ ఒకే వర్గం వారంటారు విష్ణుకుండిన శిల్పంలో నెత్తిన కొమ్ములున్న దేవతా విగ్రహా లున్నాయి వీరి శిల్పాన్నే పల్లవులు విస్తరించారు మహాబలిపురం పల్లవ శిల్పంలో మహిషమర్దనీ రూపమే సరైనదంటారు మహిషు డచట మానవ వీరుడు—మహిష విషాణుడు అలాంటివాడే శ్రీకాకుళంజిల్లా లింగేశ్వరాలయ శిల్పంలో (చూ. ముఖ లింగేశ్వర..... త్రికలింగేశ్వర వ్యాసచిత్రాలు 'భారతి' నవం

బరు 68) ఉన్నాడు. అదే గ్రామాన సోమేశ్వరాలయ శిల్పంలో వాని అదో భాగం మాత్రమే మహిషకాయంగా నున్నది. కోస్తా జిల్లాలో చాళుక్య శిల్పం అంతటా అలాంటి రూపం లేదా చచ్చిపడియున్న ఎనుము దగ్గరలో రాక్షసుడుగా నున్నాడు.

బాదామి చాళుక్య శిల్పం, మహాబలిపుర పల్లవ శిల్పం, ముఖలింగేశ్వరాలయ గాంగ శిల్పం అంత ఆకర్షణీయం గాదు. చోళ శిల్పంలో మహిష శీర్షంపై నిలచిన దేవి ఉన్నది.

ఇతర దేశాల్లో వీరుల శిరస్త్రాణాలకూ, దేవతలకూ శృంగాలున్నాయి. అవి గో వృషభ శృంగాలు (గ్రీకు, హిబ్రూ) పురాణపురుషులకూ కొమ్ములున్నాయి. ఈజిప్టు అమ్మవారూ గోశృంగిణియే. శిల్పంలో యూదు ధర్మ వ్యవస్థాపకుడు మోషెకు కూడా కొమ్ములున్నాయి. 'ఆ! వాడికేం కొమ్ములు మొలచాయా?' అంటుంటాం. అంటే వాడేమంత గొప్పవాడా అని. కొమ్ములు చూపడం సౌర—చంద్ర సంబంధం అంటారు. ఐతే విదేశాల్లో వారెవరివీ మహిష విషాణాలు కావు.

సుమేరు శిల్పంలో దైవాలకు తలపై కిరీటంవంటి పొడుగు కుళ్లాయి, దాని కిరువైపులా అంతస్తులవలె కొమ్ములున్నాయి. అడుగు వరుస కాస్త దున్నకొమ్ముల పోలిక.

సైంధవ నాగరికతా శిథిలాల్లో మహిషవిషాణు డున్నాడు. ఆ మూర్తి



ఈజిస్ దేవత (కైరో పురావస్తుశాఖ సౌజన్యంతో)

యోగ మూర్తి, పశుపతి, 'అణు' అన్నారు. సుమేరుల చతుర్మూర్తుల్లో స్వర్గలోకాధిపతి పేరూ 'అన్' యే. వారి కథల్లో ఎనుము లైవు ... రెండు నదీ ప్రాంతీయ సంస్కృతులొకటే అనిపించే పోలిక లనేకం ఉన్నాయి.

మనరాష్ట్రంలో శాసనాల్లో ఇ(ఎ)నుప ఎడ్లున్నాయి. కొందరి ఎనుప ఎడ్లనే గొర్రెలనుకున్నారు. వాస్తవాని కవి గేదెలు, సుమేరులూ వృషభా లనుకున్నారేమో!

పులి, సింహం, ఏనుగ దేన్నైనా మూర్ఖంగా, ధైర్యంగా ఎదిరించేది కారెనుము. బలానికీ, ఎత్తుకూ పోలిక యేమో—కారెనుమునే మనపూర్వులు సైరిభం(ఏనుగు పోలిక) అన్నారు.

* * *

దేవాసుర యుద్ధం కథలు అనేక దేశాల్లో ఉన్నవి. ఐతే ఈ యుద్ధం కథ మన దేశంలోవలె మరే దేశంలోనూ చిలవలూ, పలవలూ తొడగలేదు. సుమేరియన్‌ల దేవాసుర యుద్ధం—ఘోర సర్పాకారపు కుర్ (జల సంబంధం) ఓటమి. మన ఇంద్రుడు—ఈరాన్ వెత్రఘ్న—వృత్రవధ కూడా జల సంబంధమే. జలాధిష్ఠాన దైవం రూపం సర్పం. సుమేరులు ఇర్రిగేషనల్ ఇంజనీర్లు. సింధు తీరపు టాది (హరప్పా వగైరా) జనాంగం ఆ పోలికలవారే. వైదికార్యులు వ్యవసాయకులుకారు—ఆనకట్టల సాయం చేయడంతో నదీ ప్రవాహాన్ని బంధించరాదనే విశ్వాసం—సింధుతీరావే వృత్రాసుర వధాస్థలం.

మన వృత్ర వధలో పాల్గొన్నవారిలో వాగ్దేవి(సరస్వతి), త్వష్ట్రి (కనారాశి గాథలు) ఉన్నారు. ఆ వృత్ర వధ మరో రకం మహిషమర్దనం— మన కథలో సింహా లాంఛన విజయం—మహిష లాంఛనుల పరాజయం.

దేవీపూజ మధ్యధరా సముద్ర ప్రాంతాలనుండి మను మనో (క్రీటుదీవి) తుర్యసాదులు తూర్పు దేశాలకు వ్యాప్తి చెందారంటారు. ఎంతకన్న పూర్వ నాగరికత సుమేరులు తూర్పునుంచే నేటి ఈరాక్ ప్రాంతానికి చేరారనే పరిశోధకాభిప్రాయ మున్నటివ్వదే.

గ్రీసులో ఉలూక, మయూర వాంఛనీ చెప్పుల్లెనై... ఉన్నారు. లక్ష్మి క్రమవద్ద గూబఉన్న పలా ఉన్నాయి ... జ్యోతిష్మండలం గూర్చిన భావాలు.

ఇతర దేశాల్లో దేవాసురులు మానవ రూపులే—మన దేశంలో మరో ప్రత్యేకత బహుముఖుల, బహు బాహుల శిల్పం. బహు బాహు రూపాని కర్థం నాకు తోచినది, అస్త్ర శస్త్ర ప్రయోగ బహుకాలంలో అన్ని చేతులకున్నంత శక్తి గలవారని. అలాంటివే బహుముఖాలో విద్య, నాగ్నాటి శక్తి 'దీపాలకు 'కాండిల్ పవర్' యంత్రాలకు 'హార్స్‌పవర్' అంటున్నట్లే—రెండవ దానికి 'బుల్ పవర్', అనాలి అశ్వశక్తి అని మనదేశంలో ఆరంభించినది ఆంగ్లేయులు.

సైంధవ సంస్కృతి యోగముద్రామూర్తికి మహిషకాయ శిర్షాల్లేవు—కొమ్ములున్నాయి. యూదుల కతి పవిత్రమైన ఆర్క్ ఆకారం సమంగానున్న నెలవంక రూపం దేవతల కొమ్ములూ, గోశృంగిణీ యనడం వెలుగు గూర్చిన భావం, ఆకాశం కావచ్చును. ద్రవిడ దేవాలయ గోపుర శిఖరాలపార్శ్వాలు కొమ్ముల పోలికయే—గోపురాలు మరో దేశపు పురాతన దేవాలయాల (జిగ్గురాత్)నుండి ఏర్పడెనేమో.

కథలో మహిషుడు సింధు ద్వీపు డనేరాజ బీజభవుడు. శాపవశమున గేదెగానున్న స్త్రీ కుక్షిని పడగా పుట్టినవాడు. దితి ఇంద్రుని జయించు పుత్రునికై చేసిన తపస్సు కారణంగా కల్గిన వేడి (లగ్ని) భరించలేక మరో తపశ్శాలి మహిషశీర్షు డగుగాక యని శపించుట.

మహిషునిలో అగ్ని సంబంధం ఆలోచించదగినదే.

రాణి (మహిషి) పుత్రుడు మహిషు డనెందు కనరాదు. మనుస్మృతి లెక్కకు మాహిష్యులు మనలాంటి మనుష్యులే. బీజక్షేత్ర నిబేదాల్లో 'సంకర' కులం అంటుంది ధర్మసూత్రం. వైశ్యాంగనకు క్షత్రియునకూ పుట్టిన

వాడు మాహిష్యుడు అంటుంది స్మృతి సాహిత్యం వార్తా శాస్త్రోపజీవ్య అనే అర్థం చెప్పుకోరాదా? ధర్మశాస్త్రాల్లో మహిషికి మరో అర్థం జారిణి యైన వివాహితయట—

స్కాంద పురాణంలో దుందుభి, అవంతీక్షేత్ర హాలాహలుడూ మహిషులేకాని మన కథలో మహిషాసురులు కారు కాగా వారిని సంహరించినది దేవికాదు పోతే దుందుభి, హాలాహలాల అర్థం ఆలోచిస్తే అగ్ని పర్వతం భూమినుండి చిమ్మి ఊరిపైకి వచ్చే గంధక జనితోష్ణం అనుకోవచ్చును అలాంటి వాటినే పూర్వులు రాక్షసులుగా ఊహించారు

కస్పియన్‌లుగా వర్గీకరణం చేయబడినవారు సిధియన్ (శక) కుశాన్, శబర (సవర), మిస్మిన్, ఖేమక, కిమ్మెరి (కిమ్మిర), కోయ (గోండు), ముండ తుఖారాదులు. మన పురాణాల్లో వీరిలో కొందరు రాక్షసులు—వాస్తవానికి వీరంతా మానవులే ఇతర దేశాల్లోనే కాదు మన దేశంలో కూడా ఈ ప్రజల్లో శృంగ శిరస్త్రాణాలు, మహిష విషాణ శిరోవేష్టాలు ఉన్నాయి.

మన వైదికార్యుల దేవాసుర యుద్ధాలు, దశరాలు, పరాజయం సింధు తీరాన జరిగినట్లుంది ఈ కథల వెనుక రెండు విభిన్న వర్గాల పోరాటం ఉందని పిస్తుంది వోడిపోయిన వారిలో శంబరు (శంబరాసుర) డున్నాడు. ఈ శబర రాజా మహిషధ్వజుడు

ఇది సింహలాంఛనులైన హిత్తీల గెలుపు కథ అయ్యుండునా? సింహ లాంఛనులైన సాతవాహనులు శృంగ శిరస్త్రాణులైన శకుల నోడించుటా? కుషానులపై గుప్తరాజా విజయమా?

అనేక దేశాల్లో సింహం దీర ప్రతాపాలకు పేరు ఆకాశం, అధోలోకం గూర్చిన నమ్మకాల్లో సింహ ప్రమేయం ఉన్నది అగ్ని (వేడి) సూర్య (తేజం) అధికారాలకు (రాజరికం), నక్షత్రరాశికీ, గ్రీష్మానికీ, సూర్యుని సింహ సంక్రాంతికీ, మరణానికీ గుర్తు సింహం పూర్వం సింహరాశిలో సూర్యుడున్న కాలాల్లో మరణా లెక్కువగా ఉండేవట సింహరాశి కల్పనారూపం సింహవాలం, సింహ శీర్షం, సింహం.

సౌరమానంలో మేష—సింహ మధ్యకాలానికి అధిష్ఠాన దేవి దుర్గ అయితే కావచ్చును ఆమె విగ్రహాల్లో త్రిశీర్ష పార్శ్వాల్లో (భుజాలపై) తల కిరువైపుల మేష, సింహ శీర్షాలున్నవి ఇది పౌరుష ప్రతాపాల సూచనా?

ఇతర దేశ శిల్పంలో సింహముఖు లనేకు లున్నారు మన శిల్పంలో నర సింహావతారం సింహంపంజా, కాళ్లు చేతులు సింహం పంజా చేతులుగల నర రూపం, సింహశీర్షుడు.

బహు పురాతన కాలానికే సప్తమాతృకలశిల్పం సింధు శిథిల శిల్పాల్లోనే గాదు, ఇతర దేశాల్లో పోలిన శిల్పం ఉన్నది ఆ మధ్య బారతిలో సప్త మాతృకల్లో చాముండ స్థానంలో సింహముఖి (నారసింహి)ని మన వైష్ణవులు నిల్పారనే భావం చదివాను. అనేక దేశాల్లో సింహముఖు లున్నారు ఆ శిల్పకాలానికి ఈ వైష్ణవు ల్లేరు.

ఈజిపు లో హథ్‌హెహార్, శెఖెత్ (శక్తి?) తెఫీనుత్, అమన్‌రా (సూర్య) స్త్రీ రూపం—దేవమాత సింహముఖి

సుడాన్‌లో జ్యోతిర్మండల భావాల కారణం గావచ్చును—వివిధ మృగ శీర్షుల్ను, మృగరాజ శీర్షులు గల శిల్పాలున్నాయి.



చాముండ – భువనేశ్వర్ శిల్పం – (డాక్టర్ టి వి నాద్ సౌజన్యంతో)

బాబిలోనియన్ కుగ్ శిఖరాల్లో లభించిన శిల్పం సుమేరుల తర్వాతి కాలపు దేవుడు నెరెగల్ సౌరదైవం అజేయుడు, లయకారుడు, రణదేవుడు, భయంకరుడు, పితృ (మృత) లోకాధిపతి సింహముఖుడు ఒనోహోకాన ఆతని ఓడించ యత్నించి ఓడినామె సింహముఖి

జ్యోతిర్దైవతంగా రూపకల్పన—కన్యారాశికి దిగువగా (ముందుది) సింహరాశి కాబట్టి కన్య మృగవాహిని కన్యా రాశ్యధిష్ఠాన దైవం త్వష్ట్రి ఉభయలింగ త్వష్ట యే లక్ష్మి, దుర సరస్వతి కాగా ఆ నమ్మకాల్లో కన్యారాశిలో చిత్ర నక్షత్ర కల్పనా రూపం హర్యక్షం ఆకాశాన గ్రహ నక్షత్రాల గూర్చిన ఊహా జనిత రూప గాథలు అమ్మవారికి రెక్కలు పక్షిపాదాలు, పార్శ్వాల్లో గూబలు, సింహాలు వగైరా.

జీవకోటి పుట్టేది భూమిపై, గిట్టి చేరెది భూమినే—భూమికి స్త్రీ రూపం యిచ్చారు పూర్వులు—భూమాత జగన్మాత మూడు వేల సంవత్సరాలనాటి "శతపథ బ్రాహ్మణం" ఒకటేకాదు 'యజుర్వేదం" కూడా అదే భావం ప్రకటించెనట

మన చండికాదేవి సృష్టిలయాధిష్ఠాన దేవి శిల్ప సాహిత్యంలో జీవ కోటి సంబంధంవంటిదే త్రిపాలిటానా డయానా విగ్రహంలో భావం,

విశ్వమాత, విశ్వంభరి, సర్వ ప్రతిష్ఠా, సుపత్నీ స్వరాజ్ఞీ ఈమెకు సధమా, సింహ—పృథ్వీ సింహి అంటే అంతేగా—తల్లిని మించిన దైవం లేదన్న విషయం.

# తెలుగు జీవిత చరిత్రలు

## కుమారి పుల్లూరి ఉమ

ప్రకృతి యందలి ప్రతివస్తువు భిన్నరూపములు పరిణామము చెందినప్పటికిని యందలి వస్తుతత్వము నది కోల్పోవ నేరదు ఆ విధముగనే సాహిత్య మెన్ని ప్రక్రియా భేదములతో పరిణితి చెందినప్పటికీ కళాత్మక ధర్మతత్త్వమును నందిముద్భుకొనియే యుండుట సహజము

ఆంధ్రవాఙ్మయ మాధునిక యుగముననే యనేక పరిణామములకు లోనైనది ఆ క్షేత్రమున నాడు పండినపంటలే నవలలు, నాటకములు, నాటికలు, ఏకాంకికలు, వ్యాసములు మొదలైనవి ప్రక్రియలో వినూత్నత యేర్పడిన వెనువెంటనే మన యాంధ్రుల కంటపడినవి అనువాద విధానము మాత్రమే, ఒక వాఙ్మయమునుండి దేనిని క్రొత్తగ మనము స్వీకరించితిమో దానితోపాటు దాని లక్ష్యమును కూడ గ్రహించుట పరిపాటియైనది ఉదాహరణమునకు నాటక ప్రక్రియను గ్రహింతము. ఆ వాఙ్మయ విధానము మనకు క్రొత్తయని భావించు సందర్భమున నాటక లక్షణముల మాత్రమే స్వీకరించి తెనుగు నాటకములను వ్రాయుట మన యాంధ్రుల కలవాటుపడలేదు కాళిదాసు షేక్సిపియర్లు కంటబడిరి. అనువాదముల ప్రారంభించిరి తరువాతనే ఆంధ్రభాషపైన ప్రత్యేకాదరాభిమానములు కలిగిన కొందరు మాత్రమే స్వతంత్రించి అనువాదములుకాక యాప్రక్రియలలో రచనలు చేయసాగిరి కొంతకాలమైన పిదప లక్షణములను కూడ నుల్లంఘించి తమ రచనలకని ప్రత్యేక లక్షణముల నేర్పరచుకొని వాఙ్మయ శాఖలకు రూపును కల్పించిరి

ఈ మూడుదశలు ప్రతి ఆధునికాంధ్రవాఙ్మయశాఖకు నేర్పడియుండుటను చూడగలము. ఆధునికాంధ్రారామమున నంకురించిన ప్రతిసాహిత్యలతయు చిగిర్చి పుష్పించి ఫలవంతమై పెక్కు వైపులకు విస్తరించుచున్నది కాని అట్టి నోముకు నోచుకొనని ఆధునిక శాఖకు చెందిన రచనలు జీవిత చరిత్రలు, ఆత్మకథలు.

పైన పేర్కొనిన మూడుదశలయందును ప్రారంభ దశయందే కాలూని నిలువలేక బలహీనమై అతికష్టముపై తనకు తెలయకనే తడబాటున నొకటి రెండు రెండవ దశకు వచ్చియున్న వీ సాహిత్య భేదములు ఇందుకు నిరుష్టముగ నీ ప్రత్యేక శాఖా భేద లక్షణమును గ్రహించినటుల కనిపించుటలేదు

కావున 'జీవితచరిత్ర' వ్రాయుటలో తత్కర్త పాటింప వలసిన సూత్రముల గురించి, పరిగణింపదగిన అంశముల గురించి విమర్శించుట ప్రస్తుత కార్యము

ఈ ప్రక్రియా భేదము వానకాంగ్లేయులొసగిన యాస్తి ఆ వాఙ్మయమునందే ఈ ప్రక్రియ సంపూర్ణకళాత్మక సాహిత్య శాఖను పొందలేదను అసంతృప్తి వివాదము లనేకములు కలవు కాని సూక్ష్మదృష్టితో నీ వాఙ్మయ భేద లక్షణములను గుర్తింతము.

జీవిత చరిత్ర వ్రాయుటలోని, ముఖ్యోద్దేశ మొకానొక యాదర్శ వ్యక్తి యాత్మీయతను సాహిత్య లోకమునకు సంఘమునకు తెలియచేయుటయే యగును.

"The aim of biography" said Sir Sidney Lee "is the truthful transmission of Personality". అని ఆంగ్ల భాషలోని సూక్తి. ఈ వ్యక్తీకరించు విధానమునుబట్టి పాశ్చాత్య సాహిత్యవేత్త లీ శాఖను సాహిత్యముగను శాస్త్రముగను, నవలాభేదముగను నిర్ణయింపవచ్చునని విమర్శించిరి కళాత్మక ధర్మము లుండి సంక్షిప్తముగ ధర్మ విశ్లేషముతో కూడియుండిన నది సాహిత్యకళగ పరిగణింపవచ్చును. "— as in the case of Poets, Biographers seem to be born rather than made" అని Waldo H Dunn నిర్వచించెను. శాస్త్రీయ మార్గములో నేదో యొక సాంకేతికశాఖ ననుసరించి దానికి మాత్రమే ప్రత్యేకించి యేర్పడిన జీవిత చరిత్ర లనేకములు కలవు. వానినే మనము శాస్త్రీయమైన జీవిత చరిత్రమని తెలుపుదుము ఈ విషయమునే Andre Mourois 'Scientific biography will become specialised and technical. There will be biographies in which development will be traced in all its intricacy and in a manner comprehensible only to the experts " అని తన లభిప్రాయమును వెల్లడిచేసి Sociological biographies, easthetic biographies, philosophycal biographies మొదలగు వస్తు భేదములతో నేర్పడిన జీవితచరిత్ర లీకోవకు చెందినవని నిర్దేశించెను కాని మన వాఙ్మయమున గ్రుడ్డితనముగ నీ శాఖ విస్తరించియున్నదే కాని యే కోవకు చెందినదో మన మింతవరకు నాలోచింపలేదు సాహిత్య భేదముగా జీవిత చరిత యొకటనియు, నిది చరిత్రకన్నను భిన్నమైనదనియు జీవిత చరిత్రలోని కథానాయకున కీ యా లక్షణములు కలవనియు, నిర్ణయించి విమర్శించిన వ్యాసములే కనిపించుచున్నవి.

కాని జీవితచరిత్రను సాహిత్యభేదముగ గ్రహించినప్పుడు మనము పాటింప వలసిన సూత్రములు కొన్ని గలవు

సాంఘిక జీవితమున కాదర్శప్రాయుడైన యొకానొక ప్రసిద్ధవ్యక్తి 'జీవిత చరిత్ర' లోని కథానాయకుడు అనుట సామాన్యోక్తి Plutarch 'Writing the lives of famous Person" అని యూహించినట్లు విమర్శకులు తలచిరి ఆంగ్లసాహిత్యము ప్రారంభదశలో "The history of particular men's lives" is biography అని తలచెను. Marcel Schwob 'Biographers have supossed that only great men's lives could interst us" అని వ్యక్తపరచెను కాని పైన పేర్కొనిన యంశము లంత నిర్దుష్టములు కావేమోయని సూక్ష్మదృష్టికి గోచరించును 'జీవితము'అని తీసికొనినప్పుడు ప్రతి వ్యక్తి జీవితము పరిగణార్హమైనదే వారివారి జీవితమున కాయా వ్యక్తులు నాయకానాయకులే వారి పాత్ర ప్రధానమైనది సంఘటనలు ప్రముఖములైనవే. కావున నెవరి జీవితమునైనను గ్రహించుకొని తగిన రీతిగ పర్యవేక్షణ చేసి కళాత్మక ధర్మముతో పాఠకుల కభిరుచిని కల్పించు రీతిగ వ్రాసిన నదే సాహిత్య శాఖకు చెందిన జీవితచరిత్ర యగును "The memorial life record became transformed into history అని Waldo H. Deen అభిప్రాయము ఈ విషయమునే Andre Maurios 'One might argue that the life of every human being is interesting and that, if a biographer were capable of analysing all the thoughts wich passed through the mind of an obscure beggar, such an analysis might have greater richness and beauty than a life of Caeser" అని వ్యక్తపరచెను.

కాని ప్రతివారి జీవితమును చిత్రీకరించిన సంఘమునకు ప్రత్యేకముగ ధార్మిక, నైతిక ప్రబోధము నశించునేమో యను శంక పొడమును. పైపెచ్చు

తవలకును నిటి జీవిత చరిత్రకు ప్రత్యేకముగ పరిగణింపదగిన భిన్నత్వ మస్పష్టమగును. కావున 'జీవితచరిత్ర'లోని వాయకు డేదోనొక సాంఘిక మార్గమున ప్రఖ్యాతి వహించిన వ్యక్తిగనున్నచో మనము వారిని మార్గదర్శకులుగ నెంచుకొని మన జీవిత పథమును సుగమము చేసికొనవచ్చును Sir Sidney Lee కథావస్తువు విషయమున "Should be of a certain magnitude" అని నిర్దేశించెను. కావున నెవరి జీవితము సహజ సుందరముగ నుండి గణింపదగిన ప్రసిద్ధాంశములతో కూడియుండునో వారి జీవితమును రమ్యముగ చెప్పుటయే జీవితచరిత్ర యగును "There are lives which have a natural beauty, which either by chance or by some force inherent in their being, are some how constructed life spontaneous work of art" అని కథావస్తువును గురించి Andre Maurois అభిప్రాయము.

జీవితమును గ్రహించిన పిదప నావ్యక్తి బ్రతుకులోని సంఘటనలను సత్యము నేమాత్రము మీరక యదార్థముగ నున్నది యున్నట్లు తెలుపుట వలన పాఠకుల కభిరుచిని ఉత్సాహమును కలిగించును. కావున జీవిత సంఘటనలలోని ప్రతిఅంశములోని సత్యమును వెల్లడి చేయుట ప్రథమ కర్తవ్యము

"His first duty, I have shown, is to be truthful, to understand, and then reflect his understanding, his second, perhaps even more difficult is to be interesting" — interesting I mean that his work must conform to the laws of aesthetics" అని జీవిత చరిత్రకారుల విషయమున A J A Symons తన అభిప్రాయమును వెల్లడి చేసెను కావున జీవిత చరిత్రలు వ్రాయువా రాయా వ్యక్తుల మంచిచెడుల రెండింటిని తమ గ్రంథమున ప్రవేశ పెట్టవలయును ఆవ్యక్తి పైన తమకుగల ప్రత్యేకాభిమానముతో తప్పులను విస్మరించిన నది వందిమాగధుల స్తోత్ర గ్రంథమగునేగాని జీవిత చరిత్ర అనిపించుకొనవు "— a good biographer, in my view, is one who can see both white and black and can show how a man who has this difficult pair to drive, can succeed as well as fail" అని Andre Maurois చెప్పిన విషయమును మన మంగీకరింపవలసివున్నది సత్యగోపన మెట్టి ప్రదేశము లందు చేయక యుండుటవలన మన జీవితమునకొక సంతృప్తియు, పరవమం దుత్సాహము నెక్కువగును Sir Sidney Lee "The truth which biography demands is truth in its hardest most obdurate form, it is truth as truth is to be found in the British Museum; it is truth out of which all vapour of falsehood has been pressed by the weight of research" అని నిర్ణయించెను Biography లోని విషయములు 'faithfully and authoritatively delivered" అనివారి అభిప్రాయము ఈ సంఘటనల నెన్నుకొను విషయమున కేవల మావ్యక్తికి బాహ్యప్రపంచముతోడి సంబంధము గల విషయములను మాత్రమే గణింపక ఆంతరంగిక జీవిత విషయములను సహితము సంగ్రహించుటయే యుక్తము ఆంతరంగిక విషయమునను సత్యమును దాచిపెట్టక అనౌచిత్య విషయమైనప్పటికి ఔచిత్యముతో దానిని వెల్లడి చేయుటయే పరమ ధర్మము "A true biography is the narrative, from birth to death, of one man's life in its out ward mainteslation and inward cortings" అని W H. Dunn వచించినమేరకు మన మాంతరంగిక జీవితమును కూడ వ్రాయుటవలన వారెట్లు తమ సంఘటనల నెదుర్కొనిరనియు దాని కారణమున వారి హృదయ భావము లెట్లు పరిణతి నొందినవో స్పష్టమగును.

జీవిత వృత్తములోని ప్రతి సంఘటనను ప్రతిదినచర్యను మనము జీవిత చరిత్రలో గ్రహించుటకు వీలులేదు ఏ సంఘటనలవలన వ్యక్తిగత భావముల మార్పునకు లోనైనవో లేదా జీవితమునే మార్చివేసినవో అట్టివి గ్రహించుటయే మెన్న. "A biographer or autobiographer is obliged to omit from his narrative the common-places of daily life, and to limit himself almost exculsively to salient events, action and traits" అని Herbert Spencer వివరించెను ఈ విధముగానే Andre Maurois "The biographer, like the portrait painter and the Land scape painter must pick out the essential qualities in the whole subject which he is contemplating" అని తన భావమును విశదీకరించెను.

ఇక ఈ సాహిత్య ఖండమునందు పోషింపవలసిన పాత్ర చిత్రణమున రచయిత గమనింపవలసిన ముఖ్యాంశము భావసంయమము జీవిత చరిత్రకు సంబంధించిన వ్యక్తి రచయితకు ప్రీతిపాత్రుడై యుండి యతని మన్ననల కర్హుడై యుండుట సామాన్య విషయము సాధారణముగ కుమారులుగాని, శిష్యులు గాని తమ గురువు జీవిత చరిత్రలను వ్రాయుట పరిపాటి అట్టి సందర్భమున వారి జీవితమునందలి యే సంఘటనలైనను అవి సత్పరిణామములుగా నున్నట్లుగనే రచయితలుభావించి వారి భావముల కనుగుణముగ వర్ణనల రచనలు చేయుట సామాన్యముగ చూచుచున్నాము కావున రచయిత ఆ వ్యక్తి విషయమై తనకు కలిగిన నాదరాభిమానములను విస్మరించి జీవిత సంఘటనలను యథార్థముగ విన్నవించి వాని ననుసరించి పాత్ర మనస్తత్వము పాఠక లోకమునకు గోచరించునట్లుగ చేయుటయే యుక్తము ఒకచో లోకమునకు చిరపరిచితులైన ఎవరో మహానుభావుల జీవిత చరిత్రలు వ్రాయుటయందును రచయిత కళాధర్మములను సమగ్రముగ పొందుపరచి చెప్పవలసిన రీతిలో వానిని ఏకరువుపెట్టిన నదియు మన కుత్సాహమును కలిగించునేకాని విసుగుదలను కలిగించుట కవకాశములేదు "When we read the biography of a very well known man we know in advance what changes of fortuue and what denovement to expect. At first sight we might think that this might rob the book of some of its interest, but if the thing is well done, the effect is exactly the reserve" అని Andra Maurois తన భావములను స్పష్టపరచియున్నాడు.

కావున జీవితచరిత్ర యే వ్యక్తికి సంబంధించినప్పటికిని క్రమ పరిణామములతో సన్నివేశములను తెలిపి, అనవసరములైనవానిని విడిచిపెట్టి పాత్రను పోషించుటయే యుచితము నవలలో రచయిత యేర్పరచిన పథము ననుసరించి పాత్రల నడిపించుట సహజము కాని ఇట నద్దానికన్నను భిన్నము. సన్నివేశములన్నియు ప్రత్యేకించి ఆ వ్యక్తికి సంబంధించినవై యుండువానిని మాత్రమే ప్రవేశపెట్టవలయును ఈ సాహిత్య ప్రక్రియ జీవితమునకు సంబంధించినది కావున నిందు పొందుపరచిన విషయములు సజీవముగ నుండిననే అది పరనార మగును జీవితమునకు సంబంధించిన సన్నివేశములను స్పష్టపరచుట మాత్రమే రచయిత కార్యముకాదు ఆ సన్నివేశములను విశదపరచుటయందును పాఠకుల కుత్సాహమును కలిగించురీతిగ తెలిపిననే అది సాహిత్య ఖండముగ రాణించును "— the biographer must not only select his facts but also present them in the most telling order" అని A J A Symons తన అభిప్రాయమును వ్యక్తపరిచి యున్నాడు

కావున జీవిత చరిత్ర వ్రాయుటలో మనము గమనింపవలసిన అంశములు సంఘముననో సాహిత్యరంగముననో కొంత కీర్తి సంపాదించిన వ్యక్తి జీవితము కథావస్తువు సంఘటనలలో ప్రతి చిన్న విషయములను స్మరింపక ప్రధానాంశములగువానిలో నా వ్యక్తికి సంబంధించినవి ఆ సన్నివేశ కారణముగ వ్యక్తి మనస్తత్వము బహిర్గతమైన వట్టివి స్వీకరించుట. గ్రహించిన అంశ

ములను సజీవముగ ఛమత్కారముగ సత్యగోపనములేక తెలుపవలెను ఆ వ్యక్తిపై ప్రత్యేక గర్వ్యభావముతోగాని, అభిమానముతోగాని రచనను కొనసాగించరాదు

జీవితచరిత్రలోని వ్యక్తులు సజీవముగా నున్నప్పు డా సాహిత్య ప్రక్రియకు కావలసిన అంశములను సేకరించుట చాల సులభమైన కార్యము కాని ఆ వ్యక్తులు మరణించినపిదప ఈ కార్యమునకు పూనుకొనుట మిక్కిలి కష్టసాధ్యము. అట్టి దశయందు జీవిత చరిత్ర రచయితలకు దొరికెడి ఆధారములు వారి ఉత్తరములు, వారి దినచర్య గ్రంథములు మాత్రమే ఇవి "— That biography is not memorial journalism but a form of art and that is as much entitled as the modern novel to openners of expression" అని వ్యక్తీకరించుచు 'These dairies and memoires are raw material but they should not be confused with the finished product They are biographical sources not biographies' అని దాని ప్రయోజనములను విశదీకరించి యున్నాడు

ఉత్తరములను దినచర్య గ్రంథముల నాధారముగగొని అందు సంవత్సరాదుల ననుసరించి పౌర్వాపర్యవిషయముల నతి జాగ్రత్తతో పొందుపరచి యందలి విషయ సారాంశములను మాత్రమే వెల్లడి చేయవలెనేకాని లేఖలను విషయములను వున్నవి యున్నట్లుగ గ్రంథమున ప్రవేశపెట్టరాదు కొన్ని కొన్ని సంఘటనలు సాధారణముగ ఉత్తర ప్రత్యుత్తరముల నుండుట సహజము వానిని వదిలిపెట్టుట మంచిది Rev. Thomas Davidson 'Most modern biographies are too large. They err by not selecting merely the significant' అని స్పష్టపరచెను కావున వ్యక్తిగతమైన లేఖలను దినచర్య గ్రంథములను తగు రీతిలో నుపయోగించుకొనుట శ్రేయోదాయకము 'A Judicious and correct use' of private letters' అని william winters భావము

ఈవిధముగ సంపూర్ణ సౌందర్య సౌష్ఠవ రూపచిత్రణ యీ ప్రత్యేక సాహిత్య ఖండనము న కాపాడింపవలెననిచో పాటింపవలసిన పథకము సూచితమై యున్నది కావున 'Biography prejudiced its chances of success when it is consciously designed as an ethical guide of life' అను ఆంగ్లేయుల భావముతో నేకీభవించి యట్టి కళాసృష్టికి పూనుకొనుట మన సాహిత్యవేత్తల కర్తవ్యమగును

అధునికాంధ్ర వాఙ్మయమున నీ సాహిత్య దశ ఎట్టి స్థితియందున్నదో కించుక పరామర్శింతము మన ఆంధ్ర భాషా గ్రంథాలయముల ప్రవేశించి 'జీవిత చరిత్రలు' అను శీర్షికను చూచిన మనకు స్పష్టముగ కనుపించునవి వివేకానందుని జీవిత చరిత్రము, శ్రీ రామకృష్ణ పరమహంస జీవితము, శ్రీ రామలింగస్వామి జీవితము, పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితము మొదలైన గ్రంథములే.

ప్రారంభదశలో ఒకరిజీవిత వృత్తమును వేరొకరు వ్రాయుట యను నది మన వాఙ్మయమున కావ్యాదులలో కొంత కనిపించుచున్నది 12 వ శతాబ్దమున పాల్కురికి సోమన మల్లికార్జునపండితారాధ్యచరిత్ర, బసవపురాణము అను గ్రంథములు మతప్రచారార్థము అతిమానుష కృత్యములతో నేర్పడినవి ఆ గ్రంథములు వివేకానందుని జీవిత చరిత్రము, శ్రీరామకృష్ణ పరమహంస జీవితము, శ్రీరామలింగస్వామి జీవితము, పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితము మొదలగు గ్రంథములందు మానవున కతీత శక్తి నాపాదించి విశ్వసించుటకు వీలులేని సన్నివేశముల ప్రవేశపెట్టి రచితములై యున్నవి మన సాహిత్యరంగమునంనో జీవిత చరిత్రలు వ్రాయువారును, వ్రాయదగిన జీవిత చరిత్రలు కలిగినవారును లేకపోవుటవలన కాబోలు యితర సాహిత్య తాత్త్విక గ్రంథములు కంటబడినవి. బుద్ధభగవానుని జీవితము స్మరణకు వచ్చినది

ఆత్మజ్ఞాన సంపన్నులై మత స్థాపకులై భారతావనియందేగాక యావ ప్రపంచమున యశస్సు నార్జించిన వారి జీవిత చరిత్రలను తెలిసికొనుట ప్రతి భారత పౌరుని ధర్మమే కాని ఆధునిక యుగమున విశ్వసించుటకు వీలు లేని మంత్రతంత్రములను ప్రవేశపెట్టి యతిమానుషకృత్యములను కథాసంఘటనలుగ పరిగణించి వీ రెల్లరున మన కాదర్శప్రాయులని మనకంటిముందర పెట్టుట ప్రస్తుతము మనవ చర్చించుచున్న జీవిత చరిత్రయను శీర్షికలో వచ్చుటకు వీలులేని యంశములు. ఇవి తాత్త్విక గ్రంథములు. హఠయోగమును గురించియు, మానవుని భూతదయ అహింసావాదమును గురించియు నేర్పడిన గ్రంథములు కావున జీవిత చరిత్ర రచన లోనే శాస్త్రీయపద్ధతికి చెందిన జీవితచరిత్రలను విషయము నను తాత్త్వికగ్రంథములను శీర్షికలో పై గ్రంథముల నన్నింటిని చేర్చివేయుట యుక్తము ఈ గ్రంథములు పఠించు వ్యక్తులకు కేవలము సాహిత్యాభిరుచి కంటెను ప్రత్యేకముగ నందలి తాత్త్వికవిషయములపై మక్కువయున్న పఠింపగలరేకాని తదితరుల కవి శిరోభారమును కలిగించునేగాని సాహిత్యానందమునుకాదు.

శ్రీరామకృష్ణుని జీవిత చరిత్రమును చిరంతనానందస్వామి మూల వంగ గ్రంథముల ననుసరించి రచించెను ఆత్మజ్ఞాన సంపన్నులై కారణాంతరమున భూమిమీది కవతరించిన వారి చరిత్రలను మనము సాహిత్య ఖండముగ తీసికొనుటకు వీలులేదు ఇట్టి గ్రంథముల ముఖ్యోద్దేశము ప్రజలకుపదేశము చేయుటకు మాత్రమేకాని సాహిత్యమున క్రొత్త మార్గముల ప్రవేశపెట్టుటకాదు. కావున ఇట్టి గ్రంథముల పఠించి ఇవి సాహిత్యఖండమగు జీవిత చరిత్రలోని శిక్షణములు సమన్వయించుటలేదని వాదించుట నిరర్థకము కావున నీ గ్రంథము తాత్త్విక విషయవములతోకూడి ప్రత్యేకముగ వేదాంతముపై ప్రీతి కలిగిన వారికి మాత్రమే వరవాస్పమగు శాస్త్రీయ జీవిత చరిత్రయని స్పష్టపరుపగలము

ఇట్టి తాత్విక విషయమునకు సంబంధించిన గ్రంథమే "వివేకానంద జీవిత చరిత్ర" ఇతని చరిత్రలో నతి మానుష విషయముల కెక్కుడు ప్రాధాన్యమిచ్చినట్లు కనిపించుటలేదు మాధవ చైతన్య బ్రహ్మచారి వ్రాసిన గ్రంథమిది అతి సహజములగు సన్నివేశములే యందు స్థానము నాక్రమించియున్నవి. బాల్యముననే యతనికి భక్తిబీజము నాటుకొనెనట ఒకానొక సందర్భమున గది తలుపులను బిగియబెట్టి ధ్యాననిమగ్నుడై యుండ తల్లిదండ్రులు తలుపులు పగులగొట్టి లోనికి ప్రవేశించిరట కొంతకాలమునకు దుష్టబాలుర సహవాసమబ్బుటచేత తల్లిదండ్రు లాతని కింటియొద్ద ప్రత్యేకోపాధ్యాయుని వియమించిరట చిన్ననాటినుండియు నరేంద్రుడు జాతిమత బేధము లెరుగనివాడని యనేక నిదర్శనములు ప్రదర్శితములై యున్నవి విద్యాభ్యాస సందర్భమున పాఠములు జరుగు సమయమున కూడ తన స్నేహితులను రామాయణ మహాభారత కథలతో వినోదింపజేయుచుండగ నుపాధ్యాయుడు "నేనేమి బోధించుచుంటినో మరల చెప్పుడు" అని అడుగగ నరేంద్రుడు సవిస్తరముగ నన్నింటికి సమాధానము చెప్పెనట ఈవిధముగ కొన్ని కొన్ని సన్నివేశములు సహజముగ వర్ణితములై యున్నవి. ఒకనాడు దుష్టస్వభావుడగు నొక ఉపాధ్యాయు డొక బాలుని దండింప నతడు నవ్వెనట బాలురందరితో పాటు నరేంద్రుడు తన నవ్వును కలిపెను "నవ్వనని" చెప్పుమని, ఉపాధ్యాయుడు నరేంద్రుని నెంత కొట్టినను సమాధానము చెప్పలేదు ఈవిధముగ నతిశయమగు హృదయ స్థైర్యము, సహనము కలిగినవాడు నరేంద్రుడు

తత్త్వ సంబంధ విషయములను కొంత తగ్గించి అతిమానుషములను సంపూర్ణముగ పరిహరించియుండిన నిది సజీవముగ నొప్పియుండెడిది. కావున నీ గ్రంథమును మనము శాస్త్రీయ వమార్గమున నడచిన జీవిత చరిత్రయని స్వీకరింపవచ్చును. ఇక మిగిలిన శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితము, జ్యోతి రామలింగస్వామి జీవితము లిట్టివే ఏ అంశమును మనము సాహిత్య ఖండముగ గ్రహింపజాలము అనువాద గ్రంథములు, అనుసరణ గ్రంథములు తీసికొనిన లేక్కకు మించినవిగ నున్నవి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణుని జీవితము, పండిట్ నెహ్రూ జీవితము, బాలగంగాధరతిలక్ జీవితము, శ్రీమతి ఇందిరాగాంధి జీవితము అనువాద గ్రంథములైనవి

ఇక సాహిత్యశాఖగా జీవితచరిత్రను గ్రహించిన 'వేదము వేంకటరాయ శాస్త్రులవారి జీవిత చరిత్ర సంగ్రహము' కనిపించుచున్నది. పీఠికా భాగమును

గ్రంథకర్త "శ్రీ తాతగారు జీవించియుండిన కాలముననే యొకపరి బాస్వెల్ మహాశయ విరచిత డాక్టర్ జాన్సన్ పండిత జీవిత చరితము చదివితినని విన్నవించియున్నారు.' ఈ జీవిత చరిత్రను వ్రాయుటకు వారికి దొరికిన ఆధారములు వేదమువారి గ్రంథము పఠించుట, తమ్ము గురించిన సందర్భమున నేమేవి చెప్పిరో వానిని క్రోడీకరించుట, వారికి వచ్చిన ఉత్తరములను సేకరించుట మాత్రమే. గ్రంథనామమే 'జీవిత చరిత్ర సంగ్రహము' అని యుండుటవలన సవిస్తరముగ విషయాంశము లక్కై మన యెదురుజూచుట దోషము పైపెచ్చు గ్రంథకర్తయే ఉపోద్ఘాతమున ఇయ్యది సమగ్రము కాదు. అట్టిది వ్రాయుటగొప్ప పని, కాలముపట్టును' అని స్పష్టపరచకొనియుండుటచే మన మట్టి దోష విగ్రంథమున కాపాదించిన పునరుక్తి యగును కా. గ్రంథకర్త శ్రమయని యనుకొనక కాలము వృథయగునేమోయని సంశయింపక దొరికిన విషయములు సహజ సుందరముగ నింక కొంత విస్తరించి వ్రాసియుండిన నిది లక్షణబద్ధమగు జీవిత చరిత్రయై యుండెడిది అక్కడక్కడ వేదమువారి ఉత్తర ప్రత్యుత్తరముననే ప్రవేశపెట్టక వేదమువారి తండ్రి తాతల విషయములను నెక్కువగ జడవక రచించియుండవచ్చును పైపెచ్చు సంఘటనల వ్యక్తీకరించుటకు వారుగా వానిని ఒక్కటిగకూర్చి చెప్పుటవలన గ్రంథకర్త ఉపోద్ఘాతమున చెప్పిన మేరకే 'చెదరియున్నవారి వ్రాతలను ఒక్కచోటనే యొడగూర్చ నుత్సహించి కేవల మొక జాబితాగా నీ చరిత్రను వ్రాయుచున్నాడను' అనుట సత్యదూరముకాని విషయముగ నున్నది ఏనిమిదవయేటనే శ్రీ వేదమువారికి ప్రతాపరుద్రీయ నాటక రచనాబీజము హృదయమున నాటుకొనినదని వారే తెలిసికొనియున్నారట తన విషయములను చెప్పుకొనుతరి వేదమువారు 'నా కొకమారు చెప్పిన చాలును ఒకమారు చదివిన వచ్చును' అని వెల్లడి చేయుచు తనకు సులభముగరానిది గణితము, కుదరనిది చేతివ్రాత అని వ్రాసికొనిరట గ్రంథకర్త ఈ సందర్భములందు వేదమువారి విషయాంశముల కాధారముగ ఉత్తరములను స్వీయచరిత్ర భాగములను నున్నదియున్నట్లు పొందుపరచియుండుట జీవిత చరిత్రయనిపించుకొనుటలేదు దొరికిన ఆధారములతోడనే కొంత సహనముతో కళాధర్మముల పాటించి వ్రాసియుండవచ్చును. ఈయన ప్రతాపరుద్రీయనాటకమున గైకొనిన పాత్రలకు కొన్ని వాక్యములయందు జీవితానుభవాధారములను ప్రవేశపెట్టియుండుట ప్రశంసింపదగిన అంశము విద్యానాథపాత్ర, బొడ్మిన్ యిత్యాదుల విషయము లుత్సాహ పూరితముగ నున్నవి ఈయన విద్యాభ్యాస కాలమున పరీక్ష హాలులో తెలుగు పత్రము వ్రాయుచుండిరట మూడు గంటల కాలము నియమితము మొదటి రెండుగంటలకాలమున పరీక్ష ప్రశ్నము నపార్థము చేసికొని ప్రత్యుత్తరములను తప్పుగ వ్రాసిరి పిదప వ్రాసినదంతయు కొట్టివేసి ఉన్న ఒక్క గంటలో నన్ని ప్రశ్నలకు సమాధానము వ్రాయుటయు, కాని ఆటవెలది తేటగీతి లక్షణముల వ్రాయునంతలో సమయము మించిపోవుటయు వెంటనే 'ఇనగణత్రయంబు నింద్రద్వయంబును' అని వ్రాయునంతలో గంట కొట్టిరట ఇంతలో 'హంసపంచకంబు ఆటవెలది' అని వ్రాసివేసిరి కాని దొరచూచి కలమును లాగుకొనిపోయెనట అంతలో సమయస్ఫూర్తి గలిగిన వీరు చిటికెనవ్రేలు సిరాలో ముంచి సూర్యుడొక్కరుండు సురరాజు లిద్దరు అని వ్రాసిరట దొరకు కోపము వచ్చి సిరాబుడ్డిని తీసికొనిపోయిరి చిటికిన వ్రేలికి ఎంగిలి తగిలించి తడిచేసి 'దినకరద్వయంబు తేట గీతి' అని పూర్తి చేసిరట ఈ విషయములను జీవిత చరిత్రలో ప్రవేశ పెట్టుట మిక్కిలి ప్రశంసార్హముగ నున్నది ఇట్టి అంశములను తెలిపియుండుట యుక్తము ఈ సందర్భమున వ్రాసి దొర యీమారు తెలివిగా 'పేపరునే ఎత్తుకొనిపోయినాడు' అని హాస్యముగ వ్రాయుటయు గ్రంథమును చదువుట కుత్సాహమును కలిగించుచున్నది.

ఉద్యోగ విషయమున శాస్త్రులవారి సమస్యలు స్పర్ధ స్వభావముగల తోటి ఉద్యోగస్థుల వారెదుర్కొనిన విధానము 'శుక్లాంబరధరం' శ్లోకభావమును సముచితముగ తెల్పుట ఇత్యాదులు హాస్యమును నుత్కంఠను కలిగించుచున్నవి వితంతు వివాహముపై శాస్త్రులవారు వ్రాసిన వ్యాసమున మిత్రబృందము తిరస్కరించినదట. దానికి కారణము కొన్ని విషయము లందు లేవని తెల్పిరి ఆ పుస్తకమున నొకవైపు వ్రాసియుండుటవలన శాస్త్రులవారు అతిమార్దవముతో ప్రశాంతముగను 'ఆ విషయముల మీ రే వైపు చదివినప్పుడు లేవో తెలుపవలసినదని' కోరిరట సమయస్ఫూర్తి ప్రశంసార్హము ఈ విధముగ పఠించుట కర్షమును ఉత్సాహమును కలిగించు సందర్భములను గ్రంథకర్త సేకరించియున్నప్పటికి లక్షణబద్ధముగ సాహిత్యదృష్టితో చేయకపోవుటవలన నీ గ్రంథ మసమగ్రమై నది వేశ్యల విషయమై వారి మిత్రబృందమెట్లు వారిని ప్రోత్సహించినది దానికి శాస్త్రి వారిచ్చిన సమాధానము చాల సమత్కారముగ నున్నది

దివారాత్రములు శాస్త్రుల వారాంధ్ర నాటకరంగము నభివృద్ధి చేయుటకెట్లు పాటుపడినదియు ప్రబంధములకు సవిస్తర పీఠికలు వ్రాసి సాహిత్య సేవ నెట్లు గావించినదియు యిత్యాదులు గ్రంథమున కలవు.

పురాణాంతర్గత విషయమును దూషించుచు నొక యధ్యాపకుడు 'Here the rascality in ' అని చెప్ప నారంభించెనట శాస్త్రులవారు వెంటనే 'Keep it for yourself' అని సమాధానమిచ్చిరట ఇట్టి చమత్కార సన్నివేశముల నాధారముగ గొని గ్రంథకర్త సవిస్తరముగ నుత్సాహ పూరితముగా రచించియుండవచ్చును శాస్త్రుల చరమ దశ మరింత హృదయ విదారముగ వ్రాసియుండియుండవచ్చును ముఖ్యముగ నా సాహిత్యవేత్త పరమపదమును పొందిన ఘట్టము నింకను విషాదపూరితముగ రచించియుండవచ్చును.

మొత్తముమీద నతిసుందరముగ శిల్ప నిర్మాణములు చేయుకలిగిన నరికరములున్నప్పటికిని సుందర శిల్పమునకుమారుగ అస్తవ్యస్తముగ నొక ప్రతిమ చిత్రితమై యున్నది ఈ విధముగ విమర్శించుచు పోయినచో విడుదకోలు వేంకటరావుగారు వ్రాసిన చిన్నయసూరి జీవితము, నింకను కొందరు రాజకీయవేత్తల జీవిత చరిత్రలు కలవు

కాని ఈ ఆధునిక సాహిత్య ప్రక్రియ తదితర శాఖలవలె ప్రేళ్లూని మహావృక్షమగుటకు మన సాహిత్యవేత్తల సహాయ మెంతేని యవసరము ఇది నిత్య జీవితమునకు సంబంధించిన కథావస్తువు కావున కవిసమయములతో నతిశయోక్తి ఉత్ప్రేక్షాదులతో సహృదయులు మాత్రమే భావాలోకమున విహరింపగలిగెడి వర్ణనలు, లేచవలో క్లిష్టత, నిందు కనుపించవు. సుందరము, సులభము, సుగ్రాహ్యమగు నీ సాహిత్య శాఖకే విమర్శనా వ్యాసమున నేర్పరచిన పథము ననుసరించి యొకానొక సుందర సాహిత్య సౌధమును సాహితీకారులు నిర్మింతురని ఆశింతము సాహిత్యలోకమున స్వైరవిహారముచేయు నవ్య కవితా కర్తలు, వ్యాస రచనావేత్తలు విమర్శకాగ్రేసరులెందఱో కలరు వారి శిష్యులుగాని, వారి సన్నిహితులుగాని వారి జీవితచరిత్రలను వ్రాసి మన జీవితముల కాదర్శములుగ చిత్రీకరించిన యెడల వారి సాహిత్య సేవ, అటు గురుభక్తి ప్రదర్శితమగును జీవిత చరిత్రలో స్థాన మాక్రమించుటకన్నను జీవిత చరిత్ర రచనా కర్తలుగ రూపొందుట కష్టసాధ్యము. కవులకన్నను మిక్కుటముగు భావ పరిణామము, స్వార్థ రాహిత్యము, ఏకాగ్రచిత్తము సాహిత్యవేత్తల కవసరము మన తెలుగు వాఙ్మయ లోకమున నట్టి గుణముల సంపుటి పలువురిలో కలదని యూహించుట హేతు సిద్ధమగునని యెదురు చూచెదము.

—o—



Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thumbu Chetty Street, Madras-1. Chief Editor. S. Sambhu Prasad.

పద్దెనిమిది సంవత్సరాల క్రితం ప్రణాళికాబద్ధమైన ప్రగతికి రెండు ఉద్దేశాలతో మనాటి నాయకులు — దేశంలోని పౌరులందరికి మంచి జీవన వసతులు కల్పించటము, దిగుమతులమీద ఎక్కువగా ఆధారపడకపోవటము

ఈ కార్యము భారమైనదే గాక క్లిష్టమైనది కూడా. దీనికై శాయశక్తులా కృషి చేయాలి ఎంతో త్యాగమూ చేయాలి. కొన్ని కష్టాలు ఎదుర్కొనిన మనం వెనక్కి తిరిగి సాధించిన విజయాలనుకూడా చూడవలసిన సమయము వచ్చింది.

## ప్రణాళికల వలన మనకు జరిగిన లాభమేమిటి?

### ఈ పద్దెనిమిది ఏండ్లలో

1. తలసరి ఆదాయము 274.5 రూ. నుండి 481.5 రూ. వరకు పెరిగింది (1960-61 ధరల స్థాయి ననుసరించి)

2. ఆహారోత్పత్తి 1967-68 వ సంవత్సరములో 550 లక్షల టన్నుల నుండి 950 లక్షల వరకు పెరగటము వలన, ప్రతి ఒక్కరు భుజించు ఆహారము రోజుకు 12.8 ఔన్సుల నుండి 15.4 ఔన్సుల వరకు పెరిగింది. కాలరీల లెక్కననుసరించి రోజుకు 1,759 కాలరీల నుండి 2,145 కాలరీల వరకు పెరిగింది.

3. 6-11 ఏళ్ళ మధ్య గల బాలబాలికలలో 10 మందిలో 8 మందికి బడికి వెళ్ళే అవకాశాలు వున్నాయి. వారిలో చాలామందికి, బడి కాలినడకను చేరగలిగినంత దూరంలో వుంది.

4. ప్రాక్టీసు చేస్తున్న డాక్టర్ల సంఖ్య 30,000 వరకు పెరిగింది. ఆస్పత్రులలో పడక సౌకర్యాలు 1,27,000 వరకు పెరిగాయి. 16,274 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు కూడా తెరువబడినవి. వీటన్నిటి మూలంగా సగటు ఆయుర్దాయము 32 సంవత్సరాల నుండి 52 సంవత్సరాల వరకు పెరిగింది.

5. తలసరి బట్టల వినియోగము సంవత్సరానికి 11 మీటర్ల నుండి 15 మీటర్లదాకా పెరిగింది.

6. సైకిళ్ళ తయారీ 18 రెట్లు పెరిగింది. కుట్టు మిషన్ల తయారీ 13 రెట్లు పెరిగింది

7. రహదార్లు మైళ్ళలో రెట్టింపయ్యాయి. రైళ్ళలో సరకుల రవాణా రెండింతలయింది. రైల్వే ప్రయాణీకుల సంఖ్య, రోజుకు 60 లక్షలదాకా పెరిగింది. వారికి ఎక్కువ సౌకర్యాలు కల్పించబడ్డాయి.

### వ్యవసాయము

ఎకరానికి 37% ఎక్కువగా ఫలసాయం వుంటున్నది. నీటి పారుదల సౌకర్యాలు 2.8 కోట్ల ఎకరాలవరకు వ్యాప్తి చెందాయి. వాణిజ్య పంటలు 74.9% అభివృద్ధి చెందాయి.

### పరిశ్రమలు

పారిశ్రామిక రంగంలో మనం చాలా అభివృద్ధిని సాధించాము. పరిశ్రమల ఉత్పత్తులు 160 శాతము పెరిగాయి. స్వావలంబనమైన ఆర్థిక ప్రగతి త్వరగా సాధించడానికి ఉక్కు పరిశ్రమ మొదలైన ప్రముఖ పరిశ్రమలు నెలకొల్పబడ్డాయి. ఉక్కు పరిశ్రమతో పాటు, విద్యుత్పరికరాలు, సాధారణ యంత్రాలు, యంత్ర పరికరాలు, రైలింజనులు, మోటార్లు, విమానాలు, రసాయనిక ఎరువులు, నూనె ఉత్పత్తి, నూనె శుద్ధి కర్మాగారాలు అభివృద్ధి చెందాయి.

### విద్యుచ్ఛక్తి

పారిశ్రామిక, వ్యవసాయ రంగాలలో అభివృద్ధి సాధించడానికి, ఆధునిక వసతులతో జీవించడానికి విద్యుచ్ఛక్తి అత్యంత అవశ్యకము. విద్యుత్సామర్థ్యము 5 రెట్లు పెరిగింది. 130 లక్షల కిలోవాట్లకు మించి ఉత్పత్తి అవుతోంది.

అంచనాకు మించిన జనాభా పెరుగుదలతో పోల్చి చూస్తే పైన ఉదహరింపబడిన మన విజయాలు చాలా ప్రోత్సాహకరంగా వున్నాయి.

# దేశ రక్షణకోసం, అభివృద్ధికోసం పొదుపు చెయ్యండి

మనదేశం రక్షణ విషయంలో ఎదుర్కొంటున్న సవాలు మూలంగా మనలో ప్రతి యొక్కరూ పొదుపుచేసి, మన సేవింగ్సును ప్రభుత్వమువద్ద దాచవలసిన అవసరం ఎంతయినావుంది. లక్షలకొద్దీ ప్రజలు పొదుపుచేసిన సొమ్ము, ఒకచోటచేరితే, మన జవాన్లకు ఆధునిక ఆయుధాలను సమకూర్చటానికి, అభివృద్ధి కార్యక్రమాలను సాగించటానికి, మన ప్రభుత్వానికి సహాయ కారిగా వుంటుంది.

చిన్నమొత్తాలను పొదుపు చేసేవారికి వీలుగా, భారతదేశపు పొదుపు ఉద్యమ పథకంలో వివిధములైన సెక్యూరిటీలు 5 రూపాయలనుండి కూడా వున్నాయి. వాటిని కొనటంలోను, దగ్గర పెట్టుకోవటంలోను, సొమ్ముగా మార్చుకోవటంలోను సౌలభ్యముంది.

ఈ స్కీముల ముఖ్యాంశాలు క్రింద ఇవ్వబడినవి.

## క్యుములేటివ్ టైం డిపాజిట్ స్కీము

ఈ స్కీము క్రింద 5 రూ. నుండి 500 రూ లోపు (గుణకములలో) ప్రతినెలా పోస్టాఫీసులో 5, 10, లేక 15 సంవత్సరాలకాలము డిపాజిట్ చేయవచ్చును. గడువుకాలము తీరినతర్వాత డిపాజిట్లు మంచి ఆదాయాన్ని ఈ దిగువ పేర్కొనబడిన రీతిలో తెస్తాయి.

| నెలకు | గడువు తర్వాత వచ్చు మొత్తము | | |
|---|---|---|---|
| డిపాజిట్ | ఐదేండ్లు | పదేండ్లు | పదిహేనేండ్లు |
| రూ. | రూ. | రూ. | రూ. |
| 5 | 325 | 725 | 1,250 |
| 10 | 650 | 1,450 | 2,500 |
| 20 | 1 300 | 2,900 | 5,000 |
| 50 | 3,250 | 7,250 | 12,500 |
| 100 | 6,500 | 14,500 | 25,000 |
| 200 | 13,000 | 29,000 | 50,000 |
| 300 | 19,500 | 43,500 | 75,000 |

గడువు పూర్తయ్యేవరకు మీ అకౌంటువుంటే మీకు బోనస్‌కూడా లభిస్తుంది. పది రూపాయల అకౌంటుకు 5, 10, 15 ఏండ్ల తర్వాత వరుసగా రూ. 20, రూ 50, రూ. 100 బోనస్ లభిస్తుంది అదేవిధంగా ఎక్కువ మొత్తాలు గల అకౌంట్లకు ఎక్కువ బోనస్ లభిస్తుంది. ఈ విధంగా ఆదాయపుపన్ను లేకుండా, మీ డిపాజిట్లపై చక్రవడ్డీ మీకు లభిస్తుంది.

ప్రావిడెంటు ఫండుకు, జీవిత భీమా ప్రీమియంలకు ఆదాయపుపన్ను లేనట్లే, 10 ఏండ్ల, 15–ఏండ్ల అకౌంట్లలోని డిపాజిట్లకుకూడా ఆదాయపుపన్ను వుండదు.

## 12-ఏండ్ల నేషనల్ డిఫెన్సు సర్టిఫికెట్లు

ఈ సర్టిఫికెట్లు రూ. 5, రూ. 10, రూ. 50, రూ 100, రూ 500, రూ 1000 రూ. 5000, రూ. 25,000 తరగతులలో లభ్యమవుతాయి. సేవింగ్సు బ్యాంకు పనులను నిర్వహిస్తున్న పోస్టాఫీసులో ఈ సర్టిఫికెట్లు కొనుక్కోవచ్చు పెట్టుబడిలో ప్రతి 100 రూపాయలు 12 సంవత్సరాల తర్వాత 180 రూపాయలను మీకు తెస్తాయి.

## 10-ఏండ్ల డిఫెన్సు డిపాజిట్ సర్టిఫికెట్లు

ఈ సర్టిఫికెట్లు రూ. 50 పైన గుణకాలలో లభ్యమవుతాయి. ఆదాయపు పన్నులేకుండా సంవత్సరానికి $4\frac{1}{2}$ శాతము వడ్డీ లభిస్తుంది. గడువు పూర్తయిన తర్వాత అసలు మొత్తముతోపాటు, 5 శాతము, అతిరిక్తమైన వడ్డీ లభిస్తుంది.

రిజర్వుబ్యాంక్ ఆఫ్ ఇండియా ఆఫీసులలోను, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా బ్రాంచీలలోను, దాని సబ్సిడియరీ బ్యాంకులలోను, సబ్ ట్రెజరీలలోను, హెడ్ పోస్టాఫీసులలోను, సబ్ పోస్టాఫీసులలోను, ఈ సర్టిఫికెట్లు లభ్యమవుతాయి.

## 15-ఏండ్ల యాన్యుయిటీ సర్టిఫికెట్లు

ఈ సర్టిఫికెట్లు ఐదు తరగతులలో వుంటాయి. నెలకు రూ. 10, రూ. 25, రూ. 50, రూ. 100, రూ 200 పేమెంటును, వరుసగా రూ 1,330 రూ 3,325 రూ 6 650, రూ 13,300 రూ 26,600 మొత్తాలకు చేయవలసి వస్తుంది పేమెంట్లపై ఆదాయపు పన్ను వుండదు. గడువు 15 సంవత్సరాలు. ఆదాయము సంవత్సరానికి 4.25% చక్రవడ్డీ రూపంలో వస్తుంది.

## పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంటు

సేవింగ్సుబ్యాంకు అకౌంటు ఐదు రూపాయలతోనే తెరువ వచ్చును ఆ తర్వాత 1 రూ కు తగ్గకుండా డిపాజిట్ చేయవలసి వస్తుంది. ఈ డిపాజిట్లు సంవత్సరానికి $3\frac{1}{2}$ శాతము వడ్డీని ఇస్తాయి సింగిల్ అకౌంటులో రూ 10 నుండి రూ 25,000 వరకు, జాయింటు అకౌంటులో రూ 50 000 వరకు గల బాలన్సులపై వచ్చే వడ్డీకి ఆదాయపు పన్ను వుండదు విత్‌డ్రాయలు విషయంలో పరిమితిలేదు కాని బాలన్సు 5 రూ. కు తక్కువకాకుండ వుండాలి.

## నేషనల్ సేవింగ్సు సర్టిఫికెటు (మొదటి ఇస్యూ)

ఈ సర్టిఫికెట్లు రూ. 10, రూ. 100 రూ. 1000 తరగతులలో సేవింగ్సుబ్యాంకు వ్యవహారాలను నడిపే అన్ని పోస్టాఫీసులలోను లభ్యమవుతాయి

ఒక వ్యక్తి రూ 35 000 వరకు పెట్టుబడి పెట్టవచ్చును ఇద్దరు జాయింటుగా రూ 70.000 వరకు పెట్టుబడి పెట్టవచ్చును ఈ పరిమితులు ఈ సర్టిఫికెట్లకు మాత్రమే అన్వయిస్తాయి ఇతర సేవింగ్సు సర్టిఫికెట్లలోని మీ పెట్టుబడిలో ప్రమేయం లేదు ఈ సర్టిఫికెట్లకు 10 సంవత్సరాల గడువుంది గడువు తీరినతర్వాత 80% ప్రీమియంలలో ఇవి చెల్లించబడతాయి సంవత్సరానికి 6 05% చక్రవడ్డీ లభిస్తుంది ఈ సర్టిఫికెట్ల మీద వడ్డీకి రియాయితీ, ఆదాయపుపన్ను వుంటుంది పెట్టుబడిదార్ల ఇతర ఆదాయం పై సగటున చెల్లించవలసిన ఆదాయపు పన్ను రేటులో వుంటుంది

## నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు (మొదటి ఇస్యూ) బ్యాంకు సీరీసు

మార్చి 1 వ తారీఖు 1966 నుండి స్టేటు బ్యాంక్ ఆఫ్ ఇండియా ఆఫీసులలోను, వాని సబ్సిడియరీలలోను, ఈ సర్టిఫికెట్లు అమ్మకములో వున్నాయి 10-ఏండ్ల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లకు (మొదటి ఇస్యూ) వున్న షరతులే ఈ సర్టిఫికెట్ల విషయంలో వుంటాయి కాని వీనిని ఈ బ్యాంకు ఆఫీసులోనే డబ్బుగా మార్చుకోవలసి వస్తుంది.

## పేరోల్ సేవింగ్సు పథకము

ప్రభుత్వ కార్యాలయాలలోను, ప్రభుత్వ, ప్రైవేటు రంగాలకు చెందిన వాణిజ్య సంస్థలలోను, పేరోల్ సేవింగ్సు గ్రూపులు ఏర్పాటు చేయవచ్చును ఈ పథకం క్రింద, ఉద్యోగులు తమ పేబిల్లులలోనుండి కొంత మొత్తాన్ని ప్రతి నెలా నేషనల్ సేవింగ్సు సెక్యూరిటీలలోనూ, అకౌంట్లలోనూ పెట్టుబడి పెట్టటానికి తమ యజమానికి, అధికారము ఇస్తారు.

## నామినేషను

చిన్నమొత్తాల పొదుపు పథకాలలో, పెట్టుబడి దారులకు, డిపాజిటర్లకు పథకంయొక్క గడువు తీరకముందే మరణము సంభవించిన పక్షంలో, తమ తరపున ఆ సొమ్మును పొందటానికి ఎవరినైనా పేర్కొనే హక్కుంది.

**భారత ప్రభుత్వముచే జారీ చేయబడినది.**

DAVP 68/305

# శ్రీ అంబికా మెడికల్ హాల్




తపాలు పెట్టె నెంబరు 300 — ఫోన్ నెంబరు 37533

19, కుమరప్ప ముదలి వీధి, (మురుగన్ టాకీస్ సమీపం) మద్రాసు - 1.

## రత్నపుష్టి లేహ్యము

స్త్రీ-పురుషులు బలహీనత చెందిన దేహ దార్ఢ్యులను, ధాతువృద్ధిని మరల అశించు వారు మాయొక్క రత్నపుష్టి లేహ్యమును ఉపయోగించవలెను. ఈ లేహ్యము పలువిధములైన మూలికలను, జీవాధారమైన సత్తువ కలుగు వస్తువులను చేర్చబడినది ఈ లేహ్యమును 40



రోజులు విడువక సేవించుచు వచ్చిన ఇది వారి దేహరూపమును మార్చును, వారు చూచుటకు అందముగా యుందురు అప్పుడప్పుడు రాత్రులందు కలుగు స్వప్న స్ఖలనము, పోమరితనము, బలహీనత, క్షీణించిపోయిన నరములకు బలము నిచ్చును. వీర్యము, తేజస్సు, జ్ఞాపకశక్తి, ఆరోగ్యము, ఆయుస్సు వృద్ధిచేసి యింకా పలువిధములైన సౌఖ్యములను ఈ లేహ్యము కలిగించును. నడుమునొప్పి, రొమ్మునొప్పి, నరములకు శక్తి లేకుండ చేతులు వణకుట, ఆయాసము, ఆహారమునకుముందు కలుగు నొప్పి, మలబద్ధకము, నోటికి రుచి లేకుండుట, పిత్తము అధికరించి గర్భములో మంట, శరీరము క్షీణించిపోవుట, మొదలగు వ్యాధులన్నింటికి ఈ లేహ్యము పూర్తిగ గుణము నిచ్చును ఇదియునుగాక మూలమునందు కలుగు ఉష్ణము, తెలుపు వ్యాధులు, మూత్రమునందు కలుగు మంటలు, మూత్రము వచ్చునప్పుడు మూత్రమును అడ్డగించుట, మూత్రమునందు కలిసివచ్చునటువంటి తెల్లపిండిగా యుండుట, మూత్రము వచ్చునపుడు యింద్రియముతో కలిసివచ్చుట, వీటినన్నిటిని ఈ లేహ్యము పోగొట్టును ఇది అసాధ్యమైన వ్యాధులను పోగొట్టి రక్తమును శుద్ధిపరచి జీవ నరములకు బలము నిచ్చును ఈ లేహ్యముతో మా అమృతచెందూరం చేర్చి ఉపయోగించిన త్వరలో వ్యాధిని ఖండించి బలమునిచ్చును.

| | | |
|---|---|---|
| 40 రోజులకు లేహ్యము | రూ | 10—00 |
| తపాలాచార్జి | రూ | 2—75 |
| 20 రోజులకు లేహ్యము | రూ. | 6—00 |
| తపాలాచార్జి | రూ. | 1—95 |
| అమృతచెందూరం తో | రూ | 5—00 |

## మేహరాజ లేహ్యము

విస్ఫోటయమునందు చెడుపడతలు కలిగి, సఖ వ్యాధులతో అవస్థపడువారు, చెడ్డనీరు, అధిక ఉష్ణము దేహములో యిమిడి దానివలనదేహము కృశించి నానావిధములైన వ్యాధు



లతో కష్టపడువారు ఈ "మేహరాజ లేహ్యము"ని ఉపయోగించిన మాత్రమున ఇది దేహములో కలుగు విష సంబంధమైన చెడ్డనీరును పోగొట్టి, క్రొత్త రక్తమును వృద్ధిచేసి, అసాధ్యమైన వ్యాధులను ఖండించి వ్యాధిని మరల రాకుండచేసి, సౌఖ్యము కలిగించును చేతులు కాళ్ళు నొప్పి, ముట్టియందు నొప్పి, సకల అవయవముల యందు బాధ, సూదులుమాదిరి పొడుచుట, దేహములో శక్తిలేకుండ పటపట అనుశబ్దము, కుదికాళ్ళు నొప్పి, వాంతులు, రొమ్మునొప్పి, చేతులు, కాళ్ళు ముడుచుకొని పోవుట, మూర్ఛ విడుచునప్పుడు శరీరమునందు బలములేకుండ ఊపిరివట్టుట, తెలుపు, అరావు, గ్రంథి, మేహ సంబంధమైన తెలుపువ్యాధి, కుసుమ వ్యాధి, కంఠమాల, వెన్నుకుష్ఠము, చేతుల, కాళ్ళయందు యుండు కుష్ఠము, తామర, మేహ వ్రణములు, వ్రణములయందు కలుగు చెడ్డనీరు, వాటివలన దుర్వాసన, ముక్కుతినిపోవుట, చెర్మము దళముగా యుండుట, తెల్లకుష్ఠము, కాళ్ళయందును చేతులయందును ఆణె మొలచుట, తంతి మేహము, మూలవ్యాధి, అప్పుడప్పుడు కలుగు బీజరోగములు, మూత్రమున శుక్లశోణము అందు కలుగు దోషములను బాగుచేసి, దేహపుష్టి, ఆరోగ్యముకలిగించి, చెడిపోయిన రక్తమును శుద్ధిపరచి దేహమును చూచుటకు అందముగా కనిపింపజేయును. ఇటువంటి ఔషధము యెచ్చటను దొరకదు దీనిని ఉపయోగించినవారికి దీని ప్రభావము తెలియును

| | | |
|---|---|---|
| బుడ్డి 1—కి | రూ | 10—00 |
| తపాలాచార్జి | రూ. | 2—00 |

## మహిళా లేహ్యము

అప్పుడప్పుడు కలుగు ప్రసవమువలనను, నెలనెలా సరిగా బహిష్టుకాకుండ యుండుట వలనను, రక్తము అధికముగా స్రవించి దానివలన ఉష్ణము అధికరించి (లూకేరియా) అను తెలుపు కారుతూ యుండుట వలనను, కుసుమ బాధ్యము వలన రక్తము చెడిపోయి ఆయాసము, కన్నులు లోతుగా పోయినట్లు తెలియుట, స్తనములు అంటిపోయి బలహీనతచెందిన స్త్రీలు మహిళా లేహ్యమును వాడవలెను ఇది ఒక సంజీవి వంటిది. ఈ లేహ్యమును విడువక ప్రతిరోజు సేవించుచు వచ్చినవారి దేహము చూచుటకు అందముగా నుండును ఇది అంటుకొని పోయిన స్తనములను, దవడలను వికసింపచేసి, నెత్తురుపుష్టి కలిగించి పోమరితనమునుపోగొట్టి మనస్సును సంతోష పరచును కాళ్ళు, చేతులు, నరములను పోషింపజేయును ఒక పర్యాయము ఉపయోగించిచూచిన దీని గుణములను తెలుసుకొనగలరు.

| | | |
|---|---|---|
| బుడ్డి 1—కి (40 రోజులు) | రూ. | 7—00 |
| తపాలా చార్జి | రూ. | 2—75 |

## గర్భసూతక నివారిణి

ఇది స్త్రీలకు ముఖ్యమైన ఔషధము గర్భాశయ సంబంధమైన వ్యాధులను పోగొట్టును కడుపు నొప్పియున్ను, బహిష్టు కాలమునందు కడుపులో కలుగు బాధ, గర్భములో నెత్తురు చెడి దానివలన కలుగు అధికమైన ఉపద్రవములు ఈ గర్భ సూతక నివారిణి సేవించిన మాత్రమున హరించి సంతాన భాగ్యము కలుగును. దీనిని వేలకొలది స్త్రీలు ఉపయోగించి సౌఖ్యము



